# విజ్ఞప్తి

---

**ఆర్యమహాశయులారా!**

పూర్వము నాస్తికమతములవలన వైదికమతమునకుగల్గిన యుపద్రవమును నివారించిన శాస్త్రములలో న్యాయశాస్త్రము ప్రధానమైనది. అందును సమీచీనము లగుయుక్తులచేఁ బ్రత్యక్షానుమానోపమానశబ్దములకుఁ బ్రత్యేకప్రామాణ్యమును స్థాపించి తన్మూలమున నీశ్వరస్వర్గాపూర్వాదుల సత్తను ప్రతిపాదించునదై నాస్తికమతముల సమూలమున్మూలితముఁ గావించినది న్యాయకుసుమాఞ్జలి యను గ్రంథరాజము.

దీనిని నైయాయికసార్వభౌముఁ డగు నుదయనాచార్యుఁడు సంస్కృతభాషలో లలితమైన ప్రాచీనశైలిని స్తబకపంచకాత్మకముగ రచియించి యుండెను.

ఇయ్యది ప్రాచీనములైన కాణాదన్యాయదర్శనాదులఁ గలసిద్ధాంతములను దేటతెల్లముగఁ దెలియఁజేయున దగుటం జేసియుఁ; బ్రమాణచతుష్టయ వ్యవస్థాపనమూలమునఁ జింతామణ్యాది నవ్యన్యాయశాస్త్రగ్రంథములకు మార్గదర్శక మగుటం జేసియు; సకల న్యాయసిద్ధాంతరత్నములకు నాకరమనఁదగి యున్నది.

ఇట్టి సర్వోత్తమమగు నీగ్రంథమునకుఁ జిరకాలమునుండి పాఠప్రచారము లుప్తమైనది. అందులకుఁ గారణము పూర్వ మచ్చులేనికాలమున నీగ్రంథరత్నమునకుఁ గల సర్వజన దౌర్లభ్యమే గాని వేఱొండు గాదని యూహింపవచ్చును. ముద్రాక్షరశాలలు వచ్చినపిదప నీగ్రంథప్రాప్తివిషయమైన క్లేశము తొలఁగినను, గురుపరంపరాగతమగుపాఠము పూర్వమే లోపించినకారణమున నిందలి సిద్ధాంతరత్నములు నేఁడును దుర్లభములే యగుచున్నవి.

ఈవిషయమునంతను విశ్వవిద్యాలయపాఠ్యగ్రంథ నిర్ణాయకసభాసదులు గుర్తించినవారై "న్యాయశిరోమణి" "న్యాయ విద్యాప్రవీణ" పరీక్షల కీగ్రంథమునుఁ బాఠ్యముగా నిర్ణయించి మరల నీగ్రంథమునకుఁ గొంతకాలమునుండి పాఠప్రచారమును గల్పించియున్నారు.

ఇట్లీగ్రంథము న్యాయశిరోమణి విద్యాప్రవీణపరీక్షలకుఁ బాఠ్యమగుటచే శ్రీ శ్రీ శ్రీ విజయనగరమహారాజ సంస్కృత కళాశాలలో న్యాయశాస్త్రాధ్యాపకుఁడనైన నే నీగ్రంథమును నాఛాత్రమండలి కధ్యాపనము గావింపవలసి వచ్చినది. నేనును గురుపరంపరగా నీగ్రంథము నధ్యయనముఁ జేసియుండక పోవుటచే నీగ్రంథమందలి సిద్ధాంతరత్నములు దొలుత నాకును దుర్జ్ఞేయములే యైనవి. అయినను గురుచరణారవింద సంసేవా లబ్ధమగు విజ్ఞానమును, వర్ధమాన భట్టాచార్యకృత ప్రకాశ

వ్యాఖ్యను బోధినీవ్యాఖ్యను సహాయముగాఁ గొని సావధాన ముగఁ బలుమాఱు లామూలాగ్రముగఁ బరిశీలించుటచే నిందలి సిద్ధాంతరత్నములను గనుఁగొనఁ గలిగి కృతార్థుఁడ నైతినని తలంచుచున్నాఁడను. ఇట్లు బహుప్రయాసముతోఁ గనుఁగొనిన యీ గ్రంథసిద్ధాంతములను నాఛాత్త్రవర్గమునకే గాక యిత రులకుఁగూడఁ బ్రకాశింపఁజేయుట నాకర్తవ్యమునుగాఁ గొందఱు నాశిష్యులు నివేదించుటచే "యుక్తి యుక్తం వచో గ్రాహ్యం బాలాదపి సుభాషిత"మ్మనున్యాయమున వారి సుభా షితమునే మనమున నిడికొని యీగ్రంథమున కాంధ్రమునఁ బరి వర్తనము చేయఁ గడంగితిని.

ఇందలి చతుర్థస్తబకము నాంధ్రీకరించుసమయమున నాయీగ్రంథ మచ్చుపడినఁగాని సర్వజనలభ్యము కాఁజాల దనియు, నట్టియెడ నాప్రయాసము విఫలమే యగుననియు, ధనవ్యయమును గణింపక యీగ్రంథము నచ్చొత్తించి ప్రకా శింపఁజేయునంతటి యుదారులగు ముద్రాపకులు దుర్లభులనియుఁ దలపోసి నిరుత్సాహుఁడనై కొంతకాల మీగ్రంథరచననుండి విరమించితిని. కాని యట్లు విరమించిన కొలఁదికాలములోనే నాయదృష్టవశమున బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారి సారస్వతైకసేవాతత్పరతాది సద్గుణములు నా శ్రుతిగోచరములై శ్రీశాస్త్రులవారికి లేఖను వ్రాయ నన్నుఁబురికొల్పినవి. తోడనే శ్రీశాస్త్రులవారికి నా యీగ్రంథరచనోద్దేశమును తెలియఁజేసిన వాడనై దీని నచ్చొత్తించి ప్రకాశింపఁజేయవలసినదని ప్రార్థించితిని.

శ్రీశాస్త్రులవారును సహజముగాఁ బండితు లగుటంజేసి "విద్వా నేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమమ్" అనునట్లు నాయీపరిశ్రమను గుర్తించి యీగ్రంథమును ముద్రింప నంగీకారమును దెల్పుచు శీఘ్రముగా గ్రంథమునకు నాంధ్రీకరణమును పూర్తిచేసి పంపనగునని ప్రత్యుత్తరమును గటాక్షించియున్నారు. దాన ద్విగుణీకృతోత్సాహుఁడనై మఱల రచన నారంభించి శేషించిన చతుర్థస్తబకభాగమునకును బంచమస్తబకమునకును గూడ నాంధ్రపరివర్తనమును బూర్తిచేసి శ్రీశాస్త్రులవారికిఁ బంపించితిని. వారును స్వప్రతిజ్ఞానుసారముగా నా యీగ్రంథమును శీఘ్రముగా ముద్రింపించి నాప్రయాసమును సఫలీకరించిరి.

శ్రీశాస్త్రులుగా రీగ్రంథమును ముద్రించుటకై నావలనఁ గొనిన ద్రవ్యసాహాయ్య మించుకేనియు లేదు. మఱియు నీగ్రంథము తెల్గునవలలవలె సర్వజనసుబోధము గాక శాస్త్రపరిచయముకలవారికి మాత్రమె సుబోధ మగుటంజేసి దీని నపేక్షించునట్టి జనులుకూడ నల్పసంఖ్యాకులుగనే యుందురు. గాన నేతద్గ్రంథవిక్రయమూలమున శ్రీశాస్త్రిగారికి విశేషద్రవ్యలాభము గల్గుననునదియు సందేహాస్పదమే. శ్రీశాస్త్రిగా రీవిషయమునంతయు గుర్తెరింగియు నాంధ్రసారస్వతసేవనే ప్రధానముగాఁ దలంచుచు స్వకీయ ధనవ్యయమునుగూడ గణింపక యీగ్రంథమును ముద్రింపించి నాప్రయత్నము సఫలముగావించినందులకు శ్రీ వేంకటేశ్వరశాస్త్రిగారికి నే నధమర్ణుఁడనై యనేక కృతజ్ఞతాపూర్వకవందనముల నర్పించుచున్నాఁడను.

శ్రీమదుదయనాచార్యుని యుదయకాలదేశాది చారిత్రక విషయములను దెల్పు వచోరత్న గుంభిత మగుపీఠికను రచియించి నా యీకుసుమాంజలికి వన్నె దెచ్చిన నా పరమమిత్రులును శ్రీమద్విజయనగర మహారాజ సంస్కృతకలాశాలాధ్యక్షులు నగు శ్రీమాన్ పరవస్తు వెంకటరామానుజస్వామి యయ్యవార్లం గారికిని, ఈగ్రంథమును సమగ్రముగాఁ బరిశీలించి యభిప్రాయ రూపమున నిందలి ప్రత్యేక స్తబకవిషయములను సంగ్రహముగాఁ గూర్చి నాకొసఁగిన శ్రీమహామహోపాధ్యాయ కళాప్రపూర్ణే త్యాది బిరుదాంచితులును నాకు గురుతుల్యులునగు బ్రహ్మశ్రీ తాతా సుబ్బారాయశాస్త్రిగారికిని, నే ననేక కృతజ్ఞతాపూర్వక వందనముల నర్పించుచున్నాఁడను.

మఱియు తర్కసంగ్రహాధ్యయనకాలమునుండి నేటివఱ కును సకలవిధముల నన్నాదరించి పోషించుచు నాయభ్యుదయ ముల కన్నిటికిని గారణభూతులైన శ్రీ శ్రీ శ్రీ విజయనగర సంస్థానాధీశులకు నాకృతజ్ఞతను నివేదించుచు శ్రీవారికుటుంబ మునకు నితోధికమగు నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధిని గలుగఁజేయఁగలందులకై నాయిష్టదైవమగు లలితాపరమేశ్వరిని నిరంతరము ప్రార్థించుచున్నాను.

ఈగ్రంథమును రచియించునపుడును పరిశోధించునపు డును నాతో నుత్సాహముతోఁ బాల్గొనిన నాశిష్యులు సహాయోపాధ్యాయులు నగు శ్రీమాన్ వాడపల్లి శేషావ

తారముగారికి నిత్యోధికమగు విజ్ఞానాభివృద్ధి నాశంసింపుచు ననేక వేదోక్తాశీర్వాదములను చేయుచున్నాను.

మరియు నేతద్గ్రంథరచనాప్రోత్సాహకులును శిష్యులు నగు శ్రీ కొల్లూరు లక్ష్మణమూర్తి: శాస్త్రిగారికిని, గ్రంథలేఖనాదులం దనేకవిధముల నుపకరించిన శిష్యప్రశిష్యసంతతికి ననేకాశీర్వాదములను చేయుచున్నాడను.

నా కాంధ్రవ్యాకరణమున విశేషపరిచయము లేమిం జేసి యీనాగ్రంథమునం దనేక వ్యాకరణదోషము లుండవచ్చును. గుణగ్రహణపారీణులగు పాఠకమహాశయు లట్టిదోషములను లెక్కింపక ప్రతిపాద్యవిషయమునుమాత్రమే గ్రహింతురు గాత!

ప్రతిపాద్యవిషయమునఁ గూడ నెచ్చటనేని స్ఖాలిత్యము లున్నచో దయతో వెంటనే నాకుఁ దెలియఁజేసినయెడల ద్వితీయముద్రణమున వానిని సవరించుకొందును.

విజయనగరము
లలితాప్రసాద్
22-12-1938

ఇట్లు,
విబుధజనవిధేయుడు,
న్యాయభూషణ పేరి లక్ష్మీనారాయణశాస్త్రి,
శ్రీమన్మహారాజ సంస్కృతకళాశాలా ప్రధానపండితుఁడు.

# ఉపోద్ఘాతము.

---

బ్రహ్మశ్రీ పేరి లక్ష్మీనారాయణశాస్త్రిగారు ఉదయనాచార్యకృతమగు న్యాయకుసుమాంజలికి తాము వ్రాసిన యాంధ్రటీక కుపోద్ఘాతమును వ్రాయవలయునని నన్ను కోరిరి. నేను న్యాయశాస్త్రము నభ్యసించినవాడను కాకపోయినను లక్ష్మీనారాయణశాస్త్రిగారియందు నాకుగల గౌరవమువలన నందు కంగీకరింపవలసి వచ్చినది. వీరు బ్ర. శ్రీ. గుమ్మలూరు సంగమేశ్వరశాస్త్రిగారివద్ద న్యాయశాస్త్రము నభ్యసించి యందు సంపూర్ణప్రజ్ఞను సంపాదించియున్నారు. మఱియు బహుకాలము నుండి యవిచ్ఛిన్నముగా శిష్యసంతతికి న్యాయశాస్త్రమును సమగ్రముగా ప్రవచనము చేయుచున్నారు. అందుచే న్యాయకుసుమాంజలికి యాంధ్రటీక వ్రాయుటకు వీరికంటె తగినవా రుండరని నా నమ్మకము.

న్యాయకుసుమాంజలి దాని నామమును బట్టియే న్యాయశాస్త్రగ్రంథమని తెలియుచున్నది. న్యాయశాస్త్రము మనదేశమున చాలాకాలముక్రింద నుద్భవించినది. ఇది అక్షపాదోపజ్ఞము. ఈశాస్త్రము సమముగా నెప్పు డుదయించినదో చెప్పఁజాలము గాని న్యాయగ్రంథములలో నక్షపాద గౌతముని

పేరున వెలయుచున్న న్యాయదర్శనమే (సూత్రము) ప్రాచీన తమమైన గ్రంథము. అక్షపాదగౌతముని గురించిగాని యాయన కాలమును గురించిగాని మనకేమియును తెలియకున్నది. క్రీస్తు జన్మించుటకుపూర్వము రెండవశతాబ్దియందు జీవించియుండెనని యందరిచేతను నంగీకరింపఁబడిన పతంజలి తన వ్యాకరణమహా భాష్యగ్రంథములో నొకచోట (3-౨-౧౨3) న్యాయదర్శనము లోని కొంతవిషయమును (౨. ౧౦. ౪౦, ౪౧, ౪౨, ౪3, ౪౪) అనువదించిన ట్లగపడుచున్నది. ఈకారణముచే న్యాయదర్శనము క్రీస్తు జన్మించుటకుపూర్వము మూఁడవశతాబ్దికంటె నవీనము కాదని మనము చెప్పవచ్చును. ప్రాచీనగ్రంథములలో రామా యణ మహాభారతములయందును గౌతమ ధర్మసూత్రము నందును యాజ్ఞవల్క్యస్మృతియందును న్యాయశాస్త్రము పేర్కొనబడి యున్నది. న్యాయశాస్త్రముతో విశేషసామ్యము కలవైశేషికశాస్త్రమున ప్రాచీనతమమగు వైశేషిక దర్శనము (సూత్రము) న్యాయదర్శనముకంటె కొంచెము ప్రాచీనమైనది. న్యాయదర్శనమున ప్రతితంత్రమని వైశేషికదర్శనము పేర్కొనఁ బడియున్నది. ఈరెండు దర్శనములలోను శబ్దానిత్యత్వము ఆత్మస్వరూపము అనుమానము హేత్వాభాసములు అను విష యముల నిరూపణములను విమర్శించినచో న్యాయదర్శనము కంటె వైశేషికదర్శనము ప్రాచీనమైనట్లుతోఁచును. వైశేషికదర్శన మున యగపడని యీశ్వరకారణత్వవిచారము న్యాయదర్శన మున కనఁబడుటకూడ దీనియర్వాచీనతను సూచించును.

న్యాయవైశేషికపదములు భిన్నవిధముగా నిర్వచింపఁబడినవి. ఇతరుల కర్థప్రతిపత్తిని గలుగఁజేయుపరామర్శ ప్రయోజకమగు ప్రతిజ్ఞాది పంచావయవసముదాయము న్యాయమని చెప్పఁబడును. ఇట్టిన్యాయమును విమర్శించిన శాస్త్రము కాబట్టి దీనికి న్యాయశాస్త్రమను వ్యవహారము గలిగియుండవచ్చును. న్యాయమనఁగా నుదాహరణముకూడ నగుటచే నుదాహరణము ముఖ్యావయవముగా గల అనుమానమునుగురించి విచారించుటచే నీశాస్త్రమునకు న్యాయశాస్త్రమని వ్యవహారము గల్గెనని మరికొందరు చెప్పుచున్నారు.

సాంఖ్యాది ప్రతితంత్రములకంటె విశిష్టమైనది వైశేషికమని బౌద్ధులు చెప్పియున్నారు. విశేషమను పదార్థాంతరము నంగీకరించునది వైశేషికమని మనవారు చెప్పుచున్నారు.

న్యాయసూత్రములకు పక్షిలస్వామి వాత్స్యాయనుఁడు భాష్యమును వ్రాసియున్నాఁడు. క్రీస్తుశకము 400 సంవత్సర ప్రాంతమున జీవించియుండిన దిఙ్నాగుఁడను బౌద్ధనైయాయికుఁడు న్యాయభాష్యమును చూచియుండుటచే వాత్స్యాయనభాష్యము క్రీ. శ. 350 ప్రాంతమున రచియింపఁబడి యుండవలయును. వైశేషికసూత్రములకు ప్రశస్తపాదుఁడు పదార్థధర్మసంగ్రహమనుభాష్యమును వ్రాసెను. ఈతఁ డుద్యోతకరునికంటె ప్రాచీనుఁడగుటచే క్రీ. శ. 5-వ శతాబ్దమువాఁడు కావచ్చును. వైశేషికసూత్రములకు రావణభాష్యమని మఱియొకభాష్య ముండినట్లు

తెలియుచున్నది. ఇది ప్రశస్తపాదభాష్యముకంటె ప్రాచీనగ్రంథమని కొందఱును నవీనగ్రంథమని మరికొందఱును చెప్పుచున్నారు. న్యాయవైశేషికభాష్యములకు కొంత భేదము కలదు. వైశేషికభాష్యమున సూత్రములు యథాక్రమమున వ్యాఖ్యాతములు కాలేదు. అన్ని సూత్రములకు వ్యాఖ్యాన మగపడదు. న్యాయభాష్యమున యథాక్రమముగా అన్ని సూత్రములు వివరింపఁబడియున్నవి.

క్రీ. శ. 6-వ శతాబ్దము చివర నుద్యోతకరుఁడు న్యాయభాష్యమునకు న్యాయవార్తికమను వ్యాఖ్యానమును రచియించెను. బౌద్ధనైయాయికుల సిద్ధాంతములను ఖండించి హైందవన్యాయశాస్త్రమును సుస్థిరముగ జేయుటచే యితఁడు న్యాయశాస్త్రమునకు గొప్పయుపకారమును జేసినవాఁ డగుచున్నాఁడు. అందువల్లనే సుబంధువు తన వాసవదత్తమున నొక సుందరమగుకన్యక కుపమానముగా నుద్యోతకరస్వరూపమగు న్యాయస్థితిని శ్లేషతో చెప్పియున్నాఁడు. ఉద్యోతకరుని తరువాతను వాచస్పతిమిశ్రుఁడు భాసర్వజ్ఞుఁడు ఉదయనుఁడు మొదలగువారు బౌద్ధులవాదములను ఖండించి హైందవ సిద్ధాంతములను స్థిరపరచినారు.

ఉద్యోతకరుని తరువాతను సుమారు రెండుశతాబ్దములు న్యాయశాస్త్రములో నుద్గ్రంథము లేవియును వ్రాయబడినట్లు తోఁచదు. క్రీ. శ. 9-వ శతాబ్దము మధ్యకాలమున వాచస్పతిమిశ్రుఁడు జీవించియుండెను. న్యాయసూచీనిబంధనమున తా

నాగ్రంథమును విక్రమశకము 898 సంవత్సరమున (క్రీ. శ. 841) వ్రాసినట్లు చెప్పియున్నాఁడు. ఇతని న్యాయవార్తిక తాత్పర్యటీక యింతకంటెను ముఖ్యమైన గ్రంథము. ఇది ఉద్యోతకరుని న్యాయవార్తికమునకు వ్యాఖ్యానరూప మగు గ్రంథము. ఇం దీతఁడు న్యాయవార్తికములోని విషయములనే కాక న్యాయభాష్యములోని యనేకవిషయములనుగూడ విశద పరచెను. ఈ గ్రంథమువలన నితనికి తాత్పర్యాచార్యుఁడని పేరు వచ్చెను. ఇతఁడు న్యాయశాస్త్రమందే గాక సాంఖ్యయోగ వేదాంత మీమాంసాశాస్త్రములలో కూడ సుద్గ్రంథములను రచియించెను. ఇతఁడు మైథిలబ్రాహ్మణుఁడు. క్రీ. శ. 9.వ శతాబ్దము చివరను జయంతభట్టు న్యాయమంజరి యనుగ్రంథమును వ్రాసెను. ఇది న్యాయదర్శనములోని కొన్ని సూత్రములకు వృత్తి రూపమున నున్నది. ఇతనికుమారుఁడగు అభినందుఁడే కాదంబరీ కథాసార మనుకావ్యమును రచించెను. జయంతభట్టునకు వృత్తి కారుఁడని వ్యవహారము కలదు. క్రీ. శ. 10-వ శతాబ్దప్రారంభమున భాసర్వజ్ఞుఁడు న్యాయసార మనుగ్రంథమును రచించెను. ఇది రెండధ్యాయములగ్రంథము, ఇందు భాసర్వజ్ఞుఁడు క్రొత్త రీతి నవలంబించెను. న్యాయసూత్రములు దాని వ్యాఖ్యానములువలె పదార్థవిచారముతో గ్రంథమును ప్రారంభింపక ప్రత్యక్షానుమాన శబ్దరూపములగు ప్రమాణవిచారముతో ప్రారంభించి నవ్యన్యాయప్రవర్తకులకు మార్గదర్శకుఁడాయెను.

ఉపమానప్రమాణమును విడచుట యీగ్రంథమునందు మఱి యొకవిశేషము.

సూత్రభాష్యముల మార్గమును విడచి స్వతంత్రగ్రంథములను రచియించినవారిలో నుదయనాచార్యుఁడు ముఖ్యుఁడు. ఇతఁడు ప్రశస్తపాదభాష్యమునకు కిరణావళియను వ్యాఖ్యానమును, వాచస్పతి మిశ్రుని న్యాయవార్తిక తాత్పర్యటీకకు న్యాయవార్తిక తాత్పర్యపరిశుద్ధి యను వ్యాఖ్యానమును; న్యాయపరిశిష్టమను నామాంతరముకల ప్రబోధసిద్ధియు, బౌద్ధధిక్కారమను నామాంతరముకల ఆత్మతత్త్వవివేకమును, న్యాయకుసుమాంజలియు నను మూఁడు స్వతంత్రగ్రంథములను రచించెను. న్యాయపరిశిష్టమున జాతినిగ్రహస్థానముల విచారము కలదు. ఆత్మతత్త్వవివేకమున (బౌద్ధ) శూన్యతావాద(జైన) క్షణికవాదఖండన పురస్సరముగా నాత్మస్వరూపవివేచనము కలదు. వీనికంటె ముఖ్యమగుగ్రంథము కుసుమాంజలి. ఇందు మీమాంసక సాంఖ్య బౌద్ధ జైన చార్వాకుల నిరీశ్వరవాదములను ఖండించి యుక్తిమూలమున నీశ్వరస్థాపనము చేయఁబడియున్నది. ఈశ్వరస్థాపనము చేసి నాస్తికమతముల నణగఁద్రొక్కినవారిలో ముఖ్యుఁ డుదయనాచార్యుఁడు. ఇట్టిగ్రంథమును రచించుటచే నుదయనుఁడు న్యాయాచార్యుఁ డనిపించుకొని యున్నాఁడు. ఇతఁడు తన లక్షణావళిని క్రీ. శ. 984 సంవత్సరమున రచించినట్లు వ్రాసుకొనియున్నాఁడు. అందుచే నితఁడు క్రీ. శ. 10-వ శతాబ్దమున జీవించియుండెను. ప్రాచీన నైయాయికులలో

నుదయనాచార్యుఁడు కడపటివాఁడని చెప్పవచ్చును. ఇతని సమకాలికుఁడగు శ్రీధరుఁడు క్రీ. శ. 991 సంవత్సరమున ప్రశస్తపాదభాష్యమునకు న్యాయకందళి యనువ్యాఖ్యానమును రచియించెను. ప్రశస్తపాదభాష్యమునకు వ్యోమశివునిచే వ్యోమవతియను మరియొకవ్యాఖ్యాన మీకాలమునందే రచియింపఁబడినట్లు రాజశేఖరుఁడు చెప్పియున్నాఁడు.

శివాదిత్యుఁడు సప్తపదార్థి యనుగ్రంథమున వైశేషిక మతస్వరూపమును సంక్షేపముగా వ్రాసియున్నాఁడు. ఇం దనేకవిషయములను భాసర్వజ్ఞుని న్యాయసారమునుండి గ్రహించి యున్నాఁడు. ఇతఁడు శ్రీహర్షునికంటె ప్రాచీనుఁ డగుటచే క్రీ. శ. 11-వ శతాబ్దమువాఁడు కావచ్చును. ఇతనిగ్రంథముల నాదర్శముగా జేసికొనియే తర్కసంగ్రహాది నవీనప్రకరణము లుద్భవించినవి. ఈపదొకండవశతాబ్దముననే వరదరాజు తార్కికరక్ష యనుగ్రంథమును శ్లోకరూపమున రచించి దానికి తానే సారసంగ్రహ మనువ్యాఖ్యనుకూడ వ్రాసెను. ఇందు న్యాయదర్శన భాష్యములరీతిని పదార్థవిచారపురస్సరముగా విషయమంతయు సంక్షేపముగా వ్రాయఁబడియున్నది.

ఉదయనాచార్యుని తరువాత లెక్కించతగిన నైయాయికుఁడు తత్త్వచింతామణి కర్తయగు గంగేశోపాధ్యాయుఁడు. ఇతఁడు శ్రీహర్షునికంటె (క్రీ. శ. 1163) నవీనుఁడును, చింతామణి వ్యాఖ్యాతయగు జయదేవునికంటె (క్రీ. శ. 1250) ప్రాచీ

నుఁడును అగుటచే క్రీ. శ. 1200 సంవత్సర ప్రాంతము వాఁడని చెప్పవచ్చును. ఇతఁడు మైథిలుఁడు. సామాన్యముగా చింతామణి యని వ్యవహరింపఁబడు తత్త్వచింతామణి యనేకవిధముల ప్రాముఖ్యమును వహించినది. ప్రాచీనన్యాయగ్రంథముల రీతిని విడచి ప్రమాణనిరూపణమున కిందు ముఖ్యస్థాన మీయఁబడినది. అందుచే తత్త్వచింతామణి పదార్థవిచారప్రధానశాస్త్రముగా నుండిన న్యాయమును ప్రమాణవిచారప్రధానశాస్త్రముగా మార్చినదని చెప్పవచ్చును. ఇటీవల రచియింపఁబడిన ముఖ్యములగు న్యాయగ్రంథములన్నియును చింతామణి నాధారముగాఁ జేసికొనియే వ్రాయఁబడినవి. దీనికి వ్యాఖ్యానరూపముగా గాని వ్యాఖ్యానములకు వ్యాఖ్యానరూపముగా గాని యున్నవి. ఈకారణములచే చింతామణిన్యాయమున నూతనశకమును ప్రారంభించినది. ప్రత్యక్షానుమానోపమానశబ్దరూపముల జింతామణి నాలుగు ఖండములుగా నున్నది. చింతామణి మొదలగు నవీనగ్రంథములలో విశేష మేమనగా: అతిసూక్ష్మదృష్టితో లక్షణముల పరిష్కారము చేయఁబడియున్నది. ఇందు కొఱకై అవచ్ఛేద్యావచ్ఛేదక నిరూప్యనిరూపక ప్రతియోగ్యనుయోగ్యాది పారిభాషికపదములు పరిష్కరింపఁబడినవి. వీనితో నిండియుండుటచే నవ్యన్యాయగ్రంథములశైలి వీని పరిచయము లేనివారికి దుర్గ్రాహ్యముగా నుండును. కాని వీని యుపయోగమువలన నవీనన్యాయమున కార్యకారణభావ, ప్రతి

బధ్య ప్రతిబంధకభావాదికము నిస్సందేహముగా నిరూపించుట కవకాశము గల్గినది.

గంగేశోపాధ్యాయుని చింతామణి సర్వోత్కృష్టమగు గ్రంథమగుటచే తరువాతి నైయాయికులు నూతనగ్రంథములను వ్రాయఁబూనక దానికి వ్యాఖ్యానములను వ్రాయుటయందే ప్రవృత్తులైరి. గంగేశునికుమారుఁడగు వర్ధమానోపాధ్యాయుఁడు తన తండ్రిగారిగ్రంథమునకును ఉదయనాచార్యుని గ్రంథములకును వ్యాఖ్యానముల వ్రాసెను. ఇవన్నియు ప్రకాశిక పేరున వెలయుచున్నవి. జయదేవాపరనామముగల పక్షధర మిశ్రుఁడు క్రీ. శ. 1250 సంవత్సరప్రాంతమున చింతామణికి ఆలోకమను వ్యాఖ్యానమును వ్రాసెను. ఈజయదేవుని శిష్యుఁడగు రుచిదత్తుఁడు వర్ధమానుని కుసుమాంజలి ప్రకాశమునకు కుసుమాంజలి మకరంద మనువ్యాఖ్యానమును వ్రాసెను.

గంగేశోపాధ్యాయుని యనంతరము మూఁడువందల సంవత్సరములవరకును న్యాయమున గ్రంథము లగపడవు. క్రీ. శ. 16-వ శతాబ్దప్రారంభమున నవద్వీపమున న్యాయశాస్త్ర ప్రచారమును వాసుదేవసార్వభౌముఁ డనుపండితుఁడు చేసియుండినట్లు తెలియుచున్నది. రఘునాథుఁడను తార్కికశిరోమణి యతనిశిష్యుఁడు. గంగేశునితరువాత యితఁడే యెన్నదగిన నైయాయికుఁడు. ఇతఁడు గంగేశునిచింతామణికి దీధితి యనువ్యాఖ్యను వ్రాసెను. చింతామణిలోని రెండుఖండములకే

దీధితి యగపడుచున్నది. రఘునాథుఁడు వైశేషికమతఖండనమగు పదార్థఖండనము మొదలగు మరికొన్ని గ్రంథములనుకూడ రచియించెను. ఇతనిశిష్యుఁడు మథురానాథుఁడు. ఈతఁడు చింతామణికిని దీధితికిని కూడ వ్యాఖ్యానములు వ్రాసెను. ఇతఁడును జగదీశుఁడును సమకాలికులు. వీరిరువురును క్రీ. శ. 1600 సంవత్సర ప్రాంతమువారు. జగదీశుఁడు దీధితికి వ్యాఖ్యానమును వ్రాసెను. ఇది జాగదీశియను పేరున వెలయుచున్నది. ఈతఁడు శబ్దశక్తిప్రకాశికయను ఆర్థికగ్రంథమును, భాష్యసూక్తియను ప్రశస్తపాదభాష్యవ్యాఖ్యానమును, తర్కామృతమను చిన్న ప్రకరణమును కూడ రచించెను. మథురానాథ జగదీశులకు సమకాలికుఁడగు హరిరామ తర్కాలంకారుని శిష్యుఁడు గదాధరుఁడు. అందుచే నితఁడు క్రీ. శ. 1650 సంవత్సర ప్రాంతము వాఁడు కావచ్చును. ఈతఁడుకూడ దీధితికి వ్యాఖ్యానమును వ్రాసెను. ఇయ్యది గాదాధరియని ప్రసిద్ధిచెందినది. మరియు నీతఁడు చింతామణిభాగములకు కూడ వ్యాఖ్యానము వ్రాసెను. ఇదియే మూలగాధాధరియని వ్యవహరింపఁబడుచున్నది. ఇవిగాక వ్యుత్పత్తివాద శక్తివాదములను నార్థికగ్రంథములను, ఉదయనాచార్యుని యాత్మతత్త్వవివేకమునకు వ్యాఖ్యానము మొదలగు ననేకగ్రంథముల నీతఁడు రచియించెను. న్యాయశాస్త్రమున పాండిత్యము సంపాదింపఁగోరువారందరును జగదీశగదాధరుల గ్రంథములలో ముఖ్యమైనవాని నిప్పటికి నభ్యసించుచున్నారు.

క్రీ. శ. 17-వ శతాబ్దమున దీధితికి మరియొకవ్యాఖ్యానమును చిన్నచిన్న ప్రకరణములును రచియింపఁబడినవి. మధురానాథ హారిరాములశిష్యుఁడగు రఘుదేవునియొక్క శిష్యుఁడైన శంకరమిశ్రుఁడు దీధితి కొకవ్యాఖ్యానమును వ్రాసెను. ఈతఁడు వైశేషికసూత్రముల కుపస్కారమను వ్యాఖ్యానమునుకూడ వ్రాసెను. ప్రశస్తపాదభాష్యమున నన్నిసూత్రములును వ్యాఖ్యాతములు కాకపోవుటచే నీయుపస్కారము ప్రాముఖ్యమును వహించినది. విశ్వనాథపంచాననుఁడు (క్రీ. శ. 1634) న్యాయసూత్రముల కొకవ్యాఖ్యానమును వ్రాసెను. ఈతఁడు భాషాపరిచ్ఛేదమను 168 శ్లోకముల చిన్నప్రకరణము నొకదానిని వ్రాసెను. ఈశ్లోకములకు సిద్ధాంతముక్తావళి యనువ్యాఖ్యానమును కూడ వ్రాసెను. ఈకారికలలోను తద్వ్యాఖ్యానములోను విషయమంతయు సులభముగాను స్పష్టముగాను వివరింపఁబడియున్నది. న్యాయశాస్త్రము నభ్యసింపఁ దలఁచినవారు తరచుగా మొదట తర్కసంగ్రహమును తరువాత దీనిని చదువుచున్నారు. పై యిరువురకంటె నవీనుఁ డన్నంభట్టు. ఇతఁడాంధ్రుఁడు. వ్యాకరణమున, వేదాంతమున, మీమాంసలోను గూడ గ్రంథములను రచించియున్నాఁడు. ఈతఁడు తర్కసంగ్రహమను చిన్నప్రకరణమును వ్రాసి దానికి తానే దీపికయను వ్యాఖ్యనుకూడ వ్రాసియున్నాఁడు. గోవర్ధనాచార్యుఁడు తర్కసంగ్రహమునకు న్యాయబోధినియను మరియొకవ్యాఖ్యను

వ్రాసెను. తర్కశాస్త్రము నభ్యసింపఁ దలఁచినవారు మొట్ట మొదట తర్కసంగ్రహ న్యాయబోధినీదీపికలనే చదువు చున్నారు. తర్కసంగ్రహదీపికల ప్రాముఖ్యమునుబట్టి వీటికి బాలగాదాధరియని వ్యవహారముకూడ వచ్చినది. ఇంకను కేశవ మిశ్రుని తర్కభాష (క్రీ. శ. 13 శతాబ్దము) లౌగాక్షి భాస్కరుని తర్కకౌముది (క్రీ. శ. 17 శతాబ్దము) మొదలగు చిన్న చిన్న గ్రంథము లనేకములు కలవు.

పై న్యాయశాస్త్రచరిత్రమునుబట్టి యీశాస్త్రము రెండు విధములుగా నభివృద్ధిచెందినట్లు తెలియఁగలదు. మొదటినుండి 12-వ శతాబ్దమువరకు సూత్రగ్రంథముల నాధారముగా జేసికొని శాస్త్రము వికాసమును పొందినది. అప్పటినుండి సూత్రముల ఫక్కినివిడచి తత్త్వచింతామణి నాధారముగా జేసికొని వ్యాప్తిని పొందినది. ఈభేదమును పురస్కరించుకొని మొదటి దానికి ప్రాచీనన్యాయమనియు, రెండవదానికి నవీనన్యాయ మనియు వ్యవహారము గలిగినది. మరియు కాలభేదమువలన ప్రాచీన న్యాయగ్రంథములకును, నవ్యన్యాయగ్రంథములకును భాషాశైలులలో విశేషభేదము గలదు.

ఇటీవలికాలమున న్యాయపండితులందరును నవీనన్యాయగ్రంథముల నభ్యసించినవారే కాని ప్రాచీనన్యాయగ్రంథముల నభ్యసించినవారు కారు. అందును ఈదేశమున ప్రాచీన న్యాయగ్రంథపఠన మంతరించినదనియే చెప్పవచ్చును. ఇపుడు

విశ్వకళాపరిషత్పరీక్షలకు బాఠ్యములుగా నేర్పరుచుటచే స్వల్పముగా ప్రాచీనగ్రంథములు పఠనపాఠనములలోనికి వచ్చుచున్నవి. అట్టిగ్రంథములలో నుదయనాచార్యుని కుసుమాంజలి యొకటి. నవ్యగ్రంథములలో నెంతనిష్ణాతు లైన వారికైనను ప్రాచీనగ్రంథము లన్వయించుట కష్టసాధ్యము. అట్టి ప్రాచీన గ్రంథములలో ముఖ్యమగు కుసుమాంజలిలోని విషయము నవ్యన్యాయపండితులకుఁ గూడ నశ్రుతపూర్వమే యనుటకు సందేహము లేదు. అట్లయ్యు శ్రీ వేరి లక్ష్మీనారాయణశాస్త్రులుగా రందలివిషయమును స్వయంకృషిచే తెలిసికొని తాము గురుముఖతః జదివిన గ్రంథములకంటెను నెక్కువసుబోధముగా పాఠము చెప్పగల్గుటయు వివరణము వ్రాయగల్గుటయు చాల యాశ్చర్యమును గలుగజేయుచున్నది. ఇట్లు నాస్తికమతనిరాసముచేసి యాస్తికమతమును స్థాపించిన కుసుమాంజలికి తెలుఁగు వివరణమును వ్రాసి యందలివిషయము న్యాయపండితులకే కాక యితరులకును, సంస్కృతము నభ్యసింపనివారికిని గూడ తెలియునట్లు చేసిన శ్రీ వేరి లక్ష్మీనారాయణశాస్త్రిగారి యుద్యమము మిక్కిలి ప్రశంసనీయము. ఇట్టి మహోపకృతిని గావించుటచే శ్రీ శాస్త్రిగారు యావదాంధ్ర లోకముయొక్క కృతజ్ఞతకు బాత్రులైరని నాదృఢవిశ్వాసము.

శాస్త్రీయగ్రంథములకు సామాన్యముగా బ్రచార మధికముగా నుండదు. అందుచే నట్టిగ్రంథములను బ్రచురించు

వారికి ప్రతిఫలము విశేషముగా నుండదు. ఈయాంధ్ర కుసుమాంజలి నాంధ్రదేశమున విజ్ఞానవ్యాప్తియే ప్రతిఫలముగా దలంచి విశేషవ్యయప్రయాసములకు లోనై ప్రకటించిన "వావిళ్ల" ముద్రణాలయ యజమానులగు బ్రహ్మశ్రీ వెంక టేశ్వరశాస్త్రులుగారు ఆంధ్రదేశమునకు మహోపకారము జేసి రనుటకు సందేహము లేదు. వీ రిదివరలోగూడ యిట్టిగ్రంథము లనేకములను ప్రకటించి యాంధ్రభాషను ఆంధ్రవాఙ్మయమును ఆంధ్రవిజ్ఞానమును పెంపొందించి యున్నారు. వీరింకను చాలా కాలము పైవిధమున నాంధ్రులకు విజ్ఞానాభివృద్ధి చేయుదురు గాక యని భగవంతుని ప్రార్థించుచున్నాను.

విజయనగరం,
18-12-1938.

శ్రీపరవస్తు వేంకటరామానుజస్వామి, యమ్. ఏ.,
శ్రీమన్మహారాజ సంస్కృతకలాశాలాధ్యక్షుఁడు.

# పండితాభిప్రాయములు.



శ్రీవిజయనగరం మహారాజావారి సంస్కృతకళాశాలా ప్రధానాధ్యాపకులును, రాజపుత్రస్థానస్థిత జయపురరాజధానీస్థిత సంస్కృతకళాశాలావిద్వత్ప్రివరోపాయనీకృత న్యాయభూషణబిరుద భూషితులు నగు బ్ర॥ శ్రీయుత వేర్యుప నామక లక్ష్మీనారాయణశాస్త్రులవారు శ్రీమదుదయనాచార్య ప్రణీత న్యాయకుసుమాంజలిగ్రంథమును తదీయసిద్ధాంతముల నాంధ్రలోకమునకు సుబోధములుగాఁ జేయుటకై, ఆంధ్ర భాషలో పరివర్తనము జేసియున్నారు.

లోకములో నొకభాషలో నుండెడిగ్రంథమును వేఱొక భాషలోనికి పరివర్తనము జేయునపుడు స్వల్పమైన యభిప్రాయ భేదము లుండుట స్వాభావికము. అయినను ఈశాస్త్రులు గారు తమకుఁగల జ్ఞానాతిశయమునుబట్టి సంస్కృత న్యాయ కుసుమాంజలి పఠనమూలమున నెట్టిజ్ఞానము కలుగునో దాని కేమియు లోటుపాటు లేకుండ నీపరివర్తనముఁ జేయుట నా కాశ్చర్యమును సంతోషమును గలుగఁజేసినది.

లోకములో ప్రబలిన నిరీశ్వరవాదములను నిరసించు విషయమున ఈన్యాయకుసుమాంజలినిబోలిన గ్రంథము వేఱొ

కటిలేదని సుప్రసిద్ధము. ఈగ్రంథమందు నిరీశ్వరవాదములలో ప్రబలమగు చార్వాక, మీమాంసక, సౌగత, దిగంబర, సాంఖ్యవాదములు క్రమముగ నైదుస్తబకములచే నిరసించి ఈశ్వరస్థాపన జేయఁబడినది. ఆ స్తబకములందలి విషయమును ఇచ్చట సంగ్రహముగా నిరూపించుచున్నాఁడను.

వైదికములగు నగ్నిహోత్రాదికర్మలకు స్వర్గాదిఫలకత్వము "స్వర్గకామోఽగ్నిహోత్రం జుహుయాత్" ఇత్యాదిశ్రుతులవలనఁ దెలియుచున్నది. స్వర్గమనఁగా దుఃఖముతోఁ గూడుకొనక ఎల్లప్పుడునుండుపద్ధతిలో ఉత్పన్నమైన సుఖవిశేషమని "యన్న దుఃఖేన సంభిన్నం న చ గ్రస్తమనంతరం. అభిలాషోపనీతం చ తత్సుఖం స్వః పదాస్పదమ్"అను శ్లోకముచే జెప్పఁబడుచున్నది. ఇట్టిసుఖము ఈలోకమున నీదేహముతో గూడియుండిన జీవునకుఁ గలుగదు. దేహపాతానంతరమున గలుగునని చెప్పవలెను. కాలాంతరభావియగు స్వర్గపర్యంతము అగ్నిహోత్రాది రూపమగుకర్మ లుండవు. గాన చిరవినష్టమగు ననుభవమునకు స్మృతిహేతుత్వోపపత్తికై యనుభవజన్యమును స్మృతిపర్యంతస్థాయియు నగు సంస్కారరూప వ్యాపారకల్పనవలె, చిరవినష్టమగు నగ్నిహోత్రాదికమునకు శ్రుతిబోధిత స్వర్గహేతుత్వోపపత్తికై యగ్నిహోత్రాదిజన్యము స్వర్గపర్యంతస్థాయియు నగు వ్యాపారకల్పన చేయవలెను. ఆవ్యాపారమే అదృష్టమనియు, అపూర్వమనియు, ధర్మమనియు, పుణ్యమనియుఁ జెప్పఁబడును. ఈధర్మ మతీంద్రియము గాన తద్ద్వారక కార్యకారణభావ

జ్ఞాన మతీంద్రియద్రష్టలకే గాని యస్మదాదులకు సంభవింపదు. గాన అతీంద్రియాదృష్టద్వారక కార్యకారణభావజ్ఞానము గల పురుషుఁడు వేదమూలమున నస్మదాదులకు కార్యకారణభావ జ్ఞానమును గలుగఁజేయఁగలఁడు. గాన నతీంద్రియద్రష్టయగు సర్వజ్ఞపురుషుఁడే వేదకర్తయఁగు నీశ్వరుఁడని సిద్ధించును. అని నైయాయికమతము.

ఈ వాదమంతయుఁ గార్యకారణభావాంగీకారముపై నాధారపడి యున్నది. అట్టి కార్యకారణభావమే లేదని కొందఱు చెప్పుదురు.

కార్యకారణభావమే లేనిచో ఈకార్యప్రపంచమంతయు నెల్లపుడును లేకపోవలసి వచ్చును. లేదా ఎల్లపుడును పుట్టవలసి వచ్చును. కార్యములు దేశవిశేషమునుబట్టియు, కాల విశేషమునుబట్టియుఁ బుట్టుచున్నట్లు వ్యవస్థితముగా కానవచ్చుచున్నందున ఆవ్యవస్థాసిద్ధికై కార్యకారణభావ మంగీకరింపక తప్పదు. కార్యకారణభావము సిద్ధించినను, దేహాద్యతిరిక్తమగు యాగాదికర్త లేనందున దేహపాతానంతరము యాగాదిఫల మనుభవించువాఁడు లేడు గాన నట్టి ఫలానురోధమున కల్పితమైనయదృష్ట మెట్లు సిద్ధించునని కొంద ఱాక్షేపించెదరు గాని యది సరిగాదు. దేహేంద్రియాద్యతిరిక్తమును స్థిరస్థాయియు నగుజీవాత్మ యుండకతీరదు. జీవుఁడు దేహము నశించినపిదప గూడ నుండును. యాగకర్తయగు జీవుఁడే యాగఫలము

ననుభవించును. గాన తత్ఫలానురోధమున నదృష్టము సిద్ధించును. స్థిరస్థాయి యగునట్టి జీవుఁడే లేనిచో దృష్టదేహోపాధికముగా మనచేఁ జూడఁబడుచున్న సుఖదుఃఖాదివైచిత్ర్యమెట్లు సిద్ధించును. కార్య వైచిత్ర్యములో కారణ వైచిత్ర్యము ప్రయోజక మనక తీరదు. అట్టివైచిత్ర్యమును దృష్టకారణ వైచిత్ర్యముచే సమర్థించుటకు వీలులేనందున యదృష్టకారణమును కల్పింపక తీరదు. ఆయదృష్టము ఈదేహప్రాక్తన కర్మాధీనము. ప్రాక్తనకర్మ కర్త ప్రాక్తనదేహమనినచో నది యీదేహముకంటె భిన్నమగుటచేఁ గృతహానాకృతాభ్యాగమదోషము వాటిల్లును. కాన దేహద్వయానుస్యూతమగు నొకపదార్థము నంగీకరింపక తీరదు. ఇటుల పూర్వపూర్వ సుఖదుఃఖవైచిత్ర్యమువలన బూర్వ పూర్వదేహములు, తావదనుస్యూతమగు నొకపదార్థము నంగీకరింపక తప్పదు. దానినే జీవుఁడందురు. దానికి పూర్వోక్తన్యాయమువలన నీ దేహపాతానంతరమునగూడ స్థితి సిద్ధింపఁగా, నట్టిజీవుని సుఖస్థితియె ఏతద్దేహోపాధిక యాగాదిజనితఫలమని లభించును. ఆఫలానురోధమునుబట్టి వెనుకఁ జెప్పినరీతిగా అదృష్టము సిద్ధించును గాన యట్టి అదృష్టద్వారక కార్యకారణభావజ్ఞానపూర్వకముగా వేదమును రచించిన పురుషధౌరేయుఁడు సిద్ధించును.

ఇది ప్రథమస్తబకార్థము.

# II. స్తబకము

పైన జెప్పినవిధముగా అదృష్టము సిద్ధించినప్పటికి, తద్ద్వారక కార్యకారణభావబోధకమగు వేదము ప్రమాణమని యంగీకరించినప్పటికి, దానికి కర్త ఈశ్వరుఁ డనుట సరిగాదు. వేద మపౌరుషేయము. నిత్యము. తద్గతప్రామాణ్యము స్వతోగ్రాహ్యము. కాఁబట్టి దానికి కర్త నంగీకరింప నక్కఱలేదు. ఒకవు డంగీకరించినప్పటికి యోగకర్మసిద్ధులు సర్వజ్ఞులగు కపిలాదులే కావచ్చును. కాఁబట్టి యసందిగ్ధముగా నీశ్వరసిద్ధి యెటుల కల్గుననెడుశంకను నిరసించుటకై యీ స్తబక మారంభింపఁబడినది.

వేదము నిత్యమనెడువాదము సరియైనది గాదు. వేదము వర్ణసంఘాతాత్మక మగుపదముల రాశియైయున్నటుల మన కనుభవగోచరము. "గకారము పుట్టినది. గకారము నశించినది. కోలాహలము నివర్తించినది." అనెడు ప్రత్యక్షముచే వర్ణముల కుత్పాదవినాశములు ప్రతీతములు. ఇట్లు వర్ణములనిత్యములైనపుడు తత్సంఘాతపదముల సంఘాత మగువేదము నిత్య మెటులగును ?

మఱియు "వర్ణ ముత్పత్తికలది గాన నశించును" అనెడి యనుమానప్రమాణముచే గూడ వర్ణములకు తత్సంఘాతపద సంఘాతరూపమగు వేదమునకుగూడ అనిత్యత్వము సిద్ధించును. ఇచట 'ఉత్పత్తి కలది' అనెడు హేతు వసిద్ధమని శంకింప

రాదు. వర్ణములందు దారత్వమందత్వాది భేదము, ద్రుతవిలంబిత మధ్యమవృత్తిభేదముచే భిన్నకాలికత్వము, ననుభవసిద్ధమై యున్నది. ఇట్టి విరుద్ధధర్మములు కారణవైజాత్యము వలన గాని సిద్ధింపఁజాలవు. కాఁబట్టి ఆయా విరుద్ధధర్మాశ్రయవర్ణములు విరుద్ధకారణజన్యములని యొప్పక తప్పదు. కావున "ఉత్పత్తి కలది" అను హేతువు నిర్దుష్టము. ఇఁక "సోయం గకారః" అను ప్రత్యభిజ్ఞ, సాజాత్యనిబంధనము గాన వర్ణానిత్యత్వబాధకము కానేరదు. కాఁబట్టి అనిత్యములగు వర్ణములతోఁ గూడిన వేద మనిత్యమె గాన కర్త నంగీకరింపక తప్పదు. మరియు వేదము నిత్యమనువాదమున్ను సరిగాదు.

ఇఁక యోగసిద్ధిచే సర్వజ్ఞులగు కపిలాదులే వేదమునకుఁ గర్తలు అని చెప్పుట కవకాశము లేదు. యోగసిద్ధులన నతీంద్రియార్థదర్శనోపాయమగు భావన గలవారని కదా అర్థము. వారి కట్టిభావన యున్నప్పటికి దానివలన నతీంద్రియార్థసాక్షాత్కారము తప్పక గలుగుననుటలోఁ బ్రమాణము లేనందున వారియెడ వేదప్రణయనానుకూలమగు సర్వజ్ఞత్వ మున్నదని నమ్ముట కవకాశము లేదు. అందుకు వేదమే ప్రమాణమనుట తగదు. వేదమునకుఁ బ్రామాణ్యసిద్ధి వారియందలి అతీంద్రియార్థ సాక్షాత్కారత్వనిశ్చయాధీనమైయున్నది. ఆనిశ్చయము ప్రామాణ్యసిద్ధ్యధీనమై యున్నది. ఇట్లీ రెండును నన్యోన్యాశ్రయము లగుటం జేసి కపిలాదులయెడ విశ్వాసము లేదు. కాఁబట్టి స్వతస్సిద్ధాతీంద్రియార్థ సాక్షా

త్కారము గలవాఁడును, కపిలాదులకన్న విలక్షణుఁడు నగు పురుషుఁడు వేదకర్త యని యంగీకరింపవలసి యున్నది. వేద జన్యమగు ప్రమ కర్తృగుణ జన్యమగుటంజేసి అట్టి గుణాశ్ర యుఁడైనపురుషుఁడు పరమేశ్వరుఁడు సిద్ధించును.

ఇయ్యది ద్వితీయస్తబకార్థము.

## III. స్త బ క ము.

పైన జెప్పిన యుక్తులచే నీశ్వరుఁడు సిద్ధింపవచ్చును. గాని యీశ్వరుఁడు లేడని బోధించు ప్రమాణము లున్నపుడు వెనుకటి ప్రమాణము లీశ్వరు నెటుల సాధింపఁగలవు. అను వాదమును నిరసించుటకై యీ స్తబకమున నీశ్వరాభావబోధక ప్రమాణము లేదని నిరూపించఁబడుచున్నది.

ఈశ్వరుఁడు లేడనుట కనుపలబ్ధిప్రమాణమని చెప్ప వలెను. అనుపలబ్ధి ప్రమాణ మనువారును కేవలానులబ్ధి ప్రమాణ మనుటకు వీలులేదు. అట్లనినయెడల నతీంద్రియము లగుటచే ననుపలబ్ధములగు నాకాశాది నిత్యవిభువులును జగ త్సృష్టికారణములగు పరమాణ్వాదులును లేకపోవలసి వచ్చును. కాఁబట్టి యోగ్యానుపలబ్ధియే యభావసాధక మన వలయును. ఈశ్వరుఁడు గగనాదులవలె నయోగ్యుఁ డగుటచే దదనుపలబ్ధి తదభావసాధకము కానేరదు.

మఱియు "భూతలము ఘటాభావము కలది" అను చాక్షుషప్రత్యక్షమంధునకుఁ గలుగ నేరదు. కేవలానుపలబ్ధియే యభావసాధక మనినచో నంధునకుఁగూడ నట్టి చాక్షుషప్రత్యక్షము కలుగవలసివచ్చును. ఇంతేకాక "ఘటాభావ వద్భూతల"మ్మనుజ్ఞానము ప్రత్యక్షసామగ్రీజన్యమగుటచే ప్రత్యక్షఫలమే యగును. కాఁగా అనుపలబ్ధికి పృథక్ఫలకత్వము లేనందున పృథక్ప్రామాణ్యము సిద్ధింపదు.

ఇట్లు ప్రత్యక్షానుమానోపమానశబ్దములు నాలుగును ప్రమాణములని నిరూపించుచు తన్ముఖమున నీనాల్గుప్రమాణములలోను కొన్నింటిని తగ్గింపవచ్చుననువారివాదమును మరి కొన్ని జేర్చవచ్చు ననువారివాదమును, సమంజసము కాదని యీ తృతీయస్తబకమున విపులముగా నిరూపింపఁబడినది.

ఇయ్యది తృతీయస్తబకార్థము.

## IV. స్త బ క ము.

ఈశ్వరజ్ఞానము ప్రమ కానేరదు. ప్రమ యనఁగా పూర్వ మజ్ఞాతమైన వస్తువుయొక్క జ్ఞానము. ఈశ్వరజ్ఞానము నిత్యమును సర్వవిషయకము నగుటచే నీశ్వరునిపట్లఁ బూర్వాజ్ఞాత మగువస్తువే లేనందున తజ్జ్ఞానరూప మగుప్రమ ఈశ్వరున కెట్లు సంభవించును ? కాఁబట్టి ప్రమాణాన్యుఁడగు

నీశ్వరునిచే ప్రణీతమగు వేద మున్మత్తవాక్యమువలె ప్రమాణము కాఁజాలదు. కాఁగా వేదప్రామాణ్యము నాధారముగా జేసికొని ఈశ్వరుని సాధించుటకై నొందిన ప్రయాసము విఫలమనుశంకను నిరసించుటకై నీస్తబకము ఈశ్వరజ్ఞానమునకు ప్రమాత్వసాధకముగా నారంభింపఁబడినది.

'పూర్వము తెలియఁబడని వస్తువుయొక్క జ్ఞానము ప్రమ' అనునది ప్రమాలక్షణము కానేరదు. అట్లైనచో పూర్వము జ్ఞాతమైనవస్తువును గోచరించు కాలాంతరభావిజ్ఞానము ప్రమ కాకపోవలసివచ్చును. అయ్యది ప్రమ గాదందురేని దాని వలనఁ గల్గుప్రవృత్తి నియతఫలకము కాకపోవలసి వచ్చును. మరియు శుక్తియందుగల్గు రజతభ్రమయు నజ్ఞాతార్థజ్ఞానము గాన ప్రమ కావలసివచ్చును. కాన యథార్థానుభవము ప్రమ యనునది ప్రమకు నిర్దుష్టలక్షణము. ఇట్టిలక్షణ మీశ్వరజ్ఞానమునందుఁగూడ నుండుటచే నదియు ప్రమయే యగును. ప్రమ గలవానిచే రచింపఁబడినవేదము సర్వథా ప్రమాణ మగును గాన తత్ప్రామాణ్యము నాధారముగా జేసికొని ప్రథమ ద్వితీయస్తబకములలో జేయఁబడిన యీశ్వరస్థాపనము నిర్దుష్టము.

ఇది చతుర్థస్తబకార్థము.

## V. స్తబకము.

వేదకర్తగా నీశ్వరుఁడు సిద్ధింపడు. వేదము జగత్తులోనిది. సర్వజగత్కర్తృత్వము మూలప్రకృతి ప్రథమపరిణామమగు మహత్తత్వమునకే గలదు. కావున జగద్వైచిత్ర్యము కూడ దానివల్లనే యుపపన్నమగుటంజేసి ప్రథమ ద్వితీయ స్తబకములలో నిరూపింపఁబడిన యీశ్వరసాధనము సమంజసము గాదు అను సాంఖ్యులయాక్షేపమును నిరసించుటకై యీ స్తబక మారంభింపఁబడినది.

ఈ స్తబకమున ననుమానము వేదము నీశ్వరసిద్ధిలో బ్రమాణములని నిరూపింపఁబడినది. ఇందు చూపఁబడిన హేతువు లీశ్వరాసాధారణము లగుటచే, సర్వజ్ఞుఁడు జేతనుఁడు బ్రకృత్యాదివిలక్షణము నగుపురుషుని సాధింపఁగలవు. మరియు వేదబోధిత జగత్స్రష్టృత్వాది ధర్మములన్నియు నీశ్వరునియందే సంభవములుగాని వేఱొకదానియందు సంభవములు గావు. కాఁబట్టి సర్వజ్ఞుఁడును వేదకర్తయు పరమకారుణికుఁడు నగు పరమేశ్వరుఁడు గలఁడు. అతనియుపాసన పరమపురుషార్థసాధకము. అని యీ గ్రంథోపసంహారమున దెలియఁజేయుచు నట్టి యీశ్వరోపాసనవలన జీవులందరును తరింపవలయునను సదుపదేశ మీగ్రంథమునఁ జేయఁబడినది.

పైనజూపఁబడిన నిరీశ్వరవాదములును తన్నిరాకరణపూర్వకముగా జేయఁబడిన యీశ్వరస్థాపన సిద్ధాంతములును సంస్కృతభాషామూలమున నాయాశాస్త్రములం దారితేరిన

వారలకే గాని యితరులకు సుబోధములు గావు. ఇక్కాలమున నట్టివా రరుదుగ నుందురు. శ్రీశాస్త్రులవా రివిషయమునంతను గమనించి పైసిద్ధాంతములను దేశభాషలో ననువదించిన సర్వజనసుబోధముగా నుండునని తలంచినవారై న్యాయకుసుమాంజలి నాంధ్రభాషలోనికి పరివర్తనము చేసి తదీయసిద్ధాంతముల నాంధ్రులకు సుబోధములుగా జేసిరి.

వీరి గ్రంథపఠనమువలన నాంధ్రులందరును నాస్తికమత నిరాసపూర్వకములైన ఈశ్వరస్థాపన సిద్ధాంతములను సులభముగా దెలిసికొనగలిగి పరమపురుషార్థమగు నీశ్వరారాధనపరులగుట కవకాశము గలుగును.

ఈవిధమున నాంధ్రులనందర నీశ్వరపరాయణులుగా జేయ దలంపుగల వీరి యీయుద్యమము ఆంధ్రలోకమునకు బరమోపకారకమని చెప్పుటలో నతిశయోక్తి లేదు. శ్రీశాస్త్రిగారు గురుసేవచే సంపాదించుకొనిన జ్ఞానమును కేవలస్వార్థమునకేగాక యిట్టి యుద్గ్రంథముల నింకను ననేకముల నాంధ్రమున బరివర్తనము జేయుట కుపయోగించుచు నాంధ్రభాషాసేవకులై ఆంధ్రలోకకృతజ్ఞతాపాత్రు లగుదురు గాక! ఆంధ్రులెల్లరు నీగ్రంథపర్యాలోచనచే నీశ్వరభక్తులై ఈశ్వరారాధనరూపమగు కృతజ్ఞతానివేదమును శ్రీశాస్త్రిగారి కర్పింతురు గాత!

ఇట్లు,

మహామహోపాధ్యాయ, శాస్త్రరత్నాకర,
కళాప్రపూర్ణ,
తాతా సుబ్బారాయశాస్త్రి.

విజయనగరము,
20.12.38.

బ్రహ్మశ్రీ న్యాయభూషణ పేరి లక్ష్మీనారాయణశాస్త్రులు గారిచే రచింపఁబడిన యాంధ్రకుసుమాంజలిని స్థాలీపులాక న్యాయముగా చూచితిని. ఇందలివిషయము మూలమున కవిరుద్ధము. శైలి సులభము. ఇయ్యది విద్యార్థుల కత్యంతోపయుక్తమగు గ్రంథము.

ఇట్టి దుర్జ్ఞేయములగు శాస్త్రగ్రంథము లింకను అనేకములు గలవు. శ్రీలక్ష్మీనారాయణశాస్త్రులవంటిసమర్థులగు పండితులచే వానినికూడ నాంధ్రీకరింపఁజేసి యాంధ్రభారతీపోషకు జేయూత నొసఁగుబాధ్యత తనపై గలదని యాంధ్రలోకము గుర్తెరుంగు గాక!

ఇట్లు,

శాస్త్రరత్నాకర, తార్కికచక్రవర్తి,
శ్రీపాద లక్ష్మీనృసింహశాస్త్రి,
శ్రీమత్పిఠికాపురసంస్థానాస్థాన న్యాయ
విద్యాచార్యుఁడు.

పిఠాపురం
18-11-1938.

న్యాయకుసుమాంజలిస్థ

# వి ష య సూ చి.

## ప్రథమస్తబకము.


| విషయము. | | పుట. |
|---|---|---|
| మంగళాచరణము | ... | 1 |
| ఈశ్వరవిషయమున వాదుల యభిప్రాయములు | ... | 6 |
| ఈశ్వరవిషయమున విప్రతిపత్తులు | ... | 9 |
| కార్యకారణభావ వ్యవస్థాపనము | ... | 11 |
| ఆకస్మికత్వవాదఖండనము | ... | 12 |
| స్వభావవాదఖండనము | ... | 18 |
| కార్యకారణప్రవాహమున కనాదిత్వమును స్థాపించుట | ... | 20 |
| తృణారణిమణులవహ్ని కారణత్వమును విచారించుట | ... | 23 |
| శక్తి పదార్థఖండనవిచారము | ... | 24 |
| దహనసామాన్యప్రయోజకమును నిరూపించుట | ... | 31 |
| అపూర్వ వ్యవస్థాపనము | ... | 37 |
| అభావమునకు గారణత్వముఁ జెప్పుట | ... | 48 |
| ప్రతిబంధకపదార్థ నిర్వచనము | ... | ,, |
| ప్రధ్వంసాభావమునకు వ్యాపారత్వమును ఖండించుట | ... | 60 |
| ఉపలక్షణమునకుఁ గారణత్వమును ఖండించుట | ... | 61 |
| పరమాణువులు పాకజవిశేషమువలన గార్యవిశేషజనకములని నిరూపించుట | | 70 |
| కారణతాపదార్థ నిర్ణయము | ... | 79 |

విషయము. — పుట.

నైయాయికమతమున శక్తిపదార్థమన నెట్టిదో దెల్పుట ... 80

అదృష్టము భోక్తృనిష్ఠమని స్పష్టపరచుట ... 82

సాంఖ్యమతనిరూపణము ... 87

సాంఖ్యమతఖండనము ... 91

కార్యకారణములు సమానజాతీయములై యుండవలెను గాని సమాన ధర్ములుగూడ నై యుండవలె నను నియమము లేదనుట. 94

భూతచైతన్యవాదము ... 98

తత్ఖండనము ... 99

క్షణభంగవాదము ... 101

తత్ఖండనము ... 102

జాతిసాంకర్యవిచారము ... 106

నిత్యవిభువునకు గారణత్వములేదని యాశంకించుట ... 122

నిత్యవిభువునకు గారణత్వమును స్థిరపరచుట ... 124


## ద్వితీయస్తబకము.


ప్రమకు గుణజన్యత్వమును సాధించుట ... 135

ప్రామాణ్యము పరతోగ్రాహ్యమని నిర్ణయించుట ... 142

శబ్దనిత్యత్వవాదఖండనము ... 150

జాతిశక్తివాదఖండనము ... 196

ప్రళయనిరూపణము ... 203

వేదప్రోసప్రదర్శనము ... 215

ఆచారమునకు ప్రత్యక్షశ్రుతిమూలకత్వమును స్థాపించి శాఖోచ్ఛేదము నంగీకరించుట ... 226

మహాజనపరిగ్రహ పదార్థనిర్వచనము ... 230

ప్రళయానంతరమున మరల సృష్టిగలదని నిరూపించుట ... 233

విషయము. ... పుట.

## తృతీయ స్తబకము.


అనుపలబ్ధికి ఈశ్వరబాధకత్వమును నిరసించుట ... 243
యోగ్యానుపలబ్ధికి అభావనిశ్చాయకత్వమును స్థాపించుట ... ,,
మనోవైభవవాదము ... 246
తత్ఖండనము ... 247
స్వప్ననిరూపణము ... 257
సుషుప్తినిరూపణము ... ,,
ఒకనియాత్మ వేఱొకనికి ప్రత్యక్షవిషయము కాదనుట ... 258
ప్రత్యక్షమే ప్రమాణమను చార్వాకవాదమును ఖండించుట ... 272
అనుమానమునకుఁ బ్రామాణ్యము నెలకొల్పుట ... 277
అప్రయోజక హేతునిరూపణము ... 290
ఉపాధిలక్షణము ... 291
అప్రయోజకమునకు హేత్వాభాసాంతర్భావమును జెప్పుట ... 295
సిద్ధసాధనమునకు హేత్వాభాసాంతర్భావమును జెప్పుట ... ,,
సాదృశ్య మతిరిక్తపదార్థము కాదనుట ... 299
శక్తిసంఖ్యాదు లతిరిక్తపదార్థములు కాదనుట ... 302
ఉపమానమునకుఁ బ్రమాణాంతరత్వమును స్థాపించుట ... 308
ఉపమానలక్షణము ... 323
శబ్దమున కనుమానాంతర్భావమును జెప్పువారిమతము ... 324
తత్ఖండనము ... 327
వేద మపౌరుషేయము, లౌకికశబ్దములకుఁ బృథక్ప్రామాణ్యము లేదు
అనుమతము ... 343
తత్ఖండనము ... 344
అన్వితాభిధానవాదఖండనము ...

| విషయము. | | పుట. |
|---|---|---|
| అర్థాపత్తి ఈశ్వరబాధకమని యాశంకించుట | ... | 368 |
| తత్ఖండనము | ... | 369 |
| అనుపలబ్ధికి ప్రమాణాంతరత్వమును ఖండించుట | ... | 385 |

చతుర్థ స్తబకము.

| | | |
|---|---|---|
| ప్రమాలక్షణవిచారము | ... | 422 |
| జ్ఞాతతాఖండనవిచారము | ... | 438 |
| ప్రమాపదార్థనిర్వచనము | ... | 569 |

పంచమ స్తబకము.

| | | |
|---|---|---|
| కార్యముంబట్టి కర్త్రనుమానము | ... | 477 |
| కర్తృసాధకానుమానవిపరీతానుమానముల బలాబలముల విచారించుట | | 480 |
| కర్తృసాధకానుమానమందలి బలమును నిరూపించుట | | 508 |
| విపరీతానుమానమునందు తర్కాభాసను ప్రదర్శించుట | ... | 514 |
| ప్రకృతానుమానమున తర్కమును ప్రదర్శించుట | ... | 514 |
| ఆయోజనమువలన కర్త్రనుమానము | ... | 529 |
| ధృతివలన ,, | ... | 531 |
| సంహారమువలన ,, | ... | 534 |
| పదమువలన ,, | ... | 534 |
| ప్రత్యయమువలన ,, | ... | 538 |
| శ్రుతివలన ,, | ... | 540 |
| సంఖ్యావిశేషమువలన ,, | ... | 548 |
| "కార్యాయోజనేత్యాదికారికను వేఱొకరీతిని వ్యాకరించుట. | | 554 |
| తాత్పర్యశబ్దార్థవిచారము | ... | 557 |


శ్రీః శ్రీః శ్రీః శ్రీః శ్రీః.

శ్రీశివాయ గురవే నమః.

# మంగళశ్లోకములు.

లలితా పరమేశ్వరీ కృపా
కలితా నృత్యతు చిత్తపఙ్కజే,
లలితాం పదవాక్యగుమ్భనాం
కలయన్తీ రచనాసు మే సదా.

వేదాన్తన్యాయసాంఖ్యేష్వనుపమధిషణా
శాలినం జాగదీశ్యా
స్సిద్ధాన్తవ్యాప్తివాణ్యా వివృతిరచనయా
ఖ్యాపితస్వీయశక్తిం,
వాదే ప్రత్యర్థివృత్తోద్ధరణచణమహా
చండవాయుం సభాయాం
వందేఽహం గుమ్మలూరుద్విజకులతిలకం
సంగమేశం గురుం మే.

శ్రీపాదాన్వయసిన్ధుశీతకిరణం
లక్ష్మీనృసింహాహ్వయం
ఛాత్రాజ్ఞానతమోనిరాసతరణిం
న్యాయేఽక్షపాదం నమే,

వేదాన్తప్రతివాదికుంజరఘటా
పంచాననం దేశికం
ధ్యాయే సాఞ్జలిబద్ధమానతశిరా
స్సాన్వాన్తే కృతజ్ఞస్సదా.

తాతాఖ్యద్విజకులసిన్ధు
రాజచన్ద్రం
సంసేవ్యం సకలకలార్ధి
కౌముదీప్రైః,
మన్మిత్రం రచితగురుప్ర
సాదమీడ్యం
వందేఽహం ఫణిపతికల్ప
సుబ్బరాయమ్.

కుసుమాంజలి నామాయం
భవ్యోదయనకర్తృకః,
సుఖబోధాయ బాలానా
మాన్ధ్రాక్షైర్హి పరివర్త్యతే.

శ్రీ రామాయ నమః

# న్యాయకుసుమాంజలి

## ప్రథమ స్తబకము.



అవతారిక. గ్రంథము నిర్విఘ్నముగా సమాప్తినొందుట కిష్టదేవతా సంకీర్తన రూపమంగళముఁ జేయుచు గ్రంథనామమును జెప్పుచున్నాఁడు:—

శ్లో. సత్పక్షప్రసరస్సతాంపరిమళ
ప్రోద్బోధబద్ధోత్సవో
విమ్లానో న విమర్దనేఽమృతరస
ప్రస్యన్దమాద్వీకభూః
ఈశస్యైష నివేశితః పదయుగే
భృఙ్గాయమాణం భ్రమత్
చేతో మే రమయత్వవిఘ్నమనఘో
న్యాయప్రసూనాంజలిః. ౧

పుష్పాంజలిపక్షమున నీశ్లోకమున కర్థము.

అర్థము. సత్పక్షప్రసరః-సత్ = యోగ్యమైన, పక్ష=దళములయొక్క, ప్రసరః=వికాసముగలిగినదియు, సతాం=నశింపని

గంధగ్రహణశక్తిగలఘ్రాణేంద్రియము గలవారికి, పరిమళ ప్రోద్బోధబద్ధోత్సవః - పరిమళ = గంధవిశేషముయొక్క, ప్రోద్బోధ=ప్రత్యక్షముచే, బద్ధ=కట్టఁబడిన, ఉత్సవః=ఆనందమును గలుగఁజేయునదియు, విమర్దనే = చేతులరాపిడి గలిగినను, న విమ్లానః=వాడనిదియు, అమృతరసప్రస్యన్దమాధ్వీకభూః - అమృత=సుధాతుల్యమగు, రస=రసమును, ప్రస్యన్ద=స్రవించు, మాధ్వీక=తేనెకు, భూః = ఉత్పత్తిస్థానమైనదియు, అనఘః = దోషరహితమైనదియు, ఈశస్య=ఈశ్వరునియొక్క, పదయుగే= పాదద్వంద్వమున, నివేశితః = ఉంచఁబడిన, ఏషః=ఈ, న్యాయ ప్రసూనాంజలిః - న్యాయ = న్యాయమనెడి, ప్రసూనాంజలిః= పుష్పాంజలి, భృంగాయమాణం = తుమ్మెదవలె నాచరించు నదియు, భ్రమత్ =తిరుగుచున్న, మే=నాయొక్క, చేతః=మన స్సును, రమయతు = ఆనందింపఁజేయుగాత.

న్యాయపక్షమున నీశ్లోకమున కర్థము.

సత్పక్షప్రసరః-సత్ =పక్షతావచ్ఛేదకవిశిష్టమగు, పక్ష= సిషాధయిషితసాధ్యధర్మముగల ధర్మియందు, ప్రసరః=ప్రమా త్మకమగు హేతుజ్ఞానముఁ గలుగఁజేయునదియు, సతాం = విమర్శకులకు, పరిమలప్రోద్బోధబద్ధోత్సవః- పరి=సమస్త హేతు వులయందు, మల=సంబద్ధమైన వ్యాప్తియొక్క, ప్రోద్బోధ = యథార్థజ్ఞానముచే, బద్ధ = కట్టఁబడిన, ఉత్సవః=ఆనందమును గలుగఁజేయునదియు, విమర్దనే = విరోధి ప్రమాణచింతయు న్నను, న విమ్లానః = కార్యమును బుట్టించుటయం దసమర్థము గానిదియు, ననగాఁ గార్యజననసమర్థమైనదియు, అమృతరస ప్రస్యన్దమాధ్వీకభూః-అమృత = మోక్షరూపమగు, రస=ఇష్ట

మును. ప్రస్యన్ద=కలుగఁజేయు, మాధ్వీక=జ్ఞానమునకు, భూః= ఉత్పత్తిస్థానమైనదియు, ఈశస్య=ఈశ్వరునియొక్క, పదయుగే= జ్ఞాపకములైన ప్రమాణతర్కములవిషయమై, నివేశితః = ఉప పాదింపఁబడినదియు, అనఘః = నిర్దుష్టమైన, ఏషః=ఈ, న్యాయ ప్రసూనాంజలిః = ప్రతిజ్ఞాదిపంచావయవసముదాయాత్మకమగు న్యాయమనెడి పుష్పాంజలి,భృంగాయమాణం=మకరందమందు తుమ్మెదవలె, దుఃఖవిగ్రహోపాయమందు తృష్ణగల, మే = నా యొక్క, చేతః=మనస్సును, రమయతు = దుఃఖసామగ్రి లేని దానినిగాఁ జేయుగాక.

ఈశ్లోకమున "సత్పక్షప్రసరః" అను విశేషణమువలన ఆశ్రయాసిద్ధి, బాధ, స్వరూపాసిద్ధులనెడి హేతుదోషముల నిరాసము సూచితము.

"పరిమలప్రోద్బోధబద్ధోత్సవః" అను విశేషణముచే, విరోధ-వ్యభిచార - వ్యాప్యత్వాసిద్ధులనెడి హేతుదోషముల నిరాసము సూచింపఁబడియె.

"విమ్లానో న విమర్దనే" అనువిశేషణము సత్ప్రతిపక్షం బనెడి హేతుదోషముయొక్కనిరాసమును సూచింపుచున్నది.

## ప్రమాణ, తర్క, స్వరూపము.

"క్షిత్యాదికం సకర్తృకం కార్యత్వాత్" అను నియ్యది ...నస్వరూపము. "క్షిత్యాదికం యది సకర్తృకం న స్యాత్, తర్హి కార్యం న స్యాత్" అను నియ్యది తర్క స్వరూపము.

ఈప్రమాణతర్కములవలన సిద్ధించుపరమాత్మను న్యాయముగూడ ప్రతిపాదించును.

న్యాయస్వరూపము.

"౧ క్షిత్యాదికం సకర్తృకం, ౨ కార్యత్వాత్, 3 యద్యత్ కార్యం తత్తత్ సకర్తృకం యథా ఘటః, ౪ తథా చాయం, ౫ తస్మాత్ తథా." అను నీవాక్యపంచకసముదాయమే న్యాయ మనఁబడును.

ఇందు "క్షిత్యాదికం సకర్తృక" మ్మనునది ప్రతిజ్ఞా వాక్యము. "కార్యత్వాత్త"నునది హేతువాక్యము. "యద్యత్కార్యం తత్తత్సకర్తృకం యథా ఘట" యనునది యుదాహరణము. "తథా చాయ" మ్మనునది యుపనయవాక్యము. "తస్మాత్తథా" యనునది నిగమనవాక్యము.

ఈశాస్త్రమున నాత్యన్తికదుఃఖనివృత్తియే మోక్షము. దీనికి సాధనంబీశ్వరమననంబు. అయ్యది న్యాయసాధ్యంబని యీ శ్లోకముచేఁ జెప్పఁబడెను.

అవ. పూర్వశ్లోకమున న్యాయసాధ్యమగు నీశ్వరమననము ముక్తిసాధనమని చెప్పఁబడినది. అది యసంగతము. శ్రు. "ఆత్మా వా౽రే ద్రష్టవ్యశ్శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" అను శ్రుతిఘటకమైన యాత్మశబ్దము జీవాత్మపరము గనుక జీవాత్మమననమే ముక్తిసాధనమనుట యుక్తమను శంకకు సమాధానముగా:—

శ్లో. స్వర్గాపవర్గయోర్మార్గమామనన్తి మనీషిణః,
యదుపాస్తిమసావత్ర పరమాత్మా నిరూప్యతే. ౨

అర్థ. మనీషిణః = విద్వాంసులు, యదుపాస్తిం-యత్ = ఏపరమాత్మయొక్క, ఉపాస్తిం = మననరూపమగు నుపా

సనను, స్వర్గాపవర్గయోః - స్వర్గ = స్వర్గతుల్యములయిన; అప వర్గయోః = పరాపరముక్తులకు, మార్గం=సాధనముగా, ఆమ నన్తి=చెప్పుచున్నారో, అసౌ=ఈ, పరమాత్మా = పరమాత్మ; అత్ర=ఈగ్రన్థమున, నిరూప్యతే = నిరూపింపఁబడుచున్నాఁడు.

తాత్పర్యము. ఈశ్వరమననమువలన నదృష్టము గలుగును. అదృష్టమువలన ముక్తి గలుగును. లేక యీశ్వరమననమువలన జీవాత్మ సాక్షాత్కారము గలుగును. దానివలన ముక్తి గలుగును.

ఈశ్వరమననమునకు ముక్తిసాధనత్వమును బోధించు శ్రుతివాక్యము. "తమేవం విదిత్వాఽతి మృత్యుమేతి నాన్యః. పంథా విద్యతే యనాయ" యనునది దీనియర్థము. తం=పరమాత్మను, విదిత్వైవ=తెలిసికొనియే, మృత్యుం=మృత్యువును, అత్యేతి = అతిక్రమించును, ముక్తుఁ డగునని తాత్పర్యము. అయనాయ = మోక్షముకొఱకు, అన్యః=ఇతరమగు, పన్థాః= మార్గము, న విద్యతే=లేదు.

జీవాత్మ సాక్షాత్కారమునకు మోక్షహేతుత్వమును సూచించు శ్రుతివాక్యము. "యదాత్మానం విజానీయాదయమస్మీతి పూరుషః, కి మిచ్ఛన్ కస్య కామాయ శరీరమనుసంజ్వరేత్" అనునది.

దీనియర్థము:—యదా=ఎపుడు, పూరుషః=పురుషుఁడు (జీవుఁడు) ఆత్మానం=తనను, అయమస్మీతి=ఈశ్వరతుల్యుఁడనైతినని, విజానీయాత్=తెలిసికొనునో, తదా=అపుడు, కస్య=దేని యొక్క, కామాయ=కోరికకొఱకు, శరీరం=శరీరమును, అనుసంజ్వరేత్ = మిక్కిలి పరితపింపఁజేయును? దర్శనకర్తలైన

వ్యాసాదులు నితర మతస్థులందఱును, భగవంతుని యుపాసనముఁ జేయుచునే యున్నారు. సందేహమే లేదు గావున న్యాయముచే నీశ్వరస్థాపనఁజేయుట యనుచితము.

**మూ.** ఇహ యద్యపి యం కమపి పురుషార్థమర్థయమానాః శుద్ధబుద్ధస్వభావ ఇత్యౌపనిషదాః, ఆదివిద్వాన్ సిద్ధ ఇతి కాపిలాః, క్లేశకర్మవిపాకాశయైరపరామృష్టో నిర్మాణకాయమధిష్ఠాయ సంప్రదాయప్రవర్తకో ఽనుగ్రాహకశ్చేతిపాతఞ్జలాః, లోకవేద విరుద్ధైరపి నిర్లేపః స్వతన్త్రశ్చేతి మహాపాశుపతాః, శివ ఇతి శైవాః, పురుషోత్తమ ఇతి వైష్ణవాః, పితామహ ఇతి పౌరాణికాః, యజ్ఞపురుష ఇతి యాజ్ఞికాః, నిరావరణ ఇతి దిగంబరాః, ఉపాస్యత్వేన దేశిత ఇతి మీమాంసకాః, యావదుక్తోపపన్న ఇతి నైయాయికాః, లోకవ్యవహారసిద్ధ ఇతి చార్వాకాః కిం బహునా? కారవోఽపి యం విశ్వకర్మేత్యుపాసతేతస్మిన్నేవం జాతి-గోత్ర-ప్రవర-చరణ-కుల-ధర్మాదివదాసంసారం ప్రసిద్ధానుభవే భగవతి భవే సన్దేహ ఏవ కుతః? కిం నిరూపణీయమ్?

పురుషార్థములు ముత్తెఱంగులు. సుఖము, దుఃఖనివృత్తి, వీనియుపాయములనునవి. వీనిలో నేదో యొకదానినిఁ గోరువారు భగవంతుని యుపాసనమును జేయుచున్నారు.

వేదాంతులు భగవంతుని శుద్ధజ్ఞానస్వరూపునిగా నుపాసనఁ జేయుదురు. వీరు సుఖమును గోరెదరు. కాపిలులు భగవంతుని సృష్ట్యాదియందుఁ బండితుఁడనియు, యోగాను ష్ఠానసిద్ధాణిమాద్యష్టసిద్ధులుగలవాఁడనియు నుపాసనఁజేయు దురు. యోగశాస్త్రసిద్ధావిద్యాస్మితాదిరూపపంచవిధక్లేశముల చేతను, ధర్మాధర్మహేతుభూతకర్మలచేతను, దత్ఫలముల చేతను లిప్తుఁడు కాఁడనియు, వేదోచ్చారణ యోగ్య మగు శరీరమును ధరించి, "సంప్రదాయప్రవర్తకః" 'సంప్ర దీయతే గురుణా శిష్యాయ' యనువ్యుత్పత్తిచే సంప్రదాయం బన వేదము. దాని నుపదేశించినవాఁడనియుఁ, గార్యనిర్మాణ నియామకుండనియు యోగులు భగవంతు నుపాసనఁజేయు దురు. మఱియు, లోకవిరుద్ధంబులగు గర్మలచే లిప్తుఁడుగాఁ డనియు, జగత్కర్తయనియు, మహాపాశుపతులును, శివుఁడని శైవులును, బురుషోత్తముఁడని (విష్ణువని) వైష్ణవులును, బ్రహ్మ యని పౌరాణికులును, యజ్ఞపురుషుఁడని యాజకులును, కర్మో పార్జిత శరీరరహితుఁడని దిగంబరులును, ఉపాస్యమానంబగు మంత్రస్వరూపుండని మీమాంసకులును, ప్రమాణసిద్ధములగు ధర్మములతోఁ గూడుకొనిన వాఁడని నైయాయికులును, "రాజావై పరమేశ్వర" యను న్యాయముచే లౌకిక వ్యవహార సిద్ధులగు రాజాదులే యని చార్వాకులును, విశ్వకర్మయని కర్మకారులును, భగవంతు నుపాసన జేయుచున్నారు. ఇట్లు బ్రాహ్మణ్యాదిజాతివలెను, గాశ్యపాదిగోత్రమువలెను, ఋష్యా దిరూపమగు ప్రవరవలె, ఋక్శాఖాదిరూపంబగు చరణము

వలె, వేదాధ్యయనాది రూపమగు కులధర్మమువలె శ్రుత్యాది ప్రమాణసిద్ధమగు భగవంతుని విషయమైన సందేహంబేల!

శ్లో. న్యాయచర్చేయమీశస్య మనన వ్యపదేశభాక్,
ఉపాసనైవ క్రియతే శ్రవణానంతరాగతా. 3

అర్థ. న్యాయచర్చా = న్యాయసాధ్యమగునట్టియు, మననవ్యపదేశభాక్ = మననమనెడి శబ్దముచే వ్యవహరింపఁదగినదియు, శ్రవణానంతరాగతా = "తత్త్వమసీ" త్యాది శ్రుతివాక్యజన్యశాబ్దానంతరభావియునగు, ఈశస్య = ఈశ్వరుని యొక్క, ఇయం=ఈ, ఉపాసనా = ఉపాసన, క్రియతే = చేయఁబడుచున్నది.

శ్రుతిస్మృతిపురాణేతిహాసములవలన భగవద్జ్ఞానము కలిగి, భగవంతునియందుఁ జగత్కర్తృత్వాది సందేహము వలన న్యాయము బ్రవర్తించెను. "న్యాయచర్చా" యను పదమువలన న్యాయసిద్ధమైన భగవంతుని బోధించుటచేతను, నీశ్వరునిచే నుక్తమగుటచేతను వేదములకుఁ బ్రామాణ్యము సూచిత మగుచున్నయది. శ్రవణానంతరమున మననముసేయుటలో "శ్రోతవ్యో మన్తవ్య" యనుశ్రుతియు, "ఆగమేనానుమానేన ధ్యానాభ్యాసరసేన చ. త్రిధా ప్రకల్పయన్ప్రజ్ఞాం లభతే యోగ ముత్తమ" మ్మను స్మృతియుఁ, బ్రమాణములు. యోగమన నాత్మసాక్షాత్కారము.

అవ. సంశయకారణభూతమగు విశేషవిప్రతిపత్తిని జూపించుచున్నాఁడు:—

తదిహ సంక్షేపతః పంచతయీ విప్రతిపత్తిః.

౧. అలౌకికస్య పరలోకసాధనస్యాభావాత్.

౨. అన్యథాపి పరలోకసాధనానుష్ఠానసంభవాత్.

3. తదభావావేదకప్రమాణసద్భావాత్.

౪. సత్త్వేపి తస్యాప్రమాణత్వాత్.

౫. తత్సాధకప్రమాణాభావాచ్చ. ఇతి.

ఈవాక్యోపక్రమమునం దైదువిధంబులగు విప్రతిపత్తులు, అనఁగా విరుద్ధజ్ఞానము లున్నవి.

ఇందు మొదటిది యగు "అలౌకికస్య పరలోకసాధనస్యాభావాత్" అన పరలోకసాధనమగు నతీంద్రియమైన వస్తువు లేదని. అనఁగా యాగాదులవలన నదృష్టము సిద్ధింపదు గావునఁ దదధిష్ఠాతృత్వముచే నీశ్వరుఁడు సిద్ధింపనేఱఁ డనునది చార్వాకుల విప్రతిపత్తి.

"జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" యనుశ్రుతివలన స్వర్గమునకు సాధనమైన యాగమునందుఁ బ్రజలు బ్రవర్తించుచున్నారు. ఆప్రవృత్తిలో వేదవాక్యమువలనఁ గలిగెడు యథార్థజ్ఞానము కారణము. ఆయథార్థజ్ఞానము వేదప్రామాణ్యము నపేక్షించును. వేదమునకు నాప్తోచ్చరిత మగునపుడే ప్రామాణ్యము. ఆయాప్తతయు కించిజ్జ్ఞులైన జీవులకు సంభవింపదు. కాన సర్వజ్ఞుఁడగు నీశ్వరునకే చెప్పవలెను. కావున వేదవక్తగా నీశ్వరుఁడు సిద్ధించునని న్యాయమతము. ఇయ్యది యుపంగతము. "అన్యథాపి పరలోకసాధనానుష్ఠానసంభ

వాత్" ఈశ్వరుఁడు లేకపోయినను, నిత్యమగుటవలన నిర్దుష్టం బగుటవలనను, వేదంబునకు స్వతఃప్రామాణ్యము సిద్ధించును. స్వతఃప్రమాణమైన వేదమువలనఁ గలిగెడు యథార్థజ్ఞానముచే వేదోదితకర్మలయందుఁ బ్రవృత్తిగలిగి యాగాదిరూపకర్మలయొక్క యనుష్ఠానము సంభవించును. కావున వేదప్రామాణ్యముకొఱకు నీశ్వరు నంగీకరింప నవసరములేదని యీ రెండవ విప్రతిపత్తి మీమాంసకులది.

"తదభావా వేదకప్రమాణ సద్భావాత్." ఈశ్వరుఁడున్నచోఁ బ్రత్యక్షము కావలసివచ్చును. అట్టిప్రత్యక్షము లేనందునఁ బ్రత్యక్షాభావరూపమగు ననుపలబ్ధిచే నీశ్వరుఁడు లేఁడను నియ్యది సౌగతుల విప్రతిపత్తి "సత్, క్షణిక" మ్మను ననుమానముగూడ నిత్యమగు ఈశ్వరునివిషయములో బాధకము.

"సత్త్వేపి తస్యా ప్రమాణత్వా" త్తనునది దిగంబరుల విప్రతిపత్తి. ఈశ్వరుఁ డున్నను ప్రమాణము గాఁడు. ప్రమాణ శబ్దమునకు రెండర్థములు.

కరణార్థమున ల్యుట్ప్రత్యయమును జేసినచోఁ బ్రమా కరణమని యర్థము లభించును. కర్త్రర్థమున ల్యుట్టును జేసినచోఁ బ్రమాకర్తని యర్థము లభించును. ఈశ్వరుఁ డశరీరి యగుటవలనఁ బ్రమాకరణమైన యింద్రియసన్నికర్షాదికము లేనందుననుభయవిధమైన ప్రామాణ్యము సంభవింపదు. అప్రమాణమైన నీశ్వరునిచే నుచ్చరింపఁబడిన వేదమెట్లు ప్రమాణము కాఁగలదు? అని వీరల యాశయము.

"తత్సాధకప్రమాణాభావా" త్తను నీయంతిమవిప్రతిపత్తి సాంఖ్యులది. మూలప్రకృతివలన జగదుత్పత్తి యగుచుండఁ జగత్కర్తఁగా నీశ్వరు నంగీకరింప నవసరము లేదని వీరి యభిప్రాయము.

అవ. పరలోకసాధనంబగు నలౌకికమైన యదృష్టము లేదనెడు చార్వాకమతమును, "తత్ర న ప్రథమః కల్ప" యను నిత్యాదిగ్రంథముచే ఖండించుచున్నాఁడు:—

తత్ర న ప్రథమః కల్పః.

శ్లో. సాపేక్షత్వాదనాదిత్వాద్వైచిత్ర్యాద్విశ్వవృత్తితః
ప్రత్యాత్మనియమాద్భుక్తే ర స్తి హేతురలౌకికః. ౪

అర్థ. సాపేక్షత్వాత్ = కార్యము హేతువు నపేక్షించుటవలనను, అనాదిత్వాత్ = కార్యకారణభావ మనాది యగుటవలనను, వైచిత్ర్యాత్ = కార్యము విచిత్రంబైనదగుట వలనను, విశ్వవృత్తితః - విశ్వ = ప్రపంచమునకు, వృత్తితః = యాగాదులందుఁ బ్రవృత్తి యుండుటవలనను, భుక్తేః=భోగమునకు ప్రత్యాత్మనియమాత్ = భిన్నభిన్నాత్మలందుండుట వలననూ, అలౌకికః = అతీంద్రియంబగు, హేతుః = పరలోకసాధనమగు నదృష్టము, అస్తి=కలదు. ఈశ్లోకార్థమే ప్రథమ స్తబకమందు పూర్తిగ నిరూపింపఁబడును.

మూ. న హ్యయం సంసారోఽనేకవిధదుఃఖమయో నిరపేక్షో భవితుమర్హతి, తదాహి స్యాదేవ న స్యాదేవవా,నతు కదాచిత్ స్యాత్.

తా. దుఃఖమయమగు నీసంసారము నిరపేక్షము కాదగదు. ఇయ్యది నిరపేక్షంబే, యయినచో నెల్లప్పుడు పుట్టవలసియే యుండును. లేక పుట్టకపోవలసి యుండును. కాని యొకప్పుడే పుట్టుట యనుభవసిద్ధము. అనఁగా కాదాచిత్కమగుచున్నది. ఇట్టి కాదాచిత్కత్వము లేకపోవలసి వచ్చును.

**మూ.** అకస్మాదేవ భవతీతి చేన్న.

తా. ఈవాక్యమువలన నాలుగర్థములు బోధింపఁబడుచున్నవి.

1. ఈవాక్యమందలి "నఞ్" పదార్థమగునభావముతో కింపదార్థమగు హేతువు నన్వయించినయెడల హేతువు లేకుండగనే భవనము (ఉత్పత్తి) యని లభించును.

2. భవనక్రియతో నఞర్థసంబంధము వివక్షిత మయినచో దేనివలనను బుట్టదని లభించును

3. నఞ్ నకు భేదవత్త్వర్థమును జెప్పి యేకదేశమైన భేదముతో హేతుపదార్థము నన్వయింపఁ జేసిన హేతుభిన్నమువలనఁ బుట్టునను నర్థము లబ్ధంబగు. ఇక్కడ హేతుభిన్నంబు కార్యంబేని, యలీకంబేని కావచ్చును. కానఁ గార్యమువలనఁగాని యలీకమువలనఁగాని కార్యంబగునని తాత్పర్యము.

4. కిం శబ్దం బస్వభావపరంబని దానిని నఞర్థముతో నన్వయించినచో స్వభావమువలనఁగూడఁ గలుగునని యర్థంబు లబ్ధంబగు.

ఈ నాల్గుపక్షంబులు గూడ ననుపపన్నంబులు.

**శ్లో. హేతుభూతినిషేధో న స్వానుపాఖ్యవిధిర్న చ,**
**స్వభావవర్ణనా నైవ మవధేర్నియతత్వతః. ౫**

అర్థ. హేతుభూతినిషేధః - హేతు= హేతువుయొక్కయు, భూతి=భవనముయొక్కయు, నిషేధః=నిషేధము నకాదు. స్వానుపాఖ్యవిధిః-స్వ = కార్యముయొక్కయు, అనుపాఖ్య = అలీకముయొక్కయు, విధిః=విధి, న=కాదు. ఏవం=ఈప్రకారముగా స్వభావవర్ణనా స్వభావముయొక్క వర్ణనమున్ను, న=కాదు. ఎందువలననగా: అవధేర్నియతత్వతః = నియతావధి సంబంధియగు కాదాచిత్కంబగుగార్యము ప్రత్యక్షవిషయమగుటవలన యని యర్థము.

హేతువు లేకపోయినను గార్యము పుట్టదని చెప్పుటయు, దేనివలనను గార్యము పుట్టదని చెప్పుటయు, హేతుభిన్నంబగు కార్యమువలనగాని, యలీకమువలనగాని కార్యంబుత్పన్నంబగునని చెప్పుటయు, స్వభావమువలనఁ గార్యోత్పత్తి యగునని చెప్పుటయుఁ గూడఁ గార్యముయొక్క కాదాచిత్కత్వప్రత్యక్షంబువలన ననుపపన్నంబు.

మూ. హేతునిషేధే భవనస్యానపేక్షత్వేన సర్వదా భవనవిశేషాత్, భవనప్రతిషేధే ప్రాగివపశ్చాదప్యభవనమవిశేషాత్, ఉత్పత్తేః పూర్వం స్వయమసతః స్వోత్పత్తావ ప్రభత్వేన, స్వస్మాదితి పక్షానుపపత్తేః పౌర్వాపౌర్య నియమశ్చ కార్య కారణభావః, నచైకం పూర్వమపరంచ, తత్త్వస్య భేదాధిష్ఠానత్వాత్. అనుపాఖ్యస్య హేతు

త్వే ప్రాగపి సత్త్వప్రసక్తౌపునః సదాతనత్వా
పత్తేః.

తా. 1. అందు భవన మెద్దాని నపేక్షించనందున ఎల్లపుడూ భవనమే కావలసివచ్చును. కావున మొదటిపక్షమసమంజసము.

2. దేనివలననూ భవనము గాదు. అనఁగా ఉత్పత్తిగాదనెడు రెండవపక్షమునఁ బూర్వాపరములయందు యటుల కార్యముయొక్క యభవనమో కార్యోత్పత్తి కాలమునఁ గూడ యభవనమె గావలసి వచ్చును. పూర్వాపరములయందెల యభవనమో, ఉత్పత్తికాలములోఁగూడ యభవనమె స్వీకరించినచో కార్యమున కుత్పత్తిని గోచరించు ప్రత్యక్షవిరోధము సంభవించును. కాన భవనప్రతిషేధపక్షము సరిగాదు.

3. (క) హేతుభిన్నమగు కార్యమువలన కార్యోత్పత్తిని స్వీకరించిన మూఁడవపక్షమున కార్యోత్పత్తికంటెఁ బూర్వమందు కార్య ముండకపోవుటవలన కార్యోత్పత్తిలోఁ గార్యమసమర్థము. భిన్నమైనవానికే కార్యకారణభావము. అట్టి కార్యకారణభావము పౌర్వాపర్యముతోఁ గూడుకొనినది గాన నొకేవస్తువు పూర్వాపరములయం దుండనందున తన యుత్పత్తిలో తా నసమర్థమగుటవలన మూఁడవపక్షముగూడ సరిగాదు.

(ఖ) అనుపాఖ్యమనఁగా శశశృంగాదులవలె నలీకము. దానికే హేతుత్వము చెప్పినచో కార్యోత్పత్తికంటే పూర్వమందుగూడ కార్యముండవలసి వచ్చును. ఇట్లంగీకరించినచో కార్యమునకు సదాతనత్వము రావలసివచ్చును.

మూ. స్యాదేతత్, నాకస్మాదితికారణ నిషేధమాత్రం వా,భవనప్రతిషేధో వా, స్వాత్మ హేతుకత్వం వా,నిరుపాఖ్య హేతుకత్వం వా, అభిధిత్సితమ్, అపిత్వనపేక్ష ఏవకశ్చిన్నియతదేశవత్ నియత కాలస్వభావ ఇతి బ్రూమః.

4. తా. అకస్మాదేవ భవతి యనువాక్యమునకు, కారణ నిషేధమాత్రపరత్వముగాని, భవనప్రతిషేధపర్వముగాని, స్వాత్మ హేతుకత్వపరత్వముగాని అలీక హేతుకత్వపరత్వము గానియభిలషితము గాదు. మరేమనఁగా, మరియొకదాని నపేక్షింపకయే తంతువేమాదికములన్నియుఁ బటమునుగూర్చి కారణమైనను పటమునకు తంతుదేశస్వభావ మెటులనో అట్లే కార్య మహేతుకమైనను కార్యమునకు నియతోత్తర కాలవృత్తిత్వము గూడ స్వభావమువలననే సంభవించునని యాశంకింపరాదు.

మూ. నిరవధిత్వేఽనియతావధిత్వేవా కాదాచిత్కత్వ వ్యాఘాతాత్,నహ్యుత్తరకాలసిద్ధిత్వమాత్రం కాదాచిత్కత్వం, కింతు ప్రాగసత్వే సతి, సావధి త్వేతు సఏవ ప్రాచ్యో హేతు రిత్యుచ్యతే, అస్తు ప్రాగభావ ఏవావధిరితి చేన్న, అన్యేషామపి తత్కాలే సత్వాత్, అన్యథా తస్యైవ నిరూ పణానుపపత్తేః, తథాచ న తదేకావధిత్వమవిశే షాత్, ఇతరనిరపేక్షస్య ప్రాగభావస్యైవ ప్రాగపితదవధేః కార్యసత్వ ప్రసంగా

తా. ఏవి నిరవధికములుగాను ననియతావధికములుగాను నుండునో యవి కాదాచిత్కములు గావు. నిరవధికమగు గగనాదులు కాదాచిత్కములు గావు. నిరవధికత్వము, కాదాచిత్కమును పరస్పరవిరుద్ధములు. కాన కార్యము నిరవధికముగాని, అనియతావధికముగాని అయినచోఁ గార్యమునకు కాదాచిత్కత్వము లేకపోవలసి వచ్చును. కాదాచిత్కత్వ మనఁగా, ఉత్తరకాలసంబంధిత్వరూపము. ఇట్టి కాదాచిత్కత్వము నిరవధికమైన గగనాదులకువలె కార్యమునకుఁ గూడ నెటుల యుండఁగూడదు ? అని యాశంకింపరాదు. కాదాచిత్కత్వ మనఁగా, పూర్వమం దుండకపోవుటయు నుత్తరకాలమందు సంభవించుటయు నని చెప్పెదము. ఇట్టి కాదాచిత్కత్వము నిరవధికమైన గగనాదులకు సంభవింపదు. అటులైనచో ఘటగగనాదులయందు కాదాచిత్కత్వాకాదాచిత్కత్వవ్యవహారము లేకపోవలసి వచ్చును. కావున కార్యము కాదాచిత్కము సావధికమని చెప్పవలెను. ఏది యవధియో అదియే ప్రాచ్యమైన హేతువగును.

ఆయవధి పూర్వమందున్న ప్రాగభావమే. అదియే కారణముగాని, భావము కారణముగాదని యాశంకింపరాదు. ప్రాగభావకాలమున భావము లేనందున దానికి ననవధిత్వము జెప్పుటకు వీలు లేదు. ప్రాగభావమువలె నియతమైన కపాలాదిరూపములైన భావము లున్నందున వానికిఁగూడ నవధిత్వము జెప్పవలెను. కార్యోత్పత్తికంటె పూర్వమందు కపాలాదులే లేనిచో నిరాశ్రయము గాన ప్రాగభావమే సిద్ధించక పోవలసి వచ్చును. కావున ప్రాగభావమువలెఁ గపాలాదులు గూడ

నున్నందున వానికిఁ గూడ నవధిత్వము సిద్ధించును. ఇతర నిర పేక్షమైన ప్రాగభావమే యవధియైనచో కార్యోత్పత్తికంటె పూర్వమం దట్టి ప్రాగభావరూప మైనయవధి యున్నందున పూర్వమందుఁగూడ కార్యముండవలసివచ్చును. (సదా తనత్వో పత్తివచ్చును) కావున భావముగూడ నవధియని చెప్పవలెను.

మూ సంతు యే కేచిదవధయః నతు తేఽపేక్ష్యంతే ఇతి స్వభావార్థ ఇతి చేత్, నాపేక్ష్యంతే ఇతి కోర్థః, కిం న నియతాః, ఆహోస్విన్నియతా అప్యనుప కారకాః ? ప్రథమే ధూమోదహానవద్గర్దభమ ప్యవధీకుర్యాత్ నియామకాభావాత్. ద్వితీ యేతు కిముపకారాంతరేణ, నియమస్యైవాపే క్షార్థత్వాత్, తస్యైవ చ కారణాత్మత్వాత్, ఈదృశస్య చ స్వభావవాదస్యేష్టత్వాత్.

తా. ప్రాగభావకాలమున కొన్నియవధు లున్నను నవి కార్యములో ననపేక్షితములు. ఇదియే స్వభావార్థమని యాశం కింపరాదు కార్యములో ననపేక్షితత్వ మనఁగా నేమి? కార్య నియతములు కాకుండుటయా? నియతములైన ననుపకారకము లగుటయా ? మొదటిపక్షమున, ధూమములోననియతమై పూర్వమందున్న రాసభముగూడ వహ్నివలె నవధి కావలసి వచ్చును. దేనియొక్క ఆనంతర్యము ధూమమునకు స్వభా వమో అదియే ధూమములో అవధి యని చెప్పినచో, ధూమ ములో వహ్నియే అవధిగాని రాసభాదులు గావనుటలో నియామకము లేనందున రాసభాదులుగూడ యవధి కావలసి

వచ్చును. కాన స్వభావవాదములో ఇట్లు అనిష్టప్రసంగము వచ్చును.

(2) నియతమయినను అనుపకారకమను రెండవపక్షమున నియతముల నుపకారక మనినచో మఱియొక యుపకారమును స్వీకరించవలెను. దానికి మఱియొక యుపకారాంతరము స్వీకరించినచో అనవస్థాప్రసంగము వచ్చును. గాన నియమమే యపేక్షాపదమున కర్థమని చెప్పవలెను. నియతమే అపేక్షాపదార్థ మన్నప్పుడు నియతమైనదే ఉపకారకము గాన నియతమైనను అనుపకారకమా యనుశంకకే యవకాశము లేదు. నియతత్వమే కారణత్వము. కపాలాదులు పూర్వమందుండి నియతమైనందున ప్రాగభావమునవలె కపాలాదిరూపభావమునకు గూడ నవధిత్వము సిద్ధించినందున ఇట్టి స్వభావవాదము భావమునకు కూడా అవధిత్వమును కారణత్వమును స్వీకరించినచో మాకు కూడ ఇష్టమే యగును.

మూ. నిత్యస్వభావనియమవదేతత్ న హ్యాకాశస్య తత్త్వమాకస్మికమితి సర్వస్య కిం న స్యాదితి వక్తుముచితమితి చేన్న. సర్వస్యభవతః స్వభావత్వానుపపత్తేః న హ్యేకమనేకస్వభావంనామ, వ్యాఘాతాత్ నన్వేవమిహాపి సర్వదాభవతః కాదాచిత్కత్వస్వభావవ్యాఘాత ఇతి తుల్యః పరిహారః. నతుల్యః, నిరవధిత్వే అనియతావధిత్వే కాదాచిత్కత్వవ్యాఘాతాత్ నియతావధిత్వే హేతువాదాభ్యుపగమాత్.

తా. నిత్యమైన ఆకాశాత్మలకు స్వభావములైన ఆకా శత్వాత్మత్వము లాకస్మికములు గదా యని సర్వసాధారణ మెందుకు గాగూడదని యాశంకించుట యనుభవవిరోధముచే నెట్లు గూడదో అట్లే యాకస్మికము లైననూ కాదాచిత్కత్వ స్వభావముగల ఘటాదికార్యముల కాకాశాదిస్వభావమైన సదాతనత్వము నాశంకింపరా దనుట యుక్తము గాదు.

ఆకాశత్వాదికమునకు సర్వసాధారణ్యము నాశం కించుటలో నాకాశస్వభావత్వ వ్యాఘాత మనుబాధకము గలదు. గాని ఘటాదులకు సదాతనత్వమాశంకించుటలో నట్టి బాధక మేమిగలదు?

ఘటాదికార్యము సదాతనమయ్యెనేని కాదాచిత్కత్వ స్వభావ వ్యాఘాతరూపబాధకము తుల్యమే యని భావింప రాదు.

కాదాచిత్కత్వస్వరూపము సిద్ధించినపిమ్మట సదా తనత్వాపాదన చేసినచో నాస్వరూపమునకు వ్యాఘాతము వచ్చును. ఆ కాదాచిత్కత్వము, కార్యము నిరవధికమైనను, అని యతావధికమైనను సిద్ధించదు గాన కాదాచిత్కత్వసిద్ధి కొఱకు కార్యము నియతావధికమని చెప్పవలెను. అట్టైన నా యవధియే హేతు వగును.

మూ. స్యాదేతత్ ఉత్తరస్య పూర్వః, పూర్వస్యోత్తరో మధ్యమస్యోభయమవధిరస్తు, దర్శనస్య దుర పహ్నవత్వాత్, త్వయాప్యేత దభ్యుపగన్తవ్యం నహి భావవదభావే ఽప్యుభయావధిత్వమస్తి. తద్వదాభావేష్వనుపలభ్యమానైకకోటిషు స్యాత్.

తా. ధ్వంసకుఁ బూర్వవృత్తి యగు ఘటాదికము, ప్రాగ భావమునకు నుత్తర వృత్తియగు ఘటాదికము, మధ్యవృత్తి యగు ఘటాదికమునకుఁ బూర్వోత్తర వృత్తులగు ప్రాగభావ ధ్వంసలు, నవధియగుట సర్వజనసిద్ధము.

భావమునకువలె నభావమునకుభయావధిత్వము లేనట్లే యనుపలభ్యమానైకకోటికమైన ఘటాదికమువిషయమై యుభయావధిత్వము లేకపోవును.

అవ. దీనిచే నవధిసిద్ధియైనను దానికి పూర్వవృత్తిత్వము సిద్ధించనందునఁ గారణత్వసిద్ధి కాదనుశంకచేఁ గార్యకారణ భావం బనాదియని చెప్పుచున్నాఁడు:—

**శ్లో. ప్రవాహోఽనాదిమానేషః న విజాత్యేకశక్తిమాన్,**
**తత్త్వే యత్నవతా భావ్యమన్వ యవ్యతిరేకయోః. ౬**

అర్థ. ఏషః = ఈ, ప్రవాహః = కార్యకారణ ప్రవాహము, నాదిమాన్=సాదిగాదు, నవిజాత్యేకశక్తిమాన్=విజాతీయమగు తృణాదిక మేకశక్తిగలది గాదు. అన్వయవ్యతిరేకయోః తత్త్వే = నియతత్వ విషయమున, యత్నవతా=ప్రయత్నము గలపురుషునిచే, భావ్యం=ఊహింపతగ్గది.

మూ. ప్రాగభావో హ్యుత్తరకాలావధిరనాదిః, ఏవం భావోఽపి ఘటాదిస్స్యాత్, అనుపలభ్యమాన ప్రాక్కోటిక ఘటాదివిషయం నేదమనిష్టమితి చేన్న.

తా. ప్రాగభావ ముత్తరకాలావధికము, యనాది యై నటుల భావమగు ఘటాదికము గూడ నుత్తరకాలావధికము

ననాదియు నెటులఁ గాఁగూడదు? పూర్వావధి యనుపలభ్య
మానమగునపుడు ఘటాదికమున కుత్తరకాలావధిత్వ మని
ష్టము కాదని యాశంకింపఁదగదు.

**మూ.** తానస్మాత్ప్రావధిస్వభావత్వే తదహార్వాత్ పూర్వే
ద్యురపి తమవధీకృత్య తదుత్తరస్య సత్వప్రసం
గాత్, అపేక్షణీయాంతరాభావాత్, ఏవం
పూర్వపూర్వమపి భావే తదేవ సదాతనత్వమ్.

తా. అట్లైనచో నపేక్షణీయమైన వస్త్వంతరము లేక
పోవుటచే నుత్తరకాలము నవధిగా జేసికొని యా ఘట మిపు
డున్నట్లే పూర్వమందుఁ గూడ నుండవలసివచ్చును. ఇట్లే తత్పూ
ర్వమందుండెడి వస్తువు దానిస్థితికంటెఁ బూర్వమందుఁ గూడ
నుండవలసివచ్చును. ఆగంతుక కారణమువలననే కార్యము
నకుఁ గాదాచిత్కత్వము సంభవించును.

**మూ.** తదహరేవానేన భవితవ్యమిత్యస్య స్వభావ ఇతి
చేన్న.

తా. ఏదినమున ఘటము ప్రత్యక్షగోచరమగునో యా
దినమునందే యది యుండుట స్వభావమని యాశంకింపరాదు.

**మూ.** తస్యాప్యహ్నః పూర్వన్యాయేన పూర్వమపి సత్వ
ప్రసంగాత్. తస్మాత్తస్యాపి తత్పూర్వకత్వమేవం
తత్పూర్వస్యాపీత్యనాదిత్వమేవ జ్యాయః, న త్వ
పూర్వానుత్పాదే కస్యచిదపూర్వస్య సంభవ
ఇతి.

తా. ఆదినమతీన్ద్రియ మగుటచే నుత్తరకాలమునవ
ధిగాఁ జేసికొని తత్పూర్వమం దుండవలసివచ్చును.

కార్యము పూర్వమందుండెడి యాగంతుక సామగ్రి కధీనము గాకపోయినచోఁ గార్యమునకుఁ గాదాచిత్కత్వమే సంభవింపదు. కాన గార్యమునకుఁ గాదాచిత్కత్వము నా గంతుక సామగ్రియధీనము. ఇట్లే సామగ్రియందుఁగూడ గాదా చిత్కత్వము దత్పూర్వవృత్తియగు నాగంతుక సామగ్రియ ధీనము. కావున కార్యకారణప్రవాహం బనాదియనుటయే లెస్స.

**మూ.** తథాపి వ్యక్త్యపేక్షయా నియమోస్తు న జాత్య
పేక్షయేతి చేత్ న.

తా. కార్యముయొక్క నియతజాతీయత, కారణము యొక్క జాత్యపేక్ష లేకనే సంభవించుననరాదు.

**మూ.** నియతజాతీయస్వభావవ్యాఘాతాత్.

తా. కారణమునకు జాతినియమము లేనిచో హేతువు లేనందునఁ గార్యమునకు నియతజాతీయత్వమే సంభవింపదు.

కారణముయొక్క జాతినియమమే యపేక్షించనప్పుడు తంతుజాతీయమువలన ఘటజాతీయము పుట్టవలసి వచ్చును. కాన నియతజాతీయముగల కారణము నియతజాతీయముగల కార్యములోఁ బ్రయోజకమని చెప్పవలెను.

**మూ.** యదిహాయతః కుతశ్చిద్భవన్నేవ తజ్జాతీయస్వ
భావః స్యాత్ సర్వస్య సర్వజాతీయత్వ మేకజాతీ
యత్వం వా స్యాత్.

తా. విజాతీయమువలనఁ బుట్టెడు కార్యమునకు జాతి నియమము స్వభావమువలననే సంభవించునెడు పక్షమున నీ

స్వభావము భిన్న జాతీయమువలనఁ గలిగెడు కార్యముయొక్క నియతజాతీయతాస్వభావమనినచోఁ గారణమునకు జాతినియమము లేనందున ఘటము ఘటజాతీయమైనటుల పటజనకసామగ్రిజన్యమైనందున పటజాతీయముగూడ కావలసివచ్చును. పటముకూడ ధూమజనకసామగ్రీజన్యమైనందున ధూమజాతీయమును గావలసివచ్చును. ఈరీతిగ పటము, ధూమజాతీయము, ఘటజాతీయమున్ను, ధూమము, ఘటజాతీయము, పటజాతీయమున్ను కావలసివచ్చును. మరియు సర్వకార్యము లేక జాతీయములైనను గావలసివచ్చును.

మూ. ఏవం తజ్జాతీయేన యతః కుతశ్చిద్భవితవ్యమిత్యస్య స్వభావ స్తదాపి సర్వస్మాత్సర్వజాతీయ మేకజాతీయం వా స్యాత్.

తా. నియతజాతీయకార్యజనకమైన కారణస్వభావమనినచో ఘటమునుబుట్టించెడుసామగ్రి పటప్రయోజకరూపముకలదై పటజనకముకూడ కావలసివచ్చును. ఇట్లే పటజనకసామగ్రి వలన పటజాతీయము ఘటజాతీయము ధూమజాతీయము సర్వజాతీయకార్యములును సంభవింపవలసివచ్చును.

మూ. కథం తర్హి తృణారణిమణిభ్యో భవన్నాశుశుక్షణి రేకజాతీయః?

తా. భిన్నజాతీయమువలన నేకజాతీయమైన కార్యము బుట్టదనినచోఁ దృణఫూత్కారసంయోగమువలనను మణితరణికిరణసంయోగమువలనను, అరణినిర్మంథనసంయోగము వలనను, నేకమైన వహ్నిజాతీయము పుట్టుట యసంగతము గావలసినచ్చునే?

మూ. ఏకశక్తిమత్త్వాదితి చేన్న. యదిహి విజాతీయేష్వ
ప్యేక జాతీయకార్యకారణశక్తిస్సమవేయాన్న
కార్యాత్కారణవిశేషః క్వాప్యనుమీయేత,
కారణవ్యావృత్త్యాచ న తజ్జాతీయస్యైవ కార్య
స్యవ్యావృత్తిరవసీయేత.

తా. విజాతీయములకుఁ బ్రత్యేకముగా నేకజాతీయ ములోఁ గారణత్వము జెప్పినచో వ్యభిచారాదికము ప్రసక్త మగును. కాన విజాతీయ కారణములందుఁ గార్యానుకూలమగు నేకశక్తిని స్వీకరించి యట్టిశక్తిసహితమైన వానికేకజాతీయకా ర్యములోఁ గారణత్వంబని మీమాంసకులందురు. అట్లైనచో ధూమజాతీయములో నేకశక్తిమత్తే కారణమైనందున వహ్ని జాతీయమునకు ధూమజాతీయములోఁ గారణత్వము లేనందున ధూమజాతీయముచే వహ్నిజాతీయముయొక్క యనుమాన మును, వహ్నిజాతీయముయొక్క యభావమువలన ధూమజాతీ యముయొక్క యభావానుమానమును లేకపోవలసి వచ్చును.

మూ. తదభావేఽపి తజ్జాతీయశక్తిమతోఽన్యస్మాదపి
తదుత్పత్తిసంభవాత్. యావద్దర్శనం వ్యవస్థా
భవిష్యతీతి చేన్న.

తా. ధూమజాతీయ శక్తిమత్తైన యితరములవలనగూడ ధూమజాతీయోత్పత్తి సంభవించుటవలన నేకశక్తిని (జాతీయ కార్యానుకూలశక్తిని) పురస్కరించుకొని విభిన్నజాతీయము లకుఁ గారణత్వము సెప్పుట తగదు. ఏయేస్థలములందు క్లప్త మగు కారణభావమును పొందినది లేకనే యితరములయిన వానివలన నేకజాతీయమైనకార్య ముత్పన్నమగుచుండునో

సయ్యాస్థలములందు నేకజాతీయమైన కార్యానుకూలమైన శక్తిని బురస్కరించుకొనియే కారణత్వము, యెచ్చటెచ్చట క్లప్తనియతభావమును బొందినకారణమువలననే కార్యజాతీయ ముత్పన్నమగునో అచ్చటచ్చట శక్తి నపేక్షింపకయే ధూమ జాతీయమునుగూర్చి వహ్నిజాతీయమునకుఁ గారణత్వమును జెప్పుదుము కానఁ గార్యమగు ధూమజాతీయమువలన వహ్ని జాతీయముయొక్కయు వహ్నిజాతీయముయొక్క యభావము చేత ధూమజాతీయముయొక్క యభావముయొక్కయు నను మానము సంభవించునని యాశంకఁ జేయరాదు.

మూ. నిమిత్తస్యాదర్శనాత్ దృష్టస్యచానిమిత్తత్వాత్.

తా. శక్తిమత్తులు కారణమైనచో శక్తి కారణతావచ్ఛే దకమని చెప్పవలెను. అది యతీంద్రియంబగుటవలనఁ బ్రత్య క్షము గాదు. అవచ్ఛేదకగ్రహణము లేనపు డవచ్ఛేద్యమగు కారణత్వముయొక్క గ్రహమే దుర్లభము. కాన నదృష్టమైన శక్తికారణత యందవచ్ఛేదకమని చెప్పుట తగదు. దృష్టమైన తృణత్వాదిక మవచ్ఛేదకమయినచో నితరకారణములయం దుండనందున వానికిఁ గారణత్వము సిద్ధింపక పోవలసివచ్చును. కాన శక్తిని స్వీకరించి కారణత్వము నంగీకరించిన మీమాంస మతం బసంగతంబు.

మూ. ఏతేన సూక్ష్మజాతీయాదితి నిరస్తం, అవహ్నే
రపి తత్సాక్ష్యాద్ధూమోత్పత్త్యాపత్తేః.

తా. దృశ్యమాన స్థూలజాతీయభేదముగల తృణాదు లందు సూక్ష్మమైన యొకానొకజాతిని స్వీకరించి యాజాతి మత్తునకే నియతమగు జాతిగల కార్యమునుగూర్చి కారణత్వ

మును జెప్పుటయు సరిగాదు. అటులైనచోఁ గార్యమువలనను, గారణనివృత్తివలనను గారణముయొక్కయుఁ గార్యనివృత్తి యొక్కయు ననుమానమునకు భంగప్రసంగము వచ్చును. ఆ సూక్ష్మజాతి, వహ్నికంటె వేరైనదానియందుఁకూడ నుండుట వలన వహ్నిభిన్నమువలన ధూమోత్పత్తి ప్రసంగము వచ్చును.

మూ. కార్యజాతిభేదాభేదయోస్సమవాయిభేదాభేదా
వేవ తంత్రం, న నిమిత్తాసమవాయినీ ఇతి చేన్న.

తా. కార్యముయొక్క జాతిభేదాభేదములలో సమ వాయి కారణముయొక్క భేదాభేదములే ప్రయోజకములు గాని, నిమిత్తకారణముయొక్కయు, నసమవాయి కారణము యొక్కయు, భేదాభేదములు ప్రయోజకములు గావంటివేని యది తగదు.

మూ. తయోరకారణత్వప్రసంగాత్ న హి సతి భావ
మాత్రం తత్, కిం తు సత్యేవ భావః.

తా. ఎందువలనన తృణాదిరూప నిమిత్తకారణము లేకున్నను వహ్నిరూపకార్యము పుట్టవలసివచ్చును. కార్యము నకు పూర్వమునందున్నంతమాత్రమున నది కారణము గాదు. అట్లైనచో నకారణములగు రాసభాదులకుఁగూడ కార ణత్వమువచ్చును. మఱేమన యేది లేనపుడు గార్యముబుట్టుట లేదో యదియే కారణంబగు. రాసభాదులు లేనప్పటికిఁగార్యము పుట్టుటవలన నవి కారణములు గానేరవు. నిమిత్తాసమవాయి కారణములకుఁ గూడ నిటులనే కారణత్వము సిద్ధించును.

మూ. న చ జాతినియమే సమవాయికారణమాత్రం నిబన్ధనం అపి తు సామగ్రీ అన్యథా ద్రవ్యగుణ కర్మణామేకోపాదానకత్వే విజాతీయత్వం న స్యాత్.

తా. కార్యముయొక్క నియతజాతిమత్త్వమును గూర్చి కేవలసమవాయికారణమే ప్రయోజకముగాదు. అట్లైనచో విజాతీయములగు ద్రవ్యగుణకర్మలలో నొకద్రవ్యమే సమవాయికారణమగుటవలన ద్రవ్యగుణకర్మలకు విజాతీయత్వము లేకపోవలసి వచ్చును. అనఁగా నేకజాతీయములు గావలసి వచ్చును. కావున జాతినియమము సామగ్ర్యధీనమని చెప్పవలెను.

మూ. న చ కార్యద్రవ్యస్యైషా రీతిరితి యుక్తం ఆరబ్ధదుగ్ధేరేవావయవైర్దధ్యారంభదర్శనాత్.

తా. కార్యద్రవ్యముయొక్క జాతినియమమునుగూర్చియే సమవాయికారణము ప్రయోజకమనినచో క్షీరోపాదానములగు పరమాణువులవలన విజాతీయ కార్యద్రవ్యరూపమగు దధియొక్క యారంభము లేకపోవలసి వచ్చును. కాన సామగ్రీ ప్రయోజ్యమే జాతినియమమని చెప్పుట యుచితము.

మూ. ఏతేన అపోహవాదే నియమో నిరస్తః, కార్యకారణభావాద్వైత్యాది విప్లవప్రసంగాత్.

తా. అగ్నినిగూర్చి తృణాదులకుఁ దృణాద్యన్యతమత్వముచేఁ గారణత్వము చెప్పినచో వ్యభిచారాదిప్రసక్తియుండ

దనెడు మతమునందుఁ గూడ పూర్వమునందుఁ జెప్పిన యను మానభంగ ప్రసంగము వాటిల్లును.

మూ. తస్మాన్నియతజాతీయతాస్వభావభంగేన వ్యక్త్య పేక్షయైవ నియమ ఇతి ఫూత్కారేణ తృణా దేరేవ, నిర్మథనేనారణేరేవ; ప్రతిఫలితతరణికిర ణైర్మణేరేవేతి ప్రకారనియమవత్తేనైవ వ్యజ్య మానస్య కార్యజాతిభేదస్య భావాత్. దృశ్య తేచ పావకత్వావిశేషేపి ప్రదీపః ప్రాసాదోదర వ్యాపకమాలోకమారభతే న తథా జ్వాలా జాలజటిలోఽపి దారుదహనః న తరాఞ్చ్కా రీషః యస్తు తం నాకలయేత్ స కార్యసామా న్యేన కారణమాత్రమనుమిమీయాదితి కిమనుప పన్నమ్?

తా. అన్యతమత్వేనకారణత్వము గార్యమునుగూర్చి నచో నన్యతమత్వమువహ్ని సాధారణమగుటవలన వహ్ని లేకపోయినను, వహ్ని భిన్నమువలన ధూమోత్పత్తి సంభ వించినందున ధూమమువలన వహ్న్యనుమానము లేకపోవ లసివచ్చును. కాన కార్యకారణ భావసిద్ధి లేనందున స్వభావ నియమముగూడ తెలియ శక్యముగాదు. కావున వ్యక్తులకే కార్యజాతిభేదమునుగూర్చి కారణత్వము చెప్పవలెను.

తృణఫూత్కార సంయోగముచేత వ్యజ్యమానమగు జాతివిశేషమును, ఇటులనే మణి, తరణికిరణ సంయోగము చేత వ్యజ్యమానమగు జాతివిశేషమును అరణి నిర్మథన సంయోగమువలన వ్యజ్యమానమగు జాతివిశేషమును కార్య

మగు వహ్నియందు స్వీకరించవలెను. దీపము దారుదహనము (కార్చిచ్చు) పిడకనిప్పు అను నీమూఁడు నగ్నిరూపములే యయి నను దీపము పడకటింటియందు నిండువెలుఁతురు నిచ్చునటుల మిగిలిన రెండు నీయఁజాలవు. కనుక కార్య వైజాత్య మాయా కారణములవలన వ్యజ్యమానములగునని యంగీకరింపవలెను. ఈ వైజాత్యమును తెలిసికొనుటకు సమర్థుఁడు కాకపోయి నచోఁ గార్యసామాన్యముచేఁ గారణ సామాన్యానుమానము నన్వయ వ్యతిరేకములఁబట్టి చేయవచ్చును.

మూ. ఏవం తర్హి ధూమాదావపి కశ్చిదనుపలక్షణీయో విశేషః స్యాత్, యస్య దహనాపేక్షేతి నధూమాదిసామాన్యాద్వహ్నిసామాన్యాది సిద్ధిః ఏతేన వ్యతిరేకో వ్యాఖ్యాతః తథా చ కార్యానుపలబ్ధిలింగభంగే స్వభావస్యాప్యసిద్ధేః గతమనుమానేన ఇతి చేత్ ప్రత్యక్షానుపలంభ గోచరో జాతిభేదో కార్యప్రయోజక ఇతి వదతో బౌద్ధస్య శిరస్యేష ప్రహారః.

తా. కార్యవైజాత్యమును స్వీకరించి తృణఫూత్కార సంయోగమునకు విజాతీయవహ్ని ని గూర్చి కారణత్వము నంగీకరించినందునఁ గార్యమందు వైజాత్యము స్వీకరింపఁబడి నది. అట్లైనచో ధూమమునం దతీంద్రియమైనజాతిని స్వీక రించి యావిజాతీయధూమమునుగూర్చియే వహ్నికిఁ గారణ త్వముఁ జెప్పినచో ధూమసామాన్యముచేత వహ్నిసామా న్యముయొక్కయు వహ్ని వ్యతిరేకమువలన ధూమవ్యతి రేకముయొక్కయు ననుమాన భంగప్రసక్తి కలుగును. ఎట్ల

నగాఁ గార్యమునందతీంద్రియమైన జాతివిశేషమును స్వీకరించి నచోఁ దదాశ్రయమైన కార్యమప్రత్యక్షమగుటవలన దానికి హేతుత్వము సంభవింపనందున ననుమాపకత్వస్వభావము సిద్ధింపనపు డనుమానవిలోపము వచ్చుననెడి బౌద్ధశంక కవ కాశము లేదు.

ప్రత్యక్షగోచరమైన బీజత్వాదిక మంకురరూపకార్య ములోఁ బ్రయోజకము గాదు. మఱేమన నతీంద్రియమైన గుర్వద్రూపత్వమే ప్రయోజక మనియు నదియప్రత్యక్ష మనియు, నటులనే కార్యమునందుఁ గూడ నప్రామాణికము నతీంద్రియమునయిన జాతివిశేషము నంగీకరించిన బౌద్ధుని యొక్క శిరమునందే యీ అనుమానభంగరూపశిలాక్షేపము గాని అతీంద్రియజాదివిశేషమును కార్యకారణములయం దంగీకరించని మామతమందు గాదు.

మూ. యత్సామాన్యాక్రాంతయో ర్య యో ర న్వ య
వ్యతిరేకవత్తా తయో స్తదైవ హేతుహేతు
మద్భావనిశ్చయః తథా భావాంతరవిశేషసద్భా
వేఽపి న నో విరోధః.

తా. అతీంద్రియ జాతివిశేషమును గార్యకారణములయందు స్వీకరింపని మామతమునం దెచ్చటెచ్చటఁ గార్యకారణములకు వ్యభిచారము దృష్టమగునో యచ్చటచ్చట తత్తద్వ్యక్తినిఁ గూర్చి తత్తద్వ్యక్తి యేకారణము ఎక్కడట్టి వ్యభిచారము దృష్టము కాదో అక్కడ నుపస్థితప్రత్యక్షసిద్ధసామాన్య రూపముచేతనే కార్యకారణభావము. అదెట్లనినఁ దృణ ఫూత్కారసంయోగము వహ్నిసామాన్యమునుగూర్చి కారణ

మనినయెడల తృణఫూత్కారసంయోగము లేకపోయినను మణితరణికిరణ సంయోగమువలన వహ్ని పుట్టుటచే వ్యభిచార ప్రసంగము.

అందుచే వహ్నిసామాన్యమునుగూర్చి తృణఫూత్కార సంయోగమునకుఁ గారణత్వము సిద్ధింపదు. కావున నట్టి స్థలములందు విశేషకార్యకారణభావమే యంగీకరింపఁబడును. ధూమత్వసామాన్యాశ్రయమునుగూర్చి వహ్నిత్వసామాన్యాశ్రయమునకుఁ గారణత్వము జెప్పినను వ్యభిచారప్రసక్తి యుండదు. కావున ధూమసామాన్యముచే వహ్నిసామాన్యముఁయొక్కయు వహ్నిసామాన్యవ్యతిరేకమువలన ధూమసామాన్యవ్యతిరేకముయొక్కయు ననుమానము సిద్ధించును.

మూ. కిం పునస్తార్ణాదౌ దహనసామాన్యస్య ప్రయోజకమ్? తృణాదీనాం విశేష ఏవ నియతత్వాదితి చేత్. తేజోమాత్రోత్పత్తౌ పవనోనిమిత్తం అవయవసంయోగోఽసమవాయీ తేజోవయవాస్సమవాయినః. ఇయమేవ సామగ్రీగురుత్వవద్ద్రవ్యసహితా పిండితస్య ఇయమేవ తేజోగతమృద్భూతద్రవ్యమపేక్ష్య దహనం తత్రాపి జలం ప్రాప్య దివ్యం పార్థివం ప్రాప్య భౌమమ్. ఉభయం ప్రాప్యౌధర్యమారభతే. ఇతి స్వయమూహనీయమ్.

తా. తృణఫూత్కారసంయోగము వహ్నియందుండెడి విశేషములోఁ బ్రయోజకమైనను నావహ్నియందుండెడి దహనత్వములో నేది ప్రయోజకము? తృణాదివిశేషమే నియత

మయిన దగుటవలనఁ బ్రయోజకమనరాదు. తృణాదులవలనఁ గలిగెడు వహ్నియందుఁ దేజస్త్వము గూడనుండును. అది దహనత్వమునకు వ్యాపకధర్మము. తేజస్సామాన్యములో వాయువు నిమిత్తకారణము తేజోవయవములు సమవాయికారణములు. తత్సంయోగమసమవాయికారణము. ఈ మూఁడు గురుత్వవద్ద్రవ్యసహితములై సువర్ణముద్భూతస్పర్శ నపేక్షించి దహనమును బుట్టించును. వెనుకటి సామాన్య సామగ్రి జలమును సహకారిగాఁ జేసికొని దివ్యమను మెఱుపును, పృథివిని సహకారిగాఁ జేసికొని వహ్నిని, యుభయమును సహకారిగాఁ జేసికొని జఠరాగ్నిని బుట్టించును. కావునఁ దృణాదికార్యమగు వహ్నియందు వహ్నిత్వము తేజస్త్వాదికముగూడ సిద్ధించుచున్నది.

మూ. తథాప్యేకమేకజాతీయమేవ వా కశ్చిత్కారణ
మస్తు కృతం విచిత్రేణ దృశ్యతే హ్యవిలక్షణ
మపి విలక్షణానేకకార్యకారి, యథా ప్రదీప
ఏకఏవ తిమిరాపహారీ వర్తివికారకారీ రూపాం
తరవ్యవహారకారీతి చేత్ న వైచిత్ర్యాత్కా–

తా. పై గ్రంథమువలనఁ గారణత్వసిద్ధియైనను, త్రిదండిమతస్థులవలె నేకమైన బ్రహ్మకుగాని,సాంఖ్యులవలె నేకజాతీయమైన ప్రధానమునకుఁగాని విచిత్రకార్యజనకత్వమొకవస్తువునకుఁగాని యేకజాతీయమునకుఁగాని సిద్ధించుచుండఁగారణవైచిత్ర్యంబంగీకరించుట యసంగతంబు. ఒకేదీపము, చీకటినిఁబోగొట్టునదియు, వత్తికివికృతిని గలుగఁజేయునదియు, ఘటాదిరూప

మును వేరుపఱచునదియు నగునట్లు లోకములో నొకదాని వలన ననేక కార్యములు పుట్టుటనుభవసిద్ధము. కావున నొక వస్తువుగాని యేకజాతీయమైన వస్తువుగాని విచిత్ర కార్యకారి యగునని యాశంకింపరాదు.

శ్లో. ఏకస్య న క్రమః క్వాపి వైచిత్ర్యం చ సమస్య న,
శక్తిభేదో న చాభిన్నః స్వభావో దురతిక్రమః. 2

అర్థ. ఏకస్య=ఒక కారణమునకు, న క్రమః=క్రమిక కార్య జనకత్వము సంభవించదు, సమస్య = ఏకజాతీయమునకు, న వైచిత్ర్యం=విచిత్ర కార్యజనకత్వము సంభవించదు, అభిన్నః = శక్తిశక్తిమత్తు లభిన్నమగుటవలన, శక్తిభేదః=శక్తివిశేషమున, విచిత్ర కార్యము నిర్వహించుటకు సమర్థము కాదు. స్వభావమువలన విచిత్ర కార్యనిర్వాహ మగుననుటకు స్వభావము తెలుసుకొనుట దుర్లభము గాన దానిని అంగీకరించి కార్య క్రమనిర్వాహముఁ జేయుటకుఁ గూడ వీలులేదు.

మూ. న తావదేకస్మాదనపేక్షాదనేకం కార్యం. అక్రమాత్క్రమవత్కార్యానుపపత్తేః. క్రమవత్త్వాపత్త్వాత్కార్యకారణస్వభావత్వాత్తస్య. తత్ తథా యాగపద్యవదితి చేత్, అయమపి క్షణభంగే పరిహారః. న తు సహకారివాదే. పూర్వాపూర్వానపేక్షాయాం క్రమస్యైవ వ్యాహతేః; క్రమనియమే త్వనపేక్షానుపపత్తేః.

తా. ఇతరకారణముల నపేక్షించని యొకదానివలననే విచిత్ర కార్యము లగునెడఁ గ్రమికంబగు గార్యోత్పత్తి యనుపపన్నం బగును. కారణాంతరము నపేక్షించని యొకదీపమే యుగపత్కార్యజననస్వభావము గలదగురీతిని గ్రమికమగు నితరకారణముల నపేక్షించని యొకవస్తువే క్రమికకార్యజనన స్వభావము గలదగునని యాశంకింపఁదగదు. అట్లగుచో నిది క్షణభంగవాదమునందే యుపపన్నమగునుగాని, సహకారి వాదమందనుపపన్నం బయ్యెడిని. పూర్వపూర్వకారణము నపేక్షించనిచోఁ గ్రమమునకే భంగము వాటిల్లును. క్రమిక కార్యోత్పత్తి యనుభవసిద్ధ మగుటవలనఁ గారణమునకుఁ గూడఁ గ్రమికత్వ మంగీకరింపవలయును. కాన కార్యవైచిత్ర్యమునుబట్టి కారణవైచిత్ర్యం బంగీకరణీయంబు.

మూ. నాప్యనేకమవిచిత్రం. యద్యన్యూనమనతిరిక్తం
దహనకారణమదహనస్యాపి హేతుర్నాసావ
దహనః. దహనో వా స్యాదుభయాత్మకో వా
స్యాత్. న చైవమ్.

తా. విచిత్రముకాని యేకజాతీయ మనేకము (ప్రకృతి కార్యమైన మహదహంకారాదికము). కారణమని చెప్పుటకు వలనుపడదు. ఏలయన! ఆయేకజాతీయ మొకయగ్నినే పుట్టించు స్వభావము గలదా? అగ్ని భిన్నమును బుట్టించుస్వభావము గలదా? రెంటిని బుట్టించుస్వభావము గలదా? అనువానిలో మొదటిపక్షమున— ఆకారణ మగ్నిభిన్నమునకుఁ గారణ మగుచో దహనమును బుట్టించెడు స్వభావము గల యేక

జాతీయమువలనఁ బుట్టిన యదహానం బదహానంబుఁ గాక దహానంబే కానోపు.

రెండవపక్షమున—ఆయేకజాతీయ మదహానమునకుఁ గారణం బగునెడ యదహానజననైకస్వభావము గల యేకజాతీయమువలనఁ బుట్టెడుదహానము దహానము గాక యదహానము కావలె.

మూఁడవపక్షమున—దహానాదహానరూప మగుకార్యజననము కావలసివచ్చును.

కావున నేకజాతీయము విచిత్రకార్యజనకమని చెప్పుట తగదు.

**మూ.** శక్తిభేదాదయమదోష ఇతి చేన్న. ధర్మిభేదాభేదాభ్యాం తస్యానుపపత్తేః.

తా. శక్తిభేదమును నాధారముగఁ జేసికొని యొకయేకజాతీయమువలననే విచిత్రమగు గార్యోత్పత్తి యగునని యాశంకింపరాదు. ఆశక్తిని దేనియందుఁ జెప్పెదరో దానికంటె నియ్యది యభిన్నమా? భిన్నమా? అభిన్నమగుచో ధర్మి యొక్కటి యగుటవలన శక్తిభేద మనుపపన్న మగును. భిన్నమగుచో నయ్యది కారణాంతర మగుటవలనఁ బ్రతిజ్ఞాతంబయిన యేకజాతీయకారణత్వమునకు వ్యాఘాతము వాటిల్లును. కావున శక్తిభేదమువలనఁ గార్యోత్పత్తి యగుననుపక్షంబు సరిగాదు.

**మూ.** ...అసంకీర్ణోభయజననస్వభావత్వాదయమదోష ఇతి చేత్. న.

తా. ఇతరకారణముల నపేక్షించని యొకదానివలననే విచిత్రకార్యము లగునెడఁ గ్రమికంబగు గార్యోత్పత్తి యనుపపన్నం బగును. కారణాంతరము నపేక్షించని యొకదీపమే యుగపత్కార్యజననస్వభావము గలదగురీతిని గ్రమికమగు నితరకారణముల నపేక్షించని యొకవస్తువే క్రమికకార్యజనన స్వభావము గలదగునని యాశంకింపఁదగదు. అట్లగుచో నిది క్షణభంగవాదమునందే యుపపన్నమగునుగాని, సహకారి వాదమందనుపపన్నం బయ్యెడిని. పూర్వపూర్వకారణము నపేక్షించనిచోఁ గ్రమమునకే భంగము వాటిల్లును. క్రమిక కార్యోత్పత్తి యనుభవసిద్ధ మగుటవలనఁ గారణమునకుఁ గూడఁ గ్రమికత్వ మంగీకరింపవలయును. కాన కార్యవైచిత్ర్యమునుబట్టి కారణవైచిత్ర్యం బంగీకరణీయంబు.

మూ. నాప్యనేకమవిచిత్రం. యద్యన్యూనమనతిరిక్తం
దహనకారణమదహనస్యాపి హేతుర్నాసావ
దహనః. దహనో వా స్యాదుభయాత్మకో వా
స్యాత్. న చైవమ్.

తా. విచిత్రముకాని యేకజాతీయ మనేకము (ప్రకృతి కార్యమైన మహదహంకారాదికము). కారణమని చెప్పుటకు వలనుపడదు. ఏలయన! ఆయేకజాతీయ మొకయగ్నినే పుట్టించు స్వభావము గలదా? అగ్నిభిన్నమును బుట్టించుస్వభావము గలదా? రెంటిని బుట్టించుస్వభావము గలదా? అనువానిలో మొదటిపక్షమున— ఆకారణ మగ్నిభిన్నమునకుఁ గారణ మగుచో దహనమును బుట్టించెడు స్వభావము గల యేక

జాతీయమువలనఁ బుట్టిన యదహనం బదహనంబుఁ గాక దహనంబే కానోపు.

రెండవపక్షమున—ఆయేకజాతీయ మదహనమునకుఁ గారణం బగునెడ యదహనజననైకస్వభావము గల యేక జాతీయమువలనఁ బుట్టెడుదహనము దహనము గాక యదహనము కావలె.

మూఁడవపక్షమున—దహనాదహనరూప మగుకార్య జననము కావలసివచ్చును.

కావున నేకజాతీయము విచిత్రకార్యజనకమని చెప్పుట తగదు.

**మూ.** శక్తిభేదాదయమదోష ఇతి చేన్న. ధర్మిభేదా భేదాభ్యాం తస్యానుపపత్తేః.

తా. శక్తిభేదమును నాధారముగఁ జేసికొని యొక యేకజాతీయమువలననే విచిత్రమగు గార్యోత్పత్తి యగునని యాశంకింపరాదు. ఆశక్తిని దేనియందుఁ జెప్పెదరో దానికంటె నియ్యది యభిన్నమా? భిన్నమా? అభిన్నమగుచో ధర్మి యొక్కటి యగుటవలన శక్తిభేద మనుపపన్న మగును. భిన్న మగుచో నయ్యది కారణాంతర మగుటవలనఁ బ్రతిజ్ఞాతం బయిన యేకజాతీయకారణత్వమునకు వ్యాఘాతము వాటిల్లును. కావున శక్తిభేదమువలనఁ గార్యోత్పత్తి యగుననుపక్షంబు సరిగాదు.

**మూ.** ...అసంకీర్ణోభయజననస్వభావత్వాదయమదోష ఇతి చేత్. న.

తా. ఏకజాతీయమే యసంకీర్ణమయిన యుభయంబును బుట్టించు స్వభావము గలది యనుకారణమున నుభయమును బుట్టించునని యాశంకింపఁగలదు.

మూ. హి స్వాధీనమస్యాదహనత్వం, అపి తు తజ్జనకస్వభావాధీనం. తథా చ తదాయత్తత్వాద్దహనస్యాపి తత్త్వం కేన వారణీయమ్? న హి తస్మిన్ జనయితవ్యే నాసౌ తత్స్వభావః. తస్మాద్విచిత్రత్వాత్ కార్యస్య కారణేనాపి విచిత్రేణ భవితవ్యమ్.

తా. ఏకజాతీయమే దహనాదహనములను బుట్టించు స్వభావముఁ గలది యగుచో నదహనమును బుట్టించిన యా వస్తువు దహనమును బుట్టింపఁగలయును గదా! మఱియు నదహనజనకైకస్వభావ మావస్తువునం దుండునా? లేక నశించునా? ఉండినచో నావస్తువునఁ బుట్టెడు దహనమునకు నదహనత్వం బవారణీయంబుగాన, నయ్యది యుక్తము గా నగును. కావున దహనత్వము స్వభావాశ్రయమైన యేకజాతీయవస్తువువలననే వచ్చునని చెప్పుటకు వలనుపడదు. నశించినచో దహనోత్పత్తియందును, నదహనోత్పత్తియందును ననేకకారణముల నంగీకరించుటవలన నేకజాతీయకారణత్వము వ్యాఘాత మయ్యెడిని.

కావున నేరీతిగా నదహనముల కదహనత్వము తత్సామగ్ర్యధీనమో, యాతీరుననే దహనములకు దహనత్వము సామగ్ర్యధీనము. ఏసామగ్రి దహనమును బుట్టించునో యా సామగ్రియే దహనజనకైకస్వభావము కానోపదని చెప్పుటకు

వలనుపడదు. విచిత్రకార్యము దృష్టమగుటవలనఁ గారణముఁ గూడ విచిత్రమని యంగీకరింపవలయును.

**మూ.** న చ తత్స్వభావత స్తథా, తతస్సహకారివైచిత్ర్యానుప్రవేశః, న తు క్షణో౽పి. తదనపేక్ష స్తథా భవితుమర్హతీతి.

తా. స్వభావమువలన విచిత్రకార్య ముపపన్నము గానేరదు. కావున సహకారి వైచిత్ర్యము నంగీకరింపవలయును. విచిత్రసహకారి కారణాపేక్ష లేకయే యపుడు పుట్టిన క్షణస్వరూపమునుబట్టి కార్యవైచిత్ర్య ముపపన్నమగునని యాశంకింపరాదు. క్షణము నితరకారణమును నపేక్షింపక కార్యవైచిత్ర్యమున నసమర్థ మగును. కాన సహకారి నంగీకరింపవలయును.

**మూ.** అస్తు దృష్టమేవ సహకారిచక్రం, కిమపూర్వకల్పనయా? ఇతి చేన్న. విశ్వప్రవృత్తితః.

తా. సహకారి సిద్ధించి నను, దృష్టమయిన సహకారి సముదాయమే కార్యప్రయోజక మగును. అదృష్టము నెందుల కంగీకరింపలెనని యాశంకింపరాదు.

**శ్లో.** విఫలా విశ్వవృత్తిర్నో న దుఃఖైకఫలాపి వా,
దృష్టలాభఫలా నాపి విప్రలంభో౽పి నేదృశః. ౮

అర్థ. విశ్వప్రవృత్తిః - విశ్వ = లోకముయొక్క, ప్రవృత్తిః= ప్రవృత్తి, విఫలా = విఫలమైనది, న= కాదు. దుఃఖైకఫలాపి= దుఃఖమే ముఖ్యఫలముగా గలదియు, న = కాదు. దృష్టలాభ

ఫలాపి = దృష్టమగులాభము మున్నగుఫలము కలదియు, న= కాదు. ఈదృశః = ఇట్టి, విప్రలంభోఽపి = వంచనయున్నూ, న = కాదు.

ఈశ్లోకమునకుఁ బరలోకసాధనమగు నదృష్టము నంగీక రింపవలయునని యాశయము.

మూ. యది హి పూర్వపూర్వభూతపరిణతిపరంపరా మాత్రమేవోత్తరోత్తరనిబంధనం, న పరలోకార్థీ కశ్చిదిష్టాపూర్తయోః ప్రవర్తేత. న హి నిష్ఫలే దుఃఖైకఫలే వా కశ్చిదేకోఽపి ప్రేక్షాపూర్వకారీ ఘటతే.

తా. కార్యమైనశరీరమందే చైతన్యము నంగీకరించెదము. అజ్ఞానమునఁ గలిగెడు సంస్కారమువలననే యుత్తరోత్తర కార్యములు గలుగును. కావునఁ బరలోకమునుఁ దత్సాధన మగు నదృష్టమును నంగీకరింప నవసరములేదని యాశంకింప వలదు. ఆత్మ, శరీరముకంటె భిన్నముగాదనియుఁ, బరలోకమే లేదనియు ననినచోఁ బరలోకముఁ గోరెడువాఁ డెవ్వఁడును యాగాదులందును, దటాకాదులందును బ్రవర్తింపక పోయె డిని. వీనియందలిప్రవృత్తి నిష్ఫలమని చెప్ప వలనుపడదు. నిష్ఫలంబును, దుఃఖప్రయోజనంబును గలగర్మ యం దెట్టిమను జుఁడును బ్రవర్తింపనేరఁడుగదా.

మూ. లాభపూజాఖ్యాత్యర్థమితి చేత్, లాభాదయ ఏవ కిం నిబన్ధనాః? నహీయం ప్రవృత్తిస్స్వరూపత ఏవ తద్ధేతుః, యతో వాఽనేన లబ్ధవ్యమ్.

తా. లోకమున ధనలాభమును, బూజ్యతను, ఖ్యాతిని, సంపాదించుటకొఱకు యజ్ఞాద్యనుష్ఠానముగాని పరలోకార్థము గాదని యాశంకింపవలదు. లాభాదులం దీప్రవృత్తి సాక్షాత్ కారణము గాదు. ప్రవృత్తి కలిగినపిదప యజ్ఞమును జేసినను నయ్యాగము కర్మకలాపరూపమగుటవలన లాభాదిపర్యంతస్థాయి కామింజేసి యదృష్టము నంగీకరింపవలయును.

మూ. యోవా ఏనం పూజయిష్యతి స కిమర్థం,
ఖ్యాత్యర్థమనురాగార్థం చ జనో దాతరి మాన
యితరి చ రజ్యతే. "జనానురాగప్రభవాహి
సంపద" ఇతిచేన్న. నీతినర్మసచివేష్వేవతదర్థం
స్థాపనాత్.

తా. మఱియు యజ్ఞమును జేసెడివారి నెవరు పూజింతురో! ఎవరు వారికి దానమును సేతురో వారిప్రవృత్తి వ్యర్థమయ్యెడిని."జనానురాగప్రభవాహి సంపద"యను నార్యోక్తి వలన నట్టివారినిఁ బూజించుటవలన లోకమున ఖ్యాతి జనానురాగము మొదలగునవి సంభవించునను నుద్దేశముతోనే గదా ప్రవర్తించెదరు? అని యాశంకింపవలదు. అటులైనచో లాభాదుల నుద్దేశించి దానాదికము న్యాయవాదులకు, మిథ్యావాదులకు, నుద్యోగస్థులకును జేయవలయును కాని యరణ్యమునఁ దప మొనరించువారికిని యజ్ఞాదు లొనరించువారికిని జేయఁబడక పోవలసివచ్చును.

మూ. త్రైవిద్యతపస్వినో ధూర్తబకాఏవేతిచేన్న
తేషాం దృష్టసంపదం ప్రత్యనుపయోగాత్.

తా. ప్రాచీనులగు వేదవేత్తలు తపంబు నాచరించువా రయ్యుఁ బరప్రతారకులని యాశంకింపరాదు. ప్రతారణ దృష్ట ఫలైకప్రయోజన మగుటచేతను, నాప్రయోజనమందు వీరు నిస్పృహు లగుటచేతను వీరలను బ్రతారకులని సెప్పుట తగదు.

**మూ.** సుఖార్థం తథా కరోతీతి చేన్న. నాస్తికైరపి తథాకరణప్రసంగాత్ సంభోగవత్.

తా. సుఖంబుసకై కర్మంబును, దపంబునుం జేయుచున్న వారనినచో సంభోగాదులవలెఁ బూర్వోక్తము లగుకర్మలను నాస్తికులుకూడఁ జేయవలసివచ్చును.

**మూ.** లోకవ్యవహారసిద్ధత్వాదఫలమపి క్రియతే, వేద వ్యవహారసిద్ధత్వాత్సంధ్యోపాసనాదివదితి చేత్; గురుమతమేతత్, న తు గురోర్మతం, తతో నేదమనవసర ఏవ వక్తుముచితం.

తా. నిష్ఫలమైన వేదచోదితమగు సంధ్యోపాసనాదికము వలె, నిష్ఫలమై లోకవ్యవహారసిద్ధమగు యజ్ఞాదికము చేయఁ బడుచున్నది యంటివేని, యియ్యది ప్రాభాకరునిమతము (గొప్పదియగునాశయము) కాని నైయాయికమతము కాదు. కావున ననవసరమున నీప్రసంగం బనుచితంబు.

**మూ.** వృద్ధైర్విప్రలబ్ధత్వాద్బాలానామితి చేన్న, వృద్ధా నామపి ప్రవృత్తేః, న చ విప్రలంభకానాన్వాత్మా నమపి విప్రలభన్తే

తా. వృద్ధులుకూడ ప్రవర్తించుటచే వృద్ధులచే వంచితులై బాలురు యాగాదులందు ప్రవర్తించుచున్నారని యాశం

కింపరాదు. ప్రతారణచేయువారు తమసు ప్రతారణ చేయరు గదా!

మూ. తేఽపి వృద్ధతరైరిత్యేవమనాదిరితి చేన్న. తర్హి విప్రలిప్సుః కశ్చిదత్ర? యతః ప్రతారణశంకా స్యాత్.

తా. వృద్ధులును దమకుఁ బూర్వమందుండెడి వృద్ధులచేఁ బ్రతారణఁ జేయఁబడినవా రనినచో నట్టి ప్రతారకుఁడగు మూలపురుషుఁ డుండునట్లు తెలిసికొనుటయుఁ గష్టసాధ్యము.

మూ. ఇదం ప్రథమమేవ కశ్చిదనుష్ఠాయాపి ధూర్తః పరాననుష్ఠాపయతీతి చేత్, కిమసౌ సర్వలోకో త్తర ఏవ. యస్సర్వస్వదక్షిణయా, సర్వబన్ధుపరి త్యాగేన, సర్వసుఖవిముఖః బ్రహ్మచర్యేణ, తపసా, శ్రద్ధయా వా, కేవలపరవంచనకుతూ హలీ యావజ్జీవ మాత్మానమవసాదయతి. కథం చైనమేకం ప్రేక్షాకారిణోఽప్యను విదధ్యుః?

తా. మొదట ధూర్తుం డగునొకండు స్వయంబుగఁ గర్మంబుల నాచరించువాఁడై ప్రతారకుం డగునని యాశంకింప వలదు. సర్వస్వమును దక్షిణగా నిచ్చి, సర్వబంధుపరిత్యాగముఁ జేసి సర్వసుఖవిముఖుఁడై బ్రహ్మచర్యంబు నవలంబించి, శ్రద్ధా తపంబులతోఁ గూడుకొనియుఁ గేవల పరవంచనతత్పరుఁడై తన జీవితకాలమంతయు దుఃఖము ననుభవించు లోకోత్తరుఁ డెవ్వఁడగునదియు తెలిసికొనుటయే కష్టము.

మూ. కేనవాచిహేన్నానాయమీాదృశ_స్త్వయా లోకో
_త్తర ప్రజ్ఞేన ప్రతారక ఇతి నీర్ణీతః? న హ్యేతా
వతా దుఃఖరాశేః ప్రతారణసుఖం గరీయః.

తా. లోకో_త్తర ప్రజ్ఞగల నీచే "మొదటియనుష్ఠాన మును జేయుపురుషుఁడుఁ బ్రతారకుఁ డని యే హేతువునే నిర్ణయింపఁబడినది! మొదట చెప్పఁబడిన దుఃఖసముదాయము కంటెఁ బ్రతారణసుఖముఁ గొప్పది కాదు. కావునఁబరలో పరలోకార్థియై యయ్యైహికసుఖంబుల విడనాడి దుఃఖభూయిష్ఠంబు లగు ననేకకర్మంబుల నాచరించుచున్నాఁడని చెప్ప వలయును.

మూ. యతః పాషండాభిమతేష్వ ప్యేవం దృశ్యత ఇతి
చేన్న. హేతుదర్శనాదర్శనాభ్యాం విశేషాత్.

తా. ఇట్లగుచో బాషండుల ప్రవృ_త్తియు, దృష్టఫలనిర పేక్షమై పరలోకసాధనము గావలయుఁ గదా? యని యాశంకింపరాదు. కర్మలాఘవంబునఁ బాషండులుఁ బ్రవ_ర్తింతురు. యాగాదులఁ బ్రవృ_త్తి బ్రహ్మచర్యాది దుఃఖమయకర్మ, ప్రధానము లగుటవలన నివ్వానికే పరలోకసాధనత్వముగాని పాషండప్రవృ_త్తి యిట్టిదిగానందున దీనికి పరలోకసాధనత్వము లేదు.

మూ. అనాదౌ చైవం భూతేఽనుష్ఠానే ప్రత్యాయమా
నే ప్రకారాంతరమాశ్రిత్యాపి, బహువి_త్తవ్య
యాయాసోప దేశమాత్రేణ ప్రతారణాస్యాత్.
న త్వనుష్ఠానాగోచ రేణ కర్మణా. అన్యథా

ప్రమాణవిరోధమంతరేణ పాఖండిత్వప్రసిద్ధిరపి
న స్యాత్.

తా. వేదముఁ బ్రతారణపరమని చెప్ప వలనుపడదు. ఏయేతావులఁ బ్రతారణ గాన్పించునో ఆయాతావులఁ బూర్వసిద్ధమైన యొకానొకయనుష్ఠానము జ్ఞాతమైయుండఁగా మఱియొకప్రకారము నాశ్రయించి యాత్మలాభముకొరకు సుగమమైన యుపాయమాత్రముచేఁ బ్రతారణచేయుట కలదు.

అదెట్లనిన :—రోగనివర్తకమయిన యౌషధవిశేషానుష్ఠానము బూర్వము సిద్ధమైయుండఁగా "నాకుఁ గొంత ధనమిచ్చునెడ నీరోగ ముపశమింపఁగలదని ప్రతారణచేయుట కలదు.

ప్రకృతమున వేదవిహితంబులగు గర్మలను స్వయముగా తానుజేసి దుఃఖమయములగు వీనిని నొరులచేఁ జేయింపించుటవలన, వేదానుష్ఠానము ప్రతారణ కానేఱదు. వైదికానుష్ఠానమునకుఁ బూర్వమున మఱియొకయనుష్ఠానము సిద్ధమయినచో నప్పట్టున వైదికానుష్ఠానము ప్రతారణ యని చెప్పఁగను. అట్టి పూర్వానుష్ఠానాగోచరంబై, బహువిత్తవ్యయా - యాససాధ్యమైన కర్మంబుల నుపదేశించుటవలన వేదము ప్రతారణపరము గాదు. ఎయ్యది ప్రతారణపరమో, యయ్యది యప్రమాణము. వేదమట్టిది కాదు. కాన ప్రమాణము. వేదము ప్రతారకమయినచో నప్రమాణము గావున "ప్రమాణేనఖండితాః పాషండాః" అను న్యాయసిద్ధమగు బాషండత్వసిద్ధియే లేకపోవలసివచ్చును.

మూ. అస్తు దానాధ్యయనాదిరేవ విచిత్రో హేతుః
జగద్వైచిత్ర్యస్యేతి చేన్న, క్షణికత్వాత్,
అపేక్షితస్య కాలాంతభావిత్వాత్.

తా. దానాధ్యయనాదిరూపవిచిత్ర హేతువులే జగద్వైచిత్ర్యమునకు హేతువులని యాశంకింపవలదు. అపేక్షితం బగు ఫలంబు కాలాంతరమునం దగును గావున నంతవరకు నాగని, యాగంబాఫలంబునకుఁ గారణము కానందున యేతాదృశకర్మంబులవలన ఫలాసాధకం బగునదృష్టవిశేషం బంగీకరణీయంబు.

శ్లో. చిరధ్వస్తం ఫలాయాలం న కర్మాతిశయం వినా,
సంభోగో నిర్విశేషాణాం న భూతైస్సంస్కృతైరపి. ౯

అర్థ. చిరధ్వస్తం=శీఘ్రముగా నశించెడు, కర్మ=యాగాదికము, అతిశయం వినా = అదృష్టమును విడచి, ఫలాయ = స్వర్గాదిఫలము కొఱకు, నాలం = సమర్థమైనది కాదు. సంస్కృతైః = అతిశయవిశిష్టములగు, భూతైరపి = శరీరాదులచేతను, నిర్విశేషాణాం=అతిశయశూన్యము లగునాత్మలకు, సంభోగః = భోగము, న = లేదు.

మూ. తస్మాదస్త్యతిశయః కశ్చిత్.

తా. కావున నొకానొక యదృష్టవిశేష మున్నదని యంగీకరింపవలయును.

మూ ఈదృశాన్యేవైతాని స్వహేతుబలాయాతాని,
యేన నియతభోగసాధనానీతి చేత్,

తా. స్వహేతుబలమువలనఁ గలిగెడు విశేషము గలశరీరాదులే ప్రతినియతభోగసాధనములని యాశంకింపరాదు.

మూ. తదిదమమీషామతీన్ద్రియం రూపం, సహకారి భేదో వా? న తావదైంద్రియకస్యాతీంద్రియం రూపం, వ్యాఘాతాత్ ద్వితీయే త్వపూర్వసిద్ధిః.

తా. స్వహేతుబలాయాత మగువిశేషము వీనికి నతీంద్రియరూప మగునా? లేక సహకారిరూప మగునా? యను వానిలోఁ బ్రథమపక్షమున నైంద్రియకమైనశరీరాదికము నతీంద్రియరూపమని చెప్పుట వ్యాఘాతమునం జేసి సంభవింపదు. రెండవపక్షమున, మాకభిమత మగునదృష్టము సిద్ధించును.

మూ. సిధ్యతుభూతధర్మ ఏవ గురుత్వాదివదతీంద్రియః, అవశ్యం త్వయాప్యేతదంగీకరణీయం, కథమన్యథా మంత్రాదిభిః ప్రతిబన్ధః?

తా. అదృష్టసిద్ధియైనను నాయదృష్టము గురుత్వాదికము వలె శరీరధర్మంబుగాని యాత్మధర్మము కాదు. భూతధర్మంబగు నదృష్టంబును బ్రతిమనుజుఁడును నంగీకరింపవలయును. లేనియెడల వహ్నివలనఁ బుట్టెడుదాహము మంత్రాదిసన్నిధానమున నెందులకు సంభవింపదు ?

మూ. తథాహిః— కరతలానలసంయోగాద్యాదృశాదేవ దాహో దృష్టః, తాదృశాదేవ మంత్రాదిప్రతిబన్ధే సతి దాహో న జాయతే, అసతి తు జాయతే, తత్ర న దృష్టవైగుణ్యముపలభామహే, నాపి దృష్టసాద్గుణ్యేఽదృష్టవైగుణ్యం సంభావనీయం, తస్యైతావన్మాత్రార్థత్వాత్, అన్యథా కర్మణ్యపివిభాగః కదాచిన్న జాయేత.

తా. ఎట్టి కరతలానలసంయోగమువలన దాహము దృష్టమో! మంత్రాదిసన్నిధానమున నట్టికరతలానల సంయోగమువలన దాహముండుట లేదు మంత్రాదులు లేనిచోఁ బుట్టుచున్నది. అక్కడ దృష్టమగు సామగ్రీవైగుణ్యము ప్రత్యక్షసిద్ధముగాదు. దృష్టకారణసామగ్రి యుండునెడ నదృష్టవైగుణ్యము నూహింపఁజనదు. దృష్టకారణసముదాయ మదృష్టార్థము గావున నదృష్టము నంగీకరింపవలయును. దృష్టకారణసామగ్రి యున్నను నదృష్టవైగుణ్యముండునెడ నొకానొకసమయమునఁ గర్మంబున్నను విభాగముఁ గలుగకపోయెడిని. దృష్టకారణసామగ్రి యుండునెడ నదృష్టముఁగూడ నున్నదని యంగీకరింపవలయును. దృష్టకారణసామగ్రి యున్నను, నదృష్టము లేదనినచోఁ గర్మ యున్నను నదృష్టవైగుణ్యనిమిత్తంబున,నొకానొకసమయంబునఁ గర్మవలన విభాగము గలుగకపోయెడిని. కావున మంత్రాదులవలన దాహాదిరూపకార్యప్రతిబంధ మగుచున్నయది. ఇయ్యది మఱియొకతీరున నుపపన్నము కాకపోవుటవలన నైయ్యాయికు లతీంద్రియమగు దాహానుకూల శక్తిని యంగీకరింపవలెను. అద్దానిని నశింపఁజేయునదియే ప్రతిబంధకమని చెప్పవలెను. కావున నతీంద్రియంబగు ధర్మంబు నైయ్యాయికాభిమతంబు.

మూ. న చ ప్రతిబంధకాభావవిశిష్టా సామగ్రీ కారణమ్,
అభావస్యాకారణత్వాత్, తుచ్ఛోఛ్ఛాహ్యాసౌ, ప్రతిబన్ధకోత్తమ్భకప్రయోగకాలే చ తేన వినాపి కార్యోత్పత్తేః.

తా. యతీంద్రియధర్మవిశేషస్వీకార మక్కఱలేకయే

ప్రతిబంధకాభావ విశిష్టసామగ్రియే కారణము. మణియుండు కాలమునఁ బ్రతిబంధకాభావము లేమింజేసి దాహరూప కార్యము పుట్టలేదని యాశంక వలదు. అభావము కారణము గాదు. భావనిషేధరూపము. కాన తుచ్ఛము. మఱియుఁ బ్రతి బంధకోత్తంభకములు రెండును నుండుకాలమునఁ బ్రతి బంధకాభావము లేమింజేసి దాహరూపకార్యము జనింపక పోయెడిని.

మూ. ప్రాక్ ప్రధ్వంసాది వికల్పేన చానియతహేతు కత్వాపాతాత్, అకించిత్కరస్య ప్రతిబన్ధకత్వా యోగాత్, కించిత్కరత్వే చాతీంద్రియశక్తే స్స్వీకారాత్. మంత్రాదిప్రయోగే చేతరేతరా భావస్య సత్త్వేఽపి కార్యానుదయాత్.

తా. మఱియు నభావమును, నన్యోన్యాభావ మనినచో మంత్రాదిప్రయోగకాలమున మంత్రాదిభేదరూపాన్యోన్యా భావ ముండుటంజేసి దాహము పుట్టెడిని. సంసర్గాభావ మనినచో నయ్యది ప్రాగభావప్రధ్వంసాభావాత్యన్తాభావభేద మున ముత్తెఱంగగు. వీనిలో నొక్కొక్కటి కారణమగుచోఁ బరస్పరవ్యభిచారము ప్రసక్తమగును. సముదాయమునకు కారణత్వ మంగీకరించినను నవ్వాని సమావేశము దుర్లభ మగుటంజేసి (తావదనుగమకరూప మొకటిలేదని యభి మానము) యభావము కారణ మని చెప్ప వలనుపడదు. మఱియుఁ బ్రతిబంధకాభావము కారణమగుచో నెయ్యది ప్రతిబంధకమో యయ్యది కార్యజననమున సమర్థమా? లేక యసమార్థమా? అసమర్థంబగుచో నద్దానికిఁ బ్రతిబంధకత్వము

దుర్లభ మగును. సమర్థమైనచో నతీంద్రియమైన శక్తి, నాశనములో సమర్థమగుటఁ జేసి దాహ కారణమైన వహ్ని యందు నతీంద్రియశక్తి సిద్ధించును.

మూ. అతో ఽతీంద్రియం కించిద్దాహానుగుణమను
ప్రాహకమగ్నే రుస్నీయతే. యస్యాపకుర్వతాం
ప్రతిబన్ధకత్వ ముపపద్యతే, యస్మిన్నవికలే
కార్యం జాయతే, యస్యైకజాతీయత్వా దని
యతహేతుకత్వం నిరస్యతే, ఇతి.

తా. కాన దేనిని నశింపఁజేయుటవలన మంత్రాదులకుఁ ప్రతిబంధకత్వ ముపపన్నమో, యెద్దానఁ గార్యము పుట్టునో, యెద్దాని నంగీకరించినఁదృణాదులకు దాహకారణత్వమున వ్యభిచారప్రసక్తి యుండదో, యట్టిశక్తి వహ్నియందు ననుమే యింపఁబడునని యాశంకింపవలదు.

శ్లో. భావో యథా తథాఽభావః కారణం కార్యవన్మతః,
ప్రతిబన్ధో విసామగ్రీ తద్ధేతుః ప్రతిబన్ధకః. ౧౦

అర్థ. యథా=ఏప్రకారముగా, భావః = భావము, కారణం=కారణమో, తథా=ఆప్రకారముగా, అభావోఽపి=అభావమున్ను, కారణం = కారణమని, కార్యవత్ = భావాభావములు యెటులకార్యములో అట్లె రెండునుంగూడ కారణమని, మతః = ఇష్టము. విసామగ్రీ = సామగ్ర్యభావము, ప్రతిబన్ధః= ప్రతిబంధము, తద్ధేతుః = ఆప్రతిబన్ధమునకుఁ గారణమైనది, ప్రతిబంధకః = ప్రతిబన్ధకము ప్రతిబంధమునఁ జేయునదియే ప్రతిబంధకము.

మూ. నహ్యభావస్యాకారణత్వే ప్రమాణమస్తి. నహి విధిరూపేణాసౌతుచ్ఛ ఇతి స్వరూపేణాపితథా, నిషేధరూపాభావే విధేరపి తుచ్ఛత్వప్రసంగాత్. కారణత్వస్య భావత్వే నవ్యాప్తత్వాత్తన్నివృత్తౌ తదపి నివర్తత ఇతి చేన్న, పరివర్తప్రసంగాత్.

తా. అభావము కారణము కాదని చెప్పుటలోఁ బ్రమాణము లేదు. భావనిషేధరూపమైనంతమాత్రమునఁ దుచ్ఛమగు నెడ నభావనిషేధరూపమగు భావముగూడఁ దుచ్ఛమగుటం జేసి యదియుఁ గారణము గాకపోయెడిని. ఏది భావమో యదియే కారణమని చెప్పినచో, నేది యభావమో యదియే గారణమనెడు నియమమునుబట్టి భావము కారణము కాకపోవలసి వచ్చును. కావున భావముంబలె, నభావమునును, గారణమని చెప్పవలయును.

మూ. అన్వయవ్యతిరేకానువిధానస్య చ కారణత్వనిశ్చయ హేతోర్భావవదభావేఽపి తుల్యత్వాత్.

తా. మఱియు భావమునకుంబోలె నభావమునకునుఁ గారణత్వగ్రాహకము లగు నన్వయవ్యతిరేకములు సమానములగుటవలన నభావంబకారణంబనుటలోఁ బ్రమాణము లేమిం జేసి భావమే కారణమనుట యసంగతము.

మూ. అభావస్యావర్జనీయతయా సన్నిధిః, న తు హేతుత్వేనేతి చేత్ తుల్యమ్.

తా. అభావము కార్యపూర్వమం దుండినను దానిని దొలఁగించుటకు వలనుపడనందున నాకాశాదులవలె దీనికిని

సాన్నిధ్యమే కాని కారణత్వము లేదనినచో భావమునకును నిట్లే యాశంకింపవచ్చును.

**మూ.** ప్రతియోగినముత్సారయత స్తస్యాన్యప్రయుక్త స్సన్నిధిరితి చేత్ తుల్యమ్.

తా. విధ్యుత్సారణప్రయుక్తసన్నిధి యభావమున కున్నదనినచో నిషేధోత్సారణప్రయుక్తసన్నిధి భావమునకుఁ గూడ గలదు.

**మూ.** భావస్యాభావోత్సారణం స్వరూపమేవేతి చే దభావస్యాపి భావోత్సారణం స్వరూపాన్నాతి రిచ్యతే.

తా. భావమభావోత్సారణస్వరూపమనినచో అభావము భావోత్సారణస్వరూపమే యనెదము.

**మూ.** తస్మాద్యథాభావస్యైవ భావో జనక ఇతి నియ మోఽనుపపన్నః, తథాభావ ఏవ జనక ఇత్యపి.

తా. కావున భావము భావమును గూర్చియే కారణ మనుట యెట్లు కుదరదో యారీతిగనే భావమే కారణమను టయుఁ గుదరదు.

**మూ.** ప్రతిబన్ధకోత్తమ్భకప్రయోగకాలే తు వ్యభి చార స్తథా స్యాత్, యది యాదృశే సతి కా ర్యానుదయస్తాదృశ ఏవ సత్యుత్పాదస్స్యాత్, న త్వేవం, తదాపి ప్రతిపక్షస్యాఽభావాత్. అసత్ప్రతిపక్షో హి ప్రతిబన్ధకాభిమతో మన్త్రః ప్రతిపక్షః, స చ తాదృశో నాస్త్యేవ య స్త్వస్తి నాసౌ ప్రతిపక్షః. తథాపి విశేష్యే సత్యేవ విశే

షణమాత్రాభావః, స చోత్తంభక ఏవేత్యన్యైవ సామగ్రీతి చేత్ న.

తా. అభావము కారణమగుచో నింతకుఁ బూర్వము ప్రసక్తమైన వ్యభిచారాదిక మెట్లు వారణీయ మగునని యాశంకింపరాదు. ప్రతిబంధకోత్తంభకము లున్నపు డుత్తంభకాభావవిశిష్టమంత్రాదికము లేకపోవుటవలన దాహరూప కార్యము నిర్వహించును. గాన యభావము కారణమనిన పూర్వవ్యభిచారము లేదు. రెండును నున్నపుడుత్తంభకాభావరూపవిశేషణము లేకపోవుటవలన విశేషణాభావ ముత్తంభకరూపభావములోనే పర్యవసన్న మగుటం జేసి యద్దానివలననే కార్యనిర్వాహ మగునుగాన, యభావము కారణము కాదని యాశంకింపవలదు.

మూ. విశిష్టస్యాప్యభావాత్. న హి దండిని సత్యదండానామన్యేషాం నాభావః, కింతు దండాభావస్యైవ కేవలస్యేతి యుక్తం. యథా హి కేవలదండసద్భావే, ఉభయసద్భావే, ద్వయాభావే వా కేవలపురుషాభావః సర్వత్రావిశిష్టస్తథా కేవలోత్తంభకసద్భావే, ప్రతిబంధకోత్తంభకసద్భావే, ద్వయాభావే వా కేవలప్రతిబంధకాభావోఽవిశిష్ట ఇత్యవధార్యతామ్.

తా. విశేషణాభావరూపభావమువలె విశిష్టాభావ ముండుటం జేసి యభావమును కారణ మగును. దండముతోఁ గూడినపురుషుఁ డున్న స్థలమందు దండాభావముయొక్క యభావమే యుండును. దండము లేనిపురుషుల యభావ ముండదని

చెప్పుటకు నెట్లు వలనుపడదో యట్లే ప్రతిబంధకోత్తంభకము లుండునపు డుత్తంభకాభావముయొక్క యభావ ముండును గాని, యుత్తంభకాభావవిశిష్టప్రతిబంధకముయొక్క యభావ ముండదని చెప్పుటకు వలనుపడదు. కేవల దండమున్నపుడు గాని, దండము పురుషుఁడును నుండునపుడు గాని, లేక రెం డును లేనపుడుగాని, దండాభావవిశిష్టపురుషుని యభావ మెట్లుండునో యటులనే కేవల ముత్తంభ ముండునపుడుగాని, ప్రతిబంధకోత్తంభకోభయ ముండునపుడుగాని, రెండును లేన పుడుగాని యుత్తంభకాభావవిశిష్టమయిన ప్రతిబంధకము యొక్క యభావ ముండును.

మూ. అథైవంభూతసామగ్రీత్రయమేవ కిం నేష్యతే?

తా. వెనుకఁజెప్పిన సామగ్రీత్రయమే కార్యజననసమ ర్థము. అభావము కారణము గాదని యాశంకింపరాదు.

మూ. కార్యస్య తద్వ్యభిచారాత్, జాతిభేదకల్పనా యాం చ ప్రమాణాభావాత్, యథోక్తే నైవోపపత్తేః. భావే వా కామమసావస్తు, కా నో హానిః? ప్రాక్ ప్రధ్వంసవికల్పోఽపి నానియ తహేతుకత్వాఽపాదకః. యస్మిన్ సతి కార్యం న జాయతే తస్మిన్నసత్యేవ జాయత ఇత్యత్ర సంసర్గాభావమాత్రస్యైవ ప్రయోజకత్వాత్.

తా. వెనుకఁజెప్పిన త్రయము కలసి యేస్థలమునను నుండకపోవుటవలనను, నప్రామాణికమయిన జాతిభేదమును గల్పించుటలో ప్రమాణము లేసందునను, నభావమునకే కార ణత్వముఁ జెప్పవలయును. ప్రతిబంధక సంసర్గాభావమునకుఁ

గారణత్వముఁ జెప్పినందువలనఁ బూర్వమందుఁ జెప్పఁబడిన ప్రాగభావాదిభేదముచేఁ గలిగెడు వ్యభిచారమునకుఁ బ్రసక్తి లేదు.

మూ. యస్తు సంసర్గాభావ, తాదాత్మ్యనిషేధయో ర్విశేషమనాకలయన్నితరేతరాభావేన ప్రత్య వతిష్ఠతే. సః ప్రతిబోధనీయః.

తా. అన్యోన్యాభావవ్యావృత్తమైన సంసర్గాభావత్వము లేనందున ప్రతిబంధక మున్నప్పుడుగూడ దానియొక్క యన్యోన్యాభావమువలన గార్యోత్పత్తిని యాశంకించునో అట్టివాఁడు ప్రతిబందిచే బోధించేవాఁ డయ్యేని ఎట్లనిన, అన్వయవ్యతిరేకములచే వ్యాప్తికారణత్వగ్రహములలో మీమాంసకులచేగూడ సంసర్గాభావము కారణముగా యంగీకరించఁబడినది లేనిచో వ్యాపకసామగ్రి యున్నపుడు దాని యన్యోన్యాభావమువలన వ్యాప్యకార్యాభావాపత్తి వచ్చును.

మూ. తథాప్యభావేషు జాతేరభావాత్కథం త్రయా ణాముపగ్రహస్స్యాత్? అనుపగృహీతానాం చ కథం కారణత్వావధారణమితి చేత్.

తా. ప్రాగభావాదిత్రయమునందు ననుగతమగు నొక జాతి లేనందున వీనికిఁ గారణత్వ మెట్లని యాశంకింపరాదు.

మూ. మా భూజ్జాతిః, నహి తదుపగృహీతానామేవ వ్యవహారాంగత్వం, సర్వత్రోపాధిమద్వ్యవహార విలోపప్రసంగాత్.

తా జాత్యాశ్రయమునకుఁ జాతినిఁబట్టి యేవ్యవహా రాంగత్వము. జాతిలేనివానికి జాతికంటె విలక్షణమయిన

యుపాధిరూపధర్మమునుబట్టియే వ్యవహారాంగత్వము. అభావము జాత్యాశ్రయము కాకపోవుటవలన, సంసర్గాభావత్వ రూపమగు నుపాధినిఁబట్టియే వ్యవహారాంగత్వము అటుల కానిచో జాతిశూన్యములకు వ్యవహారాంగత్వ లోపము వాటిల్లును.

మూ. ఏతేన "ప్రతిబంధకే సత్యపి తజ్జాతీయాన్యస్యాభావసంభవాత్కార్యోత్పాదప్రసంగః, అనుత్పాదే తతోఽప్యధికం కించిదపేక్షణీయమస్తీ"తి నిరస్తమ్.

తా. ప్రతిబంధమైన యొకవస్తువుయున్నప్పుడు కార్యముఁ బుట్టుటలేదు. ప్రతిబంధకజాతీయమైన మఱియొకవస్తువు లేనందునఁ బ్రతిబంధకాభావరూపకారణ మున్నది గాన కార్యోత్పత్తి యగుటఁ గాఁగూడదూ? కార్యముఁ బుట్టనిచో నీయనుత్పత్తిలోఁ బ్రయోజకముగా మఱియొకదాని నపేక్షింపవలెననుశంక కవకాశము ప్రతిబంధకసంసర్గాభావము లేదు గాన లేదు.

మూ. యథా హి "తజ్జాతీయే సతి కార్యం జాయతే, అర్థాదసతి చ న జాయత."ఇతి స్థితే,తద్భావేఽపి తజ్జాతీయాన్తరాభావాన్న భవితవ్యం కార్యేణేతి న, తథైతదపి, అనుకూలవత్ప్రతికూలేఽపి సతి తజ్జాతీయాన్తరాభావానామకించిత్కరత్వాత్. ఇతి.

తా. దండమున్నప్పుడు ఘటరూపకార్యముఁ బుట్టుచున్నదనిన దండజాతీయము లేనప్పుడు ఘటాదికార్యముఁ బుట్ట

దనియుండఁగా దండమున్నపుడు దండజాతీయమైన మఱియొక దండము లేదుగాన ఘటముఁ బుట్టకపోవుననుట యెటుల వీలు లేదో అటులనే ప్రతిబంధక మున్నపుడు ప్రతిబంధకజాతీయమైన మఱియొకదానియొక్క యభావమున్నను, యది యకించిత్కరము.ఒకమణియున్నచో మణ్యంతరాభావమువలన దాహరూపకార్యముఁ బుట్టదు. మణిర్నాస్తి యనుప్రతీతి ఒకమణి యున్నను గలుగదు. గాన ఇట్టిప్రతీతి సిద్ధమయిన యభావమే కారణము. ఒకమణియున్నపుడు మణిసామాన్యాభావము లేదు గాన ఒకమణి యున్నపుడు కార్యప్రసంగ మిచ్చుట సరిగాదు.

మూ. యస్త్వకించిత్కరస్యేతి, తదప్యసత్, సామగ్రీ వైకల్యం ప్రతిబన్ధపదార్థో ముఖ్యః. స చాత్ర మణ్యాదిరేవ, న త్వసౌ ప్రతిబన్ధకః. తతః కిం? తస్యాకించిత్కరత్వేన. తత్ప్రయోక్తారస్తు ప్రతిబన్ధారః, తేచ కించిత్కరావేవేతి కిమసమంజసమ్?

తా. దాహానుకూలమగు నతీంద్రియశక్తివిశేషమును, వహ్న్యాదికమునం దంగీకరించనపుడు మణ్యాదిక మసమర్థమైనందునః బ్రతిబంధకత్వము సంభవింపనందున పూర్వాశంకకు నవకాశము లేదు.మంత్రాదికము ప్రతిబంధముగాని ప్రతిబంధకము గాదు. ప్రతిబంధ మనఁగా సామగ్రిలోఁ జేరినకారణము యొక్క యభావము. (మంత్రాదిరూపము) దానిని ప్రయోగించువాఁడు ప్రతిబంధకము. వాఁడు కించిత్కరుఁడు గాన ప్రతిబంధకశబ్దము వానియందు ముఖ్యము.

మూ. యే తు వ్యుత్పాదయన్తి, "కార్యానుత్పాదఏవ ప్రతిబంధ" ఇతి. తైః ప్రతిబన్ధమకుర్వన్త ఏవ

ప్రతిబన్ధకా ఇత్యుక్తం భవతి.తథాహి— కార్య
స్యానుత్పాదః, ప్రాగభావోవా స్యాత్?, తస్య
కాలాంతరప్రాప్తిర్వా? న పూర్వః. తస్యాను
త్పాద్యత్వాత్. న ద్వితీయః, కాలస్య స్వరూప
తోఽభేదాత్.తదుపాధేస్తు మన్త్రమంతరేణాపి
స్వకారణాధీనత్వాత్.

తా. కార్యముయొక్క యనుత్పాదమే ప్రతిబంధపదార్థ మనియే వారు సెప్పెదరో, యాపక్షమున, ప్రతిబంధమును జేయనివానికిని ప్రతిబంధపదార్థత్వము వచ్చును.

ఎట్లనినః— కార్యప్రతిబంధపదమునకుఁ గార్య ప్రాగ భావ మర్థమయినచో నయ్యది యనాది యగుటవలనఁ దదు త్పాదకము లేమింజేసి ప్రతిబంధకము నిరర్థకము కానయ్యెడిని. కాలాంతరసంబంధ రూపమగుచోఁ గాల మేకమైనందున ననంతరపదార్థానుత్పత్తి వచ్చును. కాలమనఁగాఁ గాలోపాధి యని చెప్పి, తద్భిన్న కాలసంబంధము ప్రతిబంధపదార్థ మైనచో నట్టిసంబంధము మంత్రము లేకపోయినను, స్వకారణాధీన మగుటవలన మంత్రాదులకుఁ బ్రతిబంధపదార్థత్వమే లేకపో నయ్యెడును.

మూ. ప్రాగభావావచ్ఛేదకకాలోపాధిస్తదపేక్ష ఇతి
చేన్న. మంత్రాత్పూర్వమపి తస్య భావాత్.

తా. కార్యప్రాగభావ సమకాలికమైన కాలోపాధి మంత్రప్రయోజ్యము గాన, మంత్రమునకుఁ బ్రతిబంధకత్వము సంభవింపవచ్చునని యాశంకింపరాదు. మంత్రముకంటెఁ బూర్వ మందునుఁ బ్రాగభావసమాన కాలీనమగు కాలోపాధి, మంత్ర

ప్రయోజ్యము గానందున నద్దానికి మంత్రప్రయోజ్యత్వము లేమింజేసి, కార్యానుత్పాదమే ప్రతిబంధపదార్థము. దానినిఁ జేయు మంత్రాదికము ప్రతిబంధక మనేపక్షంబసంభావితంబు.

మూ. తస్మాత్సామగ్రీతత్కార్యయోః పౌర్వాపర్యనియ
మాత్తదభావయోరపి పూర్వాపరభావ ఉప
చర్యతే.

తా. కావునఁ గార్యమునకుఁ దత్ప్రయోజకసామగ్రికిని బౌర్వాపర్యనియమమువలన, సామగ్ర్యభావకార్యాభావములకును బౌర్వాపర్యము సిద్ధించును. ప్రతిబంధపదార్థము సామగ్రీవైకల్యము. దానినిఁ జేయునది ప్రతిబంధకము. సామగ్రీవైకల్య మెచటనుండునో యచటఁ గార్యము పుట్టదని సిద్ధాంతము.

మూ. వస్తుతస్తు తుల్యకాలత్వమేవేతి నాయం పంథాః.

తా. సామగ్ర్యభావమే ప్రతిబంధపదార్థము. దానినిఁ జేయునదియే ప్రతిబంధకము. వీట్లకు రెంటికిని తుల్యకాలత్వ ముండును. ఈపక్షమే యుచితమైనది గాన, వహ్నియందు దాహానుకూలశక్తిని స్వీకరించినపక్షము సరిగాదు.

మూ. న చేదేవం శక్తిస్వీకారేఽపి కః ప్రతీకారః ?
తథా హి. ప్రతిబన్ధకేన శక్తిర్వా వినాశ్యతే,
తద్ధర్మో వా, ధర్మాన్తరం వా జన్యతే, న జన్యతే
వా కిమపీతి పక్షాః.

తా. వెనుకఁజెప్పిన రీతిగాఁ గాక వహ్నియందు దాహానుకూలశక్తిని స్వీకరించి తన్నాశకమంత్రాదికమే ప్రతిబంధకమని చెప్పినచో నిట్టిదోషములు సంభవించును. మంత్రాదిరూప ప్రతి

బంధకమువలనఁ గార్యానుకూలమైన శక్తి నశించునా? శక్తి యందుండు గార్యానుకూలత్వరూపధర్మము నశించునా? కార్యోత్పత్తి ప్రతిబంధకమగు ధర్మాంతరము పుట్టునా? లేక యేదియును బుట్టదా? యని నాలుగుపక్షములు.

మూ. తస్యాకించిత్కరస్య ప్రతిబన్ధకత్వానుపపత్తేః, విపరీతధర్మాన్తరజననే, తదభావే సత్యేవ కార్యమిత్యభావస్య కారణత్వస్వీకారః, ప్రాగభావాది వికల్పావకాశశ్చ. తద్వినాశే తద్ధర్మవినాశే వా. పునరుత్తంభకేన తజ్జననేఽనియతహేతుకత్వం,పూర్వంస్వరూపోత్పాదకాదిదానీముత్తంభకాదుత్పత్తేః.

తా. అందు నకించిత్కర మగుటవలనఁ జతుర్థపక్షమున మంత్రాదులకుఁ బ్రతిబంధకత్వము సంభవించదు. తృతీయపక్షమున మంత్రాదికమువలన విపరీతధర్మము పుట్టినచో మంత్రాదికము లేనియపుడు గార్యము పుట్టును గాన నభావమునకుఁ గారణత్వము సిద్ధించును. ప్రథమద్వితీయపక్షములయందు మంత్రాదులవలన శక్తియు, దద్గత కార్యానుకూలత్వమును, నశించినచో, నుత్తంభక సమవధానమున వహ్నియందు దాహానుకూలమగుశక్తి పుట్టినయెడల నుత్తంభకము లేనపుడు వహ్న్యుత్పాదకసామగ్రివలననే శక్తియొక్క యుత్పత్తి కలుగును. అయ్యది మణివలన నశించినపిమ్మట నుత్తంభకమువలనఁ దిరుగనట్టిశక్తి పుట్టినయెడల శక్తియనియతహేతుకముగా నగును.

మూ. న చ సమానశక్తికతయా తుల్యజాతీయత్వాన్నైవ

మితి సాంప్రతమ్.విజాతీయేషు సమానశక్తినిషే
ధాత్.

తా. విజాతీయములందు సమానశక్తి నిషిద్ధమగుట వలన నేకజాతీయశక్తి కలదగుటచేతను శక్తింగూర్చి కారణత్వముం జెప్పుటకు వలనుపడదు.

మూ. న చ ప్రతిబంధకశక్తిమేవోత్తంభకో విరుణద్ధి,
న తు భావశక్తిముత్పాదయతీతి సాంప్రతమ్, తద
నుత్పాదప్రసంగాత్, కాలవిశేషాత్తదుత్పాదే
తదేవాఽనియతహేతుకత్వమితి.

తా. ఉత్తంభకము ప్రతిబంధకశక్తినే నశింపఁజేయునుగాని భావశక్తిని పుట్టింపదని యాశంకింపరాదు. అటులైనచోఁ బ్రతిబంధకమువలనఁ గార్యానుకూలశక్తి నాశము, నుత్తంభకమువలనఁ బ్రతిబంధకశక్తినాశము నయినచోఁ దిరుగ వహ్నియందు శక్తియే లేకపోవలసి వచ్చును. కాలవిశేషము వలననే కార్యానుకూలశక్తి పుట్టుననిన, ననియతహేతుకత్వము సిద్ధము. కాన సామగ్రీవైకల్యరూప మంత్రాదికమే ప్రతిబంధపదార్థము. దానినిఁ జేయునదే ప్రతిబంధకమని చెప్పుట యుచితము.

మూ. స్యాదేతత్. మాభూత్సహజశక్తి, రాధేయ
శక్తిస్తు స్యాత్. దృశ్యతే హి ప్రోక్షణాదినా
వ్రీహ్యాదేరభిసంస్కారః కథమన్యథా కాలాం
తరే తాదృశానామేవ కార్యవిశేషోపయోగః?

తా. ప్రోక్షితంబులగు వ్రీహులకే కాలాంతరమున "వ్రీహీనవహన్తి" యనెడు శ్రుతివలన నవఘాతమునందు వినియో

గము గానవచ్చుచున్నది. అవఘాతపర్యంతము వ్రీహుల యందు ప్రోక్షణ ముండనందునఁ బ్రోక్షణజన్యమగు స్థిరమగు సంస్కారము నా వ్రీహులం దొప్పవలెను. అదియే యాధేయ శక్తి.

మూ. కథమన్యథా కాలాంతరే కార్యవిశేషోపయోగః?
న చ మంత్రాదీనేవ సహకారిణః ప్రాప్య. తేకార్య
కారిణ ఇతి సాంప్రతమ్. తేషు చిరధ్వస్తేష్వపి
కార్యోత్పాదాత్.

తా. ప్రోక్షణవలనఁ గలిగెడు సంస్కారవిశేషము నంగీకరింపకయే మంత్రాదులను సహకారిగాఁ జేసికొని ప్రోక్షితములగు వ్రీహు లవఘాతాదికార్యములలో నుపయోగించు నని యాశంకింపరాదు. మంత్రములు శబ్దరూపము లగుట వలన మూఁడవక్షణమునందే నశించును గాన వానికి సహకారిత్వము నంగీకరించుటకు వలనుపడదు.

మూ. నాపి ప్రధ్వంససహాయాస్తే తథా ఏవం హి
యాగాదిప్రధ్వంసా ఏవ స్వర్గాదీనుత్పాద
యన్తు, కృతమపూర్వకల్పనయా.

తా. మంత్రనాశమే సహకారి యనినచో యాగాదినాశమే స్వర్గాదులను బుట్టించుచుండ యాగాదులవలనఁ గలిగెడు నపూర్వకల్పనకే యవకాశము లేకపోవలసి వచ్చును.

మూ. తేషామనన్తత్వాదనన్తఫలప్రవాహః ప్రసజ్యేత
ఇతి చేత్, అపూర్వేఽపి కల్పితే తావానేవ
ఫలప్రవాహ ఇతి కుతః?

తా. యాగాదినాశము నిత్యంబగుటవలన నెల్లపుడు

స్వర్గాదికము గలుగవలసివచ్చునని యాశంకించినచో నపూర్వ మును గల్పించిన పక్షమునఁగూడ నీయాశంక వచ్చును.

మూ. అపూర్వస్వాభావ్యాదితి చేత్, తుల్యమిదమిహా
పి. తాపతాపి తత్ప్రధ్వంసో న వినశ్యతీతి విశేషః.

తా. అపూర్వ స్వభావమువలనఁ గొంతవఱకే ఫల ప్రవాహ మనినచోఁ బ్రధ్వంసస్వభావమువలన నట్లేల కాగూ డదా యని యాశంకింపరాదు. అపూర్వము ఫలమునుబుట్టించి తాను నశించును గాన యనంతఫలప్రవాహప్రసక్తి లేదు. ప్రధ్వంస నిత్యమగుటవలన ననంతఫలప్రవాహప్రసక్తి దుర్ని వారము. కావున మంత్రములుగాని తద్ధ్వంసలుగాని సహ కారులు గానేరవు.

మూ. ఉపలక్షణం ప్రోక్షణాదయః. న తు విశేషణం
తథా చావిద్యమానైరపి తైరుపలక్షితా వ్రీ
హ్యాదయ స్తత్రోపయోక్ష్యన్తే. యథా గురు
ణా టీకా కురుణా క్షేత్రమితి చేత్ తదసత్.

తా. ప్రోక్షణవలన వ్రీహ్యాదులందుఁ గలిగెడు నదృష్ట విశేషము నంగీకరింపకపోయినను, మంత్రాదులచేఁ జేయఁ బడినప్రోక్షణము ఫలపర్యంతము లేకున్నను, ప్రస్తుతకాలము లేని కురువులు, గురుక్షేత్రమను వ్యవహారమునుగూర్చి కారకు లయినటు లాప్రోక్షణమే కాలాంతరభావి ఫలమునుగూర్చి కారణము గావచ్చునని యాశంకింపరాదు.

మూ. న హి స్వరూపవ్యాపారయోరభావేప్యుప
లక్షణస్య కారణత్వం కశ్చిదిచ్ఛతి. అతిప్రసం
గాత్.

తా. ఎద్దానిని గారణమునుగాఁ జెప్పెదమో యది గాని, దానివలనఁ గలిగెడు వ్యాపారముగాని ఫలపర్యంత స్థాయి గానపుడు దానికిఁ గారణత్వము సంభవింపదు. ప్రోక్షణాదికమువలనఁ గలిగెడు నదృష్టవిశేషము ప్రోక్షణాదికము లేకున్నను, ఫలపర్యంత ముండుటవలన దానిని ద్వారముగాఁ జేసికొని ప్రోక్షణమునకు నవహానాదిఫలకారణత్వము వచ్చును.

మూ. వ్యవహారమాత్రం తు తజ్జ్ఞానసాధ్యం, న తు తత్సాధ్యమ్. తత్ జ్ఞానమపి స్వకారణాధీనం, న తు తేన నిరన్వయధ్వస్తేన జన్యతే, అస్తు వా తత్రాప్యతిశయకల్పనా కిం నశ్ఛిన్నమ్.

తా. వెనుకటిరీతినే యయినయెడల గురుక్షేత్రమను వ్యవహారవిలోపము వచ్చునని యాశంకింపరాదు. అయ్యది కౌరవాధీనము గాదు. తజ్జ్ఞానాధీనము. ఆజ్ఞానము స్వకారణాధీనము. వ్యాపారమునుబుట్టించని ధ్వస్తమైనదానివలనఁ గాదు. కావున నట్టివ్యవహారమునకు విలోపము లేదు. ఉపలక్షణాభిమతమం దతిశయకల్పనఁ జేసినను మా కభిమతమే.

మూ. యద్వా యాగాదేరప్యుపలక్షణత్వమస్తు, తదుపలక్షితః కాలో యజ్వా వా, స్వర్గాదీన్ సాధయిష్యతి కృతమపూర్వేణ.

తా. ప్రోక్షణాదిక ముపలక్షణం బైనయెడల నపూర్వకల్పన లేకయే యాగాదికము గూడ నుపలక్షణము. తదుపలక్షితమగు కాలముగాని, యజ్వగాని, స్వర్గాదికమును సాధించును. కాన యపూర్వం బేల ?

మూ. న చ దేవదత్తస్య స్వగుణాకృష్టాశ్శరీరాదయో భోగాయ తద్భోగసాధనత్వాత్, స్రగాదివదిత్యన్వయబలాదపూర్వసిద్ధిర్గ్నావిశేష ఇతి సాంప్రతమ్. ఇచ్ఛాప్రయత్నజ్ఞానైర్యథాయోగం సిద్ధసాధనాత్.

తా. స్రగాదులవలె దేవదత్తునకు భోగసాధన మగు శరీరములు,భోగసాధక మగుటవలన స్వగుణాకృష్టములు అను యనుమానముచే గుణము సిద్ధించును. ఆగుణమే అపూర్వమని యాశంకింపరాదు. ఇచ్ఛయు, ప్రయత్నమును, జ్ఞానమున్నూ గూడ గుణములగుటవలన వీనినింబట్టి సిద్ధసాధనమనేదోషము సంభవించును.

మూ. న చ తద్రహితానామపి భోగ ఇతి యుక్తిమత్. యేన తతోఽప్యధికం సిధ్యేత్.

తా. జ్ఞానేచ్ఛాప్రయత్నములు లేనివారికి భోగమే లేదు. కాన భోగములో నీమూఁడును గూడ నపేక్షితము గాన సిద్ధసాధము వచ్చును.

మూ. నాపి స్వగుణోత్పాదితా ఇతి సాధ్యార్థః. మనసా నైకాన్తికత్వాత్.

తా. స్వగుణోత్పాదితత్వమే సాధ్యార్థమైనచో సాధ్యవికలమైన నిత్యమయిన మనస్సునందుఁ దద్భోగసాధనత్వరూప హేతు వుండుటవలన వ్యభిచారము వచ్చును.

మూ. నాపి కార్యత్వే సతీతి విశేషణీయో హేతుః తథాప్యుపలక్షణైరేవ సిద్ధసాధనాత్.

తా. హేతుకోటిలోఁ గార్యత్వనివేశముఁ జేసి వ్యభిచారమును వారించిన, నుపలక్షణమునుఁబట్టి యిష్టహాని ప్రసక్తమగును.

మూ. అసతాం తేషాం కథముత్పాదత్వమితిచే త్తదేత దభిమంత్రణాదిష్వపి తుల్యమ్.

తా. కార్యపర్యంత ముండని యుపలక్షణమునకుఁ గార్యోత్పాదకత్వం బెట్లనినఁ నీయాశంక ప్రోక్షణాదికమందుఁ గూడ సమానమే.

మూ. తస్మాద్భావభూతమతిశయం జనయన్త ఏవ ప్రోక్షణాదయః కాలాంతరభావినేఫలాయకల్పన్తే. ప్రమాణత స్తదర్థ ముపాదీయ మానత్వాత్. యాగకృషిచికిత్సావదితి, అన్యథా కృష్యాద యో దుర్ఘటాః ప్రసజ్యేరన్ బీజాదీనామా పరిమాణ్వన్తభంగాత్ తేషు చావాంతరజాతే రభావాన్నియతజాతీయకార్యారంభానుపపత్తేః.

తా. కావున యాగకృషి చికిత్సాదులవలె ప్రోక్షణాదికము భావభూతాతిశయమును బుట్టించి కాలాంతరభావి యగుఫలములో సమర్థమని కల్పించుటయే యుక్తము. కృష్యాదికములో నతిశయకల్పనఁ జేయనియెడలఁ బరమాణుపర్యంతము బీజాదికము నశించినందున సజాతీయం బగుకార్యమునకు నారంభము లేకపోవలసి వచ్చును.

మూ. అతోఽచ్యతే.

**శ్లో. సంస్కారః పుంస ఏవేష్టః ప్రోక్షణాభ్యుక్షణాదిభిః,**
**స్వగుణాః పరమాణూనాం విశేషాః పాకజాదయః. ౧౧**

అర్థ. ప్రోక్షణాదులవలనఁ గలుగు సంస్కారము పురుషునియందే యంగీకరించవలెను. పరమాణుపర్యంతము నశించినను, పరమాణువులయందు సజాతీయ ద్రవ్యారంభాను గుణమైనశక్తిని స్వీకరించవలసిన యవసరము లేదు. ఆపర మాణువులే పాకవిశేషమువలనఁ గలుగుగుణములతోఁ గూడు కొని సజాతీయద్రవ్యారంభకము గాన శక్తివిశేషము నంగీక రించ నవసరము లేదని యర్థము.

మూ. యథా హి దేవతావిశేషోద్దేశేన హుతాశనే
హవిరాహుతయస్సమంత్రాః ప్రయుక్తాః పురుష
మభిసంస్కుర్వతే, న వహ్నిం, నాపి దేవతాః,
తథా వ్రీహ్యుద్దేశేన ప్రయుజ్యమానః ప్రోక్ష
ణాదిః పురుషమేవ సంస్కురుతే, న తమ్. యథా
చ శారీరీజనితసంస్కారాధారపురుషసంయోగా
జ్జలముచాం సంచరరణ. జలక్షరణరూపా
క్రియా, తథా వ్రీహ్యాదీనాం తత్తదుత్తర
క్రియావిశేషాః.

తా. దేవతావిశేషము నుద్దేశించి యగ్నియందు మంత్ర పూర్వకముగా హవిస్సును హోమము చేయుటవలన వహ్ని యందుఁగాని, దేవతయందుఁగాని యతిశయము పుట్టక పురు షునియందె ట్లదృష్టవిశేషము కలుగునో యటులనే తండుల ముల నుద్దేశించి మంత్రపూర్వకముగాఁ జేసిన ప్రోక్షణవలనఁ బురుషునియందే సంస్కారము గలుగును. ఆప్రోక్షితము లగు వ్రీహులే పురుష సంస్కారసహితములై యవహననాదిరూప మగు ననంతర క్రియలలో నుపయోగించును.

5

కారీరీ యాగమువలనఁ గలిగిన యదృష్టముతోఁగూడిన పురుషునియొక్క సంయోగమువలన మేఘములకు సంచరణ జలక్షరణాదిరూపమగు నుత్తరక్రియలు గల్గునట్లు (పురుషుఁడు పాపిగ్గైనయెడల ప్రోక్షణమువలన వానియందు సంస్కారము పుట్టనందున) నిర్దుష్టములగు వ్రీహ్యాదులందే సంస్కారము పుట్టి యాసంస్కారమే కాలాంతరభావి ఫలోత్పాదకంబని యాశంకింపరాదు.

మూ. యథా చైకత్ర కర్తృకర్మసాధనవైగుణ్యా
త్ఫలాభావస్తథా పరత్రాపి, ఆగమికత్వస్యో
భయత్రాపి తుల్యత్వాత్.

తా. కర్మవైగుణ్యము, సాధనవైగుణ్యము నున్నపుడెట్లుత్తరకాలఫలము గలుగదో యటులనే కర్తృవైగుణ్యమున్నపుడు గర్తయందువలె వ్రీహ్యాదులందుఁ గూడ నదృష్టవిశేషము గలుగదు. కాన ఫలము సంభవింపదు. సాధనవైగుణ్యము గర్మవైగుణ్యమునున్నపుడు ఫలము పుట్టకపోవుటలో నాగమమున్నటుల గర్తృవైగుణ్య విషయములోఁ గూడఁ గలదు. కనుక సంస్కారము బురుషునియందే కల్గును.

మూ. న తర్హి బర్హిష ఇవ వ్రీహ్యాదేః పునరుపయో
గాంతరం స్యాత్. ఉపయోగే వా తజ్జాతీ
యాంతరమప్యుపాదీయేత అవిశేషాత్. న.

తా. శ్రు."బర్హిస్తృణాతి" "బర్హిషి హవిరాసాదయతి" యను శ్రుతులవలన బర్హిస్సునకుఁ గార్యాంతరమునం దుపయోగ మున్నట్లు, ప్రోక్షితములగు వ్రీహులయం దతిశయ విశేషమే లేనిచో నావ్రీహులకుఁ గార్యాంతరమునం దుప

యోగము లేకపోవలసి వచ్చును. "వ్రీహిభిర్యజేత" యను శ్రుతివలన వ్రీహులకు యాగసాధనత్వముఁ జెప్పఁబడుచున్నం దున నతిశయవిశేషము నంగీకరింపక పోయినను గార్యాంతర మునం దుపయోగమును జెప్పినచో, నతిశయవిశేషము లేక పోవుట, ప్రోక్షితములు, నప్రోక్షితములు నగు వ్రీహుల రెంటి యందున సమానంబగుటచే అప్రోక్షితంబు లగు వ్రీహులకుఁ గూడఁ గార్యాంతరమునం దుపయోగము రావలసి వచ్చును. కావున ప్రోక్షణాదులవలనఁ గలిగెడు సంస్కారము వ్రీహి నిష్ఠమే యని యాశంకింపనలదు.

మూ. విచిత్రాహ్యభిసంస్కారాః కేచిద్వ్యాప్రియమా
ణోద్దేశ్య సహకారిణ ఏవ కార్యే ఉపయుజ్యన్తే,
కిమత్ర క్రియతాం? విధేర్దుర్లంఘ్యత్వాత్.

తా. దేనియందున్న వ్యాపారమువలనఁ బురుషుని యందు సంస్కారముఁ గలుగునో యట్టివ్యాపారముతోఁ గూడినట్టి వ్రీహ్యాదికముతోఁ గూడిన సంస్కారమే కాలాంత భావి యగుకార్యములో సహకారి యగును. వ్యాపార శూన్యం బగు వ్రీహ్యాదికము సహకారము గానందున, ప్రోక్షి తముగాని వ్రీహ్యాదికమునకు గాలాంతరభావి యగుకార్య ములో నుపయోగము చెప్పుటకు నవకాశము లేదు.

మూ. యథా చాభిచారసంస్కారో యందేహముద్దిశ్య
ప్రయుక్తస్తదపేక్ష ఏవ, తత్సంబన్ధస్యైవ దుఃఖ
ముపజనయతి నాన్యస్య, న వా తదనపేక్షః, ఏవ
మభిమంత్రణాది సంస్కారా అపి భవన్తో న
మనాగపి నోపయుజ్యన్తే.

తా. ఏ యాత్మకు భోగాయతన మగుశరీరము నుద్దేశించి యభిచారసంస్కారముఁ జేయఁబడునో యాయాత్మయందే దుఃఖము పుట్టుటవలన నద్దానియందే యా యభిచారసంస్కారమువలనఁ గలిగెడు నతిశయవిశేషం బుండునని యంగీకరింపవలెను. ఇతరులయందు దుఃఖము పుట్టకపోవుటవలన నచట నా యతిశయవిశేషం బంగీకరింప వలనుపడదు. అటులనే ప్రోక్షణాదిసంస్కారములు గూడ ఘాతాదులలో ఉపయోగించి పురుషునియందు సంస్కారవిశేషమును బుట్టించును.

మూ.. కథం తర్హి వ్రీహ్యాదీనాం సంస్కార్యకతేతి
చేత్, ప్రోక్షణాదిఫలసంబన్ధాదేవ.

తా. వ్రీహ్యాదులందుఁ బ్రోక్షణాదికమువలనఁ గలిగెడు సంస్కారము నంగీకరింపనిచో "వ్రీహీన్ప్రోక్షతి" యను స్థలమునందుఁ గ్రియాజన్యఫలశాలిత్వరూపకర్మత్వము వ్రీహులకు లేకపోవలసి వచ్చుననినచో వ్రీహులం దతిశయవిశేషము నంగీకరింపక పోయినను వ్యాపారమువలనఁ గలిగెడు జలసంయోగమను ఫలమునకు నాశ్రయమగుటంజేసి వ్రీహులకుఁ గర్మత్వం బవ్యాహతంబు.

మూ. నను యదుద్దేశేన యత్క్రియతే తత్తత్ర కించి
త్కరం, యథా పుత్రేష్టిపితృయజ్ఞౌ,తథా చాభి
మంత్రణాదయో వ్రీహ్యాద్యుద్దేశేన ప్రవృత్తా
ఇత్యనుమానమితి చేత్, తన్న. హవిస్త్యాగాది
భిరనైకాంతాత్ న హి తే కాలాంతభావిఫలా
నుగుణం కిచిద్ధుతాశనాదౌ జనయన్తి. కిం వా
న దృష్టమింద్రియ, లింగ, శబ్ద, వ్యాపారాః

ప్రమేయోద్దేశేన ప్రవృత్తాః ప్రమాతర్యేవ కించిజ్జనయన్తి. న ప్రమేయే ఇతి.

తా. పుత్త్రు నుద్దేశించి చేయఁబడిన పుత్త్రేష్టి, పుత్త్రగతములగు వర్చస్తేజసాదులఁ గూర్చియు, పితృదేవతల నుద్దేశించి చేయఁబడిన శ్రాద్ధాదికము పితృగతతృప్తినిఁ గూర్చియుఁ గారణము లగునట్లు వ్రీహ్యాదుల నుద్దేశించి చేయఁబడిన ప్రోక్షణాదికము వ్రీహ్యాదిగతమగు నదృష్టమునుగూర్చియే కారణం బగునని యాశంకింపవలదు.

అగ్ని నుద్దేశించి చేయఁబడిన హవిశ్యాగాదికమువలన నగ్నియం దెవ్విధం బగువిశేషము గలుగదు, దేనినుద్దేశించి,యేకర్మ చేయఁబడుచున్నదో యాకర్మ దానియం దుండెడికార్యమునే పుట్టించుననునియమము నంగీకరించుటకు వలనుపడదు. మఱియు నింద్రియము, లింగము, శబ్దము మున్నగుప్రమాణములు ప్రమేయము నుద్దేశించి ప్రవర్తించినను బ్రమాతయందే ఫలమును బుట్టించుచున్నవి. కాని ప్రమేయమునందు పుట్టించుట లేదు గాన ప్రోక్షణాదికమువలనఁ గలిగెడు సంస్కారము పురుషనిష్ఠమే యని యంగీకరింపవలెను.

మూ. కృషిచికిత్సే అప్యేవమేవ స్యాతామితి చేన్న. దృష్టేనైవ పాకజరూపాదిభేదేనోపపత్త్యావదృష్టకల్పనాయాం ప్రమాణాభావాత్. తథా చ లాఘవరసనేత్రో వ్యాఖ్యాతః.

తా. అట్లయినచోఁ గృషిచికిత్సాదులవలనఁ గలిగెడు కర్తృగతాపూర్వమే కాలాంతభావికార్యసమర్థం బగునని యాశంకింపరాదు. దృష్టమగు పాకజరూపాదిభేదమువలన

నియతమగు కార్యముయొక్కయుత్పత్తి గలుగుచుండఁగా నదృష్టమును గల్పించుటలోఁ బ్రమాణము లేమింజేసి యదృష్ట కల్పన మక్కర లేదు. లాక్షారససిక్తం బగుబీజముచేఁ గలిగెడు వృక్షముయొక్క పుష్పముల యారుణ్యరూపకార్యముఁ గూడ పాకజవిశేషమువలననే కలుగును.

మూ. అత ఏవ బీజవిశేషస్యాపరమాణ్వంతభంగేఽపి పరమాణూనామవాంతరజాత్యభావేఽపి ప్రాచీన పాకజవిశేషాదేవ విశిష్టాః పరమాణవస్తం తం కార్యవిశేషమారభన్తే. యథా కలమబీజం యవాదేః, నరబీజం వా నరాదేః గోక్షీరం మహిషాదేః, జాత్యా వ్యావర్తతే తథా తత్పరమాణవోఽపి మూలభూతాః పాకజైరేవ వ్యావర్త్యంతే న హ్యస్తి గోక్షీరం సురభి మధురం సీతం తత్పరమాణవశ్చ విపరీతాః.

తా. కావుననే బీజము భూమియం దుండఁబడినదై పరమాణుపర్యంతము నశించినప్పటికి పూర్వమం దుండెడి పాకజవిశేషసహిత మగుపరమాణువులే ద్వ్యణుకాదిక్రమమున నాయా కార్యవిశేషములఁ బుట్టించుచున్నయవి. శాలియవలు, నరవానరములు, గోక్షీరమహిషక్షీరములు నెట్లు పరస్పరము విభిన్నజాతి గలవో యట్లే వానికి మూలములగు పరమాణువులు విభిన్నములగు పాకజవిశేషములతో గూడుకొని యుండును. కాని గోక్షీరము, సురభి, మధురము, శీతములుగానున్నపు డాయా సౌరభ్యాదికముతోఁ గూడుకొనిన గోక్షీరముల పరమాణువులు విపరీతముగా నుండవు.

మూ. తస్మాత్తథాభూతాః పాకజా ఏవ పరమాణవస్త
థాభూతై రేవాద్వ్యాతి శయోఽంత్యాతిశ
యోఽంకురాదిర్వేతి. కిమత్ర శక్తికల్పనయా ?
కల్పాదావప్యేవమేవ. ఇదానీం బీజాదిసన్నివిష్టా
నామస్మదాదిభిరుపసంధానం, తదానీం తు విభ
క్తానామదృష్టాదేవ కేవలాన్మిథస్సంసర్గ ఇతి విశేషః.

తా. కావునఁ బాకజవిశేషవిశిష్టము లగు పరమాణు
వులవలన ద్వ్యణుకాదికము నంకురాదికముఁ గలుగుచుండఁగా
నాధేయశక్తి నంగీకరింప నక్కఱలేదు. సృష్ట్యాదియందుఁగూడఁ
గార్యోత్పత్తి యిటులనే సంభవించును. ప్రస్తుతము బీజాదిసన్ని
విష్టమగు వానికి సహకారిసంపాదనం బస్మదాదులచేఁ జేయఁ
బడుచున్నది. సృష్ట్యాదియందు విభిన్నములగు పరమాణువు
లకు నదృష్టమువలననే యన్యోన్యము సంయోగము గలిగి
కార్యోత్పత్తి యగుచుండును. ఇదియే విశేషంబు.

మూ. న చ వాచ్యమిదానీమపి తదైవ కిం న స్యాత్.
యతః కృష్యాదికర్మోచ్ఛేదే తత్సాధ్యానాం
భోగానాముచ్ఛేదప్రసంగాత్.

తా. ప్రస్తుతము గూడ నదృష్టవిశేషమువలననే కార్యో
త్పత్తి యగునని యనరాదు. అటులైనచోఁ గృష్యాదికర్మో
చ్ఛేదము గలుగును. తాదృశకర్మోచ్ఛేదము గలిగినపుడు దాని
వలనఁ గలిగెడు భోగములకును చ్ఛేదము గలుగును.

మూ. అవ్యవస్థాభయాచ్చాదృష్టాని కర్మాణి దృష్టకర్మ
వ్యవస్థయైవ భోగసాధనానీత్యుస్నీయతే తస్మా
త్పాకజవిశేషైః సంస్థానవిశేషైశ్చ విశిష్టాః పర

మాణవః కార్యవిశేషమారభన్తే, తే చ, తేజో ఽనిలతోయసంసర్గైర్విశేషైః. తే చ క్రియయా సా చ, నోదనా, భిఘాత, గురుత్వ, వేగ, ద్రవ త్వా,దృష్టవదాత్మసంయోగేభ్యో యథాయథ మితి న కించిదనుపపన్నమ్.

తా. అప్యుపస్థాభయమునుబట్టి దృష్టకృష్యాది సహకృతమయియే యదృష్టము భోగసాధక మగునని యనుమేయించపలెను. ఆ హేతువువలనఁ బాకజవిశేషములతోడను, సంస్థానవిశేషములతోడను గూడుకొనియున్న పరమాణువులు గార్యవిశేషమును బుట్టించును. ఆపాకజవిశేషములు, తేజో, వాయు, జలములయొక్క సంసర్గవిశేషమువలనఁ గల్గును. వానికి సంసర్గము క్రియవలనఁ గలుగును. ఆక్రియయు, నోదనాభిఘాత సంయోగమువలనను, గురుత్వము, వేగము, ద్రవత్వము, నదృష్టవదాత్మసంయోగము మొదలగువానివలనను గలుగును. కావునఁ బాకజవిశేషోత్పత్తినిమిత్తమై యాధేయశక్తి నంగీకరింప నక్కఱలేదు.

మూ. నిమిత్తభేదాశ్చ పాకే భవన్తి. తద్యథా—హారీతమాంసం హారిద్రాజలావసిక్తం హారిద్రాగ్నిప్లుష్ట, ముపయోగాత్సద్యో వ్యాపాదయతి. దశరాత్రోషితం కాంస్యే ఘృతం చాపి విషాయతే తామ్రపాత్రే పర్యుషితం క్షీరమపి తిక్తాయత ఇత్యాది.

తా. నిమిత్తభేదమును సహకారిగాఁ జేసికొని పాకజవిశేషం బాయా యీకార్యవిశేషంబును బుట్టించును.

ఎట్లన:—హారీతపక్షిమాంసమును బసుపునీటియందుఁ గొంతకాల ముంచి పసుపు నిప్పుతోఁగాల్చి యుపయోగించి నచోఁ దత్కాలమే మరణము గలుగును. కంచుపాత్రయందుఁ బదిరాత్రము లుంచిన ఘృతము విషమగు. తామ్రపాత్రయం దొకరాత్రి నుంచిన పాలు చేదగును. ఈరీతిగ నూహించునది.

మూ. యత్ర తర్హి తోయే తేజసి, వాయౌ వా, న పాకజో విశేషస్తత్ర కథముద్భవానుద్భవత్వ కఠినత్వాదయో విశేషాః? కథం వా పార్థివే ప్రతిమాదౌ ప్రతిష్ఠాదినా సంస్కృతేఽపి విశేషా భావాత్పూజనాదినా ధర్మో,వ్యతిరేకే త్వధర్మోఽ ప్రతిష్ఠితే తు న కించిత్?
న చ తత్ర యజమానధర్మేణాన్యస్య సాహాయక మాచరణీయం, అన్యధర్మస్యాన్యం ప్రత్యనుప యోగాత్ ఉపయోగే వా సాధారణ్యప్రసం గాత్.

తా. పృథివియందుండెడి కొన్ని కార్యవిశేషములు పాకజ విశేషమువలన సంభవించినను నాధేయశక్తి నంగీకరింప నిచో జలతేజోవాయువులయందుఁ బాకము లేనందున,ద్రవత్వ కఠినత్వములు, నుద్భూతవిశేషగుణవత్వానుద్భూతవిశేష గుణవత్వమును నెట్లుపపన్నంబు లగును? ఆధేయశక్తినే యంగీకరింపనిచోఁ బ్రతిష్ఠాదులచే సంస్కృతంబులగు పార్థివ ప్రతిమాదులందు శక్తివిశేషము లేనందునఁ బూజాదులవలన ధర్మము, పూజాద్యభావమువలన నధర్మమును, బ్రతిష్ఠితము

గాని ప్రతిమాదులందు ధర్మాధర్మములయొక్క యభావము నె ట్లుపపగున్నంబులను?

అన్యదీయం బగుధర్మం బన్యునిఁగూర్చి సహకారి కానే రదు గావున నచట యజమానునియొక్క ధర్మాధర్మములు పూజాదులవలనఁ గలిగెడు ధర్మాధర్మములయుత్పత్తిలోఁ బ్రయోజకములు గానేఅవు. భోగమువలన యజమానుని ధర్మము నశించినందున సహకారి లేకపోవుటవలనఁ బూజాదికముచే ధర్మముఁ గలుగకపోవలసివచ్చును. కావున నాధేయ శక్తి నంగీకరించవలెనని యాశంకించవలదు.

అత్రోచ్యతే.—

శ్లో. నిమిత్తభేదసంసర్గాదుద్భవానుద్భవాదయః,
దేవతాస్సన్నిధానేన ప్రత్యభిజ్ఞానతోఽపి వా. ౧౨

అర్థ. నిమిత్తభేదసంసర్గాత్ = జలతేజోవాయ్వాదుల యం దుదదృష్టవిశేషమువలన, ఉద్భూతత్వాదికము గలుగును. ప్రతిమాదులు ప్రతిష్ఠావిధిచే ప్రతిష్ఠితమగు రుద్రాదిరూపాభిమానముగల దేవతారూపములై ఆరాధనీయత్వమును బొందును. పూర్వపూర్వీకులచే ప్రతిష్ఠితమనే ప్రత్యభిజ్ఞవలననైననూ యారాధనీయతను బొందును.

మూ. ఉపనాయకాదృష్టవిశేషసహాయా హి పరమా
ణవో ద్రవ్యవిశేషమారభన్తే. తేషాం విశేషా
దుద్భవవిశేషాః ప్రాదుర్భవన్తి. తథా స్వాభావా
ద్రవా అప్యాపో నిమిత్తభేదప్రతిబద్ధద్రవత్వాః

కఠినం కరకాద్యారభన్తే. ఇత్యాది స్వయమూహనీయమ్.

తా. పరమాణుక్రియాజనకమగు నదృష్టవిశేషమును సహాయమునుగాఁ జేసికొని పరమాణువులు ద్రవ్యవిశేషమును పుట్టించును. సహకారియగు నదృష్టవిశేషమువలననే యుద్భవాదులు పుట్టును అట్లే సాంసిద్ధికద్రవత్వము కలజలం బదృష్టవిశేషమువలనఁ బ్రతిబద్ధద్రవత్వముఁ గలదియై కఠినములగు గరకాదులను బుట్టించును.

మూ. ప్రతిమాదయస్తు తేన తేన విధినా సన్నిధాపిత రుద్రోపేంద్రమహేంద్రాద్యభిమానిదేవతాభేదాస్తత్ర తత్రారాధనీయతామాసాదయన్తి దష్టమూర్ఛితం రాజశరీరమివ విషాపనయనవిధినాఽఽపాదితచైతన్యమ్. సన్నిధానం చ తత్ర తేషామహంకారమమకారౌ, చిత్రాదావివ స్వసాదృశ్యదర్శినో రాజ్ఞ ఇతి నోదర్శనమ్. అన్యేషాం తు పూర్వపూర్వపూజితప్రత్యభిజ్ఞానవిషయస్య ప్రతిష్ఠితప్రత్యభిజ్ఞాన విషయస్య చ తథాత్వమవసేయం ఏతేనాభిమన్త్రితపయః పల్లవాదయో వ్యాఖ్యాతాః.

తా. ప్రతిమాదులు నాయావిధానముచే నాయాదేవతలావాహన చేయఁబడి, వానియందుఁ బ్రవేశించి యాత్మాభిమానముతోఁ గూడుకొనినవై పూజాదులవలన ధర్మాధర్మములను గలుగఁజేయును. ప్రతిష్ఠావిధానమువలనఁ బ్రతిమాదులందు దేవతాసాన్నిధ్యం బెట్లు కలుగునని యాశంకింపవలదు.

సర్పదష్టుఁడై మూర్ఛనొందినవానియొక్క శరీరము మంత్రాదులచే నెట్లు చైతన్యము కలదియగునో యటులనే ప్రతిష్ఠా విధానమువలనఁ బ్రతిమాదులు దేవతాసాన్నిధ్యము కలవి యగుచున్నవి. స్వీయచిత్రాదులందుఁ దనకెట్టి యహంకార మమకారము లుండునో ప్రతిమాదులందు దేవతలకు నట్టి యహంకారమమకారము లుండును.

దేవత యచేతనమైననూ చండాలాదుల స్పర్శలేక ప్రతిష్ఠితమైన ప్రతిమాదులయందు పూర్వాపూర్వ ప్రత్యభిజ్ఞను బట్టియే ప్రతిమాదులందు పూజనీయత్వముఁ దెలియఁదగినది.

మూ ఘటాదిషు కా వార్తా? కుశలైవేతి చేన్న న హి
సామగ్రీ, దృష్టం విఘటయతి, నాప్యదృష్టం
జ్ఞాపకత్వాత్. నాప్యదృష్టిముత్పాదయతి ధర్మ
జననే సర్వథా విజయప్రసంగాత్. విపర్యయే
సర్వథా భంగప్రసంగాత్.

తా. పురుషసమవేతము లగుపుణ్యాపాపముల తెలియు నిమిత్తము తులారోహణలోకములోను, శాస్త్రములోను గూడ ప్రసిద్ధమై యున్నది. శాస్త్రములందుఁ జెప్పఁబడినరీతిగ తులారోహణముఁ జేసినయెడల నమనోన్నమనరూప మగు కార్యము దృష్టమగుచున్నది. దానినిఁబట్టి వీరు పుణ్యాత్ములు, వీరలు పాపాత్ములు నని యూహించుట కలదు.

ఏసామగ్రివలన, నమనోన్నమనాదిరూపకార్యము పుట్టునో యాసామగ్రి దృష్టమునుగాని యదృష్టమునుగాని విఘటనఁ జేయఁజాలదు. అయ్యది యదృష్టమును పుట్టించుటయు లేదు. అదృష్టంబు ధర్మంబనియు నధర్మంబనియు నిరుతెరం

గులు. అందధర్మమునే పుట్టించినచో నెప్పుడు నపజయమునే పుట్టవలసివచ్చును, ధర్మమునే పుట్టించునేని యెల్లెడ జయమే పుట్టవలసివచ్చును. నమనోన్నమనాది రూపకార్యము దృష్టమగుటవలన తత్కారణములగు సామగ్రివలనఁ గలిగెడు నాధేయశక్తితులాదులయం దంగీకరించవలెనని యాశంకించరాదు.

అత్రోచ్యతే..

శ్లో. జయేతరనిమిత్తస్య వృత్తిలాభాయ కేవలం,
పరీక్ష్య సమవేతస్య పరీక్షావిధయో మతాః. ౧౩

అర్థ. పరీక్ష్యపురుషునియందు సమవేతమగునట్టి జయపరాజయములకు కారణమైన ధర్మాధర్మములకు, వృత్తిలాభాయ = ఫలానుకూలమైన సహకారి లాభముకొరకు, పరీక్షావిధులు స్వీకరించఁబడ్డవి.

మూ. యద్యపి ధర్మాద్యభిమానిదేవతాసన్నిధిరత్రాపి క్రియతే తాశ్చ కర్మవిభవానురూపం లింగమభివ్యంజయన్తీత్యస్మాకం సిద్ధాన్తః. తథాపి పరవిప్రతిపత్తేరన్యథోచ్యతే, తేనాపి విధినా తదేవ జయస్య పరాజయస్య వా నిమిత్తమభివ్యక్తం కార్యమున్మీలయతి కర్మణశ్చాభివ్య[illegible] స్సహకారిలాభ ఏవ, తచ్చ సహకారి స్తో[illegible] విధినా తులామధిరూఢో, యోఽహం[illegible] నిష్పాపో వేతి ప్రత్యభిజ్ఞానమ్. య[illegible]

"తాంస్తుదేవాః ప్రపశ్యన్తి స్వ[illegible]
పూరుషః"

తా. ప్రతిమాదులయందువలెఁ దులయందుకూడ ధర్మా ద్యభిమానులగుదేవతల సాన్నిధ్యముఁ గలదు. ఆదేవతలే పరీక్ష్యునియొక్క పుణ్య, పాపసంపాదకము లగుగర్మలకు ననుగుణముగా, సమనోన్నమనాదిరూప మగులింగమును బ్రకాశింపసేయుదురనియే సిద్ధాంతము.

అయినను దేవతచేత నరూపముఁ గాదనియెడు సిద్ధాంతమునను సరించి మఱియొక తెఱంగునఁ జెప్పఁబడుచున్నది.

జయపరాజయములకు నిమిత్తమగునట్టియు పరీక్ష్య పురుషసమవేత మగునట్టియు నదృష్టమునకు పరీక్షావిధు లంగీకరింపఁబడినవి. నేను పాపినా? లేకనిష్పాపుఁడనా యను నీపరీక్షావిధిచేఁ దుల నధిష్ఠించితి నను ప్రత్యభిజ్ఞానమే యాయదృష్టమునకు సహకారి. దేవతలే స్వశరీరమందుండి వానియొక్క పుణ్యపాపములఁ గనిపెట్టుదురు. కావుననే యిట్లు చెప్పుదురు. "తాంశ్చదేవాః ప్రపశ్యన్తి స్వశ్చైవాంతరపూరుషః."

మూ. అథవా–ప్రతిజ్ఞానురూపాం విశుద్ధిమపేక్ష్య తేన ధర్మో జన్యతే నిమిత్తతో, విధానాద్విజయఫలశ్రుతేశ్చ అవిశుద్ధిం చాపేక్ష్యాధర్మః పరాపజయలక్షణానపేక్షితఫలోపదర్శనేన ఫలతో నిషేధాత్.

తా. మఱికొందరీవిధమునఁ జెప్పుదురు.—"జయకామస్తు॥లామారుహేత్" ను కల్పితశ్రుతిచేఁదులారోహణమువలన సత్యప్రతిజ్ఞ నపేక్షించి ధర్మముఁ గలుగును. మిథ్యారూపప్రతిజ్ఞ నపేక్షించి పరాజయరూపమగు ననభిమతఫల

ప్రదర్శనమువలన నధర్మముగూడ పుట్టును. కావున నెక్కడను నాధేయశక్తి నంగీకరింప నక్కరలేదు.

మూ. అథ శక్తినిషేధే కిం ప్రమాణమ్?

తా. శక్తిని నిషేధించుటలోఁ బ్రమాణం బేమి?

మూ. న కించిత్.

తా. ఏమియుఁ బ్రమాణము లేదు.

మూ. తత్కిమస్త్యేవ?

తా. అట్లైనచో శక్తి యంగీకరింపఁబడినదా?

మూ. బాఢమ్, న హి నోదర్శనే శక్తిపదార్థఏవ నాస్తి.

తా. అంగీకరింపఁబడినది. మామతమున శక్తిపదార్థమే లేకపోవుట లేదు.

మూ. కోఽసౌ తర్హి?

తా. అట్లైనచో శక్తిస్వరూపం బెద్ది?

మూ. కారణత్వమ్.

తా. కారణత్వమనునది.

మూ. కిం తత్?

తా. కారణత్వ మన నేమి?

మూ. పూర్వకాలనియతజాతీయత్వం, సహకారివైకల్యప్రయుక్తకార్యాభావత్వం వా.

తా. కార్యమునకుఁ బూర్వకాలముననుండి కార్యమున్నచోట తప్పక యుండునది యేదియో, యదియే కారణము. దానియందుండెడి జాతిమత్త్వముగాని, దేనియందుం

డెడు కార్యాభావవ్యాప్యత దానికంటె భిన్నమగు కారణముల యొక్క యభావావచ్ఛిన్నమో, తత్వముగాని కారణత్వము.

మూ. తతోఽధికనిషేధే కా వార్తా?

తా. ఆకారణత్వమునకన్న విలక్షణ మగుశక్తి నిషేధములో నేమి ప్రమాణము?

మూ. న కాచిత్.

తా. ఏమియు ప్రమాణము లేదు.

మూ. తత్కిం విధిరేవ?

తా. అట్లైనచో శక్తి యున్నదా?

మూ. ఏతదపి నాస్తి, ప్రమాణాభావాత్.

తా. శక్తియుండుటలోఁ బ్రమాణము లేనందున నీ శక్తియు లేదు.

మూ సందేహస్తర్హి.

తా. అట్లైనచో సందేహముఁ గల్గుచున్నదే.

మూ. కథమేవం భవిష్యతి? అనుపలబ్ధచరత్వాత్.

తా. శక్తియొక్క యుపలబ్ధి లేనపుడు సందేహం బెల?

మూ. వివాదస్తర్హి.

తా. అట్లైనచో వివాదముఁ బ్రసక్తమగునే.

మూ. కుత్ర? అనుగ్రాహకత్వసామాన్యాత్సహకారిష్వపి శక్తిపదప్రయోగాత్. సహకారిభేదే తత్రాపి దహనాదేరనుగ్రాహకోఽధికో స్త్యేవ, యః ప్రతిబన్ధకైరపనీయత ఇతి తదా న వివదామహే

అస్మదభిప్రేతస్యాభావాదేరనుగ్రాహకత్వమంగీ
కృత్య నిష్పాదనామీమాంసకా అపి న విప్రతి
పత్తుమర్హన్తి. తతోఽభావాదిరనుగ్రాహక ఇత్యే
కే, నేత్యపరే, ఇతి వివాదకాష్ఠాయాం వ్యుత్పా
దితం చేత్తస్యానుగ్రాహకత్వం, కిమపరమవశిష్య
తే యత్ర ప్రమాణమభిధానీయమిత్యలమతి
విస్తరేణ.

తా. ఎక్కడ కారణత్వము శక్తిపదవాచ్యమైనను, కార్యానుగ్రాహకత్వము కారణసహకారి సాధారణ మగుట వలన సహకారియందుఁ గూడ శక్తి పదప్రయోగ మున్నది. కారణత్వముకంటె విలక్షణమగుశక్తి నంగీకరించనిచో, వహ్న్యాదికమువలనఁ బ్రతిబంధక సమవధానమువలన దాహముఁ బుట్టవలసివచ్చును. ఏది ప్రతిబంధకమువలన నివర్తించునో కారణత్వముకంటె విలక్షణమగునట్టి శక్తిని స్వీకరించుట యావశ్యకమని యంగీకరించుటను వీలులేదు. ప్రతిబంధకాభావమునకే కార్యానుగ్రాహకత్వము మేము స్వీకరించెదము, గావున మీమాంసకులు విప్రతిపత్తిఁ జేయుటకు తగరు.

పూర్వ మభావమనుగ్రాహకమని గొందఱు గాదని కొందఱును వివాదించుసందర్భమున శక్తిపదార్థమును ఖండించి యభావమునకే యనగ్రాహకత్వముఁ జెప్పియుంటిమి.

మూ. తథాపి చేతనవ్యాపారయం సంస్క్రియతే న భూతా
నీతి కుతో నిర్ణయ ఇతి చేత్. ఉచ్యతే భోక్తృణా

ణాం నిత్యవిభూనాం సర్వదేహప్రాప్తావశిష్టా యాం విశిష్టైరపి భూతైర్నియామకాభావా త్ప్రతినియతభోగాసిద్ధేః. న హి తచ్ఛరీరం, తన్మ న,స్తానీంద్రియాణి విశిష్టాన్యపి తస్యైవేతి నియ మః, నియామకాభావాత్. తథా చ సాధారణ విగ్రహవత్త్వ ప్రసంగః. న చ భూతధర్మ ఏవ కశ్చి చ్చేతనం ప్రత్యసాధారణః,విపర్యయదర్శనాత్, ద్విత్వాదివదితి చేన్న.

తా. శరీరాదివిలక్షణము, జేతనము నగునాత్మయందే సంస్కారముగాని భూతములందు లేదనుసంగతి యెట్లు నిశ్చ యింపఁబడినదని యనినచోఁ జెప్పఁబడుచున్నది.

కర్మలవలనఁ గలిగెడు నదృష్టవిశేషమును భూతముల యందే యంగీకరించినచో నిత్యము భోక్తయగునాత్మ సర్వ మూర్తద్రవ్యసంయోగి యగుటవలన నీ యదృష్టవిశేష ముతోఁ గూడిన శరీరసంబంధ మందఱికిని సమాన మగుట వలన నందఱకు నేకరూప మగుభోగమే, కలుగవలసి వచ్చును గాని, యొకనికి సుఖానుభవము, మఱియొకనికి దుఃఖానుభ వము లేకపోవలసి వచ్చును. ఆశరీరము, నాయింద్రియములా మనస్సు, నదృష్టవిశేషవిశిష్టములై యాయాత్మకే భోగసాధ కములని చెప్పుటలో నియామకము లేనందున, నీయొకశరీరం బొకానొకనికే భోగజనక మగును. కాన నాప్రతినియత భోగానుపపత్తిచే నా శరీరసంబద్ధమగు నాపురుషునియందే కర్మలవలనఁ గలిగెడు నదృష్టవిశేషము నంగీకరించవలెను. అట్లైనఁ బ్రతినియతభోగమున కనుపపత్తి యుండదు.

భూతధర్మమగు నీలాదికము సర్వజనులకు భోగసాధక మగుటవలన భూతదర్మమగు నదృష్టవిశేషముఁ బ్రతినియత భోగసాధకమని చెప్పుటకు వలనుపడదు. భూతధర్మమగు ద్విత్వాదికం బెట్లొకానొకపురుషుని యపేక్షాబుద్ధిజన్యమై యవ్వానికే భోగసాధనం బగుచున్నదో యట్లే భూతధర్మ మగు నదృష్టాదికము కూడ భోగజనక మగునని యాశంకింప రాదు.

మూ. తస్యాపి శరీరాదితుల్యతయా పక్షత్వాత్, నియతచేతగుణోపగ్రహేణైవ తస్యాపి నియ మో న తు తజ్జన్యతామాత్రేణ స్వాయమవిశే షాత్.

తా. ద్విత్వము ప్రతినియతభోగజనకమగుటలో భూత ధర్మత్వము నిమిత్తము కాదు. పురుషవిశేషాపేక్షాబుద్ధిజన్య త్వమే నిమిత్తము. అట్టి విశేషవిశిష్టమగు ద్విత్వసామ్య మదృష్ట మునకుఁ దగదు. కావున, ద్విత్వసామ్యమును బురస్కరించు కొని యదృష్టమునకు భూతధర్మత్వము చెప్పుటకు వలనుపడదు.

మూ. తథాపి తజ్జన్యతయైవ నియమోపపత్తౌ విపక్షే కిం బాధకం కిమితి చేత్, కార్యకారణభావ భంగప్రసంగఃశరీరాదీనాం చేతనధర్మోపగ్రహే ణైవ తద్ధర్మజననోపలబ్ధేః తద్యథా—ఇచ్ఛో గ్రహేణ ప్రయత్నః జ్ఞానోపగ్రహేణేచ్ఛా దయః తదుపగ్రహేణ సుఖాదయ ఇత్యాది.

తా. భూతధర్మాంతరమగు నీలాదికము సాధారణ మయినను నపూర్వ మసాధారణమని యాశంకింపరాదు. అటులయినచో చేతనాచేతనధర్మములు విరుద్ధము లగుట వలనఁ గార్యకారణభావమునకు భంగము వాటిల్లెడిని. చేతన గుణమునఁబట్టియే తద్ధర్మత్వ ముపలబ్ధమగుచున్నది. జ్ఞానముం బట్టి యిచ్ఛయు, నిచ్ఛవలనఁ బ్రయత్నము, నద్దానివలన సుఖా దులుఁ గలుగుచున్నయవి. కావున, శరీరాదులకు భోగసాధ నత్వము చేతనగుణ సహకారమువలననే కలుగును. కావున భూతధర్మముఁ గన పూర్వము నంగీకరించ నక్కఱ లేదు.

మూ. ప్రకృతేపి చేతనగతాఏవ బుద్ధ్యాదయో నియా మకాస్స్యురితి చేన్న. శరీరాదేః ప్రాక్ తేషామ సత్వాత్. తథా చ నిరతిశయాశ్చేతనాస్సాధా రణాని భూతానీతి న భుక్తినియమ ఉపపద్యతే.

తా. శరీరాదుల నపేక్షించక బుధ్యాదికమే ప్రతినియత భోగసంపాదకమని యాశంకింపవలదు. శరీరోత్పత్తికంటె పూ ర్వము జ్ఞానాదులు లేకపోవుటవలన శరీరాదుల యుత్పత్తియే లేకపోవలసి వచ్చును. కాన బుధ్యాదులకంటె నతిరిక్తమును, చేతనధర్మము నగు నపూర్వము నంగీకరింపవలయును. ఏశరీర మెవనియొక్క భోగసాధనమగునో యాశరీరము దాని యుత్పత్తికంటె పూర్వమందుండు చేతనవిశేషగుణమువలనఁ బుట్టిన ననుమానముచేఁ జేతనగుణమగు నపూర్వము సిద్ధిం చును. భూతములు సాధారణము లగుటవలనఁ జేతనులయం దదృష్టము నంగీకరింపనిచోఁ బ్రతినియతభోగం బనుపపన్నం బగు. కావున జేతను లతిశయవిశిష్టులని చెప్పవలయును.

మూ. ఏతేన సాంఖ్యమతమపాస్తమ్. ఏవం హి తత్.—అకారణ, మకార్యః కూటస్థచైతన్య స్వరూపః పురుషః ఆదికారణం ప్రకృతిరచేతనా పరిణామినీ, తతో మహదాదిసర్గః.

తా. చేతనునియం దపూర్వము నంగీకరింపనిచో భుక్తి నియమానుపపత్తి వచ్చునని చెప్పినందున సాంఖ్యమతంబు ఖండితంబాయె.

ఆమతస్వరూప మెట్టిదనిన:—కారణము, గార్యము గానేఱనిపురుషుఁడు కూటస్థ చేతనస్వరూపుఁడు. పరిణామముఁ గలదియు, నచేతనమునగు, సత్వరజస్తమోగుణములసామ్యావస్థ గలప్రకృతి యాదికారణము. దానివలన మహత్తత్వము, (బుద్ధితత్వము) దానివలన నహంకారము, నద్దానివలన శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము ననెడి పంచతన్మాత్ర లుత్పన్నము లయినవి. ఈయేడును గార్యకారణోభయాత్మకములు. ఇందు శబ్దమువలన నాకాశము, స్పర్శవలన వాయువు, రూపమువలన తేజస్సు, రసమువలన జలము, గంధమువలనఁ బృథివియు నుత్పన్నం బగును. ఈ యాకాశాదు లైదు భూతములని చెప్పఁబడుచున్నవి. మఱియు నీ పంచతన్మాత్రలవలననే శ్రోత్రము, త్వక్కు, చక్షుస్సు, జిహ్వా, ఘ్రాణముననను నయిదు జ్ఞానేంద్రియంబులు, వాక్కు, పాణి, పాయువు, పాదము, ఉపస్థము ననెడి యైదుకర్మేంద్రియములును, సంకల్పవికల్పాత్మక మగు మనస్సు నుత్పన్నము లాయెను. భూతపంచకము, జ్ఞాన, కర్మేంద్రియపంచకములు, మనస్సు నను నీపదునారు గేవలము కార్య

రూపములు. ఈ యిరువదియైదును సాంఖ్యమతసిద్ధము లగు తత్త్వములు.

మూ. న హి చితిరేవ విషయబంధనస్వభావా అని
ర్మోక్షప్రసంగాత్. నాపి ప్రకృతిరేవ తదీయ
స్వభావా. తథాపి నిత్యత్వేనానిర్మోక్షప్రసంగాత్.

తా. విషయప్రకాశస్వరూపమగు నిత్యమైన చేతనుఁ డుండఁగా మహదాదిసర్గ మెందుల కంగీకరింపవలయునని యాశంకించరాదు. ప్రకాశనద్వారా విషయసంబంధము మగుచేత నునికి నంగీకరించినచో, నింద్రియాదులు లేనిచో విషయప్రకాశము కలుగదు. కావున వానినిఁగూడ నంగీకరింప వలసి యున్నది. వానినిఁగూడ నంగీకరించనిచో నిరపేక్షమైన చితియొక్కసంబంధ మెప్పుడు నుండుటవలనఁ బురుషునికి మోక్షమే లేకపోవలసి వచ్చును

ప్రకృతికే విషయప్రకాశనసామర్థ్యము నంగీకరించిన నది నిత్యమగుటవలన నా ప్రకృతిసంబద్ధుఁ డగుపురుషునికి పూర్వమువలె మోక్షము లేకపోయెడిని.

మూ. నాపి ఘటాదిరేవాహత్య తదీయః, దృష్టాదృష్ట
త్వానుపపత్తేః, నాపీంద్రియమాత్రప్రణాళి
కయా, వ్యాసంగాయోగాత్.

తా. విషయమునకుఁ జైతన్యసంబంధిత్వము స్వభావము. విషయము నశించినచోఁ బురుషునికి మోక్షము కలుగునని యాశంకింపరాదు.

విషయమునకుఁ బరంపరయాచైతన్య సంబంధిత్వము స్వభావమైనచో నింద్రియాదుల నంగీకరించవలెను. సాక్షాత్సంబంధిత్వము నంగీకరించినచో సన్నికృష్టవస్తువుయొక్కవలె విప్రకృష్టవస్తువుయొక్క యవభాసముగూడ కలుగవలసి వచ్చును. కావున నింద్రియాదిద్వారా విషయమునకుఁ జైతన్యసంబంధము నంగీకరింపవలయును.

ఆ యింద్రియాదులవలననే విషయప్రకాశము కలుగుచుండఁ దిరుగ మనస్సును కల్పింప నక్కరలేదని యాశంకింపరాదు.

అన్యాసక్తమనస్కునికి నింద్రియసంబద్ధ మగువస్తువుయొక్క దర్శనము లేనందున మనస్సు నంగీకరించవలెను.

మూ. నాపీంద్రియమనోద్వారా, స్వప్నదశాయాం
వరాహవ్యాఘ్రాద్యభిమానినో నరస్యాపి నర
త్వేనాత్మోపధానాయోగాత్.

తా. ఈవ్యాసంగమునుబట్టి మనస్సుతోఁగూడిన నింద్రియసంబద్ధ మగువిషయమునకే చైతన్యసంబంధము నంగీకరించినందున వెనుకటి యనుపపత్తులు వారించుచుండఁగా నహంకారము నంగీకరించ నవసరములేదని యాశంకించరాదు.

స్వప్నదశయందు వరాహస్వరూపి యగు నేను దీనిని తెలిసికొనుచున్నానని యెట్లభిమానముతోఁ గూడుకొనియుండునో పూర్వోక్త విషయసంబంధమునుబట్టి నరుఁడనగు నేను తెలుసుకొనుచున్నానను నరత్వాభిమానముకూడ నుండవలసివచ్చును. కావున నిట్టి యభిమానమునుఁబట్టి యహంకారమును గూడ నంగీకరింపవలయును.

మూ. నాప్యహంకారపర్యంతవ్యాపారేణ, సుషుప్త్యవస్థాయాం తద్వ్యాపారవిరమేఽపి శ్వాసప్రయత్నసంతానావస్థానాత్.

తా. సుషుప్తియందుఁ బూర్వోక్తములగు నింద్రియ, మనో,హంకారములు లేనందున శ్వాసప్రశ్వాససంతానమనుపపన్నము కావలసి వచ్చును. కాన బుద్ధితత్త్వము నంగీకరింపవలయును.

మూ. తద్యేతాస్వవస్థాసు సవ్యాపారమేకమను వర్తతే యదాశ్రయాచానుభవవాసనా, తదన్తఃకరణముపారూఢోర్ధః పురుషస్యోపధానీ భవతి. భేదాగ్రహాచ్చ నిష్క్రియేఽపి తస్మిన్పురుషే కర్తృత్వాభిమానః, తస్మిన్నచేతనేఽపి చేతనాభిమానః.

తా. జాగ్రత్స్వప్నసుషుప్తులం దీయనుభవరూపమగు వాసన సాంఖ్యులచే నంగీకరింపఁ బడినది. అదియే యంతఃకరణము. ఆబుద్ధితత్త్వమూ, నేను, నొకటే యనుభ్రాంతి యున్నపుడు బుద్ధిఘటాద్యాకారమగువృత్తిరూపముగాఁ బరిణమించును. ఆబుద్ధిచే నగృహీతమగు నసంసర్గకత్వ రూపవిషయసంబంధ మెంతదనుక పురుషున కుండునో యంతవరకుఁ బురుషునకు బంధము. బుద్ధి పురుషులకు భేదగ్రహము కలిగినపుడు మోక్షము. చైతన్యము పురుషునిధర్మము, కర్తృత్వము బుద్ధిధర్మము.

అటులయినచో "చేతనుఁడయిన నేను చేయుచున్నా నని సామానాధికరణ్యప్రతీతి యె ట్లుపపన్నమగునని యాశం

కింపఁ జనదు. బుద్ధి పురుషులకు భేదగ్రహము లేనందున నిష్క్రియుఁడగు పురుషునియందు కర్తృత్వాభిమానము, నచేతనమగు బుద్ధియందు చేతనాభిమానము, నుండుటవలన సామానాధికరణ్యప్రతీతి యుపపన్నంబగు.

మూ. తత్రైవ కర్మవాసనా పురుషస్తు పుష్కర పలాశ వన్నిర్లేపః. ఆలోచనం, వ్యాపార ఇంద్రియాణాం వికల్పస్తు మనసః. అభిమానోఽహంకారస్య కృత్యధ్యవసాయో బుద్ధేః.

తా. అచేతనమగు బుద్ధియందే కర్మ వాసన యుండును. పురుషుఁడు పుష్కరపలాశమువలె నిర్లిప్తుఁడు. ఆలోచన వ్యాపారం బింద్రియధర్మంబు. వికల్పము మనోధర్మము. అభిమాన మహంకారధర్మము. కృతియు యధ్యవసాయమును బుద్ధి ధర్మములు.

మూ. సా హి బుద్ధిరంశత్రయవతీ. పురుషోపరాగో, విషయోపరాగో, వ్యాపారావేశశ్చేత్యంశాః భవతి హి మయేదం కర్తవ్యమితి తత్ర మయేతి చేతనోపరాగో దర్పణస్యేవ ముఖోపరాగో భేదాగ్రహాదతాత్త్వికః. ఇదమితి విషయోపరాగ ఇంద్రియప్రణాళికయా పరిణతిభేదో దర్పణ స్యైవ నిశ్వాసాభిహతస్య మలినిమా, పార మార్థికః. ఏతదుభయాయత్తో వ్యాపారావేశో ఽపి.

తత్రైవంరూపవ్యాపారలక్షణాయా బుద్ధే ర్విషయోపరాగలక్షణం జ్ఞానం తేన సహ యః

పురుషోపరాగస్యాతాత్త్వికస్య సంబన్ధో, దర్పణ ప్రతిబింబితస్య ముఖస్యేవ మలినిమా, సోపలబ్ధిరితి, తదేవమష్టావపి ధర్మాదయో భావాః బుద్ధేరేవ, తత్సామానాధికరణ్యేనాధ్యవసీయమానత్వాత్.

న చ బుద్ధిరేవ స్వభావతశ్చేతనేతి. యుక్తం, పరిణామిత్వాత్. పురుషస్యతు కూటస్థ, నిత్యత్వాదితి. తదేతదపి ప్రాగేవ నిరస్తమ్.

తా. బుద్ధి, పురుషోపరాగము, విషయోపరాగము, వ్యాపారావేశము నను మూఁడంశములు గలిగియున్నది. అందుఁ బురుషోపరాగమనఁగా బుద్ధి చేతనులకు భేదాగ్రహాము వలనఁ గలిగెడు నేకత్వాభిమానము. విషయోపరాగమన విషయేంద్రియ సన్నికర్ష అనఁగా జ్ఞానరూపమగు పరిణామ విశేషము. ఇది పారమార్థికము. వీనివలనఁ జేయఁదగిన విషయముయొక్క ప్రతిభాసవలనఁ గలిగెడు "కరోమి" యను నధ్యవసాయము వ్యాపారావేశ మనఁబడును. అద్దమునందుండు పురుషప్రతిబింబ మెటుల నతాత్త్వికమో పురుషోపరాగము కూడ నట్లే యతాత్త్వికము. ఉచ్ఛ్వాసనిశ్వాసలవలనఁ గలిగెడు దర్పణముయొక్క మాలిన్యమువలె జ్ఞానరూపమగు విషయోపరాగము పారమార్థికము.

ఈ జ్ఞానముచేత "చేతనుఁడగు నేను దీనిని తెలిసికొనుచున్నాను" (చేతనోహమిదం జానామి) అను జ్ఞానమందు చేతనునియొక్క సంబంధమేది కలదో యదియే యుపలబ్ధియని చెప్పఁబడును. అయ్యది యతాత్త్వికము. జ్ఞానమువలె సుఖ-

దుఃఖే - చ్ఛా - ద్వేష-ప్రయత్న - ధర్మాధర్మాదులు కూడ బుద్ధిధర్మములు. స్మృతిపర్యంతముఁ బూర్వపూర్వజ్ఞానమే యనభివ్యక్తముగా బుద్ధియందుండి స్మృతినిఁ గలుగఁజేయుటవలన నీ మతమున సంస్కారము నంగీకరింపవలసిన నవసరము లేదు.

పరిణామి యగుటవలన బుద్ధి యచేతనము. పురుషుఁడు, నిర్వికారుఁడు, నిత్యుఁడు. ఇయ్యది సాంఖ్యమతంబు ఇదియుఁ, బూర్వోక్తములగు యుక్తుల చేతను ముందుఁ జెప్పఁబోవు ప్రకారముల చేతను నుపపన్నము కానేరదు.

**తథాహి:—**

శ్లో. కర్తృధర్మా నియంతారశ్చేతితా చ స ఏవ నః,
అన్యథాఽనపవర్గస్స్యాదసంసారోఽథవా ధ్రువః. ౧౪

అర్థ. కర్తృధర్మాః = కర్తయందుండు యదృష్టాదిధర్మములు, నియన్తారః = భోగజనకములు, స ఏవ = ఆకర్తయే, నః = మనకు, చేతితా = చేతనుఁడు, అన్యథా = బుద్ధి నిత్యమయినచో, అనపవర్గః = మోక్షాభావము, స్యాత్ = అయ్యెడిని, అథవా = బుద్ధి యనిత్యమయిన-చో, అసంసారః = సంసారాభావము, ధ్రువః = నిత్యము.

మూ. కృతిసామానాధికరణ్యావ్యవస్థితాస్తావద్ధర్మాదయో నియామకా ఇతి వ్యవస్థితమ్. చేతనోఽపి కర్త్రైవ, కృతిచైతన్యయోస్సామానాధికరణ్యేనా నుభవాత్.

నాయం భ్రమో, బాధకాభావాత్, పరిణామిత్వాద్ఘటవదితి బాధకమితి చేన్న. కర్తృ

సత్త్వేఽపి సమానత్వాత్. తథా చ కృతిరపి
స్వాభావికీమహతో న స్యాత్.

దృష్టత్వాదయమదోష ఇతి చేత్, తుల్యమ్.

తా. కృతిసమానాధికరణమగు (కర్తయం దుండెడిది యని భావము.) నదృష్టము భోగసాధకము. చేతనుఁడే కర్త. "చేతనోఽహం కరోమి" యను ప్రత్యయ ముండుటవలనఁ గర్తృభిన్నమగు చేతనుఁ డున్నట్లు ప్రమాణము లేదు.

"చేతనోఽహం కరోమి" యను ప్రత్యయము బాధకము లేనందున భ్రాంతిరూపము గానేఱదు. పరిణామి యగుటవలన కర్తబుద్ధి ఘటాదులవలె నచేతనమని బాధకము నాశంకింప రాదు. అట్లయిన బుద్ధికిఁ బూర్వోక్తయుక్తిచేఁ గర్తృత్వము కూడ లేక పోనయ్యెడిని.

బుద్ధితత్త్వము కర్తయగున ట్లనుభవమున్నచో కర్తయే చేతనుఁడను ననుభవము కూడ నున్నది.

మూ. అచేతనకార్యత్వం బాధకం, కార్యకారణయో
స్తదాస్యాదితి చేత్. న అసిద్ధేః, న హి కర్తుః
కార్యత్వే ప్రమాణమస్తి, ప్రత్యుత వీతరాగ
జన్మాదర్శనా (న్యా 3 అ 1 ఆ 25 సూ) దితి న్యా
యాదనాదిత్వైవ సిధ్యతి.

తా. అచేతనమగు ప్రకృతికార్య మగుటవలన గర్త యచేతనమని చెప్పుటకు వలనుపడదు. కర్తకుఁ గార్యత్వము ప్రమాణసిద్ధము గానేఱదు సరికదా! "వీతరాగ జన్మాదర్శనా" త్తను న్యాయమువలనఁ గర్త కనాదిత్వమే సిద్ధించుచున్నది.

వీతరాగజన్మాదర్శనాత్తను సూత్రమువలన నాత్మ కనాదిత్వము, ననాది శరీరయోగమునని యర్థము లభించుచున్నది. రాగశూన్యునకు జన్మ లేదు. రాగవంతునకే జన్మ దృష్టమని యీసూత్రమునకుఁ దాత్పర్యము.

ప్రతిజంతువు రాగముతోఁ గూడినదయియే పుట్టును. జన్మాంతరానుభూత విషయచింతనము లేకుండా యారాగము సంభవింపదు. ఆపూర్వానుభవము నైహికముఁ గాదనియు జన్మాంతరీయంబ యనియు చెప్పవలయును. కాన నీయాత్మ పూర్వశరీరమం దనుభవించియున్న విషయమును స్మరించుచు నావిషయములందు రక్తంబయి యుండును. ఇట్లే పూర్వజన్మ మందుఁ బూర్వతరశరీరానుభూతముఁ బూర్వతరజన్మమందుఁ బూర్వతమ శరీరానుభూతము నగువిషయమును స్మరించుచు, నాత్మ యావిషయములందు రక్తుఁ డగును. ఈరీతిగా జేతనుఁ డగుగర్తకు ననాదిత్వ మనాదిశరీర యోగము సిద్ధించును.

మూ. యత్ యచ్చ కార్యే రూపం దృశ్యతే, తస్య
తస్య కారణాత్మకత్వే రాగాదయోఽపి ప్రకృతౌ
స్వీకర్తవ్యాస్స్యుః.
తథా చ సైవ బుద్ధిః, న ప్రకృతిః, భావాష్టక
సంపన్నత్వాత్.

తా. ఏకార్యమం దేగుణము చూడఁబడుచున్నదో యాకార్యకారణముల కభేద ముండుటవలన నాగుణము కారణమునందుఁ గూడ నుండవలసి వచ్చును. బుద్ధియందు రాగాదికము పలభ్యమాన మగుటవలనఁ దదభిన్నము గారణాత్మము నగు ప్రకృతియందు కూడ రాగాదిక ముండవలసి వచ్చును.

కావున రాగాదిశూన్యమగు ప్రకృతియందు రాగాదికమును స్వీకరించినచో నదియే బుద్ధియని చెప్పుటచే సర్వము నుపపన్న మగుటవలనఁ బ్రకృతి స్వీకారముననే విలయప్రసంగము వచ్చెడిని.

మూ. స్థూలతామపహాయ సూక్ష్మతయా తే తత్ర సం
తితి చేత్, చైతన్యమపి తథా భవిష్యతి. తథా
ప్యసిద్ధో హేతుః.

తథా సతి ఘటాదీనామపి చైతన్యప్రసంగః,
తాదాత్మ్యాదితి చేత్, రాగాదిమత్వప్రసంగోఽపి
దుర్వారః, సౌక్ష్మ్యం చ సమానమితి.

తా. సూక్ష్మరూపమును ధరించి రాగాదికము ప్రకృతి యం దుండునన్నచోఁ జైతన్యముకూడ నట్లే యుండును. మఱియు నాపక్షమున నచేతనకార్యత్వ రూపమగు హేతువ సిద్ధమగుటవలన బుద్ధి చేతనమని సాధింప వలనుపడదు.

కర్త చేతనమయినచోఁ దత్కార్యములగు ఘటాదులు కూడ చేతనములు కావలసివచ్చుననినచో రాగాదిమత్తులు కూడ కావలసివచ్చును.

మూ. తస్మాదవ్యజ్జాతీయాత్కారణాదవ్యజ్జాతీయం కార్యం
దృశ్యతే. తథాభూతా త్తథాభూతమాత్రమను
మాతవ్యమ్. న తు యావద్ధర్మకం కారణం,తా
వద్ధర్మకం కార్యం వ్యభిచారాదితి కిమనేనా
ప్రస్తుతేన?

తా. కాన నేజాతీయకారణమువలన నేజాతీయ మగు కార్యము పుట్టునో యాజాతీయకార్యమువలన నాజాతీయ కారణము మాత్ర మనుమేయ మగును. కాని కారణ మెన్ని ధర్మములతోఁ గూడుకొన్నదో కార్య మన్నిధర్మములు గల దనుటకు వలనుపడదు. అటులయిన బుద్ధి భావాష్టకసంపన్న మగుటవలనఁ దత్కార్యములగు ఘటాదులకుఁ గూడ భావాష్టకసంపత్తి రానయ్యెడిని.

మూ. యది చ బుద్ధిర్నిత్యా, అనిర్మోక్ష ప్రసంగః, పుంస స్సర్వథా సోపాధిత్వే స్వరూపేణానవస్థానాత్. అథ విలీయతే, తతో నానాదేర్విలయ ఇత్యాది మత్వే తదనుత్పత్తిదశాయాం కో నియంతా? ప్రకృతేస్సాధారణ్యాత్. తథాచాసంసారః.

తా. ఈబుద్ధి నిత్యంబయిన నెల్లపుడు బురుషునకు నుపాధి సంబంధ ముండుటవలన మోక్షము లేకపోవలసి వచ్చును. అనిత్యంబయినచో ననాదిసిద్ధము లయినవానికి లయము లేనందున నది సాది యని చెప్పవలయును. అట్లయిన నాబుద్ధియొక్క యుత్పత్తి లేని సమయమున సంసారము లేక పోవలసివచ్చును.

మూ. పూర్వపూర్వబుద్ధివాసనానువృత్తేస్సాధారణ్యే ప్యసాధారణీతి చేత్, బుద్ధినివృత్తావపి తద్ధర్మ వాసనానువృత్తిరిత్యపదర్శనమ్.

సౌక్ష్మ్యాన్న దోష ఇతి చేన్ముక్తావపి పునః ప్రవృత్తిప్రసంగః.

నిరధికారత్వాన్నైవమితి చే,త్తర్హి సాధికారా,ప్రసుప్తస్వభావా బుద్ధిరేవ ప్రకృతిరస్తు, కృతమన్తరా ప్రకృత్యహంకారమనశ్శబ్దానామర్థాన్తరకల్పనయా.

తా. పూర్వపూర్వ బుద్ధివాసనలు ప్రకృతియందు సంక్రమించును. అట్టి ప్రకృతిసంబంధ మున్నందున సంసార ముండునని యాశంకించరాదు. బుద్ధిని వర్తించినపుడు తద్ధర్మమగువాసన యనువృత్త మగుననునది సిద్ధాంతవిరుద్ధము. కారణమగు ప్రకృతియందు బుద్ధి సూక్ష్మరూపముగా నున్నందున వాసనానువృత్తి కలుగునని యాశంకించినచో ముక్తియందుఁగూడఁ బ్రవృత్తి కలుగవలసివచ్చును. అనఁగా సంసారము రావలసివచ్చునని తాత్పర్యము.

ముక్తావస్థయందుఁ బురుషుఁ డధికారశూన్యుఁ డగుటవలన సంసారప్రసక్తి లేదనినచో సంసారదశయందుఁ బ్రవృత్తిజనకమనియు, ముక్తావస్థయందుఁ బ్రవృత్త్యజనక మగుబుద్ధియే జ్ఞానాదుల కాశ్రయమనియు నదియే ప్రకృతిశబ్దవాచ్యమనియుఁ జెప్పుటవలననే సర్వం బుపపన్నమగుచు నుండఁ బ్రకృత్యాదిశబ్దముల కర్థాంతరకల్పన యేల ?

మూ. సైవ హి తత్తద్వ్యవహారగోచరా, తేన తేనశబ్దేన వ్యపదిశ్యతే, శారీరవాయువదిత్యాగమోఽపిసంగచ్ఛతే, ఇత్యతోఽపి హేతురసిద్ధః. అధికారనివృత్త్యా బుద్ధేరప్రవృత్తిరపవర్గః. వాసనాయోగశ్చాధికారః. తతస్సంసారః ధర్మధర్మిణోరత్యన్తభేదే చ కాటస్థ్యావిరోధః. భేదశ్చ

విరుద్ధధర్మాధ్యాసలక్షణో ఘటపటాదివత్ప్రి
త్యక్షసిద్ధః.

తా. ఒక్కటియగు శరీరవాయు వూర్ధ్వాధోగత్యాది సంబంధమువలనను, హృదయాది స్థానభేదములవలనను ప్రాణాపానాదిసంజ్ఞలచే వ్యవహరింపఁబడినటుల నొకటి యగు బుద్ధియే తత్తద్వ్యాపారయోగమునుబట్టి ప్రకృ-త్యహంకార-మనశ్శబ్దములచే వ్యవహరింపఁ బడును. ఇట్లయినచో బుద్ధికి నచైతన్యసాధకమగు నచేతనకార్యత్వరూపహేతువుఁ గూడ నసిద్ధ మగును. అధికారనివృత్తివలన నప్రవృత్తియే యపవర్గము. వాసనాయోగమే యధికారము. దానివలననే సంసారము. బుద్ధి చేతనమయినచోఁ జేతనునికి నిత్యత్వప్రతిపాదకమగు శ్రుతికి విరోధము వచ్చుటకు వీలులేదు. ధర్మభూతమగు జ్ఞానమునకు నుత్పాదవినాశము లున్నను ధర్మియందా రెండు నవిరుద్ధములు. రెంటికి నభేద మున్నచోఁ జైతన్య-కౌటస్థ్యములకు విరోధము కలుగును. మామతమునందు ధర్మభూతమగు జైతన్యమున కుత్పాదనాశము లున్నను, దదాశ్రయమగునాత్మ నిత్యమగుటవలనఁ జైతన్యవత్తునకుఁ గౌటస్థ్యబోధకశ్రుతివిరోధము సంభవింపదు. విరుద్ధ[illegible]మగుభేదము, ఘటాదులవలె ధర్మభూతవ[illegible] దదాశ్రయ మగునాత్మకుఁ బ్రత్యక్షసిద్ధవ[illegible] నేను దెలిసికొంటిని, (అహం జ్ఞాస్[illegible] (నేను [illegible]నఁ గలను, (అహం జానామి) నేను దెలిసి[illegible]చున్నా[illegible] యములలో జ్ఞానమునకు భూత - భ[illegible]నత్వ

ములు గోచరమయినను నహంపదార్థ మగునాత్మ యబాధిత మయినందున నిత్యమని చెప్పవలెను.

మూ. న చ సామానాధికరణ్యాదభేదోఽపి, తద్ధి సమా
నశబ్దవాచ్యత్వం, ఏకజ్ఞానగోచరత్వం, ఏకాధి
కరణత్వం, ఆధారాధేయభావః, విశేష్యత్వం,
సంబన్ధమాత్రం వా, భేదఏవ భేదేఽపి చోపపద్య
మానంనాభేదం స్పృశతీతి సర్వమవదాతమ్.

తా. సామానాధికరణ్యమునుబట్టి ధర్మధర్ములకభేద మంగీకరింపవలనుపడదు. సామానాధికరణ్య మనఁగా:-1. సమానశబ్దవాచ్యత్వము, 2. ఏకజ్ఞానవిషయత్వము, 3. ఏకాధికరణత్వము, 4. ఆధారాధేయభావము, 5. విశేష్యత్వము, 6. సంబంధమాత్రము. వీనిలో నొకటియు నభేదమును సాధింపనేఱవు. మొదటిరెండును భిన్నమగువానియందుఁ గూడ నుండును. తరువాత మూఁడును భిన్నములయినవానియందే యుండును. అంత్యమగు సంబంధము గూడ నధికరణత్వాదిరూప మయినచో భేదము సంభవించును. అధికరణత్వాదిరూపము గానిచో భేదమందే యుండును. కాని యభేదము సిద్ధింప నేఱదు. కావున ధర్మభూత మగుజ్ఞానము ధర్మికంటె భిన్నము. తదాశ్రయ మగునాత్మ నిత్యమని యంగీకరింపవలయును.

మూ. స్యాదేతత్. నిత్యవిభుభోక్తృసద్భావే సర్వమే
తదేవం స్యాత్, స ఏవ కుతః? భూతానామేవ
చేతనత్వాత్, కాయాకారపరిణతాని భూతాని
తథా, అన్వయవ్యతిరేకాభ్యాం తథోపపత్తేః
కర్మజ్ఞానవాసనా తు సర్వత్ర ప్రతిభూతనియత

మనువర్తిష్యేతే. యతో భోగప్రతిసంధాన
నియమ ఇతి చేత్.

తా. నిత్యవిభుభోక్తృరూపమగు నాత్మయున్నచో నీ
చెప్పిన సంగతులన్నియు నుపపన్నము గావచ్చును. భూతము
లకే చైతన్యమును స్వీకరించుటవలన నుపపన్నమగుచుండ
న్యాయమతసిద్ధమగునాత్మ నేల యంగీకరింపవలెను? భూతము
లకే చైతన్యము నంగీకరించినచో ఘటాదులకుఁగూడ చైత
న్యము రావలసివచ్చునని యాశంకింపరాదు. శరీరరూపముగాఁ
బరిణమించిన భూతములే జ్ఞానహేతువు లగుటవలన జ్ఞానసమ
వాయికారణము, శరీరమే జ్ఞానాశ్రయమగుటలో నెట్టిగా
నున్న నేను దీనిని తెలుసుకొనుచున్నాను అను అనుభవ
మున్నూ అనన్వయవ్యతిరేకములున్నూ ప్రమాణములు.

శరీరమే యనుభవమునకుఁ గర్తృత్వమునకు నాశ్రయ
మయినచో నాశరీరము నశించినపిదప, "ఏ నేను బూర్వము
కర్మను జేసితినో, యే నేను సుఖము ననుభవించితినో యా నేను
నిప్పుడు చేయుచున్నానను ప్రతిసంధాన మనుపపన్నమని
యాశంకింపరాదు. ప్రతిసంధాన నియమమునుబట్టి పూర్వశరీ
రము నశించినను దానియందుండెడు కర్మజ్ఞానవాసన లుత్తర
శరీరమున సంక్రమించునని యంగీకరించెదము. కావున నను
సంధాననియమము గుదురునని చార్వాకమతమును ఖండించు
సిద్ధాంతముఁ జెప్పఁబడుచున్నది.

ఉచ్యతే:—

శ్లో. నాన్యదృష్టం స్మరత్యన్యో నైకం భూతమపక్రమాత్,
వాసనాసంక్రమో నాస్తి న చ గత్యన్తరం స్థిరే. ౧౫

అర్థ. అన్యదృష్టం = ఒకనిచే చూడఁబడినవస్తువును, అన్యః=మఱియొకండు, న స్మరతి=స్మరించఁడు, అపక్రమాత్ = ప్రతిక్షణము నశించుటవలన, ఏకం=ఒకటి యగు, శరీరం=శరీరము,న=స్మృతిపర్యంత ముండదు,వాసనాసంక్రమః=పూర్వశరీరమునం దుండువాసన యుత్తరశరీరమందు సంక్రమించుట, నాస్తి=లేదు, స్థిరే = స్థిరపక్షమున, గత్యన్తరం = మఱియొక మార్గము, న=లేదు.

మూ. న హి భూతానాం సముదాయపర్యవసితం చైతన్యం ప్రతిదినం తస్యాన్యత్వే పూర్వపూర్వదివసానుభూతస్యాస్మరణప్రసంగాత్. నాపి ప్రత్యేకపర్యవసితం కరచరణాద్యవయవాపాయే తదనుభూతస్య స్మరణాయోగాత్.

తా. ఈచైతన్యముఁ గరపదాదిసముదాయరూప మగు శరీరమందు స్వీకరింతురా? ప్రత్యేకము స్వీకరింతురా? మొదటి పక్షమునఁ బూర్వదివసమందుండు నవయవసంఘాత ముత్తర దివసమందు లేనందునఁ బూర్వదివసానుభూతమగు వస్తువునకు స్మరణమే లేకపోవలసి వచ్చును. రెండవపక్షమున ననుభవిత లగు హస్తాదులు నశించినచో ననుభూతవస్తువుయొక్క స్మరణము లేకపో నయ్యెడిని.

మూ. నాపి మృగమదవాసనేవ వస్త్రాదిషు సంసర్గాదన్యవాసనాఽన్యత్ర సంక్రమతి. మాత్రానుభూతస్య గర్భస్థేన భ్రూణేన స్మరణప్రసంగాత్.

తా. కస్తూరియొక్కపరిమళము వస్త్రాదులందు సంక్రమించినటుల పూర్వశరీరమం దుండువాసన యుత్తరశరీరము

నందు సంక్రమించునని యాశంకించినచోఁ, దల్లిచే ననుభూత మగువస్తువు గర్భమందుండెడి శిశువుచే స్మరింపఁబడవలసి వచ్చును

**మూ.** న చోపాదానోపాదేయభావనియమో గతిః.
స్థిరపక్షే పరమాణూనాం తదభావాత్. ఖండా
వయవినం ప్రతి చ విచ్ఛిన్నానామనుపాదాన
త్వాత్. పూర్వసిద్ధస్య చావయవినో వినాశాత్.

తా. ఉపాదానమందుండువాసన యుపాదేయమందు సంక్రమించును గనుక గర్భస్థ శిశువునుగూర్చి తల్లి యుపాదానము గానందునఁ బూర్వోక్తాతిప్రసంగము వారించునని యాశంకింపరాదు. శరీరమునుగూర్చి పరమాణువు లుపాదాన కారణము లనినచోఁ బరమాణువు లతీంద్రియము లగుటచే తద్గతగుణము లతీంద్రియము లగుటవలన దానియందుండు జ్ఞానముకూడ నతీంద్రియము గావలసివచ్చును. "జానామి" యనుజ్ఞానప్రత్యక్ష మున్నందున నీచైతన్యాశ్రయము లతీంద్రియములగు పరమాణువులని చెప్పుటకు నవకాశము లేదు. ప్రత్యక్షసిద్ధములగు కరపాదాదులే యవయవము లనినచో నవి నశించినపుడు గూడ పూర్వశరీరము నశించును గాన మిగిలిన యవయవములచే నుత్పన్నమగు ఖండశరీర మున్నపుడు స్మరణ మనుపపన్న మగును. ఉపాదానమందుండువాసన యుపాదేయమందు సంక్రమించిన నిట్టి యనుపపత్తులు రానయ్యెడిని. కావున వాసనాసంక్రమం బనుపపన్నంబు.

**మూ.** అస్తు తర్హి క్షణభంగః. న చాతిశయోఽప్యతి
రిచ్యతే, కింతు సాదృశ్యతిరస్కృతత్వాద్ద్రాగేవ

న వికల్ప్యతే, కార్యదర్శనాదధ్యవసీయతే, అం
త్యాతిశయవత్. తథా చ భూతాన్యేవ తథా
తథోత్పద్యన్తే, యథాయథా ప్రతిసంధాననియ
మాదయోఽప్యుపపద్యన్తే,క్షణికత్వసిద్ధావేవమే
తత్, తదేవ త్వన్యత్ర విస్తరేణ ప్రతిషిద్ధమ్.

తా. క్షణభంగవాదమతమునఁ బూర్వోత్తరశరీరముల కుపాదానోపాదేయభావ ముండుటచే వాసనాసంక్రమము సంభవించును గాన ప్రతిసంధాననియమ ముపపన్న మగును. ప్రతిసంధానమునుబట్టి పూర్వశరీరమునం దుండువాసనలు త్తరశరీరమందు సంక్రమించునని యంగీకరించినచో నావాసన శరీరముకంటె విలక్షణముగా నుపలభ్యమానము గానందున వాసనాసంక్రమము నంగీకరించుట తగదని యాశంకింపఁ జనదు. పూర్వశరీరసాదృశ్యముచే తిరస్కృత మగుటం జేసి కనిపించుట లేదు. అంతమాత్రమున నది లేదనుట తగదు. మీామతమున నంత్యావయవి యగు ఘటమునుబట్టి దాని సామగ్రి యెటుల నూహింపఁబడునో యటులనే ప్రతిసంధానరూపకార్యమునుబట్టి యతిశయవిశేష మూహింపఁ బడును. ఈ ప్రతిసంధాననియమమునుబట్టి యతిశయవిశిష్టము లగు శరీరములే ప్రతిక్షణవినాశముఁ గలచేతనము లనెడు బౌద్ధమతమున క్షణికత్వము సిద్ధించినచో నుపపన్న మగును. ఆ క్షణికత్వసిద్ధియే దుర్ఘటము.

అపి చ.

శ్లో. న వైజాత్యం వినా తత్స్యాన్న తస్మిన్నను మా భవేత్,
వినా తేన న తత్సిద్ధిర్నాధ్యక్షం నిశ్చయం వినా. ౧౬

అర్థ. వైజాత్యం=కారణమందు వైజాత్యము, వినా = లేనిచో, తత్ = క్షణికత్వము, న=సిద్ధింపదు. తస్మిన్సతి=ఆ వైజాత్యమే యంగీకరించినచో, అనుమా = అనుమానము, నభవేత్ = లేకపోవలసి వచ్చును. తేనవినా = అనుమానము లేనిచో, న తత్సిద్ధిః = క్షణికత్వసిద్ధియే యుండదు. నిశ్చయం వినా = క్షణికత్వ మతీంద్రియము గాన దాని సవికల్పకము లేనందున, నాధ్యక్షం = నిర్వికల్పక రూపప్రత్యక్షముచే క్షణికత్వసిద్ధి గానేరదు.

మూ. న హి కారణాకారణయో స్తజ్జాతీయస్య సతస్సహకారిలాభాలాభౌ తంత్రమిత్యభ్యుపగమే క్షణికత్వసిద్ధిః. తథా ఏకవ్యక్తావప్యవిరోధాత్, తద్వా తాదృగ్వేతి న కశ్చిద్విశేష ఇతి న్యాయాత్. తతస్తావనాదృత్య వైజాత్యమప్రామాణికమేవాభ్యుపేయమ్.

తా. ఏకజాతీయమైనవానికిఁ గార్యోత్పాదకత్వానుత్పాదకత్వములు సహకారి లాభాలాభనిమిత్తకములని చెప్పుటచే నుపపన్న మగుచుండఁగా క్షణికత్వసిద్ధి కానేఱదు. ఇట్లే యేవ్యక్తి సహకారి లేనందునఁ బూర్వము గార్యమును బుట్టించలేకపోయెనో యావ్యక్తియే సహకారి సమవధాన దశయందు కార్యమును పుట్టించుననుటలో "తద్వాతాదృగ్వా" యను న్యాయమువలన నేమియు విరోధము లేదు. కాఁబట్టి సహకారి లాభాలాభముల నాదరింపక యప్రామాణిక మగు వైజాత్యమునం దంగీకరించుట యసమంజసము.

మూ. ఏవం చ కారణవత్కార్యేఽపి కించిద్వైజాత్యం స్యాత్, యస్య కారణాపేక్షా, న తు దృష్టజాతీయస్యేతి శంకయా న తదుత్పత్తిసిద్ధిః దృష్టజాతీయమాకస్మికం స్యాదితి చేన్న, తత్రాపి కించిదన్యదేవ ప్రయోజకం భవిష్యతీత్యవిరోధాత్, న కార్యస్య విశేషస్తత్ప్రయుక్తతయోపలభ్యతే, నాపి కార్యసామాన్యస్యాన్యత్ప్రయోజకం దృశ్యత ఇతి చేత్.

తా. కారణమునందు వైజాత్యమును స్వీకరించినచోఁ గార్యమందుఁగూడ నట్టివైజాత్యము నంగీకరింపవలసి వచ్చును. ఏవిజాతీయమునకుఁ గారణాపేక్ష యుండునో దృష్టమైన ధూమాదిజాతీయమునకు వహ్న్యాదిరూపమయిన కారణాపేక్ష లేదో యను నాశంకవలన దృష్టధూమజాతీయముయొక్కయుత్పత్తియే లేకపోవలసివచ్చును.—ధూమాదులయొక్కజాతిభేదములోనే వహ్న్యాదులకుఁ గారణత్వముఁ జెప్పినచో ధూమాదిదృష్టజాతీయ మహేతుకము గావలసివచ్చును. కావున ధూమాదికార్యమం దవాంతరజాతిభేదశంకకు నవకాశము లేదని యాశంకింపరాదు. వహ్న్యాదులకు ధూమాద్యవాంతరజాతిభేదములో నుపయోగ మున్నను ధూమాదిదృష్టజాతీయం బకారణకంబు కానేఱదు. అదృష్టజాతీయములోఁగూడ వహ్న్యాదులకంటె నతిరిక్తమయినట్టియు ననుపలభ్యమానమైనట్టియు ప్రామాణికమైన మఱియొక ప్రయోజకమంగీకరింతుము.

కారణవిశేషప్రయోజ్యమైన కార్యవైజాత్యమున్నా ధూమాదిరూపదృష్టజాతీయమునకుఁ బ్రయోజకాంతరము న్నా దృష్టముఁ గానందున వెనుకటి యాశంక కవకాశము లేదని యాశంకింపరాదు.

మూ. తత్కిం కారణస్య విశేషః స్వగతస్తత్ప్రయోజకతయోపలబ్ధః, కారణసామాన్యస్య వాఽన్యత్ప్రయోజ్యాన్తరం దృశ్యతే, యతో విపక్షిత సిద్ధిస్స్యాత్, శంకాతూభయత్రాపి సులభేతి, కార్యజన్మాజన్మాభ్యామున్నీయత ఇతి చేత్. న సహకారిలాభాలాభాభ్యామేవోపపత్తేః.

ఉన్నీయతాం వా కార్యేషు శంకిష్యతే నిషేధకాభావాత్. న హి ధూమస్య విశేషం దహనప్రయోజ్యం ప్రతిషేద్ధుం స్వభావానుపలబ్ధిః ప్రభవతి. కార్యైకనిశ్చేయస్య తదనుపలబ్ధేరేవానిశ్చయోపపత్తేః. కార్యస్యాతీంద్రియస్యాపిసంభవాత్. అతఏవానుపలబ్ధ్యన్తరమపి నిరవకాశమితి.

తా. బీజమందుండెడు నప్రామాణికమైన కుర్వద్రూపత్వమునకుఁ గార్యప్రయోజకత్వమును, నుపస్థితమైన దృష్టజాతీయమగు బీజత్వాదికమునకుఁ బ్రయోజ్యాంతరమును దృష్టము గానందునఁ గార్యమునందు వైజాత్యము నంగీకరించునపు డుండెడిశంక కార్యమునందువలెఁ గారణమునం దంగీకరించునపుడుఁ గూడ సమానము కావలసివచ్చును. కార్యము యొక్క యుత్పత్త్యనుత్పత్తులఁబట్టి కారణమునందు వైజాత్యము నంగీకరింప వలనుగాదు. సహకారియొక్క లాభాలాభములను

బట్టియే కార్యముయొక్క యుత్పత్త్యనుత్పత్తు లుపపన్నము లగుచునుండఁగాఁ గారణమునం దప్రామాణికమగు వైజాత్య మును గార్యోత్పత్త్యనుత్పత్తులవలన నూహించుట తగదు.

ఊహించినను నిషేధకము లేనందునఁ గార్యమునందు జాతివిశేషమును శంకించెదము. అయోగ్య మగువానిని నిషే ధించుటలో యోగ్యానుపలబ్ధి సమర్థముఁ గానందున దహన ప్రయోజ్యమగు జాతిభేదమును ధూమమునందు శంకిం చెదము. కార్యముచే వైజాత్యమును నిశ్చయించెదము. తన్నిశ్చయమున్నందున శంక కవకాశము లేదని యాశంకింప వలదు. కార్య మనుపలబ్ధ మగుటవలనఁ దన్నిశ్చయము కూడ లేదు. కావున శంక కవకాశ మున్నది. యోగ్యానుపలబ్ధి నిషే ధకము కానందున నితరములగు ననుపలబ్ధులకుఁ గూడ నవ కాశము లేదు.

మూ. ఏవంవిధిరూపయోర్వ్యావృత్తిరూపయోర్వా జాత్యోర్విరోధే సతి న సమావేశః సమావిష్ట యోశ్చ పరాపరభావనియమః. అన్యూనానతి రిక్తవృత్తిజాతిద్వయకల్పనాయాం ప్రమాణా భావాత్. వ్యావర్త్యభేదాభావేన విరోధా నవకాశే భేదానుపపత్తేః. పరస్పరపరిహారవతో శ్చ సమావేశే గోత్వాశ్వత్వయోరపి తథా భావప్రసంగాత్.

తా. కారణమునందు వైజాత్యమునే యంగీకరించి నచోఁ గుర్వద్రూపత్వ, శాలిత్వరూపములగు రెండుజాతులకు విరోధ మున్నయెడల సమావేశమే యుండదు. సమావిష్టము

లైనచో వానికి వ్యాప్యవ్యాపకభావము నియతము. అది దుర్ఘటము ఎట్లన—కుర్వద్రూపత్వ రూపవైజాత్యము శాలిత్వమునకు వ్యాప్యమైనచో నవబీజమునందు వ్యాపకమగు శాలిత్వము లేనందున వ్యాప్యమగు కుర్వద్రూపత్వముఁగూడ నుండదు. కాన, దాన నంకురోత్పత్తి లేకపోవలసి వచ్చును. కుసూలస్థమగుశాలియందుఁ గుర్వద్రూపత్వము లేనందుననయ్యది వ్యాపకమని చెప్పుటకుఁ గూడ వీలులేదు. ఈ రెండుజాతులు నన్యూనానతిప్రసక్తములైనచోఁ బ్రమాణములేనందున భిన్నజాతులనుటకు వీలులేదు. వృక్షత్వ శింశుపాత్వములవలె వ్యావర్త్యభేదము లేనందున వీనికి భిన్నజాతిత్వము సంభవింపదు.

పరస్పరాభావ సమానాధికరణము లగుశాలిత్వ కుర్వద్రూపత్వములకు సమావేశముఁ జెప్పినచో గోత్వాశ్వత్వములకుఁ గూడ సమావేశ ముండవలసి వచ్చును.

మూ. సామగ్రీవిరోధాన్నైవమితి చేత్, తత్కృతః,
పరస్పరపరిహారేణ సర్వదావ్యవస్థితే రితిచేత్.
నేదమప్యధ్యక్షమ్. ఏకదేశసమావేశేన తు
సామగ్రీసమావేశోఽప్యన్వీయతే.

తా. గోత్వాశ్వత్వాశ్రయవ్యక్తి ప్రయోజకసామగ్రులు పరస్పర విరుద్ధము లగుటవలన గోత్వాశ్వత్వములకు సమావేశము లేదనినచో, సామగ్రుల కున్న విరోధ మెట్లు? అశ్వప్రయోజకసామగ్రి లేక గోప్రయోజకసామగ్రియు, గోప్రయోజకసామగ్రి లేక యశ్వప్రయోజకసామగ్రియు నుండుటంబట్టి సామగ్రులకు విరోధము నంగీకరించెద మనిన నట్టివిరోధము ప్రత్యక్షసిద్ధము కాదు. మఱియు సామగ్రిలో

నేకదేశము లగుచున్నట్టియు సాధారణకారణములగు గాలదిగాదు లకు సమావేశ మున్నందున దానినిఁబట్టి సామగ్రి సమావేశముకూడ ననుమేయింపఁబడును.

మూ. యావత్కార్యయోః పరస్పరపరిహృతిస్వభావత్వాదితి చే, త్తర్హి కంపశింశుపయోః పరస్పరపరిహారవతో ర్న సమావేశస్స్యాత్.

దృశ్యతే తావదిదమితి చేత్, గోత్వాశ్వత్వయోరపి న ద్రక్ష్యత ఇతి కా ప్రత్యాశా?

తథా చ గతమనుపలబ్ధిలింగేనాపి, క్వచిదపి విరోధాసిద్ధేః తతో విపక్షే బాధకాభావాత్స్వభావహేతురప్యపాస్తః.

తా. కార్యవిరోధమును బట్టి సామగ్రి విరోధముకల్పించుట వలనుపడదు. అట్లైనచోఁ గంపత్వ శింశుపాత్వములకు సమావేశమే లేకపోవలసి వచ్చును. చలపిప్పలియందుఁ గంపరూపకార్యము, నిశ్చలశింశుపయందు శింశుపాత్వరూపకార్యమున్నూ పరస్పరవిరుద్ధము లగుటవలనఁ దత్సామగ్రులకు విరోధము నూహించినచోఁ జలశింశుపయందుఁ గంపత్వశింశుపాత్వములకు సమావేశము లేకపోవలసి వచ్చునని భావము.

వానికి సమావేశము దృష్టమగుచున్నదనినచో గోత్వాశ్వత్వములకు సమావేశము దృష్టము కాదనుటలో నేమి ప్రమాణము ? వానికి సమావేశము నంగీకరించినచో విరోధము సిద్ధింపనందున గోత్వవిరుద్ధాశ్వత్వోపలబ్ధి యనెడు గోత్వానుపలబ్ధి రూపలింగముచే నశ్వమునందు గోత్వాభావానుమానమే లేకపోవలసి వచ్చును.

విరోధము సిద్ధింపనందున వృక్షమునందు, (వృక్షభిన్న మందు) కూడ శింశుపాత్వ ముండవచ్చును గాన శింశుపకు వృక్షస్వభావత్వమును సాధించునట్టి వృక్షములేనిదే శింశుప యుపలబ్ధము కానేఱదను విపక్షబాధకానుపలబ్ధి రూపహే తువ లేదు గాన శింశుపయందు వృక్షస్వభావత్వము నిశ్చయింపఁబడకపోయేని, శింశుపాత్వముగూడ వృక్షత్వమునకు వ్యభిచారి గావలసివచ్చునన్న శంక వచ్చును.

**మూ.** నన్వస్తి తత్, తథాహి. వృక్షజనకపత్రకాండా ద్యన్తర్భూతా శింశుపాసామగ్రీ, సా వృక్షమతి పత్యభవస్తి స్వకారణమేవాతిపతేత్, ఏవం శాఖాదిమన్మాత్రానుబంధీ వృక్షవ్యవహార, స్తద్విశేషానుబంధీ చ శింశుపావ్యవహారః సకథం తమతిపత్యాత్మానమాసాదయేదితి చేత్.

తా. శింశుపాసామగ్రి, వృక్షజనక పత్రకాండాది సామగ్రి నపేక్షించి యున్నది. కావున నాశింశుపాసామగ్రి, వృక్షసామగ్రి నపేక్షింపకయే శింశుపను బుట్టించినచో స్వకారణాతిపాతము (తనకారణము నపేక్షింపకయే తాను పుట్టుట) రా నయ్యెడిని. ఇది యొకబాధకము. కావున యీఁడుపలభ్యమానమగు శింశుపవృక్షమని సిద్ధించును.

శింశుపావ్యవహారముచే వృక్షవ్యవహారమును సాధించినపుడు కూడ శింశుపావ్యవహారము వృక్షవ్యవహారము నపేక్షించనిచో వృక్షత్వ శింశుపాత్వములకు సామాన్యవిశేష భావము లేకపోవలసి వచ్చును. అనునది మఱియొక విపక్ష బాధకము.

ఇందు మొదటిబాధకమువలన శింశుపాత్వ రూప హేతువుచే వృక్షత్వము సిద్ధించును రెండవదానిచే శింశుపా వ్యవహారమువలన వృక్షవ్యవహారము సిద్ధించునని యాశంకింప రాదు.

మూ. ఏవం తర్హి శింశుపాసామగ్ర్యస్తర్భూతా చలన సామగ్రీ తతస్తామతిపత్య చలనాదిరూపతా భవన్తీ స్వకారణమేవాతిపతేత్. తథా శాఖాదిమద్విశేషానుబన్ధీ శింశుపావ్యవహారః, తద్విశేషానుబంధీ చ చలనవ్యవహారః స కథం తమతిపత్యాత్మానమాసాదయేదితి తుల్యమ్.

తా. అట్లైనచో, చలనసామగ్రి శింశుపాసామాన్య సామగ్రి నపేక్షించియున్నది. కావున శింశుపాసామగ్రి నపేక్షింపకయే చలనసామగ్రి చలనమును బుట్టించినచో స్వకారణాతిపాతము వచ్చును. అయ్యది చలపిప్పలియందుఁ దృష్ట మగుటచే నిష్టమే యనరాదు. శింశుపావ్యవహారము శాఖాదిమద్విశేషమును బట్టియుండును. చలనవ్యవహారము తద్విశేషమును ( ) బట్టియు నుండును. ఈ చలన వ్యవహారము శింశుపావ్యవహారము నతిక్రమించి యుండినచో స్వరూపాతిపాతము వచ్చునను బాధకము తుల్యమగుటవలన వెనుకటి విపక్షబాధకము సిద్ధింపనేరదు.

మూ. నోదనాద్యాగంతుకనిబన్ధనం చలనత్వం న తు తద్విశేషమాత్రాధీనమితి చేత్, యది నోదనాదయ స్స్వభావభూతాస్తత స్తద్విశేషా ఏవ.

అథాస్వభావభూతా స్తతస్సహకారిణ ఏవ తత స్తానాసాద్య నిర్విశేషైవ శింశుపా, చలనస్వభావత్వమారభత ఇతి.

తథా చ కుతః క్షణికత్వసిద్ధిః?

తా. శింశుపావిశేషము నపేక్షింపకయే నోదనాది సంయోగమువలన చలనము సంభవించునని చెప్ప వలను పడదు. ఆనోదనాదులు స్వభావభూతములా? యస్వభావ భూతములా? స్వభావభూతములే యైనచో నవి శింశుపావిశేషంబులే. అస్వభావంబు లైనచో నవ్వానిని సహకారులుగా నంగీకరింపవలయును. నిర్విశేషమగు శింశుప, యానోదనాదుల సహకారులనుగాఁ జేసికొని చలనస్వభావత్వమును బుట్టించును. కాన నీపక్షమున క్షణికత్వం బెట్లు సిద్ధించును?

మూ. స్వభావభూతా ఏవాగన్తుకసహకార్యనుప్రవేశాద్భవన్తీతి చే, దేవం తర్హి వృక్షసామగ్ర్యామాగన్తుకసహకార్యనుప్రవేశాదేవ శింశుపాపి జాయత ఇతి న కశ్చిద్విశేషః.

ఏవమేతత్. కింతు శింశుపాజనకాస్తరుసామగ్రీముపాదాయైవ,చలనజనకాస్తు న తామేవ, కింతు మూర్తమాత్రం తథా దర్శనాదితి చేన్నైవమ్. కంపజనకాశ్శింశుపాజనకవిశేషా అపి సన్తస్తానతిపతన్తి, న తు శింశుపాజనకా వృక్షజనక విశేషాస్తానితి నియామకాభావాత్.

తా. నోదనాదులు స్వభావభూతములే. అయ్యవి యాగంతుకములగు సహకారుల నపేక్షించి, శింశుపాసామగ్రి నపే

క్షింపకయే కార్యమును బుట్టించుననినచో వృక్షస్వభావభూత మగు శింశుపయు వృక్షసామగ్రి నపేక్షింపకనే యాగంతుక సహకారులవలనఁ బుట్టవలసి వచ్చెడిని.

శింశుపాసామగ్రి, వృక్షసామగ్రి నపేక్షించియే శింశు పను బుట్టించును. చలనసామగ్రి కేవలము శింశుపాసామగ్రినే యపేక్షించదు. మఱి యేమన మూర్తమాత్రమునందుఁ గ్రియ పుట్టుటవలన మూర్తమాత్రము నపేక్షించునని యాశంకింప రాదు.

కంపసామగ్రి, శింశుపా సామగ్ర్యంతర్గతమైనను శింశు పాసామగ్రి నపేక్షింపకయే కార్యమును బుట్టించును. కాని, శింశుపాజనకములు వృక్షజనకసామగ్రి నపేక్షింపక కార్యజనన సమర్థములు గావనుటలో నియామకము లేదు.

మూ. శింశుపాజనకాస్తద్విశేషా ఏవ, కంపకారిణస్తు న తథా, కింత్వాగన్తవస్సహకారిణ ఇతి చే, దేవం తర్హి తానాసాద్య సదృశరూపా అపి కేచిత్కంపకారిణోఽనాసాదితసహకారిణస్తు న తథా. తథా చ తద్వా, తాదృగ్వేతి న కశ్చిద్వి శేషస్స్యాత్.

తస్మాద్విరుద్ధయోరసమావేశ ఏవ సమావిష్ట యోశ్చ పరాపరభావఏవ, అనేవంభూతానాం ద్రవ్యగుణకర్మాదిభావేనోపాధిత్వమాత్రం తే షాం తువిరుద్ధానాం నసమావేశోవ్యక్తిభేదాత్, జాతీనాం చ భిన్నాశ్రయత్వాత్, తథా చ కుతః

క్షణికత్వమ్? వైజాత్యాభ్యుపగమే చ కుతో
ఽనుమానవార్తా?

తా. శింశుపాజనకములు వృక్షజనకవిశేషములను, కంప జనకములు, శింశుపాజనకవిశేషముల నపేక్షింపక యాగంతుకములగు సహకారులే యని యాశంకించరాదు. అట్లైనచోఁ గొన్ని కంపకారులు శింశుపాజనకముల నపేక్షించి చలనరూపమగు శింశుపనుఁ బుట్టించును. శింశుపాజనకము నపేక్షింపని కంపకారులు చలనరూపమగు శింశుపనుఁ బుట్టింపనేరవని చెప్పవలసి వచ్చును. కావున నదికాని యట్టిదికాని యని చెప్పుటలో విశేషము లేదు.

కాన విరుద్ధజాతులకు సమావేశమే యుండదు. సమావిష్టము లగువానికి పరాపరభావంబె. ద్రవ్యత్వ గుణత్వ కర్మత్వాదికమునకుఁ బరాపరభావము లేమిం జేసి యుపాధిత్వమే. భిన్నవ్యక్తుల నాశ్రయించుట వలన (వ్యక్తిభేద మున్నందున) విరుద్ధములగు వీనికి సమావేశము లేదు. కాన గారణమగు యవబీజాదికమునందుఁ గుర్వద్రూపత్వ మను వైజాత్యమును స్వీకరించుటకు నవకాశము లేదు. వైజాత్యము నొప్పిన, ననుమానవార్తయే యుండదు. అది లేనిచో క్షణికత్వము సిద్ధింపనేఱదు.

మూ మాభూదనుమానమితి చేన్న, తేన హి వినా న తత్సిద్ధ్యేత్, న హి క్షణికత్వే ప్రత్యక్షమస్తి తథా నిశ్చయాభావాత్. గృహీతానిశ్చితఏవార్థే తస్య ప్రామాణ్యాత్. అన్యథాఽతిప్రసంగాత్.

తా. అనుమాన మక్కఱలేకనే క్షణికత్వము ప్రత్యక్షసిద్ధ మనుటకు వలనుపడదు. "ఇది నీలమ"నుటుల "నిది క్షణిక" మనునిశ్చయము లేదు. నిశ్చయము లేకున్నను నిర్వికల్పక రూపమగు ప్రత్యక్షమువలననే యభిమతసిద్ధి యగునని యాశంకించరాదు. నిర్వికల్పకము సవికల్పకమువలననే సిద్ధించును గాన, నిశ్చయరూపమగు సవికల్పకమే లేనందున నద్దానిచే నూహింపఁబడిన నిర్వికల్పకము క్షణికత్వసిద్ధిలోఁ బ్రమాణము కానేరదు.

మూ. నను వర్తమానః క్షణోఽధ్యక్షగోచరః, న చాసౌ పూర్వాపరవర్తమానక్షణాత్మా, తతో వర్తమానత్వనిశ్చయ ఏవ భేదనిశ్చయ ఇతి చేత్. కిమత్ర తదభిమతమాయుష్మతః? యది ధర్మ్యేవ నీలాది,ర్న కించిదనుపపన్నమ్, తస్య స్థైర్యాస్థైర్య సాధారణ్యాత్. అథ ధర్మ,స్తద్భేదనిశ్చయేఽపి ధర్మిణః కిమాయాతమ్? తస్య తతోఽన్యత్వాత్.

"అయం ఘటః" యను ప్రత్యక్షము సర్వలోకానుభవ సిద్ధము. దీనిలో "ఘటః" యనునది ధర్మిని, "అయ" మ్మనునది వర్తమానత్వమును బోధించును. ఈ వర్తమానత్వనిశ్చయమే క్షణికత్వనిశ్చయము. దీనినిఁబట్టియే క్షణికత్వసాధకమగు నిర్వికల్పక ప్రత్యక్షము నూహించెదమని యాశంకింపరాదు.

ఈ "అయం ఘటః" యను ప్రత్యక్షములో విషయమగు వర్తమానత్వము ధర్మియగు ఘటస్వరూపమా, లేక ఘటమునందుండెడి ధర్మస్వరూపమా? ధర్మిస్వరూప మనినచో

నాఘుటముతోఁ గూడినకాలమే వర్తమానకాలమని చెప్ప వలెను. అది స్థిరమగునపుడుకూడ సంభవించును. మరియు క్షణ రూపత్వ మాఘుటమున కసిద్ధము. ధర్మరూపమనినచో, ధర్మభేద మున్నను, ధర్మి భిన్నముకాదు, కావున ధర్మ, ధర్ములకు భేద ముండుటవలన ధర్మికి క్షణికత్వము సిద్ధింపదు.

మూ. వర్తమానావర్తమానత్వమేకస్య విరుద్ధమితి
చేత్, యది సదసత్త్వం తత్. తన్న. అనభ్యుపగ
మాత్. తాద్రూప్యేణైవ ప్రత్యభిజ్ఞానాత్,
సదసత్సంబన్ధశ్చేత్, కిమసంగతం? జ్ఞానవత్త
దుపపత్తేః.

తా. విరుద్ధము లగుటంజేసి వర్తమానత్వావర్తమాన త్వము లొకచో నుండవు. కాన క్షణికత్వమును ధర్మికిఁ గూడ నంగీకరించెదమని యాశంకింపరాదు. వర్తమానత్వమును బట్టియే ద్వితీయాదిక్షణమందుఁ బ్రత్యభిజ్ఞ యుండుటవలన ధర్మి స్థిరమనియే చెప్పవలెను. సదసద్విషయకమగు నేకజ్ఞాన మందు సదసత్సంబంధ మెట్లు విరుద్ధము కాదో యటులనే సదసద్రూపమగుఁ బూర్వాపరక్షణసంబంధ మేకవస్తువునందును విరుద్ధము గాదు.

మూ. క్రమేణానేకసంబన్ధ ఏకస్యానుపపన్న ఇతి చేన్న,
ఉపసర్పణప్రత్యయక్రమేణైవ తస్యాప్యుపపత్తేః.

తా. ధర్మి యస్థిరమగుటవలనఁ గ్రమికమగువస్తువునకుఁ బూర్వాపరసంబంధము విరుద్ధమని యాశంకింపరాదు. పూర్వాప రక్షణసంబంధమును గోచరించుప్రత్యయమునుబట్టియే పూ ర్వాపరక్షణసంబంధ మవిరుద్ధము.

మూ. ప్రత్యభిజ్ఞానమప్రమాణమితిచేదస్తి తావదతో
నిరూపణీయమ్, క్షణప్రత్యయస్తు భ్రాన్తోఽపి
నాస్తీతి విశేషః.

తా. "ఏనేను పూర్వక్షణమునందు ఘటమును జూచితినో యానే నిపుడు ఘటమును జూచితి"ననెడు ప్రత్యభిజ్ఞ యప్రమాణము గాన విరుద్ధధర్మములు గలవస్తువు గోచరించుటలో యది ప్రమాణమని యాశంకింపరాదు. ఆప్రత్యభిజ్ఞ యప్రామాణిక మైనచో నేవస్తువును సిద్ధించుటకు నవకాశము లేదు. ప్రమాణమైనచో స్థైర్యమే సిద్ధించును. క్షణికత్వసిద్ధికి సాధకమగు భ్రాంతి కూడ లేదు. ఇదియే విశేషము. ౧౫

మూ. స్యాదేతత్, మాభూదధ్యక్ష,మనుమానం వా
క్షణికత్వే, తథాపి సందేహోఽస్తు, ఏతావతాపి
సిద్ధం సమీహితం చార్వాకస్యేతి చేత్.

తా. క్షణికత్వలోఁ బ్రత్యక్షానుమానములు లేకపోయినను సందేహ ముండవచ్చును గాన దానిమూలముననే మాకు క్షణికత్వసిద్ధి యగునని చార్వాకునియాశయము.

మూ ఉచ్యతే.

తా. పై చార్వాకునియాశయము నిరాకరింపఁ బడుచున్నయది.

**శ్లో. స్థైర్యదృష్ట్యోర్న సందేహో న ప్రామాణ్యే విరోధతః,**
**ఏకతానిశ్చయో యేన క్షణే తేన స్థిరే మతః. ౧౬**

అర్థ. స్థైర్యదృష్ట్యోః - స్థైర్య తద్దర్శనములందు, న సందేహః = సందేహము లేదు. ప్రామాణ్యే = ప్రామాణ్యమాత్రమందుఁగాని ప్రత్యభిజ్ఞాన ప్రామాణ్యమందుగాని, విరోధతః= విరోధమువలన, న = సందేహము లేదు. యేన = ఏ విరుద్ధ ధర్మసంసర్గాభావముచే, క్షణే = క్షణమునందు, ఏకతా నిశ్చయః = ఏకత్వనిశ్చయమో, తేన = దానిచే, స్థిరే = స్థిరమునందు, ఏకతానిశ్చయః = ఏకత్వనిశ్చయము, మతః = ఇష్టము.

మూ. న హి స్థిరే, తద్దర్శనే, వా స్వరసవాహీ సందే
హః, ప్రత్యభిజ్ఞానస్య దురపహ్నవత్వాత్.

తా. "ఆఘటమే యీఘటమ"నియెడు ప్రత్యభిజ్ఞ యుండుటవలనను, ననువ్యవసాయమువలనను, స్థైర్యమునందుఁగాని, తద్దర్శనమునందుఁగాని సందేహము సంభవించుటకు నవకాశము లేదు. ప్రామాణ్యమాత్రమందుఁగాని, ప్రత్యభిజ్ఞాన ప్రామాణ్యమందుఁగాని సంశయము సంభవించదని చెప్పఁబడుచున్నది.

మూ. నాపి తత్ప్రామాణ్యే, స హి న తావత్సార్వ
త్రికః వ్యాఘాతాత్, తథా హి—ప్రామాణ్యా
సిద్ధౌ సందేహోఽపి న సిధ్యేత్. తత్సిద్ధౌ వా
తదపి సిద్ధ్యేత్, నిశ్చయస్య తదధీనత్వాత్,
కోటిద్వయస్య చాదృష్టస్యానుపస్థానే కస్సందే
హార్థః? తద్దర్శనే చ కథం సర్వథా తదసిద్ధిః?

ఏతేనాప్రామాణిక స్తద్వ్యవహార ఇతి నిరస్తమ్.
సర్వథా ప్రామాణ్యాసిద్ధౌ తస్యాప్యసిద్ధేః.

తా. ప్రామాణ్యమాత్రమందు సందేహ మున్నచో "సందేహ్మి" యను ననువ్యవసాయమందుఁగూడ ప్రామాణ్య సందేహముండునుగాన ప్రామాణ్యనిశ్చయము సంభవింపదు గాన సందేహము సిద్ధించదు.సందేహగ్రాహకజ్ఞానమందు ప్రామాణ్యము సిద్ధించినపుడే సందేహసిద్ధి యగును. సందేహగ్రాహక మందు ప్రామాణ్యము సిద్ధించినచో సందేహము గూడ సిద్ధించును. నిశ్చయస్య=ప్రామాణ్యనిశ్చయము,తదధీనత్వాత్,సందేహవ్యాపకముగాన వ్యాపకమైన ప్రామాణ్యనిశ్చయము లేనిచో వ్యాప్యసందేహసిద్ధి గాదని తాత్పర్యము. ప్రత్యభిజ్ఞయందు ప్రామాణ్య సంశయము గలుగవలయునన కోటిద్వయోపస్థితి యావశ్యకము కోటిద్వయము నిశ్చితముగానిచో సందేహమే సంభవించదు. ఇటులనే ప్రామాణ్యము సిద్ధించనిచో నప్రామాణ్యవ్యవహారముగూడ సంభవించదు.

మూ. ప్రకృతే ప్రామాణ్యసందేహో లూనపునర్జాత
కేశాదౌ వ్యభిచారదర్శనాదితి చేన్న, ఏకత్వనిశ్చ
యస్య త్వయాపీష్టత్వాత్. అనిష్టౌ వా న
కించిత్సిధ్యేత్.

తా. క్షౌరమును చేయించినపిదప మొలచిన వెండ్రుకల యందు వ్యభిచారప్రసక్తివలన స్థైర్యసాధకమగు ప్రత్యభిజ్ఞ యందుఁగూడ సందేహమని యాశంకింపరాదు. మీామతమునఁ గూడ వానియం దేకత్వనిశ్చయము నంగీకరింపవలయును. అట్లంగీకరింపనిచో క్షణికమగు నొకటియు లేక పోనయ్యెడిని.

మూ. సిధ్యతు యత్ర విరుద్ధధర్మవిరహ ఇతి చే, త్తే
నైవ స్థిరత్వమపి నిశ్చీయతే.

స ఇహ సందిహ్యేత ఇతి చేత్తుల్యమేతత్, క్వచి
న్నిశ్చయోఽపి కథంచిదితి చే,త్సమః సమాధిః.

తా. విరుద్ధ ధర్మ రాహిత్యమునుబట్టి క్షణికమునం దేక త్వమును నిశ్చయించినచో దానిచేతనే స్థైర్యము కూడ నిశ్చ యింపఁబడును.

విరుద్ధధర్మ రాహిత్యము సందిగ్ధమైనచో స్థైర్యసిద్ధి కా దనిన, నీపక్షమునఁ గూడ క్షణికత్వమునం దేకత్వము సంది గ్ధము కావలసివచ్చును.

విరుద్ధధర్మ రాహిత్య మెచట నిశ్చయింపఁ బడునో యచట క్షణమునం దేకత్వనిశ్చయ ముండుననిన, మామతము నందు స్థైర్యముఁగూడ నట్లే సిద్ధించును.

కావునఁ బరలోకసాధకము, నాత్మసమవేతము, నగు నదృష్ట మొకటియున్నదని యంగీకరించవలెను.

మూ. నన్వేతత్కారణత్వం యది స్వభావో భావస్య
నీలాదివ, త్తదా సర్వసాధారణం స్యాత్, న హి
నీలం కంచిత్ప్రత్యనీలమ్.

అథౌపాధికం, తదోపాధేరపి స్వాభావికత్వే
తథాత్వప్రసంగః ఔపాధికత్వేత్వనవస్థా.

అథాసాధారణత్వమప్యస్య స్వభావఏవ, తత

ఉత్పత్తేరారభ్య కుర్యాత్, స్థిరస్యైకస్వభావత్వాత్, ఇతి చేత్.

తా. భావమునకుఁ గారణత్వము నీలాదికమువలె స్వాభావిక మైనయెడల, నీలమందలుకు నీలమె యగునట్లు అన్నిటినిఁగూర్చియు భావము కారణము గావలసివచ్చును.

భావమునకుఁ గారణత్వ మౌపాధికం బనినచో నా యుపాధి, స్వాభావిక మైనయెడల వెనుకటిదోషమే సంభవించును. ఆయుపాధిసంబంధ ముపాధ్యంతరమువలన వచ్చుననినచో ననవస్థ ప్రసక్తమగును.

ఏ వస్తువునుఁగూర్చి యెద్దానికిఁ గారణత్వము స్వాభావికమో యద్దానినిఁగూర్చి యాభావమునకుఁ గారణత్వ మనిన, బీజమునకు బీజత్వమువలె, నంకురకారిత్వముఁగూడ నుత్పత్తి నుండియు రావలసివచ్చును.

కావునఁ గారణత్వము సాధారణమనిగాని యసాధారణమనిగాని చెప్పుట కవకాశము లేదు.

**మూ.** ఉచ్యతే.

తా. పై యాశంకకు సమాధాన మివ్వఁబడుచున్నది.

**శ్లో. హేతుశక్తిమనాదృత్య నీలాద్యపి న వస్తుసత్,**
**తద్వ్యక్తం తత్ర తచ్ఛక్తమితి సాధారణం న కిమ్. ౧౭**

అర్థ. హేతుశక్తిం = కారణత్వమును, అనాదృత్య= నిశ్చయించక, నీలాద్యపి = నీలాదికమును, వస్తుసత్ = పారమార్థికము, న= కాదు. అనఁగా ప్రామాణికముగాదు. తద్వ్యక్తం=

సహకారితోఁగూడిన, తత్ = ఆకారణము, తత్ర = ఆకార్య మందు, శక్తం=సమర్థమైనది. ఇతి=అనువ్యవహారము,సాధారణం నకిం=నీలాదికమందు, నీలత్వాదిజాతినిఁబట్టి నీలమను వ్యవహారమువలె, సహకారితోఁగూడిన కారణమందు కార్యత్వవ్యవహారముఁ గూడ సాధారణమని మాకు నిష్టమే.

మూ. సర్వసాధారణనీలాదివైధర్మ్యేణ కాల్పనికత్వం కార్యకారణభావస్య వ్యుత్పాదయితా, నీలాది, పారమార్థికమేవాభ్యుపగన్తవ్యమ్, అన్యథా, తద్వైధర్మ్యేణ హేతుఫలభావస్యాపారమార్థికత్వానుపపత్తేః. న చ కార్యకారణభావస్యాపారమార్థికత్వే నీలాదిపారమార్థికం భవితుమర్హతి, నిత్యత్వప్రసంగాత్, తస్మాదస్య పారమార్థికత్వేఽపరమపి తథా నవోభయమపీతి.

తా. సర్వసాధారణములగు నీలాదులయొక్క వైధర్మ్యముచేత, కార్యకారణభావమునకు నపారమార్థికత్వము నుపపాదించు చార్వాకుఁడు నీలాదికము పారమార్థికమని యంగీకరించవలెను. అట్లు కానిచో నద్దానియొక్క వైధర్మ్యముచేఁ గార్యకారణభావమునకు నపారమార్థికత్వముఁ జెప్పుట యనుపపన్నము కావలసివచ్చును.

కార్యకారణభావం బపారమార్థిక మైనచో, నీలాదికము పారమార్థికము కానేరదు. అయ్యది పారమార్థికమైన నిత్యము కావలసివచ్చును. అందువలన నీలాదికము పారమార్థిక మయ్యెనేని కార్యకారణభావము కూడ పారమార్థి

కమే. నీమతమునందు నిత్యమగునవే లేనందునను భయమున పారమార్థికమని చెప్పవలెను.

మూ కథమేకమనేకం పరస్పరవిరుద్ధం కార్యం కుర్యాత్ ? తత్స్వభావత్వాదితి యది, తదోత్పత్తే రారభ్య కుర్యాదవిశేషాదిత్యపి న యుక్తం, తత్తత్సహకారిసాచివ్యే తత్తత్కార్యం కరోతీతి స్వభావవ్యవస్థాపనాత్, ఇదం చ సాధారణమేవ, సర్వైరేవ తథోపలంభాత్, న హి నీలాదేరప్యన్యత్సాధారణ్యమితి.

తా. ఒకేవస్తువు పరస్పరవిరుద్ధములగు ననేక కార్యముల నెట్లుగాఁ జేయును ? దానియొక్క స్వభావమువలననే యనిన యెడల నావస్తువు ఉయుత్పత్తి మొదలుకొని కార్యమును గలుగజేయవలసివచ్చు నని యాశంకింపరాదు. సహకారి సమవధాన మున్నచోఁ దత్తత్కార్యమును పుట్టించుననెడి స్వభావవ్యవస్థాపనము నంగీకరించెదము. ఈవ్యవస్థితి యందఱికి నుపలభ్యమాన మగుటఁజేసి సాధారణమైనదే, నీలాదులకుఁ గూడ దీనికంటె విలక్షణమగు సాధారణ్యము లేదు.

మూ. స్యాదేతత్, అస్తు స్థిరం తథాపి నిత్యవిభోర్న కారణత్వముపపద్యతే. తథాహ్యన్వయవ్యతిరేకాభ్యాం కారణత్వమవధార్యతే, నాన్వయమాత్రేణ, అతిప్రసంగాత్. న చ నిత్యవిభూనాం వ్యతిరేకసంభవః.

తా. అదృష్ట మాత్మవృత్తియైనను ఆత్మ నిత్యము, విభువును, గాన అదృష్టమునుగూర్చి సమవాయికారణమని

చెప్పఁదగదు. అన్వయవ్యతిరేకములవలన, నేవస్తువునకైనఁ గారణత్వము సిద్ధించును గాని, యన్వయమాత్రమున సిద్ధించదు. ఈయాత్మ నిత్యమైనందున వ్యతిరేకము సంభవించదు.

మూ. న చ సోపాధేరసావస్త్వేవేతి సాంప్రతమ్.తథాభూతస్యోపాధిసంబన్ధేఽప్యనధికారాత్.

జనితో హి తేన స తస్య స్యాత్, నిత్యో వా ? న ప్రథమః, పూర్వవత్, నాపి ద్వితీయః పూర్వవదేవ. తథాపి చోపాధేరేవ వ్యతిరేకో, న తస్య, అవిశేషాత్.

తద్వాత ఇతి చేన్న. స చో,పాధి,శ్చేత్యతో ఽన్యస్య తద్వత్పదార్థస్యాభావాత్. భావే వా స ఏవ కారణం స్యాత్.

అత్రోచ్యతే.

తా. శరీరముతోఁ గూడుకొనినయాత్మకు వ్యతిరేకము సంభవించునే యని యాశంకింపరాదు.

నిత్యము విభువునగు నీయాత్మ, పుట్టినటువంటి శరీరసంబద్ధుఁడా? లేక నిత్యమగు నుపాధిసంబద్ధుఁడా? మొదటిపక్షమున నాత్మకు వ్యతిరేకము లేనందున నుపాధిజనకత్వము లేకపోవుట సమానము. రెండవపక్షమున నాత్మవలె నుపాధియు నిత్యమగుటవలన వ్యతిరేకము సంభవింపదు. శరీరవిశిష్టమునకు వ్యతిరేకము సంభవించుననుట కవకాశము లేదు. నిత్యావ్యాపకోపాధిపక్షములో నుపాధివిశిష్టమునకు వ్యతిరేకము సంభవించినను, నయ్యది, విశేషణమగు నుపాధికే

యగునుగాని శుద్ధమగు నాత్మకు సంభవింపదు. విశేషణవిశేష్యములకంటె నతిరిక్త మగువిశిష్టము లేదు గదా!

విశేషణవిశేష్యములకంటె నతిరిక్తమగు విశిష్ట మొకటి యున్నచో సద్దానికే కారణత్వము గాని నిత్యవిభు వగు నాత్మకుఁ గారణత్వము లేదను నాశంకకు సమాధానము చెప్పఁబడుచున్నది.

శ్లో. పూర్వభావో హి హేతుత్వం మీయతే యేన కేనచిత్,
వ్యాపకస్యాపి నిత్యస్య ధర్మిధీరన్యథా న హి. ౧౯

అర్థ. హేతుత్వం = కారణత్వము, పూర్వభావో హి=నియత పూర్వవృత్తిత్వరూపము గదా? వ్యాపకస్య=విభు వగు, నిత్యస్యాపి = నిత్యమునకున్ను, యేన కేన చిత్=ఏదో యొక హేతువుచే, హేతుత్వం=కారణత్వము, మీయతే=అను మేయించఁబడును. అన్యథా=అట్లు కానిచో, ధర్మిధీః=కార్యాశ్రయమగు ధర్మియొక్కజ్ఞానమే (ధర్మ్యనుమానమే) న హి= లేకపోయెడిని.

మూ. భవేదేవం యద్యన్వయవ్యతిరేకావేవ కారణత్వం, కింతు కార్యాన్నియతః పూర్వభావః. స చ క్వచిదన్వయవ్యతిరేకాభ్యామవసీయతే, క్వచిద్ధర్మిగ్రాహకాత్ప్రమాణాత్. అన్యథా కార్యాత్కారణానుమానం క్వాపి న స్యాత్. తేన తస్యానువిధానానుపలంభాత్. ఉపలంభే వా కార్యలింగానవకాశాత్, ప్రత్యక్షతఏవ తత్సిద్ధేః.

తా. అన్వయవ్యతిరేకములఁబట్టి కారణత్వముఁ జెప్పుటకు వీలులేదు. కారణత్వమనఁ గార్యముయొక్క యుత్పత్తి కంటెఁ బూర్వము నియతముగా నుండుట. ఇట్టికారణత్వము కొన్నిస్థలములం దన్వయవ్యతిరేకములనుబట్టి నిశ్చయింపఁబడును. కొన్నిస్థలములయందు ధర్మిసాధకమగు ననుమానము చేతనే నిశ్చయింపఁబడును. ఆత్మసిద్ధి బుద్ధ్యాదిరూపకార్యముచే నగును. "బుద్ధిః ససమవాయికారణికా, కార్యత్వే సతిగుణత్వా" త్తను ననుమానముచేతనే నాత్మకుఁ గారణత్వముగూడ సిద్ధించును. అన్నిస్థలములలోను గారణత్వం బన్వయ వ్యతిరేకములవలననే సిద్ధించుననినచోఁ గార్యకారణముల కంతటను నన్వయ వ్యతిరేకానువిధానము దృష్టము కానందునఁ గార్యమువలన కారణానుమానము లేకపో నయ్యోడిని. ఒకవేళ దృష్టమయ్యెనేని ప్రత్యక్షమువలననే కారణత్వము సిద్ధించనందునఁ గార్యలింగకమగు ననుమానమునకే యవసరము లేకపోవలసి వచ్చును.

తజ్జాతీయానువిధానదర్శనాత్సిద్ధిరన్యత్రాపి న వార్యతే.తథాపి కోష్ఠగత్యానువిహితాన్వయ వ్యతిరేకమేవ కార్యాత్కారణం సిద్ధ్యేత్. అన్యత్ర తథాదర్శనాదితి చేత్ న.

బాధేన సంకోచాత్, విపక్షే బాధకాభావేన చావ్యాప్తేః, దర్శనమాత్రేణ చోత్కర్ష సమత్వాత్. అస్య చేశ్వరే విస్తరో వక్ష్యతే.

సర్వవ్యాపకానాం సర్వాన్ప్రిత్యన్వయమాత్రా విశేషే కారణత్వప్రసంగో బాధకమితి చేన్న,

అన్వయవ్యతిరేకవజ్జాతీయతయా, విపక్షే బాధకేన చ విశేషే అనతిప్రసంగాత్.

వ్యా. నిత్యవిభుస్థలే అన్వయవ్యతిరేకాऽదర్శనేన కథం కారణత్వగ్రహ ఇత్యాశంకాయామాహ. తజ్జాతీయానువిధానేతి.అయం భావః:-జ్ఞానాద్యన్వయవ్యతిరేకాదర్శనేऽపి జ్ఞానసజాతీయరూపాద్యన్వయవ్యతిరేకశాలిఘటాదిజాతీయత్వదర్శనాత్కారణత్వసిద్ధిరితి. అన్యత్ర వ్యక్తేరన్వయవ్యతిరేకదర్శనేనైవ కారణత్వధీరితి నిత్యనిభుస్థలేऽపి తథైవ భవితవ్యమిత్యాశంకతే తథాపీతి. తన్నిరస్యతి, న బాధేనేతి. నిత్యవిభోర్ధర్మిగ్రాహకమానేన కారణత్వగ్రహాత్, అన్వయవ్యతిరేకశూన్యత్వేనాకారణత్వానుమానే బాధోऽస్మిన్నితపక్షేతరత్వోపాధితస్సాధ్యసాధకయోర్వ్యాప్తిభాధేనేత్యర్థః. సంకోచాదితి, నిత్యవిభువ్యతిరిక్తస్థల ఏవాన్వయవ్యతిరేకయోః కారణత్వప్రయోజకత్వాదితి భావః. విపక్షే బాధకాభావేన చేతి, అకారణత్వానుమానే అప్రయోజకత్వశంకాబాధకతర్కాభావేన చేత్యర్థః. న చాన్వయ వ్యతిరేకశూన్యత్వమస్తు అకారణత్వంమాస్త్వితి శంకాయాః కారణత్వే అన్వయవ్యతిరేకశాలిత్వవ్యభిచారశంకారూపత్వేన తద్బాధకః కారణత్వం యద్యన్వయవ్యతిరేకశాలిత్వవ్యభిచారి స్యాత్ తదా తత్ప్రయోజ్యం న స్యాదితి తర్కో అస్త్వేవేతి వాచ్యం. అన్వయమాత్రాపేక్షయా అన్వయవ్యతిరేకశాలిత్వస్య గురుతయా కారణత్వాప్రయోజకత్వేన నిరుక్త తర్కస్యేష్టాపత్తిదూషితత్వాత్. అగురోరన్వయమా

త్రస్య కారణతాప్రయోజకత్వే బాధకసద్భావాద్గురోరప్య న్వయవ్యతిరేకశాలిత్వస్య కారణతాప్రయోజకత్వేన అన్వయ వ్యతిరేకశాలిత్వాపాదకతర్కే నేష్టాపత్తిదూషిత ఇతి సూచ యితుమన్వయమాత్రస్య కారణత్వప్రయోజకత్వే అతిప్రసంగం బాధకమాహ సర్వవ్యాపకానామితి.

తా. పటమునుఁగూర్చి తంతువులకును, ఘటమునుగూర్చి కపాలములకును హేతుత్వము దృశ్యమాన మగుటవలన "దేని యొక్క విశేషమునకు దేనియొక్క విశేషములో హేతుత్వమో తత్సామాన్యమునకుఁ దత్సామాన్యములో హేతుత్వ" మను న్యాయమువలన సమవేతకార్య సామాన్యములో ద్రవ్య సామాన్యమునకు హేతుత్వము సిద్ధించును. దీనినిఁబట్టి సమ వేతమగు బుద్ధ్యాదికమునకు నాత్మాది కారణకత్వము సిద్ధించును.

గృహీతాన్వయవ్యతిరేకములు గల కారణవ్యక్తియే కార్యమువలన సిద్ధించును గాన నగృహీతాన్వయవ్యతిరేక ములు గలయాత్మ జ్ఞానాదికార్యముచే నెట్లు సిద్ధించును? మరియు "ఆత్మా అకారణం అన్వయవ్యతిరేకశూన్యత్వాత్," అను ననుమానముచే నాత్మకు అకారణత్వముగూడ సిద్ధించు నని యాశంకింపరాదు.

అన్వయవ్యతిరేకశూన్యత్వముచే నాత్మయం దకారణ త్వము నను మేయించుటలో వ్యభిచారశంకను నివర్తింపఁజేయు ననుకూలతర్కము లేనందున అకారణత్వమునకును, అన్వయ వ్యతిరేకశూన్యత్వమునకును, వ్యాప్తి సిద్ధిగానేరదు. కాన నిత్య విభువుకంటె నతిరిక్తమగుస్థలమునందే అన్వయవ్యతిరేకములకు

కారణత్వప్రయోజకత్వమని తాత్పర్యము. మరియొకటి, అకార ణత్వానుమానములో పక్షేతరత్వరూపమగు నుపాధిఁగూడ నుండును.

దృష్టాంతమగు ఘటరూపాదికమందు అన్వయవ్యతిరేక ములు గృహీత మైనందున, గృహీతాన్వయవ్యతిరేకములు లేని యాత్మకారణము కాదని చెప్పినచో నీశ్వరునికి జగ త్కారణత్వమే సిద్ధించక పోవలసివచ్చును

సర్వవ్యాపకమైన యాత్మకు వ్యతిరేకము లేక యన్వయమాత్రమునుబట్టియే, కారణత్వముఁ జెప్పినచో నట్టి యాత్మయొక్క యన్వయము సర్వకార్యములయందును నుం డుటవలన సర్వకార్యకారణత్వము రావలసివచ్చును. కాన అన్వయమునకువలె వ్యతిరేకమునకుఁగూడ కారణతాప్రయోజ కత్వముఁ జెప్పవలెనని యాశంకింపవలదు. రూపాదికార్య మును గూర్చి యన్వయవ్యతిరేకశాలి యగు ఘటాదిరూప మగు సమవాయికారణము దృష్టము. అటులనే జ్ఞానాదిక మునుగూర్చి సమవాయికారణజాతీయ మగుటవలన నాత్మకే కారణత్వము. ఆత్మయొక్క యన్వయమువలె ఆకాశ, కాల, దిక్కులయొక్క యన్వయముఁగూడ సర్వత్ర యుండుటవలన జ్ఞానాదులలో నవియు సమవాయికారణ మేల గాఁగూడదు ? జ్ఞానము ఆకాశగుణమైనచో శబ్దమువలె జ్ఞానముఁగూడ శ్రోత్రగ్రాహ్యము గావలసివచ్చును. కాన జ్ఞానసమవాయి కారణ మాకాశ మనరాదు.

దిక్కాలములు విశేషగుణమునకు ఆశ్రయము గానం దున అవియును సమవాయికారణమని జెప్పఁదగవు. "జ్ఞానము,

రూపమువలె కార్యగుణమగుటవలన సమవాయికారణముఁ గలది” యను ననుమాన మున్నందున, ఆత్మకంటె నితరమైన వానికి జ్ఞానాదిసమవాయికారణత్వము బాధితము. గాన యాత్మయే సమవాయి కారణమని జెప్పవలెను.

మూ. తథా హి, కార్యం సమవాయికారణవద్దృష్ట మిత్యదృష్టాశ్రయమపి తజ్జాతీయకారణకం, ఆశ్రయాభావే కిం ప్రత్యాసన్నమసమవాయికారణం స్యాత్; తదభావే నిమిత్తమపి కిముపకుర్యాత్? తథా చానుత్పత్తిః సతతోత్పత్తిర్వా సర్వత్రోత్పత్తిర్వా స్యాత్. ఏవమపి నిమిత్తస్య సామర్థ్యాదేవ నియతదేశోత్పాదే సఏవ దేశో ఽవశ్యాపేక్షణీయః స్యాత్. తథా చ సామాన్యతో దేశసిద్ధా ఇతరపృథివ్యాదిబాధే తదతిరిక్తసిద్ధిం కో వారయేత్? ఏవమసమవాయినిమిత్తే చోహనీయే.

తా. దృష్టమగు ఘటాద్యాశ్రయముగల రూపాదికము సమవాయికారణము గలదిగాఁ జూడఁబడుచున్నందున, నదృష్టమగు నాశ్రయముగల జ్ఞానాదికార్యముగూడ [illegible] కారణముగలదియే యగునని యనుమేయిం[illegible] సమవాయికారణమే లేనిచో నసమవాయికార[illegible]త్రమెట్లు సిద్ధించును? సమవాయికారణమున, సమ[illegible]గున ద్ర[illegible] యసమవాయికారణమనఁబడును? మఱియ[illegible] నవి లేనిచో నిమిత్తము జేయు నుపకారమేమి? కాఁబట్టి జ్ఞా[illegible]కార్యమును

గూర్చియు పై మూడుకారణముల నంగీకరింపవలెను. అట్లంగీక రింపనిచో కార్యమున కనుత్పత్తిగాని, యెల్లప్పుడు నుత్పత్తి గాని, అన్నిటియందు నుత్పత్తిగాని రావలసివచ్చును.

సమవాయికారణము లేకున్నను నిమిత్తకారణమువల ననే నియతదేశమం దుత్పత్తి సంభవించుననినచో కార్యోత్పత్తి కాశ్రయ మగుదేశము నంగీకరింపవలెను. ఆదేశమే సమ వాయికారణము. జ్ఞానము పృథివ్యాద్యష్టద్రవ్యములయందును బాధితమగుటవలన వానికంటె నతిరిక్తమగు ద్రవ్యమందుండు నని యంగీకరింపవలెను. ఆద్రవ్యమే—జ్ఞానాదిసమవాయికారణ మగునాత్మ. అసమవాయికారణ నిమిత్తకారణములు లేనిచో కార్యముఁ బుట్టనందున వానినిఁగూడ నిట్లె యంగీకరింపవల యును.

అన్వయమువలె, ఆత్మకు వ్యతిరేకముఁగూడ సంభవింప వచ్చును. ఎట్లనిన: ఇతరసంబంధముచే కారణముయొక్క వ్యతి రేక మప్రయోజక మగుటచేఁ, గార్యమునుగూర్చి యేసంబం ధముచే నేది కారణమో కార్యముయొక్క యభావమును గూర్చి యాసంబంధముచే నాకారణముయొక్క యభావము ప్రయోజకము. ప్రకృతమున అదృష్టాదికార్యమునుగూర్చి ఆత్మ తాదాత్మ్యసంబంధముచే కారణ మగుటవలన తాదాత్మ్య సంబంధముచే నాత్మయొక్క వ్యతిరేకము(భేదము) ప్రసిద్ధము. గాన కారణతాప్రయోజకమగు నన్వయవ్యతిరేకశాలిత్వ మాత్మకున్నందున నదృష్టాదికారణత్వము సిద్ధించును.

శ్లో॥ ఇత్యేషా సహకారిశక్తిరసమా
మాయా దురున్నీతితో

**మూలత్వాత్ప్రకృతిః ప్రబోధభయతో**
**ఽవిద్యేతి యస్యోదితా**
**దేవోఽసౌ విరత ప్రపంచరచనా**
**కల్లోలకోలాహలః**
**సాక్షాత్సాక్షితయా మనస్యభిరతిం**
**బధ్నాతు శాన్తో మమ.** ౧౯

అర్థ. యస్య = ఎవనియొక్క, ఏషా = ఈ, సహకారి శక్తిః = అదృష్టరూపమగు సహకారికారణము, దురున్నీతితః= ఊహింప నలవికానిదగుటవలన, అసమామాయా = సాటిలేని మాయయనియు, మూలత్వాత్ = ప్రపంచ మూలకారణ మగుటవలన, ప్రకృతిః = ప్రకృతియనియు, ప్రబోధభయతః= తత్వజ్ఞానమువలన నశించునదగుటచే, అవిద్యయనియు - ఉదితా = చెప్పఁబడినదో, విరతప్రపంచరచనాకల్లోలకోలాహలః, విరత = విరమించిన, ప్రపంచరచనా, ప్రపంచముయొక్క రచనయనె- కల్లోల = తరంగములయొక్క, కోలాహలః = కోలాహలము కలిగినట్టియు, శాంతః=శాంతుఁడైనట్టియు (దోషరహితుఁడైన), అసౌదేవః=ఈదేవుఁడు, మమ=నాయొక్క,మనసి=మనస్సునందు, అభిరతిం=తనను గోచరించిన నిశ్చయసంతతిని, సాక్షాత్ =ప్రత్యక్షముగా, సాక్షితయాభవన్=సాక్షిగానుండి, బధ్నాతు=దృఢముగాఁ జేయుగాక.

తా. పరమేశ్వరుఁడు అదృష్టమును సహకారిగాఁ గొని, నాకు తననుఁ గోచరించిన నిశ్చయసంతతిని నాకుఁ గలుగఁ జేయుగాత! యని ప్రార్థనఁ జేయుచున్నాఁడు.

పరమేశ్వరుఁడు స్వతంత్రముగానే తనయిచ్ఛానుసారముగనే ఉత్తమమధ్యమాధమరూప మగుప్రపంచమును సృష్టించెననిన పరమేశ్వరునికి వైషమ్యమును, నైర్ఘృణ్యమున్నూ ప్రసక్తమగును. అదృష్టమును సహకారిగాఁ జేసికొని తదనుసారముగా సృజించెననిన నట్టిదోషము ప్రసక్తము గానేరదు. జీవులయొక్క అదృష్టానుసారముగా పరమేశ్వరుఁడు ఫలప్రదుఁడు యని చెప్పఁబడెను.

మతాంతరమందు మాయ యెటుల విచారసాధ్యము గాదో అదృష్టముగూడ నట్టిదే యగుటచే మాయయనియు, సాంఖ్యమతమందు ప్రకృతి యెటుల సర్వమునుఁగూర్చి కారణమో అట్లే అదృష్టముగూడ సర్వకార్యములను గూర్చి కారణ మగుటవలన ప్రకృతియనియు జెప్పనగును.

తత్త్వజ్ఞానమువలన మిథ్యాజ్ఞానము నశించును. మిథ్యాజ్ఞానము, నశించినచో క్రమముగా దుఃఖము నశించును. దుఃఖనివృత్తియే మోక్షము. కాన దుఃఖనివృత్తిరూప మోక్షసాధకమైన తత్త్వజ్ఞానమునుఁ గలుగఁజేయుమని శ్లోకతాత్పర్యము.

మొదటిస్తబకముయొక్క ఆంధ్రతాత్పర్య
వివరణము సమాప్తము.



శ్రీరామాయ నమః.

# ద్వితీయస్తబకము

మూ. తదేవం సామాన్యతః సిద్ధే అలౌకికే హేతౌ తత్సాధనేనావశ్యంభవితవ్యం. న చ తచ్ఛక్యమస్మదాదిభిర్ద్రష్టుమ్. న చాదృష్టేన వ్యవహారః. తతో లోకోత్తరః సర్వానుభావీ సమ్భావ్యతే.

తా. ఈ స్తబకమున రెండవవిప్రతిపత్తి యుపన్యసింపఁబడి నిరాకరింపఁబడును.

ప్రథమస్తబకమునఁ బరలోకసాధనమగు నదృష్టమును, నద్దానిఁ గనుఁగొనినవానినిగా నీశ్వరుఁడును, సాధింపఁబడెను. అదృష్టము జన్యము. దానికిఁ గారణము జ్యోతిష్టోమాదికము. జ్యోతిష్టోమాదికమునకుఁగల నదృష్టసాధనత్వము, కించిద్జ్ఞులమగుమనకు ప్రత్యక్షము కాదు. మనకు ప్రత్యక్షము కానంతమాత్రమున, జ్యోతిష్టోమాదికమునకదృష్టసాధనత్వము లేదనుట సరిగాదు. అట్టియెడ, జ్యోతిష్టోమమునకు స్వర్గసాధనత్వమును బోధించు, "జ్యోతిష్టోమేన, స్వర్గకామో యజేత" యను వేదవ్యవహారమునకు లోపము వాటిల్లును. కాఁబట్టి అట్టి యలౌకికార్థములనుఁ గనుఁగొనిన, లోకోత్తరుఁడును సర్వజ్ఞుఁడు నగు పరమేశ్వరుఁ డుండెనని యంగీకరింపవలెను.

వేదవాక్యమునఁగల్గు నర్థజ్ఞానమునఁ బ్రామాణ్యనిశ్చయ ముండినపుడే వేదచోదితము లగు కర్మలందు ప్రవృత్తి కల్గును. వక్తకుండు యథార్థజ్ఞానమునుబట్టి, తదుచ్చరితవాక్య ములఁగల్గు శాబ్దబోధయందు ప్రామాణ్యము నిశ్చయింపఁ బడును. అందఱకును యాగాదులందు ప్రవృత్తి కల్గుచుండుటం జేసి, వారలకు వేదవాక్యమునఁగల్గినశాబ్దజ్ఞానమునఁ బ్రామాణ్య నిశ్చయముండెననియే చెప్పవలెను. అట్టి ప్రామాణ్యనిశ్చయ మున నపేక్షింపఁబడు యథార్థజ్ఞానరూపగుణమున కీశ్వరుఁడే ఆశ్రయమగుచున్నాఁడు.

మూ. నను నిత్యనిర్దోష వేదద్వారకో యోగకర్మసిద్ధ
సర్వజ్ఞద్వారకో వా ధర్మసమ్ప్రదాయః స్యాత్,
కిం పరమేశ్వరకల్పనయేతి చేత్.

తా. "వక్తకు భ్రమ ప్రమాదము విప్రలంభము మున్నగుదోషములు సంభవింపవచ్చును. వక్తయందలి ప్రామాణ్యము సంశయింపఁబడినచో తదుక్తవాక్యములఁ బ్రామాణ్యము గూడ సంశయగ్రస్త మగును. కాఁగా, తచ్చోదితకర్మ లందు అందఱకును ప్రవృత్తి గలుగక పోవలసివచ్చును. వేదమున కట్టిది రాకుండుటకై, వేద మొకనిచే రచియింపఁ బడినది కాదనియు, నయ్యది నిత్యమనియు, దానంజేసియే స్వతః ప్రమాణ మగుచున్నదనియు, చెప్పుదుము. ఇట్లు స్వతః ప్రమాణమగు వేదమూలముననే, ధర్మసమ్ప్రదాయము ఉప పన్న మగుచున్నందున, తత్ప్రవర్తకునిగా నీశ్వరు నంగీకరింపఁ బనిలేదు."అని మీమాంసకులును;"వేద మొకనిచే రచియింపఁ బడిన దనువాదము సరియైనను, యోగ, కర్మలచే సిద్ధులగు

కపిలాదులమూలముననే ధర్మసమ్ప్రదాయము సిద్ధించుటం జేసి, తత్ప్రవర్తకునిగా నీశ్వరు నంగీకరింపఁ బనిలేద”ని సాంఖ్యులును అనుచున్నారు. కాని వారివాదములు యుక్తిసహములు కావు. ఎట్లన,

మూ. అత్రోచ్యతే:—

శ్లో. ప్రమాయాః పరతన్త్రత్వాత్ సర్గప్రళయసమ్భవాత్,
తదన్యస్మిన్ననాశ్వాసాత్ నవిధాన్తర సమ్భవః. ౧

తా. వేదజన్యమగు ప్రమ, వక్తయొక్క యథార్థజ్ఞానమను గుణజన్యమగుటం జేసియు, సృష్టి ప్రళయము లుండుటం జేసియు, యోగకర్మసిద్ధులైనను కపిలాదులందు విశ్వాసము లేమిం జేసియు, వేఱొకరీతిని ధర్మసమ్ప్రదాయము సిద్ధింపమిం జేసియుఁ, దప్పక నీశ్వరు నంగీకరింపవలయును.

మూ. తథాహి:—ప్రమా జ్ఞానహేత్వతిరిక్తహేత్వధీనా, కార్యత్వే సతి, తద్విశేషత్వాత్, అప్రమావత్. యదిచ తావన్మాత్రాధీనా భవేద ప్రమాఽపి ప్రమైవభవేత్. అస్తి హి తత్ర జ్ఞానహేతుః, అన్యథా జ్ఞానమపి సానస్యాత్.

తా. అప్రమవలె ప్రమ గూడ కార్యమును, జ్ఞానవిశేషము, నగుటం జేసి, జ్ఞానసామాన్యమునుగూర్చి కారణము లగు నాత్మ, మనసు, ఆత్మమనస్సంయోగములకంటె వేఱగు నొక కారణమునఁ బుట్టినదని చెప్పవలయును గదా! ఆకారణమే వక్తృయథార్థజ్ఞానము. ప్రమ జ్ఞానసామాన్యసామగ్రి

మాత్రముననే గల్గునన్నచో నట్టిసామగ్రి యప్రమాస్థల మునఁగూడ నుండుటంజేసి యప్రమకూడ ప్రమ యయ్యెడిని. అప్రమాస్థలమున నట్టిసామగ్రి లేదందువా! అట్టియెడ నప్రమ జ్ఞానమే గాకపోయెడిని.

మూ. జ్ఞానత్వే వ్యతిరిక్తదోషానుప్రవేశాదప్రమేతి చేత్. ఏవం తర్హి దోషాభావమధిక మాసాద్య ప్రమాపి జాయేత, నియమేన తదపేక్షణాత్.

తా. అప్రమ జ్ఞానసామాన్యసామగ్రీ జన్యమగుటచే, జ్ఞానమైనను, ప్రమాస్థల సాధారణముగాని దోషవశమునఁ బుట్టినదగుటం జేసి, ప్రమ కానేర దందువా! అట్టియెడ, అప్రమాస్థలమున దోషమువలె ప్రమాస్థలమున దోషభావముఁగూడ నియతమగుటం జేసి, ప్రమ, దోషాభావా ధీనముఁగూడ కావలసివచ్చెడిని.

మూ. అస్తు దోషాభావోఽధికో భావస్తు నేష్యతే ఇతి చేత్. భవేదప్యేవం, యది నియమేన దోషై ర్భావరూపైరేవ భవితవ్యం, నత్వేవం. విశేషా దర్శనాదేరభావస్యాపి దోషత్వాత్. కథ మన్యథా తతః సంశయవిపర్యయౌ. తతస్తద భావోభావ ఏవేతి కథం సనేష్యతే.

తా. ప్రమనుగూర్చి భావమునకుఁ గారణత్వము నంగీ కరింపని మాకు, ప్రమ, దోషాభావ మాత్రాధీనమగుట యభిమ తమే యనుటకు వలనుపడదు. భ్రమవిశేష మగుసంశయ మును, విపర్యయమును, విశేషాదర్శనమువలన జనించుటంజేసి, యభావమగు విశేషాదర్శనముఁగూడ దోషమగుట నిర్వివా

దము. అభావాభావము భావరూపమే యగుటంజేసి, అభావమగు విశేషాదర్శనరూపదోషముయొక్క యభావము భావమే యగును. కాఁగా ప్రమనుగూర్చి దోషాభావమునకే కారణత్వము నంగీకరించునట్టి నీవు భావమునకుఁగూడ కారణత్వము నంగీకరించినట్లే యగును.

మూ. స్యాదేతత్, శబ్దే తావద్విప్రలిప్సాదయో
భావా ఏవ దోషాః. తతస్తదభావే స్వత ఏవ
శాబ్దీప్రమేతి చేన్న.

తా. ప్రత్యక్షాదిప్రమలకు గుణజన్యత్వము నంగీకరించినను, వేదస్థలమున విప్రలిప్సాదిదోషముల యభావముననే శాబ్దప్రమ యుత్పన్నమగుటం జేసి, వక్తయొక్క యథార్థజ్ఞానరూపమగు గుణ మపేక్షింపఁబడదని చెప్పుటకు వలనుపడదు.

మూ. అనుమానాదౌ లిఙ్గవిపర్యాసాదీనాం భావానా
మపి దోషత్వే తదభావమాత్రేణ ప్రమా
నుత్పత్తేః.

తా. అనుమితి ఉపమితి మున్నగువానికారణము నియతముగా భావరూప మగుటచే, గుణము లేకున్నను, లింగవిపర్యాసాదిదోషముల యభావమాత్రమునఁ బ్రమాత్మకమగు ననుమిత్యాదులు కలుగవలసి వచ్చెడిని. ప్రమావిశేషములగు ప్రత్యక్షానుమిత్యాదులఁ గూర్చి గుణము కారణమగుటం జేసి, యట్టి శాబ్దప్రమనుగూర్చియు, భావమైన గుణమే కారణమని చెప్పనగును.

మూ. అన్యత్ర యథాతథాస్తు, శబ్దే తు విప్రలిప్సా
ద్యభావే వక్తృగుణాపేక్షా నాస్తీతి చేన్న.

తా. ప్రమాస్థలమున గుణములసన్నిధి దోషోత్సారణ ప్రయుక్తమనిన, నప్రమాస్థలమునఁగూడ దోషములసన్నిధి గుణోత్సారణప్రయుక్తమని చెప్ప వీలగును గదా !

మూ. నిస్స్వభావత్వమేవమపౌరుషేయస్య వేదస్య
స్యాదితిచే దాత్మాన ముపాలభస్వ.

తా. వేదస్థలమున గుణదోషములు లేనందున నపౌరుషేయమగు వేదమునకు నిస్స్వభావత్వప్రసంగము వచ్చునని నీవు నిన్నే నిందించుకొనుము

మూ. తస్మాద్యథా ద్వేష రాగాఽభావాఽవినాఽభ వే
ఽపి రాగ ద్వేష యోరనువిధాననియమాత్ ప్ర
వృత్తినివృత్తిప్రయత్నయో రాగద్వేష కారణ
కత్వం,న తు నివృత్తిప్రయత్నో ద్వేష హేతుకః,
ప్రవృత్తిప్రయత్నస్తు సత్యపి రాగానువిధానే
ద్వేషాఽభావ హేతుక ఇతి విభాగో యుజ్యతే,
విశేషాఽభావాత్, తథా ప్రకృతేఽపి.

తా. రాగమున్నపుడు ద్వేషాభావమున్నను ప్రవృత్తి రూపమగు ప్రయత్నమునుగూర్చి రాగమే కారణము కాని ద్వేషాభావము కాదు. ద్వేషమున్నపుడు రాగాభావమున్నను నివృత్తిరూపమగు ప్రయత్నమునుగూర్చి ద్వేషమే కారణము కాని రాగాభావముకాదు. అను విభాగమున్నటులనే దోషనివృత్తియున్నను ప్రమలో గుణమే కారణముగాని దోషాభావము కారణము కాదని యిచ్చటఁ గూడ నంగీకరింపవలయును.

మూ. తథాపి వేదానామపౌరుషేయత్వే సిద్ధే అపేత వక్తృదోషత్వాదేవ ప్రామాణ్యం సేత్స్యతి, తతః సిద్ధే ప్రామాణ్యే గుణాభావేఽపి తదితి దోషాభావ ఏవ హేతురకారణం గుణా ఇతి చేన్న, అపేతవక్తృగుణత్వేన సత్ప్రతిపక్షత్వ ప్రసంగాత్ స్వతఏవ ప్రామాణ్యానిశ్చయః, కింతు శంకామాత్రమనేనాపనీయతే, దోషనిబంధన త్వాత్తస్య తదభావేఽభావాత్, అతో వేద మనుమానవ త్సత్ప్రతిసాధనీకర్తుముచితమితి చేన్న. గుణనివృత్తినిబంధనాయాశ్శంకాయా స్సులభత్వాత్. తస్యాః కేవలాయా అప్రా మాణ్యం ప్రత్యనంగత్వాన్న శంకేతి చేత్, దోషనివృత్తేరపి కేవలాయాః ప్రామాణ్యం ప్రత్యనంగత్వాన్నతయా శంకానివృత్తిరితి తుల్యమితి.

తా. "అపేతవక్తృదోషమగుటచే వేదము ప్రమాణ" మనెడి యనుమానమువలన దోషాభావమే ప్రామాణ్యమును గూర్చి కారణముగాని గుణము కారణము కానేరదనిన "నపేతవక్తృగుణ మగుటవలన వేదమప్రమాణ" మనెడు ప్రతిపక్షానుమానముచే నప్రామాణ్యము గూడ సిద్ధింపవలసి వచ్చును. వేదము నిత్యమగుటవలననే స్వతఃప్రమాణము. దోషనివృత్తి యప్రామాణ్యశంకనుమాత్రము దొలఁగించును. కాన సత్ప్రతిపక్షశంకకు వీలులేదనరాదు. దోషనివృత్తివలన దోషనిబంధనమగు శంక నివర్తించినను గుణాభావ నిబంధన

మగు నప్రామాణ్య శంక యుండుటచే కేవలగుణాభావ మప్రమను గూర్చి కారణము కానందున గుణాభావనిబంధనమగు శంక కవకాశము లేదనినచో గుణరహితంబగు దోషనివృత్తియుఁ బ్రమనుగూర్చి కారణము కానందున నప్రామాణ్యశంక నివర్తింపదని చెప్పవలసివచ్చును. కావున దోషసహితమగు గుణనివృత్తి యప్రమనుగూర్చి కారణమగునటుల గుణసహితమగు దోషనివృత్తి ప్రమలోఁ గారణమని చెప్పుట యుచిత మయినందున వేదవాక్యజన్యశాబ్దప్రమ గుణజన్యమనియు, నాగుణమున కాశ్రయుఁ డీశ్వరుఁడనియుఁ దప్పక నంగీకరింపవలయును.

మూ. ఏవం ప్రామాణ్యం పరతో జ్ఞాయతే, అనభ్యాస దశాయాం సాంశయికత్వాత్, అప్రామాణ్య వత్. యది తు స్వతో జ్ఞాయేత, కదాచిదపి ప్రామాణ్యసంశయో న స్యాత్, జ్ఞానత్వసంశయ వత్. నిశ్చితే తదనవకాశాత్. న హి సాధక బాధకప్రమాణాఽభావమవధూయ సమాన ధర్మాదిదర్శనాదేవాసౌ, తథా సతి, తదనుచ్ఛేద ప్రసంగాత్.

తా. వేదజన్యజ్ఞానమునందుఁ బ్రామాణ్య మనుమానాదికముచే గ్రహింపఁబడునని చెప్పవలయును గాని స్వతోగ్రాహ్యమని చెప్పుటకు వలనుపడదు. స్వతోగ్రాహ్యమేయగుననిన జ్ఞానగ్రహముచేతనే జ్ఞానగతప్రామాణ్యము గూడ నిశ్చితమగును గాన జ్ఞానత్వసంశయమువలెఁ బ్రామాణ్యసంశయమును లేకపోవలసివచ్చును. కేవలసమానధర్మదర్శనమువలననే సంశ

యము కలుగునని చెప్పుటకు వలనుపడదు. సాధకప్రమాణము గాని, బాధకప్రమాణముగాని లేనిసమయమున కేవలసమాన ధర్మదర్శనమున్నను సంశయము కలుగదు. కేవలసమానధర్మ దర్శనమువలననే సంశయము కలుగుననినయెడల, నెల్లపుడును సంశయమే యుండవలసివచ్చును. కావున ప్రామాణ్యముస్వతో గ్రాహ్యమని చెప్పుటకు వీలులేదు.

మూ. అథ ప్రామాణ్యావదప్రామాణ్యేఽపి తత్ప్రత్యయ దర్శనాద్విశేషాఽదర్శనాద్భవతి శంకేత్యభి ప్రాయః, తత్కిం ప్రమాణజ్ఞానోపలంభేఽపి న తత్ప్రామాణ్యముపలబ్ధం, ప్రమాణజ్ఞానమేవ వా నోపలబ్ధమ్? ఆద్యే కథం స్వతః ప్రామాణ్య గ్రహః, ప్రత్యయప్రతీతావపి తదప్రతీతేః. ద్వి తీయే కథం తత్ర శంకా? ధర్మిణ ఏవానుప లబ్ధేరితి. యదపి ఝడితిప్రచురతరసమర్థప్రవృ త్త్యన్యథానుపపత్త్యా స్వతఃప్రామాణ్యముచ్యతే తదపి నాస్తి.

తా. జ్ఞానత్వాదిరూపసమానధర్మదర్శన మున్నపుడు ప్రామాణ్యజ్ఞాన ముండినను "ఇది ప్రమాణమే" యను నవధార ణాత్మకమగు నిశ్చయము లేనందున నీనిశ్చయాభావాత్మక విశేషాదర్శనరూపదోషమువలనఁ బ్రామాణ్యశంక కలుగవచ్చు నని శంకించరాదు. పూర్వమందు ప్రామాణ్యజ్ఞాన ముపలబ్ధ మైనపుడు ప్రామాణ్య ముపలబ్ధము కాదనియా? ప్రామాణ్య జ్ఞానమే యుపలబ్ధము కాదనియా? ప్రామాణ్య ముపలబ్ధము

కాదనినచో, స్వతోగ్రాహ్యమని చెప్పుటయే కుదరదు. రెండవ పక్షమున ధర్మి యుపలబ్ధము కానందున దానియందు ప్రామాణ్య సంశయ మనుపపన్నము. ప్రచురతరమును సఫలమునగు ప్రవృత్తియొక్క యుపపత్తికై ప్రామాణ్యము స్వతోగ్రాహ్యమగుననుటకును వీలులేదు.

మూ. అన్యథైవోపపత్తేః. ఝడితి ప్రవృత్తిర్హి ఝడితి తత్కారణోప నిపాతమంతరేణానుపపద్యమానా తమాక్షిపేత్. ప్రచుర ప్రవృత్తిరపి స్వకారణ ప్రాచుర్యం, ఇచ్ఛా చ ప్రవృత్తేః కారణమ్, తత్కారణమపీష్టాభ్యుపాయతాజ్ఞానమ్, తదపి తజ్జాతీయత్వలింగానుభవప్రభవమ్, సోఽపీంద్రియసన్నికర్షాదిజన్మా, న తు ప్రామాణ్యగ్రహస్య క్వచిదప్యుపయోగః. ఉపయోగే వా స్వతఏవేతి కుత ఏతత్? తతః సమర్థప్రవృత్తిప్రాచుర్యమపి ప్రామాణ్యప్రాచుర్యాత్తద్గ్రహణప్రాచుర్యాద్వా, స్వతస్త్వం తు తస్య క్వోపయుజ్యతే. న హి పిపాసూనాం ఝడితి ప్రచురా సమర్థా చ ప్రవృత్తిరంభసీతి పాసోపశమనశక్తిస్తస్య ప్రత్యక్షా స్యాత్.

తా. ప్రవృత్తినిగూర్చి ప్రామాణ్యగ్రహము హేతువయినచో పైఁజెప్పినరీతిని ప్రామాణ్యము స్వతోగ్రాహ్యమని చెప్పుటకు నవకాశము కలుగును. ప్రవృత్తినిగూర్చి ప్రామాణ్యగ్రహము హేతువు గాదు. అర్థసందేహమువలనఁ గూడ ప్రవృత్తి కలుగును. శీఘ్రతర ప్రవృత్తి ఝడితికారణసమవధా

నము లేక యుపపన్నము కానందున, ఝడితిప్రవృత్తి కారణా క్షేపకమగును. ప్రవృత్తియందుండు ప్రాచుర్యమనఁగా ప్రవృత్తి కారణవైశిష్ట్యము. ప్రవృత్తినిఁగూర్చి ఇచ్ఛ కారణము. ఇచ్ఛ నుగూర్చి ఇష్టసాధనతాజ్ఞానము కారణము. ఆజ్ఞానము తజ్జా తీయత్వరూపలింగానుభవజన్యము. ఆలింగానుభవ మింద్రియ సన్నికర్షవలనఁ గలుగును. ప్రవృత్తికారణ పరంపరలో ప్రామా ణ్యజ్ఞానమున కుపయోగమే లేదు. ఒకానొకసమయమున నుప యోగమున్నను స్వతః ప్రామాణ్యగ్రహమునకే యుపయోగ మని చెప్పుటకు వీలులేదు. కాబట్టి సమర్థప్రవృత్తిప్రాచు ర్యము ప్రామాణ్యప్రాచుర్యమువలనగాని ప్రామాణ్యగ్రహ ప్రాచుర్యము వలనఁగాని వచ్చును, కాని ప్రామాణ్యముయొక్క స్వతస్త్వమున కెచ్చటను నుపయోగము లేదు. పిపాసకల వానికి జలమందున్న పిపాసాశాంతినిఁ జేయుసామర్థ్యము ప్రత్యక్షము కాకపోయినను శీఘ్రముగా ప్రచురతర సమర్థ మగుప్రవృత్తి స్వకారణమువలననె కలుగునట్లు స ప్రామాణ్యగ్రహము లేకపోయినను స్వకారణ ప్రాచుర్యము వలననే ప్రచురతరప్రవృత్తి యుపపన్నమగును.

మూ. స్యాదేతత్. ప్రామాణ్యగ్రహే సతి సర్వమేత
దుపపద్యతే. స చ స్వతో యది న స్యాత్ న స్యా
దేవ, పరతః పక్షస్యానవస్థాదుస్థత్వాదితి చేన్న.

తా. స్వతఃప్రామాణ్యగ్రహము లేనిచో ప్రామాణ్య గ్రహ ముండుటయే సంభవింపదు. అనుమానాదికమువలన ప్రామాణ్యగ్రహము సంభవించుటకు వీలులేదు. నిశ్చితప్రామా ణ్యకమగు పరామర్శకే ప్రామాణ్యగ్రహమునుగూర్చి కారణ

త్వము చెప్పవలయునుగాన పరామర్శయందలి ప్రామాణ్యనిశ్చ యమునకై లింగాంతర మపేక్షింపఁబడిన ననవస్థవచ్చును. కావున ప్రామాణ్యము స్వతోగ్రాహ్యమనియే చెప్పుట యుచిత మని యాశంకింపరాదు.

మూ. తదగ్రహేఽప్యర్థసందేహాదపి సర్వస్యోపపత్తేః.
న చానవస్థాపి, ప్రామాణ్యస్యావశ్యజ్ఞేయత్వా
ఽనభ్యుపగమాత్.

తా. ప్రామాణ్యగ్రహము లేకున్నను జ్ఞానమం దప్రామా ణ్యశంక లేనిచో నట్టి వ్యవసాయాత్మకమగు నర్థనిశ్చయము వలననే నిష్కంప ప్రవృత్తి యుపపన్నమగును. ప్రామాణ్యాను మితినిగూర్చి తజ్జనకపరామర్శధర్మికప్రామాణ్యగ్రహముయొక్క యపేక్ష లేదు. అప్రామాణ్యశంక లేనిచో నగృహీతప్రామా ణ్యకమగు పరామర్శము ప్రామాణ్యానుమితి సంపాదకమగును గాన జనకజ్ఞానధర్మిక ప్రామాణ్య నిశ్చయాపేక్ష లేదు. ఇట్లే ప్రామాణ్యానుమితియం దప్రామాణ్యశంక లేనిచో ననిశ్చిత ప్రామాణ్యకమగు ప్రమాత్మకానుమితియుఁ బ్రవృత్తి సంపాదకము కావచ్చును. గాన ననవస్థాదోషమున కవకా శము లేదు.

మూ. అన్యథా స్వతః పక్షేఽపి సా స్యాత్. లింగం
నిశ్చితమేవ నిశ్చాయకమ్, తతస్తన్నిశ్చయార్థ
మవశ్యం లింగాంతరాపేక్షాయామనవస్థేతి చేత్.
తత్కిమనుపద్యమానోఽర్థోఽనిశ్చిత ఏవ స్వోప
పాదకమాక్షిపతి? యేనాఽనవస్థా న స్యాత్.

తా. ప్రామాణ్యమనుమానాదికముచే గ్రహింపఁబడు ననుపక్షమున నిశ్చితమగు లింగమె ప్రామాణ్య నిశ్చాయక మని చెప్పవలయును. ఆలింగనిశ్చయార్థము లింగాంతరము నపేక్షింపవలయును. ఆ యపేక్షిత లింగనిశ్చయార్థము తెఱఁగ లింగనిశ్చయ మపేక్షిత మగును. ఇట్లు అనవస్థ వచ్చుననినచో, "ఘటః ఘటత్వవన్నిష్ఠవిశేష్యతానిరూపిత ఘటత్వనిష్ఠప్రకార తాశాలిజ్ఞానవిషయః, ఘటత్వప్రకారకజ్ఞాతతావత్వాత్", అను ననుమానముచే ప్రామాణ్యగ్రహము నంగీకరించిన భట్టమతమునఁగూడ, ప్రామాణ్యసంశయమువలన లింగము సందిగ్ధమగును గాన లింగనిశ్చయముకొఱకు లింగాంతరము నపేక్షింపవలయును. ఆలింగనిశ్చయముకొఱకును లింగాంతరాపేక్ష యావశ్యకము. కాన ననవస్థాదోషము సమానము.

మూ. ప్రత్యక్షేణ తస్య నిశ్చయాత్తస్య చ సత్తయైవ నిశ్చాయకత్వాన్నైవమితి చేత్, మమాపి ప్రత్యక్షేణ లింగనిశ్చయాత్తస్య చ సత్తయైవ నిశ్చాయకత్వాన్నైవమితి తుల్యం. లింగజ్ఞానస్య ప్రామాణ్యానిశ్చయే కథం తన్నిశ్చయః స్యాదితి చేత్, అనుపద్యమానార్థజ్ఞానప్రామాణ్యానిశ్చయే కథం తన్నిశ్చయ ఇతి తుల్యం. న హి నిశ్చయేన స్వప్రామాణ్య నిశ్చయేన వా విషయం నిశ్చాయయతి ప్రత్యక్షం, అపితు స్వసత్తయేత్యుక్తమితి చేత్, తుల్యం. తథాపి యది తల్లింగాఽభాసః స్యాత్తదా కా వార్తేతి చేత్, అనుపపద్యమానో ఽప్యర్థో యద్యాభాసః

స్యాత్తదాకా వా _ర్తేతి తుల్యం. సోఽపి ప్రామా
ణ్యమాత్రేపతీత్యుత్సర్గః, స చ క్వచిద్బాధకే నా
పోద్యత ఇతి చేత్, లింగేఽప్యేవమితి తుల్యం.

తా. మామతమున జ్ఞాతతారూపలింగము చక్షురిం ద్రియముచే నిశ్చయించఁబడును. చక్షురింద్రియ మజ్ఞాతమై నిశ్చయ జనకమగును గావున ననవస్థ వారించుననినచో ప్రామాణ్యమున కనుమానగ్రాహ్యత్వమునంగీకరించిన మామత మునఁగూడనట్లే వారించును.చక్షురింద్రియరూపమగు ప్రత్యక్ష మజ్ఞాతమై విషయనిశ్చయమును పుట్టించును గావున చక్షురిం ద్రియనిశ్చయముయొక్కగాని దానియొక్క ప్రామాణ్య నిశ్చ యముయొక్కగాని యపేక్ష లేదు. కాబట్టి యనవస్థలేదనినచో నయ్యది యుభయులకు సమానమే. లింగ మాభాసరూపమై నచో ప్రామాణ్య నిశ్చాయక మెట్లగుననునదిగూడ నుభయు లకు సమానమే. మామతమున ననుపపద్యమాన మాభాసరూప మైనను, భాధకము లేనిచోఁ బ్రామాణ్యాక్షేపక మగునను నదియు సమానమే.

మూ. తర్హి ప్రామాణ్యానుమానేఽపి శంకా తదవస్థై
వేతినిష్ఫలప్రయాస ఇతి చేత్, ఏతదపి తాదృ
గేవ. అనుపపద్యమానోర్థఽఏవాసౌ తథావిధ
కశ్చిత్ యః స్వప్నేఽపి నాఽభాసః స్యాత్ తత
నాశంకేతి చేత్, లింగేఽప్యేవమితి సమః సమాధిః.

తా. కారణముఖమైన యనవస్థ వారించినను, ఫలముఖ మైన యనవస్థ యుండును. "జలజ్ఞానము ప్రమ"యను నను మితియం దప్రామాణ్యశంక యున్నచో నర్థసిద్ధి కాదు. కావున

దానియందు ప్రామాణ్యనిశ్చయమావశ్యకము. దానికొఱకు మరియొకదాని నపేక్షించినచో, ననవస్థాదోషము కలుగునను నదిగూడ నుభయులకు సమానమే. స్వప్నమందుఁ గూడ నా భాసరూపముగాని యనుపద్యమానమైన దానివలనఁ గలిగెడు ప్రామాణ్యానుమితియందు ప్రామాణ్యశంక కవకాశము లేదని చెప్పుటకూడ నుభయులకు సమానమే.

మూ. కః పునరసావర్థో యః స్వప్నేఽపినాభాసః స్యాత్ ?
యదనుపలంభే విభ్రమావకాశో యాదృగుప
లంభే చ తద్బాధవ్యవస్థా. అన్యథా హి, తథా
భూతస్యాపి వ్యభిచారే సాపి న స్యాత్. మా
భూదితి చేన్న, భవితవ్యం హి తత్త్వాఽతత్త్వ
విభాగేన, అన్యథా వ్యాఘాతాత్. కథం హి
నియామకనిశ్శేషవిశేషోపలంభేఽపివిపరీతారోపః,
తథాభావే వా తదతిరిక్తవిశేషానుపలంభే కథం
బాధకమ్, తదభావే త్వబాధస్య కథం భ్రాన్త
త్వమితి.

తా. ఎద్దాని యుపలంభము లేనపుడు శుక్తియందు "రజతము"ను భ్రాంతియు, ఉపలంభమున్నపుడట్టి భ్రమ యొక్క నివృత్తియుఁ గలుగునో యట్టి శుక్తిత్వమేయనా భాసరూపమని లోకసిద్ధమైయున్నది. కావున స్వప్నమందట్టి యనాభాసరూపమగు వస్తువెద్దియో చెప్పుడు. పైరీతి బాధ్య బాధకభావమొప్పనిచో, బాధ్యబాధకవ్యవస్థయే లేకపో వలసి వచ్చును. లోకమున బాధ్యబాధకవ్యవస్థ లేకపోయిన తత్త్వాతత్త్వవిభాగము లేకపోవలసివచ్చును. (తత్త్వమనఁగా

బాధకజ్ఞానవిషయము. అతత్త్వమనఁగా బాధ్యజ్ఞానవిషయము.) రజతత్వరూపవిశేషోపలంభమున్నపుడును భ్రమ నంగీకరించిన యెడల, భ్రాంతి యథార్థమగును గాన రజతమునకు బాధ్యత్వమును శుక్తిత్వాదివిశిష్టమునకు బాధకత్వమును లేకపోవలసి వచ్చును.

మూ. స్యాదేతత్ పరతః ప్రామాణ్యేఽపి నిత్యత్వాద్వేదానామనపేక్షత్వం, మహాజనపరిగ్రహాచ్చ ప్రామాణ్యమితి కో విరోధః? న.

తా. "పౌరుషేయమగుశబ్దమువలనఁ గలుగు జ్ఞానముయొక్క ప్రామాణ్యమనుమానాదికముచే గ్రహింపఁబడినను, వేదము నిత్యమగుటచే వక్త లేనందున వేదజన్యశాబ్దప్రమ వక్తృగుణాధీనము గాదు. ఆప్తోక్తత్వము లేకపోయినను, మహాజనపరిగ్రహమువలననే వేదజన్యజ్ఞానమునకుఁ బ్రామాణ్యసిద్ధికలుగునని చెప్పుటచే నెట్టి విరోధము లేద"ని యాశంకించరాదు.

మూ. ఉభయస్యాప్యసిద్ధేః.

తా. వేదమునకు, నిత్యత్వము మహాజనపరిగృహీతత్వము అనునీయుభయమసిద్ధము.

మూ. న హి వర్ణా ఏవ తావన్నిత్యాః. తథాహి ఇదానీం శ్రుతపూర్వో గకారో నాస్తి, నివృత్తః కోలాహల ఇతి ప్రత్యక్షేణైవ శబ్దధ్వంసః ప్రతీయతే. న హి శబ్దఏవాన్యత్ర గతః. అమూర్తత్వాత్. నాప్యావృతః, తతఏవ సంబన్ధవిచ్ఛేదానుపపత్తేః. నాప్యనవహితః శ్రోతా, అవధానేఽప్య

నుపలబ్ధేః. నాపీంద్రియం దుష్టం, శబ్దాంతరోప లబ్ధేః. నాపి సహకార్యాంతరాఽభావః, అన్వయ వ్యతిరేకవతః తస్యాసిద్ధేః. నాప్యతీంద్రియం, తత్కల్పనాయాం ప్రమాణాఽభావాత్. అన్యథా, ఘటాదావపి తత్కల్పనాప్రసంగాత్. న చ శబ్దనిత్యత్వసిద్ధౌ తత్కల్పనేతి యుక్తమ్, నిరాకరిష్యమాణత్వాత్.

తా. "పూర్వముశ్రుతమైన గకార మిప్పుడు లేదు." "కోలాహలము నివృత్తమ"నెడు ప్రత్యక్షములలో శబ్దధ్వంస విషయమగుటచే, వర్ణము లనిత్యములనియే చెప్పవలెను. అమూర్తము లగుటవలన, శ్రుతపూర్వమగు గకారమును కోలాహలమును వేఱొకచోటికి వెళ్లినవనిగాని, ఇతరములగు వస్తువులచేఁ గప్పఁబడినవనిగాని చెప్పుటకు వీలులేదు. సావధానమనస్కులకుఁ గూడననుపలబ్ధము లగుటవలన శ్రోత యనవహితమనస్కుఁడని చెప్పుటకును వీలులేదు. శబ్దాంతరములు వినఁబడుచున్నందున నింద్రియము దుష్టమని చెప్పుటకును వీలులేదు. అన్వయవ్యతిరేకశాలియగు సహకార్యంతరము లేమింజేసియే శబ్దము వినిపించుటలేదనియు చెప్పుటతగదు. శబ్దమున కతీంద్రియత్వముఁగల్పించుటకుఁ బ్రమాణమేమియును లేదు. ప్రమాణము లేకున్నను శబ్దమున కతీంద్రియత్వముఁ గల్పించినచో ఘటాదులకుఁగూడ నతీంద్రియత్వముఁగల్పింప వీలగును. శబ్దనిత్యత్వము నిరాకరింపఁబడుచున్నందున "శబ్దమునకు నిత్యత్వము సిద్ధింపఁగా నతీంద్రియత్వమును కల్పించెదమ"నుమాట సరికాదు.

మూ. యే త్వేకదేశినో నైవమిచ్ఛంతి. తాన్ ప్రత్యుచ్యతే, వివాదాధ్యాసితః శబ్దప్రధ్వంసః ఇంద్రియగ్రాహ్యః. ఇంద్రియకాఽభావత్వాత్. ఘటాఽభావవత్.

తా. "అభావప్రత్యక్షమునుగూర్చి ప్రతియోగియోగ్యతయు నధికారణయోగ్యతయుఁ బ్రయోజకములు. ప్రకృతమున, శబ్దధ్వంసాధికరణమగు నాకాశ మయోగ్యము గాన "కోలాహలము నివృత్తము" అను ప్రత్యక్ష ముపపన్నము గాదు. మరియు నభావప్రత్యక్షమున నింద్రియసంబద్ధవిశేషణతయే సన్నికర్ష గానియింద్రియ విశేషణత సన్నికర్ష గాదు. కాఁబట్టి వెనుకటి ప్రత్యక్షముపపన్నము గాద"ని యాశంకించినచో శబ్దధ్వంస కింద్రియగ్రాహ్యత్వము, "అశ్రూయమాణ శబ్దధ్వంసః ఇంద్రియగ్రాహ్యః, ఇంద్రియగ్రాహ్య ప్రతియోగికత్వే సతి, అభావత్వాత్, ఘటాభావవత్" అను యనుమానాదికముచే సాధించఁబడును.

మూ. నైతదేవమ్. ఇంద్రియాఽసన్నికృష్టత్వాదతీంద్రియాధారత్వాద్వేతి చేన్న.

తా. శబ్దధ్వంస ఇంద్రియసన్నికృష్టము కాకపోవుటవలనను, అతీంద్రియమగు నాకాశాదికమాధారముగా గలదగుటవలనను, ఇంద్రియ గ్రాహ్యమగుటకు వీలులేదని యాశంకించరాదు.

మూ. ఇదం హ్యుపాధ్యుద్భావనం వా స్యాత్? వ్యాపకానుపలబ్ధ్యా సత్ప్రతిపక్షత్వం వా?

తా. ఇయ్యది వ్యతిరేకముగా నుపాధియొక్క యుద్భా

వనమా ? సత్ప్రతిపక్షోద్భావనమా ? యిది వ్యతిరేకముగా నింద్రియసన్నికృష్టత్వముగాని, ఇంద్రియ గ్రాహ్యాధికరణత్వము గాని యుపాధి యనియా నీయాశయము.

మూ. న ప్రథమః, స్వరూపయోగ్యతాం ప్రతి సహ
కారియోగ్యతాయా అనుపాధిత్వాత్, తస్యా
స్తామపేక్ష్యైవ సర్వథా వ్యవస్థితేః.

తా. ఉపాద్యుద్భావనయని చెప్పుటకు వీలులేదు:— సాధ్యవ్యాపకము సాధనావ్యాపకము నగునది యుపాధి. ఇంద్రియసన్నికృష్టత్వరూప సహకారియోగ్యత నపేక్షించియే స్వరూపయోగ్యత (ప్రత్యక్షవిషయత్వము) ఉండును. ఇంద్రియసన్నికృష్టత్వము పక్షమైన శబ్దధ్వంసయం దున్నందునసాధన మగు నైంద్రియకాభావత్వమునకు వ్యాపకమగును. గాన నుపాధియగుటకు వీలులేదు. ప్రత్యక్షవిషయత్వము త్ర్యణుక మందున్నది. త్ర్యణుకమం దైంద్రియకాధారత్వము లేదు. గావున ప్రత్యక్షవిషయత్వరూపసాధ్యమున కైంద్రియకాధారత్వము వ్యాపకము కాదు. అభావత్వరూప పక్షధర్మావచ్ఛిన్న సాధ్య వ్యాపకత్వము వివక్షితనిన నష్టాశ్రయ ద్రవ్యాభావమం దైంద్రియకాధారత్వము లేనందున నాపక్షమునం గూడ సాధ్యావ్యాపకత్వము వచ్చును. గాన నైంద్రియ కాధారత్వము కూడ నుపాధి యగుటకు వీలులేదు.

మూ. నాప్యైంద్రియకాధారత్వప్రయుక్తం అభావస్య
ప్రత్యక్షత్వం,ధర్మాద్యభావస్యాపితథాత్వప్రసం
గాత్. అతఏవ నోభయప్రయుక్తమ్.

తా. విషమవ్యాప్తస్థలమందు సాధ్యప్రయోజకమే యుపాధి గానక్కడక్కడ గానవచ్చుచున్నది. "ధూమవాన్ - వహ్నేః" అనుస్థలమున ధూమప్రయోజకమగు నార్ద్రేంధన సంయోగముపాధి. అట్లు, ఐంద్రియకాధారత్వము ప్రత్యక్ష విషయత్వరూప సాధ్యమునందు ప్రయోజకముగాదు. ప్రయో జకమైనచో నతీంద్రియమగు ధర్మాద్యభావ మైంద్రియకమైన యాత్మాధారకమైనందున ప్రత్యక్షము కావలసివచ్చును. కనుక నింద్రియసన్నికృష్టత్వైంద్రియకాధారత్వములు రెండునుం గూడ యుపాధియనుటకు వీలులేదు.

**మూ.** నాపి ద్వితీయః; ప్రథమస్యాసిద్ధేః. అస్తి హి శ్రోత్ర శబ్దాఽభావయోః స్వాభావికో విశేష్యవిశేషణ భావః. విశేష్యస్యాతీంద్రియత్వాత్ కథమైం ద్రియకవిశిష్టజ్ఞానవిషయత్వం, తథా విశేష్యమ వ్యవస్థాపయతశ్చ కథం విశేషణత్వమితి చేన్న.

తా. సత్ప్రతిపక్షోద్భావన మనినచో, "శబ్దధ్వంస ఇం ద్రియాసన్నికృష్ట మగుటవలన నింద్రియాగ్రాహ్యమ"ని చెప్ప వలయును. శ్రోత్రమునకు శబ్దాభావమునకు స్వాభావికమగు విశేషణవిశేష్యభావసంబంధ మున్నందున ఇంద్రియాసన్నికృష్ట త్వరూపహేతువు పక్షమందు లేకపోవుటచే నసిద్ధము గాన సత్ప్రతిపక్షోద్భావన కవకాశము లేదు.

శ్రోత్ర మతీంద్రియమగుటవలన శబ్దధ్వంసప్రత్యక్షవిష యత్వరూపవిశేష్యత్వము శ్రోత్రమునకును అట్టి విశేష్యవ్యవ స్థాపన జేయని శబ్దధ్వంసకు శ్రోత్రవిశేషణత్వమును సంభవింపఁ దని యాశంకింపరాదు.

మూ. తథా విశేష్యవ్యవస్థాపనాయాః ఫలత్వాత్. న తు తదేవ విశేషణత్వం ఆత్మాశ్రయప్రసంగాత్. విశేషణభావేన సమవాయాఽభావయోర్గ్రహణం, తథాగ్రహణమేవ చ విశేషణత్వమితి.

తా. తద్విశేషణత్వము తద్విశేష్యకవిశిష్టబుద్ధిజనకత్వగర్భితమన్నచోఁ బూర్వోక్తయాశంక కవకాశముండును. గాని విశేషణత్వము విశిష్టబుద్ధి ఘటితమని చెప్పుటకు వీలు లేదు. అట్లు చెప్పిన విశిష్టబుద్ధియున్నప్పుడే తద్ఘటితవిశేషణత్వ ముండును. దానివలన విశిష్టబుద్ధి కలుగును. కావున విశిష్టబుధ్యధీనమే విశిష్టబుద్ధి యగుటచే నాత్మాశ్రయము వచ్చును.

మూ. తస్మాత్ సంబన్ధాన్తరమంతరేణ తదుపశ్లిష్టస్వభావత్వమేవ హి తయోః, సైవ చ విశిష్టప్రత్యయజననయోగ్యతావిశేషణతేత్యుచ్యతే, సా చాత్ర దుర్నివారా. ప్రతియోగ్యధికరణేన స్వభావత ఏవాఽభావస్య మిళితత్వాత్.

తథాపి తయాతథైవ ప్రతీతిః కర్తవ్యేతి చేన్న.

తా. విశేషణతారూప సంబంధమునకు విశిష్టజ్ఞానము ఫలము. గాన, సయ్యది విశేషణత్వమున నంతర్భూతమని చెప్పుటకు వీలులేదు. విశేషణత్వమనఁగా విశిష్టప్రత్యయజననయోగ్యత్వము అట్టి యోగ్యతారూపవిశేషణత్వము శబ్దధ్వంసకు స్వప్రతియోగిశబ్దసమవాయికారణమగు నాకాశముతోఁ గూడ స్వతస్సిద్ధముగా మిళితమైయున్నది.

అట్టి స్వాభావికమగు విశేషణతారూప సన్నికర్షవలన శ్రోత్రవిశేష్యకమగు ప్రతీతియేల కలుగరాదని యాశంకించరాదు.

మూ. గృహ్యమాణవిశేష్యత్వాఽవచ్ఛిన్నత్వాద్వ్యా ప్తేః.అన్యథా సంయుక్తసమవాయేన రూపాదా విశిష్టవికల్పధీజననదర్శనాత్, గంధాదావపి తథాత్వప్రసంగాత్.

తా. విశేష్యము యోగ్యమగునపుడే, యోగ్యతవలన, తద్విశేష్యకమగు విశిష్టబుద్ధి కలుగును. ప్రకృతమున నాకాశ మతీంద్రియ మగుటవలన నాకాశము విశేష్యము గాఁగల విశిష్టబుద్ధి విశేషణతా సన్నికర్షవలనఁ గలుగదు. అట్లు గల్గు ననిన "రూపవాన్ ఘటః" యను ప్రత్యక్షము సంయుక్తసమ వాయరూపసన్నికర్షచే చక్షురింద్రియమువలన కలుగునటుల ఘ్రాణసంయుక్త సమవాయరూపసన్నికర్షచే ఘ్రాణమున కయోగ్యమగు పుష్పమును విశేష్యముగాఁజేసికొని "గంధ వత్పుష్పం" అను ప్రత్యక్షము గూడ ఘ్రాణమువలనఁ గలుగ వలసివచ్చును. ఘ్రాణమువలన నట్టిప్రత్యక్షము గలుగుట లేదు. మఱియేమన "పుష్పేగంధః" యనిగాని "అయం గంధః" అనిగాని ప్రత్యక్షము కలుగును.

మూ. తథాపి నేంద్రియవిశేషణతయా కస్యచిద్గ్రహ ణందృష్టమ్,అపిత్వింద్రియసంబద్ధవిశేషణతయా, సా చాత్ర నివర్తతే ఇతి చేన్న.

తా. ఇంద్రియవిశేషణతారూపసన్నికర్షవలన నభావ ప్రత్యక్ష మెక్కడను గలుగుటలేదు. ఇంద్రియసంబద్ధ విశేషత వలననే యభావప్రత్యక్షము కలుగును. శబ్దధ్వంసకు నింద్రియ విశేషణతారూపసన్నికర్షయే యున్నది. గాన దానికిఁ బ్రత్య క్షత్వ మెట్లని యాశంకింపరాదు.

మూ. అస్య ప్రతిబంధస్య ఇంద్రియసన్నికృష్టార్థప్రతి
సంబన్ధివిషయత్వాత్. అన్యథా సంయుక్తసమ
వాయేన గంధాదావుపలబ్ధిదర్శనాత్, సమవా
యేనాఽదర్శనాత్, శబ్దస్యాగ్రహణప్రసంగాత్.

తా. ఇంద్రియసంయుక్తమగు ఘటాదులయందుండు నభావముయొక్క ప్రత్యక్ష మింద్రియసంయుక్త విశేషణతా రూపసన్నికర్షవలనఁ గల్గినను శబ్దధ్వంసయొక్క ప్రత్యక్షము మాత్ర మింద్రియవిశేషణతారూపసన్నికర్షవలననే కలుగును. ఇంద్రియ సంబంధమునకు ప్రత్యక్షజనకత్వము నంగీకరించనియెడల ఘ్రాణసంయుక్తసమవాయముచే గంధాదిప్రత్యక్షము కలుగుటవలన శ్రోత్రసమవాయముచే శబ్దాదిప్రత్యక్షము కలుగకపోవలసివచ్చును. కాన సాక్షాత్సంబంధమువలననే ప్రత్యక్ష ముపపన్న మగుచున్నందునఁ బరంపరాసంబంధాశ్రయణ కవసరముండదు.

ఈ గ్రంథముచే సత్ప్రతిపక్షానుమానమునఁ బ్రథమ హేతువు అసిద్ధమని చెప్పఁబడినది.

ఇంక ద్వితీయానుమానము విమర్శింతము.

మూ. నాప్యభావత్వేసతీంద్రియాధారత్వాత్స త్ప్రతిప
క్షత్వం, యోగ్యతావిరహప్రయుక్తత్వా
ద్వ్యాప్తేః. న చాతీంద్రియాధారత్వమేవ తస్య
యోగ్యతావిరహః, తద్విపర్యస్యైవయోగ్య
తాత్వాఽపత్తేః. న చైవమేవ, ధర్మాదిప్రధ్వంస
గ్రహణప్రసంగాత్.

తా. "శబ్దధ్వంస యభావమును అతీంద్రియాధారము నగుటవలన నింద్రియాగ్రాహ్యమ"ను నీయనుమానము గూడ యోగ్యతావిరహరూపమగునుపాధితోఁ గూడినదగుటవలనఁ దుల్యబలము గాదు. అతీంద్రియాధారత్వమే యోగ్యతా విరహము గాన నట్టి యోగ్యతావిరహము సాధనవ్యాపక మగుటవలన యోగ్యతావిరహమున కుపాధిత్వము సంభవింప దని యాశంకించరాదు. అతీంద్రియాధారత్వమే యోగ్యతావిరహమైనయెడల తద్విరహమైన ఐంద్రియాధారత్వమే యోగ్యత యనిచెప్ప వీలగును. అట్లు చెప్పిన ధర్మాద్యభావ మునకుఁ గూడ ప్రత్యక్షత్వము వచ్చును.

మూ. దృశ్యాధారత్వం దృశ్యప్రతియోగితా చేతి
ద్వయమప్యస్య యోగ్యతేతి చేన్న. ఉభయని
రూపణీయత్వనియమాऽనభ్యుపగమాత్. ప్రతి
యోగిమాత్రనిరూపణీ యోహ్యభావః.

తా. దృశ్యాధారత్వము దృశ్యప్రతియోగికత్వము అను నీరెండును గలిసియే యోగ్యత. ఇట్టి యోగ్యత లేనందుననే ధర్మాద్యభావమునకు ప్రత్యక్షత్వము లేదని చెప్పుట సరిగాదు. ఏలయన, నభావ ప్రత్యక్షములో ప్రతి యోగియోగ్యతకే ప్రయోజకత్వముగాని యధికరణయోగ్య తకుఁ గూడ ప్రయోజకత్వమొప్పుట శాస్త్రసిద్ధము గాదు.

మూ. అన్యథే"హభూతలే ఘటో నాస్తీ"త్యేషాపి
ప్రతీతిః ప్రత్యక్షా న స్యాత్. సంయోగో
హ్యత్ర నిషిధ్యతే, తదభావశ్చ భూతలవద్ఘ

ఽపి వర్తతే, తత్ర యది ప్రత్యక్షతయా భూత
లస్యోపయోగో ఘటస్యాపి తథైవ స్యాదవిశే
షాత్. అథ ఘటస్యాన్యథోపయోగః, భూత
లస్యాప్యన్యథైవ స్యాదవిశేషాత్, కథమన్య
థేతి చేత్.

తా. అట్లే యైనచో "భూతలేఘటో నాస్తి" యను ప్రతీతి ప్రత్యక్షరూపము కాకపోవలసివచ్చును. ఘటాభావ ప్రతియోగియగు ఘటమునకు భూతలము సమవాయికారణము కానందున నీప్రతీతి భూతలమందు ఘటముయొక్క ధ్వంస ప్రాగభావముల నవగహించుననుటకు వీలులేదు. కావున ఘటసంయోగనిషేధమే యీప్రతీతిలో విషయమని చెప్పవలయును. ఆఘటసంయోగము భావిఘటమునకు కాబోవునది యైనచో దానియొక్క ప్రాగభావమే విషయమనియు నతీతమైనచో, ధ్వంసవిషయమనియు, నెప్పుడును లేనిదైనచో, నత్యంతాభావము విషయమనియుఁ జెప్పవలయును. అట్టి సంయోగముయొక్కయభావము భూతలమునందువలె ఘటమునందుఁ గూడనుండును. ప్రతియోగ్యధికరణ ప్రత్యక్షముల రెండిటి వలనను అభావ ప్రత్యక్షము గలుగుననినచో నధికరణమగు ఘటము లేనందునఁ దత్ప్రత్యక్షము సంభవించదు. అధికరణ ప్రత్యక్షము లేనందున వెనుకటి ప్రతీతికి ప్రత్యక్షత్వము లేకపోవలసి వచ్చును. వెనుకటి ప్రత్యక్షములో ఘటమునకు మరియొకరీతిని యుపయోగమన్నచో విశేషము లేనందున భూతలమునకుఁగూడ మరియొకరీతి నుపయోగము చెప్పవలసి వచ్చును. మరియొకరీతిని యుపయోగ మెట్లందువా!

మూ. ప్రతియోగినిరూపణార్థం అభావసన్నికర్షార్థం చ. తత్ర ప్రతియోగినిరూపణం స్మరణలక్షణ మనుపలభ్యమానేనాపీతి న తదర్థమధ్యక్షగోచ రత్వమపేక్షణీయమన్యతరస్యాపి, కుత ఉభయస్య.

తా. ప్రతియోగినిరూపణకొఱకుఁగాని యభావసన్ని కర్షకొఱకుగాని యుపయోగమని చెప్పవలయును. అందు ప్రతియోగిస్మరణరూపమగు ప్రతియోగినిరూపణము ప్రతియోగి ప్రత్యక్షము కాకపోయినను, అధికరణము ప్రత్యక్షము కాకపోయినను, సంభవించుటఁబట్టి యీరెండిటిలో నొక్కదాని ప్రత్యక్షమును అవసరము లేదు. గాన నుభయమున కుపయోగము లేదనుసంగతి వేఱఁజెప్ప నవసరము లేదు.

మూ. సన్నికర్షస్తు భూతలఘటసంయోగాభావస్యేంద్రియేణసాక్షాన్నాస్తి. యేనాస్తి, తేనాపి యదింద్రియం న సన్నికృష్యేత కథమివ తం గమయేత్? నచోపలబ్ధోపలభ్యమానాభ్యా మేవేంద్రియం సన్నికృష్యతే, ఇతరేతరాశ్రయప్రసంగాత్.

అభావసన్నికర్షకొఱకని చెప్పినచో నాయభావమునకు నింద్రియమునకు సాక్షాత్సన్నికర్ష సంభవింపదు పూర్వమందుపలబ్ధమైన భూతలముతోఁ గాని బరమం దుపలప్స్యమానమగు భూతలముతోఁగాని యింద్రియము సన్నికృష్టమై యభావ ప్రత్యక్షముఁ గలుగఁజేయుననినచో, నుపలబ్ధి కలిగినపిదప సన్నికర్షయుఁదదనంతరముపలబ్ధియు నని యన్యోన్యాశ్రయము

వచ్చును. కావున నభావప్రత్యక్షములోఁ బ్రతియోగి యోగ్యత్వమే తంత్రముగాని యధికరణయోగ్యత్వము తంత్రముగాదు.

మూ. తస్మాత్సన్నికర్షే సతి యోగ్యత్వాద్భూతలమ ప్యుపలభ్యతే. నతు తస్యోపలభ్యమానత్వ మభావోపలబ్ధేరంగమితి యుక్తముత్పశ్యామః. ప్రకృతే తు న ప్రతియోగినిరూపణార్థం తదుప యోగః, తస్య సంయోగవదాధారాఽనిరూప్య త్వాత్. నాపి సన్నికర్షార్థం, తదభావస్య సాక్షా దింద్రియసన్నికర్షాదితి. న చేదేవం, కుత ఏషా ప్రతీతి రిదానీంశ్రుతపూర్వో శబ్దో నాస్తీతి? అనుమానాదితి చేన్న.

తా. కనుక సన్నికర్ష యున్నయెడల యోగ్యము గాన భూతలమునఁ గూడ ప్రత్యక్షమైనప్పటికి నాప్రత్యక్ష మభావోపలబ్ధి కంగము కాదు.

ప్రకృతమున శబ్దధ్వంసప్రత్యక్షములో శబ్దనిరూపణ మునకై యధికరణగ్రహాపేక్ష లేదు. శబ్దము సంయోగము వలె నాధారనిరూప్యముగానందున సంయోగగ్రహ మధికరణ గ్రహము నపేక్షించునటుల శబ్దగ్రహము అధికరణగ్రహము నపేక్షింపదు. శబ్దధ్వంసకు నింద్రియముతోఁ గూడ సాక్షా త్సన్నికర్ష యుండుటవలన సన్నికర్షనిమిత్తమై గూడ నధిక రణగ్రహాపేక్ష లేదు. అధికరణగ్రహాపేక్ష శబ్దధ్వంసప్రత్య క్షములో నుండవలెననినచో “శ్రుతపూర్వమగు గగారమిపుడు

లేదు." అను ప్రాత్యక్షిక ప్రతీతి కనుపపత్తి వచ్చును. ఇది యను మితి రూపమనుటకు వీలు లేదు.

మూ. శబ్దస్యైవ పక్షీకరణే హేతోరనాశ్రయత్వాత్. అనిత్యత్వమాత్రసాధనే అభావస్య నియతకాల త్వాఽసిద్ధేః.ఆకాశస్య పక్షత్వే తద్వృత్తయాఽను లభ్యమానత్వస్య హేతోరనైకాంతికత్వాత్. శబ్దసద్భావకాలేఽపి తస్య సత్త్వాత్. ఏవం కాల పక్షేఽపి దోషాత్.

తా. అట్లయిన, శబ్దమందు ధ్వంసను శబ్దసత్వకాలమం దుపలభ్యమానత్వరూప హేతువువలన సాధించవలయును. శబ్దధ్వంస యున్నపుడు పై హేతువు శబ్దమందు బాధితమైనం దున స్వరూపాసిద్ధ మగును. ధ్వంస లేనపుడు హేతువు పక్ష మందున్నను ధ్వంసరూపసాధ్యము లేనందున బాధితమగును. శబ్దమందు ధ్వంసప్రతియోగిత్వమును సాధించునెడల ఒకా నొకసమయమున ధ్వంస యున్నందున నర్థాంతరప్రసంగము వచ్చును. "ఆకాశః-శబ్దధ్వంసవాన్—శబ్దవృత్తయా అనుపలభ్య మానత్వాత్." అనుననుమానము ఆకాశము శబ్దము కలదిగా నెప్పుడు నుపలభ్యమానము గానందున శబ్దసత్వకాలమున సాధ్యము లేని యాకాశమునందు హేతువుండుటచే వ్యభి చారి యగును. ఇట్లే కాలదిగాదికము పక్షముచేసినపుడు గూడ వ్యభిచారము వచ్చును.

మూ. అహమిదానీం నిశ్శబ్దశ్రోత్రవాన్, శబ్దోపలబ్ధి రహితత్వాత్, బధిరవదితి చేన్న. దృష్టాన్త స్య సాధ్యవికలత్వాదవ్యాహతత్వాచ్చ, బధి

రశ్చ శ్రోత్రవాంశ్చేతి వ్యాహతమ్. తస్యాపి చ శ్రవసః నిశ్శబ్దత్వే ప్రమాణం నాస్తి.

తా. "అహమిదానీం నిశ్శబ్దశ్రోత్రవాన్— శబ్దోపలబ్ధిరహితత్వాత్ - బధిరవత్"—అను ననుమానముఁగూడ దృష్టాంతమగు బధిరునియందు సాధ్యము లేనందున సాధ్యవికల దృష్టాంతకత్వరూపదోషయుక్త మగును. శ్రోత్రము లేనివాఁడే బధిరుఁడు గాన 'బధిరశ్రోత్రవాన్' అనువాక్యము విరుద్ధార్థకము గదా! బధిరునకు శ్రోత్రమున్నను నయ్యది శబ్దరహితమని చెప్పుటకు ప్రమాణము లేదు.

బధిరశ్రోత్రమందు శబ్దము పుట్టినసది యుపలబ్ధివిషయము కావలెను. కాన శబ్దోపలబ్ధి లేకపోవుటయే నచ్చోట శబ్దము లేకపోవుటలోఁ బ్రమాణమని చెప్పుటకు వీలు లేదు.

మూ. అనుపభోగ్యస్య ఉత్పాదవైయర్థ్యం ప్రమాణమితి చేన్న, ఆద్యాదిశబ్దవదుపపత్తేః. తేషాం శబ్దాన్తరారంభం ప్రత్యుపయోగోఽన్త్యస్య న తథేతి చేన్న, అంత్యత్వాఽసిద్ధేః. సర్వేషాం చోత్పాదవతాం ప్రయోజనతదభావయోరస్మాదృశైరనాకలనాత్. సుషుప్త్యవస్థాయాం శ్వాసప్రశ్వాసప్రయోజనవచ్చ తదుపపత్తేః. ఆరంభే సతి ప్రయోజనమవశ్యమితి వ్యాప్తేః. న త్వాపాతతః ప్రయోజనానులంభమాత్రేణారంభనివృత్తిః.

తా. ఉపలబ్ధి లేనంతమాత్రమున నుత్పత్తియే లేదని చెప్పిన నాద్యశబ్దముఁగూడ నుపభోగ్యము కానందున నదియు

లేకపోవలసి వచ్చును. ఆద్యాదిశబ్దముల కుపభోగము లేకపో యినను శబ్దాంతరోత్పత్తిలో నుపయోగ మున్నది. అంత్యశబ్ద మున కట్టియుపయోగము లేదని చెప్పుట అంత్యత్వము సిద్ధము కానందున యుక్తము గాదు. అదియునుఁగాక లోకములోఁ బుట్టినవానియొక్క ప్రయోజనతదభావములు అసర్వజ్ఞులమగు మనకు తెలియనందున సుషుప్త్యవస్థయందు శ్వాసప్రశ్వాస సంతానముయొక్క ప్రయోజన తదభావములవలె నూహింప శక్యములు గావు. కనుక నుత్పత్తియున్నప్పుడు ప్రయోజ నము తప్పకయుండును. ప్రయోజన ముపలబ్ధము కానంత మాత్రమున నారంభనివృత్తిఁ జెప్పుటకు వీలులేదు.

మూ. తథాసతి కర్ణశష్కుల్యవచ్ఛేదోత్పాదవ నభసః
తం ప్రతి నివర్తేత,బధిరస్య తే నానుపయోగాత్.
వివాదకాలే బధిరకర్ణః శబ్దవాన్, యోగ్యదే
శస్య అనావృతకర్ణశష్కులీసుషిరత్వాత్, తది
తరకర్ణశష్కులీసుషిరవదితి.

తా. అట్లు చెప్పినచో బధిరుని శ్రోత్రమున కుపాధిరూప మగు కర్ణశష్కులీనిర్మాణమే లేకపోవలసి వచ్చును. అది యునుఁ గాక "బధిరకర్ణః శబ్దవాన్. యోగ్యదేశస్య అనా వృతకర్ణశష్కులీసుషిరత్వాత్, తదితరకర్ణశష్కులీసుషిర వదితి." అను ననుమానమువలనఁగూడ బధిరకర్ణమందు శబ్దము సిద్ధించును. కావున నిశ్శబ్దశ్రోత్రత్వము బధిరునియందు బాధి తము గావున దృష్టాంతాసిద్ధి వచ్చును.

మూ. నిశ్శబ్దాః పణవవీణావేణవః; తదేకజ్ఞానసంసర్గ
యోగ్యత్వస్య తదనుపలంభేఽప్యుపలభ్యమాన

త్వాత్, యత్ యదేకజ్ఞానసంసర్గయోగ్యస్య
అనుపలంభేఽప్యుపలభ్యతే తత్తదభావవత్,
యథా అఘటం భూతలమితి చేన్న.

తా. "శ్రుతపూర్వమగు శబ్దము ఇప్పుడు లేద"నెడు ప్రతీతి యనుమితిరూపమని చెప్పుటకు వీలులేనందున ప్రత్యక్షరూపమనియే చెప్పవలయును. దానికొఱకు, ఆకాశోపలబ్ధియనవసరమయినచో నాప్రత్యక్షము సంభవించుటయే దుర్లభము గావున నభావప్రత్యక్షములో నధికరణయోగ్యత తంత్రము కాదు. భూతలము "ఘటముగలది" యను ఘటజ్ఞానసంసర్గయోగ్యమై ఘటోపలబ్ధి లేనిసమయమునఁ గూడ ప్రత్యక్షవిషయ మగుటవలన నెట్లు ఘటాభావముగలదో అట్లే వీణాదులు గూడ "ఇది వీణాశబ్దమ"ను శబ్దజ్ఞాన సంసర్గయోగ్యములై శబ్దోపలబ్ధి లేనిసమయమునఁగూడ ప్రత్యక్షములగుటవలన శబ్దధ్వంసగలవి యను ననుమానముచే శబ్దనాశమును గోచరించెడు జ్ఞాన మనుమితిరూపమని యాశంకింపరాదు.

మూ. ఏకజ్ఞానసంసర్గయోగ్యత్వాఽభావాత్. శబ్దస్య
శ్రోత్రత్వాద్వీణాదీనాం చాక్షుషత్వాత్. అభి
మానమాత్రాదితి చేన్న,తథాపి శబ్దప్రధ్వంసస్య
అతద్దేశత్వాత్. అత్యన్తాఽభావస్య చ కాలా
ఽనియమాత్.

తా. శబ్దము శ్రోత్రగ్రాహ్యమును వీణాదులు చక్షుర్గ్రాహ్యములు నగుటచే నేకజ్ఞానములో శబ్దవీణాదులకు భానము సంభవించనందున శబ్దైకజ్ఞానసంసర్గయోగ్యతారూప హేతువు అసిద్ధమగును. గాన పై యనుమానము పనికి

రాదు. అభిమానమును బట్టి సాధించుటకుఁగూడ వీలులేదు. వీణాదులు శబ్దసమవాయి కారణములు కానందున నచ్చట శబ్దధ్వంస యుండుట శాస్త్రవిరుద్ధము. "నిశ్శబ్దాః" యనునది శబ్దసమవాయిత్వరహితార్థకమేయనినచో నత్యంతాభావము నకు కాలనియమము లేనందున శబ్దోపలబ్ధి లేనిసమయముననే నిశ్శబ్దత్వమును సాధించెదమనుట కుదరదు.

మూ. స్యాదేతత్, శబ్దసదాకాశోపాధయో హి భేర్యాదయః, తేన తేషు విధీయమానః శబ్ద ఆకాశ ఏవ విహితో భవతి, ప్రతిషిధ్యమానశ్చతత్రైవ ప్రతిషిద్ధో భవతి, శరీరే సుఖాదివదితి చేన్న.

తా. ఉపాధియందుండు విధినిషేధము లుపాధివిశిష్ట మందే సంభవించును. శరీరమందు విధీయమానమగు సుఖము గాని తన్నిషేధముగాని శరీరముతోఁగూడుకొనిన ఆత్మయం దెట్లుండునో యట్లే భేరీమృదంగాదిరూపమగు నుపాధులందు విధీయమానమగు శబ్దమున్ను శబ్దప్రతిషేధమును ఈయుపాధి విశిష్టమగు నాకాశమునందే సంభవించును. కనుక భేర్యాదుల యందు సాధించెడు నిశ్శబ్దత్వమున కతద్దేశత్వము నాశంకించుటకు వీలులేదు.

మూ. తత్ర సోపాధావాత్మని ప్రత్యక్షసిద్ధే, సుఖాది నిషేధస్యాపి ప్రత్యక్షసిద్ధత్వాత్. నచైనమిహాపి; తదుపహితస్య నభసః అప్రత్యక్షత్వాత్. ఉపాధ యస్తావత్ప్రత్యక్షా ఇతి చేన్న, తైరభావానిరూపణాత్. నిరూపణే వా ప్రత్యక్షేణాపి గ్రహణప్రసంగాత్.

తా. ఈరీతి నాకాశమున నిశ్శబ్దత్వమును సాధించుట వెనుకటిదృష్టాంతమునుబట్టి కుదురదు. సోపాధిక మగునాత్మ ప్రత్యక్షమైనందున దానియందు సుఖాదినిషేధముఁగూడ ప్రత్యక్ష మగును. ప్రకృతమున, సోపాధికమగునాకాశ మప్రత్యక్షమైనందున దానియందుండు శబ్దధ్వంసయుఁ బ్రత్యక్షము గాదు. ఉపాధి ప్రత్యక్షమైనప్పుడు ఉపాధిచే నభావ నిరూపణము చేయుట యసంగతము. ఉపాధులగు వీణాదుల చేతనే శబ్దధ్వంస నిరూపింపఁబడుననినచో నయ్యది ప్రత్యక్షముగానే గ్రహింపఁబడవలసి వచ్చును.

**మూ.** నచైవం సతి పారమార్థికాధికరణనిరూపణీయత్వమభావస్య. న చ తేఽపి ప్రత్యక్షసిద్ధాః, సర్వత్ర శబ్దకారణవ్యవధానేఽప్యుపలబ్ధస్య శబ్దస్య నాస్తితాప్రతీతేః.

తా. అట్టియెడ ప్రతియోగి సమవాయికారణనిరూపణీయత్వమభావమునకు లేకపోవలసి వచ్చును. మఱియు శబ్ద కారణ వ్యవధాన ముండినను తనకు శబ్దోపలబ్ధి యున్నపు డప్రత్యక్షములగు వీణాదులయందు శబ్దాభావప్రతీతి యనుపపన్నము కావలసివచ్చును.

**మూ.** అనుమానికైస్తైస్తథా వ్యవహార ఇతి చేన్న, హేతోస్తద్వృత్తయా అనుపలభ్యమానత్వస్య అనైకాంతికత్వాత్, అభావప్రతీతికాలే సందిగ్ధాశ్రయత్వాచ్చ, ఉపలభ్యమానవిశేష్యత్వపక్షే చాసిద్ధేః, ఇంద్రియవ్యవధానాచ్ఛబ్దలింగస్య చానుపలంభాత్.

తా. శబ్దవిశేషముచే ననుమితములగు వీణాదులయందు శబ్దము ప్రత్యక్షము గాకపోవుటచే నిశ్శబ్దత్వము నను మేయించెద మనినచో శబ్దముగల యాకాశమందు శబ్దవత్తయాఽనుపలభ్యమానత్వరూపహేతు వుండుటఁజేసి వ్యభిచారమువచ్చును. శబ్దవిశేషానుమితమగు వీణ ప్రత్యక్షము కానియెడ వీణ యుండెనా? లేదా? యనుసందేహముచేనాశ్రయాసిద్ధి వచ్చును. "శబ్దవత్తయా అనుపలభ్యమానత్వేసతి ఉపలభ్యమానత్వాత్." యని హేతువన్నచో వెనుకటి దోషము వారించిననూ హేతువు అసిద్ధమగును. ఇంద్రియ వ్యవధానమువలన శబ్దము ప్రత్యక్షము కానియెడల శబ్దరూపలింగ మనుపలభ్యమానమగుటవలన నాశ్రయము సిద్ధింపమిచే నాశ్రయాసిద్ధివచ్చును. కాన శబ్దధ్వంస యనుమితమగుటకు వీలులేదు.

మూ. అపిచ నష్టాశ్రయాణాం ద్రవ్యగుణకర్మణాం నాశోపలంభః కథమ్? న కథంచిదితిచే దాశ్రయనాశాత్కార్యనాశ ఇతి కుతఏతత్? అనుమానత స్తథోపలంభాదితి చేన్న, తుల్యన్యాయేనోక్తోత్తరత్వాత్. తంతుషు నష్టేష్వపి యది పటో న నశ్యేత్తద్వదేవోపలభ్యేతేతి చేత్, ఏతస్య తర్కస్యానుగ్రాహ్యమభిధీయతాం. యదత్రోపలభ్యతే న తత్కార్యపరంపరావత్, యోగ్యస్య తథానుపలభ్యమానత్వే సతి ఉపలభ్యమానత్వా దితి చేన్న.

తా. ప్రతియోగి సమవాయికారణమునుబట్టియే యభావనిరూపణము చేయఁబడునని చెప్పిన నాశ్రయనాశమువలనఁ గలుగు ద్రవ్యగుణకర్మలయొక్క నాశమునకుఁ బ్రత్యక్షత్వ మెట్లు? ఎట్లును లేదనినచో "నాశ్రయనాశమువలనఁ గార్యనాశ" మనునది యెట్టిజ్ఞానము ? స్వరూపకాలాకాశాదుల పక్షముగాచేసిన నాశ్రయాసిద్ధ్యనైకాంతికత్వాదిదోషములు సంభవించుటచే నయ్యది అనుమితిరూపమని చెప్పుటకు వీలు లేదు. "తంతువులు నశించినను బటము నశింపనియెడల యుపలభ్యమానము కానిమ్ము. అట్టి యుపలబ్ధి లేనందునఁ బటము లేద"నెడుజ్ఞానము తర్కానుగృహీతమగు ననుమితి రూపమని చెప్పుటకు వీలులేదు. అనుమానమే లేనందున వెనుకఁ జెప్పిన తర్కముచే ననుగ్రాహ్యమగు ననుమితియే సంభవింపదు. తత్కార్య మనుపలబ్ధమైన, నేది యుపలభ్యమాన మగునో యది దానియొక్క కార్యపరంపరాశూన్యమను ననుమానమువలనఁ గలుగు ననుమితియే తర్కానుగ్రాహ్య మని యాశంకించరాదు.

మూ. తంత్వవయవానాం పటాఽనాధారత్వే సాధ్యే
సిద్ధసాధనాత్. పటప్రధ్వంసవత్త్వే సాధ్యే బాధి
తత్వాత్, తస్య స్వప్రతియోగికారణమాత్రదేశ
త్వాత్. యే పటధ్వంసవంతస్తంతవస్తదభావ
వంత ఏతే అంశవ ఇతి సాధ్యమితి చేన్న, తంతు
నాశోత్తరకాలం పటనాశాత్తద్వత్త్వానుపపత్తేః.
యోగ్యతామాత్రసాధనే చ పటప్రధ్వంసా
సిద్ధేః. తస్య నాశాఽనాశయోస్సమానత్వాత్.

తా. ఇట్టి యనుమానమువలన నుపలభ్యమానములగు తంత్వవయవములను పక్షము చేసి పటానాధారత్వమును సాధించినచో తంతువులే పటాధారము లగుటచేఁ దంత్వంశల యందుఁ బటానాధారత్వము పూర్వమే సిద్ధించినందున తిరిగి దానిని సాధించిన సిద్ధసాధనరూపదోషము ప్రసక్తమగును. పటధ్వంసను సాధ్యము చేసినచో నయ్యది పటసమవాయికారణములగు తంతువులయందే యుండుటవలనఁ బక్షమందు సాధ్యము లేనందున బాధ ప్రసక్తమగును. తంతునాశమైన పిదపఁ బటనాశమగుటచే "పటధ్వంసవత్తంత్వభావవాన్." అను సాధ్యాప్రసిద్ధి వచ్చుటచే నంశలయందు పటధ్వంసవిశిష్టములగు తంతువులయభావము సాధించెదమనుటకుఁ గూడ వీలు లేదు. పటధ్వంసయోగ్యతావిశిష్టతంత్వభావము సాధ్యమనుటకుఁగూడ వీలులేదు. పటమున్నపుడు లేనపుడుఁ గూడ యోగ్యతయున్నందునఁ బటధ్వంససిద్ధియే లేకపోవలసి వచ్చును.

మూ. అనన్యగతికతయా విశిష్టనిషేధే కృతే విశేషణానామప్యభావః ప్రతీతో భవతి, గుణక్రియావత్పటాధారా స్తంతవో న సంతి స్వావయవేష్వితి ప్రత్యయ ఇతి చేత్. తథాపి గుణకర్మణాం పటస్య చ ప్రధ్వంసః కిమధికరణః ప్రతీయతే ఇతి వక్తవ్యం. అంశ్వధికరణఏవేతి చేత్, భ్రాన్తిస్తర్హియమ్, తస్య అతద్దేశత్వాత్.

తా. విశిష్టనిషేధము చేసినచో విశేషణనిషేధసిద్ధిఁ గూడ గలుగుటచే "అంశవః, గుణక్రియావత్పటాధారతంత్వభావవంతః" అను ప్రతీతియే ద్రవ్యగుణకర్మనిషేధవిషయక

మని చెప్పిన నీప్రతీతివలన ద్రవ్యగుణకర్మలయొక్క నిషేధము సిద్ధమైనను, ఆనిషేధమేయధికరణకమో చెప్పవలయును. అంశువులయందే గుణకర్మపటములయొక్క నిషేధప్రతీతి యనినచో నంశువులు వీనికాధారములు కానందున నంశువులయందు వీనినిఁ గోచరించుప్రతీతి భ్రమ కావలసి వచ్చును.

మూ. ఆశ్రయావచ్ఛేదకతయా తేషామప్యదూరవిప్రకర్షేణ తద్దేశత్వం, ఏవంభూతేనాపి దేశేన తన్నిరూపణం, యోగ్యతాయాః అవ్యభిచారాదితి చేత్. న తత్ప్రతియోగిసమవాయిదేశేనైవ ప్రధ్వంసనిరూపణమితి నియమః. ప్రకారాంతరేణాపి నిరూపణాత్.

తా. తంతువులయందు పటధ్వంస యుండునపుడు స్వావయవావచ్ఛేదేన ఉండుటచే విప్రకర్ష లేనందున నంశువులయందుఁ గూడ పటధ్వంసయోగ్యత యుండుననినచోఁ బ్రకారాంతరముచేఁగూడ నభావనిరూపణము చేయవచ్చును గాన ప్రతియోగి సమవాయిదేశముచేతనే ప్రధ్వంస నిరూపింపఁబడునను నియమము లేదు.

మూ. తస్మాద్యస్య యావతీ గ్రహణసామగ్రీ తం విహాయ తస్యాం సత్యాం తదభావో యత్ర క్వచిన్నిరూప్యో దేశే కాలే వా. ఇయాంస్తు విశేషః. సా సతీ చేత్ప్రత్యక్షేణ,అసత్యేవ జ్ఞాతా చేదనుమానాదినేతి స్థితిః.

తా. ప్రతియోగి గ్రాహకమగు సామగ్రియు నాప్రతియోగ్యవినాభూతమగు సన్నికర్షయు లేనిసమయమున నితర

మగు సామగ్రిదశయందు దేశమునందుఁగాని కాలమునందుఁగాని ప్రధ్వంస మెచ్చట నిరూపింపఁబడును. యోగ్యానుపలబ్ధి సహకృతమగు నింద్రియసన్నికర్షరూపమే సామగ్రియనిన దానివలన ప్రత్యక్షమే కలుగును. ఇంద్రియసన్నికర్షరూపము గానిచో ననుమానాదికమువలననే గలుగును.

మూ. ఏతేన, "సద్భ్యామభావో నిరూప్యతే"–ఇత్యాది శాస్త్రవిరోధో పరిహృతో వేదితవ్యః. ఉభయ నిరూపణీయ ప్రతియోగివిషయత్వాదనుమాన విషయత్వాచ్చ. అన్యథా, ఆశ్రయాసిద్ధిప్రసంగాత్. తత్రాపి న గ్రహణే నియమో, జ్ఞాన మాత్రం తు వివక్షితమ్, తావన్మాత్రస్యైవ తదుపయోగాత్. క్వచిద్గ్రహణస్య సామగ్రీసంపాతాయాతత్వాత్.

తా. "అభావము ప్రతియోగి సమవాయిదేశనిరూపణీయమ"ను నియమము లేనిచో "సద్భ్యామభావో నిరూప్యతే." "ప్రతియోగి తత్సమవాయి దేశములచే నభావము నిరూపింపఁబడు"నను శాస్త్రవిరోధము ప్రసక్తమగునని యాశంకింపరాదు. ప్రతియోగితత్సమవాయిదేశములచే నభావము నిరూపింపఁబడునని దానికి యర్థముగాదు. మఱి యేమన, సంయోగముభయనిష్ఠమగుటంజేసి యుభయనిరూప్యమగునట్లు తదభావముకూడ నుభయనిరూప్యమగుననియే యర్థము.ఇట్టి విశేషస్థలవిషయకమగుటవలన శాస్త్రవిరోధము పరిహృతమగును. ఇట్లే యీశాస్త్రము వ్యాపకాభావముచే వ్యాప్యాభావమును సాధించు ననుమానవిషయకమనియుఁ జెప్పవచ్చును. ఆయను

మాన మాశ్రయమును గోచరింపనిచో నాశ్రయాసిద్ధి యను దోషము ప్రసక్తమగును. ఆశాస్త్రము ప్రతియోగ్యను యోగ్యుభయనిరూప్యప్రతియోగివిషయకమనినను అధికరణముయొక్క స్మరణవలనఁ గూడ నభావగ్రహణము కలుగుటచే నధికరణసాక్షాత్కారమే యపేక్షితముః గాదు.

మూ. యది చాధికరణగ్రహే శాస్త్రస్య నిర్భరః స్యాత్, వహ్నేర్దాహ్యం వినాశ్యానువినాశవత్తద్వినాశ్యః (న్యా 4 అ 1 ఆ. 27 సూ.) ఇతి నోదాహరేత్, అసిద్ధత్వాత్.

తా. వహ్నేర్దాహ్యం వినాశ్యానువినాశవత్తద్వినాశః. యనియుదహరించుటవలన న్యాయసూత్రకారాశయముకూడ నిదియే. ఈసూత్రము ఘటగతానిత్యత్వముయొక్క నిత్యత్వానిత్యత్వవిచారణయందు ఘటనాశానంతరము తద్గతానిత్యత్వముఁగూడ నశించునను నాశయముచే సూత్రకారునిచేఁ జెప్పఁబడినది. దాహ్యం = కాష్ఠాదికమును, వినాశ్య = నశింపఁజేసి, వహ్నేః=వహ్నియొక్క, అనువినాశవత్=అనువినాశమువలె, తద్వినాశః=అనిత్యత్వవినాశము యని సూత్రార్థము. కావున అధికరణముయొక్క ప్రత్యక్షమే యపేక్షితమైన నసిద్ధి సంభవించును.

మూ. న హి వహ్నివినాశః తదవయవపరంపరాస్వనిరూప్యః, తాసామనిరూపణాత్. నాప్యన్యత్ర గమనాభావాదినా పారిశేష్యాదనుమేయః, హేతోరేవ నిరూపయితుమశక్యత్వాత్.ఆశ్రయానుపలబ్ధేః.

తా. సూత్రకారుఁడు వహ్నినాశము వహ్నియొక్క యవయవములయందే యుండునని చెప్పనందున దానియొక్క యవయవపరంపరయందే వహ్నినాశముండుటకు వీలులేదు. ఇంకొకచోటకు గమనము లేనందునను, అనుపలభ్యమాన మైనందుననూ నాశజ్ఞాన మనుమితిరూపమని చెప్పుటకు వీలు లేదు. అనుపలభ్యమానత్వమున కాశ్రయమగు వహ్ని లేనందున, అపక్షధర్మమైన ననుపలభ్యమానత్వాదికమునకు హేతుత్వము సంభవించనందున దానివలన వహ్నినాశ మను మేయించుటకు వీలులేదు.

మూ. నాపి నిమిత్తవినాశాత్సర్వమిద మేకవారేణ సే త్స్యతీతి యుక్తం, తస్యానైకాంతికత్వాత్. తేజ సా విశేషితత్వాదయమదోష ఇతి చేత్, న. వ్యాప్త్యసిద్ధేః. న హి ఇంధనవినాశాత్తేజోద్ర వ్యమవశ్యం వినశ్యతీతి క్వచిత్సిద్ధం, ప్రత్యక్ష వృత్తేరనభ్యుపగమాత్. తస్మాదత్యాగేనాన్య త్ర గమనం న సంభావ్యతే తేన నిమిత్తాదినాపి దేశేన ప్రధ్వంసో నిరూప్యతే ఇత్యకామేనాపి స్వీకరణీయం, గత్యంతరాఽభావాత్. అతఏవ తమసః ప్రత్యక్షత్వేఽప్యభావత్వమామనన్త్యా చార్యాః. ఏతేన శబ్దప్రాగభావో వ్యాఖ్యాతః.

తా. నిమిత్తమగు నింధనాదికముయొక్క నాశము ప్రత్యక్షమైనందున నీప్రత్యక్షసిద్ధమగు నిమిత్తనాశమువలన నొకపర్యాయమే హేతువున్నూ వహ్నినాశరూప సాధ్య మున్నూ సిద్ధించునని చెప్పుటకు, నిమిత్తమునశించినను నైమిత్త

కముయొక్క నాశమెచటను గానరానందున వీలులేదు. "నిమిత్తనాశాద్వహ్నినాశః" అనియే దానికర్థమని చెప్పుటకు వీలులేదు. ఇంధనరూపనిమిత్తనాశమువలన నవశ్యము వహ్ని నశించు ననునియమము, ఇంధననాశమైనను వహ్ని యవయవ రూపముగాఁ గానవచ్చుచున్నందున సరిగాదు.

కావున దేనిని విడచి యింకొకస్థలమునకు వెళ్లుట సంభవింపదో, యట్టిదేశముచేతనే ధ్వంసనిరూప్యమని, గత్యంతరము లేనందున నవశ్యము స్వీకరించవలెను. కనుకనే కపాలాదిరూప యవయవపరంపర నశించినపిదప ఘటనాశమగుటవలన "భూతలే ఘటోనాస్తి" యను ప్రతీతిఁగూడ నుపపన్నమగును. తేజోభావరూప తమోవిషయకమగు "తమోవానయం దేశః" అను ప్రతీతిఁగూడ నుపపన్నమగును. కాబట్టి శబ్దధ్వంసప్రత్యక్షములోఁ బ్రతియోగి సమవాయికారణమగు నాకాశము యొక్క యుపలబ్ధి యవసరము లేదు. ప్రతియోగియోగ్యత మాత్రమే ప్రయోజకము. శబ్దప్రాగభావస్థలమందుఁ గూడ నిట్లే యూహింపవలయును.

మూ. ఏవం స్థితే అనుమానమప్యుచ్యతే:— శబ్దో౽నిత్యః ఉత్పత్తిధర్మకత్వాత్, ఘటవత్. న చేదం ప్రత్యభిజ్ఞానబాధితం, తస్య జ్వాలాదిప్రత్యభిజ్ఞానేనావిశేషాత్. నైవం అబాధితస్య తస్యస్వతః ప్రమాణత్వాదితి చేత్తుల్యమ్. జ్వాలాయాం తన్నాస్తి విరుద్ధధర్మాధ్యాసేన బాధితత్వాత్, అన్యథా భేదవ్యవహారవిలోపప్రసంగోనిమిత్తా

భావాత్. ఆకస్మికత్వేవాఽతిప్రసంగఇతి చేత్తు ల్యం శబ్దేఽపి, తీవ్రతీవ్రతరత్వమన్దమన్దతరత్వా దేర్భావాత్.

తా. ప్రత్యక్షముచే శబ్దముయొక్క యనిత్యత్వమును సాధించినట్లే "శబ్దోఽనిత్యః ఉత్పత్తిధర్మకత్వాత్ ఘటవత్." అను అనుమానమువలనఁ గూడ సాధింపవచ్చును. 'సఏవాయం గకారః' ఆగకారమే యీగకారమను శబ్దనిత్యత్వసాధక ప్రత్యభిజ్ఞచే నీయనుమానము బాధితమని చెప్పుటకు వీలు లేదు. "సైవేయం దీపజ్వాలా" ఆదీపజ్వాలయే యీదీపజ్వాల యను ప్రత్యభిజ్ఞయనిత్యమగు దీపజ్వాలయొక్క సాజాత్యవిష యకమగునటులనే 'సఏవాయం గకారః' యను ప్రత్యభిజ్ఞయు శబ్దనిత్యత్వమును గోచరింపక యనిత్యమగుశబ్దముయొక్కసాజా త్యమునే గోచరించును. జ్వాలను గోచరించు ప్రత్యభిజ్ఞ సాజా త్యవిషయకమైనను, వర్ణములను గోచరించు ప్రత్యభిజ్ఞమాత్ర ము స్వతః ప్రమాణభూతమగు శబ్దనిత్యత్వమునే గోచరించు ననుట సమంజసము కాదు కదా! జ్వాలయందు విరుద్ధధర్మము యొక్క యధ్యాస మున్నందున జ్వాలాప్రత్యభిజ్ఞ నిత్యజ్వా లను గోచరించదు. భిన్నములగు జ్వాలలకే సాజాత్యమును గోచరించును. నిమిత్తాంతరము లేనందున విరుద్ధధర్మాధ్యాస మున్నను భేదము నంగీకరించనిచో భేదవ్యవహారమునకే విలో పము వచ్చును. ఆప్రత్యభిజ్ఞ యనియతహేతుకమైనచో విరు ద్ధధర్మాశ్రయము లగువానికిఁ గూడ నైక్యబోధక ప్రత్యభిజ్ఞ యుండవలసివచ్చును. కాన విరుద్ధధర్మాధ్యాసయున్నచో భేద మునే యంగీకరించవలయునని యనినయెడల శబ్దమునందుఁ

గూడ తీవ్రతీవ్రతరత్వ మందమందతరత్వాది రూపభేదక ధర్మములున్నందున శబ్దప్రత్యభిజ్ఞయు సాజాత్యమునే గోచరించును. కాని శబ్దనిత్యత్వమును గోచరింపదు.

మూ. తదిహ న స్వాభావికమితి చేన్న, స్వాభావికత్వావధారణన్యాయస్య తత్ర తత్ర సిద్ధస్యాత్రాపి తుల్యత్వాత్. నహ్యపాం శైత్యద్రవత్వే స్వాభావికే తేజసో వా ఔష్ణ్యభాస్వరత్వే ఇత్యత్రాన్యత్ప్రమాణమస్తి ప్రత్యక్షాద్వినా. తత్త్రైవ యుజ్యతే, అన్యస్యోపాధేరనుపలంభాన్నియమేన తద్గతత్వేన చోపలంభాదితి చేత్తుల్యమేతత్.

టీ. ఈధర్మములు శబ్దమునకు స్వాభావికములుగావని చెప్పుటకు వీలులేదు. ఉదకమునకు శీతస్పర్శద్రవత్వములును తేజస్సున కుష్ణస్పర్శభాస్వరరూపములును స్వాభావికము లనుటకుఁ బ్రత్యక్ష మెట్లు ప్రమాణమో యట్లే శబ్దమునకాధర్మములు స్వాభావికము లనుటకుఁ గూడ ప్రత్యక్షమే ప్రమాణమగును. ఇతరములగు నుపాధులం దుపలభ్యమానములుగాక జలమునందే శైత్యద్రవత్వము లుపలభ్యమానములగుటవలనను, భాస్వరరూపోష్ణస్పర్శలు తేజస్సునందే యుపలభ్యమాన మగుటవలనను, శైత్యద్రవత్వములు జలమునకును భాస్వరరూపోష్ణస్పర్శలు తేజస్సునకును స్వాభావికములగునని చెప్పినయెడలఁ బ్రకృతమునఁ గూడ మంద్రత్వాది ధర్మములు శబ్దధర్మములుగానె యుపలభ్యమానము లగుటవలన శబ్దమునకే స్వాభావికములని చెప్పుదుము.

మూ. తథాప్యతీంద్రియాన్యధర్మత్వశంకా స్యాదితి చేదేతదపి తాదృగేవ. తత్కిం యద్గతత్వేన యదుపలభ్యతే, తస్యైవ స ధర్మః, నన్వేవం పీతః శంఖో, రక్తః స్ఫటికో, నీలః పట ఇత్యపి తథా స్యాదవిశేషాత్. న.

తా. అతీంద్రియమగుధ్వని ధర్మమే మంద్రత్వాదికమని నచో, యట్టి యాశంక యందరకును సమానమే. దేనియందే ధర్మముపలభ్యమానమగునో యది దానిధర్మమను నియమము వలన మందత్వాదికము వర్ణధర్మమనినయెడలఁ బీతారుణ్య నీలాదిరూపములు శంఖస్ఫటికపటాదులం దుపలభ్యమానము లగుటవలన నవియు తద్ధర్మములు కావలసివచ్చును. కాన వెనుకటి నియమమునుబట్టి మందత్వాదులు వర్ణధర్మములని చెప్పుటకు వీలులేదని యాశంకించరాదు.

మూ. పీతత్వాదీనామన్యధర్మత్వస్థితౌ శంఖాదీనాం చ తద్విరుద్ధధర్మత్వస్థితే జపాకుసుమాద్యన్వయ వ్యతిరేకానువిధానాచ్చ బాధేన భ్రాన్తత్వావ ధారణాత్. న చేహ తారతారతరత్వాదేరన్య ధర్మత్వస్థితిః, నాపి శుకశారికాదిగకారాణాం తద్విరుద్ధధర్మత్వం, నాప్యన్యస్య తద్ధర్మిణోఽ న్వయవ్యతిరేకావనువిధత్తే.

తా. పీతాదుల కితరధర్మత్వమును శంఖాదుల కితరధర్మి త్వము నున్నందున జపాకుసుమాదులసంబంధమున్నపుడే స్ఫటి కమునం దారుణ్యప్రతీతి యుండుటఁబట్టియు, నది లేనప్పు డా ప్రతీతి లేకపోవుటఁబట్టియు, "రక్తః స్ఫటికః" యను ప్రతీతి

భ్రాంతియని జెప్పెదము. మందమందతరత్వాదుల కన్యధర్మత్వ ముగాని శుకశారికాద్యుచ్చరిత గకారాదులకు తద్విరుద్ధధర్మ వత్త్వముగాని జపాకుసుమాదులవంటి యితరధర్మములయొక్క యన్వయవ్యతిరేకములుగాని లేనందున మందమందతరత్వాది ప్రతీతులు భ్రాంతిరూపములని చెప్పుటకు వీలులేదు.

మూ. తథాపి శంకా స్యాదితి చేదేవమియం సర్వత్ర. తథా చ న క్వచిత్కించిత్కుతశ్చిత్సిధ్యేత్. న చైతచ్ఛంకితుమపిశక్యతే, అప్రతీతే సంస్కారాఽభావాత్, సంస్కారానుపనీతస్య చారోపయితుమశక్యత్వాత్. న చ ధ్వనిధర్మా ఏవ గృహ్యంతే, స్పర్శాద్యనంతర్భావేణ భావేషు త్వగాదీనామవ్యాపారాత్. న చ శ్రవణేనైవ తద్గ్రహణం, అవాయవీయత్వేన తస్య వాయుధర్మాఽగ్రాహకత్వాత్ చక్షుర్వత్. తారతారతరత్వాదయో వా న వాయుధర్మాః, శ్రావణత్వాత్, కాదివత్. వాయుర్వా న శ్రవణగ్రాహ్యధర్మా, మూర్తత్వాత్, పృథివీవత్.

తా. అట్లయిననూ మందత్వాదిక మన్యధర్మమేమో యనుశంక యుండుననిన అట్టిశంక అంతటను గలుగవచ్చును. గాన నెద్దానివలనను యెక్కడను, యేదియును సిద్ధింపక పోవలసివచ్చును. అదియునుగాక యట్లు శంకించుటకుఁ గూడ వీలులేదు. అన్యమజ్ఞాతమైనచో నీధర్మముఁగూడ గృహీతము కాకపోవుటచే మందత్వాదికమునకు శబ్దమందారోపమే యశక్యము. ధ్వనిగతమందత్వాదికమునకు శబ్దమం దారోపమని

చెప్పుటకు వీలులేదు. త్వగింద్రియముచే వాయువునందుండు స్పర్శగ్రహింపఁబడు నట్లు స్పర్శకంటె భిన్నమగు ధ్వని గ్రహింపఁ బడుట లేదు. శ్రోత్రము వాయవీయము గానందున నయ్యది వాయువునందుండుధ్వనినిగాని తద్ధర్మమగు మందత్వాదికమును గాని గ్రహింపనసమర్థమగుటంజేసి, మందత్వాదికము ధ్వనిధర్మముగా నుపలభ్యమానము గానందున నట్టి యనుపలభ్యమానమగు తారత్వాదికమునకు శబ్దమం దారోప మసంభావితము. మంద్రత్వాదికము శ్రోత్రగ్రాహ్య మగుటవలన వాయుధర్మమని చెప్పుటకు వీలులేదు. పృథివివలె వాయువును మూర్తమగుటవలన శ్రావణగ్రాహ్యధర్మము కలది గాదు.

మూ. యది చ నైవం, కాదీనామపి వాయవీయత్వప్రసంగః. తతః? కిం అవయవిగుణత్వేఽనిత్యత్వం, పరమాణుగుణత్వేఽగ్రహణం. ద్వయమప్యేతదనిష్టం భవతః. అవశ్యం చ శ్రవసా గ్రాహ్యజాతీయగుణవతా భవితవ్యం,బహిరింద్రియత్వాత్, ఘ్రాణాదివత్.

తా. వాయువు మూర్తమైనను అందు శ్రవణగ్రాహ్య దర్మము లుండుననినచో అట్లే శ్రవణగ్రాహ్యములగు కకారాదివర్ణములు గూడ నుండవలసివచ్చును. ఇట్లు వాయువునందు వర్ణములను స్వీకరించిన బాధకమేమందువా! వాయువు నిత్యానిత్య భేదముచే ద్వివిధమగుటచేనవి యవయవివృత్తులైన యెడల యనిత్యములును, పరమాణురూపవాయు వృత్తులైన యెడల నగ్రాహ్యములును కావలసి వచ్చును. ఈయుభయమును, నీకనిష్టము గదా! గావున బహిరింద్రియమగు ఘ్రాణేం

ద్రియమువలె శ్రోత్రముఁ గూడ గ్రాహ్యాజాతీయగుణము కలదని యంగీకరించవలయును.

మూ. సన్తుధ్వనయోఽపి నాభసాః, తథా చ తద్ధర్మ గ్రహణం శ్రవసోపపద్యతేతి చేన్న. తారస్తార తరో వాయం గకార ఇత్యత్ర ధ్వనీనామస్ఫుర ణాత్. న చ వ్యక్త్యావినా సామాన్యస్ఫురణం, కారణాఽభావాత్. వ్యక్తిస్ఫురణసామగ్రీనివి ష్టా హి జాతిస్ఫురణసామగ్రీ. కుత ఏతత్? అన్వ యవ్యతిరేకాభ్యాంతథాఽవగమాత్.ఐంద్రియి కేష్వేవ ఘటాదిషు సామాన్యగ్రహణాత్, అతీంద్రియేషు చ మనఃప్రభృతిష్వగ్రహణాత్.

టీ. ధ్వనియు శబ్దమే యగుటచే నాకాశమందే యుండును, మందత్వాదికము ధ్వనిధర్మము, ఈరెంటినిఁగూడ శ్రోత్రము గ్రహించును. కావున ధ్వనియందు గృహీతమగు మందత్వాదికమునకు వర్ణములందారోపమని చెప్పుటకు వీలు లేదు. "ఈగకారము మందము మందతరము" యను ప్రతీ తులు ధ్వనివిషయకములు కానందున మందత్వాదికము ధ్వని వృత్తియని చెప్పుటకు వీలులేదు. వ్యక్తిభానముండనిచో జాతి భానముండుట దుర్లభము కదా? వ్యక్తిభాసకసామగ్రి యున్న పుడే జాతిభానముండునుగాన వ్యక్తిభాసకసామగ్రి లేనిచోఁ గేవలజాతిభానమనుపపన్నము. జాతిభానమునుఁ గూర్చి వ్యక్తి భాసకసామగ్రికన్వయవ్యతిరేకములచేఁ గారణత్వము నిశ్చి తము. ఘటాదిచాక్షుషప్రత్యక్షములో ఘటమందు ఘటత్వాది

జాతి భాసించుటవలనను నతీంద్రియములగు పరమాణు మన స్సులయందు జాతిభానము లేకపోవుటవలనను వ్యక్తిభాసక సామగ్రి కిట్టి యన్వయవ్యతిరేకములవలన జాతిభాసకత్వము క్లుప్తమై యున్నది. కావున ధ్వనిరూపధర్మి గ్రహణములేనిచో మందత్వాదిరూపజాతిగ్రహణము సంభవించనందున ధ్వనిగత మందత్వాదికమునకు గకారాదివర్ణములయం దారోపమని చెప్పుటకు వీలులేదు.

మూ. స్వరూపయోగ్యతైవ తత్ర నిమిత్తమకారణం వ్యక్తియోగ్యతేతి చేత్. ఏవం తర్హి సత్తాద్రవ్యత్వపార్థివత్వాదీనాం స్వరూపయోగ్యత్వే పరమాణ్వాదిష్వపి గ్రహణప్రసంగః, అయోగ్యత్వే ఘటాదిష్వపి తదనుపలంభాపత్తిరితి దురుత్తరం వ్యసనమ్. తస్మాద్వ్యక్తిగ్రహణయోగ్యతాంతర్గతైవ జాతిగ్రహణయోగ్యతేతి తదనుపలంభే జాతేరనుపలంభ ఏవ. తథాచ న తారత్వాదీనామారోపసంభవ ఇతి స్వాభావికత్వస్థితౌ విరుద్ధధర్మాధ్యాసేన భేదస్య పారమార్థికత్వాత్ప్రత్యభిజ్ఞానమప్రమాణమితి న తేన బాధః.

తా. వ్యక్తి యోగ్యత లేకపోయినను జాతిభానములో స్వరూపయోగ్యతయే ప్రయోజకమనినచో నయోగ్యమగు పరమాణ్వాదికమునందున్న సత్తాద్రవ్యత్వపార్థివత్వాదుల సాక్షాత్కారము కలుగవలసివచ్చును. అవియు నయోగ్యము

లైనచో ఘటాదులయందును వానియుపలబ్ధి లేకపోవలసి వచ్చును. కావున వ్యక్తియోగ్యత యున్నపుడే జాతిగ్రహణ యోగ్యతకూడ నుండును. వ్యక్తి యుపలభ్యమానము కాన పుడు జాత్యుపలబ్ధి కూడ సంభవింపదు. కావున మందత్వా దులు వర్ణములకు స్వాభావికములగు ధర్మములగుట నిట్టివిరుద్ధ ధర్మాధ్యాసముచే వర్ణములకు భేదము సిద్ధించుచుండ "సవే వాయం గకారః" అను ప్రత్యభిజ్ఞ వర్ణనిత్యత్వములోఁ బ్రమాణము గాదు. ఇట్టి ప్రత్యభిజ్ఞచేఁ బూర్వానుమానము బాధితము కానేరదు.

మూ. నాపి సత్ప్రతిపక్షత్వం, మిథో విరుద్ధయోర్వా స్తవతుల్యబలత్వాఽభావాత్. ఏకస్య అన్యత మాఙ్గవైకల్యచింతాయా మస్య వైకల్యే తస్యై వోద్భావ్యత్వాత్. అవైకల్యే త్వదీయేనైవ వికలేన భవితవ్యమితి హీనస్య న సత్ప్రతిపక్ష

తా. పరస్పరవిరుద్ధములగు సాధ్యతదభావముల సాధిం చు హేతువులకుఁ దుల్యబలత్వమున్నపుడే సత్ప్రతిపక్షత్వము. హేతువునకంగములగు పక్షసత్వ, సపక్షసత్వ, విపక్షాఽసత్వ ములలో నేదైన నొకయంగముయొక్క వైకల్యచింతయున్న శబ్దనిత్యత్వసాధక ప్రకృత హేతువుయందే వైకల్యముండుట నేయంగమునకు వైకల్యమో దానియొక్క యుద్భావనచేయు టయే యుచితము. ప్రకృతహేతు వంగవికలము గానిచో నీచేత నుపన్యసించఁబడిన రెండవహేతువు దానియొక్క యంగములలో నేదియో యొకటి యుండనందున హీనబల

మగుటవలన దానిచేఁ బ్రకృత హేతువునకు సత్ప్రతిపక్షాశంక సంభవింపదు.

మూ. తథాపి నిత్యః శబ్దోఽద్రవ్యద్రవ్యత్వాదిత్యత్రాపి సాధనదశాయాం కించిద్వాచ్యమితి చేదసిద్ధిః. ద్రవ్యం శబ్దః సాక్షాత్సమ్బన్ధేన గృహ్యమాణత్వాత్, ఘటవదితి సిధ్యతీతి చేన్న, ఏతస్యాప్యసిద్ధేః. న హి శ్రోత్రగుణత్వే ద్రవ్యత్వేవాఽసిద్ధే సాక్షాత్సంబన్ధే శబ్దస్య ప్రమాణమస్తి.

తా. వాస్తవమగు తుల్యబలత్వము లేకున్నను తుల్య బలములుగాఁ బ్రతిసంధీయమానములగు హేతువులకు సత్ప్రతి పక్షత్వము సంభవించును గదా? "శబ్దో నిత్యః ద్రవ్యసమవాయికారణత్వాభావే సతి ద్రవ్యత్వాత్" యను సత్ప్రతి పక్షానుమానమసిద్ధిరూపదోషదూషిత మగుటవలన సంభవింపదు. సాక్షాత్సంబంధముచే గ్రహింపఁబడుటచే ఘటమువలె శబ్దముకూడ ద్రవ్యమగుటవలన సత్ప్రతిపక్షానుమానమసిద్ధము గాదని యాశంకించరాదు. శబ్దమునకు శ్రోత్రగుణత్వమును ద్రవ్యత్వమును సిద్ధింపనిచో సాక్షాత్సంబంధముండుటలోఁ బ్రమాణము లేనందున నీయనుమానమున "సాక్షాత్సంబంధేన గృహ్యమాణత్వాత్" అను హేతువసిద్ధమగును.

మూ. పరిశేషోఽస్తి, తథాహి:—సదాద్యభేదేన సామాన్యాదిత్రయవ్యావృత్తౌ మూర్తద్రవ్యసమవాయనిషేధేన కర్మత్వనిషేధాత్ ద్రవ్యగుణత్వ పరిశేషే సంయోగసమవాయయోరన్యతరస్సం

బన్ధ ఇతి చేన్న. బాధకబలేన పరిశేషే ద్రవ్యత్వ
స్యాపి నిషేధాత్ లింగగ్రాహక ప్రమాణబాధా
పత్తేః బాధకే సత్యపి వా ద్రవ్యత్వాఽప్రతి
షేధే కర్మత్వాదీనామప్యప్రతిషేధప్రసక్తౌ పరి
శేషాఽసిద్ధేః.తస్మాదేకదేశపరిశేషో న ప్రమాణం,
సందేహాసంకోచమాత్ర హేతుత్వాత్.

తా. శబ్దము సత్తగలదగుటవలన సామాన్యవిశేషసమవాయరూపము గాదు. మూర్తద్రవ్యములం దుండనిదగుటవలనఁ గర్మరూపము కాదు. కావున పరిశేషానుమానమువలన ద్రవ్యముగాని గుణముగాని యగును కాఁగా సంయోగ సమవాయరూపసాక్షాత్సంబంధములలో నేదైన నొకటి యుండుటవలన శబ్దమందు ద్రవ్యత్వమును సాధించు "సాక్షాత్సంబంధేన గృహ్యమాణత్వాత్" అను హేతువసిద్ధము గాదని యాశంకించుటకు వీలులేదు. కర్మాదిస్వరూపమగుటలో బాధకమున్నట్లు "శబ్దో న ద్రవ్యం శ్రోత్రమాత్రగ్రాహ్యగుణత్వాత్." యను ద్రవ్యత్వబాధక ప్రమాణముఁ గూడ నున్నందున పూర్వానుమానము బాధితము. ద్రవ్యత్వబాధకప్రమాణ మున్నను ద్రవ్యత్వము నంకరించినచోఁ గర్మత్వాదికముఁగూడ సిద్ధింపవలసి వచ్చుటఁజేసి పరిశేషమే లేకపోవలసి వచ్చును. కాన ఏకదేశపరిశేషము సందేహాసంకోచమాత్ర హేతువగుటవలనఁ బ్రమాణముగాదు.

మూ. అథ ద్రవ్యత్వే కిం బాధకమ్? ఉచ్యతేః—శబ్దో
న ద్రవ్యం బహిరిన్ద్రియవ్యవస్థా హేతుత్వాత్,
రూపాదివదితి పరిశేషాద్గుణత్వేన సమవాయి

సిద్ధౌ లింగగ్రాహకప్రమాణబాధితత్వాత్ నావ్యవహితసంబంధగ్రాహ్యత్వేన ద్రవ్యత్వ సిద్ధిః. న చాసిద్ధేన సత్ప్రతిపక్షత్వం, అసిద్ధస్య హీనబలత్వాత్.

తా. శబ్దమందు ద్రవ్యత్వాభావమును సాధించు హేతువున్నపుడు పరిశేషమువలన గుణత్వము సిద్ధించినను సత్ప్రతిపక్షానుమాన మసిద్ధమగుటవలన హీనబలమగుటచే దీనిచే సత్ప్రతిపక్షాశంకఁజేయుటకు వీలులేదు.

మూ. నను శబ్దస్తావదశ్రోత్రగుణో నైవేతి త్వయైవ సాధితం ప్రబన్ధేన, న చ శ్రోత్రగుణః, తేన గృహ్యమాణత్వాత్, యత్ యేనేంద్రియేణ గృహ్యతే నాసౌ తస్య గుణః, యథా గృహ్యమాణో గంధాదిః, శ్రోత్రం వా న స్వగుణ గ్రాహకమ్ ఇంద్రియత్వాద్ఘ్రాణవదితి న గుణ త్వసిద్ధిరితి చేత్. తతః కిమ్?

తా. పైరీతిని శబ్దము శ్రోత్రముచేతనే గ్రహింపఁబడుట వలన శ్రోత్రభిన్నముయొక్క గుణముకాదని చెప్పఁబడెను. ఘ్రాణేంద్రియముచే గ్రహింపఁబడినను గంధము ఘ్రాణ గుణముకానటుల శ్రోత్రగ్రాహ్యమైనను శబ్దము శ్రోత్ర గుణము కాదు. ఘ్రాణేంద్రియము తనయందుండుగంధము నెట్లు గ్రహింపఁజాలదో యటులనే శ్రోత్రము కూడ నింద్రియ మగుటవలన స్వగుణగ్రాహి కానేరదు. గాన గుణత్వము సిద్ధింపదు అని యందువా వినుము.

మూ. న చైతదపి, ఘ్రాణాదిసమవేతగన్ధాద్యగ్రహే స్వగుణత్వస్యాప్రయోజకత్వాత్. అయోగ్యత్వం హి తత్రోపాధిః. అన్యథా, సుఖాదిర్నాత్మగుణః తేన గృహ్యమాణత్వాత్ రూపాదివత్, న వా తేన గృహ్యతే తత్సమవేతత్వాదదృష్టవత్, ఆత్మా వా న తద్గ్రాహకః తదాశ్రయత్వాత్ గన్ధాద్యాశ్రయఘటాదివత్, ఇత్యాద్యపి శంకేత. తస్మాత్స్వగుణః పరగుణో వా ఽయోగ్యో న గృహ్యతే, గృహ్యతే తు యోగ్యో యోగ్యేన, తత్కిమత్రానుపపన్నం.

తా. ఘ్రాణాదులయందుండు గంధముయొక్క యగ్రహణములో నయోగ్యత్వము ప్రయోజకముగాని స్వగుణత్వము ప్రయోజకము గాదు. అట్లే యగుచో సుఖాదికమాత్మచే గ్రహింపఁబడుటవలన నాత్మగుణము కాకపోవలసివచ్చును. ఆత్మసమవేతమగు నదృష్టమువలె నగ్రాహ్యము కావలసివచ్చును. మరియు గంధాదులకాశ్రయములగుఘటాదులవలె సుఖాదులకాశ్రయమగు నాత్మకూడ సుఖాదిగ్రాహకము కాకపోవలసి వచ్చుననెడు యాశంక కవకాశము వచ్చును. కావున స్వగుణమైనను బరగుణమైనను నయోగ్యమైన గ్రహింపఁబడదు, యోగ్యమైన గ్రహింపఁబడునని చెప్పిన నేమియు ననుపపత్తి లేదు.

మూ. అవశ్యం చ శ్రోత్రేణ విశేషగుణగ్రాహిణా భవితవ్యమ్ ఇంద్రియత్వాత్, అన్యథా తన్ని

ర్మాణవైయర్థ్యాత్, తదన్యస్యేంద్రియాంతరే
ణైవ గ్రహణాత్. న చ ద్రవ్యవిశేషగ్రహణే
తదుపయోగః, విశేషగుణయోగ్యతామాత్రి
త్యైవేంద్రియస్య ద్రవ్యగ్రాహకత్వాత్, న
ద్రవ్యస్వరూపయోగ్యతామాత్రేణ. అన్యథా
చాంద్రమసం తేజః స్వరూపేణ యోగ్యమితి
తదప్యుపలభ్యేత ఆత్మా వా మనో గ్రాహ్యే
ఇతి సుషుప్త్యవస్థాయామప్యుపలభ్యేత. అను
ద్భూతరూపేఽపి వా చక్షుః ప్రవర్తేత. తస్మా
ద్గుణయోగ్యతామేవ పురస్కృత్యేంద్రియాణి
ద్రవ్యముపాదదతే నాతోఽన్యథేతి స్థితిః. అత
ఏవ నాకాశాదయశ్చాక్షుషాః.

తా. శ్రోత్రమింద్రియమగుటవలన ఘ్రాణాదులవలె విశేషగుణగ్రాహి యని చెప్పవలయును. విశేషగుణగ్రాహి కానిచో శ్రోత్రనిర్మాణమునకే వైయర్థ్యము వచ్చును. ద్రవ్యవిశేషమును గ్రహించుటలో దీని యుపయోగమని చెప్పుటకు వీలులేదు. తద్గతవిశేషగుణగ్రాహి కానిచోఁ గేవలద్రవ్యగ్రాహకత్వము దీనికి సంభవింపదు. ద్రవ్యగతవిశేషగ్రహణయోగ్యతను సహకారిగాఁ జేసుకొనియే ఇంద్రియము ద్రవ్యగ్రాహకమగునుగాని కేవలద్రవ్యముయొక్క స్వరూపయోగ్యతనుబట్టి ద్రవ్యగ్రాహకము గాదు గదా! అట్లే యగుచో నాత్మ మనోగ్రాహ్యమగుటవలన సుషుప్త్యవస్థయందుఁ గూడఁ బ్రత్యక్షము కావలసివచ్చును. ఇట్లే యనుద్భూతరూపము

యొక్క సాక్షాత్కారముఁగూడఁ గలుగవలసివచ్చును. కావున గుణయోగ్యతను సహకారిగాఁ జేసికొనియే ఇంద్రియములు ద్రవ్యప్రత్యక్షమును బుట్టించునని చెప్పవలయును. ఆకాశ గుణము చక్షుర్గ్రహణయోగ్యము కాకపోవుటవలననే నాకాశము ప్రత్యక్షము కాదు.

మూ. అస్తు తర్హి శబ్దో నిత్యః నిత్యాకాశైకగుణత్వాత్తద్గతపరమమహత్పరిమాణవదితి ప్రత్యనుమానమితి చేన్న, అకార్యత్వస్యోపాధేర్విద్యమానత్వాత్. అన్యథా, ఆత్మవిశేషగుణా నిత్యాః తదేకగుణత్వాత్, తద్గతపరమమహత్త్వవదిత్యపి స్యాత్. అస్య ప్రత్యక్షబాధితత్వాదహేతుత్వమితి చేన్న, నిరుపాధేః బాధానవకాశాత్. స్వభావప్రతిబద్ధస్య చ తత్పరిత్యాగే స్వభావపరిత్యాగప్రసంగాత్. తస్మాత్ బాధేన వోపాధిరున్నీయతే అన్యథా వేతినకశ్చిద్విశేషః. ఏతేన శ్రావణత్వాచ్ఛబ్దత్వవదిత్యపి పరాస్తమ్. అత్రాపి తస్యైవోపాధిత్వాత్. అన్యథాగంధరూపరసస్పర్శా అపినిత్యాః ప్రసజ్యేరన్, ఘ్రాణాద్యైకైకేంద్రియగ్రాహ్యత్వాత్ గంధత్వాదివదిత్యపి ప్రయోగసౌకర్యాత్.

తా. పూర్వానుమానముచే సత్ప్రతిపక్షాశంక వారించినను "శబ్దో నిత్యః నిత్యాకాశైకగుణత్వాత్ తద్గతపరమమహత్పరిమాణవత్" అను ననుమానముచే సత్ప్రతిపక్షితత్వము

నాశంకించుటకు వీలులేదు. ఈయనుమాన మకార్యత్వరూ పోపాధితోఁ గూడుకొనుటవలన దుర్బలమగుటచే దీనివలన సత్ప్రతిపక్షాశంక చేయుట కవకాశము లేదు. సోపాధికమైనను నీయనుమానము నిత్యత్వసాధక మగుననినచో "ఆత్మవిశేష గుణాః నిత్యాః తదేకగుణత్వాత్ తద్గతపరమమహత్పరిమాణ వత్" అనునను మానముచే నాత్మవిశేషగుణములగు జ్ఞానేచ్ఛా దులకుఁగూడ నిత్యత్వము రావలసివచ్చును."ఆత్మవిశేషగుణాః నిత్యాః గుణత్వాత్." అను ననుమానము ప్రత్యక్షబాధితమ గుటవలనఁ దదేకగుణత్వ ముపాధిశూన్యమనుటకు వీలు లేదు. బాధయున్నపుడు పక్షాంతర్గతమగు జ్ఞానాద్యంతర్భావముచే వ్యభిచారముండును గావున నవశ్యము సోపాధికమని చెప్పవల యును. స్వతస్సిద్ధముగా హేతువునందు వ్యభిచారమున్నపు డుపాధికూడ నుండుట స్వభావమగుటచే నది లేదని చెప్పిన స్వభావపరిత్యాగము వచ్చును. పూర్వోక్తమగు హేతువునం దుపాధి బాధచేఁగాని యితరములగు వ్యభిచారాదులచేఁగాని యూహించుటలో విశేషము లేదు. సోపాధికమగు హేతువు దుర్బలమైనందున శబ్దమందు నిత్యత్వసాధకానుమానముచే సత్ప్రతిపక్షాశంకఁజేయుటకు వీలు లేదు. కనుకనే "శబ్దో నిత్యః శ్రావణత్వాత్ శబ్దత్వవత్" యను ప్రత్యనుమానముచేఁ గూడ సత్ప్రతిపక్షాశంకఁజేయుటకు వీలులేదు. సోపాధికమైనను శ్రావణత్వరూపహేతువుచే నిత్యమగు శబ్దత్వరూపదృష్టాంత మున శబ్దమందు నిత్యత్వమును సాధించెదమనినచో గంధ త్వాదిదృష్టాంతములఁబట్టి ఘ్రాణాద్యేకేంద్రియగ్రాహ్యత్వ

రూపహేతువుచే గంధరూప రస స్పర్శాదులకుఁ గూడ నిత్యత్వమును సాధింపవలసివచ్చును.

మూ. విరోధవ్యభిచారావసంభావితావేవాఽత్రే త్యసిద్ధినవశిష్యతే సాపి నాస్తి. తథాహిః—శబ్దస్తావత్పూర్వన్యాయేన స్వాభావికతీవ్రమందతరతమాదిభావేన ప్రకర్షనికర్షవానుపలభ్యతే ఇయం చ ప్రకర్షనికర్షవత్తా కారణభేదానువిధాయినీ సర్వత్రోపలబ్ధా. అకారణకా హి నిత్యాః ప్రకర్షవంత ఏవ భవన్తి, యథా ఆకాశాదయః, నికృష్టా ఏవ వా, యథా పరమాణ్వాదయః, న తు కించిదతిశయానాః కుతశ్చిదపకృష్యంతే. తదియం నిత్యేభ్యో వ్యావర్తమానా కారణవత్సు చ భవన్తీ జాయమానతామాదాయైవ విశ్రామ్యతీతి ప్రతిబన్ధసిద్ధా ప్రయుజ్యతే; శబ్దో జాయతే ప్రకర్షనికర్షాభ్యాముపేతత్వాన్మాధుర్యాదివత్. అన్యథా, నియామకమంతరేణ భవన్తీ నిత్యేష్వపి సా స్యాత్ నియమహేతోరభావాత్.

తా. పూర్వానుమానమున విరోధవ్యభిచారసంభావన లేకపోయినను శబ్దమునం దుత్పత్తిధర్మకత్వరూపహేతువు సిద్ధించనందున నసిద్ధిదోషము సంభవించునని యాశంకించుటకు వీలులేదు. తీవ్రతీవ్రతరత్వ మందమందతరత్వాదులు శబ్దస్వాభావికము లన్నను ఆప్రకర్షనికర్షలు కారణభేదమునుబట్టి

యే యుపలభ్యమానము లగుచున్నవి. అట్లుకానిచోఁ గారణ భేదములేని యాకాశమందుఁ గేవలము ప్రకర్షయుఁ బరమా ణ్వాదికమందుఁ గేవలము నికర్షయుఁ గానవచ్చును. సకారణక మగువానియందుఁ బ్రకర్షనికర్షలు రెండును గానవచ్చుచున్నవి గదా, అందుచే సకారణములందుండెడి యిట్టి ప్రకర్షనికర్ష లచే శబ్దమందుత్పత్తిమత్త్వము మాధుర్యాదికమునందువలె నుండునని యూహించుటకు వీలుపడును. కారణభేదములేకయే బ్రకర్షనికర్షలు సంభవించుననిన నిత్యములగు నాకాశాదుల యందు నికర్షయు పరమాణువులయందు ప్రకర్షయు రావలసి వచ్చును. కావున దేనియందు ప్రకర్షనికర్షలుండునో యది జన్య మని చెప్పవలెను. ఇందుచేఁ బూర్వానుమాన మసిద్ధమని చెప్పుటకు వీలులేదు.

మూ. శబ్దాదన్యత్రేయం గతిరితి చేన్న, సాధ్యధర్మిణం
విహాయేతి ప్రత్యవస్థానస్య సర్వానుమాన
సులభత్వాత్.

తా. "ప్రకర్షనికర్షశాలియగునది యుత్పత్తిగలద"నెడు వ్యాప్తి శబ్దభిన్నవిషయకమని చెప్పుటకు వీలులేదు. అట్లయిన యెడల "నెచ్చటెచ్చట హేతువుపలభ్యమానమగునో నచ్చ టచ్చట సాధ్యముండున"ను నియమముఁగూడ పక్షాతిరిక్త విషయకమగుటకు వీలగును గానఁ బక్షమాత్రమందు సాధ్య మును సాధించు ననుమానమాత్రమునకే విలోపము వచ్చును.

మూ. న చేత్ వ్యఞ్జకతారతమ్యాద్వ్యఞ్జనీయతార
తమ్యం, అస్వాభావికత్వప్రసంగాత్. వ్యవ

స్థితం చ స్వాభావికత్వం న చ వ్యంజకోత్పాదకాభ్యా మన్యస్యానువిధానమస్తి న చ స్వాభావికత్వోపాధికత్వాభ్యామన్యః ప్రకారః సంభవతి.

తా. వ్యంగ్యమందుండు తరతమాదిభావము, వ్యంజకముయొక్క తరతమాదిభావాధీనము గానిచో శబ్దమందుండు తారతమ్యాదికము స్వాభావికము కాకపోయెడిని. ఉత్పాదక వ్యంజకములకంటె వెఱొక దానిసన్నిధి లేదు. స్వాభావికత్వోపాధికత్వములకంటె వేరొకటియుండదు. తారతమ్యాదికమునకు శబ్దస్వాభావికత్వవ్యవస్థ జేయఁబడియే యుండెను. స్వాభావిక ప్రకర్షనికర్షలచే నుత్పత్తి సిద్ధించును గాన పూర్వానుమానమున నుత్పత్తిమత్వహేతువసిద్ధము గాదు.

మూ. స్యాదేతత్ తథాప్యుత్పత్తేర్నిత్యత్వేన కో విరోధో యేన ప్రతిబంధసిద్ధిః స్యాత్. అసిద్ధే చ తస్మిన్ భవతాం వ్యాపకత్వాఽసిద్ధోఽస్మాకమప్రయోజకః. సౌగతానాం సందిగ్ధవిపక్షవృత్తిరయముపక్రాంతో హేతురితి చేన్న, ఇదం హ్యుత్పత్తిమత్వం వినాశకారణసన్నిధివిరుద్ధేభ్యో నిత్యేభ్యః, స్వవ్యాపకనివృత్తౌ నివర్తమానం వినాశసన్నిధిమతి వినాశిని విశ్రామ్యతీతి.

తా. ఉత్పత్తిగల్గినను ఒకానొకటి నిత్యమై యుండుటంజేసి ఉత్పత్తిమత్వహేతువునం దనిత్యత్వవ్యాప్తి సిద్ధింపదు. కాఁగా ఉత్పత్తిమత్వహేతువు నైయాయికమతమున నని

త్యత్వరూపసాధ్యమునకు హేతువ్యాపకత్వము సిద్ధింపమింజేసి వ్యాపకత్వాసిద్ధమును, మీమాంసకులమగు మామతమున వ్యాప్తి సిద్ధించనందున నప్రయోజకమును, సౌగతమతమున సందిగ్ధవిపక్షవృత్తియు నగును. కాన సాధ్యసాధక మెట్లగునని యాశంకించరాదు. ఉత్పత్తిమత్త్వమునకు వ్యాపకమైన వినాశకారణసన్నిధానము నిత్యములయందు లేనందున నుత్పత్తిమత్త్వరూపవ్యాప్య ముండుట సంభవింపదు. అది నశించుదానియందే యుండును. కావున పూర్వోక్తదోషముల కవకాశము లేదు.

మూ. వినాశకారణసన్నిధానేనావశ్యం జాయమా
నస్య భవితవ్యత్వమితి కుతో నిర్ణీతమితి చేన్న,
తదసన్నిధానం హి న తావదాకాశాదేరివ,
స్వభావవిరోధాత్ ఉత్పత్తివినాశయోస్సంసర్గ
దర్శనాత్.

తా. ఉత్పత్తిమత్తు వినాశకారణ సన్నిధానముతోఁ గూడుకొనునని యెట్లు నిర్ణయించెదవని యాశంకింపరాదు. ఉత్పత్తివినాశములకు సంసర్గము దృష్టమగుటవలన నుత్పత్తిమత్తు వినాశకారణసన్నిధికలదని నిశ్చయించెదము.

మూ. అవిరుద్ధయోరసన్నిధిస్తు దేశవిప్రకర్షాద్ధిమవ
ద్వింధ్యయోరివ స్యాత్.

తా. అవిరుద్ధములగు హిమవద్వింధ్యపర్వతములకు దేశవిప్రకర్షవలన యసన్నిధియున్నటుల నవిరుద్ధములగు నుత్పత్తివినాశములకుఁ గూడ దేశవిప్రకర్షవలన నసాన్నిధ్యము చెప్పుట సరికాదు.

మూ. దేశయోరపి విప్రకర్షో విరోధాద్వా హేత్వభావాద్వా. పూర్వోక్తాదేవ న ప్రథమః, ద్వితీయస్తు పటకుంకుమయోరివ స్యాత్. యది కుంకుమసమాగమాదర్వాగివ ప్రధ్వంససంసర్గాదర్వాగేవ పటో వినశ్యేత్. యథా హి వినాశకారణం వినా న వినాశః తథా యది కుంకుమసమాగమం వినా న వినాశః పటస్యేతి స్యాత్, కస్తయోస్సంసర్గం వారయేత్, తస్మాదవిరుద్ధయోరసంసర్గః కాలవిప్రకర్షనియమేన వ్యాప్తః స చాతోనివర్తమానః స్వవ్యాప్యముపాదాయ నివర్తతే ఇతి ప్రతిబంధసిద్ధిః.

తా. దేశములకుండు విప్రకర్షయైనను విరోధమువలనగాని సంసర్గహేతువుయొక్క యభావమువలనఁగాని గలుగునని చెప్పవలయును. ఉత్పత్తివినాశములకు సంసర్గము దృష్టమగుటవలన ఉత్పత్తివినాశములకు విరోధమువలన విప్రకర్షయని చెప్పుటకు వీలులేదు. వినాశకారణజాయమానత్వములకు హేత్వభావమువలనఁగలుగునసంసర్గము యవిరుద్ధమైనటువంటియొకానొకసమయమున సంసృష్టమైన పటకుంకుమలకు సంసర్గహేతువులేనిచో నొకానొకసమయమున యసంసర్గవలె అట్లెయీవినాశకారణజాయమానత్వములకుఁ గూడ ఒకానొకసమయమునే యసంసర్గము సంభవించును. ఎట్లనఁగా: కుంకుమసమాగమముకంటె పూర్వమున పటము నశించినచో సంసర్గహేతువు లేనందున పటకుంకుమలకసంసర్గవలె నాశకసామగ్రికంటె

పూర్వమందు జాయమానమగు పటము నశించినచో సంసర్గ హేతువు లేనందున వినాశకారణజాయమానత్వములకుకూడ నసంసర్గ గలుగును. అట్లుండుట సంభవింపదు. జాయమానవస్తు వునకు వినాశకారణసన్నిధానమున్నపుడే నాశముఁ జూడఁ బడుచున్నది యనినచో కుంకుమసమాగమ మున్నపుడే పట నాశము దృష్టమగుచున్నది యనుటకుఁ గూడ వీలుకలుగును. అట్లైనచో వానికి సంసర్గయే సంభవించును. అట్లు చెప్పు టకు వీలులేదు. ఇట్లు దేశవిప్రకర్ష లేనందున కాలవిప్రకర్ష చేతనే యవిరుద్ధములగువాని కసంసర్గమని చెప్పవలెను. ఈకాలవిప్రకర్ష యుత్పత్తివినాశములవలన నివర్తమాన మగుచుఁ దనకు వ్యాప్యమైన యవిరుద్ధమైనవాని యసంసర్గను నివర్తింపఁజేయుచుఁ దానుకూడ నివర్తించును. కావున నవి రుద్ధమైనవాని సంసర్గ దృష్టమైనందున నుత్పత్తిమత్వమం దని త్యత్వవ్యాప్తి సిద్ధించును.

మూ. స్యాదేతత్ యద్యేవమస్థిరః శబ్దః కథమర్థేన
సంగతిరస్యోపలభ్యతే ఇతి చేత్. యథైవార్థ
స్యాస్థిరస్య తేన.

తా. శబ్దము లనిత్యములన్నచో గృహీతసంగతికమైన పదము నశించును గావున కాలాంతరమున నర్థప్రతీతి లేకపో వలసివచ్చును. అట్టి యర్థప్రతీతి కలుగుచున్నట్లనుభవ మున్నం దున శబ్దము నిత్యమనవలెనని యాశంకించరాదు. శబ్దము నిత్య మనుపక్షమున నేపదమున కేవ్యక్తియందు శక్తి గృహీత మగునో ఆవ్యక్తి నశించినపుడాపదమువలన వ్యక్త్యంతర ప్రతీతి కలుగకపోవలసి వచ్చును. మఱియు శబ్దము నిత్యమను

మతమున, ననిత్యమగునర్థముతో దానికిఁ గలసంగతి గ్రహింపఁ బడినట్లే శబ్దమనిత్యమను మతమునఁగూడ నాసంగతి గ్రహింపఁ బడును.

మూ. జాతిరేవ పదార్థో, న తు వ్యక్తిరితి చేన్న,
శబ్దాత్తదలాభప్రసంగాత్.

తా. వ్యక్తిశక్తి నంగీకరించునపు డట్లాశంకింపవచ్చును గాని జాతి శక్తి నంగీకరించినపక్షమున పదమును జాతియు నిత్యము లగుటవలన నర్థప్రతీతి కనుపపత్తిలేదని యాశంకింపరాదు. జాతియే పదార్థమైనచో వ్యక్తి యశక్యమగుట వలన దానియొక్క భానము లేకపోవలసివచ్చును.

మూ. ఆక్షేపత ఇతి చేత్, కః ఖల్వాయమాక్షేపో
నామ?

తా. ఆక్షేపమువలన వ్యక్తిలాభము కలుగుననినచో నాక్షేప మన నేమి?

మూ. న తావదనుమానమ్, అనంతాభిస్సహ సంగతి
వదవినాభావస్యాపి గ్రహీతుమశక్యత్వాత్.
శక్యత్వే వా సంగతేరపి తథైవ సుగ్రహ
త్వాత్.

తా. అనుమానమనినచో వ్యక్తు లనంతములగుటవలన వానియందు శక్తిజ్ఞానమువలె వ్యాప్తిగ్రహము కూడ కలుగుట యశక్యము గాన వ్యక్తిభాన మనుపపన్నము కావలసి వచ్చును. గోత్వాదిరూపసామాన్యధర్మమును బురస్కరించు

కొని వ్యాప్తిగ్రహము కలుగుననిన నట్లే శక్తిగ్రహము కూడా యుపపన్నమగునని చెప్పుటకవకాశము కలుగును. కావున సామాన్యరూపమునుబట్టి వ్యాప్తిగ్రహము కలుగునని చెప్పుటకు వీలులేదు.

మూ. వ్యక్తిమాత్రరూపేణావినాభావ ఇతి చేన్న, వ్యక్తిత్వస్య సామాన్యస్య అభావాత్, భావే వా, తదాక్షేపి విశేషానాక్షేపాత్, వాచ్యత్వమపి వా తథైవాస్తు కిమాక్షేపేణ? సంగతే రవిరోధాదితి.

తా. "గోత్వం వ్యక్త్యాశ్రితం జాతిత్వాత్" అను ననుమానమున వ్యక్తిత్వేన వ్యాప్తిజ్ఞానము కలుగునని యాశంకింపరాదు. వ్యక్తిత్వమన్ని వ్యక్తులయందు ననుగతమైన దొకటి లేనందున నేవ్యక్తియొక్క వ్యాప్తిజ్ఞానము కలుగునో యావ్యక్తులుగాక తదితరవ్యక్తిజ్ఞానము లేకపో వలసివచ్చును. వ్యక్తి సామాన్యమునందుండు వ్యక్తిత్వమున్నను వ్యక్తిత్వేన వ్యక్తిజ్ఞానమున్నను గవాదిరూపవిశేష వ్యక్తిభానము లేకపోవలసి వచ్చును. అనుమానరూపమగు నాక్షేపమువలన వ్యక్తివిశేషభాన మంగీకరించినచో సామాన్యాశ్రయమైన వ్యక్తియందు వాచ్యత్వగ్రహణమువలననే వ్యక్తివిశేషభానము కలుగుచుండ నాక్షేపమువలన వ్యక్తి విశేషభానమని చెప్పుటేల.

మూ. అర్థాపత్తిరాక్షేప ఇతి చేన్న, వ్యక్త్యా వినా కిమనుపపన్నం!జాతిరితి చేన్న,తన్నాశానుత్పాద

దశాయామపి సత్త్వాత్. తథాపి వ్యక్తిమాత్రం
వినేతి చేన్న, మాత్రార్థాభావాత్.

తా. ఆక్షేపమన నర్థాపత్తి యనుటకుఁ గూడ వీలు లేదు. ఆక్షేపమనఁగా "అది లేనియెడల నిది యనుపపన్నమ" నునది గదా ? వ్యక్తిలేక ఏది యనుపపన్నము? వ్యక్తి నశించి నపుడును వ్యక్తి పుట్టుటకుముందును జాతి యుండుటవలన జాతి యనుపపన్నమని చెప్పుటకు వీలులేదు. అసర్వజ్ఞులమైన మనకు వ్యక్తులన్నిటియొక్క జ్ఞానము సంభవింపనందున "వ్యక్తి మాత్రము లేక జాతి యనుపపన్నమను"నది యాక్షేపపదార్థ మని చెప్పుటకు వీలులేదు.

మూ. వ్యక్తిజ్ఞానమంతరేణ జాతిజ్ఞానమనుపపన్నమితి
చేన్న, తదభావేఽప్యుత్పాదాత్.వ్యక్తివిషయ
త్వంవినా జాతివిషయతా తస్యానుపపన్నేతి
చేన్న,ఏవంతర్హ్యేకజ్ఞానగోచరతాయాం కిమనుప
పన్నం కిం ప్రతిపాదయేదితి.

తా. వ్యక్తిజ్ఞానము లేకపోయినను జాతిజ్ఞానము సంభవించుటవలన "వ్యక్తిజ్ఞానము లేక జాతిజ్ఞాన మనుపపన్నమ"ను నదియు నాక్షేపపదార్థము కానేరదు. కేవలజాతి యుపస్థితము కానందున జాతివిశిష్టమందే శక్తిని స్వీకరించవలెను. "గౌః గోపదశక్త్యా" యను శక్తిజ్ఞానమువలననే, వ్యక్తిభానము కూడా యుపపన్నమగును గాన "గోవిషయత్వము లేక జాతి విషయత్వ మనుపపన్నము" యను నర్థాపత్తివలన వ్యక్తిభాన మని చెప్పుటకుకూడా వీలులేదు.

మూ. జాతీనామన్వయాఽనుపపత్త్యా వ్యక్తిరవసీయతే
ఇతి చేన్న, పరస్పరాశ్రయప్రసంగాత్.

తా. జాతియందే శక్తినంగీకరించి వ్యక్తియందు శక్తినంగీకరించనిపక్షమున గామానయేత్యాదిస్థలమందు ప్రకృత్యర్థమైన జాతియందు విభక్త్యర్థమైన సంఖ్యాకర్మత్వా దులయొక్క యన్వయ మనుపపన్న మగుటవలన అన్వయానుప పత్తిరూపలక్షణాబీజమున జాతిశక్తపదమునకు వ్యక్తియందు లక్షణ నంగీకరించెదమని యాశంకించ రాదు. అట్టియెడ జాతి జ్ఞాన మున్నపుడే లక్షణచే వ్యక్తిజ్ఞానమును, వ్యక్తిజ్ఞాన మున్నపుడే జాతిజ్ఞానమును, గలుగవలయును గాన నన్యోన్యా శ్రయప్రసంగము వచ్చును.

మూ. స్యాదేతత్ ప్రతిబంధం వినాపి పక్షధర్మతా
బలాత్ యథా లింగంవిశేషే పర్యవస్యతి; తథా
సంగతిం వినాపి శబ్దః శక్తివిశేషాద్విశేషే పర్య
వస్యతి, స ఏవాక్షేప ఇత్యుచ్యతే ఇతి చేత్, న
తావత్ప్రతీతిః క్రమేణ. అపేక్షణీయాభావేన
విరమ్య వ్యాపారాఽయోగాత్.

తా. ధూమరూపమగు హేతువు వహ్నిసామాన్య వ్యాప్యముగా గృహీతమై వహ్నివిశేషవ్యాప్యముగా గృహీ తము కాకపోయినను పక్షధర్మతాబలమున పక్షవృత్తిహేతు వునకు వ్యాపకమగు వహ్న్యాదివిశేషానుమాపక మగుచున్నట్లు మొదట జాత్యర్థకముగా జ్ఞాతమగుపదమే పిదప నజ్ఞాయ మానవ్యక్తిశక్తికముఁగూడ నగుచు వ్యక్తివిశేషప్రతీతిజనక మగును అనునిదియే నాక్షేపపదార్థము అనినచో జాతివ్యక్తుల

యొక్క ప్రతీతులకు క్రమము లేకపోవలసివచ్చును. అపేక్ష ణీయమగు హేతువు లేనందున జాతివ్యక్తులను గోచరించు ప్రతీతులకు యౌగపద్యము రావలసివచ్చును.

మూ. జాతిప్రత్యాయన మపేక్షత ఇతి చేత్, కృతం తర్హి శబ్దశక్తికల్పనయా తావతైవ తత్సిద్ధేః, ఓమితి చేన్న, వ్యక్త్యనాలంబనాయాః జాతి ప్రతీతేరసంభవాదిత్యుక్తత్వాత్, ప్రమా ణాంతరాపాతప్రసంగాచ్చ, స్మరణం తదిత్య య మదోష ఇతి చేన్న, అననుభూతానన్వయ ప్రసంగాత్.

తా. జాతిజ్ఞానము వ్యక్తిజ్ఞానమునుఁగూర్చి హేతువుఅగు నని, క్రమోపపత్తిఁ జేసినచో వ్యక్తి శక్తిలేకపోయినను జాతి జ్ఞానమువలననే వ్యక్తిజ్ఞాన ముపపన్నమగుటవలన వ్యక్తిశక్తికే యుచ్ఛేదప్రసంగము వచ్చును. వ్యక్తిని గోచరింపని జాతి ప్రతీతి సంభవింపదని చెప్పియే యున్నందున వ్యక్తిశక్త్యు చ్ఛేదము మాకిష్టమనుటకు వీలులేదు. వ్యక్తిజ్ఞానమునుగూర్చి పదమునకు కారణత్వమునుఁ జెప్పక జాతిజ్ఞానమునకే కారణత్వ మును చెప్పినచో జాతిజ్ఞానము ప్రమాణము కావలసి వచ్చును. జాతిజ్ఞానకరణకమగు వ్యక్తిజ్ఞానము స్మరణరూపము. అనుభవము కాదు. కాఁబట్టి జాతిజ్ఞానమునకు ప్రమాణాంత రత్వప్రసంగము లేదని చెప్పుటకు వీలులేదు. అటులైనచో "గామానయ" అనువాక్యమువలన ననసుభూతగోవ్యక్తి యనుభవము లేకపోవలసివచ్చును.

మూ. అస్త్వేకైవ ప్రతీతిరితి చేత్. కృతం తర్హి శక్తిభేదకల్పనయా. ఏవం చ యథా సామాన్యవిషయా శక్తిరేకైవ తద్వతి పర్యవస్యతి, తథా సామాన్యాశ్రయా సంగతిస్తద్వతి పర్యవస్యేదితి.

తా. పదము అజ్ఞాయమానవ్యక్తి శక్తికమైనను, జాతిశక్తతయాంజ్ఞానమువలన జాతివ్యక్త్యులను గోచరించుజ్ఞానము కలుగుననినచో శక్తిభేదకల్పనకే యవకాశము లేదు. పటత్వసామాన్యవిషయకమగు పటపదముయొక్క శక్తి వ్యక్తియందే పర్యవసన్న మగుచున్నందున దానికి వ్యక్తియందు పృథక్ శక్తి లేనట్లు శబ్దానిత్యత్వపక్షమునఁగూడ శబ్దత్వసామాన్యవిషయకమగుశక్తియే తదాశ్రయమైన పటశబ్దమందు వాచకత్వవ్యవహారమును కలుగఁజేయును. కాఁబట్టి పటశబ్దమునకు జాతివాచకత్వము లేదని చెప్పుటయే యుచితము.

మూ. న చ నిత్యా అపి వర్ణాః స్వకానుపూర్వ్యాదిహీనాః పదార్థైస్సంగమ్యన్తే, న చ తద్విశిష్టత్వమపి తేషాం నిత్యమ్. తస్మాత్తత్తజ్జాతీయక్రోడనివిష్టా ఏవ పదార్థాః పదాని చ సంబధ్యన్తే నాతోఽన్యథేతి నైతదనురోధేనాపి శబ్దస్య నిత్యత్వమాశంకనీయమితి. యదా చ వర్ణా ఏవ న నిత్యాః తదా కైవ కథా పురుషవివక్షాధీనానుపూర్వ్యాది విశిష్టవర్ణసమూహరూపాణాం పదానామ్, కుతస్తరాంచ, తత్సమూహరచనా

విశేషస్వభావస్య వాక్యస్య, కుతస్తమాం తత్స
మూహస్య వేదస్య

తా. స్వరానుపూర్వ్యాదివిహీనములును నిత్యములు నగు వర్ణములు పదార్థములతోఁ సంగతికలవి కావు. ఆనుపూర్వితోఁ గలసిన వర్ణసముదాయరూపమగు పదము అర్థప్రత్యాయకమని చెప్పవలెను. ఆనుపూర్వి యనఁగా ఏకవర్ణజ్ఞానాంతరజ్ఞానవిషయత్వరూపము, జ్ఞాన మనిత్యమైనందున తద్ఘటితమగు పదముఁగూడ ననిత్యమని చెప్పవలెను. వర్ణములే యనిత్యము లైనచో, పురుషవిశేషవివక్షాధీనమగు నానుపూర్వితోఁ గూడిన వర్ణసముదాయాత్మకమగు పద మనిత్యమని చెప్పవలెనా? పద మనిత్యమైనచో తత్సమూహాత్మకమగు వాక్య మనిత్యము. తత్సముదాయరూపమగు వేదముఁగూడ ననిత్యము.

మూ. పరతంత్రపురుషపరాధీనతయా ప్రవాహావిచ్ఛే
దమేవ నిత్యతాం బ్రూమ ఇతి చేత్, ఏతదపి
నాస్తి,సర్గప్రళయసంభవాత్, అహోరాత్రస్యా
హోరాత్రపూర్వకత్వనియమాత్కర్మణాం విష
మవిపాకసమయతయా యుగపద్వృత్తినిరో
ధానుపపత్తేః, వర్ణాదివ్యవస్థానుపపత్తేః సమయా
నుపలబ్ధౌ, శాబ్దవ్యవహారవిలోపప్రసంగాత్,
ఘటాదిసంప్రదాయభంగప్రసంగాచ్చ. కథమేవ
మితి చేత్.

తా. పరతంత్రపురుషపరాధీనమగుటవలన ప్రవాహానుచ్ఛేదరూపమగు నిత్యత్వము సర్గప్రళయము లున్నందున

సంభవించదు. కాఁబట్టి వేద మనిత్యమగుటవలనఁ దత్కర్తయు సర్వజ్ఞుఁడు నగు పరమేశ్వరు నంగీకరించవలెను. ప్రళయము నంగీకరించినచో ఈయహోరాత్ర మెట్లహోరాత్ర పూర్వకమో యటులనే యహోరాత్రముల కహోరాత్ర పూర్వకత్వము సిద్ధించుచుండును. దానికి యనుపపత్తి వచ్చును. ఇట్లే కర్మలును సహకారులతో కూడుకొనియే క్రమముగా భోగసంపాదకము లగుటవలన నొక్కపర్యాయమే భోగ నివృత్తియగుట యసంభవము. సృష్ట్యాదిని బ్రాహ్మణాదివర్ణవిభాగమే లేనందున వర్ణవ్యవస్థయే లేకపోవలసి వచ్చును. ప్రయోజ్యప్రయోజకవృద్ధులు లేనందున వ్యవహారమువలన శక్తిజ్ఞానమే సంభవింపమింజేసి శాబ్దవ్యవహారవిలోపము గూడ వచ్చును. ఘటాదికము నేసామగ్రినిఁబట్టి చేయవలసియుండునో అట్టిసామగ్రిని కనిపెట్టిన పురుషుఁడు లేనందున ఘటాదినిర్మాణ భంగప్రసంగము వచ్చెడిని.

ఉచ్యతే:—

శ్లో. వర్షాదివద్భవోపాధిర్వృత్తిరోధః సుషుప్తివత్,
ఉద్భిద్వృశ్చికవద్వర్ణాః మాయావత్సమయాదయః.

తా. "వర్షాదినం వర్షాదినపూర్వకం వర్షాదినత్వాత్" అను ననుమానము రాశ్యాదిభేదసంసర్గరూపమగు నుపాధిదూషిత మెట్లగునో యట్లే "అహోరాత్ర మహోరాత్రపూర్వక మహోరాత్రత్వాత్" అనుననుమానముఁ గూడ బ్రహ్మాండస్థితిరూపమగు నుపాధిదూషితము. సుషుప్తియందు కర్మలకొక్కపర్యాయమే భోగనివృత్తి యెటులనో యటులనే ప్రళయమందుఁ గూడ నొక్కపర్యాయమే వృత్తినిరోధము కలుగును. తందు

లీయక వృశ్చికాదికము తత్పూర్వకమైనను ఆద్యమైన వృశ్చికాదికము గోమయాదివిజాతీయమువలనఁ గలుగునట్లు బ్రాహ్మణాదికము బ్రాహ్మణాది పూర్వకమైననూ ఆద్యబ్రాహ్మణశరీరము బ్రాహ్మణత్వసంపాదకకర్మతోఁగూడిన భూతములవలననే గలుగును గాన బ్రాహ్మణాదివ్యవస్థ కననుపపత్తి లేదు. మాయావివలె నీశ్వరుఁడే సృష్ట్యాదియందు ప్రయోజ్యప్రయోజకశరీరముల నధిష్ఠించి వ్యవహారమువలన సృష్ట్యాదిపురుషులకు శక్తిజ్ఞానము కలుగఁజేయును గాన శాబ్దాదివ్యవస్థ కనుపపత్తి లేదు. ఇటులనే ఈశ్వరుఁడు కులాలాదిశరీరములను ధరించి ఘటాదికముయొక్క సామగ్రిని చూపించుటవలన ఘటాదిసంప్రదాయభంగప్రసంగమును లేదు.

మూ. తత్పూర్వకత్వమాత్రే సిద్ధసాధనాత్, అనంతర తత్పూర్వకత్వేఽప్రయోజకత్వాత్, వర్షాదిదినపూర్వకతద్దిననియమభంగవదుపపత్తేః, రాశ్యాదివిశేషసంసర్గరూపకాలోపాధిప్రయుక్తం హి తత్, తదభావ ఏవ వ్యావృత్తేః, తథేహాపి సర్గానువృత్తినిమిత్తబ్రహ్మాండస్థితి రూప కా లో పాధినిబంధనత్వాత్తస్య తదభావఏవ వ్యావృత్తౌ కో దోషః, నచ తదనుత్పన్నమనశ్వరం వా, అవయవిత్వాత్.

తా. "వర్షాదినం వర్షాదినపూర్వకం వర్షాదినత్వాత్" అను ననుమానమువలె "అహోరాత్రం అహోరాత్రపూర్వకం అహోరాత్రత్వాత్త" నెడి యనుమానము గూడ నప్రయోజకము. అహోరాత్రమం దహోరాత్రపూర్వకత్వము సాధ్య

మనిన ప్రళయము నంగీకరించినను సృష్ట్యాద్యహోరా త్రములందు వెనుకటి యహోరాత్రపూర్వకత్వ ముండుట వలన సిద్ధసాధనరూపదోషప్రసంగము వచ్చును. కావున నవ్య వహితాహోరాత్రపూర్వకత్వమే సాధ్యమని చెప్పవలెను. వర్షాదినమం దవ్యవహితవర్షాదినపూర్వకత్వము సాధ్య మన్నపుడు కర్కటకసింహాన్యతర రాశ్యవచ్ఛిన్నరవికాల పూర్వకత్వముపాధి. దానికి సాధనావ్యాపకత్వము కర్క టక ప్రథమాంశావచ్ఛిన్నదినాంతర్భావేణ వచ్చును. కావున వర్షాదినత్వరూప హేతు విట్టి యుపాధితోఁ గూడుకొనుట వలన పూర్వోక్తసాధ్యవ్యాప్త్యభావవత్తు గావున ప్రథమా నుమానము వ్యాప్యత్వాఽసిద్ధము. ద్వితీయానుమానమున సంసారావచ్ఛిన్న కాలపూర్వకత్వము వర్తమానదినాంతర్భా వేణ సాధ్యవ్యాపకమును, సృష్ట్యాది ప్రథమదివసాంతర్భావేణ సాధనాఽవ్యాపకము నగుటవలన నుపాధి యగును. ఇట్టి యుపాధితోఁ గూడినందున నహోరాత్రత్వరూప హేతువు వ్యాప్యత్వాసిద్ధము గావున సాధ్యసాధకము గానేరదు. సంసా రము నిత్యము గావున పూర్వోక్తోపాధియందు సాధనవ్యాప కత్వము వచ్చునని యాశంకించరాదు. సంసారము గాని సంసా రావచ్ఛిన్న కాలరూపమగు నుపాధిగాని యవయవిరూపమగు టవలన ఉత్పత్తినాశములులేనట్టి యవయవి లేనందున సాధ నాఽవ్యాపకత్వము సంభవించును.

పైన నుదాహరింపఁబడిన, ప్రళయబాధకము లైదిం టిలో మొదటిది నిరాకరించఁబడినది.

మూ. వృత్తినిరోధస్యాపి సుషుప్త్యవస్థావదుపపత్తేః, న హ్యనియతవిపాకసమయాని కర్మాణీతి న తదానీం కృతాన్యన్యేవ. భోగవిముఖాని, న హ్యచేత యతః కశ్చిద్భోగో నామ విరోధాత్, కస్తర్హి తదానీం శరీరస్యోపయోగః? తం ప్రతి న కశ్చిత్, తర్హి కిమర్థమనువర్తతే? ఉత్తరభోగార్థం చక్షు రాదివత్, ప్రాణితి కిమర్థం? శ్వాసప్రశ్వాససంతా నేనాయుషోఽవస్థాభేదార్థం, తేన భోగవిశేష సిద్ధేః.

తా. విషమ విపాకసమయములగు కర్మలు సుషుప్త్య వస్థయం దెట్లు భోగనివృత్తిగలవి యగుచున్నవో యట్లి ప్రళయమందుఁ గూడ భోగనివృత్తి గలవై యుండును. సుషు ప్త్యవస్థయందు జ్ఞానసామాన్యసామగ్రి లేనందున జ్ఞానము పుట్టదు. అందువలన భోగముండుననుటకు వీలులేదు. శరీ రము భోగావచ్ఛేదకము గాన సుషుప్త్యవస్థయందు భోగము లేనిచో శరీరమున కేమి యుపయోగమని యాశంకించరాదు. సుషుప్తుని గూర్చి యాసమయమున ననుపయుక్తమే యా శరీరమని చెప్పెదము. అనుపయుక్తమగు శరీరానువృత్తి యేలయందువా! స్వప్నసుషుప్తులయందు జ్ఞానమును బుట్టించని చక్షురాదీంద్రియములయొక్క యనువృత్తి భావిజ్ఞానము కొఱ కెటు లంగీకరింపఁబడుచున్నదో యటులనే యుత్తరభోగా ర్థమై తదనువృత్తి యావశ్యకము. శ్వాసప్రశ్వాసము లుండుట వలన నాయుర్దాయముయొక్క యవస్థాభేదముకొరకుఁ బ్రతికి యున్నట్లు చెప్పవలెను. అందువలన భోగము సిద్ధించును.

మూ. ఏకస్యైవ కథంచిదుపపద్యతే, న తు విశ్వస్యేతి చేత్. అనంతతయా అనియతవిపాకసమయతయా ఉపమర్ద్యోపమర్దకస్వభావతయా చ కర్మణాం విశ్వస్య ఏకస్య వా కో విశేషః యేన తన్న భవేత్.

తా. ఒకానొకనికి సుషుప్తియందు వృత్తినిరోధము గల్గినను ప్రళయకాలమున, నందఱకును గలుగుటెట్లని యాశంకించరాదు. కర్మలనంతము లగుటవలనను, అనియత మగు విషమవిపాకసమయము కలవగుటవలనను, ఒకనికి నంద ఱకు ననుటలో విశేషము లేదు.

మూ. భవతి చ సర్వస్యైవ సుష్వాపః, క్రమేణ నతు యుగపదితి చేన్న, కారణక్రమాయత్తత్వాత్కార్యక్రమస్య. న చ స్వహేతుబలాయాతైః కారణైః క్రమేణైవ భవితవ్యం, అనియతత్వాదేవ. సర్వగ్రాసవత్, గ్రహాణాం హ్యన్యథా సమాగమాఽనియమేఽపితథా కదాచిత్స్యాత్ యథా కాలాద్యనియమేపి సర్వమండలోపరాగః స్యాత్, త్రిదోషసన్నిపాతవద్వా. యథా హి, వాతపిత్తశ్లేష్మణాం చయప్రకోపప్రశమనక్రమానియమేఽపిఏకదా సన్నిపాతః స్యాత్ తదా దేహాసంహారః తథా. కాలానలపవనమహార్ణవానాం సన్నిపాతే బ్రహ్మాండదేహప్రళయావస్థాయాం యుగపదేవ భోగరహితాశ్చేతనాస్స్యురితి కో విరోధః ?

తా. కారణక్రమమునుబట్టియే కార్యక్రమము గాన భోగనివృత్తి క్రమముగా నందఱకును సంభవించును గాని యొకేపర్యాయము సంభవింపదనరాదు. అయ్యది కారణక్రమముననే వచ్చును గాని యొకేపర్యాయము రాదనుటలోఁ గూడ నియమము లేదు. గ్రహణసమయమున నొకేసారి చంద్రమండలముయొక్క గ్రాస మెట్లగునో వాతపిత్తశ్లేష్మములసన్నిపాతమువలన దేహసంహార మెట్లగునో యట్లే, ప్రళయాగ్ని ప్రళయవాయువు మహాసముద్రములయొక్క సమావేశము కలిగినపుడు బ్రహ్మాండదేహప్రళయము కలుగును. కాఁబట్టి యాప్రళయమునందు చేతనులందఱును,ఒకేసారి భోగరహితులగుదురనుటలో విరోధము లేదు.

మూ. తథాపి విదేహాః కర్మిణ ఇతి దుర్ఘటమితి చేత్, కిమత్ర దుర్ఘటమ్? భోగనిరోధవచ్ఛరీరేంద్రియ విషయనిమిత్తనిరోధాదేవ తదుపపత్తేః.

తా. అట్లయ్యు, విదేహులు కర్మలుగలవా రెట్లగుదురని యాశంకింపరాదు. కర్మలవలన భోగము కలుగునపుడు శరీరముఁగూడ నుండును. భోగనిరోధ మగునపుడు శరీరము ఇంద్రియములు విషయములకుఁ గూడ నిరోధముండును గాన విదేహులు కర్మలుకలవా రగుదురు.

మూ. వృశ్చికతండులీయకాదివద్వర్ణాది వ్యవస్థాప్యుపపద్యతే,యథా హి వృశ్చికపూర్వకత్వేఽపి వృశ్చికస్య గోమయాదాద్యః తండులీయకపూర్వకత్వేఽపి తండులీయకస్య తండులకణాదాద్యః వహ్నిపూర్వకత్వేఽపివహ్నేరరణేరాద్యఃఏవం

క్షీరదధిఘృతతైలకదళీకాండాదయః తథామా నుషపశుగోబ్రాహ్మణపూర్వకత్వేఽపి తేషాంప్రాథమికాస్తత్తత్కర్మోపనిబద్ధభూతభేద హేతుకా ఏవ స ఏవ హేతుః సర్వత్ర అనుగత ఇతి సర్వేషాం తత్సంతానికానాం సమానజాతీయత్వమితి కిమసంగతమ్ ?

తా. వృశ్చిక తండులీయకాది వ్యవస్థవలె బ్రాహ్మణాది వ్యవస్థకూడ నుపపన్న మగును. వృశ్చికము వృశ్చికపూర్వకమైనను మొదటివృశ్చికము గోమయమువలననే గల్గునట్లును, తండులీయకము తండులీయకపూర్వకమైనను మొదటితండులీయకము తండులకణమువలననే గల్గునట్లును, వహ్ని వహ్నిపూర్వకమైననూ మొదటివహ్ని యరణివలననే బుట్టినట్లును, పాలు, పెరుగు, నెయ్యి, తైలము మున్నగునవి ఆక్షీరాదులవలనఁ గల్గునట్లును ప్రాథమికములగు మానుషాదులవ్యవస్థ ఆయాకర్మలతోఁ గూడుకొనిన భూతములవలననే కలుగును. ఆ హేతువులు, వానిసంతతియందుఁగూడ నుండుటచే యంతట నున్నందున వాట్లవలనఁ బుట్టినవానికిఁ గూడ నాజాతియే వచ్చును యని చెప్పినచో యేమియసంగతము ?

మూ. గతం తర్హి గోపూర్వకోఽయం గోత్వాదిత్యాదినా. న గతమ్, యోనిజేష్వేవ వ్యవస్థాపనాత్, మానసాస్త్వన్యథాపీతి గోమయవృశ్చికాదివదిదానీమపి కిం నస్యాదితి చేన్న, కాలవిశేషనియతత్వాత్కార్యవిశేషాణామ్,న హి వర్షాసుగోమయాచ్ఛాలూక ఇతి హేమంతే కిం నస్యాత్.

తా. "అట్టిచో గోసామాన్యము గోపూర్వకము" అనునను మానము లేకపోవలసివచ్చునని చెప్పరాదు. యోనిజమైన గోవులకే గోపూర్వకత్వము చెప్పెదము. మానసికమైన గవాదిసృష్టి యన్యథా యుండవచ్చును. మొదటివృశ్చికము గోమయమువలన నెట్లుత్పన్నమయ్యెనో యట్లే ఇపుడును ఏల పుట్టకూడదని యాశంకించరాదు. వర్షాకాలమందు గోమయము వలన పురుగులు పుట్టుటవలనను హేమంతమునందుఁ బుట్టక పోవుటవలనను కార్యవిశేషములు కాలవిశేషనియతములని చెప్పవలెను. కావున నట్టి కాలవిశేషము ఇపుడు లేనందున నట్టియాశంక కవకాశము లేదు.

మూ. సమయో వ్యేకో నైవ. మాయావినేవ వ్యుత్పా
దవ్యుత్పాదక భావావస్థిత నానాకాయాధిష్ఠా
నాద్వ్యవహారతఏవ సుకరః, యదా హి మా
యావీ సూత్రసంచారాధిష్ఠితం దారుపుత్రక
మిదమానయేతి ప్రయుంక్తే స చ దారుపుత్రక
స్తథా కరోతి తదా చేతనవ్యవహారాదివ త్తద్దర్శి
బాలో వ్యుత్పాద్యతే,తథేహాపి స్యాత్, క్రియా
వ్యుత్పత్తిరపి తతఏవ కులాలకువిందాదీనామ్.

తా. ఐంద్రజాలికుఁడు సూత్రమునందు దారుమయమైన బొమ్మనుంచి దానిఁ గూర్చి "యాఘటమును తీసుకొనిరమ్ము" అని ప్రయోగించిన పిదప నాబొమ్మ యటులఁ జేయును. దానినిజూచిన బాలుఁడును చేతనవ్యవహారమునవలె బొమ్మయొక్క వ్యవహారమువలనఁ గూడ శక్తిజ్ఞానము కల

వాఁ డగును. అట్లే సృష్ట్యాదియందు ఈశ్వరుఁడు ప్రయోజ్య ప్రయోజకశరీరములను ధరించి ప్రయోజకవృద్ధునిచే నియోగింపఁబడినఁ బ్రయోజ్యవృద్ధునియొక్క వ్యవహారమువలన నపుడుండు జనులకు శక్తిజ్ఞానమును గలుగఁజేయును. మఱియు నిట్లే యీశ్వరుఁడు కులాలకువిందాదిరూపములను ధరించి ఘటపటాదికార్యనిర్మాణమున నుపయోగించు సామగ్రిని దెల్పును. దానినిఁ గనుఁగొనిన కులాలకువిందాదులు ఘటపటాదుల నిర్మాణము చేయుదురు గాన ఘటపటాదిసంప్రదాయమున కనుపపత్తి లేదు.

మూ. సర్గాదావేవ కిం ప్రమాణమితి చేత్, విశ్వసంతానోఽయం దృశ్యసంతానశూన్యైస్సమవాయిభిరారబ్ధః సంతానత్వాత్, ఆరణేయసంతానవత్, వర్తమానబ్రహ్మాండపరమాణవః పూర్వముత్పాదితసజాతీయసంతానాంతరాః నిత్యత్వేసతి తదారంభకత్వాత్, ప్రదీపపరమాణువదిత్యాది.

తా. సృష్ట్యాదియందుఁ బ్రమాణ మేమనఁగాః అరణినిర్మంథనసంయోగమువలన గల్గువహ్నిసంతానము సంతానరూప మగుటవలన, దృశ్యమైన వహ్నిసంతానశూన్యముగల సమవాయియగు, పరమాణువలనఁ గలుగునట్లు ప్రపంచసంతానముఁ గూడ అటులనే గలుగును. యను ననుమానమున్ను, ప్రదీపపరమాణువులు నిత్యలములై ప్రదీపారంభకమగుటవలన పూర్వమున బుట్టించిన ప్రదీపసజాతీయమగు ప్రదీపాంతము గలవియో, అట్లే ప్రస్తుతమునందుండు బ్రహ్మాండముయొక్క పరమాణువులు గూడఁ బూర్వమునఁ బుట్టించిన బ్రహ్మాండసజా

తీయబ్రహ్మాండముగలవి యను యనుమానమున్ను, సృష్టిలోఁ బ్రమాణ మగును.

**మూ.** అవయవానామావాపోద్వాపాదుత్పాదవినాశౌ
చ స్యాతాం సంతానావిచ్ఛేదశ్చేతి కో విరోధ
ఇతి చేన్న, ఏవం హి ఘటాదిసంతానావిచ్ఛే
దోఽపి స్యాత్. విపర్యయస్తు దృశ్యతే, కర్త్రాది
భోగవిశేషసంపాదనప్రయుక్తోఽసావితి చేన్న,
ద్వ్యణుకేషు తదభావాత్. తథా చ తదవయవా
నామపగమాఽభావేనానాదిత్వప్రసంగే ద్వ్యణు
కత్వవ్యాఘాతః.

తా. అవయవులకవయవముల యుపగమాపగమముల వలననే యుత్పత్తివినాశములును సంతానావిచ్ఛేదమును సంభవించునని చెప్పిన విరోధ మేమున్నదని శంకించరాదు. కార్యద్రవ్యమున కీరీతిగా నత్యంతోచ్ఛేదము లేనిచో నభిమతమైన ఘటాదులకుఁగూడ నత్యంతోచ్ఛేదము లేకపోవలసి వచ్చును. సామాన్యముగా ఘటాదుల కత్యంతోచ్ఛేదము దృష్టమగుటవలన నది మాకిష్టమే యనుటకు వీలులేదు. కార్యద్రవ్యము భోగసాధనము గానందుననే యత్యంతోచ్ఛేదవ్యవహారము కలుగును గాని అవయవములయొక్క ఉపగమాపగములవలన కలుగదని యాశంకించుటకు వీలులేదు. అటులైనచో ద్వ్యణుకము భోగసాధనము కానందునను, అవయవములయొక్క యపగమము లేనందునను సదాతనము కావలసివచ్చును. ద్వ్యణుకమునకు అట్టియెడ ద్వ్యణుకత్వహానియుఁ గల్గును.

మూ. తస్మాద్యత్కార్యం యన్నిబన్ధనస్థితి తదపగమే తన్నివృత్తిః యత్ యద్ధేతుకం తదుపగమే తస్యోత్పత్తిః, న చ కార్యస్య స్థితినిబన్ధనం నిత్యమేవ నిత్యస్థితిప్రసంగాత్, న చ నిత్య ఏవ హేతుః. అకాదాచిత్కత్వప్రసంగాత్. తదతి నిస్తరంగమేతత్.

తా. కావున నేకార్య మేది యున్నపుడుండునో యది లేనిచో నాకార్యముయొక్క నివృత్తి కల్గును. ఏది యద్ధేతుకమో ఆకార్యమది యున్నపుడే పుట్టును. కార్యముయొక్క స్థితినిబంధనము నిత్యమని చెప్పుటకు వీలులేదు. అటులైనచో కార్యముఁగూడ నిత్యము కావలసివచ్చును. కార్యముఁగూడ నిత్యహేతుకమైనచో కాదాచిత్కత్వము లేకపోవలసి వచ్చును.

మూ. ఈదృశ్యాం చ వస్తుస్థితౌ భోగోఽపి కర్మభిరేవ మేవ వస్తుస్వభావాఽనతిక్రమేణ సంపాదనీయ ఇతి ద్వ్యణుకవత్పిపీలికాండాదేర్బ్రహ్మాండపర్యం తస్యాపి విశ్వస్యైయమేవ గతిరితి ప్రతిబంధ సిద్ధిః.

తా. ఇట్లు కార్యస్థితి యనిత్యహేతుకమగుచుండగా భోగము గూడ కర్మలచే వస్తుస్థితి నతిక్రమించక సంపాదనీయ మగును. కనుకనే "భోగార్థః కర్మభిస్సర్వేషాముత్పాదః" యను సిద్ధాంతముఁగూడ కుదురును. కనుక ద్వ్యణుకము భోగసాధనము గాకపోయినను స్థితినిబంధనహేతువుయొక్క ఉపగమాపగమములవలన నుత్పాదవినాశశాలి యగునట్లు కార్యరూప

మైన ప్రపంచమునకుఁ గూడ నుత్పత్తివినాశములు సంభవించును. కాన సృష్టిప్రళయసాధకములగు ననుమానముల యందు వ్యాప్తి సిద్ధించును.

మూ. తథా చ బ్రహ్మాండే పరమాణుసాధ్వవితరి పరమాణుషుచ స్వతంత్రేషు పృథగాసీనేషు తద న్తఃపాతినః ప్రాణిగణాః క్వ వర్తంతామ్? కుపితకపికపోలాంతర్గతౌదుంబరమశకసమూహవత్, దవదహనదహ్యమానదారూదరవిఘూర్ణమానఘుణసంఘాతవత్, ప్రళయపవనోల్లాసనీయార్ణవానలనిపాతిపోతసాంయాత్రికసార్థవద్వేతి.

తా. బ్రహ్మాండము ద్వ్యణుకాదిక్రమమున నశించినపిదప పరమాణువులు స్వతంత్రముగా నుండునపుడు కోపించిన కోతియొక్క గండస్థలమునందుండెడి మశకసమూహము వలెను, కార్చిచ్చుచే దహింపఁబడుచున్న వృక్షకోటరమందుండు తేనెటీగలువలెను, ప్రళయకాలమందు వీచు పెనుగాలిచే వృద్ధినొందినఁ బడబాగ్నియందుపడిన నావయందుండెడి కళాసుల సమూహమువలెను, బ్రహ్మాండాంతర్గతమైన పర్వతములు సముద్రములు మొదలగు నిఖిలమగు పదార్థములును నశించును.

ఈగ్రంథముచే బ్రహ్మాండనాశరూపమగు ప్రళయము సిద్ధించినందున బ్రహ్మాండాంతర్గతమైన వేదసముదాయము కూడ నశించునని సూచింపఁబడెను.

శ్లో. జన్మసంస్కారవిద్యాదేశ్శక్తేస్స్వాధ్యాయకర్మణోః,
హ్రాసదర్శనతో హ్రాసః సంప్రదాయస్య మీయతామ్. 3

తా. జన్మ = జన్మయొక్కయు, సంస్కార = గర్భాది సంస్కారముయొక్కయు, విద్యాదేః = వృత్తిధర్మము మొదలగువాటియొక్కయు, శక్తేః = అధ్యయనశక్తియొక్కయు, కర్మలశక్తియొక్కయు, హ్రాసదర్శనతః = నాశముగజూడఁబడుట వలన, సంప్రదాయస్య = వేదముయొక్క, హ్రాసః = నాశము, మీాయతాం = ఊహింపఁబడుఁగాక.

మూ. పూర్వంహి మానస్యః ప్రజాస్సమభవన్ తతో ఉపత్యైక ప్రయోజనమైథునసంభవాః తతః కామావర్జనీయసన్నిధిజన్మానః, ఇదానీం దేశకాలాద్యవస్థయా పశుధర్మాదేవ భూయిష్ఠాః, పూర్వం చరుప్రభృతిషు సంస్కారాః సమాధియిషత, తతః క్షేత్రప్రభృతిషు తతో గర్భాదితః ఇదానీం తు జాతేషు లౌకికవ్యవహారమాశ్రిత్య పూర్వం సహస్రశాఖో వేదో అధ్యగాయి తతో వ్యస్తః తతష్షడంగ ఏకః ఇదానీం తు క్వచిదేకా శా

తా. కృతయుగమున సంకల్పమువలననే మానసికమైన ప్రజోత్పత్తియు త్రేతాయుగమందు దపత్యైక ప్రయోజనమైన మిథునకర్మచే నుత్పత్తియు ద్వాపరమునఁ గామముతోఁ గూడిన మిథునకర్మవలన నుత్పత్తియు నయ్యెను. ప్రస్తుతమున దేశకాలవ్యవస్థలేక కేవలము పశుధర్మమువలననే ప్రజలయొక్క యుత్పత్తి యగుచున్నది. ఈప్రకారము జన్మహ్రాసము దృష్టమగుచున్నది. కృతయుగమందు చరుపురోడాశ

మందు మంత్రసంస్కారము చేయఁబడెను. అనంతరము క్షేత్రాదులయందును, గర్భాదులయందును సంస్కారములుఁ జేయఁబడెను. ప్రస్తుతము శిశువు జన్మించినపిదప లౌకికవ్యవహారము నాశ్రయించి సంస్కారము చేయఁబడుచున్నది. ఈప్రకారము సంస్కారాదులకు హ్రాసము దృష్టమగుచున్నది. పూర్వము సహస్రశాఖలతోఁ గూడుకొనిన వేదాధ్యయనము. పిమ్మట కొంతకాలమునకు కొన్నిశాఖలతోఁగూడుకొనిన వేదాధ్యయనము. మరికొంతకాలమునకు షడంగసహిత వేదాధ్యయనము, ప్రస్తుతము కొన్నిస్థలములయం దొకొక్కశాఖయొక్కయే యధ్యయనము జరుగుచున్నది.

మూ. పూర్వం ఋతవృత్తయో బ్రాహ్మణాః ప్రాదోృతి
పత, తతోఽమృతవృత్తయః, సంప్రతి ప్రమృత
సత్యానృతకుసీదపాశుపాల్యశ్వవృత్తయో భూ
యాంసః, పూర్వం దుఃఖేన బ్రాహ్మణైరతి
థయోఽలభ్యన్త,తతః క్షత్రియాతిథయోఽపి
సంవృత్తాః, తతో వైశ్యావేశినోఽపి సంప్రతి
శూద్రాన్నభోజినోఽపి పూర్వ మమృతభుజః
తతో విఘసభుజః,తతోఽన్నభుజః, సంప్రత్యఘ
భుజ ఏవ.

తా. పూర్వమున బ్రాహ్మణు లుంఛశిలావృత్తులచే జీవించుచుండెడివారు. అనంతర మయాచిత మైనదానిని గ్రహించుచుండెడివారు. అటుపిమ్మట కొంతకాలమునకు యాచితమైనదానిని గ్రహించుచుండెడివారు. ప్రస్తుతము

వ్యవసాయము వడ్డీ వ్యాపారము గోరక్షణము మొదలగు కర్మలచే జీవనము చేయుచున్నారు. ఇట్లు వృత్తిహ్రాసము దృష్టమగుచున్నది.

పూర్వము బ్రాహ్మణులకే బ్రాహ్మణాతిథులు లభించెడివారు. అటుపిమ్మట క్షత్రియులకును వైశ్యులకునుగూడ బ్రాహ్మణులు అతిథులగా వెళ్లెడివారు. ప్రస్తుతము శూద్రాన్నమును భుజించెడు బ్రాహ్మణాతిథు లున్నారు. పూర్వము యజ్ఞశేషమునే భుజించెడివారు. అటుపిమ్మట అతిథులశేషమునే భుజించెడివారు. ప్రస్తుత మితరులతో సంబంధము లేక స్వోదరపూరణపరాయణులై కానఁబడుచున్నారు.

మూ. పూర్వం చతుష్పాద్ధర్మ ఆసీత్, తత స్తనూయమానే తపసి త్రిపాత్, తతో మ్లాయతి జ్ఞానే ద్విపాత్, సంప్రతి జీర్యతి యజ్ఞే దానైకపాత్, సోఽపి పాదో దురాగతాజవిపాదికాశతదుఃస్థో ఽశ్రద్ధామలకళంకితః కామక్రోధాదికంటకశతజర్జరః ప్రత్యహమపచీయమానవీర్యతయా ఇత స్తతస్స్ఖలన్నివోపలభ్యతే.

తా. పూర్వము ధర్మము-తపస్సు, జ్ఞానము, యజ్ఞము దానము నను నాలుగుపాదములతో నుండెడిది. క్రమముగాఁ దపోజ్ఞాన యజ్ఞములు నశించినపిదప కేవల దానరూపమగు నేకపాదముతో నుండెను. ప్రస్తుత మాపాదముకూడ దుష్టప్రతిగ్రహ మనెడువ్యాధిచేఁ బీడింపఁబడి యశ్రద్ధ యనెడు మలముచేఁ బూయఁబడి కామక్రోధాది రూపకంటకశతముచే

బాధపడుచు ప్రతినిత్యము క్షీణించుసామర్థ్యము కలదగుటచే నిటునటు సంచరించుటకు వీలులేక యున్నది. ఇటుల ధర్మహ్రాసము దృష్టమగుచున్నది.

అధ్యయనమునకు యజ్ఞమునకుఁ గారణమైన సామర్థ్యముయొక్క నాశమువలన స్వాధ్యాయ యాగాదిరూపమగు కార్యహ్రాసము చూడఁబడుచున్నందున వేదముయొక్క హ్రాసముఁగూడ నూహింపఁబడుఁగాక.

మూ. ఇదానీమేవ సర్వత్ర దృష్టాన్నాధికమిష్యతే ఇతి చేన్న, స్మృత్యనుష్ఠానానుమితానాం శాఖానాముచ్ఛేదదర్శనాత్. స్వాతంత్ర్యేణ స్మృతీనామాచారస్య చ ప్రామాణ్యానభ్యుపగమాత్.

తా. శాఖలకు విచ్ఛేదము లేదు. ప్రస్తుత మధ్యయన విషయముగా నెంతవేద ముపలభ్యమాన మగుచున్నదో నావేదమే యెల్లపుడు నధ్యయనవిషయము గావున వేదమునకుఁగాని శాఖలకుఁగాని హ్రాసము లేదని యాశంకింపరాదు. స్మృతికి నాచారమునకును ప్రామాణ్యము శ్రుతిమూలకము గావున ప్రత్యక్షసిద్ధమగు స్మృతికి నాచారమునకును మూలమగు శ్రుతి కానరానందున స్మృత్యాచారాదులచే ననుమేయించెదము. (వివాదపదం స్మృతిః=స్మృత్యర్థానుభావక వేదమూలం—అక్లృప్తమూలత్వే సతి మహాజనపరిగ్రహీతస్మృతిత్వాత్, ప్రత్యక్షవేదమూలకస్మృతివత్. ఆచారః వేదబోధితః—అలౌకికావిగీతశిష్టాచారవిషయత్వాత్— యాగవత్,) ఇట్లు అనుమితమైన శాఖలవలె నధ్యయనగోచరముగాని వేదములకుఁ గూడ హ్రాసము నంగీకరించవలెను.

మూ. మన్వాదీనామతీంద్రియార్థదర్శనే ప్రమాణాభావాత్. ఆచారాత్స్మృతిః స్మృతేశ్చాచార ఇత్యనాదితాభ్యుపగమే అన్ధపరంపరాప్రసంగాత్. ఆసంసారమనామ్నాతస్య చ వేదత్వవ్యాఘాతేనానుమానాఽయోగాత్. ఉత్పత్తితోఽభివ్యక్తితోఽభిప్రాయతో వాఽనవచ్ఛిన్నవర్ణమాత్రస్య నిరర్థకత్వాత్.

తా. మన్వాదు లతీన్ద్రియార్థద్రష్టలనుటకుఁ దగుప్రమాణము లేమిం జేసి వార లతీంద్రియార్థమును గని పెట్టి వేదము నపేక్షింపకయే స్మృత్యాదులను రచించినారని చెప్పుటకు వీలు లేదు. శిష్టాచారము బహుళముగా నున్నందున దానినిఁ బట్టియే స్మృతిప్రణయనమును, స్మృతినిఁబట్టి శిష్టాచారమును నంగీకరించుచు వేదప్రాసము లేదని చెప్పినచో స్మృత్యాదులకు వేదమూలకముగాఁ బ్రామాణ్యము నంగీకరించిన మీామతమం దీ రెండింటికి వేదమూలకత్వ మంగీకరించక ప్రామాణ్య మంగీకరించినచో అంధపరంపరాప్రసంగము వచ్చును. అనఁగా స్మృత్యాచారాదుల కానుమానికత్వము స్వీకరింపవలసివచ్చును. ఈస్మృత్యాచారములకు నిత్యానుమేయ వేదమూలకత్వ మంగీకరించెదము. శాఖోచ్ఛేద మంగీకరించమనిన నాసంసారము పఠించకుండాయుండెడి ఆ వేదమునకు వేదత్వము లేనందున ననుమేయత్వ మనుపపన్నము. ఉత్పత్తితోగాని యభివ్యక్తితోగాని యభిప్రాయముతోగాని శూన్యమగు వర్ణమాత్రము నిరర్థకముఁ గాన నట్టిదానికే

స్మృత్యాచారమూలకత్వము నంగీకరించి, శాఖోచ్ఛేదము లేదనుటకు వీలులేదు.

మూ. యది చశిష్టాచారత్వాదిదం హితసాధనం కర్తవ్యం వేత్యనుమితం కిం వేదానుమానేన? తదర్థస్యాను మానతఏవ సిద్ధేః. న చ ధర్మవేదనత్వాదిదమే వానుమానం అనుమేయో వేదః, ప్రత్యక్ష సిద్ధత్వాదశబ్దత్వాచ్చ. అథ శిష్టాచారత్వా త్ప్రమాణమూలోయమితి చేత్, తతః సిద్ధసాధ నమ్, ప్రత్యక్షమూలత్వాభ్యుపగమాత్. తద సంభవేఽప్యనుమానసంభవాత్.

తా. "ఇదం హితసాధనం కర్తవ్యం వా శిష్టాచార త్వాత్త"ను ననుమానముచేతనే కర్మలకు హితసాధనత్వమును కర్తవ్యత్వమును సిద్ధించుచుండఁగా నిత్యానుమేయమగు వేద మూలకత్వ మొప్పుట యసంగతము. శిష్టాచారరూప హేతువు ధర్మబోధక మగుటవలన నీయనుమానమే నిత్యానుమేయ వేదమని యాశంకింపరాదు. ఆచారము ప్రత్యక్షసిద్ధ మగుట వలన నిత్యానుమేయరూపమనియు శబ్దరూపము గానందున వేదమనియు చెప్పుటకు వీలులేదు. "ఇదం ప్రమాణ మూలంశిష్టాచారత్వాత్త"ను ననుమానముచే నిత్యానుమేయ వేదమూలకత్వము సాధించుటకు వీలులేదు. ఆచారమీశ్వ రీయప్రత్యక్షవిషయ మగుటవలన దానికి ప్రత్యక్షమూల కత్వము సిద్ధించినందున సిద్ధసాధనాఖ్యదోషము సంభవించును. ఈశ్వరు నంగీకరించనిపక్షమున ప్రత్యక్షమూలకత్వము లేక

పోయినను అనుమానమూలకత్వమే యంగీకరించెదము గాని నిత్యానుమేయ వేదమూలకత్వ మంగీకరింపము.

మూ. నిత్యమజ్ఞాయమానత్వాత్తదప్రత్యాయకం, కథ మనుమానం కథం చ మూలమితి చేత్. వేదః కిమజ్ఞాయమానః ప్రత్యాయకోఽప్రత్యాయక ఏవ వా మూలం, యేన జడతమ తమాద్రియసే. అనుమితత్వాత్ జ్ఞాయమాన ఏవ ఇతి చేత్, లింగమప్యేవమేవాస్తు.అనుమేయప్రతీతేఃప్రాక్త నీలింగప్రతీతిరపేక్షితా కారణత్వాత్. న తు పశ్చాత్తనీతి చేత్. శబ్దప్రతీతిరప్యేవమేవ.

తా. అనుమాన మజ్ఞాయమాన మగుటవలన ప్రత్యయ జనకము గానందున నది యనుమాన మెట్లగును? అట్టిదెటుల మూలమగును? అందువా! శిష్టాచారమునకు నిత్యానుమేయ వేదమూలకత్వము నంగీకరించిన నీమతమున నజ్ఞాయమాన మగువేదము ప్రత్యయజనక మెట్లగును? అట్టిప్రత్యయజన కముగాని వేదము ఆచారమూల మెట్లగును? చెపుము! అనుమితమగుటచే జ్ఞాయమానమే యగుననిన, లింగముఁగూడ నట్లే కావచ్చును. లింగప్రతీతి యనుమేయప్రతీతికిఁ గారణ మైనందున పూర్వమందుండుట యావశ్యకమనినచో శబ్ద ప్రతీతిఁగూడ నట్లే యగును. ఆచారకర్తవ్యత్వము పైయను మానమూలము, ఆచారకర్తవ్యత్వము సిద్ధించినపుడే అను మేయప్రతీతిగల్గును. ఆచారకర్తవ్యతాబోధకలింగప్రతీతికంటె పూర్వమాచారకర్తవ్యత సిద్ధించినందున ననుమానము నంగీక

రించవలసిన యవసరము లేదనినచో శబ్దప్రతీతి లేకయాచార కర్తవ్యత సిద్ధింపనందున శబ్దానుమానముఁగూడ నట్టిదేయగును.

మూ. ఆచారస్వరూపేణ శబ్దమూలత్వమనుమీయతే,
తేన తు శబ్దేన కర్తవ్యతా ప్రతీయతే ఇతి
చేన్న. ఆచారస్వరూపస్య ప్రత్యక్షసిద్ధత్వేన
మూలాంతరాఽనపేక్షణాత్ తస్మాత్కర్తవ్యతా
యాం ప్రత్యక్షాఽభావాదప్రమితతయా చ
శబ్దానుమానానవకాశాత్ ప్రత్యక్షశ్రుతేరసం
భవాచ్ఛిష్టాచారత్వేనైవ కర్తవ్యతామను
మాయ తయా మూలశబ్దానుమానమ్, తథా
చ కిం తేన? తదర్థస్య ప్రాగేవ సిద్ధేః.

తా. శిష్టాచారమునకుఁ శబ్దమూలకత్వము నను మే యించెదము. అనుమితమైనశబ్దముచే కర్తవ్యత సిద్ధించునని యాశంకించరాదు. ఆచారస్వరూపము ప్రత్యక్షసిద్ధమైనందున ప్రమాణాంతరము నపేక్షించదు. ఆచారస్వరూపము ప్రత్యక్ష సిద్ధమైనను దాని కర్తవ్యతాబోధకై వేదానుమాన మవసర మనుటకు వీలులేదు. కర్తవ్యత ప్రత్యక్షము కానందునను ప్రమితము కాకపోవుటచేతను శబ్దానుమానమున కవకాశము లేదు. కర్తవ్యతను బోధించు ప్రత్యక్షశ్రుతి లేనందున శిష్టా చారత్వరూపహేతువుచేఁ గర్తవ్యత ననుమేయించి అనుమిత మైన గర్తవ్యత్వముచే మూలశబ్దము ననుమేయించెదమని చెప్పవలెను. కాగా అనుమితమై కర్తవ్యత పూర్వమే సిద్ధించి నందున దానికై శబ్దానుమానప్రసక్తియే లేదు.

మూ. తథాప్యాగమమూలత్వేనైవ తస్య వ్యాప్తేరితి చేత్. అతఏవ తర్హి తస్య ప్రత్యక్షానుమాన మూలత్వమనుమేయం. ఆదిమతః తత్వం స్యాత్ అయం త్వనాదిరితి చేత్. ఆచారోఽపి తర్హి ప్రథమతః తథా స్యాత్, అయం త్వనాదిర్వినా ప్యాగమం భవిష్యతి ఆచారకర్తవ్యతాను మానయో రేవమనాదిత్వమస్తు కిన్నశ్ఛిన్నమితి చేత్. ప్రథమం తావన్నిత్యానుమేయో వేద ఇతి, ద్వితీయం చ దేశేనైవ ధర్మే ప్రమాణ మితి.

తా. దర్శాదులయందు వేదపూర్వకత్వసహచారదర్శ నమువలన వేదమూలకత్వవ్యాప్తి సిద్ధించును అని చెప్పుటకు కూడ వీలులేదు. పౌరుషేయవాక్యస్థలమందు ప్రత్యక్షాను మానమూలకత్వ మున్నటుల వైదికవాక్యస్థలములందుకూడ ప్రత్యక్షానుమానమూలకత్వము సిద్ధించవలసి వచ్చును. కావున కేవలసహచారదర్శనమున వ్యాప్తి సిద్ధియగునని చెప్పుటకు వీలులేదు. సాదియైనవానికి ప్రత్యక్షానుమానమూలకత్వ మను మితమైనను అనాదియైన యాచారమునకు ప్రత్యక్షానుమాన మూలకత్వము లేదనినచో, సాదియైనయాచార మెటులైనను యనాదియైన యాచార మాగమము లేకపోయినను కావ చ్చును. అనాదియైనయాచారము వేదమూలకము కాకపోయి నను శిష్టాచారత్వేన కర్తవ్యత్వానుమానమే మూలమని చెప్పెదము శిష్టులు కర్మలనాచరించు తమ పూర్వులఁ జూచి

శిష్టాచారత్వముచే కర్తవ్యత ననుమేయించికొనుచు తాము కూడ కర్మల నాచరింతురు. పూర్వులును వారి పూర్వులను చూచి కర్తవ్యత ననుమేయించి కర్మలం బ్రవర్తించిరి. ఇట్లు కర్తవ్యత్వానుమానమే యాచారమునకు మూలమగుచున్నందున ననుమానమూలకత్వమునే స్వీకరించెదమనినచో "నిత్యానుమేయవేదము స్మృత్యాచారములకు మూలమ"ను సిద్ధాంతమును, "చోదనాలక్షణోఽర్థో ధర్మః" యనుసిద్ధాంతమును భగ్నము కావలసివచ్చును.

మూ. అథాయమాశయః వైదికా అప్యాచారా రాజ
సూయాశ్వమేధాదయః సముచ్ఛిద్యమానా
దృశ్యన్తే, యత ఇదానీం నానుష్ఠీయన్తే న
చైతే ప్రాగపి నానుష్ఠితా ఏవ, తదర్థస్య వేద
రాశేరప్రామాణ్యప్రసంగాత్. సముద్రతరణోప
దేశవత్. న చైవమేవాస్తు, దర్శాద్యుపదేశేన
తుల్యయోగక్షేమత్వాత్.

తా. వైదికాచారములగు రాజసూయాశ్వమేధాదులు ప్రస్తుత మాచరింపఁబడకపోవుటవలన సముచ్ఛిద్యమానములుగాఁ జూడఁబడుచున్నవి. రాజసూయాశ్వమేధాదులు పూర్వముకూడ ననుష్ఠింపఁబడలేదనినచో [illegible] సముద్రతరణము నుపదేశించు వాక్యము[illegible] రాజసూయాశ్వమేధాదుల నుపదేశించు వేదవాక్య[illegible]గూడ [illegible]ప్రమాణములు గావలసివచ్చును. దర్శాదుల [illegible]దేశించు వేదవాక్యములతోఁ దుల్యయోగక్షేమము క[illegible]వలన రాజసూయాది బోధకవేదము గూడ ప్రమాణ[illegible] చెప్పవలెను.

మూ. ఏవం పునస్స కశ్చిత్కాలో భవితా యత్రైతే అనుష్ఠాస్యంతే, తథాన్యేప్యాచారా స్సముచ్ఛేత్స్యంతే అనుష్ఠాస్యంతే చేతి న విచ్ఛేదః, తత స్తద్వదాగమమూలతేతి చేత్. ఏవం తర్హి ప్రవాహాదౌ లింగాఽభావే కర్తవ్యత్వాగమయో రననుమానాదసత్వాం ప్రత్యక్షశ్రుతౌ ఆచారసంకథాపి కథమితి సర్వవిప్లవః. తస్మాత్ప్రత్యక్షశ్రుతిరేవ మూలమాచారస్య, సా చేదానీం నాస్తీతి శాఖోచ్ఛేదః.

తా. రాజసూయాశ్వమేధాద్యాచారములు పూర్వకాలమునవలె నుత్తరకాలమునగూడ ననుష్ఠింపఁబడవచ్చును. అటులే యితరములగు నప్రత్యక్షవేదమూలకాచారములు కూడ ముందాచరింపఁబడవచ్చును. ఒకానొకసమయమున నుచ్ఛిన్నములును గావచ్చును. "ఆచారాః వేదమూలాః ఉచ్ఛేదానంతరభావిత్వాత్ రాజసూయాశ్వమేధాదివత్" అను నీయనుమానమువలన నాచారమునకు వేదమూలకత్వమును సాధించెదమని చెప్పుట కవకాశము లేదు. ప్రళయకాలమ్మందు స్మృత్యాచారాదుల కుచ్ఛేదముండుటవలన ననుష్ఠానమే సంభవింపదు. కావున సర్వవిప్లవము సంభవించును. కావున నాచారమునకు ప్రత్యక్షశ్రుతియే మూలము. అట్టి ప్రత్యక్షశ్రుతియొక్క యధ్యయనము లేనందున శాఖోచ్ఛేదమును చెప్పవలెను.

మూ. అధునాప్యస్తి సాఽన్యత్రేతి చేత్. అత్ర కథం నాస్తి? కిముపాధ్యాయవంశానామవ్యక్తత, గమ

నాత్ ? తేషామేవోచ్ఛేదాద్వా? ఆహోస్విత్ స్వాధ్యాయవిచ్ఛేదాత్ ? న ప్రథమద్వితీయౌ, సర్వేషామన్యత్ర గమనే ఉచ్ఛేదేవానియమేన భారతవర్షే శిష్టాచారస్యాప్యుచ్ఛేదప్రసంగాత్. తస్యాధ్యేతృసమానకర్తృకత్వాత్. అన్యత ఆగతైరాచారప్రవర్తనే అధ్యయన ప్రవర్తనమపి స్యాత్. న తృతీయః, ఆధ్యాత్మిక శక్తిసంపన్నానామన్తేవాసినామవిచ్ఛేదే తస్యాసంభవాత్.

తా. అట్టి ప్రత్యక్షశ్రుతి భారతవర్షమున నధ్యయన గోచరము గాకపోయినను, మరియొకస్థలమునఁ గలదని నచో నిచ్చట నెందుకు లేదు. వేదోపదేశము చేయు నుపాధ్యాయవంశములు మఱియొకస్థలమునకు వెళ్లుటవలననా, లేక వారియొక్క నాశమువలననా ఇచ్చట లేదని చెప్పుదువు? అటులైనచో యీభారతవర్షమందు శిష్టాచారమునకే యుచ్ఛేదము ప్రసక్తమగును. అధ్యయనము లేకపోయినను దేశాంతరస్థులచే నాచారము ప్రవర్తింపఁ జేయఁబడినదనిన, అధ్యయన ప్రవర్తనముఁగూడ కావలసివచ్చును. స్వాధ్యాయవిచ్ఛేదము వలననే ప్రత్యక్షశ్రుతి యిచ్చట లేదనిచెప్పుట యాధ్యాత్మిక శక్తిసంపన్నులగు నంతేవాసులవిచ్ఛిన్నముగా నున్నందున సరికాదు.

మూ. తస్మాదాయురారోగ్యబలవీర్యశ్రద్ధాశమదమ గ్రహణధారణాదిశక్తేరవారహామపచీయమాన

త్వాత్ స్వాధ్యాయానుష్ఠానే శీర్యమాణే కథం
చిదనువర్తతే, విశ్వపరిగ్రహాచ్చ న సహసా
సర్వోచ్ఛేద ఇతి యుక్తముత్పశ్యామః.

తా. అందువలన నాయురారోగ్య బల, వీర్య, శ్రద్ధా, శమ, దమ, గ్రహణ ధారణాదులయొక్క శక్తి ప్రతిదినమును క్షీణించుచున్నందున స్వాధ్యాయానుష్ఠానము క్రమముగా తగ్గుచునున్నందున (స్వాధ్యాయానుష్ఠానము) నచ్చటచ్చ టతి కష్టముచే మెల్లఁగాఁ బ్రవర్తించుచున్నది. అందరిచేఁ గ్రహింపఁ బడిన దగుటచే వేగముగా సర్వోచ్ఛేదము సంభవించ లేదు.

మూ. గతానుగతికో లోకఇత్యప్రామాణికఏవ ఆచా
రో న తు శాఖోచ్ఛేదః, అనేకశాఖాగతేతి
కర్తవ్యతాపూరణీయత్వాత్ ఏకస్మిన్నపి కర్మ
ణ్యనాశ్వాసప్రసంగాత్ ఇతి చేత్. ఏవం హి
మహాజనపరిగ్రహస్యోపప్లవసంభవే వేదా అపి
గతానుగతికతయైవ లోకైః పరిగృహ్యన్తే ఇతి
న వేదాః ప్రమాణం స్యుః. తథా చ వృశ్చిక
భియా పలాయమానస్య ఆశీవిషముఖే నిపాతః.

తా. ఆచారమున కితికర్తవ్యతను బోధించు శాఖోచ్ఛేదము నంగీకరించిన శాఖాంతరములందలి యంగవిధుల యొక్క పరిజ్ఞానము సంభవింపనందున నీకర్మల కంగభూతము లగు కర్మలు ఇంకను కలవేమో యనుశంక కలుగవచ్చును. కాగా "ఈకర్మకు నివియే యంగములు" అను నమ్మకము లేక పోయెడిని. కనుక వారుచేసినారని వీరు వీరుచేసినారని మఱి

యొకరు చేయుటయేగాని మహాజనపరిగృహీత మగుటవలన ప్రామాణికమని చెప్పుటకు వీలులేదు. గతానుగతికమగుటచే నాచార మప్రమాణమనిన, గతానుగతిక న్యాయముననే వేదమూదును ప్రవర్తించుచున్నందున సర్వవేదమునకు నప్రామాణ్యము సంభవించెడిని. మహాజనపరిగ్రహముకంటె నితర మగు ప్రామాణ్యకారణ మున్నదని చెప్పుటకు వీలులేదు. కాఁబట్టి శాఖోచ్ఛేదరూప వృశ్చికభయమువలన పలాయమానులగువారు సర్వవేదాప్రామాణ్యరూపమగు సర్పముఖమందు పడినవా రగుదురు. కావున శాఖోచ్ఛేదము నంగీకరించవలెను.

మూ. ఏవమేన కాలక్రమభావినమనాశ్వాసమాశంక మానైర్మహర్షిభిః ప్రతివిహితమతో నోక్త దోషోఽపి. న చాయముచ్ఛేదో జ్ఞానక్రమేణ యేన శ్లాఘ్యస్స్యాత్. అపి తు ప్రమాద మదమానాలస్యనాస్తిక్యపరిపాకక్రమేణ. తత శ్చోచ్ఛేదానంతరం పునః ప్రవాహః తదనం తరం చ పునరుచ్ఛేద ఇతి సారస్వతమివ శ్రోతః, అన్యథా కృతహానప్రసంగాత్. తథా చ భావి ప్రవాహావద్భవన్నప్యయ ముచ్ఛేదపూర్వక ఇత్యనుమీయతే. స్మరతి చ భగవాన్ వ్యాసో గీతాసు భగవద్వచనమ్.

శ్లో. యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థానమధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్.

శ్లో. పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే. ఇతి.

తా. ముస్ముందు పైరీతిని కర్మలం దనాదరము కలుగ వచ్చునని యట్టియనాదరమును తొలగించుటకొరకే ఆయా శాఖాబోధితములగు నంగములను కనుఁగొనుచు, సర్వజ్ఞులగు మహర్షులు కల్పసూత్రములను రచియించిరి. గతానుగతికన్యాయమున నాచారమున కప్రామాణ్యము నాపాదించి శాఖోచ్ఛేదము నంగీకరింపనిచో, కల్పసూత్రరచనకే వైయర్థ్యము ప్రసక్తమగును. అట్టి శాఖోచ్ఛేద మప్రామాణ్యజ్ఞానమువలనఁ గాదు. మఱి యేమన ప్రమాదము మదము అభిమానము ఆలస్యము నాస్తిక్యము మున్నగువానియొక్క పరిపాకముచే, వాని యధ్యయనము లేనందున క్రమముగా కలిగినది. ఇట్లు ఆచారముచే ననుమితములగు వేదశాఖలకువలె, వర్తమాన వేదమునకుఁ గూడ నుచ్ఛేద మంగీకరించెదము. ఆయుచ్ఛేదానంతరము మఱలప్రవాహమును తదనంతరము మఱలనుచ్ఛేదమును క్రమముగా నంగీకరించవలెను. వర్తమానప్రవాహమునకుచ్ఛేదమున్నను, భావిప్రవాహమునకు తదుచ్ఛేదమును అంగీకరించనిచో కృతములగు కర్మలకు నుపభోగము లేకయే నాశము సంభవింపవలసి వచ్చును. కాన భావి యెట్లుచ్ఛేదపూర్వకమో యట్లే వర్తమానప్రవాహముఁగూడ నుచ్ఛేదపూర్వకమని యనుమేయించవలెను. పైగీతావచనములుగూడ నిట్టియర్థమునేఁ జెప్పుచున్నవి.

మూ. కః పునరయం మహాజనపరిగ్రహః? హేతుదర్శనశూన్యైర్గ్రహణధారణార్థానుష్ఠానాదిః. సహ్యా

త్ర న స్యాత్ ఋతే నిమిత్తమ్. న హ్యత్రాల స్యాదిర్నిమిత్తం,దుఃఖమయకర్మప్రధానత్వాత్. నాప్యన్యత్ర సిద్ధప్రామాణ్యేఽభ్యుపాయేఽనధికారేణాస్మిన్ననన్యగతికతయాఽను ప్రవేశః, పరైః పూజ్యానామప్యత్రాప్రవేశాత్. నాపి భక్ష్యపేయాద్యద్వైతరాగః,తద్విభాగవ్యవస్థాపరత్వాత్. నాపి కుతర్కాభ్యాసాహితవ్యామోహః, ఆకుమారం ప్రవృత్తేః. నాపి సంభవద్విప్రలంభపాషండసంసర్గః,పిత్రాదిక్రమేణ ప్రవర్తనాత్. నాపి యోగాభ్యాసాభిమానేనావ్యగ్రతాభిసంధిః, ప్రాథమికస్య కర్మకాండే సుతరాం వ్యగ్రత్వాత్. నాపి జీవికా, ప్రాగుక్తేన న్యాయేన దృష్టఫలాఽభావాత్. నాపి కుహకవంచనా, ప్రకృతే తదసంభవాత్.

తా. మహాజన పరిగ్రహమనఁగా నైహికములగు నిమిత్తముల నపేక్షింపక వేదమును గ్రహించుటయు దానిని ధరించుటయు తదోబ్ధ్యకర్మల ననుష్ఠించుటయు. ఇట్టి మహాజన పరిగ్రహము నిమిత్తము లేక సంభవింపదు. వేదము దుఃఖమయ కర్మప్రధాన మగుటవలన వేదపరిగ్రహములో నాలస్యాదులు నిమిత్తములు గావు. బౌద్ధాదులకుఁ బూజ్యులగువారికిఁగూడ నీ వేదపరిగ్రహమం దధికారము లేనందున—సిద్ధప్రామాణ్యము గల వేఱొకమతమందు అధికారము లేనందున అనన్యగతికుల కిందు ప్రవేశమనుటకును వలనుపడదు. వేదపరిగ్రహము "ఇది భక్ష్యము, ఇది యభక్ష్యము, ఇది పేయము, ఇది అపేయము"

అను విభాగముతోఁ గూడినదగుటవలన భక్ష్యపేయాద్యద్వైత రాగము ఇందు నిమిత్తమనుటకు వీలులేదు. ఆస్తికులందరు నిందుఁ బ్రవర్తించుటవలన కుతర్కాభ్యాసజనితవ్యామోహ మిందు నిమిత్తము కాఁజాలదు. పిత్రాది క్రమముగాఁ బ్రవ ర్తించుటవలన-నిప్పటిపాషండజనసంపర్కము కారణము కాదు. యోగాభ్యాసానర్హుఁడగు బ్రహ్మచారియే వేదచోదితకర్మలం దధికాసక్తిగలవాఁడగుటంజేసి "యోగాభ్యాసమే జేయఁదగి నది గాని చిత్తవిక్షేపహేతువగు యాగాదిక మాచరణీయము గాద"ను నవ్యగ్రతాభిమానము హేతువు గాదు. దృష్ట ఫలము లేనందున జీవికయు నిమిత్తము కాదు. కుహకవంచ నాదులు సంభవించినందున నవియును హేతువులు కావు.

మూ. సంభవన్తి చైతే హేతవో బౌద్ధాద్యాగమపరి గ్రహే. తథాహి. భూయస్తత్ర కర్మలాఘవ మిత్యలసాః. ఇతః పతితానామప్యనుప్రవేశ ఇత్యనన్యగతికాః. భక్ష్యాద్యనియమ ఇతి రాగి ణః. స్వేచ్ఛయా పరిగ్రహ ఇతి కుతర్కాభ్యా సినః. పిత్రాదిక్రమాభావాత్ప్రవృత్తిరితి పాషండ సంసర్గిణః."ఉభయోరన్తరం జ్ఞాత్వా కస్య శౌచం విధీయతే" ఇత్యాదిశ్రవణాదవ్యగ్రతాభిమా నినః. సప్తఘటికాభోజనాదిసిద్ధేర్జ్జివికేత్యయో గ్యాః. ఆదిత్యస్తంభనం పాషాణపాటనం శాఖా భంగో భూతావేశః ప్రతిమాజల్పనం ధాతు వాద ఇత్యాదిదర్శనాత్కుహకవంచితాః. తత

స్తానీ పరిగృహ్ణా_స్తీతి సంభావ్యతే. అతో న తే
మహాజనపరిగృహీతా ఇతి విభాగః.

తా. బౌద్ధాద్యాగమపరిగ్రహమునఁ బూర్వో_క్తములగు నాలస్యాదికములు నిమి_త్తము లగును. ఎట్లన కర్మలాఘవము నపేక్షించి అజ్ఞులును, వేదాద్యపరిగ్రహమువలన భ్రష్టులగు ననన్యగతికులకు నిందు ప్రవేశము కలుగుటవలన ననన్యగతికులున్ను, భక్ష్యపేయాదినియమము లేనందున రక్తులున్ను, స్వేచ్ఛాపరిగ్రహమువలన కుతర్కాభ్యాసము కలవారునున్ను, పిత్రాదినియమము లేకున్నను ప్రవృ_త్తి కలుగుటవలనఁ బాషండసంసర్గులును,

"శ్లో. అత్య_న్తమలినః కాయః దేహీ చాత్య_న్తనిర్మలః,
ఉభయోర_న్తరం జ్ఞాత్వా కస్య శౌచం విధీయతే."

అను న్యాయమున నవ్యగ్రతాభిమానులును, కర్మాచరణావసరము లేనందున శీఘ్రభోజనము నపేక్షించి యయోగ్యులును, ఆదిత్య_స్తంభనము పాషాణపాటనము శాఖాభంగము భూతావేశము ప్రతిమాజల్పనము ధాతువాదము మున్నగునవి సంభవించునని వంచకులును, బౌద్ధాద్యాగమములను పరిగ్రహించుచున్నారు. కావున బౌద్ధాద్యాగమములు మహాజనపరిగృహీతములు కానేరవు.

మూ. స్యాదేతత్, యద్యేవం సర్వకర్మణాం వృ_త్తినిరోధో (ధే) న కించిదుత్పద్యతే, న కించిద్వినశ్యతీతి _స్తిమితాకాశకల్పే జగతి కుతో విశేషాత్పునస్సర్గః? ప్రకృతిపరిణతేరితి సాంఖ్యానాం శోభతే. బ్రహ్మపరిణతేరితి భాస్కరగోత్రే

యుజ్యతే. వాసనాపరిపాకాదితి సౌగతమత మనుధావతి. కాలవిశేషాదితి చోపాధివిశేషా భావాదయుక్తం; అసతాం చోపలక్షణానాం న విశేషకత్వం, సర్వదా తుల్యరూపత్వాత్. న జ్ఞానద్వారా, అనిత్యస్య తస్య తదానీమభా వాత్, నిత్యస్య చ విషయతః స్వరూపతశ్చ అవిశేషాత్, ఇతి చేన్న.

తా. ప్రళయమునందు సర్వకర్మలకును వృత్తినిరోధము కలిగినపుడు దేనికిని ఉత్పత్తినాశములు లేనందున స్తిమితాకాశ కల్పమగు జగత్తునందు దేనివలన తిరిగి యుత్పత్తియగును? జగత్తు ప్రకృతియొక్క పరిణామమనుసాంఖ్యుల కుపపన్న మగు ను. బ్రహ్మయొక్క పరిణామమను భాస్కరమతమునను (త్రిదండి మతమున) ఉపపన్న మగును. కర్మ వాసనయొక్క పరిణామమను సౌగతమతమున నుపపన్నమగును. ఉపాధివిశేషము లేనందున కాలవిశేషమువలననే సృష్టి యగుననుటకు వీలులేదు. పూర్వ మందుండిన సూర్యపరిస్పందరూపోపాధులు ఇపుడు లేనందున వానివలన జగదుత్పత్తి సంభవించుటకు వీలులేదు. సూర్యపరి స్పందలు లేకున్నను, తజ్జ్ఞానమువలన జగదుత్పత్తి సంభవించు నని చెప్పుటకు అట్టి జ్ఞానము కూడ ననిత్యమగుటవలన వీలు పడదు ఈశ్వరజ్ఞానము నిత్యములను గోచరించుటవలన విష యమున్నూ, ఆజ్ఞానమున్నూ గూడ నిత్యమగుటవలన దానిని బట్టి సృష్టి యనుటకు వీలులేదు. కావున సృష్టి ఎట్లగునని యాశంకించరాదు.

మూ. శరీరసంక్షోభ శ్రమజనితనిద్రాణాం ప్రాణినామా
యుః పరిపాకక్రమసంపాదనైకప్రయోజనశ్వా
స సంతానానువృత్తివన్మహాభూత సంప్లవ సంక్షో
భలబ్ధసంస్కారాణాం పరమాణూనాం మంద
తరతమాదిభావేన కాలావచ్ఛేదైకప్రయో
జనస్య ప్రచయాఖ్యసంయోగపర్యన్తస్య కర్మ
సంతానస్యేశ్వరనిశ్వసితస్యానువృత్తేః, కియాన
సావిత్యత్రావిరోధాదాగమప్రసిద్ధి మనతిక్రమ్య
తావన్తమేవ కాలమిత్యనుమన్యతే, బ్రహ్మాండా
న్తరవ్యవహారో వా కాలోపాధిః. తదవచ్ఛిన్నే
కాలే పునః సర్గః.

తా. సుషుప్తికాలమున కర్మలకు యుగపద్వృత్తి నిరో ధమున్నను శ్వాసప్రశ్వాసములయొక్క యనువృత్తిబలము వలన నొకానొకసమయమున ప్రబోధ మెట్లగునో అట్లే మహా భూతసంప్లవసంక్షోభముతోఁ గూడిన పరమాణువుల కీశ్వర నిశ్వాసరూపమగు కర్మసంతానానువృత్తివలన నొకానొకసమ యమందు ప్రపంచసృష్టి యగును. అట్లు ఆగమసిద్ధి ననుసరించి యే కొంతకాలము ప్రళయమును దిరుగ సృష్టియు సంభవించు నని సిద్ధాంతము. మరియొకరీతినిఁ గూడ సృష్టి యుపపన్న మగును. బ్రహ్మాండములన్నిటికి నొక్కసారే నాశములేనందున బ్రహ్మాండాంతరరూపకాలోపాధి యున్నందున తదవచ్ఛిన్న కాలమువలననే తిరిగి సృష్టికావచ్చును.

మూ. యథా ఖల్వలాబులతాయాం వితతాని ఫలాని.
తథాపరమేశ్వరశక్తావనుస్యూతాని సహస్ర

శోఽండానీతి శ్రూయతే. ఏవం విచ్ఛేదసంభవే కస్య కేన పరిగ్రహః? యతః ప్రామాణ్యం స్యాత్. జ్ఞాపకశ్చాయమర్థో న కారకః. తతః కారకాభావాన్నివర్తమానం కార్యం జ్ఞాపకాభిమతః కథంకారమాస్థాపయేత్.

తా. ఆనపతీగయం దెట్లు అనేకఫలము లుండునో అట్లే పరమేశ్వరశక్తియందు వేలకొలఁది బ్రహ్మాండము లను స్యూతము లగుచున్నవి అట్టి ప్రళయకాలమున వేదమును మహాజనులును లేనందున మహాజనపరిగృహీత మగుటవలన వేదము ప్రమాణమనుటకు వీలులేదు. మహాజనపరిగ్రహము వేదప్రామాణ్యమునకు జ్ఞాపక మగునుగాని యుత్పాదకము గానేరదు. ఏగుణ ముత్పాదకమో, యట్టిగుణము లేనిచో జ్ఞాప్యమగు ప్రామాణ్యము లేనందున మహాజనపరిగృహీత మగు నదియేదియుండును. కావున మహాజనపరిగృహీత మగుటవలన వేదము ప్రమాణమని చెప్పుట సర్వథా యనుపపన్నము.

మూ. స్యాదేతత్. సన్తు కపిలాదయఏవ సాక్షాత్కృతధర్మాణః కర్మయోగసిద్ధాస్తఏవ సంసారాంగారేషు పచ్యమానాన్ ప్రాణినః పశ్యన్తః పరమకారుణికాః ప్రియహితోపదేశేనానుగ్రహీష్యంతి, కృతం పరమేశ్వరేణానపేక్షితకీటాదిసంఖ్యాపరిజ్ఞానవతేతి చేన్న.

తా. వేదమునకు పరతః ప్రామాణ్యమును స్వీకరించినను, కర్మయోగసిద్ధులును భావనావశమున నతీంద్రియార్థ

దర్శులునగు కపిలాదిమహర్షులు సంసారాగ్నియందు పడి, పచ్యమానమగు ప్రాణివర్గమును చూచుచు కృపచే ప్రియమును హితమునునైన వేదోపదేశమునుచేసి లోకము ననుగ్రహించిరనుటవలననే పరతః ప్రామాణ్యము వేదమునకు సిద్ధించుచుండ నందునిమిత్తమై యనపేక్షితకీటాదిసంఖ్యాపరిజ్ఞానవంతుఁడును సర్వజ్ఞుఁడునగు పరమేశ్వరు నంగీరించుట యనవసర మనరాదు.

మూ. తదన్యస్మిన్న నాశ్వాసాత్. తథాప్యతీంద్రియార్థ దర్శనోపాయో భావనేత్యభ్యుపగమేఽపి నాసౌ సత్యమేవ సాక్షాత్కారముత్పాదయతి, యతః సమాశ్వసిమః. ప్రమాణాంతరసంవాదాదితి చేన్న, అహింసాదిహితసాధనమిత్యత్ర తదభావాత్. ఆగమోఽస్తీతి చేన్న, భావనామాత్రమూలత్వేన తస్యాప్యనాశ్వాసవిషయత్వాత్. ఏకదేశసంవాదేనాపి ప్రవృత్తిరితి చేన్న, స్వప్నాఖ్యానవదన్యథాపి సంభవాత్. న చానుపలబ్ధే భావనాపి. చోరసర్పాదయో హ్యుపలబ్ధా ఏవ భీరుభిర్భావ్యంతే.

తా. కపిలాదులకుండు నతీంద్రియార్థదర్శనోపాయమగుభావన సత్యముగా సాక్షాత్కారజనక మనుటలో సమాశ్వాసము లేదు. దృష్టమగువానివిషయమై సమాశ్వాసమున్నను, అతీంద్రియార్థవిషయముల నట్టి సమాశ్వాసము లేదు. ఆగమముకూడ భావనామూలక మగుటవలన నదికూడ నాశ్వాసవిషయము గాదు. ఆగమైకదేశమునకు సంవాదమునఁ

ప్రామాణ్యమును నిశ్చయించి, వేదమగుటవలన సర్వవేదము లును బ్రమాణములు. అను ననుమానము; స్వప్నైకదేశప్రా మాణ్యమునుబట్టి "సర్వస్వప్నములును ప్రమాణముల"ను యనుమానమువంటి దగును. కాన నేకదేశప్రామాణ్యమును బురస్కరించుకొని సర్వవేదములకు ప్రామాణ్యము నిర్ణయించు టకు వీలులేదు. భావన సంస్కారరూపమగుటవలన ననుపలబ్ధ ములగువాని విషయమై సంభవించదు. ఉపలబ్ధములగు చోర సర్పాదులయందే భీరులకు భావన సంభవించును.

మూ. న చ కర్మయోగయోర్హితసాధనత్వం కుత శ్చిదుపలబ్ధమ్. న చైతయోః స్వరూపేణోప లంభః క్వచిదుపయుజ్యతే భావనాసాధ్యో వా. న చాస్మిన్నన్వయవ్యతిరేకౌ సంభవతః, దేహాన్తరభోగ్యత్వాత్ఫలస్య అప్రతీతతయా తదనుష్ఠానే తదభావాచ్చ. న చ కర్తృభోక్తృ రూపోభయదేహ ప్రతిసంధానాదేవ తదుప పద్యతే, తదభావాత్. న హ్యేతస్య పూర్వ కర్మణః ఫలమిదమనుభవామీతి కశ్చిత్ప్రతిసం ధత్తే. కేచిత్తథాభవిష్యన్తీతి సంభావనామాత్రే ప్యనాశ్వాసాత్, వినిగమనాయాం ప్రమాణా భావాత్.

తా. కర్మయొక్కయు యోగముయొక్కయు హిత సాధనత్వోపలబ్ధియే యుపయోగించును కాని కేవలస్వరూ పముయొక్క యుపలబ్ధి యుపయోగించదు. ఉపలంభము

భావనాసాధ్యమనుపక్షముఁగూడ సంభవింపదు. భావనోప లంభముల కన్వయవ్యతిరేకములు లేనందున సాధ్యసాధన భావము సంభవింపదు. ప్రవృత్తియున్నపుడు కర్మయోగముల కన్వయమున్నపుడు ఫలముయొక్క యన్వయజ్ఞానమున సాధ కత్వనిశ్చయముగలుగునని యాశంకించుటకు వీలులేదు. ఫలము దేహాంతరభోగ్య మగుటవలన ననుష్ఠిత కర్మయోగములందు ఫలసాధనత్వము. ప్రతీయమానము కానందున ఫలముయొక్క యన్వయజ్ఞానమే సంభవింపదు. మఱియు "హితసాధనత్వ నిశ్చయమువలనఁ బ్రవృత్తి, దానివలన హితసాధనత్వము" అను నన్యోన్యాశ్రయము ప్రసక్తమగును. "ఈపూర్వకర్మ యొక్క ఫలమిది దీనిని నే ననుభవించుచున్నాన"ను ప్రతి సంధానము లేనందున కర్తృభోక్తృప్రతిసంధానమువలననే "కర్మయోగములు హితసాధనములను" ఉపలబ్ధి కలుగుటకు వీలులేదు. "పూర్వజన్మమున నేను జేసినకర్మకిది ఫలము" అను ప్రతిసంధానమువలన నుపలబ్ధి కలిగినను జన్మాంతరపరి జ్ఞానము లేనందున "పూర్వమందుఁ జేసిన కర్మలయొక్క ఫల మగు దీనినిపుడు నే ననుభవించుచున్నా"నను ప్రతిసంధాన ములో నాశ్వాసము లేదు.

మూ. ప్రతిపన్నిశీథనిద్రాణప్రాతఃప్రతిబుద్ధ సమస్తోపా
ధ్యాయవ దన్యోన్యసంవాదాత్కపిలాదిషుసమా
శ్వాస ఇతి చేన్న, ఏకజన్మప్రతిసంధానవజ్జన్మాం
తరప్రతిసంధానే ప్రమాణాభావాత్.

తా. అనాధ్యాయదివసములలో నంత్యదివసముయొక్క రాత్రియందు నిద్రించి ప్రాతఃకాలమందు లేచిన యుపాధ్యా

యులయొక్క సంవాద మేతజ్జన్మకృత మగుటవలన యుపాధ్యాయులయందు సమాశ్వాస మున్నను జన్మాంతర ప్రతిసంధాన విషయములయొక్క ప్రతిసంధానములో నాశ్వాసము లేనందున నన్యోన్యసంవాదమునుబట్టి కపిలాదులయందు సమాశ్వాస ముండుటకు వీలు లేదు.

మూ. తథాపి చాధికారివిశేషేణ బ్రాహ్మణత్వాద్య ప్రతిసంధానే అనుష్ఠానరూపస్యాశ్వాసస్యాభావాత్. న హి పూర్వజన్మని మాతాపిత్రోర్బ్రాహ్మణ్యాత్తదుత్తరత్ర బ్రాహ్మణ్యమితి నియమః, యేన సర్గాదౌ వర్ణాదిధర్మవ్యవస్థా స్యాత్. ఈశ్వరవదదృష్టవిశేషోపనిబద్ధభూతవిశేషానుపలంభాత్. అతీంద్రియార్థదర్శిత్వే చానాశ్వాస స్యోక్తత్వాత్.

తా. సృష్ట్యాదిని వర్ణాదివ్యవస్థ లేనందున జన్మాంతరమందుండు మాతాపితరులయొక్క బ్రాహ్మణ్యమువలన నుత్పత్త్యాదికమును నిశ్చయించి సంప్రదాయప్రవర్తనము సర్వజ్ఞుఁడగు నీశ్వరునకువలె కపిలాదులకు సంభవింపదు. వారల యతీంద్రియార్థదర్శిత్వమున నాశ్వాసము లేదని వెనుకనే జెప్పఁబడినది గదా!

మూ. ఏతేన బ్రహ్మాండాన్తరసంచారివర్ణవ్యవస్థయా సంప్రదాయప్రవర్తన మపాస్తమ్. సంచారశక్తేరభావాత్. వర్షాన్తరసంచరణమేవ హి దుష్కరం, కుతో లోకాన్తరసంచారః? కుత స్తరాం చ బ్రహ్మాణ్డాన్తరగమనం? అణిమాదిసంపత్తే

రేవమపి స్యాదితి చేన్న, తత్రాపి ప్రమాణా భావాత్, సమ్భావనామాత్రేణ సమాశ్వాసా నుపపత్తేః. ఆద్యమహాజనపరిగ్రహాన్యథాను పపత్తిరేవాత్ర ప్రమాణమితి చేత్, ఏవంభూ తైక కల్పనయైవోపపత్తౌ భూయః కల్పనాయాం గౌరవప్రసఙ్గాత్. విదేహనిర్మాణశక్తేరణిమాది విభూతేశ్చ అవశ్యాభ్యుపగన్తవ్యత్వాత్. అస్త్వేకఏవేతి చేత్, న తర్హీశ్వరమన్తరేణా న్యత్ర సమాశ్వాస ఇతి.

తా. కపిలాదులకు వర్ణాంతరసంచారమె దుర్ఘటము. గాన లోకాంతరసంచారమును బ్రహ్మాండాంతరసంచారమును, దుర్ఘటమని వేఱఁజెప్ప నవసరము లేదు. మఱియు, వారల కణిమాదిసంపత్తి యుండుటలోఁ బ్రమాణము లేదు. గాన, బ్రహ్మాండాంతరమందుండు వర్ణవ్యవస్థచే సంప్రదాయప్రవర్తన మొనరించిరనుటఁ గూడ సంభవించదు. వారల కణిమాది సంపత్తి కలదనుటకు మహాజనపరిగ్రహానుపపత్తియే ప్రమాణ మనినచో నట్టిమహాజనుల ననేకమందిని కల్పించుటయు వారల కనేక దేహనిర్మాణసామర్థ్యమును అణిమాద్యైశ్వర్యమును కల్పించుటయు గౌరవము గావున సర్వజ్ఞుఁడగు నీశ్వరునకే యట్టిశక్తియు నణిమాద్యైశ్వర్యమును గల్పించుట యుక్తము. కాఁబట్టి ఈశ్వరోచ్చరిత మగుటవలననే వేదము ప్రమాణ మని చెప్పనగును.

శ్లో. కారంకార మలౌకికాద్భుతమయం
మాయావశాత్సంహరన్

హారంహారమపీంద్రజాలమివ యః
కుర్వన్ జగత్క్రీడతి,
తం దేవం నిరవగ్రహస్ఫురదభి
ధ్యానానుభావం భవం
విశ్వాసైకభువం శివం ప్రతి నమన్
భూయాసమంతేష్వపి. ౮

ఇతి ద్వితీయస్తబకః.

తా. ఏదేవుఁడు తత్తత్కార్యప్రయోజకమగు నదృష్ట సహకారమున దుర్నిరూప్యమును విచిత్రమునగు కార్యజాతమును, ఐంద్రజాలికుఁడు ఇంద్రజాలమునువలె అనేకసారులుఁ జేసి సంహారించునో, అట్లే అనేకమారులు సంహారించి, మఱల జేయుచు క్రీడించునో, ప్రతిబంధకములేకుండ ప్రకాశించు సంకల్పమను మహిమగల్గినట్టియు, జగత్కారణమైనట్టియు, విశ్వాసమునకు స్థానమైనట్టియు, స్వయంప్రకాశమానుఁ డగు నట్టియు నాయీశ్వరుని నేనంతకాలమందుఁ గూడ నమస్కరింపుచు నుందునుగాత.

ద్వితీయస్తబకము సమాప్తము.

పరదేవతార్పణమస్తు.

శ్రీ శివాయగురవే నమః
శ్రీ రామాయ నమః

# తృతీయ స్తబకము.

మూ. నన్వేతదపి కథం? తత్ర బాధకసంభవాత్, తథాహి:—యది స్యాదుపలభ్యేత. అయోగ్యత్వాత్ సన్నపి నోపలభ్యతే, ఇతి చేదేవం తర్హి శశశృంగమప్యయోగ్యత్వాన్నోపలభ్యతే ఇతి స్యాత్. నైతదేవం, శృంగస్య యోగ్యతయైవ వ్యాప్తత్వాదితి చేత్, చేతనస్యాపి యోగ్యోపాధిమత్తయైవ వ్యాప్తత్వాత్, తద్బాధే సోఽపి బాధిత ఏవేతి తుల్యమ్. వ్యాపకస్యార్థాద్యనుపలంభేనాప్యనుమీయతే నాస్తీతి. కో హి ప్రయోజనమన్తరేణ కించిత్కుర్యాదితి.

ఉచ్యతే.

శ్లో. యోగ్యాదృష్టిః కుతోఽయోగ్యే
ప్రతిబన్దిః కుతస్తరామ్,
క్వాయోగ్యం బాధ్యతే శృంగం
క్వానుమాన మనాశ్రయమ్. ౧

తా. నిత్యములును నిర్దుష్టములు నగు వేదములవలనను, కపిలాదిమహర్షులవలనను, ధర్మసంప్రదాయము సిద్ధింప

నపుడు, ఈశ్వరునివలనమాత్ర మెటు లాధర్మసంప్రదాయము సిద్ధించును ? అది యటుండ, నీశ్వరుఁ డొకఁడు కలఁడా ? అతఁ డుండెనేని యాతనిప్రత్యక్ష మేల కల్గకుండును ? ఇట్టి యనుపలబ్ధిచే, నీశ్వరాభావమే సిద్ధించుచున్నది గదా. కావున నీశ్వరునివలన ధర్మసంప్రదాయ మెటులు సిద్ధించు ననఁగలవు? ఈశ్వరుఁడున్నను ప్రత్యక్షసాధకములగు మహత్త్వోద్భూత రూపము లాతనికి లేకుండుటచే నతఁడు ప్రత్యక్షము కాలే దందువేని పైనిఁదెలిపిన యయోగ్యతగల శశశృంగముకూడ నుండవలసి వచ్చునుగదా ? కావున నిటుచూచినను నీశ్వరా భావము సిద్ధించుచున్నది. శృంగము యోగ్యమగుట గవాది శృంగములందు వ్యక్తమే గదా! శశమునకు శృంగమున్నచో నదియు యోగ్యమే యగును. కావున తద్దృష్టాంతముచే నీశ్వరాభావము సిద్ధింపరాదని యనరాదు. అటులందువేని దాని కిదియే తుల్యయుక్తి. చేతనుఁడుపాధివిశిష్టుఁ డగుట సర్వానుభవసిద్ధమగు విషయము గదా ! అటులే యీశ్వ రుఁడు చేతనుఁడైనను, నాతనియుపాధి ప్రత్యక్షము కాలేదు. కావున యోగ్యానుపలబ్ధిచే బాధితమగు నుపాధితోఁగూడిన యీశ్వరుఁడును బాధితుఁడే యగుచున్నాఁడు. ఇఁక జగత్క ర్తృత్వరూపమున, నీశ్వరసత్తను ప్రతిపాదింతు నందువేని యదియును జరుగనేరనిదే. ప్రయోజన మపేక్షింపక యెవ్వఁ డును గార్యమునఁ బ్రవర్తింపఁడు గదా ! నీమతమున నవాప్త సకలకాముఁడగు నీశ్వరున కట్టిప్రయోజనాపేక్ష లేకుం డుటచే, ప్రవృత్తియే యనుపపన్నము. అట్టిప్రవృత్తియే లేనపు డీశ్వరునకు జగత్కర్తృత్వ మెట్లు ? తస్మాలమున

నీశ్వరసిద్ధి యెట్లు? అని యీశ్వరాభావప్రతిపాదకు లను చున్నారు. కాని యది సరికాదు.

ఏలన అయోగ్యతగల పరమాత్మయెడ యోగ్యానుప లబ్ధి బాధక మెట్లగును? అటులైనచో, పరమాణ్వాకాశా దులుఁగూడ నయోగ్యములగుటచే నవియును లేవనవలసి వచ్చెడిని. ఇఁక శృంగ దృష్టాంతమునుబట్టి యీశ్వరుఁడు లేడంటివి గదా! శృంగ మయోగ్యమందువా? లేక యోగ్య మందువా? అయోగ్యమందువేని అయోగ్యవిషయమున, యోగ్యానుపలబ్ధి బాధకము కాదని యనుపదమే చెప్పఁబడి యెను. కావున ప్రతిబంది కానేరదు గదా! ఇఁక యోగ్య మందువేని, అయోగ్యమగు పరమాత్మయెడ నది ప్రతిబందియే కానేరదు.

మఱియు "కర్తృత్వవ్యాపకమగు శరీరాదులు లేకుం డుటచే, నీశ్వరుఁడు జగత్కర్త కాఁజాలఁడు." అను ననుమా నము సయితము నీమతమున నాశ్రయాసిద్ధ మగుచున్నది. నీయనుమానము కుదురుటకై యీశ్వరు నంగీకరింతువేని, యీశ్వరసత్త నీచే నంగీకరింపఁబడుచున్నదియ గదా!

మూ. స్వాత్మైవ తావద్యోగ్యానుపలబ్ధ్యా ప్రతిషేద్ధుం న శక్యతే, కుతస్త్వయోగ్యః పరమాత్మా. తథా హి, సుషుప్త్యవస్థాయామాత్మానమనుపలభ మానో నాస్తీత్యవధారయేత్. కస్యాపరాధేన పునర్యోగ్యోప్యాత్మా తదానీం నోపలభ్యతే? సామగ్రీవైగుణ్యాత్. జ్ఞానాదిక్షణికగుణోప ధానో హ్యాత్మా గృహ్యతే ఇత్యస్య స్వభావః.

జ్ఞానమేవ కుతో న జాయతే ఇతి చిన్త్యతే పశ్చాద్వా కథముత్పత్స్యత ఇతి చేన్మనసోఽనిన్ద్రియప్రత్యాసన్నతయాఽజననాత్తత్ప్రత్యాసత్తౌ చ పశ్చాజ్జననాత్.

తా. మఱియు, స్వాత్మ యోగ్యమైనదయ్యును సుషుప్తియందు ప్రత్యక్షము కానంతమాత్రమున యోగ్యానుపలబ్ధిచే నది లేదనఁజాలము గదా! ఇఁక నయోగ్యత గల పరమాత్మ నెట్లు లేదనఁగలము? సుషుప్తియందాత్మ ప్రత్యక్షము కాకుండుట కేమి నిమిత్తమని ప్రశ్నింతువేని వినుము. జ్ఞానాది విశేషగుణసంబంధ మున్నపుడే ప్రత్యక్షమగుట యాత్మకు స్వభావము గదా! సుషుప్తియం దట్టిసంబంధము లేకుండుటయే యాత్మప్రత్యక్షము కాకుండుటలో నిమిత్తము. ఇఁక పైనిఁ దెలిపినజ్ఞానము సుషుప్తిలో జనింపకుండుటకును, సుషుప్త్యనంతరము జనించుటకును నిమిత్తమేమని యాశంకింతువు కాబోలు. అణువగుమనస్సు సుషుప్తికాలమునఁ బురీతత్తునఁ బ్రవేశించి బాహ్యేంద్రియసంబంధము నొందకుండుటచే నపుడు జనింపదనియు, తదనంతరము తత్సంబంధము నొందుటచే జనించుననియు చెప్పుదుము.

మనోవైభవవాదినా మిదమసమ్మతమ్. తథా హి, మనో విభు, సర్వదాస్పర్శరహితద్రవ్యత్వాత్,సర్వదావిశేషగుణశూన్యద్రవ్యత్వాత్, నిత్యత్వేసత్యనారంభక ద్రవ్యత్వాత్, జ్ఞానాసమవాయికారణ సంయోగాధారత్వా, దిత్యాదేరితి చేన్న. సర్వేషామాపాతతః స్వరూపా

సిద్ధత్వాత్. తథా హి, యది రూపాద్యుపలబ్ధి
నాం క్రియాత్వేన కరణతయామనోనుమితి ర్న
తదా ద్రవ్యత్వసిద్ధిః, అద్రవ్యస్యాపి కరణ
త్వాత్.

తా. ఇఁక నెల్లపుడును,స్పర్శశూన్యము, ద్రవ్యము నగుటచే నాకాశమువలెను, నెల్లపుడు విశేషగుణశూన్యము ద్రవ్యము నగుటచే కాలమువలెను, నిత్యమై ద్రవ్యానారంభక ద్రవ్యమగుటచే నాకాశమువలెను, జ్ఞానాసమవాయి కారణ సంయోగాశ్రయ మగుటచే నాత్మవలెను, మనసు విభువగుటచే దాని కింద్రియసన్నికర్ష మొకపు డుండుననియు, నొకపుడు లేదనియు, చెప్పుట కెట్లు వలనుపడునందువేని వినుము. తొలుత మనసు సిద్ధించినపుడు గదా ! దానికి విభుత్వమును సాధించుట. అదియే సిద్ధింపనపుడు దానికి విభుత్వమును సాధించు టెట్లు ? ఒకపుడు "ఛేదనాదికమువలె రూపోపలబ్ధిఁ గూడ క్రియయై కరణముగలది" అను ననుమానముచే కరణము సిద్ధించును. అదే మనస్సు అని యందువు. అపుడు కరణము ద్రవ్యమే కావలయుననునియమము లేకుండుటచే, మనసును సాధించుటకు నీవు రచించిన యనుమానమువలన, నది ద్రవ్యత్వవిశిష్టమై సిద్ధింపమి పైహేతువులు స్వరూపాసిద్ధము లగుచున్నవి.

మూ. అథాసామేవ సాక్షాత్కారితయేంద్రియత్వేన
తదనుమాతవ్యం, తథాపి వ్యాపకస్య నిరు
పాధేర్నేంద్రియత్వమిత్యుపాధిర్వక్తవ్యః. తత్ర
యది కర్ణశష్కులీవన్నియతశరీరావయవస్యే

పాధిత్వం, తదా తావన్మాత్రే వృత్తిలాభః తద్ద్వే
షే చ వృత్తినిరోధః శ్రోత్రవత్ ప్రసజ్యేత.
తతః శరీరమాత్రముపాధిరవసేయః. తథా చ
తదవచ్ఛేదేన వృత్తిలాభే శిరసి మే వేదనా
పాదే మే సుఖమిత్యాద్యవ్యాప్యవృత్తిత్వప్రతీతి
విరోధః. అసమవాయికారణానురోధేన విభు
కార్యాణాం ప్రాదేశికత్వనియమాత్.

తా. ఒకపుడు రూపప్రత్యక్షమువలె "సుఖోపలబ్ధియు జన్యప్రత్యక్షమగుటచే, నింద్రియజన్య మగుచున్నది." అను ననుమానరచనచే నింద్రియము సిద్ధించును. ఇంద్రియము ద్రవ్యమే కావలెనను నియమముంబట్టి, మనస్సు ద్రవ్యత్వముతోఁగూడియే సిద్ధించునదగుటచే, ద్రవ్యత్వఘటితములగు పై హేతువులు స్వరూపాసిద్ధములు కానేరవు అని యన్నను నీయభీష్టము సిద్ధింపఁజాలదు. ఎట్లనః వ్యాపకమగు నాకాశము కర్ణశష్కులియను నుపాధితోఁ గూడియే యింద్రియమగుట సర్వానుభవసిద్ధ మగుటంబట్టి యటులనే మనసుగూడ నీమతమున వ్యాపకమగుటచే నుపాధితోఁ గూడియే యింద్రియ మగునని చెప్పవలయును. అట్లు చెప్పునపుడు శ్రోత్రేంద్రియము నకుఁ గర్ణశష్కులినివలెనే మనస్సునకు సయిత మొకయుపాధిని గల్పించికొనక తీరదు గదా! అపుడు కర్ణశష్కులికంటె భిన్నమగు ప్రదేశమునఁ బుట్టిన శబ్దము గ్రహింపఁబడునట్లుగా నీవు మనసున కుపాధిగా నంగీకరించినదానికంటె నితరమగు ప్రదేశమునఁ బుట్టినసుఖము ప్రత్యక్షము కాకుండుటయు

శ్రోత్రేంద్రియమున కుపహతిఁ గల్గునపుడు శబ్దము తద్దేశభవ మయినను గ్రహింపఁబడనట్లు, నీవన్న యుపాధి కుపహతి గల్గునపుడు సుఖము ప్రత్యక్షమే కాకుండుటయు సంభ వించును. కావున నీవు శరీరమంతయు నుపాధి యనవలెను. అటులందువేని శరీరమంతటను సుఖోపలబ్ధి గలుగుననక తప్పదు. శరీరావయవములలో నొకదానియందు సుఖోప లబ్ధియు, వేఱొకదానియందు దుఃఖోపలబ్ధియుఁ గల్గుట యను భవసిద్ధమే గదా! అట్టి యనుభవమున కిపుడు విరోధము వాటిల్లెడిని. అసమవాయికారణానురోధమున విభుకార్యముల వ్యాప్యవృత్తు లగుచున్నవి గదా!

మూ. శరీరతదవయవాది పరమాణుపర్యన్తోపాధి కల్ప
నాయాం, కల్పనాగౌరవప్రసంగో నియమా
నుపపత్తిశ్చేతి. తతోన్యదేవైకం సూక్ష్మముపా
ధిత్వేనాతీన్ద్రియం కల్పనీయమ్. తథా చ తస్యై
వేన్ద్రియత్వే స్వాభావికే ఽధికకల్పనాయాం
ప్రమాణాభావాద్ధర్మిగ్రాహక ప్రమాణబాధః.

తా. శరీరము, దాని యవయవములు, తదవయవములు అనురీతిగా నణుపర్యంతము గలయన్నియు నుపాధులే యని యంగీకరించినచోఁ గల్పనాగౌరవమే గాక పైనిఁ దెల్పిన యను భవమునకును విరోధముఁ దప్పదు. కావున పైఁదెల్పినవాని కంటె విలక్షణమై, యేకము, సూక్ష్మము, నతీంద్రియము నగు నొకయుపాధిని గల్పింపవలయును. అటులేని వేఱొకదానినిఁ గల్పించుటలోఁ బ్రమాణము లేకుండుటచే లాఘవానురోధ ముగా నీవన్న యుపాధియే "మనస్సు"అని చెప్పుట యుచితము.

అటులేని మనస్సిద్ధికై నీరచించిన యనుమాన మణువగుమన స్సునే సాధించున దగుటంబట్టి మనసునకు విభుత్వమును సంపాదించుటకై నీవుచేసిన యనుమానము బాధిత మగు చున్నది.

మూ. అథ జ్ఞానక్రమేణేంద్రియ సహకారితయా తద
నుమానం, తతస్సుతరాం ప్రాగుక్తదోషః.
యది చ మనసో వైభవేఽప్యదృష్టవశాత్
క్రమ ఉపపాద్యేత తదా మనసోఽసిద్ధేరాశ్ర
యాసిద్ధిరేవ వైభవహేతూనామితి.

తా. ఏకకాలమున నింద్రియములకన్నింటికిని విషయ సంయోగ మున్నను, నొకయింద్రియమువల్లనే జ్ఞానోత్పత్తి యగుటయు; నితరేంద్రియములవలన నది కాకుండుటయు సర్వానుభవసిద్ధ మగుటంబట్టి, యొకయింద్రియమునుండియే జ్ఞానోత్పత్తి యగుటకుఁ దగు నొకసహకారి నంగీకరింపవల యును. అదియే మనస్సు అని యొకపు డందువా? అపుడు తత్స హకారి విభువన్నచో నెల్లయింద్రియములతోడి సంయోగము సంభవింపవలసి వచ్చుటంబట్టి యుగపజ్ఞానోత్పత్తి వారింపదు. కావునఁ దద్వారణమునకై పైసహకారి యణువనియే చెప్ప వలసియున్నది. అపుడు నీయీయనుమానము సైతము వైభవ సాధకానుమానమునకు బాధకమే యగుచున్నది. ఇఁక మనసు విభువన్నను నదృష్టముచే జ్ఞానక్రమము కుదురునని చెప్ప నెంచినచో తత్క్రమము వేఱొకవిధముగ సిద్ధించుటం బట్టి తత్క్రమసిద్ధికైన మనస్సాధనము నిష్ఫలము గాన మనసు

సిద్ధింపనేరదు. అట్లు మనసు సిద్ధింపనపుడు పై హేతువు లాశ్ర యాసిద్ధములే యగుటచే వైభవమును దేనికి సాధింపఁగలవు?

మూ. అథ యత్రాదృష్టస్య దృష్టకారణోపహారేణోప యోగః, తత్ర తత్పూర్ణతాయాం కార్యముత్ప ద్యతఏవ. అన్యథా, అన్త్యతన్తుసంయోగే భ్యోఽపి కదాచిత్ పటో న జాయేత, జాతో ఽపి వా కదాచిన్నిర్గుణః స్యాత్, బలవతా కులా లేన దృఢదణ్డనున్నమపి చక్రం న భ్రామ్యేత. యత్ర తు దృష్టానుపహారేణాదృష్టవ్యాపార స్తత్ర తద్వైగుణ్యాత్ కార్యానుదయః, యథా పరమాణుకర్మణః. తదిహాపి యది విషయేన్ద్రియాత్మనాం సమవధానమేవ జ్ఞాన హేతుః, తదా తత్సద్భావే సదైవ కార్యం స్యాత్. న హ్యేతదతిరిక్తమప్యదృష్టస్యోప హారణీయమస్తి, న చ సదైవ జ్ఞానోదయః, తతోఽతిరిక్తమపేక్షితవ్యమ్. తచ్చ యద్యపి సర్వాణ్యేవేన్ద్రియాణి వ్యాప్నోతి, తథాపి కరణధర్మత్వేన క్రియాక్రమః సంగచ్ఛతే, అక ల్పితే తు తస్మిన్నాయం న్యాయః, ప్రతిపత్తుర కరణత్వాచ్చక్షురాదీనామనేకత్వాదితి చేత్.

తా. ఇఁకఁ గొన్నికార్యములపట్ల నదృష్టము దృష్ట కారణసామగ్రీద్వారముననను, గొన్నిఁటియెడ స్వతంత్రముగను గారణ మగుచుండును. ఎచ్చట దృష్టకారణసామగ్రీమూల

మున, నదృష్టము కార్యోత్పాదకమగునో యచటఁ దత్కారణ సామగ్రి పుష్కలముగా నున్నపుడు తప్పక కార్యము పుట్టు చుండును. అదృష్టము చేయుపని పుష్కలసామగ్రిని సంపా దించుటయే యగుటంబట్టి యట్టిచోట "నదృష్టము లేకుండు టచే కార్యము పుట్టలేద"ని చెప్పుటకు వలనుపడదు. అటులు చెప్పినచో నంత్యతంతుసంయోగాది పుష్కలకారణము లున్నను పటముః పుట్టకుండెడిని. ఒకపుడు పుట్టినను, నిర్గు ణము గావలసివచ్చెడిని. మఱియు బలశాలియగు కుమ్మ రిచే దృఢదండముచేఁ ద్రిప్పంబడియు చక్రము తిరుగక పోయెడిని. ఎచట నదృష్టము స్వతంత్రముగనే కారణ మగునో యచట నది లేనపుడు కార్యము పుట్టనే పుట్టదు. ఇట్టివిషయము సృష్ట్యాది పరమాణువులందు క్రియ జనించు టలో వ్యక్తమగుచున్నది. ఆవిధముగనే ప్రకృతమునఁ గూడ విషయములు, ఇంద్రియములు, విషయేంద్రియసం యోగము, ఆత్మ, అను వీనిసమావేశమే జ్ఞానకారణమన్నచో తత్సమావేశము నిరంతరము, నవ్యాహతమగుటచే, నెల్లపు డును జ్ఞానము జనింపవలసి వచ్చెడిని. ఇచ్చట నదృష్టముచే సంపాదింపఁదగినది వేఱొండు లేదు కాని నిరంతరమును జ్ఞానము జనించుట లేదు. కావున దీనికంటె విలక్షణ మగు నొకదాని నంగీకరింపవలెను. అదియే మనస్సు. కరణ మగునది విభువయ్యు, క్రియలను క్రమముగనే పుట్టించుట కరణధర్మమగుటచే జ్ఞానక్రమమునకు భంగము వాటిల్లదు. అయ్యది యంగీకరింపఁబడనిచో జ్ఞానక్రమమునకు భంగము వచ్చును. ఇఁక నట్టికరణత్వ మాత్మయందుఁగాని చక్షు

రాదికమందుఁగాని యారోపింపఁగూడదా! అని యందువా? ఆత్మ కర్తయగుటచేఁ గరణ మెన్నఁడును గానేరదు గదా! చక్షురాదులలో నన్యతరమునకే కల్పించుట నిర్యుక్తికమగుటచే నన్నిఁటికిని గల్పింపవలయుటంబట్టి నన్నియు నిరంతరము నుండునవి యగుటచే జ్ఞానయౌగపద్యము వారింపదు అని యందువా! వినుము.

మూ. నన్వేవమపి యుగపజ్జ్ఞానాని మాభూవన్, యుగ
పజ్జ్ఞానం తు కేన వార్యతే? భవత్యేవ సమూహా
లంబనమేకం జ్ఞానమితి చేన్న, ఏకేంద్రియ
గ్రాహ్యేష్వివ నానేంద్రియగ్రాహ్యేష్వపి
ప్రసంగాత్. తేష్వపి భవత్యేవేతి చేన్న, వ్యా
సంగకాలే జ్ఞానక్రమేణ వివాదవిషయే క్రమా
నుమానాత్. బుభుత్సావిశేషేణ వ్యాసంగే
క్రియాక్రమ ఇతి చేన్నైవం, న హ్యేష బుభు
త్సాయా మహిమా యదబుభుత్సితే విషయే
జ్ఞానసామగ్ర్యాం సత్యామపి న జ్ఞానం, మపి తు న
తత్ర సంస్కారాతిశయాధాయకః ప్రత్యయః
స్యాత్. యది త్వబుభుత్సితే విషయే సామగ్రీ
మేవ సా నిరున్ధ్యాత్, ఘటాయోన్మీలితం చక్షుః
పటం నైవ దర్శయేత్, తస్మాద్బుభుత్సాపీ
న్ద్రియాన్తరాదాకృష్య బుభుత్సితార్థగ్రాహి
ణీన్ద్రియే మనో నివేశయన్తీ యుగపజ్జ్ఞానానుత్ప
త్తావుపయుజ్యతే, న తు స్వరూపతః.

తా. ఈవిధముగ నేకకాలమున ననేకజ్ఞానముల యుత్పత్తి నివారించినను యుగపజ్జ్ఞానమును వారించు టెట్లు? ఒక్కొకయింద్రియమువలనఁ దమతమవిషయములను బెక్కిటిని గోచరించు సమూహాలంబనజ్ఞానము గలుగుచునే యున్నది గదా! యుగపజ్జ్ఞానము వారించు టెట్లనుశంక కవకాశ మెక్కడ" అని యందువా? నాయాశయ మదిగాదు. మఱి యేమన వినుము. ఏకేంద్రియగ్రాహ్యములగు ననేకపదార్థ ములను గోచరించు జ్ఞానమువలెనే, యనేకేంద్రియగ్రాహ్యము లగు పెక్కుపదార్థములను గోచరించు జ్ఞానముఁగూడఁ గలుగ వలసివచ్చునని నాయాశయము. ఇఁక శబ్దస్పర్శరూపరసగంధ ములు నియతముగా నొక్కొకయింద్రియముచే గ్రహింపఁదగిన వయ్యు పెద్దచక్కిలమును దినునపు డనేకేంద్రియజన్యమగు నొకజ్ఞానమునందే భాసించుచుండుట యనుభవసిద్ధము గదా! కావున నానేంద్రియగ్రాహ్యపదార్థములను బెక్కిఁటిని గోచ రించు జ్ఞానముఁగూడ నానేంద్రియములవలనఁ గలుగవచ్చునే" అని యందువా? చిత్తైకాగ్రత గలిగియున్నపుఁ డణువగుమన సున కన్నియింద్రియములతో సన్నికర్షము దుర్ఘట మగుటం బట్టి యొకేజ్ఞాన ముదయించుట సర్వానుభవసిద్ధమగుటచే నేత ద్దృష్టాంతమున శష్కులీభక్షణసమయమునఁ గూడ గంధాది జ్ఞానములు క్రమముగాఁ గలుగునని యూహింపవలసి యున్న దేగాని యొకేసమయమున జ్ఞానములన్నియుఁ బుట్టునని చెప్పు టకు వలనుపడదు. అయినను వానియుత్పత్తివిషయమునఁ గలుగు కాలభేదము దుర్గ్రాహమగుటచే గంధాదులన్నియు నొకేజ్ఞానమున భాసించుచున్నటులు తోఁచును.

ఇఁక జ్ఞానముగల్గుటలో బుభుత్సగూడఁ బ్రయోజక మగుచున్నది. చిత్తైకాగ్రత యున్నపు డొకవిషయమునే తెలిసికొనవలయు ననునిచ్ఛ యుండుటచే నొకవిషయమే తెలియఁబడుచున్నది గాని తదితరవిషయములు తెలియఁబడ లేదు. కావున చిత్తైకాగ్రత యున్నపుడు జ్ఞానములు క్రమముగాఁ గల్గుటలో బుభుత్సయే ప్రయోజకముగాని మనసున కన్నియింద్రియములతో సన్నికర్షము లేకపోవుట కాదనియందువా ? వినుము. జ్ఞానసామగ్రి పుష్కలముగానున్నపుడు బుభుత్స లేకున్నను, జ్ఞాన ముదయించుట సర్వానుభవసిద్ధ మగుటంబట్టి చిత్తైకాగ్రత యున్నపు డబుభుత్సితపదార్థములను గోచరించుజ్ఞానముఁ గలుగకుండుట, బుభుత్స లేమిచేఁ గాదు. మఱియేమన ? జ్ఞానసామగ్రిలోఁ గొంత కొఱంతయుండుటచే నని చెప్పవలెను. ఇఁక బుభుత్సచేయు పని యేమన ? తానున్నపుడు గలిగెడిజ్ఞానమువలన నగు సంస్కారమునకు దార్ఢ్యమును గలిగించుటయే. అబుభుత్సితపదార్థజ్ఞానసామగ్రినిఁగూర్చి బుభుత్సప్రతిబంధక మందువేని ఘటమును గాంచుటకుఁగాఁ దెఱచిన కంటికిఁ బటము గానరాక పోవలసివచ్చెడిని ? కావున బుభుత్స యణువగు మనస్సు నబుభుత్సితపదార్థములను గ్రహించు నింద్రియమునుండి మరలించి బుభుత్సితార్థగ్రాహకమగు నింద్రియముతోఁ గలుపుచు, యుగపద్జ్ఞానానుత్పత్తిలోఁ బరంపరగాఁ బ్రయోజకమగును గాని సాక్షాత్తుగాఁ గానేరదు.

మూ. విభునోపి మనసో వ్యాపారక్రమాత్ క్రమ
ఇతి చేన్న, తస్య సంయోగాతిరిక్తస్య కర్మ

రూపత్వే వైభవవిరోధాత్. గుణరూపత్వే నిత్యస్య క్రమానుపపత్తేః. అనిత్యస్య చ నిత్యైక గుణస్యావిభుద్రవ్యసంయోగాసమవాయికారణకత్వేన తదన్తరేణాఽనుపపత్తేః. తదపి కల్పయిష్యతే ఇతి చేత్, తదేవ తర్హి మనస్థానే నివేశ్యతాం లాఘవాయ. తస్మాదణ్వేవమన ఇతి.

తా. ఇఁక మనసు విభువయ్యు, దానికిఁ గలవ్యాపారములు క్రమయుక్తము లగుటచే, జ్ఞానక్రమ ముపపన్నమగు నందువా ? ఎటులు? ఆవ్యాపారము క్రియయా ? లేక గుణమా? క్రియయందువేని క్రియ యెల్లపుడును మూర్తమునే యాశ్రయించును గాని విభువు నాశ్రయింపదు గావున మనోవైభవమునకు విరోధము వాటిల్లక తప్పదు. ఇఁక గుణమందువా ? ఆగుణము నిత్యమా లేక యనిత్యమా ? నిత్యమన్నచో, నిత్యములకుఁ గ్రమ మెపుడును, నుపపన్నము గాదుగదా ! అనిత్యమన్నచో, నిత్యములనే యాశ్రయించు ననిత్యగుణము, మూర్తద్రవ్యసంయోగ మున్నపుడే జనించునదగుటచే, నదిలేక జనింపదు గదా ! అందులకై యట్టి మూర్తద్రవ్యమునుఁగూడ నొకదాని నంగీకరింతునందువా ? లాఘవానురోధమున దానికే మనస్థ్సాన మేల యొసంగఁగూడదు. కావున మనసణువనుటయే యుక్తము.

మూ. తథా చ, తస్మిన్ననిన్ద్రియప్రత్యాసన్నే నిరుపధానత్వాదాత్మనః సుషుప్త్యవస్థాయామనుపలంభః. ఏతదేవ మనసః శీలమితి కుతో నిర్ణీత

మితి చేదన్వయవ్యతిరేకాభ్యామ్. న కేవలం తస్య, కిన్తు సర్వేషామేవేన్ద్రియాణాం. న హి విశేషగుణమనపేక్ష్య చక్షురాద్యపి ద్రవ్యే ప్రవర్తతే. స్వాపావస్థాయాం కథం జ్ఞానమితి చేత్, తత్తత్సంస్కారోద్బోధే విషయస్మరణేన స్వప్నవిభ్రమాణాముత్పత్తేః. ఉద్బోధ ఏవ కథమితి చేత్. మందతరతమాదిన్యాయేన బాహ్యానామేవ శబ్దాదీనాముపలంభాత్, అన్తతశ్శరీరస్యైవోష్మాదేః ప్రతిపత్తేః. యదా చ మనస్త్వచమపిపరిహృత్య పురీతతి వర్తతే తదా సుషుప్తిః.

తా. కాఁబట్టి యణువగుమనసునకు సుషుప్తియందు బాహ్యేంద్రియసంయోగము లేకుండుటచే జ్ఞానము కలుగదు. జ్ఞానముతో సంబంధమున్నపుడే యాత్మ ప్రత్యక్షమగుట సర్వానుభవసిద్ధ మగుటంబట్టి, సుషుప్తియం దట్టిజ్ఞానసంబంధము లేకుండుటచే నాత్మ ప్రత్యక్షము గాదు. విశేషగుణసంబంధముగల యాత్మనే గ్రహించుట మనశ్శీలమగుట యన్వయవ్యతిరేకములచేతనే సిద్ధమగుచున్నది గదా! అట్టిశీల మొక్కమనస్సునకే గాదు. అన్నియింద్రియములకును గలదు. చక్షురాదికముఁగూడ రూపాదివిశేషగుణముగల ద్రవ్యమునే గదా గ్రహించుచున్నది! ఇఁక స్వప్నమునఁగూడ మనసునకు బాహ్యేంద్రియసంయోగము కలుగమి నపుడును, జ్ఞానము గలుగకపోవలసివచ్చునే. అపుడు జ్ఞానము పుట్టుట యనుభవసిద్ధము గదా! అది యెటులు? అని

యందువా ? వినుము. మందతరమందతమాది శబ్దజ్ఞానము వలనఁగాని, శరీరగతమగు సూక్ష్మజ్ఞానమువలనఁ గాని లేక యదృష్టమువలనఁగాని పూర్వానుభవజనితసంస్కారముల కుద్బోధము కలుగును. దానివలన విషయస్మృతికలిగి తన్మూల మున స్వప్నవిభ్రాంతులు గలుగుచుండును. స్వప్నమున మన సున కొక్కత్వక్కుతోఁ దక్కఁ దక్కినయింద్రియములతో సంబంధముండదు. మనసు త్వక్కుతోఁగూడ సంబంధమును గోల్పోయి పురీతత్తునఁ బ్రవేశించునపుడే సుషుప్తి గలుగు చుండును.

మూ. స్యాదేతత్. పరాత్మా తు కథం పరస్యాయోగ్యః? న హి సాక్షాత్కారిజ్ఞానవిషయతామేవాయం న ప్రాప్నోతి, స్వయమప్యదర్శనప్రసంగాత్. నాపి గ్రహీతురేవాయమపరాధః, తస్యాపి హి జ్ఞానసమవాయికారణతయైవతద్యోగ్యతా. నాపి కరణస్య, సాధారణత్వాత్. న హ్యసంసార మేకమేవ మనః ఏకమేవాత్మానంగృహ్ణాతీత్యత్ర నియామకమస్తి. స్వభావ ఇతిచేత్, తర్హి ముక్తౌ నిస్స్వభావత్వప్రసఙ్గః, తదేకార్థతాయా అపాయాదితి.న; భోజకాదృష్టోపగ్రహస్య నియామకత్వాత్.యద్ధి మనో యచ్ఛరీరం యానీన్ద్రియాణి యస్యాదృష్టేనాకృష్టాని, తాని తస్యైవేతి నియమః. తదుక్తం ప్రాక్, "ప్రత్యాత్మ నియమాద్భుక్తే"రితి. ఏతేన పరబుద్ధ్యాదయో వ్యాఖ్యాతాః.

తా. చైత్రీయాత్మ మైత్రునిచే నెట్లు గ్రహింపఁబడదో చెప్పుము? చైత్రునియాత్మయందు ప్రత్యక్షయోగ్యతయే లేదు గాన మైత్రునిచే గ్రహింపఁబడలేదని చెప్పుటకు వలను పడదు. ఆత్మయగుటవలన, మైత్రీయాత్మఁగూడ గ్రహింపఁబడక పోవలసివచ్చును. గ్రహీతయగు మైత్రునియొక్కయపరాధమువలననే చైత్రునియాత్మ గ్రహింపఁబడలేదనిజెప్పుటకు వీలులేదు. జ్ఞానసమవాయికారణ మగుటవలన స్వాత్మకు ఎట్లు స్వప్రత్యక్ష జననయోగ్యతయుండెనో అట్లే పరాత్మకుఁగూడ ప్రత్యక్షజననయోగ్యత యుండును గాన స్వాత్మాపరాధము గాదు. సర్వసాధారణ మగుటవలన కరణముయొక్కయపరాధ మనుటకును వీలులేదు. ప్రమాణములేనందున, సంసార మున్నంతవఱకు, ఒకమనసు, ఒకేయాత్మను గ్రహించు ననుటకు వీలులేదు. ఒకమనస్సు ఒకేయాత్మను గ్రహించుస్వభావము గలదనినచో జీవన్ముక్తావస్థయందు నిస్స్వభావత్వము రావలసివచ్చెడిని. గావున స్వభావమనుటకు వీలుకాదు. సామగ్రి యుండుటంజేసి, పరాత్మ పరునకేల ప్రత్యక్షము గాదని యాశంకింపరాదు. ఆత్మగ్రహమున భోజకాదృష్టమే నియామకము. ఏమనస్సు, ఏశరీరము, ఏయింద్రియముల ఎవనియదృష్టముతోఁ గలసియుండునో, నయ్యవి, ఆయాత్మనే గ్రహించుననునియమము గాన, చైత్రునిమనస్సు శరీరము ఇంద్రియములు, మైత్రుని యదృష్టాకృష్టములు గానందున, మైత్రునిచే చైత్రీయాత్మ గ్రహింపఁబడదు. ఈకారణముననే, పరాత్మ బుద్ధ్యాదులుగూడ పరునిచే గ్రహింపఁబడవని తెలిసి

కొనుడు. ఈవిషయము ప్రథమస్తబకమున "ప్రత్యాత్మ నియమాద్భుక్తేః" యను శ్లోకముచే వివరింపఁబడినది.

ఈరీతిగా "యోగ్యాదృష్టిః కుతోఽయోగ్యే" అను శ్లోకమునకు వ్యాఖ్యానముఁజేసి, ఉపసంహారమును జేయుచున్నాఁడు.

మూ॰ తదేవం యోగ్యానుపలబ్ధిః పరాత్మాదౌ నాస్తి తదితరా తు న బాధికేతి తవాపి సమ్మతం. అతః కిమధికృత్య ప్రతిబన్దిః. న హి, శశశృంగమయోగ్యానుపలబ్ధ్యా కశ్చిన్నిషేధతి. న చ ప్రకృతే యోగ్యానుపలబ్ధిం కశ్చిన్మన్యతే.

తా. ఈరీతిగా ఈశ్వరునివిషయమైన యోగ్యానుపలబ్ధి లేనందున, ఈశ్వరబాధ చెప్పుటకు వీలులేదు. కేవలానుపలబ్ధి బాధకము గానేరదనుట నీకును సమ్మతమే. అయోగ్యానుపలబ్ధిచే శశశృంగమును ఎవఁడును బాధించలేఁడు. గాన ప్రతిబన్ది దేనినిఁబట్టి యుండును? పరమాత్మయగు నీశ్వరునివిషయమైన యోగ్యానుపలబ్ధిని బాధకముగా నెవ్వరును తలంచరు ఇట్లుండఁగా:—

మూ. అథాయమాశయః:— అయోగ్యశశశృంగాదావనుపలబ్ధిర్న బాధికా స్యాదితి. తతః కిం? తత్సిద్ధ్యేదితి చేత్, ఏవమస్తు యది ప్రమాణమస్తి. పశుత్వాదికమితి చేత్, పరసాధనే ప్రతిబన్దిస్తర్హి న తద్బాధనే. తత్రైవ భవిష్యతీతి చేత్.

తా. అనుపలబ్ధి అయోగ్యమైన శశశృంగములో బాధకము గానేరదు గాన శశశృంగము సిద్ధించుననియా నీ

యాశయము. బాధకము లేనంతమాత్రమున వస్తువు సిద్ధించునా? అట్లైనచో నయోగ్యానుపలబ్ధినిఁ జూపిన నీమతమునఁ గూడ ఈశ్వరునివిషయములో బాధకము లేదని చెప్పఁబడినది గాని సాధకము చెప్పఁబడలేదు గదా! నీమతమున క్షిత్యాదికమందు, కార్యత్వముచే సకర్తృకత్వమును సాధించినచో, మా మతమునఁగూడ పశుత్వాదికముచే, శశమందుఁగూడ శృంగము సిద్ధించునందువు కాఁబోలును. అట్లగుచో ప్రథమమున నీశ్వరానుపలబ్ధివలన ఈశ్వరునివిషయములో బాధ నుపన్యసించి, అయోగ్యమగు నీశ్వరునివిషయమైన యోగ్యానుపలబ్ధి బాధకము గానేరదని మేమనశృంగవిషయమునఁగూడ నట్లే యగును; శృంగవిషయమైన బాధకమగుచో నీశ్వరునివిషయమునఁగూడ బాధక మగుచున్నదని, ఈశ్వరబాధనవిషయమున ప్రతిబందినిఁ జూపుట కుపక్రమించితివి. ప్రకృతమున, పరసాధనవిషయమున ప్రతిబంద్యుద్భావనఁ జేయుచుంటివి. ఇట్టి యాశయమును వికల్పించి దూషించుచున్నాఁడు:—

మూ. తత్కిం తత్ర ప్రతిబన్దిరేవ దూషణం; అథ కథం చిత్తుల్యన్యాయతయా యోగ్యా ఏవ పరాత్మ బుద్ధ్యాదయస్తే చ బాధితా ఏవేత్యపహ్నుత విషయత్వం? న ప్రథమః, అవ్యాప్తేః. న హి పశుత్వాదేశ్శశశృంగసాధకత్వేన కార్యత్వాదేః కర్తృమత్త్వాదిసాధకత్వం వ్యాప్తం, యేన తస్మిన్నసతి తత్ప్రతిషిద్ధ్యేత. న ద్వితీయః, మిథోఽనుపలభ్యమానత్వస్య వాదిప్రతివాదిస్వీకారాత్. తథాపి పశుత్వాదౌ కో దోష ఇతి

చేన్న. జానీమస్తావ త్తద్విచారావసరే చింత యిష్యామః.

తా. "కార్యత్వము సకర్తృకత్వసాధకమైనచో పశు త్వము శృంగమును సాధించనీ" యనెడు ప్రతిబందియే దూష ణమా? లేక యోగ్యానుపలబ్ధివలనఁ బశుత్వమువలె కార్య త్వముఁగూడ బాధితవిషయముఁ గలదనియా? మొదటిది ప్రతిబందిదూషణము గానేరదు. ఏలన, కార్యత్వమందుండు కర్తృత్వసాధకత్వము పశుత్వమందుండు శృంగసాధకత్వముచే వ్యాప్తముగాదు. పశుత్వమందున్న శృంగసాధకత్వము లేనపు డు కార్యత్వమందుండు కర్తృత్వసాధకత్వము లేనిచో "వ్యాపక స్యాభావా ద్వ్యాప్యాభావః"అను న్యాయమునుబట్టి కార్యత్వ మందుండు కర్తృసాధకత్వమందు పశుత్వమందుండు శృంగ సాధకత్వవ్యాప్తి యుండును. అట్లులేనందున కర్తృసాధకత్వ శృంగసాధకత్వములకు వ్యాప్యవ్యాపకభావము లేదుగాన పూర్వమునఁజెప్పిన ప్రతిబందియే యసంగతము.

రెండవపక్షముఁగూడ సరికాదు. ఏలన, యోగ్యానుప లబ్ధిచే పరాత్మబాధ నంగీకరించినచో పరస్పరము వాదిప్రతి వాదు లనుపలభ్యమానులు గావున, వాదిప్రతివాద్యంగీకా రమే లేకపోవలసి వచ్చెడిని. కాఁబట్టి రెండవపక్షముఁగూడ సరిగాదు.

పరసాధనములో దూషణము లేకపోవచ్చును గాని శృంగసాధకముగా పశుత్వము నంగీకరించుటలో ఏయనుప పత్తి యుండును? శృంగసాధకముగా పశుత్వహేతువును ప్రయోగించినపుడుఁ గూడ ఈశ్వరసాధకానుమానములో

నీవు జెప్పెడిదోషమే యుండును. అనవసర మగుటవలన ప్రస్తుతముఁజెప్ప నవసరము లేదు.

మూ. స్యాదేతత్. యత్ప్రమాణగమ్యం హి యత్, తదభావఏవ తస్యాభావమావేదయతి. యథా రూపాదిప్రతిపత్తేరభావ శ్చక్షురాదే రభావమ్. కాయవాగ్వ్యాపారైకప్రమాణకశ్చ పరాఽత్మా, తదభావఏవ తస్యాభావే ప్రమాణమఙ్కురాదిషు. తన్న. తదేకప్రమాణకత్వాసిద్ధేః. అన్యథా, సుషుప్తోఽపి న స్యాత్. శ్వాససన్తానోఽపి తత్ర ప్రమాణమితి చేన్న.నిరుద్ధపవనోఽపి న స్యాత్. కాయసంస్థానవిశేషోఽపి తత్ర ప్రమాణమితి చేన్న,విషమూర్ఛితోఽపి న స్యాత్.శరీరోష్మాపి తత్ర ప్రమాణమితి చేన్న,జలావసిక్తవిషమూర్ఛితోఽపి న స్యాత్.

తా. ఏది, ఏప్రమాణముచే తెలియఁబడునో ఆప్రమాణాభావమువలన నా వస్తువుయొక్క అభావము సిద్ధించును. రూపాద్యుపలబ్ధి రూపప్రమాణముచే చక్షుస్సు తెలియఁబడును. గావున ఉపలబ్ధి రూపప్రమాణముయొక్క యభావము వలన చక్షురాదులయొక్క యభావము సిద్ధించును.అట్లే కాయవాగ్వ్యాపారైకగమ్యము పరమాత్మ. పరమాత్మయొక్క కాయవాగ్వ్యాపార ముపలబ్ధము కాకుండుటచే; కాయవాగ్వ్యాపారాభావమువలన పరమాత్మయొక్క యభావము సిద్ధించునని చెప్పుటకు వలనుపడదు. కాయవాగ్వ్యవహారైక

ప్రమాణకత్వమే అసిద్ధము. ఇట్టి ప్రమాణగమ్యత్వమునే, అంగీకరించినచో సుషుప్త్యవస్థయం దిట్టిప్రమాణము లేనం దున సుషుప్తుఁడు లేకపోవలసి వచ్చెడిని. శ్వాసప్రశ్వాసాది రూపప్రమాణమున్నందున సుషుప్తుఁడుండునని నిశ్చయించి నచో శ్వాసప్రశ్వాసాదులు లేని నిరుద్ధపవనుఁడు (ప్రాణాయా మమును బట్టినవాఁడు) లేకపోవలసి వచ్చును. అవయవ సం స్థానవిశేషముఁగూడ ప్రమాణమనినచో విషమూర్ఛితుఁడు గూడ లేకపోవలసి వచ్చును. శరీరమందలి ఊష్మ (వెచ్చఁ దనముఁ)గూడ ప్రమాణమనినచో, నీటితో తడపఁబడిన విష మూర్ఛితుఁడుగూడ లేకపోవలసి వచ్చును.

మూ. తస్మాత్ యద్యత్కార్యముపలభ్యతే తత్తదను గుణశ్చేతనస్తత్రతత్ర సిధ్యతి. న చ కార్యమా త్రస్య క్వచిద్వ్యావృత్తిరితి. న చ త్వదభ్యుపగ తేనైవ ప్రమాణేన భవితవ్యం నాన్యేనేతి నియ మోఽస్తి.న చ ప్రమేయస్య ప్రమాణేనవ్యాప్తిః. సా హి కార్త్స్న్యేన వా స్యాత్ ఏకదేశేన వా స్యాత్ ? న ప్రథమః, ప్రత్యక్షాద్యన్యతమా సద్భావేఽపి తత్ప్రమేయావస్థితేః. న ద్వితీయః, పురుషనియమేన సర్వప్రమాణవ్యావృత్తావపి ప్రమేయావస్థితేః.అనియమేనాసిద్ధేః.న హి సర్వ స్య సర్వదా సర్వథాత్ర ప్రమాణం నాస్తీతి నిశ్చయః శక్య ఇతి. కథం తర్హి చతురాదేర భావో నిశ్చేయః? వ్యాపకానుపలబ్ధేః. చరమ

సామగ్రీనివేశినో హి కార్యమేవ వ్యాపకం, తన్నివృత్తౌ తథాభూతస్యాపి నివృత్తిః. యోగ్యతామాత్రస్య కదాచిత్ కార్యం, తన్నివృత్తౌ తథాభూతస్యాపి నివృత్తిః. అన్యథా, తత్రాపి సన్దేహః. ప్రకృతేఽపి వ్యాపకానుపలబ్ధ్యా తత్ప్రతిషేధోఽస్తు. న. ఆశ్రయాసిద్ధత్వాత్. న. హీశ్వరస్తజ్జ్ఞానం వా క్వచిత్సిద్ధమ్. ఆభాసప్రతిపన్నమితి చేన్న, తస్యాశ్రయత్వానుపపత్తేః. ప్రతిషేధ్యత్వానుపపత్తేశ్చ.

తా. కావున నేయేకార్య మెక్కడెక్కడ పుట్టునో అచ్చట దత్తత్కార్యానుగుణ మగుచేతనుఁడు సిద్ధించుచున్నాఁడు. కార్యసామాన్యమునకు వ్యావృత్తిఁ జూడఁబడనందున దత్కారణమైన చేతనునియొక్క నివృత్తి నూహించుటకు వీలులేదు. నీచే నంగీకృతమైనప్రమాణమే కార్యసాధకముగాని వేఱొకటి గాదనుటలో ప్రమాణము లేదు. గావున దత్తత్కార్యానుగుణమగు చేతనుఁడు సిద్ధించును మఱియు ప్రమాణప్రమేయములకు వ్యాప్తియే సంభవించదు. ప్రత్యక్షాదిప్రమాణములలో నేది లేకపోయినను, ప్రమేయమున్నందున ప్రమాణసామాన్యముచే ప్రమేయము సిద్ధించుననుపక్షము సరిపడదు. పురుషవిశేషనియమముచే నన్ని ప్రమాణములయొక్క వ్యావృత్తి ఉండినను, ప్రమేయ మున్నందున కొన్ని ప్రమాణములకు ప్రమేయమునకు వ్యాప్తి

అనిగూడ చెప్పుటకు వలనుపడదు. అనఁగ నొకపురుషుని యందితరపురుషసంబంధ మగు ప్రమాణములు లేవు. ఇతరుల యందు ఈపురుషునికి సంబంధించిన ప్రమాణములు లేకపోయి నను ప్రమేయ మున్నందున సర్వపురుషాపేక్షయాయే ప్రమే యమును సిద్ధించకపోవలసివచ్చును. సర్వకాలములందు నన్ని విధములచేతను అన్నిఁటియొక్కయు ప్రమాణము లేదని నిశ్చయించుటకు వీలులేదు. ప్రమాణ ప్రమేయములకు వ్యాప్తిలేనిచో చక్షురాదులయొక్క యభావము ఎట్లు సిద్ధించునన్నచో వ్యాపకానుపలబ్ధివలన అని చెప్పెదము.ఆయా వ్యాపకములయొక్క నివృత్తివలననే తత్తద్వ్యాప్యములు నివర్తించును. చరమసామగ్రీనివిష్టమగు రూపాదిజ్ఞానరూప కార్యమే వ్యాపకము. ఇట్టి రూపాదిప్రత్యక్షముయొక్క నివృత్తినిఁబట్టియే చక్షురాదులయొక్క యభావము సిద్ధిం చును. ఒకానొకసమయమున యోగ్యతామాత్రమునుగూర్చి కార్యము వ్యాపకముఁగాన కార్యనివృత్తినిఁబట్టి యోగ్యతా నివృత్తి యగును. ఒకానొకప్పుడు కార్యవ్యతిరేకమున్నను యోగ్యతాసందేహము గల్గును. "ఈశ్వరోనకర్తా తద్వ్యా పక శరీరాదిశూన్యత్వాత్, ఆకాశవత్" అను నను మానముచే నీశ్వరునియందు జగత్కర్తృత్వాభావము సిద్ధిం చునే యని యాశంకింపవలదు. ఈశ్వరుఁడుగాని, తజ్జ్ఞానము గాని సిద్ధింపనపుడు పక్షమే లేనందున పూర్వానుమానము సంభవించదు. భ్రాంతివిషయమైన ఈశ్వరునియందు, పూర్వాను మానముచే కర్తృత్వనిషేధమును సాధించెదమని చెప్పుటకు

వీలు లేదు. ఆభాసప్రతిపన్నమన్నగా అలీకము. గాన దానికి ఆశ్రయత్వముగాని ప్రతియోగిత్వముగాని సంభవింపదు.

శ్లో. వ్యావర్త్యాభావవత్త్వైవ భావికీ హి విశేష్యతా,
అభావవిరహాత్మత్వం వస్తునః ప్రతియోగితా. ౨.

మూ. న చైతదాభాసప్రతిపన్నస్యాస్తీతి కుతస్తస్య నిషేధాధికరణత్వం నిషేధ్యతా వేతి.కథం తర్హి శశశృంగస్య నిషేధః? న కథంచిత్. స హ్యభావప్రత్యయఏవ. న చాయమపారమార్థికప్రతియోగికః పరమార్థాభావో నామ. న చాపారమార్థికవిషయం ప్రమాణం నామేతి.

తా. వ్యావర్త్య మనఁగా ప్రతిషేధ్యము. దానియొక్క అభావాధికరణత్వమే పారమార్థికమైన విశేష్యత గావున నలీకమున కభావాధికరణత్వరూపమగు విశేష్యత్వము సంభవింపదు. క్షిత్యాదికమందు జగత్కర్తయగు నీశ్వరుని యొక్క యభావమును గూడ సాధించుటకు వీలు లేదు. వస్తువు అనఁగా ప్రమాణవిషయము. దానికే అభావవిరహాత్మత్వరూపప్రతియోగిత్వము. అలీకమైనదానికి ప్రతియోగిత్వము గూడ సంభవింపదు. అని శ్లోకాభిప్రాయము.

అట్లగునెడల శశశృంగముయొక్క నిషేధ మెట్లు సంభవించునని యాశంకింపరాదు. ఇచ్చట గల్పితమైన శశశృంగముయొక్క నిషేధము గాదు. మఱేమన;శశమందు శృంగముయొక్క నిషేధము. "శశమందు శృంగము లేదు". అను

ప్రత్యయము పారమార్థికాభావ ప్రత్యయము. ఈప్రతీతి విషయమైన యభావము పారమార్థిక ప్రతియోగికమైన పరమార్థాభావము గాదు. అపారమార్థికము, అనఁగా అలీకము. దీనివిషయమున ప్రమాణము లేదు.

అపి చ;

శ్లో. దృష్టోపలమ్భసామగ్రీ శశశృంగాది యోగ్యతా,
న తస్యాం నోపలమ్భోఽస్తి నాస్తి సాఽనుపలమ్భనే. 3

మూ. కేన చ శశశృంగం ప్రతిషిధ్యతే? సర్వథాఽనుపలబ్ధస్య యోగ్యత్వాసిద్ధేః.తదితరసామగ్రీ సాకల్యం హి తత్. ననూక్తమాభాసోపలబ్ధం హి తత్. అతఏవాశక్యనిషేధమిత్యుక్తమ్. అనుపలమ్భకాలే ఆభాసోపలమ్భసామగ్ర్యా అభావాత్, తత్కాలే. చానుపలమ్భాభావాదితి. కస్తర్హి శశశృంగం నాస్తీత్యస్యార్థః? శశే అధికరణే విషాణాభావోఽస్తీతి.

తా. మఱియు ననుపలబ్ధిమాత్రమున నభావనిర్ణయము గలుగునన్నచో నతీంద్రియములైన గగనపరమాణ్వాదులకుఁ గూడ నుచ్ఛేదము వాటిల్లును. కాఁబట్టి యోగ్యానుపలబ్ధియే యభావ నిర్ణాయకమని చెప్పవలెను. ప్రత్యక్షసామగ్రి రెండు విధములుగా నున్నది. ప్రమాస్థలమందు విషయముతో కలసిన చక్షురాది కారణకలాపము; అప్రమాస్థలమందు విషయరహితమైన దోషసహిత కారణకలాపము. ఈరెండింటిలో నేదోయొ

కటియున్నచో ప్రత్యక్షము కల్గును. శశశృంగము అసద్రూప మగుటవలన తత్ప్రత్యక్షము దోషయుక్తమగు సామగ్రివలనఁ గల్గును. ఇట్టి యోగ్యతయున్నచో శశశృంగ ప్రత్యక్షముం డును, గాన ననుపలబ్ధియే సంభవింపదు. యోగ్యతలేనిచో యోగ్యతావిశిష్టానుపలబ్ధి సంభవింపదు. గావున అసద్రూప మగు శశశృంగనిషేధము చేయుటకు వీలులేదు. ఈవిషయ మును, దృష్టోపలమ్భేత్యాదిశ్లోకము చెప్పుచున్నది. యోగ్యత యనఁగ ప్రతియోగికంటెను, దానికి వ్యాప్యమగు చక్షు స్సన్నికర్షముకంటెను, వేఱైన లౌకికప్రత్యక్షసామగ్రి దోష యుక్తమైన శశశృంగోపలమ్భసామగ్రీరూపయోగ్యత యు న్నచో శశశృంగోపలమ్భము లేదన్నమాట లేదు. శశ శృంగోపలమ్భమే యున్నందున ననుపలబ్ధి లేదు గాన శశ శృంగాభావబుద్ధి గలుగదు. ఉపలమ్భము లేనిచో యోగ్యత లేదు గావున, యోగ్యతావిశిష్టానుపలబ్ధి లేదు గావున నప్పుడుగూడ నభావోపలబ్ధి గలుగదని శ్లోకార్థము.

ఎల్లపుడు ప్రత్యక్షవిషయము గానిదానికి పూర్వోక్త మగుయోగ్యత సంభవించదు. శశశృంగ మాభాసోప లబ్ధము. శశశృంగాభాససమయమున, అనుపలబ్ధి సంభవింపదు. అనుపలమ్భకాలమున యోగ్యత ఉండదు. యోగ్యతా విశిష్టమైన యనుపలబ్ధియే అభావప్రత్యక్షమును గూర్చి కారణము గాన, ఉపలమ్భకాలమునఁగాని, అనుపలమ్భ కాలమునఁగాని, విశిష్టానుపలబ్ధి లేనందున, శశశృంగాభావ ప్రత్యక్షము కలుగదు. అటులేని "శశశృంగం నాస్తి" అను

దాని కర్థ మేమందువా ! శశరూపాధికరణమందు శృంగా భావ మున్నదని యర్థము.

మూ స్యాదేతత్. యద్యపీశ్వరో నావగతో యద్యపి చ నాభాససిద్ధేన ప్రమాణవ్యవహారః శక్య సమ్పాదనః, తథాప్యాత్మానస్సిద్ధాః తేషాం సార్వ జ్ఞ్యం నిషిధ్యతే, క్షిత్యాదికర్తృత్వం చేతి. తథాహి, మదితరే న సర్వజ్ఞాః చేతనత్వాదహ మివ, న చ తే క్షిత్యాదికర్తారః పురుషత్వా దహమివ. ఏవం వస్తుత్వాదేరపీతి. తదేతదపి ప్రాగేవ పరిహృతమ్. తథాహి:—

శ్లో. ఇష్టసిద్ధిః ప్రసిద్ధేఽంశే హేత్వసిద్ధిరగోచరే,
నాన్యా సామాన్యతస్సిద్ధిర్జాతావపి తథైవ సా. ౪

మూ. ప్రమాణప్రతీతానాం చేతనానాం పక్షీకరణే సిద్ధసాధనమ్. తతోఽన్యేషామసిద్ధౌ హేతో రాశ్రయాసిద్ధత్వమ్. ఆత్మత్వమాత్రేణ సోఽపి సిద్ధ ఇతి చేత్, కోస్యార్థః? కిమాత్మత్వేనోప లక్షితా సైవ వస్తుగత్యా సర్వజ్ఞవిశ్వకర్తృ వ్యక్తిః, అథ తదన్యా. ఆత్మత్వమేవ వా పక్షః? సర్వత్ర పూర్వదోషానతివృత్తేః. అథాయమా శయః—ఆత్మత్వం న సర్వజ్ఞసర్వకర్తృవ్యక్తి సమవేతం, జాతిత్వాత్, గోత్వవత్ ఇతి. తద

సత్. నిషేధ్యాసిద్ధేర్నిషేధస్యా శక్యత్వాత్.
తథా చాప్రసిద్ధవిశేషణః పక్ష ఇత్యాశ్రయా
సిద్ధిరితి స ఏవ దోషః.

తా ఈశ్వరుఁడు ప్రమాణసిద్ధము గానందునను, ఆ భాసప్రతిపన్నమైనదానివలన ప్రమాణవ్యవహారము లేనందునను, "ఈశ్వరః జగత్కర్తృత్వాభావవాన్ కర్తృత్వవ్యాపక శరీరాద్యభావాత్" అను పూర్వోక్తానుమానము సంభవింపక పోయినను, ఆత్మ సర్వమతసిద్ధ మగుటఁజేసి, అట్టియాత్మను పక్షముఁజేసి, దానియందు జగత్కర్తృత్వాభావ సర్వజ్ఞత్వాభావములు సాధించెదము. అని యాశంకించుటకు వలనుపడదు. ప్రమాణసిద్ధమగు చేతనులను పక్షముఁజేసినచో వారియందు సర్వజ్ఞత్వాభావమును, జగత్కర్తృత్వాభావమును, సిద్ధ మగుటవలన సిద్ధసాధన మనెడుదోషము వాటిల్లును. అజ్ఞాతమైన ఆత్మను పక్షముఁజేసిన, అజ్ఞాతమలీక మగుటంజేసి, ఆశ్రయమే సిద్ధింపనందున పక్షాప్రసిద్ధి యనుదోషము వాటిల్లును. ఆత్మత్వాశ్రయము పక్షమనినచో అట్టియాశ్రయము సర్వజ్ఞుఁడైన క్షిత్యాదికర్తయే యగునా? అన్యుఁడా? సర్వజ్ఞుఁడే యగుననిన, అట్టివాఁడు సిద్ధించనందున ఆశ్రయాసిద్ధి యనుదోషము ప్రసక్త మగుచున్నది. అన్యుఁ డగునన్నచో; వానియందు సాధ్యము సిద్ధించియేయున్నందున సిద్ధసాధన రూపదోషము తప్పదు. ఆత్మత్వజాతిని పక్షముఁజేసి జాతిత్వ హేతువువలన, సర్వజ్ఞ సర్వకర్తృవ్యక్తియం దుండకుండుటను సాధించెదమన్నచో (ఆత్మత్వం న సర్వజ్ఞ సర్వకర్తృ

సమవేతం జాతిత్వాత్ గోత్వవత్) అట్టి సర్వజ్ఞ సర్వకర్త లేనందున సాధ్యాప్రసిద్ధి సంభవించును. అప్రసిద్ధ సాధ్య మగుటవలన నీ యాత్మత్వ పక్షకానుమానముఁగూడ పనికి రాదు.

మూ. త్వదుపగతాగమలోకప్రసిద్ధస్యై వేశ్వరస్యాసర్వ జ్ఞత్వమకర్తృత్వఞ్చ సాధ్యతే ఇతి చేన్న,

**శ్లో. ఆగమాదేః ప్రమాణత్వే బాధనాదనిషేధనం,**
**ఆభాసత్వే తు సైవ స్యాదాశ్రయాసిద్ధిరుద్ధతా. ౫**

నిగదవ్యాఖ్యాతమేతత్.

తా. నీచే ప్రమాణముగా నంగీకరింపఁబడిన యాగమ సిద్ధమగు నీశ్వరునియందు జగత్కర్తృత్వాభావ సర్వజ్ఞత్వా భావములు సాధించెదమనుటకును వలనుపడదు. ఆగమ మనఁగ వేదము. దానికి ప్రామాణ్యము నంగీకరించినయెడల, ప్రమాణ భూతమగు వేదమందు, ఈశ్వరునకు జగత్కర్తృత్వమును, సర్వజ్ఞత్వమును చెప్పఁబడుటవలన, తదాభావము లేనందున, అనుమానము బాధితమగును, ఆగమ మాభాసరూప మన్న యెడల, ఈశ్వరుఁడే సిద్ధింపనందున, నాశ్రయాసిద్ధిరూపదోషము వాటిల్లక తప్పదని శ్లోకాభిప్రాయము.

మూ. చార్వాకస్త్వాహ:— కిం యోగ్యతావిశేషా గ్రహేణ? యన్నోపలభ్యతే తన్నాస్తి, విప రీతమస్తి. న చేశ్వరాదయస్తథా. తతో నసన్తీ త్యేతదేవ జ్యాయః. ఏవమనుమానాదివిలోప ఇతి చేత్, నేదమనిష్టం. తథా చ లోకవ్యవహారో

చ్ఛేద ఇతి చేన్న. సమ్భావనామాత్రేణ తత్సిద్ధేః.
సంవాదేన చ ప్రామాణ్యాభిమానాదితి.

తా. చార్వాకుఁడు ఆశంకించుచున్నాఁడు. ఏమన; యోగ్యతావిశేషముయొక్క గ్రహముచే నేమి ప్రయోజనము. ఏవి ప్రత్యక్షములుగావో అవి లేవు. ఏవి ప్రత్యక్షము లగుచున్నవో అవియే యున్నవి. ఈశ్వరాదులు ప్రత్యక్షవిషయమగుట లేదు. కాన, నీశ్వరాదులు లేరనుటయే ఉచితము. అట్టిచో ననుమానవిలోపము వాటిల్లునని యాశంకింపరాదు. ప్రత్యక్షము నొకదానినే ప్రమాణముగా నంగీకరించిన మాకనుమానవిలోపమనిష్టము గాదు. అట్టిచో లోకవ్యవహారవిలోపము ప్రసక్తమగునని యాశంకింపరాదు. సంభావనామాత్రముచే లోకవ్యవహారము సిద్ధించును. పరస్పర సంవాదమువలననే ప్రామాణ్యాభిమానము గల్గును.

మూ. అత్రోచ్యతే:—

శ్లో. దృష్ట్యదృష్ట్యోః క్వ సన్దేహో
భావాభావవినిశ్చయాత్,
అదృష్టిబాధితే హేతౌ
ప్రత్యక్షమపి దుర్లభమ్. ౬

సమ్భావనా హి సన్దేహ ఏవ. తస్మాచ్చ వ్యవహారస్తస్మిన్ సతి స్యాత్. స ఏవ తు కుతః? దర్శనదశాయాం భావనిశ్చయాత్, అదర్శనదశాయామభావావధారణాత్. తథా చ గృహాద్బహిర్గతశ్చార్వాకో వరాకో న నివర్తేత

ప్రత్యుత, పుత్రదారధనాద్యభావావధార ణాత్ సోరస్తాడం శోకవికలో విక్రోశేత్. స్మర ణానుభవాన్నైవమితి చేన్న. ప్రతియోగిస్మ రణఏవాభావపరిచ్ఛేదాత్, పరావృత్తోఽపి కథం పునరాసాదయిష్యతి? సత్త్వాదితి చేదనుపలమ్భ కాలేఽపి తర్హి సన్తీతి న తావన్మాత్రేణాభావావ ధారణమ్. తదైవోత్పన్నా ఇతి చేన్న. అనుప లమ్భేన హేతూనాం బాధాత్. అబాధే వా స ఏవ దోషః అతఏవ ప్రత్యక్షమపి న స్యాత్, తద్ధేతూనాం చక్షురాదీనామనుపలమ్భబాధిత తత్వాత్. ఉపలభ్యన్తఏవ గోళకాదయ ఇతి చేన్న. తదుపలబ్ధేః పూర్వం తేషామనుప లమ్భాత్. న చ యౌగపద్యనియమః. కార్య కారణభావాదితి.

తా. చార్వాకమతమును నిరాకరించుచున్నాఁడు:— సంభావన యనఁగా సందేహము. సందేహ మున్నపుడే వ్యవ హారము గల్గును. దర్శనకాలమున భావనిశ్చయమున దర్శన కాలమున నభావనిర్ణయము నుండుటంజేసి సందేహమే సంభ వింపదు. ప్రత్యక్షవిషయముగాని పదార్థము లేదన్నచో చార్వాకుఁడు గృహమును విడచి వేఱొకగ్రామమునకు వెళ్లి నపుడ దర్శనముచే లేకపోవలసి వచ్చుటంబట్టి తిరిగి గృహ మును గూర్చి రాకపోవలసి వచ్చెడిని. మఱియు, గ్రామాం తరమం దుండునపుడా చార్వాకుఁ డదర్శనముచే పుత్ర దారధనాద్యభావనిశ్చయముఁ గలవాఁడై, గుండెలు కొట్టు

కొనుచు దుఃఖింపవలసి వచ్చును. అనుపలంభ కాలమున, ప్రామాణికమైన స్మరణ మున్నందున, దారాపుత్రాదుల నున్నట్లు నిశ్చయించుటచే, దుఃఖింపఁడని చెప్పుటకు వీలులేదు. అభావబుద్ధినిఁ గూర్చి, ప్రతియోగి జ్ఞానము కారణము గాన, ప్రతియోగి స్మరణచే నభావమును నిశ్చయించి రోదనముఁ జేయవలసివచ్చును. మఱియు, గ్రామాంతరమునుండి తిరిగి వచ్చిన చార్వాకుఁడు దారాపుత్రాదుల నెట్లు పొందఁగలఁడు? ఉండుటచే నందువా! అట్లేని,యనుపలంభ కాలమునఁ గూడ నుండుటంజేసి, నీయనుపలబ్ధి యభావసాధకము కానేరదు. ఉపలబ్ధికాలమున మఱల పుట్టినారనుటకును వలనుపడదు. కారణము లున్నపుడుగదా కార్యము పుట్టుట. అనుపలబ్ధిచే కారణములు బాధితము లగుటంజేసి, తత్కాలమున దారాపుత్రాదులు మఱల జనించినారనుట కెట్లు వీలగును? మఱియుఁ గేవలానుపలబ్ధి కభావసాధకత్వము నంగీకరించినయెడల ననుపలబ్ధిచేఁ జక్షురాదిప్రమాణములు లేకపోవలసి వచ్చుటంబట్టి తత్కార్యమగు ప్రత్యక్షముఁగూడ లేకపోవలసి వచ్చెడిని. ఘటాదులయొక్క ప్రత్యక్షము సర్వానుభవసిద్ధ మగుచున్నది. దీనినిఁబట్టి యప్రత్యక్షమైన చక్షురాదిప్రమాణముల నూహించుచున్నాము. అదర్శనమాత్ర మభావమును సాధించునన్నచో ననుపలబ్ధిచే ప్రత్యక్షజ్ఞానహేతువైన చక్షురాదికము బాధితము గావలసివచ్చును. గోళకము ప్రత్యక్షము గాన ఘటాదిప్రత్యక్ష ముపపన్న మగునని చెప్పుటకు వలనుపడదు. గోళకోపలబ్ధికంటెఁ బూర్వమందు గోళకముయొక్క

యుపలబ్ధి లేనందున గోళకోపలబ్ధికంటెఁ బూర్వము గోళకము లేదు. గాన యుపలబ్ధికంటె పూర్వమునఁ గారణమగు గోళకము లేకపోవుటచేత ప్రత్యక్షము కుదురదు. ప్రత్యక్షకాలమున గోళకముఁగూడ పుట్టిననుటకును వలనుపడదు. కార్యకారణములకుఁ బౌర్వాపర్యనియమమే గాని యుగపదుత్పత్తినియమము లేదు. కాఁబట్టి గోళకోపలబ్ధికంటె పూర్వ మనుపలబ్ధిచే గోళకము బాధితమగుటంబట్టి తత్ప్రత్యక్షము ఘటాదిజ్ఞానములో నుపయోగింపదు. ఇట్టి యనుపపత్తులు సంభవించును గాన ననుపలబ్ధిచే నభావనిర్ణయముఁ జేయఁదగదు.

మూ. ఏతేన, న పరమాణవస్సన్తి అనుపలబ్ధేః. న తే నిత్యా నిరవయవా వా పార్థివత్వాత్. ఘటాదివత్. న పాథసీయపరమాణురూపాదయో నిత్యాః, రూపాదిత్వాత్, దృశ్యమానరూపాదివత్. న రూపత్వపార్థివత్వాది నిత్యాకార్యాతీన్ద్రియసమవాయి, జాతిత్వాత్, శృంగత్వవత్. నేన్ద్రియాణి సన్తి, యోగ్యానుపలబ్ధేః. అయోగ్యాని చ శశశృంగప్రతిబన్ది నిరసనీయానీత్యేవం స్వర్గాపూర్వదేవతానిరాకరణం నాస్తికానాం నిరసనీయం. మీమాంసకశ్చ తోషయితవ్యో భీషయితవ్యశ్చేతి.

తా. కాఁబట్టి "యనుపలబ్ధంబు లగుటంజేసి పరమాణువులు లేవనియు, ఘటాదులవలె పార్థివము లగుటంబట్టి పరమాణువులు నిత్యములు గావనియు, జలీయపరమాణువు

లందలి రూపాదికము ప్రత్యక్షసిద్ధమగు రూపాదికమువలె నసత్యమనియు, రూపత్వపార్థివత్వాదికము శృంగత్వమువలె జాతియగుటచే నిత్యములు నకార్యములు నతీంద్రియములు నగువానియం దుండదనియు, యోగ్యానుపలబ్ధి యుండుటం బట్టి ఇంద్రియములు లేవనియు, అయోగ్యములు, శశశృంగ ప్రతిబంది నిరసనీయములనియు", నాస్తికులు చేయు, స్వర్గము అపూర్వము దేవతలు మున్నగువాని నిరాకరణము, యుక్తి యుక్తము గానేరదు.

అనుపలబ్ధిమాత్రమున కభావసాధకత్వము లేదు. మఱి యొక హేతు వాశ్రయాసిద్ధ మగుచున్నది. కావున వెనుకటి యనుమానము లెంతమాత్రమును కుదురవు. యోగ్యానుప లబ్ధియే యభావసాధక మగుటంజేసి యదృష్టాదికము సిద్ధించు చున్నందున సంతోషమును, నీశ్వరుఁ డబాధ్యమగుటచే భీతియు మీమాంసకునకు సంభవించును.

మూ. యద్యేవమనుపలంభేనాదృశ్యప్రతిషేధో నేష్య
తే,అనుపలభ్యోపాధిప్రతిషేధోఽపి తర్హి నేష్ట
వ్యః. తథా చ కథం తథాభూతార్థసిద్ధిరపి.అను
మానబీజప్రతిబన్ధాసిద్ధేః. తదభావే శబ్దాదేరప్య
భావః, ప్రామాణ్యాసిద్ధేః. సేయముభయతః
పాశారజ్జుః.

తా. అనుపలంభముచే నదృశ్యప్రతిషేధము నంగీక రింపనిచో ననుపలబ్ధమగు నుపాధియొక్క ప్రతిషేధమును గూడ నంగీకరింపక పోవలసివచ్చును. అట్లైనచో ననుపలభ్య మానోపాధి యున్నందున, ననుమానబీజమయినవ్యాప్తి సిద్ధిం

పనందున నయోగ్యమయిన యీశ్వరుఁడు సిద్ధింపకపోవలసి వచ్చెడిని.

అనుమానము లేనిచో శబ్దమునకుఁ బ్రామాణ్యము సిద్ధింపనందున ననుమానసిద్ధప్రామాణ్యముఁగల శబ్దమునకుఁ గూడ విలోపము వచ్చును. అనులబ్ధి కభావసాధకత్వము లేనిచో నీరీతి ననుమానశబ్దప్రమాణములకు విలోపము వచ్చుచున్నది; ఉన్నచో నదృశ్యములగు గగనపరమాణ్వాదులకుచ్ఛేదము వచ్చుచున్నది. కావున నిఋపక్షములందును ననర్థం బున్నదని చార్వాకుఁ డాశంకించుచున్నాఁడు.

మూ. అత్ర కశ్చిదాహ—మాభూదుపాధివిధూననం, చతుఃపఞ్చరూప సమ్ప్రత్తిమాత్రేణైవ ప్రతిబన్ధనిర్వాహాత్. తస్యాశ్చ సపక్షాసపక్షదర్శనాదర్శనమాత్రప్రమాణకత్వాత్. యత్ర తు తద్భంగః, తత్ర ప్రమాణభంగోఽప్యావశ్యకః. న హ్యాప్తి సంభవో దర్శనాదర్శనయోరవిప్లవే హేతురుపప్లవతే ఇతి.

తా. పైయాశంకకు నొకఁడిట్లు సమాధానమును జెప్పుచున్నాఁడు. ఉపాధినిషేధము లేకపోయినను, పక్షసత్వము, సపక్షసత్వము, విపక్షాసత్వము, అబాధితత్వము, అసత్ప్రతిపక్షితత్వము, నను నీయైదురూపములతోను హేతువు గలసెనేని వ్యాప్తి సిద్ధియగును. ఈయైదును, సపక్షముయొక్క దర్శనము అసపక్షముయొక్క అదర్శనము ప్రమాణముగాఁ గలవి గాన నీయైదును లేనిచో నక్కడ ప్రమాణము లేదు. ఏ హేతువునందు సపక్షదర్శన విపక్షాదర్శన రూపప్రమాణ ముండునో

వెనుకఁజెప్పిన యైదురూపములతోఁ గలసిన యట్టిహేతువు యొక్క విప్లవము లేదు. అనఁగా నట్టిహేతు వుండునని భావము.

మూ. అప్రయోజకోఽపి తర్హి హేతుస్స్యాదితిచేత్, భూయోదర్శనావిప్లవే కోఽయమప్రయోజకో నామ? న తావత్సాధ్యం ప్రత్యకార్యమకారణం వా. సామాన్యతో దృష్టానుమానస్వీకారాత్. నాపి సామగ్ర్యాం కారణైకదేశః. పూర్వవదభ్యుపగమాత్. నాపి వ్యభిచారీ. తదనుపలంభాత్. వ్యభిచారోపలంభే వా సఏవ దోషః. న చ శంకితవ్యభిచారః. నిర్బీజశంకాయాస్సర్వత్ర సులభత్వాత్. నాపి వ్యాప్త్యన్తరసహవృత్తిః. ఏకత్రాపి సాధ్యే అనేకసాధనోపగమాత్. నాప్యల్పవిషయః, ధూమాదేస్తథాభావేఽపి హేతుత్వాత్.

తా. ఉపాధినిరసనము లేకపోయినను వెనుకఁ జెప్పఁబడిన రూపపంచకసంపత్తివలన వ్యాప్తి సిద్ధించునన్నచో నప్రయోజకముఁగూడ హేతువు గావలసివచ్చునని యాశంకింపఁ జనదు. భూయోదర్శనముయొక్క విప్లవము లేనిచో నప్రయోజక మనునది యేది? సాధ్యమున కకార్యముగాని, యకారణముగాని, యైన హేతువు అప్రయోజక మగునన్నచో రూపరసములకుఁ గార్యకారణభావము లేకపోవుటంబట్టి రూపసాధక మయిన రసము హేతువు కాకపోవలసి వచ్చెడిని. సామగ్ర్యేకదేశ మగు కారణ మప్రయోజకమని చెప్పినచో

పటసామగ్ర్యేకదేశమగు నంత్యతంతుసంయోగమునకు పట మునుగూర్చి హేతుత్వము లేకపోవలసి వచ్చును. వ్యభి చారము ప్రత్యక్షము గానందున వ్యభిచారి యప్రయోజక మనుటకు వీలుపడదు. వ్యభిచారము ప్రత్యక్షమయినచో నదియే దోషము గావచ్చును. శంకితవ్యభిచారి యగు హేతువు దుష్టమయినచో బీజములేని యాశంక యంతట నుండుట వలన సద్ధేతువే లేకపోవలసి వచ్చును. ఒకేసాధ్యమును సాధించు సద్ధేతువు లనేకము లుండవచ్చును గాన హేత్వంతర ముతోఁ గలసియుండున దప్రయోజక మనుటయు తగదు. ధూమము వహ్నిలో హేతువగుటవలన వ్యాపక సాధ్యావ న్నిష్ఠాభావప్రతియోగి (అనఁగా అల్పవిషయమయినది) అప్ర యోజకమని చెప్ప తగదు.

మూ. నను ధూమో వహ్నిమాత్రే అప్రయో జకఏవ,తన్నివృత్తావపి తదనివృత్తేః. ఆర్ద్రేన్ధనవ త్త్వం వహ్నివిశేషం ప్రతి తు ప్రయోజకః, తన్నివృత్తౌ తస్యైవ నివృత్తే రిత్యేతదప్యయు క్తం. సామాన్యాప్రయోజకతాయాం విశేష సాధకత్వాయోగాత్తదసిద్ధౌ తస్యాసిద్ధినియ మాత్. సిద్ధౌ వా సామాన్యవిశేషభావానుప పత్తేః. నాపిక్లప్తసామర్థ్యేఽన్యస్మిన్కల్పనీయసా మర్థ్యోఽప్రయోజకః, నాశే కార్యత్వసావయవ త్వయోరపి హేతుభావాదితి.

తా. ధూమము నివర్తించినను తప్తమగు నయఃపిండ మందు వహ్ని యున్నందున ధూమము వహ్నిమాత్రములో

ప్రయోజకము గానేరదు. ధూమములేనిచోట తడసినకట్టెలతోఁగూడిన వహ్ని లేకపోవుటచే ధూమము తడసిన కట్టెలతోఁగూడిన వహ్నిలోమాత్రము ప్రయోజక మనుటయు సరిపడదు. ఏలన, సామాన్యములో ప్రయోజకము కాని దానికి విశేషములో సాధకత్వము సంభవింపనందున వహ్నిసామాన్యములో ప్రయోజకముకానిదానికి వహ్నివిశేషములో సాధకత్వ మెట్లు సంభవించును? సామాన్యాసాధకమయినదానికి విశేషసాధకత్వము నంగీకరించినచో సామాన్యవిశేషభావవ్యవస్థయే లేకపోవలసి వచ్చును. గుణనాశములో భావకార్యత్వమునకు ప్రయోజకత్వము క్లృప్తమయినను, దీనికి వ్యాప్యమగు సావయవత్వమునకు కార్యద్రవ్యనాశములో హేతుత్వ మున్నది గాన నొకస్థలమందు క్లృప్తమయిన దానికి వ్యాప్యమగునది మఱియొకదానిలో నప్రయోజకమని చెప్పుటకు వలనుపడదు.

మూ. తదేతదపేశలం. కథం హి విశేషాభావాత్, కశ్చిద్వ్యభిచరతి కశ్చిచ్చ నేతి శక్యమవగన్తుం. తతో నిర్ణాయకాభావే సతి సాహిత్యదర్శనమేవ శంకాబీజమితి క్వాసౌ నిర్బీజా. ఏవం సత్యతిప్రసక్తిరపి చార్వాకనన్దినీ నోపలభ్యాయ.

తా. ఈవెనుకఁ జెప్పినసంగతి విచారసహము గాదు. ఏలన నీహేతువు వ్యభిచారి, యీహేతు వవ్యభిచారియని తెలిసికొనుట యశక్యము. కాఁబట్టి సాధ్యనిశ్చయముగాని, సాధ్యాభావనిశ్చయముగాని లేనియెడల సాహిత్యదర్శనమే

శంకాబీజమని చెప్పవలసి యుండుటంబట్టి నిర్బీజశంక కవకాశ మెక్కడ? కాఁగా పైఁజెప్పఁబడిన యతిప్రసక్తి చార్వాకుని సంతోషముకొఱకే గాని నిందకొఱకు గాదు.

మూ. స్వభావాదేవ కశ్చిత్కించిద్వ్యభిచరతి, కశ్చిచ్చ నేతి స్వభావఏవ విశేష ఇతి చేత్. కేన చిహ్నేన పునరసౌ నిర్ణేయ ఇతి నిపుణేన భావనీయం. భూయోదర్శనస్య శతశః ప్రవృత్తస్యాపి భంగదర్శనాత్.

తా. విశేషాదర్శనముతోఁగూడిన సహచారదర్శనము వ్యభిచార శంకాబీజము గావున నిర్బీజశంక కవకాశము లేదు. స్వభావమువలన దీనికిది కార్యము నియ్యది కారణము నని యెట్లు నిశ్చయించెదరో యటులనే దీనికిది వ్యభిచారి, ఇయ్యదవ్యభిచారి యని లోకోత్తర ప్రజ్ఞగల నీచేత నిశ్చయింపఁబడును గాని స్వభావమును తెలియని మాబోఁట్లకు దుర్లభము. అనేకసారులు భూయోదర్శన మున్నను, నొకానొకస్థలమందు దానికిఁ గూడ భంగము కలుగుచుండుటచే కేవల భూయోదర్శనమును బట్టియు నియ్యది వ్యభిచారి యియ్యది యవ్యభిచారి యని నిశ్చయించుట కవకాశము లేదు.

మూ. యత్ర భంగో న దృశ్యతే తత్ర తథేతి చేత్. ఆపాతతో న దృశ్యత ఇతి సర్వత్ర కాలక్రమేణాపి న ద్రక్ష్యత ఇతి కో నియంతేతి. తస్మాదుపాధితద్విరహావేవ వ్యభిచారావ్యభిచారనిబన్ధనం, తదవధారణం చాశక్యమితి.

తా. ఎక్కడ నట్టిభంగము కానరాదో యక్కడనే నిర్ణయించితిమని చెప్పుటకును వలనుపడదు. కొన్నిసమయము లందు భంగము కానరాకపోయినంతమాత్రమున సర్వ కాలములందును భంగము దృష్టముకాదని చెప్పుట సాహ సము. కావున వ్యభిచారిత్వములో నుపాధి యుండుటయు నవ్యభిచారిత్వములో నది లేకుండుటయు ప్రయోజకమని చెప్పవలయును. అట్టిప్రయోజకమును దెలిసికొనుట అస్మ దాదులకు శక్యము గాదు.

మూ. నను యస్సర్వైః ప్రమాణైః సర్వదాఽస్మదాది
భిర్వ్యద్వత్తయా నోపలభ్యతే నాసౌ తద్వాన్.
యథా బకః శ్యామికయా, నోపలభ్యతే చ
వహ్నా ధూమ ఉపాధిమత్తయేతి శక్యమితి
చేన్న. అస్యాప్యనుమానతయా తదపేక్షాయా
మనవస్థానాత్. సర్వాదృష్టేశ్చ సందేహాత్
స్వాదృష్టేర్వ్యభిచారతః, సర్వదేత్యసిద్ధేః.

తా. ఏవస్తువు సర్వప్రమాణములచే నేదికలదిగా నస్మ దాదులచే దృష్టముగాదో, యా వస్తువునందు దానియభావ ముండును. కొంగ నీలరూపముగలదిగా నేప్రమాణముచే నయిన నస్మదాదులచేఁ జూడఁబడనందున కొంగయందు నీలరూపాభావం బెట్లు నిశ్చయింపఁబడుచున్నదో, అగ్ని వహ్ని సాధ్యమగునపుడు ధూమ మస్మదాదులచే నుపాధికలదిగాఁ జూడఁబడనందున ధూమమునం దుపాధ్య భావమును నిశ్చయించుటకు నవకాశము లేదు. ఇదియు నను మాన మగుటచే నీ హేతువునందుఁగూడ నుపాధ్యభావనిశ్చ

యము నపేక్షించినచో ననవస్థాదోషము సంభవించును. అందఱిచేఁ జూడఁబడలేదనుట సందేహగ్రస్తము. తనచేఁ జూడఁబడలే దనినఁ దనచే నొకానొకసమయమునందుఁ జూడఁబడనిది లేకపో నయ్యెడిని. ఎల్లపుడును జూడలేదనుట యప్రసిద్ధము.

మూ. తాదాత్మ్యతదుత్పత్తిభ్యాం నియమ ఇత్యన్యే. తత్ర తాదాత్మ్యం విపక్షే బాధకాద్భవతి. తదుత్పత్తిశ్చ పౌర్వాపర్యేణ ప్రత్యక్షానుపలంభాభ్యాం. న హ్యేవం సతి శంకాపిశాచ్యవకాశమాసాదయతి, ఆశంక్యమానకారణభావస్యాపి పిశాచాదేరేతల్లక్షణావిరోధేనైవ తత్త్వనిర్వాహాదితి. న. ఏవమప్యుభయగామినోఽవ్యభిచారనిబన్ధనస్యైకస్యావివేచనాత్. ప్రత్యేకం చావ్యాపకత్వాత్. కుతశ్చ కార్యాత్మానౌ కారణమాత్మానం చ న వ్యభిచరత ఇతి.

తా. ఏ సాధ్యహేతువులకు తాదాత్మ్యముగాని కార్యకారణభావముగాని యుండునో అట్టిస్థలమందు వ్యాప్తి నిశ్చయింపఁ బడును. విపక్షబాధకమువలన, తాదాత్మ్యము నిశ్చయింపఁబడును. వృక్షముగా నిది శింశుపము గాదు. కాననిట్టి విపక్షబాధకమునుబట్టి వృక్షశింశుపములకు తాదాత్మ్యము నిశ్చయింపఁబడును. వహ్నిధూమములకు ప్రత్యక్షానుపలంభములనుబట్టి యనఁగా నన్వయవ్యతిరేకములనుబట్టి యుత్పాద్యోత్పాదకభావము నిశ్చయించఁబడును. ఇట్లయినచో

నుపాధి శంకాపిశాచికవసరము లేదు.వహ్న్యింధనము లున్న పుడు వీటికంటె నతిరిక్తమయిన పిశాచాదుల సన్నిధికూడ నాశం కింపఁబడినను వహ్న్యింధనాదివ్యభిచారికి యాశంకింపవలదు. వహ్న్యింధనాదికము లేనిసమయమున కేవల పిశాచాదులవలన ధూమము పుట్టనందున ధూమనియతమునకే సన్నిధి చెప్ప వలెను. అన్వయవ్యతిరేకములు వహ్నికే గాని యాశంక్య మానకారణభావముగల పిశాచాదులకు సంభవించవు. గాన పూర్వమందు చెప్పఁబడిన తాదాత్మ్యమువలనను, నుత్పత్తి వలనను వ్యాప్తి నిశ్చయము గలుగునని" చెప్పెడు చార్వా కునిమతము సమంజసము గాదు. తాదాత్మ్యము, ఉత్పత్తి ఈ రెండును గలసి వ్యాప్తి గ్రాహకమా ? లేక నొక్కొకటియా? రెండును గలసి యొక హేతువునం దుండనందున మొదటి పక్షము సరిగాదు. రెండవపక్షమున వ్యాప్తిగ్రాహకము ప్రత్యేకమయినచో వ్యాప్తిగ్రాహకతావచ్ఛేదకమగు ననుగత రూపము లేనయ్యెడిని. కాఁబట్టి చార్వాకమతము సరిగాదు. ఉపాధిశంకగాని వ్యభిచారశంకగాని యున్నపుడు వ్యాప్తి సిద్ధిగానందున ననుమానముచే నీశ్వరసిద్ధి యెటులగునను. నాశంకకు సమాధానము చెప్పఁబడుచున్నది.

శ్లో. శంకాచేదనుమాఽస్త్యేవ న చేచ్ఛంకా తతస్తరాం,
వ్యాఘాతావధిరాశంకా తర్కశ్శంకాఽవధిర్మతః. ౭

తా. తద్దేశ తత్కాలిక మయినవానియందు వ్యభిచా రాభావనిశ్చయ ముండుటవలన దేశాంతర కాలాంతరస్థ మయినవానియందు వ్యభిచారశంక కలుగవలసి వచ్చెడిని.

దేశాంతరస్థ కాలాంతరస్థములు ప్రత్యక్షములు కానందున వానియొక్కజ్ఞానం బనుమానసాధ్యము. కాఁబట్టి శంకయున్న చో ననుమానము సిద్ధమే. శంక లేనిచో నంతకన్న ననుమాన ముండును. తచ్ఛంకానివర్తకము తర్కము. తర్కంబన నాపాద్యమును గోచరించు మానసికజ్ఞానము. ఇందు నాపాద్యమునకు నాపాదకమునకు నుండువ్యాప్తి నిశ్చయము కారణము. ఈ వ్యాప్తి నిశ్చయవిరోధియగు వ్యభిచారశంకానివర్తకమగు తర్కాంతరము నపేక్షించినచో ననవస్థాదోషము సంభవించు నని చెప్పుటకు నవకాశము లేదని చెప్పునది. "వ్యాఘాతా వధిరా శంకా" తర్కమూలమగు వ్యాప్తియందు వ్యభిచార శంకయుండదు. ఏలయన, వ్యాఘాతాత్, కారణము లేనిచో కార్యోత్పత్తిని శంకించినచో కారణప్రవృత్తి యనుపపన్నము కావలసి వచ్చెడిని. అనఁగా భోజనకార్యము తృప్తి. ఇట్లే శబ్దప్రయోగకార్యము పరునకుఁగల్గు నర్థప్రతిపత్తి. తృప్తినిఁ గూర్చి భోజనమందును, పరుని యర్థప్రతిపత్తినిఁగూర్చి శబ్ద ప్రయోగమందును గల్గుప్రవృత్తి కనుపపత్తి వచ్చెడిని. ఇట్టి ప్రవృత్త్యనుపపత్తి యున్నపుడు తర్కమూలభూతవ్యాప్తి యందు వ్యభిచారశంక కలుగనేరదు. కావున, ననవస్థాదోష ము లేదు.

మూ. కాలాన్తరే కదాచిద్వ్యభిచరిష్యతీతి కాలం
భావినమాకలయ్య శంక్యేత. తదాకలనం చ
నానుమానమవధీర్య కస్య చిత్. ముహూర్త
యామాహోరాత్రపక్షమాసర్త్వయన సంవత్స
రాదయో హి భావినో భవన్ముహూర్తాద్యను

మేయా ఏవ. అనవగతేషు స్మరణస్యాప్యనాశంక
నీయత్వాత్. అనాకలనే వా, కమాశ్రిత్య
వ్యభిచారశ్శంక్యేత? తథా చ సుతరామనుమా
నస్వీకారః. ఏవం చ దేశాన్తరేఽపి వక్తవ్యం.

తా. రాఁబోవుకాలమును దెలిసికొని, కాలాంతరమం దొకానొకప్పుడు హేతువు వ్యభిచారి కాఁగలదని శంకించి నచో, రాఁబోవుకాలము ప్రత్యక్షము గానందున ననుమానముచేతనే తెలియఁబడవలయును. కావున శంక యుండునెడ ననుమానము లేదని చెప్పుటకు వలనుపడదు. రాఁబోవు ముహూర్త యామాహోరాత్ర పక్షమాసర్త్వయన సంవత్సరాదులు వర్తమాన ముహూర్తాద్యనుమేయములు. అననుభూతమైనచో స్మరణశంకకుఁగూడ నవకాశము లేదు. రాఁబోవు ముహూర్తాదిరూపమగు కాల మజ్ఞాతమైనచో దేనినాశ్రయించి వ్యభిచారమును శంకించుట? వ్యభిచార శంకలేనిచోఁ దప్పక యనుమానము స్వీకరింపఁబడుచునే యున్నది. ఇట్లే ప్రత్యక్షము కాని దేశమందు వ్యభిచారమును శంకించిన, నాదేశము ప్రత్యక్షము కానందున, తద్జ్ఞాన మనుమానైకసాధ్యమే కావలయుటంబట్టి, యనుమానము సిద్ధించుచేయున్నది. ఆదేశ మజ్ఞాత మగునెడల, దానినాశ్రయించి వ్యభిచారమును శంకించుటకే అవకాశము లేదు. కావున, ననుమానము తప్పక సిద్ధించుచేయున్నది

మూ. స్వీకృతమనుమానమ్. సుహృద్భావేన పృచ్ఛామః, కథమాశంకా నివర్తనీయా? ఇతి చేన్న,

యావదాశంకం తర్కప్రవృత్తేః. తేన హి వర్త మానేనోపాధికోటౌ తదాయత్తవ్యభిచార కోటౌ వాఽనిష్టముపనయతేచ్ఛా విచ్ఛిద్యతే. విచ్ఛిన్నవిపక్షేచ్ఛశ్చ ప్రమాతా భూయో దర్శనోపలబ్ధసాహచర్యం లిఙ్గమనాకులోఽధి తిష్ఠతి. అధిష్ఠితాచ్చ కరణాత్ క్రియాపరినిష్ప త్తిరితి కిమనుపపన్నమ్?

తా. అనుమానమును స్వీకరించితిమి గాని స్నేహభావ ముచేఁ గొన్ని సంగతులు మాటలాడుకుందము. వ్యభిచార శంక యెట్లు నివర్తించునో చెప్పుము. తర్కాశ్శంకా వధిర్మతః, యావదాశంకం తర్కప్రవృత్తేః. అనఁగా తర్కసహకృత భూయోదర్శనమువలనఁ గలుగు సంస్కారరూపప్రమాణ ముచే వ్యభిచారశంక నివర్తించి వ్యాప్తిగ్రహము గలుగును. ఉపాధికోటియందు, తదధీనమైన వ్యభిచారకోటియందు అని ష్టము నుపపాదించెడు తర్కముచే సంశయాయత్తమైన సాధ్యాభావమును గోచరించు నిచ్ఛ, దానికిఁ గారణమగు సంశయమును నివర్తించును. నివృత్తమైన ఇచ్ఛగలప్రమాత భూయోదర్శనమువలన, ఉపలబ్ధమగు సాహచర్యముగల లింగ జ్ఞానరూపప్రమాణముచే, అనుమితి గలవాఁడగును. గావున నేది యనుపపన్నము.

మూ. నను తర్కోఽప్యవినాభావమపేక్ష్య ప్రవర్తతే, తతోఽనవస్థయా భవితవ్యమ్. న. శంకాయా వ్యాఘాతావధిత్వాత్. తదేవ హ్యాశంక్యతే, యస్మిన్నాశంక్యమానే స్వక్రియావ్యాఘాతా

దయో దోషా నావతరన్తీతి లోకమర్యాదా.
న హి హేతుఫలాభావో న భవిష్యతీతి శంకి
తుమపి శక్యతే. తథా సతి, శంకైవ న స్యాత్,
సర్వం మిథ్యా భవిష్యతీత్యాదివత్.

తా. తర్కముఁ గూడ నాపాద్యాపాదకములకు గల వ్యాప్తిజ్ఞానము నపేక్షించుచున్నది. ఆ వ్యాప్తిజ్ఞానవిరోధి యగు వ్యభిచారశంకను నివారించుటకై తర్కాంతరము నపేక్షించినచో ననవస్థాదోషము వాటిల్లునే యనరాదు. అట్టి స్థలములందు స్వక్రియావ్యాఘాతముచేతనే శంక నివర్తింపఁబడును. గాన, తర్కాంతరము నపేక్షింపఁ బనిలేదు. కాఁబట్టి యనవస్థాదోషమున కవకాశము లేదు. కారణము లేకున్నను కార్యము ఉండఁగూడదా యని ఎవఁడు శంకించునో వానికి కార్యకారణభావజ్ఞాన మావశ్యకము. అయ్యది లేనిచో శంకయే లేకపోవలసివచ్చెడిని. కావున నట్టియాశంక, తృప్తిని ఉద్దేశించి భోజనమందును, ధూమమును ఉద్దేశించి వహ్నియందును, ప్రవృత్తి లేకపోవలసి వచ్చుననెడి వ్యాఘాతముచే నివారింపఁబడును. కాఁబట్టి అట్టిస్థలములందు, తర్కాంతరము నపేక్షించవలసిన యవసరము లేదు.

మూ. తథాపి, అతీన్ద్రియోపాధినిషేధే కిం ప్రమాణ
మిత్యుచ్యతామితి చేత్. న వై కశ్చిదతీన్ద్రియో
పాధిః ప్రమాణసిద్ధోఽస్తి, యస్యాభావే
ప్రమాణమన్వేషణీయమ్. కేవలం సాహచర్యే
నిబన్ధనాన్తరమాత్రం శఙ్క్యతే. తతః శంకైవ

ఫలతః స్వరూపతశ్చ నివర్తనీయా. తత్ర ఫలమ స్యావిపక్షస్యాపి జిజ్ఞాసా తర్కాదాహాత్య నివర్తతే. తతోఽనుమానప్రవృత్తౌ శఙ్కా స్వరూపమపీతి సర్వం సుస్థం. న చైతదనాగమమ్, న్యాయాఙ్గతయా తర్కం వ్యుత్పాదయతః సూత్రకారస్యాభిమతత్వాత్. అన్యథా తద్వ్యుత్పాదనవైయర్థ్యాత్.

తా. అతీంద్రియోపాధి ప్రమాణసిద్ధమగున దొకటి లేనందున, నట్టి యుపాధినిషేధ మేప్రమాణముచే సిద్ధించు ననుట కవకాశము లేదు.

సాహచర్యమాత్రముచే వ్యాప్త్యంతరమును శంకించినచో ఫలమువలన నట్టి శంకాస్వరూపమును నివర్తింపఁ జేయవలెను. పిమ్మట యనుమానము ప్రవర్తించునెడ శంకాస్వరూపము నివర్తించును. తర్కము న్యాయాంగమగుట సూత్రకారులకు కూడ నభిమతమే. అట్లు కాదేని, న్యాయాంగముగా దర్కసూత్రముఁ జెప్పుట యసంగత మయ్యెడిని. కాఁబట్టి తర్కము న్యాయాంగమని యంగీకరింపవలయును.

మూ. తదయం సంక్షేపః. యత్రానుకూలతర్కో నాస్తి సోఽప్రయోజకః. స చ ద్వివిధః, శఙ్కితోపాధి ర్నిశ్చితోపాధిశ్చ. యత్రేదముచ్యతే.

శ్లో. యావచ్ఛావ్యతిరేకిత్వం శతాంశేనాపి శంక్యతే,
విపక్షస్య కుతస్తావత్ హేతోర్గమనికాబలమ్."

తత్రోపాధిస్తు,సాధనావ్యాపకత్వే సతి సాధ్యవ్యాపకః.తద్ధర్మభూతా హి వ్యాప్తిర్జపాకుసుమరక్తతేవ స్ఫటికే సాధనాభిమతే చకాస్తీత్యుపాధిరసావుచ్యతే ఇతి.

తా. భూయోదర్శనాదులకు విఘ్నము లేనిచో నప్రయోజకమనునదేది యనుశంకకు సమాధానము.

ఏస్థలమందు వ్యభిచారశంకను నివారింపఁజేయు తర్కము ఉండదో తత్థ్సలీయ హేతువు నప్రయోజకముగా దెలియనగు. శంకితోపాధి, నిశ్చితోపాధి, యను భేదముచే నయ్యది రెండువిధము లగుచున్నది. ఉపాధిశంక యున్నచో వ్యభిచారశంక తప్పక యుండును. వ్యభిచారశంక వ్యాప్తి నిశ్చయమును ప్రతిబంధించును. కాన వ్యభిచారశంక యుండు నెడల హేతువు అనుమాపకము గానేరదు. ఇందులకుఁ బ్రమాణము. "యావచ్చావ్యతిరేకిత్వం" అనుశ్లోకము. విపక్షస్య=సాధ్యశూన్యమునకు, అనఁగా సాధ్యము లేనిచోట, హేతోః = హేతువునకు, అవ్యతిరేకిత్వం=సత్వము, శతాంశేనాపి యావత్ శంక్యతే = అనఁగా హేతువునందు విపక్షగామిత్వ రూపవ్యభిచారశంక ఎపుడుండునో, అట్టితరి, హేతోః= హేతువునకు, గమనికాబలమ్—అనుమాపకత్వము, కుతః ఎట్లు అని యర్థము. వ్యభిచారశంకా కబళితమగు హేతువనుమాపకము గానేరదని తాత్పర్యము. ఉపాధి యన, సాధ్యముగా గైకొనఁబడినదానికి వ్యాపకమును, సాధనముగా గైకొనఁబడినదాని కవ్యాపకమును అగునది. ఉదాః—పర్వత

మందు వహ్ని చే ధూమమును సాధింపనెంచ, నార్ద్రేంధనసం యోగ ముపాధి యగును. ధూమముండుతావులందెల్ల, నార్ద్రేన్ధనసంయోగము నియతముగా నుడుంటంబట్టి, ఇచ్చట సాధ్యముగా స్వీకరింపఁబడిన ధూమమున కార్ద్రేన్ధనసంయోగము వ్యాపక మగుచున్నది. అనలాశ్రయమగు తప్తాయః పిండమున, నార్ద్రేన్ధనసంయోగము లేమింజేసి, ఇచ్చట సాధనముగా గైకొనఁబడిన వహ్నికి ఆర్ద్రేన్ధనయోగ మవ్యాపక మగుచున్నది.

ఎద్దానిధర్మము వేఱొకవస్తువున ప్రకాశించుచున్నదో అయ్యది, ఆవస్తువులో నుపాధి యగుచున్నది. జపాకుసుమముయొక్క రక్తిమ స్ఫటికమునందు ప్రకాశించేన దగుటంజేసి, స్ఫటికమున జపాకుసుమ ముపాధి యనఁబడుచున్నది. అట్లే, వహ్నిసమానాధి కరణార్ద్రేన్ధన సంయోగమందుండెడి ధూమవ్యాప్తి, కేవల వహ్నియందు ప్రకాశించుటం జేసి, వహ్నిలో నార్ద్రేన్ధనసంయోగ ముపాధి యగుచున్నది. హేతువునందు, సోపాధికత్వనిశ్చయ ముండిన, సాధ్యవ్యభిచారనిశ్చయము నియతమగుటచే, వ్యాప్తి నిశ్చయముఁ గలుగనేరదు. వ్యాప్తినిశ్చయము లేనితఱి, గారణము లేమింజేసి, అనుమతియు జనింపదు. ఇందులకు ప్రమాణముగా "అన్యేపరప్రయుక్తానాం" అను శ్లోకము నుదాహరించుచున్నాఁడు.

మూ. తదిదమాహుః—

శ్లో. "అన్యే పరప్రయుక్తానాం వ్యాప్తీనాముపజీవకాః,
తైర్దుష్టై రపి నైవేష్టా వ్యాపకాంశావధారణా." ఇతి.

అర్థ. అన్యే = మఱికొన్ని హేతువులు, పరప్రయుక్తానాం=ఉపాధిప్రయుక్తమగు, వ్యాప్తీనాం=వ్యాప్తులకు, ఉపజీవకాః=ఆశ్రయము లగుచున్నవి. దుష్టైస్తైరపి=దుష్టములగు (సోపాధికములగు) నట్టి హేతువులవలనను, వ్యాపకాంశావధారణా = సాధ్యనిశ్చయము, నైవేష్టా=అభిమతము గాదు; కలుగనేరదని భావము.

సోపాధికమగు హేతువు సాధ్యమునకును, సాధ్యాభావమునకును సమానాధికరణ మగును. సాధారణధర్మజ్ఞానము సంశయకారణ మగుటంజేసి, సాధ్యతదభావ సహచరిత హేతుజ్ఞానమున, సాధ్యసంశయమే జనించును గాని, సాధ్యనిశ్చయము జనింపనేరదని తాత్పర్యము.

మూ. తదనేన విపక్షదండభూతేన తర్కేణ సనాథే
భూయోదర్శనే, కార్యం వా, కారణ వా,
తతోఽన్యద్వా, సమవాయి వా, సంయోగి
వా, అన్యథావా, భావో వా,ఽభావో వా, స
విశేషణం వా, నిర్విశేషణం వా, లిఙ్గమితి నిశ్శ
ఙ్కమవధారణీయమ్. అన్యథా తదాభాస
ఇతి రహస్యమ్.

తా. వ్యభిచారశంకాపనోదకమగు తర్కముతోఁ గూడిన భూయోదర్శన ముండునెడల, కార్యమునుగాని, కారణమునుగాని, కార్యకారణములకంటె వేఱగుదానిని గాని, సమవాయినిగాని, సంయోగినిగాని, భావమునుగాని, అభావమునుగాని, సవిశేషణమునుగాని, నిర్విశేషణమును గాని, (విశేషణములతో గూడుకున్నదానినిగాని, శుద్ధమును

గాని,) నిస్సంశయముగా, హేతువని నిర్ణయింపఁ దగును. అది లేనిచో, హేతు వాభాసమని దెలియనగును.

**మూ.** తాదాత్మ్యతదుత్పత్త్యోరప్యేతదేవ బీజం. యది కార్యాత్మానౌ కారణమాత్మనం చాతిపతేతాం, తదా తయో స్తయో స్తత్వం వ్యాహన్యేత. అత ఏవ, సామగ్రీనివేశిన శ్చరమకారణాదపి కార్య మనుమిమతే సౌగతా అపి. తస్మాద్విపక్షబాధక మేవ ప్రతిబన్ధలక్షణం.

తా. తాదాత్మ్యమునుఁబట్టియుఁ, దదుత్పత్తినిఁబట్టియు వ్యాప్తి నిశ్చయించఁబడునను బౌద్ధమతమందుఁగూడ, వ్యభిచారశంకా నివర్తకమగు తర్కానుసరణము వ్యాప్తి నిశ్చయముకొఱకు కావశ్యకము "అయంవృక్షః శింశుపాయాః" అనునపుడు శింశుపయందు వృక్షతాదాత్మ్యమునుఁబట్టియు, "వహ్నిమాన్ధూమాత్" అనుస్థలమున ధూమమందు వహ్ని కార్యత్వమును బట్టియు వ్యాప్తిని నిశ్చయించెదరు. ఈ స్థలములయందు వ్యభిచారశంకా నివర్తకముగా, "ధూమము, కారణమైనవహ్నిని; శింశుప, వృక్షమును నతిక్రమించి యున్నచో, ధూమమునకు వహ్నికార్యత్వమును శింశుపకు వృక్షస్వరూపత్వమును లేకపోవలసి వచ్చును." అను నిట్టి తర్కమావశ్యకము. ఇట్టితర్కము లేనిచో వ్యాప్తి నిశ్చయముఁగలుగుట దుర్లభము. గనుకనే సౌగతులుగూడ సామగ్రీఘటకమగు చరమకారణమైన మద్దిలయొక్క యభిఘాతముచే చెవిటివాడు శబ్దానుమానము జేయునని జెప్పుదురు.

కాఁబట్టి వ్యాప్తి నిశ్చయముఁ గలుగుటకై వ్యభిచారశంకా నివర్తకమగు తర్కము నందరు నపేక్షించవలెను.

మూ. తథా హి;—శాకాద్యాహారపరిణతివిరహిణి మిత్రాతనయే న కిఞ్చిదనిష్టమితి నాసౌ తస్య వ్యాపికా, వ్యాపికాతు శ్యామికాయాః, కార ణత్వావధారణాత్. కారణం చ తత్ తస్య, తదతిపత్య భవతి చేతి వ్యాహతం. ఏవమన్యత్రా ప్యూహనీయమితి.

తా. "స శ్యామః మిత్రాతనయత్వాత్." అను స్థలమున శ్యామరూపము సాధ్యము. మిత్రాతనయత్వము హేతువు. ఉక్తమిత్రాతనయునియందు, శాకాద్యాహారపరిణతి లేనందున, మిత్రాతనయత్వమునకు శాకాద్యాహారపరిణతి వ్యాపకము గాదు. శాకాద్యాహారపరిణతి శ్యామత్వమును గూర్చి కారణమగుటచే సాధ్యమగు శ్యామత్వమునకు మాత్రము వ్యాపక మగుచున్నది. ఇచట "శాకాద్యాహార పరిణతి లేకున్నను శ్యామత్వముఁ గలుగకూడదా" యను వ్యభిచారశంకను, "అట్లగుచో, సాధ్యమగు శ్యామత్వమునకు, శాకాద్యాహారపరిణతికార్యత్వము లేకపోవలసి వచ్చెడిని" యనుతర్కము నివర్తింపఁజేయుచు, శాకాద్యాహారపరిణతి రూపమగు నుపాధియందు, శ్యామత్వ వ్యాపకత్వగ్రహమును గలుగజేయును. ఇట్లే స్థలాంతమునఁగూడ దెలిసికొన నగును.

మూ. క్వ పునరప్రయోజకోఽన్తర్భవతి ? న క్వచిదిత్యే కే. యథా హి, సిద్ధసాధనం న బాధితవిషయం,

విషయాపహారాభావాత్. నాపి నిర్ణయే సతి పక్షత్వాతిపాతాదపక్షధర్మః, కాలాతీతవిలోప ప్రసఙ్గాత్. న చానైకాన్తికాదిః, వ్యభిచారా ద్యభావాత్. తథాఽయమపి. సూత్రం తూప లక్షణపరమితి.

తా. హేత్వాభాసము సవ్యభిచారాది భేదమున నైదు విధము లగుచున్నది గదా! అం దేవిధమున, నప్రయోజక మంతర్భవించుచున్నది? ఏవిధమునందును అంతర్భావము నొందదని కొందఱి మతము. సిద్ధసాధన మెట్లు, అతిరిక్తదోష మగుచున్నదో యట్లే అప్రయోజకమును గా వచ్చును. సిద్ధసాధనము ప్రమితమైన సాధ్యశూన్యమగు ధర్మి గలది కానందున, బాధితవిషయముగలది గాదు. సాధ్యనిశ్చయ ముండునెడ సాధ్యసంశయఘటిత మగుపక్షత సంభవింపమి, పక్షతావిశిష్టధర్మి వృత్తి గానందున నసిద్ధము కాఁగూడదా యని యనరాదు. అట్లగుచో, ధర్మియందు ప్రమాత్మకమగు సాధ్యాభావ నిశ్చయ ముండుతఱి, సాధ్యసంశయము జనింపమి, బాధకూడ నసిద్ధిలో ననంతర్భావము నొందవలసి వచ్చెడిని. వ్యభిచారాదులు లేమింజేసి యనైకాంతికమున, నంతర్భవింపఁ జేయుటకు వలనుపడదు. కాఁబట్టి సిద్ధసాధన మెట్లు అతిరిక్తమగు హేత్వాభాస మయ్యెనో అట్లే అప్రయోజకముఁగూడ నతిరిక్త మగు హేత్వాభాస మగుచున్నది. సవ్యభిచారాదులం దంత ర్భవింపని హేత్వాభాసము లిన్నియుండఁగా, గౌతముఁడు సవ్యభిచార విరుద్ధేత్యాదిసూత్రమున హేత్వాభాసము నైదువిధములుగానే విభజించు టేల యని యందువా!

వినుము. ఆసూత్రము పలక్షణపరము. సూత్రకారునకుఁ గూడ సిద్ధసాధనమును అప్రయోజకమును హేత్వాభాసము లగుట సమ్మతమే యని కొందఱిమతము.

మూ. తదసత్. విభాగస్య న్యూనాధికసంఖ్యావ్యవచ్ఛేదఫలకత్వాత్. క్వ తర్హి ద్వయోరన్తర్భావః? అసిద్ధ ఏవ. వ్యాప్తస్య హి పక్షధర్మతా ప్రతీతిః సిద్ధిః, తదభావోఽసిద్ధిః.ఇయఞ్చ వ్యాప్తి పక్షధర్మతాస్వరూపాణామన్యతమా ప్రతీతా భవన్తీ యథాసఙ్ఖ్యమన్యథాసిద్ధిరాశ్రయాసిద్ధిః స్వరూపాసిద్ధి రిత్యాఖ్యాయతే. మధ్యమాప్యాశ్రయస్వరూపాప్రతీత్యా తద్విశేషణపక్షత్వాప్రతీత్యా వేతి ద్వయీ. తత్ర చరమా సిద్ధసాధనమితి వ్యపదిశ్యతే, వ్యాప్తిస్థితౌ పక్షత్వస్యాహత్య విఘటనాత్. న త్వేవం బాధే, వ్యాప్తేరేవ ప్రథమం విఘటనాదితి విశేషః.

తా. అది సరికాదు. ఏలన, హేత్వాభాసవిభాగసూత్రముపలక్షణపరమని చెప్పుటకు వలనుపడదు. సూత్రకారునకా సూత్రము పలక్షణపరము కావలయునను నాశయమే యుండినచో నాతఁడు హేత్వాభాసలను, రెండువిధములుగా గాని, మూఁడువిధములుగాగాని లేక నాల్గువిధములుగాగాని యేల విభజింపఁగూడదు? కాఁబట్టి విభాగసూత్రమునకు న్యూనాధికసంఖ్యావ్యవచ్ఛేదమే ఫలమని గ్రహించి, హేత్వాభాసలైదింటికంటె నెక్కువగాని, తక్కువగాని, లేవను

నర్థమును గ్రహింప నగును. అట్లగుచో సిద్ధసాధనమునకు, ప్రయోజకమునకు నెందంతర్భావ మందువా! అసిద్ధిలో ననని దెలిసికొనుము. అది యెట్లన; వినుము. అసిద్ధియన సిద్ధియొక్క యభావము గదా! సిద్ధియన, వ్యాప్తి విశిష్ట హేతువుయొక్క పక్షధర్మతా ప్రతీతి. అట్టి ప్రతీతియొక్క యభావమే యసిద్ధి యనఁబడుచున్నది. ఈ యసిద్ధియే వ్యాప్తి ప్రతీతిలేనిచో వ్యాప్యత్వాసిద్ధి యనియు, పక్షధర్మతా ప్రతీతి లేనిచో నాశ్రయాసిద్ధి యనియు, స్వరూపప్రతీతి లేనిచో స్వరూపాసిద్ధి యనియు, మూఁడునామంబులఁ బరగుచున్న యది. ఇందాశ్రయాసిద్ధి ఆశ్రయస్వరూపముయొక్క అప్రతీతి వలనను, తద్విశేషణమగు పక్షతయొక్క యప్రతీతివలనను, రెండువిధము లగుచున్నది. సాధ్యనిశ్చయరూపమగు సిద్ధ సాధనమునకు ద్వితీయాశ్రయసిద్ధిలో నంతర్భావము. వ్యాప్తి సిద్ధియుండినను, పక్షతావైగుణ్యమున పక్షత్వాసిద్ధి యనఁ బడును. బాధస్థలమందు దొలుతనే వ్యాప్తివిఘటనము గల్గును. "జలహ్రదోవహ్నిమాన్ధూమాది"త్యాది బాధస్థల మందు బాధ నిశ్చయమువలన మొదటనే పక్షతావిఘటనము గల్గును గాన బాధకంబు సిద్ధసాధనమందున్న విశేష మేమని యాశంకింపరాదు. సాధనాభిమతము పక్షవృత్తి యగుస్థలమున దొలుత వ్యాప్తివిఘటనమే గలుగును. గాన నిదియే విశేషము.

**మూ.** యత్త్వప్రయోజకః సన్దిగ్ధానైకాన్తిక ఇత్యనైకాన్తికేఽన్తర్భావ్యతే. తదసత్. వ్యాప్త్యసిద్ధ్యా హి నిమిత్తేన వ్యభిచారః శఙ్కనీయో ఽన్యథా వా? ప్రథమే, అసిద్ధిరేవ దూషణ

ముపజీవ్యత్వాత్, నానైకాన్తిక ముపజీవక
త్వాత్. అన్యథా శఙ్కాత్వదూషణమేవ, నిర్ణీతే
తదనవకాశాదితి.

తా. "ఏదప్రయోజకమో అది సందిగ్ధానైకాంతి
కము. గావున ననైకాంతికమే యప్రయోజకము" అను
మతము విమర్శసహము గాదు. వ్యభిచారము వ్యాప్త్యసిద్ధి
రూప నిమిత్తముచే శంకనీయమా! లేక వేఱొకరీతినా?
వ్యాప్త్యసిద్ధిచే నని శంకించిన గారణమగుటచే నసిద్ధిలోనే
జేరును. వ్యాప్తి సిద్ధియున్నచో వ్యాప్తి నిశ్చయ మున్న
పుడు శంకయే సంభవింపనందున శంక దూషణము గాదు.
కాఁబట్టి యనుమాన మీశ్వరునివిషయమున బాధకము
కానేరదు.

మూ. ఉపమానం తు బాధకమనాశఙ్కనీయమేవ,
విషయానతిరేకాదితి కేచిత్. తథా హి:—న
తావదస్య విషయః సాదృశ్యవ్యపదేశ్యం పదా
ర్థాన్తరమేవ సమ్భావనీయం.

శ్లో. పరస్పర విరోధే హి న ప్రకారాన్తరస్థితిః,
నైకతాపి విరుద్ధానాముక్తిమాత్రవిరోధతః. ౮

తా. ఫలవ్యాపారవైజాత్యము లేనందున నుపమాన
మనుమానప్రమాణముకంటె నతిరిక్తము గాదు. కాఁబట్టి
యుపమాన మీశ్వరవిషయమున బాధకము కానేరదు. అను
మానవిషయముకంటె నతిరిక్తమగు సాదృశ్యరూపవిషయము,

ఉపమానమున కున్నందున నుపమాన మనుమానముకంటె నతిరిక్తమగుప్రమాణము. ఈ సాదృశ్యము చక్షుఃపాత మాత్ర మున దెలియఁబడనందున ప్రత్యక్షగమ్యము కాదు. లింగజ్ఞానము లేకపోయినను, తత్ప్రతీతి గల్గుచున్నందున, ననుమానగమ్యముఁగూడ కాదు. ఈ సాదృశ్యము పదార్థాంతరము. నిర్గుణ మగుటవలన ద్రవ్యము కాదు. గుణాదుల యందును నుండున దగుటంజేసి గుణముగాని కర్మగాని గానేరదు. సత్ప్రతియోగిక మగుటచే జాతియు గాదు. ప్రత్యక్ష మగుటవలన, విశేష సమవాయరూపము కాదు. భావముగా ప్రతీయమాన మగుటచే నభావరూపమును గాదు. సప్త పదార్థాతిరిక్తమును, ప్రత్యక్షానుమానములకు గోచరము గానిదియు నగు సాదృశ్య ముపమానైకవిషయ మగుటం జేసి యుపమాన మనుమానముకంటె విలక్షణప్రమాణమగు నని యాశంకింపవలదని భావము జెప్పునది.

మూ. న హి భావాభావాభావాభ్యామన్యః ప్రకారః సమ్భావనీయః, పరస్పరవిధినిషేధరూపత్వాత్. న భావ ఇతి నిషేధమాత్రేణైవాభావవిధిః, తత స్తం విహాయ కథం స్వవచనేనైవ పునః సమ్భాదయో నిషేధేన్నాభావ ఇతి. ఏవం నాభావ ఇతి నిషేధ ఏవ భావవిధిః. తత స్తం విహాయ స్వవాచైవానున్మత్తః కథం పునర్నిషేధేన్న భావ ఇతి. అతఏవసమ్భాతానామేకతాప్య

శక్యప్రతిపత్తిః. ప్రతిషేధవిధ్యోరేకత్రాసమ్భవాత్. తస్మాద్భావాభావావేవ తత్త్వం.

అర్థ. భావాభావములకంటె నితరమగుప్రకారము నూహించుటకు వలనుపడదు. భావ మభావనిషేధరూపము. అభావము, భావనిషేధరూపము. "న భావః" యను నిషేధముచే, నభావము విధింపఁబడుచున్నది. ఈరీతి నభావమును విధించు సహృదయుఁడు, "నాభావః" అని యభావనిషేధము నెట్లు జేయఁగల్గును ? ఇట్లే—"నాభావః" అను నభావనిషేధముచే భావమును విధించెననున్మత్తుఁడు మఱల "నభావః" అని భావనిషేధము నెట్లు జేయగల్గును? విధివిషయమునకును, నిషేధవిషయమునకును నైక్యము సంభవింపదు. ఒకేస్థలమున విధిప్రతిషేధములు రెండును సంభవింపవు. కాఁబట్టి, భావము నభావముఁ దప్ప వేఱొండుపదార్థము లేదు.

మూ. భావత్వేపి గుణవన్నిర్గుణం వేతి ద్వయమేవ పూర్వవత్. పూర్వం ద్రవ్యమేవ. ఉత్తరఞ్చాశ్రితమనాశ్రితం వేతి ద్వయమేవ, పూర్వవత్. తత్రోత్తరం సమవాయఏవ, అనవస్థాభయాత్. ఆశ్రితస్తు సామాన్యవన్నిస్సామాన్యం చేతి పూర్వవత్ ద్వయమేవ. తత్ర ప్రథమమపి స్పందోఽస్పందఇతి ద్వయమేవ. ఏతచ్చ యథాసఙ్ఖ్యం కర్మగుణఇతి వ్యపదిశ్యతే. నిస్సామాన్యం నిర్గుణమాశ్రితన్త్వేకాశ్రితమనేకాశ్రితం వేతి

ప్రాగివ ద్వయమేవ. ఏతదపి యథాసఙ్ఖ్యం విశేషః సామాన్యం చేత్యభిధీయతే.

తా. ఈభావము సగుణమనియు నిర్గుణమనియు రెండు విధములు. ఇందు సగుణము ద్రవ్యము. నిర్గుణము ఆశ్రితమనియు ననాశ్రితమనియు రెండువిధము లగుచున్నది. అనాశ్రితనిర్గుణము (అనవస్థాభయమున) సమవాయము. ఆశ్రితనిర్గుణము ససామాన్యము, నిస్సామాన్యము నను భేదమున రెండుతెరంగు లగుచున్నయది. అందు మొదటిది, స్పందము నస్పందము నని రెండువిధములు. స్పందము కర్మ యనియు నస్పందము గుణమనియుఁ జెప్పఁబడుచున్నది. నిస్సామాన్యమగు నిర్గుణాశ్రిత మేకాశ్రితమనియు ననేకాశ్రితమనియు రెండువిధములు. ఇందు మొదటిది విశేషము. రెండవది సామాన్యము.

మూ. తదేతత్సాదృశ్యమేతాస్వేకాం విధామాసాదయన్నాతిరిచ్యతే.అనాసాదయ న్నపదార్థీభూయ స్థాతుముత్సహతే. ఏతేన శక్తిసఙ్ఖ్యాదయో వ్యాఖ్యాతాః. తతోఽభావేన సహ సప్తైవ పదార్థా ఇతి నియమః. అతో నోపమానవిషయోఽర్థాన్తరమితి.

తా. సాదృశ్యము పైనఁ జెప్పఁబడినపదార్థము లేడింటిలోను, ఏ యొకదానియందైన నంతర్భావము నొందవచ్చును. గాన నతిరిక్తపదార్థము గానేరదు. అంతర్భావము నే బొందనిచో నయ్యది పదార్థమే గానేరదు. ఇట్లే శక్తియు సంఖ్యయు, పదార్థాంతరములు గావని దెలియ

నగును. అభావముతో నేడే పదార్థములు. కాఁబట్టి, యుపమానైకవిషయముగా నెంచఁబడిన సాదృశ్యము పదార్థాంతరము కాకుండుటం జేసి, యుపమాన మనుమానముకంటె విలక్షణము గానేరదు.

మూ. స్యాదేతత్. భవతు సామాన్యమేవ సాదృశ్యం, తదేవ తస్య విషయః స్యాత్. తత్సదృశోయమితి హి ప్రత్యయో నేన్ద్రియజన్యః, తదా పాతమాత్రేణానుత్పత్తే రితి చేన్న. పూర్వపిండానుసన్ధానరూపసహకారివైధుర్యేణానుత్పత్తేః, సోయమితి ప్రత్యభిజ్ఞానవదితి.

తా. సప్తపదార్థాతిరిక్తమగు నుపమానవిషయమైన సాదృశ్యము లేకపోయినను, సాదృశ్యము జాతిరూపము. ఇదియే ఉపమానవిషయము. "తత్సదృశోయం" అనెడు ప్రతీతి ఇంద్రియపాతమాత్రమునఁ గలుగనందున ప్రత్యక్షవిషయము గాదు. ఇట్టి సాదృశ్యమే ఉపమానమునకు విషయమని జరన్మీమాంసకు లందురు. అది సమంజసము గాదు. తత్సాదృశ్యమనఁగా, తద్భిన్నత్వేసతి తద్గత భూయోధర్మవత్త్వము. (దానికంటె వేఱగుచు,దానియందుండు పెక్కుధర్మములు గల్గియుండుట.) అందు, తద్భిన్నత్వప్రతీతి, పూర్వపిండరూప ప్రతియోగి జ్ఞానాధీనము.ఇట్టి ప్రతియోగి జ్ఞానరూపమగు సహకారి లేనందున,తజ్ఞానము లేనిచో"సోయ"మనెడు ప్రత్యభిజ్ఞ గలుగనట్లు పూర్వపిండరూప ప్రతియోగిస్మరణ లేనపుడు, ఇంద్రియపాతమాత్రమున, "తత్సదృశోయ" మనెడు ప్రతీతి గలుగదు గాని ప్రత్యక్షాదివిషయము గాదని నిషేధించరాదు.

మూ. నన్వేతత్సదృశః స ఇతి నేన్ద్రియజన్యమ్, తేన తస్యాసంబన్ధాత్. న చేదం స్మరణమ్, తత్పిణ్డానుభవేపి విశిష్టస్యాననుభవాత్. న చైతదపి అయం స ఇతి విపరీత ప్రత్యభిజ్ఞానవదుపపాదనీయం, తత్రేదన్తోపస్థాపనక్రమవిపర్యయేపి విశేష్యస్యేన్ద్రియేణసన్నికర్షావిరోధాత్, తస్య సన్నిహిత వర్తమానగోచరత్వాత్, ప్రకృతే తు తదభావాత్. తస్మాత్, తత్పిణ్డస్మరణసహాయమేతత్పిణ్డవర్తి సాదృశ్యజ్ఞానమేవ తథావిధం జ్ఞానముత్పాదయ దుపమానం ప్రమాణమితి. ఏతదపినాస్తి.

తా. సాదృశ్యజ్ఞానమాత్ర ముపమానఫలము గాక పోయినను, గోనిష్ఠగవయ సాదృశ్యజ్ఞానమే "గోసదృశో గవయః" అను నుపమానమునకు ఫలము. తత్కారణ మగుటం జేసి, యుపమానమునకు పృథక్ప్రామాణ్యము సిద్ధించును. పూర్వము తత్పిండానుభవ మున్నను, విశిష్టానుభవము లేనందున, "ఏతత్సదృశః సః," "గవయసదృశీ గౌః" అనునది. స్మృతిరూపమనుటకు వీలులేదు. "అయం సః" అను విపరీతప్రత్యభిజ్ఞవలె దీని నుపపాదించుటకు వీలు లేదు. ఆ ప్రత్యభిజ్ఞాస్థలమందు తత్త్వేదన్త్వోపస్థాపక క్రమవైపరీత్య మున్నను విశేష్య మొకటే అయినందున, ఇంద్రియ సన్నికృష్టము. ఇంద్రియ మపుడుండువస్తువునే గ్రహించును. గాన "అయం సః" అను ప్రత్యభిజ్ఞ ప్రత్యక్షరూపము గావ

చ్చును గాని, "ఏతత్సదృశః సః" అనుజ్ఞానమున విశేష్యమైన గోవు సన్నిధానమున లేనందున ఇంద్రియసన్నికృష్టము గాదు. కాఁబట్టి ఈజ్ఞానము ప్రత్యక్షరూపము గాదు. గోస్మరణ ముతో గూడియున్న "గోసదృశో గవయః" అను జ్ఞానము వలన "గవయ సదృశీగౌః" అనుజ్ఞానము గల్గును. దీనికి కరణమగు "గోసదృశో గవయః" అనునదియే ఉపమానమని యాశంకింపవలదు.

శ్లో. సాధర్మ్యమివ వైధర్మ్యం మానమేవం ప్రసజ్యతే,
అర్థాపత్తిరసౌ వ్యక్తమితి చేత్ప్రాకృతం న కిం? ౯

మూ. యదా హి ఏతద్విసదృశోఽసావితి ప్రత్యేతి తత్రాపి తుల్యమేతత్. న హి తత్ప్రత్యక్షమ సన్నికృష్టవిషయత్వాత్. న స్మరణమ్, విశిష్టస్యా ననుభవాత్. నోపమానమసాదృశ్యవిషయ త్వాత్. నన్వేతద్ధర్మాభావవిశిష్టత్వమేవ తస్య వైధర్మ్యం, తచ్చాభావగమ్యమేవేష్యతే. న చ ప్రకృతేఽపి తథాఽస్తు,సాదృశ్యస్య భావరూప త్వాదితి చేన్న. ఇతో వ్యావృత్తధర్మవిశిష్ట తాయా అపి వైధర్మ్యరూపత్వాత్, తస్య చ భావరూపత్వాత్.

తా. "ఏతత్సదృశః సః"అను జ్ఞానమునకుఁ గరణముగా నుపమానరూపప్రమాణము నంగీకరించినచో "ఏతద్వైధర్మ్యా సః" అను జ్ఞానమునకుఁగూడ, వేరొకజ్ఞానమును, కరణముగా

నంగీకరింపవలసి వచ్చెడిని. "ఏతద్వైసదృశః సః"అను జ్ఞానమందలి విశేష్య మసన్నికృష్ట మగుటవలన, నది యింద్రియజన్య మనుటకు వలనుపడదు. విశిష్టానుభవము పూర్వమున లేనందున, స్మరణ మనుటకును వీలులేదు. సాదృశ్యము విషయము కాకుండుటం జేసి, యుపమితి యనుటయు సరిగాదు. గోవునం దుండు కరభ (గాడిద) వైధర్మ్యమనఁగా, కరభమునం దుండు ధర్మముయొక్క యభావమే. ఇట్టి యభావజ్ఞాన మనుపలబ్ధి రూపప్రమాణముచే గలుగును. "ఏతత్సదృశః సః" అను జ్ఞానము సాదృశ్యవిషయకము. సాదృశ్యము భావరూపము. గాన నిది యనుపలబ్ధివలనఁ గలుగదు. గాన ప్రమాణాంతరము నంగీకరింపవలసిన బనిలేదని యనరాదు. తద్వైధర్మ్యము తదవృత్తి ధర్మరూపము. ఇయ్యది భావము. కాఁబట్టి "ఏతద్వైసదృశః సః" అను జ్ఞానమునకుఁ గూడ వేరొకజ్ఞానమును గరణముగా నంగీకరింపవలసివచ్చెడిని.

మూ. స్యాదేతత్. తద్ధర్మా ఇహ న సన్తీత్యవగతే, అర్థాదాపద్యతే ఇహాఽవిద్యమానా స్తత్ర సన్తీతి. న హి తద్వైధర్మ్యమేతస్యోపపద్యతే, యద్యేతద్వైధర్మాఽసౌ న భవతీతి చేత్. ఏవం తర్హి ప్రకృతమప్యర్థాపత్తిరేవ. న హి తత్సాదృశ్యవిశిష్టత్వమేతస్య ప్రత్యక్షసిద్ధమపి తస్యైతత్సాదృశ్యవిశిష్టత్వం వినోపపద్యతే.

తా. "కరభవిసదృశీగౌః" అనునది యర్థాపత్తివలన సంభవించును. ఎట్లన, "గోవునందుండు ధర్మములు గాడిద యందు లేవ"నుజ్ఞానము కల్గినపిదప అర్థాత్తూ గోవు గాడిద

యందు లేనిధర్మములు గలదని తెలియఁబడును. అనఁగా "యద్యేతద్విధర్మాఽసౌ న భవతి, తద్విధర్మత్వ మేవతస్య నోపపద్యతే" అను నర్థాపత్తివలన గోవునందు కరభావృత్తి ధర్మవత్త్వము తెలియఁబడును. కాఁబట్టి ప్రమాణాంతరము నంగీకరింపఁ బనిలేదనినచో ప్రకృతమునఁగూడ "గోవునందు గవయసాదృశ్యము లేక, గవయమునందు గోసాదృశ్య ముప పన్నము గాదు" అను నర్థాపత్తివలననే గోనిష్ఠ గవయసాదృశ్యజ్ఞానము గల్గుచుండఁగా ఉపమానప్రమాణమునకు విలోపమే వచ్చును.

మూ. ఏతేన, దృష్టాసన్నికృష్టప్రత్యభిజ్ఞానం వ్యాఖ్యాతం. తత్రాపి తద్ధర్మశాలిత్వం తస్య స్మరణాభివ్యక్త మనుపపద్యమానం తదిదన్త్వాస్పదస్యైకతాం వ్యవస్థాపయతి. తస్మాన్నోపమానమధికమితి.

తా. ప్రత్యభిజ్ఞాస్థలమందు పూర్వాపరములవలె మధ్యసత్త్వము ఇంద్రియగమ్యము గాదు. లింగజ్ఞానము లేకపోయినను మధ్యసత్త్వము గృహీతమగుటవలన లింగజన్యమును గాదు. మధ్యసత్త్వజ్ఞానమే యుపమానఫలమని యాశంకించుటకు వీలులేదు. సాధర్మ్య వైధర్మ్యములవలె మధ్యసత్త్వముఁ గూడ నర్థాపత్తిగమ్యము. "పూర్వాపరవ్యక్తులకు మధ్యసత్త్వము లేనిచో నైక్య మనుపపన్నము" అను నర్థాపత్తివలననే మధ్యసత్త్వము సిద్ధించును. గాన నుపమానఫలము లేనందున, నుపమానము ప్రమాణాంతరము గాదు.

మూ. ఏవం ప్రాప్తే అభిధీయతే:—

శ్లో. సమ్బన్ధస్యపరిచ్ఛేదః సంజ్ఞాయాః సంజ్ఞినా సహ,
ప్రత్యక్షాదేరసాధ్యత్వాదుపమానఫలం విదుః. ౧౦

పై పూర్వపక్షము నిరాకరింపఁబడుచున్నది:—

తా. సంజ్ఞ యనఁగా పదము. సంజ్ఞి యనఁగా నర్థము. వీనికిఁ గలసంబంధము వాచ్యవాచకభావము. దీనియొక్క పరిచ్ఛేదమనఁగా జ్ఞానము. ఇయ్యది ప్రత్యక్షాది ప్రమాణసాధ్యము కాదు. కాఁబట్టి దీని నుపమానఫలమని దెలిసికొనుడు.

మూ. యథా గౌస్తథా గవయ ఇతి శ్రుతాతిదేశవాక్యస్య గోసదృశం పిణ్డమనుభవతః స్మరతశ్చ వాక్యార్థ మయమసౌ గవయశబ్దవాచ్య ఇతి భవతి మతిః. సేయం న తావత్ వాక్యమాత్రఫలం, అనుపలబ్ధపిణ్డస్యాపి ప్రసఙ్గాత్. నాపి ప్రత్యక్షఫలం, అశ్రుతవాక్యస్యాపి ప్రసఙ్గాత్. నాపి సమాహారఫలం, వాక్యప్రత్యక్షయో ర్భిన్నకాలత్వాత్. వాక్యతదర్థయోః స్మృతిద్వారోపనీతావపి గవయపిణ్డసమ్బన్ధేనాపీన్ద్రియేణ తద్గతసాదృశ్యానుపలమ్భే సమయపరిచ్ఛేదాసిద్ధేః.

తా. గవయశబ్దమున కర్థ మెఱుంగనివాఁడు, తొలుత "యథాగౌస్తథాగవయః" అను నారణ్యకుని వాక్యమును విని, దానంగల్గు శాబ్దజ్ఞానమున నగు సంస్కారము నొందును. పిమ్మట గవయ మృగమును జూచినతోడనే "యథాగౌస్తథా

గవయః" అను నతిదేశవాక్యార్థమును స్మరించును. పిదప "గవయోగవయ పదవాచ్యః" అను నుపమితి గలవాఁడగును. (గవయము గవయశబ్దమున కర్థమని దెలిసికొనును.) ఇదియే ఉపమానఫలము. ఇయ్యది, గవయపిండమును జూడనివానికిఁ గలుగమిం జేసి, వాక్యఫల మనుటకు వలనుపడదు. వాక్య శ్రవణము లేనివానికిఁ గలుగనందున, ప్రత్యక్ష ఫలమను టయు సరిపడదు. వాక్యప్రత్యక్షములు విభిన్న కాలికము లగుటం జేసి, వాక్యప్రత్యక్షముల రెండింటికిని(ప్రమాణసమా హారమునకు) ఫలమని జెప్పుటకును వీలుకాదు. గవయ మింద్రియసంబద్ధ మగునపుడు, వాక్యతదర్థములు స్మృతము లయినను, గవయమందుండు గోసాదృశ్యము జ్ఞాతమయిననే గాని,ప్రమాణసమాహారమున "గవయోగవయ పదవాచ్యః" అను నుపమితి గలుగనేరదు.

మూ. ఫలసమాహారే తు తదన్తర్భావే అనుమానా
దేరపి ప్రత్యక్షత్వప్రసఙ్గః. తత్ కిం తత్ఫలస్య
తత్ప్రమాణబహిర్భావ ఏవ? అన్తర్భావే వా
కియతీ సీమా? తత్తదసాధారణేన్ద్రియాదిసా
హిత్యం, అస్తి తర్హి సాదృశ్యాదిజ్ఞానకాలే
విస్ఫారితస్య చక్షుషో వ్యాపారః. న.

తా. వాక్యముయొక్కయుఁ బ్రత్యక్షముయొక్కయు ఫలములకు సమాహార మున్నందున, ప్రత్యక్షాంతర్భావము జెప్పిన, ప్రత్యక్షఫలమగు లింగపరామర్శము అనుమితికరణ మగుటం జేసి, ప్రత్యక్షానుమానఫలములకును సమాహార మున్నందున ననుమానమునకునుఁ బ్రత్యక్షత్వము ప్రసక్త

మగును. మఱియు, ప్రత్యక్షఫలమునకుఁ బ్రత్యక్షబహిర్భా వమా? లేక తదన్తర్భావమా? అన్తర్భావమన్న నెంతవఱకు? తద్బహిర్భావ మనిన, నింద్రియపాతమున గల్గు నాలోచనము నకు (నిర్వికల్పమునకు) ఫలమైన సవికల్పకజ్ఞానమునకునుఁ బ్రత్యక్షబహిర్భావము ప్రసక్తమగును. తదంతర్భావ మనిన, సాదృశ్యజ్ఞానకాలమున నసాధారణకారణమగు నింద్రియవ్యా పార ముండును గాన "గవయో గవయ పదవాచ్యః" అను నదిగూడ ప్రత్యక్షమే యగునని యాశంకింపవలదు.

మూ. ఉపలబ్ధగోసాదృశ్యవిశిష్టగవయపిండస్య వాక్య తదర్థస్మృతిమతః కాలాన్తరేప్యనుసన్ధానబలా త్సమయపరిచ్ఛేదోపపత్తేః.

తా. గోసదృశమైన గవయముయొక్క ప్రత్యక్షా నంతరము "యథాగౌస్తథా గవయః" అను వాక్యము యొక్కయు, తదర్థము యొక్కయు, స్మరణానంతరమున నింద్రియవ్యాపారము లేకపోయినను సమయపరిచ్ఛేదము ("గవయోగవయ పదవాచ్యః" అను నుపమితి) గలుగు చున్నది. కాఁబట్టి దీనికిఁ గరణమగు సాదృశ్యజ్ఞానము ప్రమా ణాంతరము. ఇదియే ఉపమానప్రమాణము.

మూ. నను చ వాక్యాదేవానేన సమయః పరిచ్ఛిన్నః, గోసదృశస్య గవయశబ్దస్సంజ్ఞేతి. కేవలమిదానీం ప్రత్యభిజానాత్యయమసావితి. ప్రయోగాద్వాఽ నుమితః, యో యత్రాసతి వృత్త్యన్తరే వృద్ధైః ప్రయుజ్యతే స తస్య వాచకో యథా గోశబ్ద

ఏవ గోః, ప్రయుజ్యతే చాయం గోసదృశే, ఇతి
కిముపమానేనేతి. న.

శ్లో. సాదృశ్యస్యానిమిత్తత్వాన్నిమిత్తస్యాప్రతీతితః,
సమయో దుర్గ్రహః పూర్వాంశభేదేనానుమయాపివా.౧౧

తా. "వాక్యమువలనగాని, యనుమానమువలనగాని సమయము సిద్ధించును గాన ఉపమానము ప్రమాణాంతరము గాదు" అని మరల వైశేషికుఁడు,నన్విత్యాదిగ్రంథముచే నాశంకించుచున్నాఁడు. ఎటులన:—"గోసదృశో గవయ పద వాచ్యః"అను వాక్యమునలన, "గోసాదృశ్య విశిష్టగవయము గవయశబ్దవాచ్య" మనెడుజ్ఞానముఁ గలుగును. గవయదర్శన కాలమున, గోసాదృశ్య విశిష్టమగు నేవ్యక్తి, వాక్యశ్రవణ సమనంతరము, గవయపదవాచ్యముగా నవగత మయ్యెనో, అట్టిదానిని, సాక్షాత్కరించుచుంటినను ప్రత్యభిజ్ఞ కలవాఁడై యున్నాఁడు. కాఁబట్టి పూర్వోదాహృతవాక్యమువలన, శక్తిజ్ఞానము సంభవించుచున్నది. ఇట్లే యనుమానమువలనను సంభవించును. "గవయత్వ విశిష్టోధర్మీ, గవయశబ్దవాచ్యః, గోసదృశత్వాత్"అని యనుమానప్రయోగము. విశేషవ్యాప్తి యందు దృష్టాంతము దుర్లభము. గావున, నేశబ్దము వృత్త్యంతరము లేనపుడు వృద్ధులచే నెక్కడ ప్రయోగింపఁబడునో, ఆశబ్దము దానికి వాచకమను సామాన్యవ్యాప్తి, గోశబ్దము వృత్త్యంతము లేనిసమయమున, గోత్వజాతి విశిష్టమందు పెద్దలచే ప్రయోగింపఁ బడుచున్నందున, గోత్వవిశిష్టవాచకము గోశబ్దము అగుచున్నరీతిగా గవయశబ్దము, గోసాదృశ్య

విశిష్టమందు ప్రయోగింపఁ బడుచున్నందున, వాచకతా ప్రతీతి యనుమానమువలనను గల్గుచుండఁగా నుపమానమునకు ప్రమాణాంతరత్వ మెందుకనెడు యాశంకకు సమాధానము. గవయశబ్దమునకు, గోసాదృశ్యము శక్యతావచ్ఛేదకము కానందునను, శక్యతావచ్ఛేదకమైన గవయత్వము ప్రతీతము గానందునను, శబ్దమువలనగాని, యనుమానమువలనగాని, "గవయత్వ శక్యతావచ్ఛేదకక పదవాచ్యోఽయ" మ్మను ప్రతీతి గలుగ నేరదని యర్థము.

మూ. న హి గవయశబ్దస్య సాదృశ్యం ప్రవృత్తి నిమిత్తమ్, అప్రతీతగూనామవ్యవహారప్రసఙ్గాత్. న చోభయమపి నిమిత్తం, స్వయం ప్రతీతసమయసంక్రాన్తయేఽతిదేశవాక్యప్రయోగా నుపపత్తేః. గవయత్వే హ్యాయం వ్యుత్పన్నో వృద్ధవ్యవహారా న్న సాదృశ్యే.కథ మేతన్నిర్ధారణీయమితి చేత్. వస్తుగతిస్తావదియం, తదాపాతతః సన్దేహేఽపి న ఫలసిద్ధిః. గన్ధవత్త్వమివ పృథివీత్వస్య, గోసాదృశ్యం గవయశబ్దప్రవృత్తినిమిత్తస్యోపలక్షణ మిద మేవ వానిమిత్తమిత్యనిర్ధారణాత్.

తా. గవయత్వము జాతి యగుటంజేసి లఘు వగుచున్నది. గోసాదృశ్య ముపాధి యగుటంజేసి, గురు వగుచున్నది. కాఁబట్టి గోసాదృశ్యము గవయశబ్దశక్యతావచ్ఛేదకము గా నేరదు. సాదృశ్యమాత్ర మే శక్యతావచ్ఛేదక

మన్న చో, గోసాదృశ్య జ్ఞానశూన్యుఁడు, గవయశబ్దమును వ్యవహరింపక పోవలసివచ్చెడిని. గవయత్వజాతి, సాదృశ్యము అను నీరెండును, శక్యతావచ్ఛేదక మనిన, గవయత్వజాతి విశిష్టమందు, గవయశబ్ద శక్తిజ్ఞానముగల యారణ్యకుఁడు, పరునకుఁగూడ నట్టిశక్తిజ్ఞానముఁ గలుగఁజేయుటకై గవయపద ప్రయోగమును జేయకపోవలసి వచ్చెడిని. గవయశబ్దమునకు, గవయత్వజాతి విశిష్టమందే శక్తిగృహీత మైనది, సాదృశ్య విశిష్టమం దగృహీత మనెడువిషయము నీకెట్లు బోధపడిన దందువా! లాఘవజ్ఞానరూప తర్కసహకారమున, గృహీత మైనది. కాఁబట్టి గోసాదృశ్యము గవయ పదప్రవృత్తి నిమిత్తము కానేరదు. గంధవత్త్వము, పృథివీపద శక్యతావచ్ఛేదకమం దుపలక్షణమా? లేక, పృథివీపద శక్యతావచ్ఛేదకమా? యనుసందేహ ముండునెడల పృథివీపద శక్తినిశ్చయముఁ గలుగనట్లు, గవయపదశక్యతావచ్ఛేదకమునకు సాదృశ్య ముపలక్షణమా? లేక సాదృశ్యమే శక్యతావచ్ఛేదకమా? యనుసందేహ మున్నపుడు, గవయశబ్దశక్తినిశ్చయమును కలుగదు. కావున లాఘవజ్ఞానరూపతర్కముచే గవయత్వ మందు శక్యతావచ్ఛేదకత్వగ్రహము గల్గినపిదప సందేహము నకు ప్రసంగమే లేనందున, గవయపదశక్తినిశ్చయము గలుగుటలో నేమియు సందియము లేదు.

మూ. స్యాదేతత్. పూర్వం నిమిత్తానుపలబ్ధేర్న ఫలసిద్ధి రిదానీం తు తస్మిన్నుపలబ్ధే తదేవ వాక్యం స్మృతిసమారూఢం ఫలిష్యతి, అధ్యయనసమయ గృహీత ఇవ వేదరాశి రంగోపాఙ్గపర్యవదాతస్య

కాలాన్తరే. న చ వాచ్యం, వాక్యేన స్వార్థస్య ప్రాగేవ బోధితత్వాత్ ప్రాగేవ పర్యవసితమితి. గోసాదృశ్యస్యోపలక్షణనిమిత్తత్వయో రన్యతరత్ర తాత్పర్య్య సన్దేహాత్. ఇదానీం తు గవయత్వే అవగతే తర్కపురస్కారాత్సాదృశ్యస్యోపలక్షణతాయాం వ్యవస్థితాయాం, గంగాయాం ఘోష ఇతివ దన్వయప్రతిపత్తిరితి చేత్, న.

తా. గవయపిండదర్శనముకంటె పూర్వమునఁ బ్రవృత్తినిమిత్తమైన గవయత్వము ప్రత్యక్షము కానందున, వాక్యమువలన శక్తిజ్ఞానము గలుగకపోయినను, పిండదర్శనానంతరమున, అంగోపాంగజ్ఞానము గలవాని కధ్యయన సమయమున స్మృతమైన వేదరాశి యెట్లు స్వార్థబోధక మగునో అట్లే, స్మృతమైన "గోసదృశో గవయపదవాచ్యః" అను వాక్యమువలననే, శక్తిజ్ఞానము గలుగును. కాఁబట్టి యుపమానము ప్రమాణాంతరము గాదు. అని మఱల వైశేషికుఁ డాశంకించుచున్నాఁడు. గవయపిండదర్శనముకంటె పూర్వమున నేవాక్యము స్వార్థమును బోధించెనో, ఆవాక్యమే మరల స్వార్థము నెట్లు బోధింపఁ గల్గునని యాశంకింపరాదు. పిండదర్శనముకంటె పూర్వమున, "గోసాదృశ్య ముపలక్షణమా! ఇదే గవయపదశక్యతావచ్ఛేదకమా" యనుటలో తాత్పర్యసందేహ మున్నందున, దర్శనముకంటె పూర్వమున, వాక్యమువలన శక్తినిశ్చయము గలుగదు. దర్శనానంతరము, గవయత్వజాతి లఘువను లాఘవజ్ఞానరూప తర్కసహకార

ముచే గవయత్వమునకు శక్యతావచ్ఛేదకత్వనిశ్చయము గలిగినపిదప, పూర్వోదాహృతవాక్యమున నున్న గోసదృశపదము, లక్షణచే గవయత్వవిశిష్టమును బోధించును. ఈరీతిని పూర్వోక్తవాక్యమువలననే శక్తిజ్ఞానముఁ గల్గుచుండఁగా నుపమానము ప్రమాణాంతరము గాదని యాశంకింపరాదు.

శ్లో. శ్రుతాన్వయాదనాకాంక్షం న వాక్యం హ్యన్యదిచ్ఛతి,
పదార్థాన్వయవైధుర్యాత్తదాక్షిప్తేన సఙ్గతిః. ౧౨

మూ. గోసదృశో గవయపదవాచ్య ఇతి సామానాధికరణ్యమాత్రేణాన్వయోపపత్తౌ విశేషసన్దేహేపి వాక్యస్య పర్యవసితత్వేన మానాన్తరోపనీతానపేక్షణాత్. రక్తారక్తసన్దేహేపి ఘటో భవతీతి వాక్యవత్. అన్యథా వాక్యభేదదోషాత్.

తా. రక్తత్వారక్తత్వ సందేహమున్నను, ఘటోభవతి యను వాక్యమువలన నెట్లు వాచ్యార్థబోధ గల్గుచున్నదో, అట్లే ఉపలక్షణత్వ నిమిత్తత్వాది సందేహమున్నను, "గోసదృశోగవయపదవాచ్యః" అను వాక్యమువలన, సామానాధికరణ్యేన వాచ్యార్థాన్వయబోధ గల్గుచున్నందున, వాక్యము వాచ్యార్థముకంటె భిన్నమగు లక్ష్యార్థము నపేక్షింపదు. ఎచ్చట వాచ్యార్థముల కన్వయము సంభవించదో, నచ్చటనే లక్షణాస్వీకార మావశ్యకము. వాచ్యార్థాన్వయబోధ గల్గిన పిమ్మట లక్ష్యార్థాన్వయబోధ గల్గునన్నచో వాక్యభేదము

ప్రసక్తమగును. మానాంతరమును (ప్రత్యక్షమును) అపేక్షింపకనే వాక్యము, వాచ్యార్థాన్వయబోధను గల్గించును.

మూ. న చ గంగాయాం ఘోష ఇతివత్పదార్థావేవా
న్వయాయోగ్యౌ, యేన ప్రమాణాన్తరోపనీతే
నాన్వయస్స్యాత్.

తా. "గంగాయాంఘోషః" అనుస్థలమున, వాచ్యార్థాన్వయమున కనుపపత్తి యుండుటం జేసి, లక్షణ నంగీకరించినను, ప్రకృతమున వాచ్యార్థాన్వయమున కనుపపత్తి లేమింజేసి, గోసదృశపదమునకు, ప్రత్యక్షసిద్ధ గవయత్వవిశిష్టమందు, లక్షణ నంగీకరించుట యనావశ్యకము.

మూ. ప్రతీతవాక్యార్థబలాయాతోఽప్యర్థోయది వాక్య
స్యైవ, దివాభోజననిషేధవాక్యస్యాపి రాత్రి
భోజనమర్థస్స్యాత్. తస్మాద్యథా గవయశబ్దః
క్వచిద్వాచకః శిష్టప్రయోగాదితి సామా
న్యతో నిశ్చితేపి, విశేషే మానాన్తరాపేక్షా,
తథా గోసదృశస్య గవయశబ్దో వాచక ఇతి
వాక్యాన్నిశ్చితేపి సామాన్యే విశేషవాచకత్వే
ఽస్య మానాన్తరమనుసరణీయమితి.

తా. వాక్యమువలన ప్రతీత్యనిర్వాహము లేకపోయినను, వాక్యమందలి గోసదృశపదమునకు, గవయత్వ విశిష్టార్థకత్వము లేక, వాక్యమువలన, గవయత్వవిశిష్టమందు గవయపదవాచ్యత్వము సిద్ధింపనందున, గోసదృశపదమునకు గవయత్వవిశిష్టమే యర్థమని జెప్పినచో, నీరీతిని "దేవదత్తో దివా న

భుఙ్క్తే" యను వాక్యమందలి దివాభోజనపదమునకును, రాత్రిభోజన మర్థము కావలసివచ్చెడిని. గవయశబ్దము శిష్టులచే ప్రయోగింపఁబడుటచే, కించిద్ధర్మావచ్ఛిన్నవాచక మగుచున్నదని సామాన్యముగా దెలియఁబడినను, గవయత్వ విశిష్ట వాచకత్వవిశేషసిద్ధికై మానాంతరము నెట్లపేక్షింపవలయునో, అట్లే "గోసదృశో గవయశబ్దవాచ్యః" అనువాక్యమున సామాన్యసిద్ధి గల్గినను, "గవయో గవయపదవాచ్యః" అను విశేషసిద్ధికై మానాంతరము నపేక్షింపవలయును. అదియే యుపమానము.

మూ. అస్త్వనుమానం. తథా హి, గవయశబ్దో గవయస్య వాచకః అసతి వృత్త్యన్తరేఽభియుక్తైస్తత్ర ప్రయుజ్యమానత్వాత్, గవి గోశబ్దవదితి చేన్న. అసిద్ధేః. న హ్యసతి వృత్త్యన్తరే తద్విషయతయా ప్రయోగః సంగతిమవిజ్ఞాయ జ్ఞాతుం శక్యతే.

తా. కేవల వాక్యమువలన నుపమితి గలుగకపోయినను, శక్తిలక్షణాది వృత్త్యంతరము లేనపుడు ఏశబ్దము నేయర్థమున పండితులు ప్రయోగించెదరో ఆశబ్ద మాయర్థమునకు వాచకము. "అభియుక్తులు గోరూపార్థమున, గోశబ్దమును ప్రయోగించినట్లు గవయరూపార్థమున గవయశబ్దమును ప్రయోగించిరి. కావున గవయశబ్దము గవయవాచకమగుచున్నద"ను ననుమానముననే, వాచకత్వజ్ఞానముఁ గల్గుచున్నది. కాఁబట్టి యట్టి జ్ఞానమునకు కరణమునుగా నుపమానమను నొక ప్రమాణమును స్వీకరించుట సమంజసముగాదని

యాశంకింపవలదు. వృత్త్యంతరమే లేనిచో గవయబోధక ముగా గవయశబ్దప్రయోగమే సంభవింపదు. కాబట్టి నీ వుదహరించిన యనుమానమున, "వృద్ధైస్తత్ర ప్రయుజ్యమానత్వాత్" అను హేతువు, పక్షమున లేమింజేసి, స్వరూపాసిద్ధమగుచున్నది.

మూ. సామానాధికరణ్యాదితి చేన్న. పిండమాత్రే సిద్ధసాధనాత్, నిమిత్తే చాసిద్ధేః, సాదృశ్యస్యానిమిత్త్వాత్వాదిత్యుక్తం.

తా. విధేయవాచకపదమున కుద్దేశ్యవాచకమయిన గవయపదముయొక్క సామానాధికరణ్యముండుటంజేసి, గవయత్వ విశిష్టవాచకత్వసిద్ధి యగునని యాశంకింపరాదు. గవయపద సామానాధికరణ్యము పిండసామానాధికరణ్యమునుబట్టి సిద్ధసాధనము వచ్చును. సాదృశ్యము గురువగుటం జేసి, శక్యతావచ్ఛేదకము గాదు. ప్రత్యక్షాద్యపేక్ష లేనిచో, గవయత్వరూప శక్యతావచ్ఛేదకసిద్ధి గాదు. కాబట్టి యనుమానము వలన గవయత్వవిశిష్టవాచకత్వము సిద్ధింపదు.

మూ. నను వ్యాప్తిపరమిదం వాక్యం స్యాత్, యో గోసదృశః స గవయపదార్థ ఇతి. తథా చ వాక్యాదవగతప్రతిబన్ధోఽనుమినుయాత్. అయమసౌ గవయః గోసదృశత్వాత్ అతిదేశవాక్యావగతపిండవదితి. న. విపర్యయాత్. న హి గోసదృశం బుద్ధ్వావారోప్యానేన పృష్టః

సకిం శబ్దవాచ్య ఇతి, కిన్తు సామాన్యతో గవయ
పదార్థమవగమ్య స కీదృగితి.తథా చ యద్యోగ
ప్రాథమ్యాభ్యాం తస్యైవ వ్యాప్యత్వం, తతః
కిం తేన? ప్రకృతానుపయోగాత్.

తా. "యోగోసదృశః సః గవయపదార్థః" అను వాక్యము, గోసాదృశ్యమందు, గవయపద వాచ్యత్వవ్యాప్తిని బోధించును. ఈవాక్యమున గల్గిన వ్యాప్తిజ్ఞానముఁ గలవాఁడు "ఇయ్యది అతిదేశవాక్యముచే నవగతమగు పిండము వలె గోసదృశ మగుటం జేసి, గవయము" అని యనుమే యించునని యాశంకింపరాదు. గోసదృశమును దెలిసికొని, గోసదృశ మేశబ్దమున కర్థమని యడుగలేదు. సామాన్యముగాఁ గవయపదార్థజ్ఞానము గలవాఁడై అయ్యదెట్టిదని యడిగెను కాఁబట్టి, వ్యాప్యమును బోధించు వాక్యము మొదట, యత్పదఘటితముగా ప్రయోగించును. కాఁబట్టి గవయపదార్థత్వము వ్యాప్యము. గోసాదృశ్యము వ్యాపకము. వెనుకటి యనుమానమున సాధ్యమైన గోసాదృశ్యమును, హేతువునుగాను, వ్యాప్యమయిన, గవయపదార్థమును సాధ్యమునుగాను ప్రయోగించినందున నియ్యది విపరీతానుమాన మగుచున్నది. దీనివలన ప్రకృతమున కేమియు నుపయోగము లేదు.

మూ. అథ కిం లక్షణకోఽసా వితి ప్రశ్నార్థః, తదా
వ్యతిరేకపరం స్యాత్, లక్షణస్య తథాభావాత్.
తథాచ, గోసదృశో గవయ ఇత్యస్యార్థో యో
గవయ ఇతి న వ్యవహ్రియతే నాసౌ గోసదృశ

ఇతి. ఏవం చ ప్రయో_క్తవ్యం, అయమసౌ గవయ ఇతి వ్యవహ_ర్తవ్యః గోసదృశత్వాత్ యస్తు న తథా నాసౌ గోసదృశః, యథా హ_స్తీ. న చ హస్త్యాదీనాం విపక్షత్వే ప్రమాణ మ_స్తి.సర్వాప్రయోగస్య దురవధారణత్వాత్, కతిపయవ్యవహారస్య చానై కా_న్తికత్వాత్.

తా. యత్పదయోగము లేకపోయినను "గన్ధవతీ పృథివీ" అనువాక్యము వ్యతిరేకి లక్షణపరము. ఈ వాక్యమువలన "నేది పృథివి గాదో అది గంధముగలది కాదను" నర్థము లభించును. ఈరీతిగానే 'గోసదృశోగవయః' అను వాక్యముఁగూడ వ్యతిరేకి లక్షణపరము. ఏది గవయమని వ్యవహరింపఁబడదో అది గోసదృశము గాదు. అట్టివస్తువు ఏనుగు అని చెప్పుటకుఁ గూడ వీలులేదు. "ఏనుఁగువలె నేది గవయమని వ్యవహరింపఁబడదో అది గోసదృశము గాదు." అనుట అందఱిచే వ్యవహరింపఁ బడకపోవుటయా? లేక కొందఱిచే వ్యవహరింపఁ బడకపోవుటయా? అందఱును తెలియఁబడనందున నందఱిచే వ్యవహరింపఁ బడకపోవుట యనునది దుర్ఘటము. కొందఱిచే ననఁగా మనదేశస్థులచే వ్యవహరింపఁబడకపోయినను, దేశాంతరమందు గవయశబ్దముచే వ్యవహరింపఁబడు యేనుగునందుకతిపయావ్యవహారము లేనందున, సాధ్యశూన్యమగు నేనుగునందు, గోసాదృశ్యాభావ రూపహేతు వుండుటవలన, వ్యభిచారి యగును. వ్యతిరేక్యనుమానము సరిగానందున, వ్యతిరేకి లక్షణపరమని జెప్పుట కవకాశము లేదు.

మూ. నను లింగమాత్రే ప్రశ్నో భవిష్యతి, కీదృక్. కిం లింగమితి. న, న హ్యానేన లింగమవిజ్ఞాయ గవయశబ్దస్య వాచకత్వం, కస్యచిద్వాచ్యత్వం వాఽవగతం, యేన తదర్థం ప్రశ్నః స్యాత్. ప్రవృత్తినిమిత్తవిశేషలింగే ప్రశ్నో; యేన నిమిత్తేన గవయశబ్దః ప్రవర్తతే, తస్య కిం లింగమితి చేన్న. న హి తదవశ్యమనుమేయమేవేత్యనేన నిశ్చితం, యత ఇదం స్యాత్. జ్ఞానోపాయమాత్రప్రశ్నే తద్విశేషేణోత్తరమితి చేన్న. అవిశేషాదిన్ద్రియసన్నికర్షమప్యుత్తరయేత్. పర్యాయాన్తరం వా, యథా, గవయమహం కథం జానీయామితి ప్రశ్నే, వనం గతో ద్రక్ష్యసీతి. యథా వా, కః పికఇత్యత్ర కోకిల ఇతి తస్మాన్నిమిత్తభేదప్రశ్న ఏవాయం గవయో గవయపదవాచ్యః కీదృక్ కేన నిమిత్తేనేతి యుక్తముత్పశ్యామః.

తా. గవయశబ్దార్థము ఎట్టిది ? ఎట్టిలింగము గలది ? అని ప్రశ్నించఁగా ఆరణ్యకుఁడు గోసదృశమని ఉత్తరము ఇచ్చెనని చెప్పుటకు వీలులేదు. లింగవిషయమైన ప్రశ్న అయినచో లింగము జ్ఞాతమా ? లేక అజ్ఞాతమా ? అజ్ఞాతమైనచో లింగజ్ఞానము లేనిచో గవయశబ్దమునకు, వాచకత్వము గవయశబ్దవాచ్యత్వముయొక్క జ్ఞానమే కల్గుట దుర్లభము. కాఁబట్టి లింగము జ్ఞాతమనియే చెప్పవలయును.

లింగము తెలియఁబడినప్పుడు లింగవిషయమైన ప్రశ్నయే సంభవించదు. ప్రవృత్తినిమిత్త మనుమేయమే గావలెనను నియమము లేనందున, యేధర్మమునుబట్టి గవయశబ్దము ప్రవర్తించునో అట్టి శక్యతావచ్ఛేదకము ఎట్టిలింగము గలది అని ప్రశ్నార్థ మనుటకు కూడ వీలులేదు. గవయపదప్రవృత్తినిమిత్తజ్ఞానోపాయ ప్రశ్నయనినచో, ఇంద్రియ సన్నికర్షముఁ గూడ జ్ఞానోపాయ మైనందున, గవయపదప్రవృత్తి నిమిత్తమేమి అనుప్రశ్నకు "ఇంద్రియసన్నికర్ష మ"నునది గూడనుత్తరము కావలసివచ్చును. "కః పికః" యను ప్రశ్నకు, "కోకిలః" అనునది యెట్లు ఉత్తరవాక్యమో, గవయమును నేనెట్లు దెలిసికొందు ననుదానికి, వనమునకు వెళ్లిన చూచెదవు అనుదానివలె, ఇంద్రియసన్నికర్షముకూడ జ్ఞానోపాయ మైనందున, "ఇంద్రియసన్నికర్షము" అనునది గూడ ఉత్తరము గావలసివచ్చును. కావున, గవయపదవాచ్యమైన, గవయము, యేనిమిత్తముచే నెట్టిది యని, ప్రవృత్తినిమిత్త విశేషప్రశ్నమే యనవలయును.

మూ. తస్య చ నిమిత్తవిశేషస్య సాక్షాదుపదర్శయితు మశక్యత్వాత్ పృష్టస్తదుపలక్షణం కించిదాచష్టే, తచ్చోపమానసామగ్రీసముత్థాపనమేవ, తస్య చ ప్రమాణస్య సతస్తర్కః సహాయతామాపద్యతే, సాదృశ్యస్యైవ నిమిత్తతాయాం కల్పనాగౌరవం, నిమిత్తాన్తరకల్పనే చ, క్లృప్తకల్ప్యవిరోధ ఇతి తదేవ నిమిత్తమవగచ్ఛతీతి.

తా. నిమి_త్తవిశేష ప్రశ్న మే అయినచో దానిని ఎందు వలన నుత్తరవాక్యముచే ప్రదర్శింపలేదు అనినచో అట్టి నిమి_త్తవిశేషము సాక్షాత్తుగా ప్రదర్శనజేయుటకు వీలులేక, నిమి_త్త విశేషోపలక్షణమును, ఉత్తరవాక్యముచే ప్రదర్శించెను. ఇట్టి సాదృశ్యజ్ఞానమే యుపమానప్రమాణము. ఇట్టి ప్రమాణమునకు తర్కము సహాయము. సాదృశ్య ముపాధిరూప మగుటవలన, అది శక్యతావచ్ఛేదక మగుటలో గౌరవము, ధర్మాంతరము శక్యతావచ్ఛేదకమైనచో క్లిష్టమైన గవయత్వమును, విడనాడుటయు సంభవించును. గావున గవయత్వమే గవయపదశక్యతావచ్ఛేదకమని దెలియనగును.

మూ. లక్షణం త్వస్యానవగతసఙ్గతి సంజ్ఞాసమభివ్యాహృతవాక్యార్థస్యసంజ్ఞిన్యనుసన్ధానముపమానం, వాక్యార్థశ్చ క్వచిత్సాధర్మ్యం క్వచిద్వైధర్మ్యమతో నావ్యాపకం, తస్మాన్నియతవిషయత్వాదేవ, న తేన బాధో, నత్వనతిరేకాదితి స్థితిః.

తా. అగృహీతశ_క్తికమైన పదసమభివ్యాహృత వాక్యార్థమును అర్థమందు అనుసన్ధానమే యుపమానము. "గోసదృశో గవయః" అనుస్థలమున, సాదృశ్యజ్ఞానము. "ధిక్కలభం దీర్ఘగ్రీవం" అనఁగా పొడవగు మెడగల గాడిదను నిందించుస్థలమున వైధర్మ్యజ్ఞానము గావున నవ్యాప్తి లేదు. ఇట్టి యుపమానప్రమాణము నియతముగా శ_క్తిజ్ఞానమునే గలుగఁజేయును గాన, నిట్టి యుపమానప్రమాణము ఈశ్వరునివిషయమున బాధకము గానేరదు.

మూ. శబ్దోపి న బాధకమనుమానానతిరేకాదితి వైశే
షికాదయః, తథా హి, యద్యప్యేతే పదార్థాః
మిథస్సంసర్గవన్తః వాక్యత్వాదితి వ్యధికరణమ్,
పదార్థత్వాదితి చానైకాన్తికం, పదైః స్మారి
తత్వాదిత్యపి తథా.

తా. ఆకాంక్షాదికముగల పదములకుగాని, పదార్థము
లకుగాని, అన్వయబోధలో లింగభావముచేతనే, కరణత్వము
సిద్ధించును. కాన పదములకుగాని, పదార్థములకుగాని, అను
మానవిధముననే, ప్రామాణ్యమును స్వీకరించెదము. గాన,
పృథక్ప్రామాణ్యము శబ్దమునకు లేనందున, శబ్దము బాధ
కముగాదని, వైశేషికాదు లందురు. పదార్థ పక్షకానుమాన
మున, వాక్యత్వమును హేతువునుగాఁ జేసిన, సాధ్యమగు
పదార్థసంసర్గముగల, పదార్థములందు అయ్యది లేనందున,
వాక్యత్వరూపహేతువు విరుద్ధ మగును. పదార్థత్వమును
హేతువుగాఁ జేసినచో, మిథస్సంసర్గశూన్యములగు ఘటకర్మ
త్వాదులందు, పదార్థత్వ ముండుటవలన, పదార్థత్వము వ్యభి
చారి యగును. పదస్మారితత్వరూపహేతువుఁగూడ నిట్లే వ్యభి
చారి యగును.

మూ. యద్యపి చైతాని పదాని స్మారితార్థసంసర్గవన్తి
తత్స్మారకత్వాదిత్యాదౌ సాధ్యాభావః. న
హ్యత్ర మత్వర్థస్సంయోగః సమవాయస్తాదా
త్మ్యం విశేషణవిశేష్యభావో వా సమ్భవతి,
జ్ఞాప్యజ్ఞాపకభావస్తు స్వాతన్త్ర్యేణానుమానా_న్త
ర్భావవాదిభిర్నేష్యతే, న చ లింగతయా జ్ఞాప

కత్వం, యల్లిఙ్గస్య విషయ స్తదేవ తస్య, పరస్ప
రాశ్రయప్రసంగాత్. తదుపలమ్భే హి వ్యాప్తి
సిద్ధిః తత్సిద్ధౌ చ తదనుమానమితి.

తా. పదపదార్థములకు సంయోగముగాని, సమవాయ
ముగాని, తాదాత్మ్యముగాని, విశేషణ విశేష్యభావముగాని,
సంభవింపనందున, పదపక్షకానుమానములో పక్షమైనశబ్ద
మందు సాధ్యము లేనందున బాధ సంభవించును. పదము
స్మారితపదార్థ సంసర్గజ్ఞాపకము. సంసర్గము పదజ్ఞాప్యము గాన
జ్ఞాప్యజ్ఞాపక భావరూపసంబంధము పక్షమం దుండును గాన,
బాధ లేదని యాశంకింపరాదు.

శబ్దమున కనుమానాంతర్భావము స్వీకరించెడు వైశే
షికమతమున స్వతంత్ర్యముగా జ్ఞాపకత్వము స్వీకరింపనందున,
సాధ్యబాధ సంభవించును. అన్యోన్యాశ్రయ రూపదోషము
సంభవించును గాన లింగభావముచే శబ్దమునకు జ్ఞాపకత్వ
మును స్వీకరించుటకు వీలులేదు. యల్లింగస్య విషయ స్త దేవ
తస్య, లింగమున కేది కర్మ యో, శబ్దమునకు నదియే, పరస్పరా
శ్రయ మెటులనఁగా; ప్రమాణాంతరముచే శబ్దమందు లిఙ్గి
త్వము సిద్ధించినచో లింగతయాజ్ఞాపకము సిద్ధించును. పిదప
శబ్దరూపలింగమందు లింగతయాజ్ఞాపకత్వరూప సాధ్యవ్యాప్తి
సిద్ధించును. పిమ్మట జ్ఞాపకత్వము సిద్ధించును. గాన పదార్థ పక్ష
కానుమానము, పదపక్ష కానుమానము సంభవించదు. కావున,
శబ్దమునకు పృథక్ప్రామాణ్య మవశ్యము స్వీకరింపవలెనను
యద్యపి పూర్వపక్షమునకు, తథాపీత్యాదినా వైశేషికుని
యుత్తరము.

మూ. తథాప్యాకాంక్షాదిమద్భిః పదైస్స్మారితత్వాత్ గామభ్యాజేతి పదార్థవదితి. స్యాత్ న చ విశేషాసిద్ధిర్దోషః, సంసర్గస్య సంసృజ్యమానవిశేషాదేవ, విశిష్టత్వాత్. యద్వా, ఏతాని పదాని స్మారితార్థసంసర్గజ్ఞానపూర్వకాణి, ఆకాంక్షాదిమత్త్వే సతి, తత్స్మారకత్వాత్. గామభ్యాజేతి పదవత్. న చైవమర్థాసిద్ధిః జ్ఞానావచ్ఛేదకతయైవ తత్సిద్ధేః, తస్య చ సంసృజ్యమానోపహితస్యైవావచ్ఛేదకత్వాన్న విశేషాప్రతిలమ్భ ఇతి. అత్రోచ్యతే.

తా. తథాపి యనుగ్రంథము వైశేషికునిది. "ఏతే పదార్థాః తాత్పర్యవిషయ మిథస్సంసర్గవన్తః ఆకాంక్షాదిమద్భిః పదైస్స్మారితత్వాత్" అనునది పదార్థ పక్షకానుమానము. ఇచ్చట తాత్పర్యవిషయ మిథస్సంసర్గవన్తః, అనునది సాధ్యము. సాధ్యకోటిలో సంసర్గమందు తాత్పర్యవిషయత్వ విశేషణము వలన నభిమతసంబంధమునుబట్టి యర్థాంతరరూపదోషము సంభవింపదు. ఈ యనుమానముచే సంసర్గసిద్ధి అయినను, సంసర్గవిశేషము సిద్ధింపలేదని యాశంకింపరాదు. పదస్మారిత పదార్థవిశేషములను పక్షముఁజేసి, వానియొక్క సంసర్గమును, సాధ్యముగాఁ జేసినచో పదార్థవిశేషములకు అనఁగా ఘట, కర్మత్వాది పదార్థములకుఁ గల యాధేయత్వరూప సంసర్గ విశేషము సిద్ధించును.

పదపక్షకానుమానమున సంసర్గజ్ఞానపూర్వకత్వము సాధ్యముఁ జేసినందున, సాధ్యబాధయు వ్యభిచారము

మున్నగు దోషములకును ప్రసంగము లేదు. పదస్మారితపదార్థవిశేషములతోఁ గూడుకొనియున్న సంసర్గయొక్క జ్ఞానపూర్వకత్వము సాధ్యము. సాధ్యమైనజ్ఞానమందు సంసర్గవిశేషము విశేషణము, గాన జ్ఞానవిశేషణతయా సంసర్గవిశేషము సిద్ధించును. పదార్థకరణత్వపక్షమున, పదకరణత్వపక్షమున, నీ రెండనుమానములవలనను, వాక్యార్థము సిద్ధించుచుండఁగా శబ్దమున కనుమానవిధమున ప్రామాణ్యము సంభవించుచుండఁగా పృథక్ప్రామాణ్యము లేనందున, శబ్ద మీశ్వరబాధకము కాదని చెప్పెడు వైశేషికు లాశంకింపఁగా దానికి సమాధానము. అత్రోచ్యతే యను గ్రంథము.

మూ. అత్రోచ్యతే.—

శ్లో. అనైకాన్తః పరిచ్ఛేదే సంభవే చ న నిశ్చయః,
ఆకాంక్షా సత్తయా హేతుః యోగ్యాసత్తిరబన్ధనా. ౧౩

తా. పదార్థపక్షకానుమానము అనఁగా "ఏతే పదార్థాః తాత్పర్యవిషయ మిథస్సంసర్గవన్తః ఆకాంక్షాదిమద్భిః పదైః స్మారితత్వాత్." అనెడు అనుమానము. "సంసృష్టా ఏవ" అనే పరిచ్ఛేదము, అనఁగా నియమము సాధ్యము జేసినచో నుక్త హేతువుగల పదార్థములయందు నియమరూపసాధ్యము లేనందున, హేతువు అనైకాంతిక మనఁగా వ్యభిచారి. సంభవే చ, యనఁగా సంసర్గయోగ్యత. ఇట్టి యోగ్యతను సాధ్యముఁ జేసినచో వాక్యఫలమగు జ్ఞానవిశేషనిశ్చయము గలుగదు.

ద్వితీయానుమానము. "ఏతాని పదాని స్మారితార్థసంసర్గ జ్ఞానపూర్వకాణి, ఆకాంక్షాదిమత్త్వే సతి, పదార్థస్మారకత్వాత్" అనునది. హేతుజ్ఞానము లేనిచో సాధ్యసిద్ధి గాదు. ఆకాంక్షయన, ప్రతిపత్తయొక్క జిజ్ఞాస, సంసర్గజ్ఞానములో నిట్టి యాకాంక్ష యజ్ఞాతమై కారణమగును. కావున హేతు విశేషణముఁ జేయుటకు వీలులేదు. ఆకాంక్షను విడనాడి, యోగ్యతను, ఆసత్తిని, హేతువిశేషణముఁ జేసినచో "అయమేతి పుత్రః రాజ్ఞః పురుషోఽపసార్యతాం" అను నిరాకాంక్ష వాక్యమందు హేతువు ఉండును. సాధ్యము లేదు. కావున హేతువు వ్యభిచారి యగును. కాఁబట్టి రెండవ యనుమానమువలనను అర్థసిద్ధి గాదు గాన, శబ్దము ప్రమాణాంతరమని జెప్పవలయునని శ్లోకతాత్పర్యము.

మూ. ఏతే పదార్థా మిథస్సంసర్గవన్త ఇతి సంసృష్టా
ఏవేతి నియమో వా సాధ్యః, సమ్భావితసం
సర్గా ఇతి వా? న ప్రథమః అనాప్తోక్తపదకదంబ
స్మారితైరనైకాన్త్యాత్. ఆప్తోక్త్యావిశేషణీయమితి
చేత్. న, వాక్యార్థప్రతీతేః ప్రాక్ తదసిద్ధేః, న
హ్యావిప్రలమ్భకత్వమాత్రమిహాప్తశబ్దేన వివక్షి
తం, తదుక్తేరపి, పదార్థసంసర్గవ్యభిచారాత్.
అపి తు తదనుభవప్రామాణ్యమపి, న చైతచ్ఛ
క్యమసర్వజ్ఞేన, సర్వదా సర్వవిషయే సత్యజ్ఞాన
వానయమితి నిశ్చేతుం, భ్రాన్తేః పురుషధర్మ
త్వాత్.

తా. "పదార్థపక్షకానుమానములో సంసర్గ గలవే యనునియమము సాధ్యమా; సంసర్గయోగ్యత సాధ్యమా? అనాప్తునిచే నుచ్చరింపఁబడిన పదస్మారితత్వముగల ఘటకర్మత్వాదులయందు నియమరూపసాధ్యము లేనందున, "ఆకాంక్షాదిమద్భిః పదైస్స్మారితత్వాత్" అను హేతువు వ్యభిచారి యగును. ఏఘటమునకు నేయానయనమునకును సంసర్గ పుట్టలేదో, హేతువుగల నా ఘటానయనములయందు నియమరూపసాధ్యము లేనందున, వ్యభిచారి యగును. అట్టిఘటమునకు, ఆ నయనమునకు, యోగ్యత యుండును గాన, యోగ్యతాఘటితహేతువు లేనందున, వ్యభిచారము లేదని భ్రమింపవలదు. ఆప్తోక్తత్వమును గూడ హేతుశరీరమున ప్రవేశింపఁజేసిన వ్యభిచారము వారించినను, వాక్యార్థప్రతీతికంటె పూర్వము ఆప్తత్వము సిద్ధము గానందున, హేతుకోటిలో ప్రవేశముచేయుటకు వీలులేదు. వంచకుఁడుగాని వానిచే ప్రయుక్తమగు శబ్దముచే స్మారితములగు పదార్థములందుఁ గూడ సంసర్గము లేనందున వ్యభిచారి యఁగును గాన, అవిప్రలమ్భకత్వము ఆప్తత్వ మనుటకు వలనుపడదు. ఈ యర్థమున ఇతఁడు యథార్థజ్ఞానము గలవాఁడు ఆప్తుఁడని చెప్పవలయును. భ్రాంతిపురుషధర్మ మగుటచే, ఇతఁడు ఎల్లపుడును స్వవిషయములయందు యథార్థజ్ఞానము గలవాఁడని, అసర్వజ్ఞులమైన మనము నిశ్చయించుట దుర్లభము.

మూ. యత్ర క్వచిదాప్తత్వమనాప్తస్యాప్యస్తీతి న
తేనోపయోగః, తతోఽస్మిన్నర్థేఽయమభ్రాన్త
ఇతి కేనచిదుపాయేన గ్రాహ్యం నచైతత్సంసర్గ

విశేషమప్రతీత్య శంక్యం, బుద్ధేరర్థభేదమన్తరేణ నిరూపయితుమశక్యత్వాత్. పదార్థమాత్రే చాభ్రాన్తత్వసిద్ధౌ న కించిత్. అనాప్తసాధారణ్యాత్. ఏతేషాం సంసర్గేఽయమభ్రాన్త ఇతి శక్యమితి చేన్న. ఏతేషాం సంసర్గే ఇత్యస్యాఏవ బుద్ధేరసిద్ధేః. అననుభూతచరే స్మరణాయోగాత్. తదనుభవస్య లింగాధీనతయా తస్య చ విశేషణాసిద్ధత్వేనానుపపత్తేరితి.

తా. ఒకానొకస్థలమందు ఆప్తత్వమును నిశ్చయించి, యీరీతిగా సర్వత్ర ఆప్తత్వము ననుమేయించెద మనినచో నిట్టియాప్తత్వ మనాప్తునియందుఁ గూడ నుండును గాన దీని వలన నుపయోగము లేదు. గాన సంసర్గవిశేషప్రతీతి లేనిదే యీయర్థమునం దితఁడు భ్రాంతుఁడని యేయుపాయము చేతను తెలుసుకొనుట దుర్లభము. అట్లయినచో పరస్పరాశ్రయప్రసంగము సంభవించును. పదార్థములన్నియు ప్రయోగముకంటె పూర్వమందె ప్రతీతములు. అవియన్నియు సత్యములు గాన వానియందు ఆప్తత్వము నిశ్చయింపఁబడు ననినచో నిట్టి యాప్తతయ నాప్తసాధారణము గాన నిదియు నుపయుక్తము గాదు. వాక్యమువలన పదస్మారిత పదార్థముల యొక్క యోగ్యతవలె వాని సంసర్గవిషయమై ప్రయోక్తయ భ్రాంతుఁడని నిశ్చయించుటకు వీలు లేదు. కారణము లేనందున నట్టినిశ్చయ మనుభవరూపమైనది కలుగదు. అనుభవము లేనందున స్మరణరూప మయినదనికూడ చెప్పుటకు వీలు లేదు. కాన నాప్తోక్తత్వము హేతుశరీరములో ప్రవేశపెట్టుటకు వీలు లేదు.

నియమరూపసాధ్యసాధక హేతువనా ప్త వాక్యసాధారణముఁ గాన ప్రథమానుమానములో ప్రథమసాధ్యము సంభవింపదు.

మూ. నాపి ద్వితీయః, యోగ్యతామాత్రసిద్ధావపి సంసర్గానిశ్చయాత్, వాక్యస్య తదేకఫలత్వాత్, యోగ్యతామాత్రస్య ప్రాగేవ సిద్ధేః. అన్యథా తదసిద్ధావాసన్నసాకాఙ్క్షపదస్మారితత్వాదిత్యేవ హేతుస్స్యాత్. తథా చాగ్నినా, సించేదిత్యాదినా స్మారితైరనైకాన్తః తథావిధానాం సర్వథా సంసర్గాయోగ్యత్వాదితి.

తా. వాక్యమునకు సంసర్గనిశ్చయమే ఫలము. అర్థపక్షకానుమానములో సంసర్గయోగ్యతను సాధ్యముఁ జేసినయెడల యోగ్యత సిద్ధించినను, సంసర్గనిశ్చయము కలుగదు. యోగ్యత యనుమానముకంటె పూర్వమందే సిద్ధించెను. అనుమితికంటె పూర్వము యోగ్యత సిద్ధించినచో యోగ్యతను హేతుకోటిలో ప్రవేశపెట్టక యాసన్నసాకాంక్షపదస్మారితత్వము హేతువుఁ జేయవలసివచ్చును. అటులనే హేతువుఁ జేసినచో యోగ్యతలేని "అగ్నినా సించేత్త"ను వాక్యస్మారితపదార్థమందు హేతు వున్నందున వ్యభిచారి యగును గాన సర్థపక్షకానుమానము సంభవింపదు.

మూ. ద్వితీయేఽపి ప్రయోగే హేతురాకాంక్షాదిమత్త్వే సతీతి. తత్ర కేయమాకాంక్షా నామ? న తావద్విశేషణవిశేష్యభావః. తస్య సంసర్గస్వభావతయా సాధ్యత్వాత్. నాపి తద్యోగ్యతా, యోగ్యతయైవ గతార్థత్వాత్.

తా. "ఏతాని పదాని స్మారితార్థసంసర్గజ్ఞానపూర్వకాని, ఆకాంక్షాదిమత్త్వే సతి, తత్స్మారకత్వాత్." అను యనుమానము లో హేతుకుక్షిలోనున్న యాకాంక్షయనునది విశేషణవిశేష్య భావరూపమయినచో, విశేషణవిశేష్యభావ మనఁగా, విశేషణ విశేష్యసంసర్గయే ఇట్టి యాకాంక్ష పూర్వమందే సిద్ధించును. విశేషణవిశేష్యసంసర్గయే సాధ్యమయినందున సిద్ధసాధన మను దోషము సంభవించును గాన విశేషణవిశేష్యభావ మాకాంక్ష యనుటకు వీలులేదు. యోగ్యతవలననే గతార్థ మగును గాన సంసర్గయోగ్యత యాకాంక్షారూప మనుటకు వీలులేదు.

మూ. నాప్యవినాభావః, నీలం సరోజమిత్యాదౌ తద భావేపి వాక్యార్థప్రత్యయాత్. తత్రాపి విశే షాక్షిప్తసామాన్యయోర వి నా భా వోఽస్తీతి చేన్న. అహో విమలం జలం నద్యాః కచ్ఛే మ హిషశ్చరతీత్యాదౌ వాక్యభేదానుపపత్తిప్రసం గాత్. నాపి ప్రతిపత్తుర్జిజ్ఞాసా, పటో భవతీ త్యాదౌ శుక్లాదిజిజ్ఞాసాయాం రక్తః పటో భవతీత్యేకదేశవత్ సర్వదా వాక్యాపర్యవసాన ప్రసఙ్గాత్.

తా. పదస్మారితపదార్థముల కవినాభావ మాకాంక్ష యని జెప్పుటకు వీలులేదు. "నీలం సరోజం" అను వాక్యము లోనున్న నీలపదార్థమునకు, సరోజపదార్థమునకు నవినాభా వము లేకపోయినను శాబ్దబోధ కలుగుచున్నది. "నీలం సరో జ"మను స్థలమందు గుణద్రవ్యవిశేషములగు నీలసరోజము లచే నాక్షిప్తములగు గుణద్రవ్యసామాన్యముల కవినాభావ

మున్నందున, యాకాంక్ష యున్నందున శాబ్దబోధ కలుగు నన్నచో "అహో విమలం జలం, నద్యాః కచ్ఛే మహిష శ్చరతి," యను భిన్నవాక్యస్థలమందు ప్రథమవాక్యఘటక నదీపదార్థమునకు ద్వితీయవాక్యఘటక కచ్ఛపదార్థమునకు నవినాభావము కలదు కాన భిన్నవాక్యములు గూడ సాకాంక్షము లగుటవలన నేకవాక్యత్వప్రసంగము వచ్చును. గాన, నవినాభావ మాకాంక్ష యనుటకు వీలులేదు. శ్రోతయొక్క జిజ్ఞాసయే యాకాంక్ష యనినచో "రక్తః పటోభవతి" యను స్థలమందు ఏకదేశమయిన "పటోభవతి" యను వాక్యమువలె శుక్లాదిజిజ్ఞాస యున్నప్పుడు "పటో భవతి" యనువాక్యము అపర్యవసన్నము గావలసివచ్చును. అనఁగా జిజ్ఞాసితమయిన వాక్యార్థబోధకము గానందున, నేకదేశమయిన పటో భవతి యనువాక్య మెటుల, నపర్యవసన్నమో యటులనే శుక్లరూపముఁ గూడ జిజ్ఞాసితము గాన దానిని గోచరింపని బోధను గూర్చి కారణమయినందున శుక్లాదిజిజ్ఞాస యున్నపుడు ఘటో భవతి యనువాక్యముఁ గూడ నపర్యవసన్నము గావలసి వచ్చును."

మూ. గుణక్రియాద్యశేషవిశేషజిజ్ఞాసాయామపి, పద స్మారితవిశేషజిజ్ఞాసా ఆకాంక్షా, పటఇత్యుక్తే, కిం రూపః? కుత్ర? కిం కరోతీత్యాదిజిజ్ఞాసా, తత్ర భవతీత్యుక్తే కిం కరోతీత్యేషైవ పదస్మారిత విషయా, న తు కిం రూప ఇత్యాదిరపి, యదా తు, రక్త ఇత్యుచ్యతే, తదా కిం రూప ఇత్యే షాపి పదస్మారితవిషయా స్యాత్, ఇతి న కించిద

నుపపన్నమితి చేత్. ఏవం, తర్హి చక్షుషీ నిమీల్య పరిభావయతు భవాన్.

తా. కేవలము జిజ్ఞాసమాత్ర మాకాంక్ష కాదు. మరే మన పదస్మారిత విశేషపదార్థమున గోచరించు జిజ్ఞాసయే కాన పటః యని యుచ్చరించినపు డేమిరూపముఁ గలది? ఎక్కడ నున్నది? ఏమి చేయుచున్నది? యని జిజ్ఞాసలు కలుగును. భవతి, యని యుచ్చరించినపుడు కిం కరోతి యను జిజ్ఞాసయె పదస్మారితక్రియావిశేషమును గోచరించునది. "కిం రూపః." యనునది కాదు. రక్తః, యని చెప్పినపుడే కిం రూపః యను జిజ్ఞాస పదస్మారితవిషయ మయ్యెని. కావున నీరీతిగా నాకాంక్షా స్వరూపముఁ జెప్పినచో నేమియు ననుపపత్తి లేదు. అనినచో నీవు కళ్లుమూసికొని తిరస్కరింపుము, కాని యిదియె యాకాంక్షగాని ఇట్టియాకాంక్ష హేతువిశేషణముఁ జేయుటకు వీలు లేదు.

మూ. కిమస్యాం జాతాయామన్వయప్రత్యయః, అథ జ్ఞాతాయామితి, తత్ర ప్రథమేనానయా వ్యభిచారవ్యావర్తనాయ హేతుర్విశేషణీయః, మనస్సంయోగాదివత్సత్తామాత్రేణోపయోగాత్. ఆసత్తియోగ్యతామాత్రేణ విశిష్టస్తు నిశ్చితోఽపి న గమకః. అయమేతి పుత్రో రాజ్ఞః పురుషోఽపసార్యతామిత్యాదౌ వ్యభిచారాత్.

తా. జిజ్ఞాసారూపమగు నాకాంక్ష మనస్సంయోగాదికమువలె నజ్ఞాతమగుచు నుపయోగించుటవలన నిట్టి యాకాం

క్షను హేతుశరీరములో వ్యభిచారవారణముకొఱకు ప్రవేశ పెట్టుటకు వీలులేదు. ఆకాంక్షను విడనాడి యాసత్తి యోగ్యతలనే హేతుశరీరములో ప్రవేశముఁ జేసినచో, సాధ్యము లేని నిరాకాంక్షయగు "అయమేతి పుత్రో రాజ్ఞః పురుషో ఽప సార్యతా" మనువాక్యమందు హేతు వున్నందున వ్యభిచారము సంభవించును. కాన, నన్వయబోధోపయుక్తమగు నజ్ఞాతమయిన యాకాంక్షకు హేతుశరీరప్రవేశముఁ జేయుటకు వీలులేదు.

మూ. ద్వితీయస్తు స్యాదపి, యద్యనుమానాన్తరవత్త
త్సద్భావేపితజ్జ్ఞానవైధుర్యాదన్వయప్రత్యయో
న జాయతే. నత్వేతదస్తి, ఆసత్తియోగ్యతా
మాత్రప్రతిసంధానాదేవ సాకాంక్షస్య సర్వత్ర
వాక్యార్థప్రత్యయాత్, నివృత్తాకాంక్షస్య చ
తదభావాత్.

తా. "పర్వతో వహ్నిమాన్ ధూమా"దిత్యాదిస్థలమందు ధూమరూపహేతువునందు వహ్నివ్యాప్తి యున్నను, నావ్యాప్తియొక్క జ్ఞానములేనిచో ననుమితి కలుగదు. అటులనే యాకాంక్షయున్నను తజ్జ్ఞానములేనిచో నన్వయబోధ కలుగనిచో నాకాంక్షాజ్ఞానము వాక్యార్థబోధలో కారణమని చెప్పుటకు వీలగును. గాని, యటు లాకాంక్షాజ్ఞానము లేకపోయినను, నాకాంక్షయుండి యాసత్తి యోగ్యతలయొక్క జ్ఞానమున్నచో వాక్యార్థబోధ కలుగుచున్నది. ఆకాంక్ష లేనిచోఁ గలుగుట లేదు. ఆకాంక్ష యుండుటయే యావశ్య

కము గాని దాని జ్ఞానముతో నవసరము లేదు. కాన నా కాంక్ష జ్ఞాతమై కారణము కాదు. కావున నాకాంక్షాఘటిత మయినదానిని హేతువుఁ జేయుటకు వీలులేదు.

మూ. కథమేషనిశ్చయః సాకాంక్ష ఏవ ప్రత్యేతి, న తు జ్ఞాతాకాఙ్క్ష ఇతి చేత్. తావన్మాత్రేణోప పత్తా వనుపలభ్యమానజ్ఞానకల్పనా నుపపత్తేః. అన్యత్ర తథాదర్శనాచ్చ, యథా హి దూరా ద్దృష్టసామాన్యో జిజ్ఞాసతే కోఽయమితి, ప్రత్యా సీదంశ్చస్థాణురయమితి ప్రత్యేతి,తదాస్య జ్ఞాతు మహమిచ్ఛామీత్యను వ్యవసాయాభావేఽపి స్థాణురయమిత్యర్థప్రత్యయో భవతి. తథేహా ప్యవిశేషాద్విశేషోపస్థానకాలే సంసర్గావగతిరేవ జాయతే, న తు జిజ్ఞాసావగతిరితి.

తా. ఆకాంక్ష యుండుటయే యావశ్యకము. దాని జ్ఞాన మవసరములేదని నీచే నెటుల నిశ్చయింపఁబడినదని యా శంకించుటకు వీలులేదు. శబ్దాతిరిక్తస్థలమందు దూరముగా నొకవ్యక్తిని జూచి, యిది యేమని జిజ్ఞాసగలవాఁడయి యా వ్యక్తి సమీపమునకు వెళ్లినపిదప నిది స్థాణువు, యనుజ్ఞానము కలుగుచున్నది. కాని, దీనిని తెలుసుకొనుటకు నే నిచ్ఛయించు చున్నానను ననువ్యవసాయరూపమగు జిజ్ఞాసయొక్క జ్ఞానము లేదు. ఇట్టిస్థలమున గలుగు "అయం స్థాణుః" అను జ్ఞాన ములో జిజ్ఞాస యజ్ఞాతమయి యెటుల నుపయోగించు చున్నదో ప్రకృతమునఁ గూడ నజ్ఞాతమయిన యాకాంక్షవల

ననే యన్వయబోధ యుపపన్న మగుచుండఁగా ప్రమాణము లేనందునను, విశేషము లేనందునను, నాకాంక్షాజ్ఞానమునకుఁ గారణత్వము లేదని నిశ్చయించెదము. "విశేషోపస్థాపనకాలే, సంసర్గప్రతియోగి పదార్థస్మరణకాలే సంసర్గావగతిః," వాక్యార్థ బోధనుబట్టి జిజ్ఞాసయొక్క జ్ఞాన మవసరము లేదని యర్థము.

మూ. న చ విశేషోపస్థాపనాత్ప్రాగేవ జిజ్ఞాసావగతిః ప్రకృతోపయోగినీ, తావన్మాత్రస్యానాకాంక్షత్వాత్. న చైవంభూతోప్యయమైకాంతికో హేతుః. యథా హి, అయమేతి పుత్రో రాజ్ఞః పురుషోఽపసార్యతామితి వక్తా ఉచ్చారయతి శ్రోతా చ వ్యాసంగాదినా నిమిత్తేనాయమేతి, పుత్ర ఇత్యశ్రుత్వైవ రాజ్ఞః పురుషోఽప సార్యతామితి శృణోతి, తదాస్యాకాంక్షాది మత్వే సతి పదకదంబకత్వం, న చ స్మారితార్థ సంసర్గజ్ఞానపూర్వకత్వమితి.

తా సంసర్గవిశేషప్రతియోగి పదార్థస్మరణకాలమందే పదార్థజిజ్ఞాస యుండవలెనా ? అట్టిస్మరణకంటె పూర్వమందె యుండవలెనా?......................................., ఘటం అను శబ్దప్రయోగముఁ జేసినపిదప పశ్యతి పదస్మారిత దర్శనక్రియయందు ఘటకర్మత్వసంసర్గప్రత్యయము జిజ్ఞాసలేనిదే కలుగుచున్నది. కావున మొదటిపక్షము సమంజసము కాదు. పదస్మారిత విశేషవిషయకజిజ్ఞాసయే యాకాంక్షా రూపము కావున పూర్వభావియగు నశేషగుణక్రియావిష

యకమయినజిజ్ఞాస యాకాంక్షయని చెప్పుట సమంజసము కాదు."

జిజ్ఞాసారూపమగు నాకాంక్షయొక్క జ్ఞానము వాక్యార్థ జ్ఞానములో హేతువయినను, ఇట్టి యాకాంక్షను హేతు విశేషణముఁ జేసినచో పూర్వానుమానము వ్యభిచారియే యగును; ఎట్లన, ఒకఁడు "అయమేతిపుత్రో రాజ్ఞః పురుషో ఒపసార్యతాం" అని యుచ్చరింపఁగా శ్రోత అనాయాసక్తుఁడై "రాజ్ఞః, పురుషోఽపసార్యతాం" అను మూఁడుపదములనే వినె ననుకొనుఁడు. అట్టిచోటకూడ ఆకాంక్షాదిత్రయోపేత మగు హేతువున్నది. గాని, రాజపురుషులకు పుత్రాపసరణము లతో సంసర్గావగతి పూర్వకత్వరూప మగుసాధ్యము లేదు. కాఁబట్టి వ్యభిచారి గాన, శబ్దపక్షకానుమానము నిర్దుష్టము గాదు.

మూ. స్యాదేతత్, యావత్సమభివ్యాహృతత్వేన విశేషితే హేతౌ నాయం దోషః తథావిధస్య వ్యభిచారోదాహరణాసంస్పర్శాత్. కుతస్తర్హి కతిపయ పదశ్రావిణః, సంసర్గప్రత్యయః? అలిఙ్గఏవ లింగత్వాధ్యారోపాత్. ఏతావానేవాయం సమభివ్యాహార ఇతి తత్ర శ్రోతురభిమానః. న తత్సందేహేపి శ్రుతానురూప సంసర్గావగమాత్. భవతి హి తత్ర ప్రత్యయః, న జానే కిమపర మనేనోక్తమేతావదేవ శ్రుతం, యద్రాజ్ఞః పురుషోఽపసార్యతామితి, భ్రాన్తిరసావితి చేత్. న తావదసౌ దుష్టేంద్రియజా. పరోక్షాకార

త్వాత్. న లింగాభాసజా, లింగాభిమానాభావే
ऽపి జాయమానత్వాత్.

తా. సమభివ్యాహృతపదములు యెన్ని యో వాట్లన్నింటి యొక్క సమభివ్యాహారరూపమగు యాకాంక్షతోఁగూడిన, పదార్థస్మారకత్వమును హేతువుఁ జేసినయెడల "రాజ్ఞః పురుషో సహార్యతా"మను వాక్యమందు హేతువు లేనందున వ్యభిచారము లేదు. అట్లైనచో కొన్ని పదములు విన్నప్పుడు సంసర్గప్రత్యయము యెటులఁగలుగుననిన చో లింగముగాని దానియందు లింగత్వభ్రాంతివలననే గలుగును ఇట్టి సమభివ్యాహారమే నాచే వినఁబడెనని శ్రోతకు యభిమానమని జెప్పుటకు వీలు లేదు. యానత్పద సమభివ్యాహృతత్వసందేహమున్నను సంసర్గప్రత్యయముఁ గలుగుచున్నది. భ్రాంతి కారణము లేనందున లింగత్వభ్రాంతికి యవకాశమే లేదు. వాక్యములోనున్న కొన్ని పదములను వినినవానికిఁ గలుగు సంసర్గప్రత్యయము భ్రాంతియనుటకు వీలు లేదు. ఈ సంసర్గప్రత్యయము దుష్టేంద్రియజన్యమా, లేక లింగాభాసజన్యమా, పరోక్షజ్ఞాన మఁగుటవలన దుష్టేంద్రియ జన్య మనుటకు వీలు లేదు. లింగాభిమానము లేకపోయినను గలుగుచున్నందున లింగాభాసమువలన గలుగునన్న పక్షముఁ గూడ సరిగాదు.

మూ. ఏతాదృక్పదకదమ్బప్రతిసన్ధానమేవ తాం జనయ
తీతి చేత్. యద్యేవమేతదేవాదుష్టం సదభ్రాన్తిం
జనయత్వేన వారణీయం వ్యాప్తిప్రతిసన్ధానం
వినాపి తస్య సంసర్గప్రత్యాయనే సామర్థ్యావ
ధారణాత్. చక్షురాదివత్.

తా. కొన్నిపదములయొక్క అగ్రహణ రూపదోష దూషితమైన కొన్నిపదములయొక్క ప్రతిసంధానమే భ్రాంతి రూపమగు సంసర్గప్రత్యయమును గలుగఁజేసిన దనినచో, ఆ శ్రోతకు దోషహీనమై వినఁబడిన పదములయొక్క సమభి వ్యాహార జ్ఞానమువలననె అభ్రాంతిరూపమగు వాక్యార్థ ప్రత్యయముఁ గలుగుచుండఁగా దానిని యెవరు వారించెదరు. ఆ వాక్యార్థప్రత్యయమును వ్యాప్తి ప్రతిసంధానము లేక పోయినను చక్షురాదులవలె నజ్ఞాయమానమై ఆకాంక్షాది సహితమైనశబ్దము సమర్థము గాన వాక్యార్థప్రత్యయ మను మతిరూపము గాదు.

మూ. నాస్త్యేవ తత్ర సంసర్గప్రత్యయః అసంసర్గా
గ్రహమాత్రేణ తు తథా వ్యవహారఇతి చేత్.
తర్హి యావత్సమభివ్యాహారేణాపి విశేషణే
నాప్రతీకారః, తథా భూతస్యానాప్తవాక్యస్య
సంసర్గజ్ఞానపూర్వకత్వాభావాత్.

తా. యావత్సమభివ్యాహృతత్వ సందేహమున్నను వ్యాప్తిజ్ఞానము లేనివానికి సంసర్గప్రత్యయముఁ గలిగినచో, శబ్దమున కనుమానవిధయాప్రామాణ్యము లేదని జెప్పవచ్చును సంసర్గప్రత్యయమే గలుగదు. లేనిచో సంసర్గవ్యవహార మెటు లనినచో అసంసర్గాగ్రహమాత్రముననే సంసర్గవ్యవహార ముపపన్న మగుననినచో సంసర్గజ్ఞాన పూర్వకత్వములేని యనాప్తవాక్యమందు యావత్సమభివ్యాహృతత్వ ఘటితమైన హేతువున్నందున వ్యభిచారి యగును.

మూ. అసంసర్గాగ్రహపూర్వకత్వమాత్రే సాధ్యేన వ్యభిచార ఇతి చేత్. ఏవన్తర్హి సంసర్గో న సిధ్యేత్. ఆప్తవాక్యేషు సేత్స్యతీతి చేన్న. సర్వవిషయాఽఽప్తత్వస్యాసిద్ధేః. యత్ర క్వచిదాప్తత్వస్యానైకాంతికత్వాత్. ప్రకృతవిషయే త్వాప్తత్వసిద్ధౌ సంసర్గవిశేషస్య ప్రాగేవ సిద్ధ్యధ్యుపగమాదిత్యుక్తం.

తా. అసంసర్గాగ్రహమాత్రపూర్వకత్వమే సాధ్యము. కాన వ్యభిచారమున కవకాశము లేదనినచో సంసర్గసిద్ధి లేకపోవలసి వచ్చును. ఆప్తవాక్యస్థలమందు సిద్ధించునని జెప్పుటకు వీలుపడదు. సర్వవిషయములయం దాప్తత్వసిద్ధి లేదు. ఏదో విషయమున యాప్తత్వ మనాప్తవాక్యసాధారణము ప్రకృతవిషయమున యాప్తత్వము సంసర్గజ్ఞానానంతరము సిద్ధించును గాన శబ్దపక్షకానుమానము సరిగాదు.

మూ. న చ సర్వత్ర జిజ్ఞాసానిబన్ధనం; అజిజ్ఞాసోరపి వాక్యార్థప్రత్యయాత్ ఆకాంక్షాపదార్థస్తర్హి కః? జిజ్ఞాసాం ప్రతి యోగ్యతా, సా చ స్మారిత, తదాక్షిప్తయోరవినాభావే సతి, శ్రోతరి తదుత్పాద్యసంసర్గావగమప్రాగభావః. న చైషోఽపి, జ్ఞానమపేక్షతే, ప్రతియోగినిరూపణాఽధీననిరూపణత్వాత్. తదభావనిరూపణస్య తస్య చ విషయనిరూప్యత్వాదితి.

తా. పూర్వము ఆకాంక్ష యనఁగా జిజ్ఞాసయనియు, నిట్టియాకాంక్ష సత్తయా (అనఁగా నజ్ఞాయమానమై హేతు

వగును గాన హేతువిశేషణము చేయుట సంభవించదనియు చెప్పఁబడెను. ఇప్పుడు జిజ్ఞాసరూపమగు నాకాంక్షయే కారణముఁగాదని చెప్పఁబడుచున్నది. జిజ్ఞాస లేనివానికిఁగూడ సంసర్గప్రత్యయముఁ గలుగుటవలన జిజ్ఞాస కారణమే గాదు. అట్లైనచో నాకాంక్షాపదమున కర్థ మేమనఁగా జిజ్ఞాసాయోగ్యతయే యాకాంక్షాపదార్థము.

పదస్మారితమునకు నాప్తోక్త పదస్మారితముతోఁగాని పదాక్షిప్తముతోఁగాని యవినాభావ మున్నప్పుడు శ్రోతకున్న సంసర్గప్రత్యయముయొక్క ప్రాగభావరూపమే యోగ్యత. "ఓదనం పచతి" అనుస్థలమునందు పచధాతుస్మారితమైన పాకక్రియకు నోదన పదస్మారిత ఓదన రూపకారకమునకు నవినాభావ మున్నందున నిది యేకవాక్యము. "నీలంసరోజ" మను స్థలమునందు పదస్మారితనీలమునకు సరోజమునకు నవినాభావము లేనందున విశేషముచే సామాన్య మాక్షిప్తము. నీలముచే గుణసామాన్యమును సరోజ రూపవిశేష్యముచే ద్రవ్యసామాన్యము నాక్షిప్తము. కాన గుణద్రవ్యముల కవినాభావ మున్నందున దీని కేకవాక్యత్వము నిర్వహించును.

శ్రోతయందుండెడు వక్తచే నుచ్చరించఁబడ్డ వాక్యముచే గలుగు నిట్టి సంసర్గజ్ఞానముయొక్క ప్రాగభావమే యోగ్యత యనఁబడును. ఇట్టియాకాంక్షకు హేతువిశేషణత్వము లేనందున ననుమానము సంభవించదు.

ఇట్టిప్రాగభావము అజ్ఞాతమై కారణముగాని జ్ఞాతమై కారణము గాదు. ఇట్టియోగ్యత హేతువిశేషణమైనచో సంసర్గప్రత్యయములో సంసర్గావగమప్రాగభావజ్ఞాన మపేక్షి

తము. అభావజ్ఞానము ప్రతియోగియైన సంసర్గావగమముయొక్కజ్ఞానము నపేక్షించును. ఇది సంసర్గావగతి నపేక్షించును. కాన నన్యోన్యాశ్రయము వచ్చును. ప్రాగభావ మజ్ఞాతమై సంసర్గప్రత్యయములో నుపయోగించును గాన హేతువిశేషణముచేయుట సంభవించనందున ననుమానముచే వాక్యార్థప్రత్యయ ముపపన్నము గానందున శబ్దమునకుఁ బ్రత్యక్షానుమానములకువలె పృథక్ప్రామాణ్యము స్వీకరించవలెను.

మూ. ప్రాభాకరాస్తు; లోకవేదసాధారణవ్యుత్పత్తిబలే నాఽన్వితాభిధానం ప్రసాధ్య వేదస్యాపౌరుషేయతయా వక్తృజ్ఞానానుమానానవకాశాత్; సంసర్గే శబ్దస్యైవ స్వాతంత్ర్యేణ ప్రామాణ్యమాస్థిషత, లోకే త్వనుమానతవేవ వక్తృజ్ఞానోపసర్జనతయా సంసర్గసిద్ధేరన్వితాభిధానబలాయాతేఽపి ప్రతిపాదకత్వేఽనువాదకతామాత్రం వాక్యస్యేతి నిర్ణీతవన్తః, తదలిస్థపీయః.

తా. ప్రాభాకరులు వైదికశబ్దమునకుఁ బృథక్ప్రామాణ్యము నంగీకరించి లౌకికశబ్దమున కనుమానమందే యంతర్భావము నాశంకించుచున్నారు:—

వేద మపౌరుషేయము, స్వతఃప్రమాణము. వైదికశబ్దములు శక్తిచే నన్వితత్వములనే బోధించును. అపౌరుషేయములు గనుకనే వక్తయొక్కజ్ఞాన మవసరము లేదు. సంసర్గయందుఁగూడ శక్తి యున్నందున శక్తివలననే సంసర్గమును బోధించుటవలన స్వతఃప్రామాణ్య ముండును. లౌకికశబ్దములు

పౌరుషేయములు. "లౌకికశబ్దాః తాత్పర్యవిషయస్మారితార్థ సంసర్గవిషయక వక్తృయథార్థజ్ఞానపూర్వికాః, ఆకాంక్షాది మత్త్వేసతి తత్స్మారకత్వాత్." అనెడు ననుమానముచేతనే వక్తృవిశేషణ జ్ఞానవిశేషణమై సంసర్గ సిద్ధించును కాన ననుమానముచే సిద్ధమైన స్మారితార్థ సంసర్గవిషయమై లౌకికవాక్య మనువాదకము గాని పృథక్ప్రమాణము గాదని ప్రాభాకరు లాశంకించుచున్నారు. కాని యది సమంజసము గాదు.

శ్లో. నిర్ణీతశక్తేర్వాక్యాద్ధి ప్రాగేవార్థస్య నిర్ణయే,
వ్యాప్తిస్మృతివిలమ్బేన లింగస్యైవానువాదితా. ౧౪

తా. వేదమందు క్లృప్తమైన సామగ్రివలననే లౌకిక వాక్యమువలనఁగూడ నన్వయబోధ గలుగును. అటులు గానిచో ననువాదకత్వముఁగూడ లౌకికవాక్యములకు లేక పోవలసి వచ్చును. ఆకాంక్షాదులతోఁ గూడుకొన్న శబ్ద జ్ఞానముకంటెఁ బూర్వమున వ్యాప్తి స్మృతిపక్షధర్మతాజ్ఞానములు లేకపోయినను లౌకికవాక్యముఁగూడ వేదతుల్య మగుటవలన వాక్యార్థప్రత్యయము విలంబము లేకుండఁ గల్గుచున్నది. ఇటులున్నను లౌకికవాక్యముల కనువాదకత్వ మంగీకరించినచో వేదమువలనఁగూడ వాక్యార్థబోధ గలుగకపోవలసి వచ్చును. దీనికిఁగూడ ననువాదకత్వము రావలసివచ్చును. శబ్దస్థలమందు వ్యాప్తి స్మరణలేనిదే యవిలంబముగా శబ్దము బోధకము. అనుమానస్థలమునందు వ్యాప్తి స్మరణగలిగినపిదపఁ గలుగవలెను. విలంబమున్నందున ననుమానమే యనువాదకమని చెప్పవలసి వచ్చును. కాన వైదికశబ్దమువలె లౌకిక శబ్దముఁగూడ పృథక్ప్రమాణమే గాని యనువాదకము గాదు.

మూ. యావతీ హి వేదే సామగ్రీ తావత్యేవ లోకేపి భవస్తీకథమివ నార్థం గమయేత్. న హ్యపేక్షణీయాన్తరమస్తి, లింగే తు పరిపూర్ణే ప్యవగతే వ్యాప్తిస్మృతిరపేక్షణీయాస్తీతి విలంబేన కిం నిర్ణయం? అన్వయస్య ప్రాగేవ ప్రతీతేః.

తా. ఆకాంక్షాదులతోఁ గూడుకున్న పద ప్రతియోగిక స్వార్థాభిధానశక్తి ప్రతిసంధానమే వేదస్థలమందలి వాక్యార్థ ప్రతీతినిగూర్చి సామగ్రి. ఇట్టిసామగ్రి లౌకిక వాక్యస్థలమందుఁ గూడ నున్నది గాన లౌకికశబ్దమువలన నెట్లర్థబోధ గలుగదు. ఇట్టి సామగ్రికంటె మరియొకటి వాక్యార్థబోధలో నపేక్షితమైనది లేదు. అనుమానస్థలమందు వాక్యమందు స్వార్థవిషయక జ్ఞానానుమానముకొరకు నర్థాభిధానశక్తిని దెలుసుకొని వాక్యమునకును వక్తృ యథార్థజ్ఞానఘటితసాధ్యమునకును వ్యాప్తిని నిశ్చయించవలెను. అట్లైనచో విలంబకారి యగు లింగముచే నిశ్చయించఁదగునది యేమిగలదు? వ్యాప్తి స్మరణకంటెఁ బూర్వమందె సంసర్గప్రత్యయముఁ గలుగుచున్నది. ఆలోచించఁగా వ్యాప్తి స్మరణాదివిలంబముచే నను మితి విలంబమగును గాన వాక్యముచే సిద్ధించిన సంసర్గమునకు సాధకమైనందున ననుమానమునకే యనువాదకత్వము రావలసివచ్చును.

మూ. లోకే వక్తురాప్తత్వనిశ్చయోఽపేక్షణీయ ఇతి చేన్న. తద్రహితస్యాపి స్వార్థప్రత్యాయనే శబ్దస్య శక్తేరవధారణాత్, అన్యథా వేదేష్వ

ర్థప్రత్యయో న స్యాత్, తదభావాత్, న చ లోకేఽన్యాన్యేవ పదాని, యేన శక్తివైచిత్ర్యం స్యాత్.

తా. లౌకికవాక్యమువలనఁ గలుగు నర్థప్రత్యయము వక్తయొక్క యాప్తత్వనిశ్చయము నపేక్షించును. అది యనుమానసాధ్యము. కాన ననుమానాపేక్ష వాక్యార్థబోధలో నావశ్యకమని యాశంకింపవలదు. వేదవాక్యములు పౌరుషేయములు గానందున వక్తయందాప్తత్వనిశ్చయము లేకపోయినను వాక్యార్థప్రత్యయముఁ గలుగుచున్నందున వక్తయొక్క యాప్తత్వనిశ్చయ మనపేక్షిత మనినచో నీరీతిగ వ్యభిచారము సంభవించును. వేదములో నేయేవాక్యములు కానవచ్చుచున్నవో లోకములో గూడ నాయావాక్యములే గానవచ్చుచున్నవి. కాన శక్తివైచిత్ర్యము లేదు. కాఁబట్టి అనుమానాపేక్ష లేదు.

మూ. అనాప్తోక్తౌ వ్యభిచారదర్శనాత్తుల్యాపి సామగ్రీ సందేహేన శిథిలాయతే ఇతి చేన్న. చక్షురాదౌ వ్యభిచారదర్శనేన శంకాయామపి సత్యాం జ్ఞానసామగ్రీతస్తదుత్పత్తిదర్శనాత్.

తా. వక్తయొక్క యాప్తత్వనిశ్చయమును వాక్యార్థప్రత్యయ మపేక్షించనిచో వాక్యమందాప్తోక్తత్వసంశయమున్నందున వాక్యార్థప్రత్యయముఁ గలుగదు. స్థాణుపురుషసంశయమున్నపుడు చక్షుస్సెటుల నిశ్చాయకము గాదో యటులనే యాప్తోక్తత్వా నాప్తోక్తత్వ సందేహ మున్న

పుడు శబ్దము వాక్యార్థప్రత్యాయకము గానేరదు. కాన నాప్తత్వనిశ్చయ మావశ్యకమని యాశంకింప వీలులేదు. సమానవిషయకసంశయమే ప్రతిబంధకము. సందేహమాప్తత్వ మును, అనాప్తత్వమును గోచరించును. ఇట్టి భిన్నవిషయకసందే హమున్నను వాక్యమువలన నర్థప్రత్యయముఁ గలుగును. కలుఁగదనినచో చక్షుస్సునందుఁ బ్రమాజనకత్వా ప్రమాజనక త్వసందేహ మున్నపుడు చక్షుస్సువలన జ్ఞానసామాన్యసామ గ్రిచేఁ బ్రత్యక్షముఁ గలుగకపోవలసి వచ్చును. కాన, తద్ధర్మిక విభిన్నసంశయము దానివలనఁ గలుఁగు జ్ఞానముఁగూర్చి ప్రతి బంధక మనుటకు వీలులేదు.

మూ. జ్ఞాయమానస్యాయం విధిర్యత్సందేహే సతి నిశ్చాయకం, యథా లిఙ్గమ్, చక్షురాది తు సత్తయేతి చేన్న. వాక్యస్య నిశ్చితత్వాత్, ఫల ప్రామాణ్యసందేహస్య చ ఫలోత్తరకాలీన త్వాత్. ఆప్తోక్తత్వస్య చార్థప్రత్యయం ప్రత్య నంగత్వాత్. లోకేపి చాప్తత్వానిశ్చయేపి వాక్యార్థప్రతీతేః, భవతి హి వేదానుకారేణ పఠ్యమానేషు మన్వాదివాక్యేషు అపౌరుషే యత్వాభిమానినో గౌడమీమాంసకస్యార్థ నిశ్చయః, న చాసౌ భ్రాంతిః. పౌరుషేయత్వ నిశ్చయదశాయామపి తథా నిశ్చయాదితి.

తా. చక్షుస్సు అజ్ఞాయమానమై యర్థప్రత్యయములో నుపయోగించును. అట్టిస్థలమందు శంక (సందేహము) ప్రతి

బంధకము గాకపోయినను, వాక్యము లింగమువలె జ్ఞాతమై యర్థప్రత్యాయకము గాన సందేహ మర్థప్రతీతిలోఁ బ్రతి బంధకమని యాశంకింపవలదు. ఈసందేహము. ౧. వాక్య మందా? ౨. ఫలప్రామాణ్యమందా? 3. ఆప్తోక్తత్వమందా? వాక్యము నిశ్చితమగుటవలన వాక్యస్వరూపసంశయమే లేదు. వాక్యార్థప్రత్యయముఁ గలిగినపిదప దానియందుఁ గలుగు ప్రామాణ్యసంశయము సంశయముకంటెఁ బూర్వమందుండు వాక్యార్థజ్ఞానప్రతిబంధకము గానందున, రెండవపక్ష మనుప పన్నము ఆప్తోక్తత్వనిశ్చయము వాక్యార్థప్రత్యయములో నుపయోగించనందున మూఁడవపక్షముఁగూడ సరియైనదిగాదు. వేదస్థలమం దాప్తోక్తత్వప్రతీతి యంగము కాకపోయినను, లౌకికవాక్యస్థలమం దపేక్షితమని చెప్పుటకు వీలులేదు. ఉభయ మును దుల్యమగుటవలన లౌకిక శబ్దస్థలమందుఁగూడ నాప్తో క్తత్వనిశ్చయాపేక్ష యనవసరము. వేదమువలె స్వరములతోఁ బఠించు మన్వాదివాక్యమం దపౌరుషేయత్వనిశ్చయముఁ గల గౌడమీమాంసకునకుఁ గూడ నర్థప్రత్యయముఁ గలుగు చున్నది. కావున నర్థప్రత్యయములో నాప్తోక్తత్వప్రతీతి యంగము గాదు. పౌరుషేయత్వనిశ్చయ మున్నపుడును వాక్యార్థప్రతీతిఁ గలుగుచున్నందున వారలకుఁ గలుగు నీ నిశ్చయము భ్రాంతియనుటకు వీలులేదు.

మూ. స్యాదేతత్, నాప్తోక్తత్వమర్థప్రతీతే రంగమితి బ్రూమః. కింత్వనాప్తోక్తత్వశంకానిరాసః. స చ క్వచిదపౌరుషేయత్వనిశ్చయాత్, క్వచిదాప్తో

క్తత్వావధారణాదితి చేత్. తత్కిమపౌరుషే
యత్వస్యాప్రతీతౌ సందేహే వా వేదవాక్యా
ద్విదితపదార్థసంగతేరర్థప్రత్యయఏవ న భవేత్,
భవన్నపి వా న శ్రద్ధేయః?

తా. వాక్యమువలనఁ గలుగు నర్థప్రతీతిలో నాప్తోక్తత్వ మంగమని (సాక్షాదుపకారమని) చెప్పుట లేదు. మరేమన అనాప్తోక్తత్వ శంకానిరసనములో నుపయోగించును. కొన్ని స్థలములయం దపౌరుషేయత్వ నిశ్చయమువలనను, గొన్ని స్థలములయం దాప్తోక్తత్వ నిశ్చయమువలనను శంక నివర్తించును. కాన ననాప్తోక్తత్వ శంకానిరసనద్వారమున నాప్తోక్తత్వనిశ్చయ ముపయోగించు ననినచో వేదవాక్యమువలనఁ బదపదార్థసంగతి గ్రహమున్నపుడు అపౌరుషేయత్వనిశ్చయము లేనప్పుడు గాని అనాప్తోక్తత్వసందేహ మున్నప్పుడు గాని వాక్యార్థబోధ గలుగదనెదవా? కలిగినను నావాక్యార్థప్రత్యయ మప్రామాణ్యశంకాకలుషితముఁ గాన ప్రమాణముగ స్వీకరించమనెదవా.

మూ. ప్రథమే సత్యాదయ ఏవ ప్రమాణం. న చాసం
సర్గాగ్రహే తదానీం సంసర్గవ్యవహారో, బాధ
కస్యాత్యన్తమభావాత్. తథాపి తత్కల్పనా
యామన్వయోచ్ఛేదప్రసంగాత్. ద్వితీయేత్వ
శ్రద్ధా ప్రత్యక్షవన్నిమిత్తాంతరాన్నివర్త్స్యతీతి
వేదే యది, లోకేపి తథాస్యాదవిశేషాత్.

అన్యథా వేదస్యాప్యనువాదకతా ప్రసంగః. త దుచ్యతే.

శ్లో. వ్యస్తపుందూషణాశంకైస్స్మారితత్వాత్పదైరమీ,
అన్వితా ఇతి నిర్ణీతే వేదస్యాపి న తత్కుతః. ౧౫

తా. ప్రథమపక్షమున ననఁగా నపౌరుషేయత్వనిశ్చయము లేనపుడు గాని దానియొక్క సందేహ మున్నపుడు గాని యితరసామగ్రియంతయు నున్నను వాక్యార్థబోధ గలుగదన్నపక్షమున వాక్యార్థబోధ గలుగదనుటలో శపథమే ప్రమాణము గావలసివచ్చును. శ్రోతకు సంసర్గవ్యవహారముఁ గలుగుచున్నందున నాస్థలమందు సంసర్గప్రత్యయముయొక్క సద్భావమునే యూహింపవలెను గాని దానియొక్క యభావము నూహించుటకు వీలులేదు. అనాప్తోక్తత్వ రూపబాధకము లేనందున, నసంసర్గాగ్రహమందే సంసర్గమను వ్యవహారముఁ గల్గునుగాని సంసర్గప్రత్యయముఁ గలుగుట లేదనిన సర్వత్ర ఇటులనే చెప్ప వీలగును గాన సంసర్గప్రత్యయమే లేకపోవలసివచ్చును సంసర్గప్రత్యయాజనకమైనందున శబ్దమునకుఁ బ్రామాణ్యవిలోపము వచ్చును. రెండవపక్షమునం దనఁగా వాక్యార్థప్రతీతిఁ గలిగినను దానియం దప్రామాణ్యశంక యుండునన్నపక్షమున వేదవాక్యమువలనఁ గలుగు వాక్యార్థబోధయందు నితరకారణములవలన నప్రామాణ్యశంక నివర్తించినచో లౌకికశబ్దములుగూడ నట్టివే గాన నిక్కడఁగూడఁ బ్రత్యక్షమందువలె నివర్తించును. ఇట్లంగీకరించనిచో లౌకికవాక్యములకు ననుమానసిద్ధమగు సంసర్గానువాదకత్వమే యంగీకరించినచో

వేదముఁ గూడ నట్టిదే గాన దానికిఁ గూడ ననువాదకత్వము స్వీకరింపవలసివచ్చును. ఈయాశయమునె పైశ్లోకము వ్యక్తీకరించుచున్నది. "ఏతేపదార్థాః మిథ స్సంసర్గవంతః. పురుషదోషశంకాశూన్య పదస్మారితత్వాత్." అను ననుమానసిద్ధ సంసర్గానువాదకత్వము లోకములో నున్నశబ్దములకు స్వీకరించినచో వేదమునకుఁగూడ నటుల యనువాదకత్వ ముండదా? అని దానియర్థము.

మూ యదా హ్యాపౌరుషేయత్వనిశ్చయాత్ప్రాక్,
వేదో న కించిదభిధత్తే ఇతి పక్షః, తదాఽఽప్తో
క్తత్వనిశ్చయోత్తరకాలం లోకవద్వేదేప్యపౌ
రుషేయత్వనిశ్చయాత్పశ్చాదనుమానావతారః.
ఇయాంస్తు విశేషః, యదత్ర పదార్థానేవ పక్షీ
కృత్య నిరస్తపుందోషాశంకైరాకాంక్షాదిమ
ద్భిః పదైస్స్మారితత్వాదాప్తోక్తపదకదంబకస్మారిత
పదార్థవత్ సంసర్గవత్త్వ సాధ్యః,బుద్ధివ్యవ
హితస్త్వితరత్రేతి ఫలతో న కశ్చిద్విశేష ఇతి.
తథా చాన్వితాభిధానేఽపి జఘన్యత్వాద్వే
దస్యానువాదకత్వప్రసంగః. న చైవం సతి తత్ర
ప్రమాణమస్తి.

తా. అపౌరుషేయత్వనిశ్చయముకంటెఁ బూర్వమందు వేదము దేనిని బోధించనిచో, నటులనే యాప్తోక్తత్వనిశ్చయానంతరమున లోకములోవలె వేదమం దపౌరుషేయత్వనిశ్చయముఁ గలిగిన పిదపనే చెప్పిన యనుమానము ప్రవర్తించును. వేదస్థలమందుఁ బదార్థములే పక్షము గాన సాక్షా

త్సంసర్గ సిద్ధించును. లోకములోఁ బదపక్షకానుమానమున తాత్పర్యవిషయపదార్థసంసర్గావగాహి వక్తృయథార్థ జ్ఞాన పూర్వకత్వము సాధ్యము. జ్ఞానవిశేషణమై సంసర్గ సిద్ధించును. ఉభయత్ర ననుమానమువలననే సంసర్గసిద్ధియగుటలో నేమియు విశేషము లేనందున నన్వితాభిధానవాదములోఁ గూడ వేద మున కనువాదకత్వప్రసంగము వచ్చును. అనుమానమువలన సంసర్గ సిద్ధించుచుండఁగా శబ్ద మన్వితాభిధానమువిషయమై ప్రమాణమని చెప్పుటకు కట్టిప్రమాణము లేదు.

మూ విశిష్టప్రతిపత్త్యన్యథానుపపత్త్యా హి శబ్దస్య తత్ర శక్తిః పరికల్పనీయా, సా చానుమానే నైవోపపన్నేతి వృథా ప్రయాసః. తస్మాల్లోకే శబ్దస్యానువాదకతేతి విపరీతకల్పనేయ మాయు ష్మతాం.

తా. అన్వితాభిధానకల్పనయందు వృథా ప్రయాసమని లౌకికశబ్దములకే యనువాదకత్వ మిచ్ఛయించుచున్న వానికి వేదమునకుఁగూడ ననిష్టమైన ననువాదకత్వప్రసంగము వచ్చి నది. ఇంతవరకు నన్వితాభిధానవాదము నంగీకరించి లోకవేద ములకుఁ దుల్యత్వ మంగీకరించఁబడినది. "కిం చేదమి"త్యాది గ్రంథముచే నన్వితాభిధానవాదముఁగూడ సిద్ధసాధనాదిదోష ములచే నిరాకరింపఁబడుచున్నది.

మూ. కిం చేదమన్వితాభిధానం నామ? న తావదన్వి తప్రతిపాదనమాత్రం, అవివాదాత్. నాపి స్వా ర్థాభిధాయాస్తత్ర తాత్పర్యం, అవివాదాదేవ. నాపి సంగతిబలేన తత్ప్రతిపాదనం, వాక్యార్థ

స్యాపూర్వత్వాత్. నాపి స్వార్థసంగతిబలేన, తస్య స్వార్థఏవోపక్షయాత్. నాపి సైవ సంగతి రుభయప్రతిపాదికా, ప్రతీతిక్రమానుపపత్తేః, యోగపద్యాభ్యుపగమే తు యోగ్యత్వాది ప్రతిసంధానశూన్యస్యాపి పదార్థప్రత్యయ వద్వాక్యార్థ (ర్థాభిధాయక) ప్రత్యయప్ర సంగాత్.

తా. అన్వితాభిధాన మననేమి? పదములకు సాక్షా ద్వాక్యార్థాభిధాయకత్వము లేకపోయినను అభిహితాన్వయ వాది మతమందుఁగూడ వాక్యార్థబోధకత్వ ముండును గాన అన్వితప్రతిపాదకత్వము; అన్వితాభిధాన మైనచో అభిహితా న్వయవాదులకుకూడా నిష్టమైనందున వివాదయే లేదు. పద శక్తికి వాక్యార్థబోధయందే తాత్పర్యమనినచో నిదిగూడ ఉభయవాదిసమ్మతముః గాన వివాదమునకు నవసరము లేదు.

శక్తిబలముచే వాక్యార్థప్రతిపాదకత్వ మనినచో (1) ఈశక్తి వాక్యార్థమందా? (2) లేక పదార్థమాత్రమందా? శక్తి గ్రహముకంటె పూర్వమందు వాక్యార్థము స్మృతము గానందున వాక్యార్థమందు శక్తిగ్రహమె దుర్లభము.

(2) రెండవపక్షమున పదశక్తి పదార్థమందు గృహీ తమై పదార్థబోధనే గలుగఁజేయును గాని వాక్యార్థబోధలో నుపయోగించదు పదశక్తి యేపదార్థమును వాక్యార్థమును గూడ బోధించుననుటకుఁగూడ వీలులేదు. పదార్థస్మృతికాల మందే అపేక్షణీయమైనది మఱియొకటి లేనందున వాక్యార్థ ప్రతీతిఁగూడఁ గలుగవలసి వచ్చును. పదార్థస్మృతికి వాక్యార్థ

ప్రతీతికి క్రమము యున్నది. దానికి భంగము వచ్చును. పదార్థస్మృతికి వాక్యార్థబోధకు ఒకేక్షణమందు యుత్పత్తి స్వీకరించినచో యోగ్యతాప్రతిసంధానము లేనిసమయమున పదార్థబోధవలె వాక్యార్థబోధ గలుగవలసి వచ్చును.

మూ. నాపి సైవ సంగతిః స్వార్థే నిరపేక్షా వాక్యార్థే తు పదార్థప్రతిపాదనావాన్తరవ్యాపారేతి యుక్తం, తస్యాః స్వయమకరణత్వాత్. సంగతాని పదాని హి కరణం, న తు సంగతిః.

తా. ఆ పదశక్తియే పదార్థస్మృతిలో నిరపేక్షమై వాక్యార్థబోధలో పదార్థస్మరణమును వ్యాపారముగా జేసికొని వాక్యార్థబోధను గలుగఁజేయునని జెప్పుటకుకూడ వీలులేదు ఏలనన, అవాంతరవ్యాపారము నపేక్షించి కార్యములో సమర్థమైనదియే కరణము పదార్థస్మృతిని ద్వారముగా జేసికొని సంగతమైన పదములే కరణములు గాని సంగతికరణము గాదు.

మూ. తథాపి తత్ప్రతిపాదనానుగుణసంగతిశాలీనిపదానీతి చేత్. న తావద్వాక్యార్థప్రతిపాదనానుగుణసంగతేస్తదాశ్రయత్వేన, సామాన్యమాత్రగోచరత్వాత్. తద్వన్మాత్రగోచరత్వాద్వా, నాపి తదనుగుణవ్యాపారవత్త్వేన, అకరణత్వాదిత్యుక్తం, తదనుగుణకరణవ్యాపారోత్థాపకత్వాత్తదనుగుణత్వేన నో వివాదః.

తా. వాక్యార్థప్రతిపాదనానుగుణమగు సంగతితో గూడుకున్న పదములే కరణమని చెప్పెదము. సంగతి కరణ

కోటిలోఁ జేరినందున అవాంతరవ్యాపారయోగమున్నది గాన కరణత్వము సిద్ధించునని యాశంకింపవలదు. సంగతికి వాక్యార్థప్రతిపాదనానుగుణత యనఁగా సాక్షాద్వాక్యార్థ బోధకత్వరూప మనుటకు వీలులేదు. ఈపదమున కిది వాచ్యము అని పదార్థాశ్రితమగు వాచ్యతాగ్రహముగాని వాక్యార్థాశ్రిత వాచ్యతాగ్రహము గాదు. పదార్థాశ్రయమగుసంగతి వాక్యార్థమును బోధింపనేరదు. అన్యాశ్రయమగుసంగతి అన్యమును బోధించినచోఁ ఘటాశ్రయమగు ఘటపదసంగతివలన పటబోధగూడఁ గలుగవలసి వచ్చును. కాన సాక్షాత్తు వాక్యార్థబోధకత్వము సంభవింపదు. సామాన్యము అనఁగా జాతియే పదార్థమని కొందఱి మతము. "జాతిమత్తే" యని కొందఱి మతము. జాతినిగాని, తద్వ్యక్తినుగాని బోధించును. వాక్యార్థబోధకత్వము సాక్షాత్తు సంభవింపదు.

(2) సంగతి కరణముగాదని జెప్పియే యున్నందున వాక్యార్థజ్ఞానానుగుణత వాక్యార్థజ్ఞానానుకూల వ్యాపారవత్త్వరూప మనుటకు వీలులేదు.

(3) వాక్యార్థబోధానుకూలపదార్థస్మృతి హేతుత్వరూప మైనచోఁ సంగతి విశిష్టపదజ్ఞానమువలన పదార్థస్మృతిఁ గలిగి వాక్యార్థబోధ బుట్టును గాన పదార్థస్మరణ కారణజ్ఞాన విషయ మగుసంగతికి వెనుకఁజెప్పిన వాక్యార్థబోధానుగుణత మా కిష్టమగుటవలన వివాదయే లేదు.

**మూ. అన్వితఏవ శక్తిరితి చేత్. ఉక్తమత్ర వాక్యార్థస్యాపూర్వత్వాత్. ప్రతీతిక్రమానుపపత్తేశ్చేతి.**

తా. శక్తిగ్రహముకంటె పూర్వమందు వాక్యార్థము స్మృతము గాదనిన్ని, పదార్థస్మృతి వాక్యార్థబోధక్రమముకు ననుపపత్తి వచ్చునని జెప్పియున్నందున పదమునకు అన్వితశక్తిఁ జెప్పుటకు వీలులేదు.

మూ. స్మృతక్రియాన్వితే కారకే స్మృతకారకాన్వితాయాం చ, క్రియాయాం సంగతిరతో నోక్తదోషావకాశః, నాపి పర్యాయతాపత్తిః, ప్రాధాన్యేన నియమాత్. నాపి పౌనరుక్త్యం, విశేషాన్వయే తాత్పర్యాత్. నాపీతరేతరాశ్రయత్వం, స్వార్థస్మృతావనపేక్షణాత్. నాపి వాక్యభేదాపత్తిః, పరస్పరపదార్థస్మృతిసన్నిధౌ తదితరానపేక్షణాదితి చేత్, న.

తా. అన్వితాభిధానపక్షములో లోగడ ఉపన్యసించిన దోషములను వారించుటకు ప్రాభాకరుఁడు స్మృతక్రియాన్వితే అనునది మొదలుకొని, చేదిత్యంతగ్రంథముచే నాశంకించుచున్నాఁడు. పదాంతరస్మారితమగు కారకముతో నన్వితమగు క్రియయందు క్రియాపదమునకు క్రియాపదముచే స్మృతమగు క్రియచే నన్వితమగు కారకమందు కారకపదమునకు శక్తి స్వీకరించెదము. స్మరణోత్తరము వాక్యార్థబోధ కలుగును. కాన వాక్యార్థమున కపూర్వత్వము లేదు. కాన సంగతి గ్రహము గలుగును. క్రమనిరోధముఁగూడ లేదు. క్రియాపదమునకు కారకము. గారకపదమునకు క్రియయు నర్థమగుటవలన కారకపదమునకు క్రియాపదమునకు సమానార్థకత్వరూప పర్యాయతాపత్తి వచ్చునని యాశంకింపరాదు. "

దనంపచతి" అనుస్థలమందు "జీదనం" అను కారకపదము జీద నత్వమును నిమిత్తముగా జేసికొని ప్రధానముగా జీదనము నే బోధించును. ఇటులనే క్రియాపదమున్ను పాకత్వమును నిమిత్తముగాఁ జేసికొని పాకరూపక్రియనే ప్రధానముగ బోధించును. ఇట్టి ప్రధానార్థములు భిన్నమగుటవలన పర్యాయతాపత్తి యాశంకించుట కవకాశము లేదు. కాని క్రియాపదముచే చెప్పఁబడ్డ కారకాన్వితక్రియయే వాక్యార్థ మగుటవలన వాక్యార్థమునకు పౌనరుక్త్యదోషమని యాశంకింపరాదు. పదముచే బోధింపఁబడునది సామాన్యముగా కారకాన్వితమగు క్రియవాక్యమునకు కారకవిశేషముతోఁగూడిన క్రియావిశేష రూపార్థమందు తాత్పర్యము. సామాన్యవిశేషములకు భేద మున్నందున పౌనరుక్త్యము లేదు. కాని క్రియాపదముచే కారకముతోగలసిన క్రియయొక్క యుపస్థితిఁ గలుగవలసి వచ్చినపుడు కారకపదమువలనఁగలుగు కారకోపస్థితియొక్క యపేక్ష యుండవలెను. ఇటులనె కారకపదముచే క్రియాన్వితకారకముయొక్క యుపస్థితిఁ గలుగవలసి వచ్చునప్పుడు క్రియాపదముచే గలుగు క్రియోపస్థితి యపేక్ష యుండవలెను. కాన పరస్పరాశ్రయప్రసంగము వచ్చునని యాశంకింపరాదు. కారకపదమువలన క్రియాన్వయ విశిష్ట కారకోపస్థితియు క్రియాపదమువలన కారకాన్వయవిశిష్ట క్రియోపస్థితియుఁ గలిగినయెడల పరస్పరాశ్రయప్రసంగమున కవకాశము గలుగును. కారకక్రియాపదములవలన అన్వయ విశిష్ట కారకక్రియలే ఉపస్థితము లగును. పిమ్మట క్రియాపదమువలన క్రియానుయోగిక కారకప్రతియోగిక విశేషా

న్వయబోధ గలుగును. "జీ దనంపచతి" అనుస్థలమందు క్రియా పదమునకు కారకాపేక్ష యున్నచో తేమన కర్మకపాకమునకు "జీ దనమానయేత్" వాక్యాంతరబోధిత ఆనయనకర్మ జీద నమునకు బోధ కలుగవలసివచ్చును. వాక్యార్థము వేరగుట వలనవాక్య భేదము రావలసివచ్చునని యాశంకింపరాదు.సన్నిధిఁ గూడ యపేక్షితము గాన సన్నిహితమును విడిచి అన్యమును యపేక్షింపదు. కాన పూర్వోక్తాశంక కవకాశము లేదు. ఇట్టి ప్రాభాకరమతము సరిగాదు.

మూ. అన్వితే సంగతిగ్రహ ఇతి కోర్థః? యది యత్ర సంగతిః, తద్వస్తుగత్యా పదార్థాన్వితం, న కిం చిత్ప్రతికృతోపయోగి, న హి యత్ర చక్షుషః సామర్థ్యమవగతం తద్వస్తుగత్యా స్పర్శవదితి తద్వత్తాపి తస్య విషయః. అథాన్వితతయైవ తత్ర వ్యుత్పత్తిరిత్యర్థః.తదసత్, ప్రమాణాభావాత్.

తా. అన్వితమందు శక్తిగ్రహము అనుదాని కర్థమేమి? దేనియందు శక్తి స్వీకరించెదరో అది వస్తుగత్యా మఱియొక పదార్థముతో అన్వితమైనను ప్రకృతమున నేమియు బాధ లేదు. చక్షురింద్రియము ఘటమును గ్రహించును. ఆఘటము స్పర్శతోఁ గూడుకున్నను దానినిఁగూడ గ్రహించునా? లేదు. అటులనే ఘటమానయ అనుస్థలమందు ఘటపదమునకు ఘట మందును, ఆనయనపదమున కానయనమందును శక్తి యున్నది. ఘటము ఆ నయనాన్వితము. ఆ నయనము ఘటాన్వితము. అయినను ఘటానయనాదిపదములు ఆనయన ఘటాదులను గూడ బోధించవలెనను పగడ లేదు. కాన అన్వితమందు శక్తి

గ్రహము అనునది నిరర్థకవాక్యము ప్రమాణము లేనందున అన్వయపురస్కారేణ శక్తిగ్రహము అనుటకు వీలులేదు.

మూ. అన్వితార్థప్రతిపత్త్యన్యథానుపపత్తిరితి చేన్న. అనన్వితాభిధానేనాప్యుపపత్తేః. ఆకాంక్షానుపపత్తిరస్తు, న హి సామాన్యతోఽన్వితానవగమేఽన్వయవిశేషే జిజ్ఞాసా స్యాత్. న దృష్టే ఫలవిశేషే రసవిశేషజిజ్ఞాసావదాక్షేపతోఽప్యుపపత్తేః, శబ్దమహిమానమంతరేణ యతః కుతశ్చిదపి స్మృతేషు పదార్థేషు, అన్వయప్రతీతిః స్యాత్. న చైవం తతశ్శబ్దశక్తిరవశ్యం కల్పనీయేతి చేత్.

తా. అన్వితమందు శక్తిని స్వీకరించనిచో అన్వితార్థరూపవాక్యార్థబోధ యనుపపన్నము. కాన నన్వితమందు శక్తిని స్వీకరించుటలో అన్వితార్థబోధానుపపత్తి రూపార్థాపత్తి ప్రమాణమున్నదని యాశంకింపరాదు. అన్వితమందు శక్తిని స్వీకరించక పదార్థమందు శక్తిని స్వీకరించినను, అన్వయబోధ యుపపన్న మగుచున్నది గాన యనుపపత్తి రూపయర్థాపత్తి కవసరము లేనందున, అర్థాపత్తివలన అన్వితమందు శక్తి సిద్ధించుననుటకు వీలు లేదు.

పచతి అను క్రియాపదము ప్రయోగించినపుడు 'జీ' దనమునా? లేక, 'తే' మనమునా యను కారకవిశేషసంబంధమును గోచరించెడు జిజ్ఞాస గలుగును. ఇట్టి జిజ్ఞాసారూపమగు నా

కాంక్ష క్రియాకారకములకుండు సామాన్యసంబంధప్రతీతి లేనిదీ యనుపపన్నము గాన ఆకాంక్షానుపపత్తి రూపప్రమాణమే అన్వితమందు శక్తిసాధకమని యాశంకింపరాదు. చక్షురింద్రియముచే రూపవిశేషము దృష్టమైనపిదప, రససామాన్యము ననుమేయించి రసవిశేషమందు యెటుల జిజ్ఞాస గలుగునో అటులనే క్రియాకారకముల కవినాభావమువలన వాట్లకు సామాన్యసంబంధము ననుమేయించి విశేషసంబంధమందు జిజ్ఞాస గలుగును. కాన అన్వయవిశిష్టమందు శక్తి యనవసరము. "జీ దనంపచతి" అను వాక్యమువలనఁ గలుగు బోధలో ప్రత్యక్షాదులచే ఉపస్థితమగువాటియొక్క అన్వయము భాసించక శబ్దముచే స్మృతమైనపదార్థ సంసర్గవిశేషమే భాసించుచున్నది. కావున అన్వయవిశేషభావములో శబ్దమునకే ఉపయోగము గాన శబ్దమున కన్వయసామాన్యమందు శక్తి కల్పించవలెనని యాశంకింపరాదు.

మూ. కుతస్తర్హి కవికావ్యాని విలసంతి. న హిసంసర్గ
విశేషమప్రతీత్య వాక్యరచనా నామ, న చ
స్వోత్ప్రేక్షాయాం ప్రత్యక్షమనుమానం, శబ్ద
స్తదాభాసా వా సంభవంతి, అన్యత్ర చింతా
వశేన పదార్థస్మరణేభ్యః.

తా. పదార్థములకు కరణత్వము చెప్పుభట్టుఁడు "కుతస్తర్హీతి" గ్రంథముచే ప్రాభాకరుని ఉట్టంకించుచున్నాఁడు. చింతావశముమువలన పదార్థములను కల్పించి నూతనముగా కావ్యరచనఁ జేయును. పదార్థములే కరణములు. సంబంధసామాన్యమందు శక్తమగుపదములకే కరణత్వమని చెప్పి

నచో పదములుగాని సంబంధసామాన్యమందు శక్తిగ్రహము గాని లేనందున నూతనకావ్యరచనయే లేకపోవలసి వచ్చును. పదార్థోత్పత్తిలో ప్రత్యక్షముగాని, ప్రత్యక్షాభాసముగాని, అనుమానముగాని, అనుమానాభాసముగాని, శబ్దముగాని, శబ్దాభాసముగాని లేనందున పదార్థములే కరణములు ఏస్థల మందు పదమువలన పదార్థోపస్థితిఁ గలుగునో పదార్థస్మరణచే అన్యథాసిద్ధముగానపదములు కరణములు గావు. అట్లుకానిచో శ్వేతరూపముయొక్కయు దర్శనమున్నపుడు డెక్కలయొక్క ధ్వనినిఁబట్టియు దాని కంఠస్వరముయొక్క శ్రవణమునుబట్టియు శ్వేతపదము. అశ్వపదము ధావతిపదము లేకున్నను తెల్లని గుఱ్ఱము పరుగెత్తుచున్నది అను ప్రతీతి ఎటుల కలుగును. కాన స్మృతమైన పదార్థములే కరణములు గాని పదములు గావు. అట్లైనచో పచతి యనుదానివలన గలుగుబోధలో ప్రత్యక్షాదు లచే నుపస్థితమగువాట్లకు భాన ప్రసంగము వచ్చునని యాశం కింపరాదు. శబ్దముచే నుపస్థితమగు పదార్థమందు శబ్దముచే నుపస్థితమగు పదార్థముయొక్క సంబంధమే భాసించును. "శాబ్దీహ్యాకాంక్షా శబ్దేనైవ పూర్యతే" అను న్యాయమును బట్టి శబ్దోపస్థితపదార్థముయొక్క సంబంధమే భాసించును గాని ప్రత్యక్షాద్యుపస్థితపదార్థసంబంధ భానప్రసక్తి లేదు.

మూ॥ అసంసర్గాగ్రహోఽసావితి చేత్. మమ తావ
త్సంసర్గగ్రహ ఏవాసౌ, తవాపి సైవ పదావళీ
క్వచిదన్వయే పర్యవస్యతి క్వచిదనన్వయాగ్ర
హే, ఇతి కుతో విశేషాత్. ఆప్తానాప్తవక్తృ
కతయేతి చేత్. కిం తథావిధేన వక్త్రా తత్ర

కశ్చిత్ విశేష ఆహితః. అహో వక్తైవావ
చ్ఛేదకతయావిశేషః? ప్రథమే అభిహితాన్వయ
వాదినామివ తవాపి శక్తికల్పనాగౌరవం.

తా. ఉత్ప్రేక్షావశమువలన గలిగెడు అసంసర్గాగ్రహము కావ్యరచనలో హేతువనుటకు వీలులేదు. మాకు దేని వలననో దానివలన గలుగు సంసర్గప్రత్యయమే కావ్యరచనా హేతువు గాని అసంసర్గాగ్రహము కారణము గాదు. నీకు కూడా ఆనుపూర్వితో గూడుకొన్న పదసముదాయమువలన నొకానొకప్పుడు సంసర్గప్రత్యయమును, మఱియొకప్పుడు అసంసర్గాగ్రహమును బుట్టించుట యేవిశేషమునుబట్టియో జెప్పు ? ఆప్తునిచే ఉచ్చరించుటవలన సంసర్గప్రత్యయము. అనాప్తోచ్చరిత మైనయెడల అసంసర్గాగ్రహము అనినచో నీస్థలమందు అడగవలసి యున్నది. వక్తచే నీపదములయందు యేవిశేష మైనా యుంచఁబడ్డదా ? లేక పదవిశేషణమైన వక్తయొక్క విశేషమా? మొదటిపక్షమున అనఁగా పదములయందు వక్తచే ఒకవిశేషము నంగీకరించినచో అభిహితాన్వయవాదులకువలె నీకుకూడ శక్తి కల్పనాగౌరవము వచ్చును. పదములయందు ఆప్తుఁడైన వక్తచే బోధప్రయోజకమగు శక్తివిశేషమును యుంచనియెడల ననాప్తోక్త వాక్యమువలనఁ గూడ బోధ గలుగవలసివచ్చును. కాన వక్తచే నొకవిశేషము కల్పింపఁబడ వలెను. అభిహితాన్వయబోధను స్వీకరించిన భాట్టమతమందు వలె నీమతమందుఁగూడ నాప్తునియం దుపదోచ్చారణశక్తియు పదనిష్ఠాతిశయాధానశక్తియు వాక్యార్థధీశక్తియు నను మూఁడు కల్పించవలసివచ్చును గాన గౌరవము.

మూ. ద్వితీయే తువక్తురివ పదానామప్యవచ్ఛేదకతయైవ విశేషకత్వమస్తు. ఏవం తర్హి పదానామప్యన్వయ ప్రతీతావస్త్యుపయోగః, కస్సందేహః.పరం పదార్థాభిధానేన, న త్వన్యథా. యథా తవైవాప్తస్య సంసర్గపరతయా పదసమభివ్యాహారమాత్రేణ, న త్వన్యథా.

తా. ద్వితీయపక్షమందు పదార్థమందు శక్తివిశేషమును స్వీకరించక, పదములయందు ఆప్తోక్తత్వవిశేషమువలె పదోపస్థాప్యత్వము పదార్థమందు స్వీకరించెదము. ఆప్తునివలె పదములు గూడ అవచ్ఛేదకము లగుటవలన వీనికిఁగూడ విశేషణత్వము యుండును. అట్లైనచో పదములకుఁగూడ అన్వయ బోధలో నుపయోగ ముండునే అనుటలో సందియములేదు. నీమతమం దాప్తునకు పదోచ్చారణమాత్రమందే హేతుత్వము గాని వాక్యార్థబోధలో హేతుత్వము లేనట్లు, మామతమున పదములకు అవఛేదకతయా ఉపయోగమే గాని మఱియొకరీతిగా గాదు. ఆకాంక్షాదులతోఁ గూడుకున్న పదార్థములే అన్వయబోధను బుట్టించును. పదార్థములే యన్వయ బోధలో హేతువులైనపుడు పదములకుఁగూడ అన్వయ బోధకత్వము సిద్ధించును.

శ్లో. "న విముంచతి సామర్థ్యం వాక్యార్థేపి పదాని నః,
యజ్జ్వలంతి హి కాష్ఠాని తత్కింపాకం నకుర్వతే"

అనురీతిని పదములకుఁగూడ సామర్థ్యము సిద్ధమగును. పదార్థ

ములు కరణమను నీమతమున, పదమునకుఁగూడ వాక్యార్థ బోధలో నుపయోగము చెప్పినచో నాప్తునకుఁగూడ వాక్యార్థబోధకత్వము చెప్పుటకు వీలులేదు.

మూ. అన్యథా గురుమతవిదామేవ శ్లోకః ఆప్తపదప్రక్షేపేణ పఠనీయః. "శ్లో. ప్రాథమ్యాదభిధాతృత్వాత్తాత్పర్యోపగమాదపి, ఆప్తానామేవ సా శక్తిర్వరమభ్యుపగమ్యతామ్."ఇతి తస్మాత్ప్రకారాంతరేణ సంసర్గప్రత్యయో భవతు మా వా, పదార్థానామాకాంక్షాదిమత్వే సతి అభిహితానామవశ్యమన్వయ ఇతి కుతోఽతిప్రసంగః. న చైవం సతి పదార్థా ఏవ కరణం, తేషామనాగతాదిరూపతయా కారకత్వానుపపత్తౌ తద్విశేషస్య కరణత్వస్యాయోగాత్, తత్సంసర్గే ప్రమాణాంతరాసంకీర్ణోదాహరణాభావాచ్చ పదానాం తు పూర్వభావనియమేన పదార్థస్మరణావాంతరవ్యాపారవత్తయా తదుపపత్తేః వ్యాపారస్యావ్యవధాయకత్వాదితి కృతం ప్రసక్తానుప్రసక్త్యా.

అట్లయిన నీక్రింద నుదహరించు శ్లోకములో "పదానాం" అనుస్థానమున "ఆప్తానాం" అని యుండవలసివచ్చును.

**శ్లో. ప్రాథమ్యాదభిధాతృత్వా త్తాత్పర్యోపగమాదపి,**
**పదానామేవ సా శక్తి ర్వరమభ్యుపగమ్యతాం.**

తా. అందుచే నూతనమగు కవి కావ్యస్థలమున ప్రకా రాంతరముచే సంసర్గప్రత్యయము గాని అసంసర్గాగ్రహము గాని కలిగినను, ఆకాంక్షాదు లున్నప్పుడు అభిహితము లగు పదార్థములకే యన్వయబోధ యని జెప్పినప్పుడు ఏమిదోష ము? ఇట్లైన పదార్థములే కరణమనుటకు వీలులేదు. పదార్థ ములు వాక్యార్థబోధ కలుగుపర్యంత ముండనందున వాటికి సంసర్గప్రత్యయములో కరణత్వము చెప్పుటకు వీలులేదు. మఱియు ఏస్థలమున పదములు లేక పదార్థజ్ఞానమువలననే సంసర్గప్రత్యయము కలుగునో అట్టిస్థలమందు ప్రమాణాంతర జన్యోపస్థితివ్యాపారకమైన మనస్సునకే కరణత్వము సిద్ధించు టచే పదార్థముల కెంతమాత్రము కరణత్వము లేదు. పదా ర్థములవలె పదములుగూడ అతీతము లగుటవలన వాటికి మాత్రము సంసర్గప్రత్యయములో కరణత్వ మెట్లు సిద్ధించు నని యాశంకించరాదు. సంసర్గప్రత్యయముకన్న పూర్వమందు పదములు లేకపోయినను పదజన్యపదార్థోపస్థితి యుండుట వలన దానిని ద్వారముగా జేసుకొని పదములకు కరణత్వము సిద్ధింపవచ్చును. ఈరీతిని యనుమానముకన్న విలక్షణమగు ప్రామాణ్యము శబ్దమునకు సిద్ధించినది.

మూ. అస్తు తర్హి శబ్దఏవ బాధకం సర్వజ్ఞే కర్తరి
తథా హి, ప్రకృతేః క్రియమాణాని గుణైః
కర్మాణి సర్వశః. "అహంకారవిమూఢాత్మా కర్తా
హామితి మన్యతే. ఇత్యాది పఠంతి అస్యాయ
మర్థః" న పారమార్థికం చేతనస్య కర్తృత్వ
మస్తి. ఆభిమానికం తు తత్. న చ సర్వజ్ఞస్యా

ఽభిమానో, న చాసర్వజ్ఞస్య జగత్కర్తృత్వ
మస్తి ఉచ।

తా. అనుమానాదులకంటె విలక్షణ ప్రమాణముగా శబ్దము సిద్ధించినను ఇట్టిశబ్దమే, సర్వజ్ఞుఁడు జగత్కర్తయగు నీశ్వరునివిషయములో బాధకమని జెప్పెదము. ఎటులనఁగా ? అచేతనమగు ప్రకృతిసంబంధమైన సత్వరజస్తమోగుణములచే చేయఁబడు సర్వక్రియలును "అహంకరోమి"యను నహంకారముచే బద్ధుఁడై నేనే చేయుచున్నానని తలఁచుచున్నాఁడు. కాన చేతనునికి పారమార్థికమైన కర్తృత్వము లేదు. అహంకారమునుబట్టి వచ్చినందున ఆభిమానికమైన కర్తృత్వము సర్వజ్ఞునకు నభిమానముండదు. సర్వజ్ఞుఁడుగాని వానికి జగత్కర్తృత్వము సంభవించదు గాన ప్రకృతిసంబంధమగు గుణములవల్లనే యుపపన్నమగుచుండఁగా సర్వజ్ఞుఁడైన జగత్కర్తనొకం డంగీకరించవలెనను సాంఖ్యమతము సమంజసముగాదు.

శ్లో. న ప్రమాణమనాప్తోక్తిర్నాదృష్టే క్వచిదాప్తతా,
అదృశ్యదృష్టౌ సర్వజ్ఞో న చ నిత్యాగమః క్షమః. ౧౬

తా. "ప్రకృతేః క్రియమాణాని" యను యాగమ మాప్తునిచేఁ జెప్పఁబడినదా? లేదా ? లేనియెడల యప్రమాణమగుటవలన సర్వజ్ఞుఁడైన యీశ్వరునివిషయమై బాధకముగానేరదు ఆప్తునిచేఁ జెప్పఁబడినయెడల ఆగమప్రణయనహేతవగుజ్ఞానము ప్రత్యక్షానుమానాదులవలన గలుగనందున నిత్యమని యంగీకరించవలెను. కాన దానికి సర్వవిషయకత్వ మర్థవశమువలన సిద్ధించును. అట్టి సర్వవిషయకమైన

జ్ఞానముఁ గలవాఁడు గాన సర్వజ్ఞుఁడై నట్టియు నాప్తుఁడై నట్టియు నీశ్వరుఁడు సిద్ధించును. ఆగమము అనఁగా వేదము. నిత్య మని చెప్పుట కుదురదు.

మూ. యది హి సర్వజ్ఞకర్త్రభావావేదకశ్శబ్దో నాప్తో క్తః. న తర్హి ప్రమాణం, అథాప్తోఽస్య వక్తా కథం న తదర్థదర్శీ? అతీంద్రియార్థదర్శీతి చేత్. కథమసర్వజ్ఞః? కథం వా న కర్తా? ఆగమస్యైవ ప్రణయనాత్ న చ నిత్యాగమసంభవో, విచ్ఛే దాదిత్యావేదితం.

తా. సర్వజ్ఞుఁడైన కర్తయొక్క యభావమును బోధించు నాగమ మాప్తునిచేఁ జెప్పఁబడనిచో నాయాగమము ప్రమాణమే గాదు. ఆప్తునిచేఁ జెప్పఁబడినయెడల ఆగమార్థమును దెలియనివా డేలగును. అతీంద్రియమైన యాగమార్థమును జూచి యాగమప్రణయనముఁ జేసినచో నాప్తుఁడు సర్వజ్ఞుఁడు జగత్కర్తయని చెప్పవలెను. సృష్టిప్రలయములను సాధించి యున్నందున యాగమము నిత్యమనుటకు వీలులేదు.

అపి చః—

శ్లో. న చాసౌ క్వచిదేకాంతః సత్వస్యాపి ప్రవేదనాత్,
నిరంజనావబోధార్థో న చ సన్నపి తత్పరః. ౧౭

మూ. న హ్యాసత్త్వపక్షఏవాగమో నియతః, ఈశ్వర సద్భావస్యైవ భూయస్సు ప్రదేశేషు ప్రతిపాద నాత్. తథా చాగ్రే దర్శయిష్యామః. తథా చ

సతి క్వచిదసత్వప్రతిపాదనమనేకాంతం నబాధకం, సత్వప్రతిపాదనమపి తర్హి న సాధనమితి చేదాపాతతస్తావదేవమేతత్ యదా తు నిశ్శేషవిశేషగుణశూన్యాత్మస్వరూప ప్రతిపాదనార్థత్వమకర్తృకత్వాగమానామవధారయిష్యతే తదా న తన్నిషేధే తాత్పర్యమిమాషామితి సత్వప్రతిపాదకానామేవాగమానాం ప్రామాణ్యం భవిష్యతీతి న తేషామప్యన్యత్ర తాత్పర్యమితి వక్ష్యామః.

తా. ఈచెప్పినయాగమము జగత్కర్తయొక్క యభావమందే నియతము గాదు. సత్వముఁగూడ ననేకస్థలములందుఁ జెప్పఁబడినది. శ్రు. "ద్యావా పృథివీ జనయన్ దేవఏకః. విశ్వస్యకర్తాభువనస్య గోప్తా" అనుశ్రుతి సహస్రము నియతము గానందున యీయాగమమువలన యసత్వసిద్ధి గానిచో ననియత మగుటవల్లనే జగత్కర్తయొక్క సత్వముఁగూడ సిద్ధించకపోవలయునని యాశంకించరాదు. "ఆపాతతః" ఇట్టి యాశంకఁ గలిగినను "ప్రకృతేః క్రియమాణాని" యను యాగమము నిశ్శేషవిశేషగుణశూన్యాత్మ స్వరూపబోధపరముగాని, జగత్కర్తయొక్క యసత్వమును జెప్పునదిగాదని నిశ్చయించెదము. జగత్కర్తయొక్క సత్వమును బోధించుయాగమ మన్యపరము గాక సత్వమునే బోధించును. ఈవిషయము పంచమస్తబకమందు వివరించెదము:—

మూ. అస్త్వర్థాపత్తిస్తర్హి బాధికా తథా హి, యద్య భవిష్యన్నోపాదేక్ష్యత్, న హ్యసావనుపదిశ్య

ప్రవర్తయితుం న జానాతి, అతఉపదేశఏవా
న్యథానుపపద్యమాన స్తథావిధస్యా భావమౌ
దాసీన్యం వాఽఽ వేదయతి. న. అన్యథైవోప
పత్తేః.

శ్లో. హేత్వభావే ఫలాభావాత్ప్రమాణేఽసతి న ప్రమా,
తదభావాత్ప్రవృత్తిర్నో కర్మవాదేష్వయం విధిః. ౧౮

తా. అర్థాపత్తిప్రమాణమే సర్వజ్ఞకర్తయందు బాధ
కము. ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడయినచో నుపదేశమే లేక
పోవును. ఉపదేశము చేయకనే యాగాదికమందు ప్రవర్తింపఁ
జేయుట తెలియకపోవుట లేదు. కాన యీ యుపదేశము
వలన అసర్వజ్ఞత్వము కల్పించవలసి వచ్చుచున్నది. సర్వజ్ఞత్వము
లేకున్న జగత్కర్తృత్వము సంభవించదు. కాన సర్వజ్ఞుఁ
డగు జగత్కర్త లేడని యాశంకింపరాదు. లోకములో
కారణములేక కార్యోత్పత్తి యెక్కడను సంభవించుట లేదు
గదా! వేదార్థమును గోచరించుప్రమ ప్రమాణవిశేషము
నుపదేశరూపము నగు వేదములేనిచో సంభవించదు. వేదార్థ
మును గోచరించు ప్రమలేనిచో వేదోదితమగు కర్మలయందు
ప్రవృత్తి లేకపోవలసి వచ్చును. కర్మలయందు ప్రవృత్తి
వేదకర్తయగు సర్వజ్ఞుఁడు లేనిచో నుపపన్నము గాదు. గాన
వేదోపదేశమునుబట్టి సర్వజ్ఞుఁడగు నీశ్వరు నంగీకరించవలెను.
అదృష్టమువలననే ప్రవృత్తి గలుగుచుండఁగా వేదవాక్యము
వలన గలుగుప్రమ ఆవశ్యకముకాదనిన, యదృష్టమువలననే
భూతములకు ప్రవృత్తి యుపపన్నమగుచుండఁగా నుపదేశము

నకు వైయర్థ్యము కర్మవాదపక్షమునగూడ సంభవించును అని శ్లోకతాత్పర్యము.

మూ. బుద్ధిపూర్వా హి ప్రవృత్తిర్న బుద్ధిమనుత్పాద్య శక్యసంపాదనా. న చ ప్రకృతే బుద్ధిరప్యుపదేశమంతరేణ శక్యసిద్ధిః, తస్యైవ తత్కారణత్వాత్. భూతావేశన్యాయేన ప్రవర్తయేదితి చేత్. ప్రవర్తయేదేవ యది తదా ఫలసిద్ధిః స్యాత్. న త్వేవం. కుతఏతదవసితం ? ఉపదేశాన్యథానుపపత్త్యైవ. యస్యాపి మతే అదృష్టవశాదేవ భూతానాం ప్రవృత్తిస్తస్యాపి తుల్యమేతత్. యద్యస్తి ప్రవృత్తినిమిత్తమదృష్టం, కిముపదేశేన? తత ఏవ ప్రవృత్తిసిద్ధేః. న చేత్, తథాపి కిముపదేశేన? తదభావే తస్మిన్నత్యప్యప్రవృత్తేః. నిత్యః స్వతంత్రఉపదేశో న పర్యనుయోజ్య ఇతి చేత్. యూయం పర్యనుయోజ్యాః, యే తమవధానతో ధారయంతి విచారయంతి చేతి.

తా. ప్రవృత్తి బుద్ధిపూర్వకము గాన బుద్ధిలేనిచో నుపపన్నము గాదు. కాన బుద్ధిసంపాదన మావశ్యకము. ఉపదేశము లేనిచో బుద్ధి సంభవించదు. అట్టిబుద్ధినిగూర్చి యుపదేశము కారణము. మీమాంసకమతమందు కర్మలవలనఁ గలుగు నదృష్టము ప్రవర్తకమైనను దృష్టఫలసాధకమైనకర్మగుర్వధ్యయనమువలన గలుగుజ్ఞానము అదృష్టఫలసాధనమైన

యాగాది ప్రవృత్తిసాధకమని యందురు. గాన సర్వత్ర యదృష్టమునకే ప్రవర్తకత్వముఁ జెప్పినచో నీ మతమందుఁ గూడ నుపదేశవైయర్థ్యము తుల్యము. ఉపదేశము లేకపోయినను, భూతావేశన్యాయమువలన నీశ్వరుఁడు భూతములయందుఁ బ్రవేశించి ప్రవర్తింపఁ జేయఁగూడదా? యని యాశంకించవచ్చును. ఉపదేశము లేనిదీ ప్రవృత్తిగలిగినచో, నది యెక్కడను దృష్టముకాలేదు గనుక యుపదేశమువలన గలుగు జ్ఞానమే ప్రవర్తక మనుసంగతి యెట్లు తెలియఁబడ్డదనిన వేదోపదేశము మఱియొకరీతిగా నుపపన్నము గాదు. కాన నీరీతిగా నిశ్చయించెదము. అటులగానిచో నెవరిమతమందు నదృష్టవశమువలననే భూతములయొక్క ప్రవృత్తియో వారి మతమందుఁగూడ నుపదేశమునకు వైయర్థ్యము సంభవించును. ఉపదేశము నిత్యము గాన వైయర్థ్యాశంకఁ జేయుటకు వీలు లేదని దూషించకు మనినచో నుపదేశమును నేను దూషించుట లేదు. వేదమును జదివి దానిని ధారణజేసి విచారణఁ జేయు మిమ్ములను దూషించుచుంటిమి గాని, యుపదేశమును దూషించుట లేదు. వేదచోదితమగు కర్మలయందు గల్గు ప్రవృత్తిలో, విధివాక్యములవలన గలుగుజ్ఞానమే సాధనము, గాన నుపదేశమావశ్యకము. గనుక దీనినిబట్టి వేదకర్తయగు నీశ్వరునకు నసర్వజ్ఞత్వముఁ జెప్పుటకువీలు లేదు.

మూ. న చార్థాపత్తిరనుమానతో భిద్యతే, లోకే తద
సంకీర్ణోదాహరణాభావాత్. ప్రకారాంతరా
భావాచ్చ. తథా హి.

శ్లో. అనియమ్యస్య నాయుక్తిః నానియన్తోపపాదకః,
న మానయోర్విరోధోఽస్తి ప్రసిద్ధేనాప్యసౌ సమః. ౧౯

తా. ఇంతకుపూర్వమందు అర్థాపత్తికి వేరే ప్రమాణాంతరత్వము నంగీకరించి ప్రమాణాంతరమగు నర్థాపత్తికి జగత్కర్తయగు నీశ్వరుని సర్వజ్ఞత్వములో బాధకత్వము నిరాకరించఁబడినది. ప్రస్తుత మర్థాపత్తిస్థలమందు ననుమానము నకుఁ గోచరముగానట్టి విషయముగాని సామగ్రీభేదముగాని లేనందున నర్థాపత్తి యనుమానముకంటె వేరుప్రమాణము గాదనుసంగతి చెప్పఁబడుచున్నది. వ్యాప్యమువలన వ్యాపక జ్ఞాన మనుమానము. అనుపపద్యమానమువలన గలిగెడి యుప పాదకజ్ఞాన మర్థాపత్తి. కాన సామగ్రినిబట్టియు విషయమును బట్టియు ననుమానమునకు నర్థాపత్తికిని భేదమున్నదని శంకించ రాదు. అనుపపద్యమానము వ్యాప్యము. ఉపపాదకము వ్యాపకము. రాత్రిభోజనము లేనిచో పగలుభోజనము చేయని వానికిఁ బలిసియుండుట సంభవించదుగదా! కాన ప్రస్తుత మనుపపద్యమానమగు దివాభుంజానత్వవిశిష్టపీనత్వము వ్యాప్యము. ఉపపాదకమగు రాత్రిభోజనము. వ్యాపకము. కాన ననుమానవిషయమే యర్థాపత్తివిషయము. అనుమానసామగ్రియే యర్థాపత్తిసామగ్రి. గాన నర్థాపత్తికి ననుమానమునకును, విషయముచేతను సామగ్రిచేతను భేదము లేనందున నర్థాపత్తి యనుమానముకంటె వేరుకాదు. మఱియొక్కయుదాహరణము. జీవించియున్న దేవదత్తు డింటివద్దలేడను జ్ఞానమువలన దేవ దత్తునియందు బహిస్సత్వ మూహింపఁబడుచున్నది. వ్యాప్యము

గానిది యనుపపద్యమానము గాదు. వ్యాపకము గానిదానికి నుపపాదకత్వము సంభవించదు. వ్యాపకముయొక్క వ్యతిరేక జ్ఞానమువలననే వ్యాప్యముయొక్క వ్యతిరేకము సిద్ధించును. గాన ప్రస్తుతమున వ్యతిరేకములకు వ్యాప్తి గృహీతమై వ్యాప్యమందు పక్షధర్మతాజ్ఞానమువలన "దేవదత్తః బహిరస్తి" యను ననుమితియే గలుగును. గాన నర్థాపత్తి యను మానముకంటె వేఁగుప్రమాణము కాదు.

మూ. జీవంశ్చైత్రో గృహేనాస్తీత్యనుపపద్యమానమ
సతి బహిస్సద్భావే తమాపాదయతీత్యుదాహ
రంతి. తత్ర చింత్యతే. కిమనుపపన్నం జీవతో
గృహాభావస్యేతి. న హ్యనియమ్యస్యానియా
మకం వినా కించిదనుపపన్నం, అతిప్రసంగాత్.
ననుస్వరూపమేవ తత్. న తావబ్బహిస్సత్త్వేన
కర్తవ్యం, తదకార్యత్వాత్తస్య. స్థితిరేవాస్య
తేన వినా న స్యాదిత్యస్య స్వభావ ఇతి చేత్.
ఏవంతర్హి తన్నియతస్వభావఏవాసౌ వ్యాప్తే
రేవ వ్యతిరేకముఖనిరూప్యాయాస్తథా వ్యప
దేశః

తా. జీవించియున్న చైత్రునియందు బహిస్సత్త్వము లేక ననుపపద్యమానమైన యింటివద్ద లేకపోవుట జీవియైన చైత్రుని యందుఁ బహిస్సత్త్వమును కల్పించుననునది యర్థాపత్తికి నుదాహరణము. ఈవిషయము చర్చింపఁదగియున్నది. వ్యాప్యముఁ గానిదానికి వ్యాపకముగానిది లేనప్పు డేమి యనుపపత్తి? అవ్యాపకము లేనప్పుడు అవ్యాప్య మనుపపన్నమనినచో

వ్యాప్యము గానిదానిచేగూడ నవ్యాపకకల్పన జేయవలసి వచ్చును. గాన జీవియైన చైత్రునియొక్క గృహమందు లేక పోవుటకు నేమి యనుపపత్తి ? బహిస్సత్త్వము లేనిచో గృహాభావస్వరూపమే యనుపపన్నమనుటకు గృహాభావము బహిస్సత్త్వకార్యము గానందున యుక్తము గాదు. ఒకవేళ బహిస్సత్త్వము లేనిదీ యట్టిచైత్రునియందు గృహాసత్త్వస్థితియే యనుపపన్న మనినచో జీవియైన చైత్రునియందుండు గృహాసత్త్వము బహిస్సత్త్వముయొక్క నియతస్వభావముఁ గలదని చెప్పవలెను. నియతస్వభావ మనఁగా వ్యాప్తియే. సాధ్యము లేనిదీ హేతు వుండదనునదియే వ్యతిరేకవ్యాప్తిని బోధించు శబ్దము. కాన నర్థాపత్తి వేరుప్రమాణము గాదు.

మూ కథం వా బహిస్సత్త్వమస్యోపపాదకం? న హ్యాని
యామకో భవన్నప్యనియమ్యముపపాదయతి,
అతిప్రసంగాదేవ స్వభావోఽస్య యదనేన బహి
స్సత్త్వేన గృహాసత్త్వం క్రోడీకృత్య స్థాతవ్యమితి
చేత్. సేయం వ్యాప్తిరేవాన్వయముఖనిరూ
ప్యా తథావ్యపదిశ్యతే ఇతి.

తా. పూర్వమందుఁజెప్పిన యతిప్రసక్తి వచ్చును గాన నియామకము గానిదీ యనియమ్యము నుపపాదించుటకు వీలు లేనందున జీవియైన చైత్రునియందుండు గృహాసత్త్వమునకుబహిస్సత్త్వ మేల యుపపాదక మగును. చైత్రునియందుండు గృహాసత్త్వము బహిస్సత్త్వముతో గలసియుండుటయే స్వభావము. కాన బహిస్సత్త్వము నియామకమనినచో నెచ్చటెచ్చట జీవిత్వవిశిష్టగృహాసత్త్వమో యచ్చటచ్చట బహిస్సత్త్వమని చెప్పినచో

నిది సాధ్యనిరూపితాఽన్వయవ్యాప్తిని బోధించుశబ్దమే. అటుల విచారించినను యనుమానముచేతనే యుపపన్న మగును.

మూ. న వయమవినాభావమర్థాపత్తావపజానీమహే,
కిం తు తద్జ్ఞానం; న చాసౌ సత్తామాత్రేణ తదను
మానత్వమాపాదయతీతి చేత్. న. అనుపపత్తి
ప్రతిసంధానస్యావశ్యా భ్యుపగంతవ్యత్వాత్.
అన్యథా త్వతిప్రసంగాత్.

తా. అర్థాపత్తిస్థలమందు కల్ప్యకల్పకములకు వ్యాప్తి యున్నను నజ్ఞాతమై కల్పనాంగము గాదు. జ్ఞాతమై కల్పనాంగ మగును. కాన నర్థాపత్తికి యనుమానాంతర్భావము సంభవించదని యాశంకింపరాదు. సాధ్యసాధనములకు వ్యాప్తి యున్నను దానియొక్క జ్ఞానములేనిచో ననుమితి పుట్టదు. అటులనే యనుపపత్తియున్నను దానియొక్క ప్రతిసంధానమున్నప్పుడే కల్పన గలుగును. కాన ననుపపత్తి ప్రతిసంధానమే వ్యాప్తిజ్ఞానము దీనికే కల్పనాంగత్వము చెప్పవలెను. కాన నర్థాపత్తి యనుమానముకంటె విలక్షణము గాదు.

మూ. అర్థాపత్త్యాభాసానవకాశాచ్చ. యదాహ్యన్యథై
వోపపన్నమన్యథానుపపన్నమితి మన్యతే,
తదాస్య విపర్యయో నత్వన్యథేతి.

తా. అజ్ఞాతమైయున్న వ్యాప్తియే కల్పనాంగమనినచో మరియొకరీతిగా నుపపన్న మగుచుండఁగా మరియొకరీతిగా నుపపన్నము గాదను నాభాసవలన నుపపాదకత్వాభిమతమైన

దానియొక్క కల్పన లేకపోవలసి వచ్చును. వ్యాప్తిజ్ఞానమే కల్పకముగాని వ్యాప్తి కల్పకము గాదు.

మూ. తథాపి కథమత్ర వ్యాప్తిర్గ్రాహ్యేతి చేత్. యదాహమిహ తదానాన్యత్ర, యదాన్యత్ర తదా నేహేతి సర్వప్రత్యక్షసిద్ధమేతత్, కా తత్రాపి కథంతా? సర్వదేశాప్రత్యక్షత్వే తత్రాభావో దురవధారణఇత్యపి నాస్తి, తేషామేవ సంసర్గస్యాత్మని ప్రతిషేధాత్. అయోగ్యానాం ప్రతిషేధే కా వార్తేతి చేత్? తదవయవానాం తత్సంసర్గ ప్రతిషేధాదేవానుమానాత్, అన్యేషాం న కాచిత్. న హ్యాకారణీభూతేన పరమాణునా నేదం సంసృష్టమితి నిశ్చేతుం శక్యమితి. న చావినాభావనిశ్చయే నాపి గమయన్న పక్షధర్మోఽర్థాపత్తిరితియుక్తం, పక్షధర్మతాయా అనిమిత్తత్వప్రసంగాత్, అవిశేషాత్. వ్యధికరణేనావినా భావనిశ్చయాయోగాచ్చ. యత్ యత్ర యదేతి ప్రకారానుపపత్తేః.

తా. గృహాభావము బహిస్సత్త్వము వ్యధికరణము లగుటవలన వీట్లకు వ్యాప్తిగ్రహ మెట్లులని యాశంకింపరాదు. "యదాహమిహ" ఇత్యాదివాక్యము లన్వయవ్యతిరేకవ్యాప్తులను బోధించునట్లు జెప్పఁబడియున్నవి గాని వ్యత్యాసముగా నన్వయించవలెను. జీవి గృహాసత్త్వము వ్యాప్యము.

బహిస్సత్త్వము వ్యాపకము. దీనిని తెలుపుదుచేయ నది "నయ దాహామిహతదాన్యత్ర" అనఁగానే నిక్కడ లేను గాన దీని కంటె వేరుస్థలమందుంటిని నను నది యన్వయవ్యాప్తిని బోధించుశబ్దము. ఎప్పుడు మరియొకచోట లేనో యప్పు డిక్కడనే యుంటిని నను నది వ్యతిరేకవ్యాప్తిని బోధించుశబ్దము. ఈ రీతిగా రెండువ్యాప్తు లందరికి ప్రత్యక్షసిద్ధమే. కాని తానున్న స్థలముకంటె మిగిలినయావత్తు తెలియఁబడనందున దాని యొక్కయభావము తెలియనందున వ్యతిరేకవ్యాప్తిగ్రహముఁ గలుగుట దుర్లభమని యాశంకింపరాదు. ఆత్మప్రత్యక్షముఁ గానిదానియందు దేశముయొక్క సంసర్గము ప్రతిషేధించెదము. దేశము ప్రత్యక్షముగానందున దాని సంసర్గముఁగూడ నయోగ్యమైనందున యోగ్యానుపలబ్ధి లేకపోయినను దేశము యొక్కస్మరణ గలుగును. గాన ప్రతియోగిస్మరణ మున్నందున నిషేధించుటకు వీ లగును. పరమాణువులు, వానియొక్క సంసర్గము నెల్లప్పు డయోగ్యముగాను వాట్లయొక్క నిషేధ మెట్లని యాశంకించరాదు. పరమాణువులు రెండువిధములు, 1. స్థూలమైన నవయవములుగల కార్యద్రవ్యారంభకములు 2. కేవలములు స్థూలమైన యావదవయవములు. అవయవి. వాట్ల సంసర్గయు యోగ్యమైనచో వీట్లనుబట్టి యయోగ్యమైన పరమాణుసంసర్గగూడ నను మేయించెదము. కాన స్మృతులు గావచ్చును గాని నిషేధముచేయుటకు వీలుగాన "యదాయత్రాహం తదానాన్యత్ర" యనేవ్యాప్తిచే నన్యదేశ సంబంధనిషేధమును సాధించవచ్చును. స్థూలావయవములు లేని పరమాణువులయొక్కయు సంసర్గనిషేధ మెట్లనినచో

వాట్లతో యవసరములేదని చెప్పెదము. జీవించియున్న దేవదత్తునియందున్న గృహాభావమునకు బహిస్సత్త్వమునకు వ్యాప్తి నిశ్చయమున్నను, గృహామందున్న దేవదత్తాభావము బహిస్సత్త్వమునకు వ్యధికరణమగుటవలన లింగమగుటకు వీలు లేదు. కాన నపక్షధర్మమైన యర్థాపత్తి యనుమానముకంటె వేరని యాశంకించరాదు. గృహామందున్న దేవదత్తాభావమే హేతువైనచో నీయాశంక సరిపోవును. పక్షధర్మతకుఁగూడ ననుమానాంగత్వ మున్నది. కాన ప్రకృతములో గృహానిష్ఠాభావప్రతియోగిత్వ రూపహేతువువలన దేవదత్తునియందు బహిస్సత్త్వమును సాధించెదము. అట్టి ప్రతియోగిత్వరూప హేతువు పక్షమందున్నందున ననుమానము చేతనే కల్పకము యొక్క సిద్ధి యగును గాన నర్థాపత్తి యనుమానముకంటె వేరుకాదు. వ్యధికరణమైన హేతువుయందు నియతసామానాధికరణ్యరూపవ్యాప్తి యుండదు. ఏ హేతు వేదేశమందు గాని యేకాలమందుగాని యుండునో యాదేశమందుగాని యాకాలమందుగాని సాధకము. అను "యత్ర యదా" యనుశబ్దములచే సాధ్యహేతువులకు సామానాధికరణ్యము దేశమునుబట్టిగాని కాలమునుబట్టిగానియున్నందున ననుమానమువలననే నిర్వహించుచుండఁగా నర్థాపత్తి వేరుప్రమాణము గాదు.

మూ. ప్రమాణయోర్విరోధేఽర్థాపత్తిరవిరోధోపపాదికా, న త్వేవమనుమానమిత్యపి నాస్తి. విరోధే హి రజ్జుసర్పాదివదేకస్య బాధ ఏవ స్యాన్న తూభయోః ప్రామాణ్యం. ప్రామాణ్యే వా న

విరోధః. స్థూలమిద మేకమితి వత్ సహా సంభ
వాత్. చైత్రోయ మయం తు మైత్ర ఇతి
వద్వా విషయ భేదాత్.

తా. ప్రమాణయోర్విరో ధేత్యాది గ్రంథముచేఁ దృతీయపాదము వివరింపఁబడుచున్నది.

"జీవీ దేవద_త్తః క్వచిద_స్తి" అను ప్రతీతిలో క్వచి_త్త్వేన గృహముఁగూడ విషయమగుచున్నందున గృహమునవగహిం చిన యీ ప్రతీత్యనంతరమున గృహేనా_స్తి అనెడి ప్రతీతు లలో నున్నది. లేదు, అను ప్రతీతులవలననే విరోధజ్ఞానము కరణము, అర్థాప_త్తి క్వచిద_స్తి, యను ప్రతీతికి గృహాతిరి_క్త విషయకత్వమును గల్పించును. కావున నవిరోధాపాదకల్ప నము ఫలము వెనుకటి ప్రతీతుల కవిరోధకల్పన మర్థాప_త్తి వలననేగాని యట్టికల్పన యనుమానసాధ్యము గాదు. కాన ప్రమాణవిరోధపరిహారముకొఱ కర్థాప_త్తి రూపప్రమాణాం తర మంగీకరింపవలెనని యాశంకింపరాదు. క్వచిద_స్తి, యను ప్రమాణమునకు గృహేనా_స్తి యను ప్రమాణమునకు నున్న విరోధము వా_స్తవమైనచో నీరెండింటిలో రజ్జు సర్పస్థలమం దొకదాని కెటుల బాధయో ప్ర_స్తుతమందుఁగూడ నొకదానికి బాధయే సంభవించును గాని రెండిటికిఁ బ్రామాణ్యము సంభ వింపదు. 1. క్వచిద_స్తి, 2. గృహేనా_స్తి, యనెడి రెండింటికిఁ బ్రామాణ్య మున్నచో స్థౌల్యము నేకత్వమును గ్రహించెడి ప్రమాణములకు విరోధము లేనందున (స్థూల మిద మేకమ్) వలెను గానున్న యిదియొకటి యనుజ్ఞానముయొడల నొకదాని తరువాత మఱియొకటి యెట్టుల గలుగునో యటులనే విరో

ధము లేనందున రెండునుగూడఁ గలుగవచ్చును. "విషయ ములు భిన్నమైనపుడు, వీఁడు చైత్రుఁడు. వీఁడు మైత్రుండు" అనెడి ప్రతీతులవలె నీ ప్రతీతులుగూడ గలుగవచ్చును.

మూ. ప్రకృతే క్వాప్యస్తీతి సామాన్యతో గేహస్యాపి ప్రవేశాదేకవిషయతాప్యస్తీతి చేత్. యద్యే వం క్వచిదస్తి క్వచిన్నాస్తీతివన్న విరోధః. అత్రాపి విరోధఏవేతి చేదేకం తర్హి భజ్యేత. న భజ్యేత, అర్థాపత్త్యా ఉభయోరప్యుపపాదనా దితి చేత్కిమనుపపద్యమానం ?

తా. వెనుకటి ప్రతీతులు భిన్నవిషయము లైనందున విరోధము లేకపోయినను "క్వచిదస్తి" యనుప్రతీతిలో సామాన్యముగా గృహముగూడ విషయమైనందున దీనికి "గృహేనాస్తి" యనుదాని కేకవిషయత్వ మున్నది గాన విరోధ ముండునని యాశంకింపరాదు, 1. క్వచిదస్తి, 2. క్వచి న్నాస్తి" యనువాటికి యెటుల విరోధము లేదో ప్రకృత మునఁగూడ విరోధము లేదు. "క్వచిదస్తి క్వచిన్నాస్తి" అను ప్రతీతులకుఁగూడ విరోధ మున్నచో నొకప్రతీతి బాధిత మని చెప్పవలెను. బాధితమని చెప్పము అర్థాపత్తిచే విషయ భేదమును గల్పించి యీ ప్రతీతులు రెండునుగూడ నుప పన్నముఁ జేయుదమనుట యనుపపద్యమానము లేనందున సరిగాదు.

మూ. విరోధఏవాన్యథానుపపద్యమానః విభిన్నవిష యతయా వ్యవస్థాపయతీతి చేత్. అథాభిన్న విషయతయైవ కిం న వ్యవస్థాపయేత్ ? వ్యవ

స్థాపనమ విరోధాపాదనం, ఏకవిషయతయైవ చానయోర్విరోధః, స కథం తయైవ శమయితవ్యః, న హి యో యద్విషమూర్ఛితః స తే నైవోద్ధాప్యత ఇతి చేత్.

తా. "క్వచిదస్తి గేహేనాస్తి" యనుప్రతీతులకు భిన్నవిషయకత్వము లేనిచో విరోధ మనుపపన్నమను యనుపపత్తిజ్ఞానమువలన భిన్నవిషయకత్వము సిద్ధించుననినచో నర్థాపత్తిచే నభిన్నవిషయత్వ మెట్లు సాధింపఁగూడదని పూర్వపక్షిని ఉట్టంకించుచున్నాఁడు. వీ రిరువురయొక్క యాశయమును గనిపెట్టక మఱియొకఁ డిట్లనుచున్నాఁడు. వ్యవస్థాపన యనఁగా నవిరోధాపాదనము గదా? ఏవిషముచే నేపురుషుఁడు మూర్ఛనొందునో యావిషముచే నాపురుషునియొక్క మూర్ఛ యెటుల నివర్తించదో, అటులనే యభిన్నవిషయత్వముచే వచ్చినవిరోధము దానివలననే శాంతింపదు గాన, భిన్నవిషయత్వము చెప్పవలెను. అది యర్థాపత్తిసాధ్యము గావున యర్థాపత్తి ప్రమాణాంతరమని జెప్పుట కవకాశము లేదు

మూ. ఏకవిషయతయా అనయోర్విరోధ ఇత్యేతదేవ కుతః? విభిన్నదేశస్వభావతయైవ సర్వత్రోపలంభాదితి చేత్. నన్వియం వ్యాప్తిరేవ. తథా చ ఘుట్టకుట్యాం ప్రభాత మితి.

తా. ఈప్రతీతుల కేకవిషయత్వమునుబట్టి విరోధ మెటులను? విభిన్నదేశస్వభావమంతటను ప్రత్యక్షమనినచో నట్టిస్వభావమే వ్యాప్తి.

అనుమానత్వప్రసంగభయముచే వ్యాప్తిని పరిహరించి

ప్రవర్తించినవానిచే తిరుగ వ్యాప్తియే స్వీకరింపఁబడెను. తెల్లవారినచో నాసీలు పుచ్చుకొనెదరు గాన రాత్రి యాసీలు పాక చాటవలెనని డబ్బివ్వవలెననెడి భయముచేఁ బ్రవర్తించిన వాని కా సీలుపాకవద్దనే తెల్లవారెను. డబ్బిచ్చుకొనుట యెటుల తప్పలేదో యటులనే వ్యాప్తి స్వీకరింపక విధిలేక పోయెను.

మూ. ధూమోఽపి వా అనుపపద్యమానతయైవ వహ్నిం గమయేత్. న హి తేన వినాఽసావుప పద్యతే. విరోధోఽపి, ధూమాద్వహ్నినా భవి తవ్యమ్, అనుపలబ్ధేశ్చ న భవితవ్యమితి. తథా చానుపలబ్ధేరర్వాగ్భాగవ్యవస్థాపనమ్, ధూ మస్య చ వ్యవథానేనానుపలభ్యవహ్నివిష యత్వస్థితిరర్థాపత్తిరితి కుతోఽనుమానమ్ ?

తా. నాల్గవపాదముయొక్క వివరము:—వ్యాప్తి పక్ష ధర్మతలు రెండునుయున్నను అనుపపద్యమానమగు గృహాసత్వ ముచే బహిస్సత్వమును కల్పించినచో, వహ్నిలేనిచో ధూమ మనుపపద్యమానమగుచు వహ్నిని కల్పించును గావున నను మానమాత్రమునకే యుచ్ఛేదము రావలసివచ్చును. కేవల మనుపపత్తియే గాదు. విరోధముఁగూడ నున్నది. (1. ధూమా ద్వహ్నినా భవితవ్యమ్, 2. అనుపలబ్ధేశ్చ న భవితవ్యమితి) "ఈపర్వతము ధూమముఁ గలుగుటవలన వహ్నిగలది, 2. ప్రత్యక్షము గానందున వహ్నిశూన్యమ"నెడి ప్రతీతులకుఁ గలవిరోధము మొదటిప్రతీతి కనుపలభ్యమాన వహ్నివిష యత్వమును రెండవప్రతీతికర్వాగ్భాగవిషయత్వమును నర్థా

పత్తిచేఁ గల్పించుటచే పరిహరింపఁబడును. కాన ననుమాన మాత్రమున కుచ్ఛేదము సంభవించును.

మూ. వహ్నిమానయమిత్యనుమానం వ్యాప్తేః? అన్యథాఽనుమానాభావే విరోధాసిద్ధేః. అర్వాగ్భాగానుపలబ్ధివిరోధేన పరభాగేఽస్య వహ్నిరిత్యర్థాపత్తిరేవేతి చేన్న. వ్యాప్తిగ్రాహకేణ ప్రమాణేన విరోధస్యోక్తత్వాత్.

తా. వ్యాప్తిజ్ఞానమువలనగల్గు "పర్వతో వహ్నిమాన్" అను ననుమానముతో ననుపలబ్ధికి విరోధముఁ జెప్పిన నపుడనుమానమునకుఁ బృథక్ప్రామాణ్యము సిద్ధమె అనుమానమే లేనిచో విరోధమే లేదు. విరోధముచే ననుపలబ్ధికిఁ బరభాగే వహ్నివిషయకత్వ మర్థాపత్త్యా కల్పించవలెను. కావున నిట్టి కల్పన యర్థాపత్తిసాధ్యము గాన నర్థాపత్తి నంగీకరింపవలెనని యాశంకింపరాదు. అనుపలబ్ధితో ననుమానమునకు విరోధము లేదు. మఱియేమన వ్యాప్తి గ్రాహకమయిన "యత్ర యత్ర ధూమః తత్ర తత్ర వహ్నిః", యనువ్యాప్తి గ్రాహకముతోనే యున్నది. కాన ననుమాన ప్రమాణస్వీకారమునకు వైయర్థ్యము లేదు. పర్వతత్వరూపసామాన్య ధర్మావచ్ఛిన్నమున వహ్ని నవగహించిన "పర్వతోవహ్నిమాన"నెడి యనుమానమున కర్వాగ్భాగత్వరూపవిశేష ధర్మావచ్ఛేదేన వహ్న్యనుపలబ్ధిలో విరోధిత్వము లేనిచో "క్వచిదస్తి"యనుసామాన్యనిశ్చయమునకు "గేహేనాస్తి"యనుదానితో విరోధము లేదు. ప్రమాణ విరోధము లేనప్పు డర్థాపత్తి నంగీకరింపవలసిన యవసరము లేదు.

మూ. నాప్యుత్తరార్థాపత్తిః. అన్యథా పాండరత్వ
స్యాపాలాలత్వవిరోధేన పాలాలత్వస్థితిరప్యర్థా
పత్తిరేవ స్యాత్. తద్విశిష్టస్య తేనైవ వ్యాప్తే
రైవమితి చేత్. యద్యేవమర్వాగ్భాగానుప
లభ్యమానవహ్నిత్వేన విశిష్టస్య ధూమస్య
తేనైవ వ్యాప్తేః కథమేవంభవిష్యతీతితుల్యమ్.

తా. పరభాగావస్థాపన మర్థాపత్తి యనుటకు వీలు లేదు. విరుద్ధములకు విషయవ్యవస్థాపనమె యర్థాపత్తి యనినచో పాండరధూమము పొల్లునిప్పుచే వ్యాప్తమగును. కావున నపాలాలత్వ విరోధమువలన పాలాలత్వవ్యవస్థాపనముఁ గూడ నర్థాపత్తి కావలసివచ్చును. పాండరధూమము పాలాలవహ్నిచే వ్యాప్యమగుచు వహ్నియందుఁ బాలాలత్వ వ్యవస్థాపక మనినచో ననుపలభ్యమానవహ్నిసంబంధి యగు ధూమముఁగూడఁ బరభాగమందున్న వహ్నిచే వ్యాప్తమగును గావున ననుమానముచేతనే వహ్నియందుఁ బరభాగావస్థితి సిద్ధించును గావున నర్థాపత్తియే యవసరము లేదనెదము.

మూ. కేవలవ్యతిరేక్యనుమానం పరాభిమతమర్థాపత్తి
రన్వయాభావాదితి చేత్. ఏవమేతావతా విశే
షేణానుమానేఽర్థాపత్తివ్యవహారం న వార
యామః. తత్రానుమానవ్యవహారః కుత ఇతి
చేత్. అవినాభూతలింగసముత్పన్నత్వాత్.

తా. నైయాయికుల కభిమతమయిన కేవల వ్యతిరే కృనుమానమేదియో నయ్యదియె యన్వయవ్యాప్తి లేనందున

నర్థాపత్తియనెదము. దాని కనుమానత్వ మంగీకరింపమనినచో నన్వయవ్యాప్తి లేనందున నర్థాపత్తివ్యవహార మంగీకరించినచో ననుమానత్వ ముండును గావున నయ్యది వారించుటకు శక్యము గాదు.

మూ. సాధ్యధర్మేణ వినా వ్యాభవనమన్వయిన ఇవ వ్యతిరేకిణోఽప్యవిశిష్టమ్,తన్నిశ్చయశ్చాన్వయ వ్యతిరేకాభ్యామన్యతరేణ వేతి. తస్మాదర్థాపత్తి రిత్యనుమానస్య పర్యాయోఽయం, తద్విశేష వచనం వా పూర్వవదాదివదితి యుక్తం.

తా. అన్వయవ్యతిరేకి హేతువునం దెటుల వ్యాప్తినిఁ బట్టిగాని తన్నిశ్చయమునుబట్టిగాని యనుమానత్వ ముండునో కేవల వ్యతిరేకియందుఁ గూడ నటులనే యనుమానత్వ ముండును. అన్వయవ్యతిరేకిస్థలమం దన్వయవ్యతిరేకసహాచారములవలన వ్యాప్తినిశ్చయము గలుగును. కేవల వ్యతిరేకిస్థలమందు వ్యతిరేకసహాచారమునుబట్టియే వ్యాప్తినిశ్చయము గలుగును. కావున నర్థాపత్తి యనునది యనుమానపర్యాయముగాని, పూర్వవదాదిశబ్దములవలె యనుమానవిశేషవచనముగాని కావచ్చును. కావున నర్థాపత్తి యనుమానములోనే యంతర్భూత మగుటవలన వేఱుప్రమాణము గాదు.

మూ. అనుపలబ్ధిస్తు న బాధికేతి చింతితమ్. న చ ప్రత్యక్షాదేరతిరిచ్యతే.

తా. ఇంతవఱకు నర్థాపత్తి వేఱుప్రమాణముఁ గాదని చెప్పఁబడినది. అనుపలబ్ధి యీశ్వరబాధకము కాదన్నసంగతి పూర్వమందేఁ జెప్పఁబడినది. ప్రస్తుత మీయనుపలబ్ధి ప్రత్య

క్షాదిప్రమాణములకంటె వేఱుకాదనువిషయము చెప్పఁ బడుచున్నది.

తదుచ్యతే:—

శ్లో. ప్రతిపత్తేరపారోక్ష్యా దింద్రియస్యానుపక్షయాత్,
అజ్ఞాతకరణత్వాచ్చ భావావేశాచ్చ చేతసః. ౨౦

తా. "భూతలం ఘటాభావవ" త్తనుజ్ఞాన మింద్రియ సన్నికర్ష మున్నప్పుడే గలుగుచున్నందున నింద్రియజన్యము గాన నపరోక్షరూప మగుటవలనను, ఇంద్రియవ్యాపార మన్యథా సిద్ధము గాకపోవుటం జేసియు, ననుమిత్యాదులవలె జ్ఞాతకరణకము కానందునను, అస్మదాదులయొక్క బాహ్యాను భవము భావభూతకరణసహాకృతమనోజన్య మగుటవలనను, దీనిలో నింద్రియమె కరణము గాని యనుపలబ్ధి కరణము గాదు.

మూ. యా హి సాక్షాత్కారిణీ ప్రతీతి స్సేంద్రియ కరణికా, యథారూపాదిప్రతీతిః. తథేహ భూ తలే ఘటో నాస్తీత్యపి. సాక్షాత్కారిత్వమస్యా అసిద్ధమితి చేన్న. ఏకజాతీయత్వే జ్ఞాతాజ్ఞాత కరణత్వానుపపత్తేః. న హి తస్మిన్నేవ కార్యే తదేవ కరణమేకదా జ్ఞాతమజ్ఞాతం చైకదోప యుజ్యతే, లింగేంద్రియయోరపి వ్యత్యయ ప్రసంగాత్. జ్ఞానస్యాకారణత్వ ప్రసంగాచ్చ. న హి తదతిపత్యాపి భవత స్తత్కారణత్వమ్, వ్యాఘాతాత్. తస్మాత్ జ్ఞాతానుపలబ్ధిజన్యస్యా

సాక్షాత్కారిత్వాత్, తద్విపరీతకారణకమిదం
తద్విపరీతజాతీయమితి న్యాయ్యమ్.

తా. "రూపముగలది కుండ" యను ప్రతీతి యెటుల యింద్రియమువలనఁ గలుగునో, అటులనే "యిక్కడ ఘటము లేదు." (ఇహాభూతలే ఘటోనాస్తి) అనెడి ప్రతీతిఁగూడ నింద్రియమువలననె గల్గునందున నీప్రతీతి సాక్షాత్కారము ఇంద్రియమువలనఁగలుగుజ్ఞానమును లింగమువలనఁ గలుగుజ్ఞానము, నేకజాతీయమైనచో నింద్రియమువలనఁ గలుగుజ్ఞానమున కజ్ఞాతకరణకత్వమునకును, లింగమువలనఁ గలుగుజ్ఞానమునకు జ్ఞాతకరణకత్వమునకు ననుపపత్తి వచ్చును. (లింగమువలె నింద్రియముఁగూడ జ్ఞాతమై కరణము కావలసివచ్చును. ఇటులనె యింద్రియమువలె లింగ మజ్ఞాతమై కరణము కావలసి వచ్చును.) ఒకేకరణ మొకేజ్ఞానములో నొకప్పుడు జ్ఞాతమై మఱియొకప్పు డజ్ఞాతమై యుపయోగింపదు. ఏకజాతీయమయిన జ్ఞానములో నజ్ఞాతమైనదే కారణమయినచో జ్ఞానమునకు కరణత్వమే లేకపోవలసి వచ్చును. నీవు జ్ఞానమునకుఁ గరణత్వమును విడనాడి యజ్ఞాతమైనదానికే కారణత్వము విరోధము వలనఁ జెప్పుటకు వీలులేదు. గాన జ్ఞాతానుపలబ్ధివలనఁ గలుగు జ్ఞాన మెటుల నసాక్షాత్కారిరూపమో యటులనె యజ్ఞాతానుపలబ్ధి సహకృతమైన యింద్రియమువలనఁ గలుగుజ్ఞానమును సాక్షాత్కారరూపముగా నంగీకరింపవలెను.

మూ. నను క్వ నామ జ్ఞాతానుపలబ్ధిరసాక్షాత్కారిణీ
మభావప్రతీతిం జనయతి? తద్యథానిపుణతర
మనుస్మృతోమయా మందిరే చైత్రో న చోప

లబ్ధ ఇతి శ్రుత్వా శ్రోతాఽనుమినోతి, నూనం నాసీదేవేతి.

తా. అనుపలబ్ధి జ్ఞానమువలనఁ బరోక్షమైన యభావ ప్రతీతి యెక్కడఁ గలిగెనని ప్రశ్నించఁగా, నద్దానికి సమాధానముఁ జెప్పుచున్నాఁడు. "నాచే బాగుగా వెదకఁబడినది. ఎంతవెదకినను గనుపించలేదు" అనువాక్యమును వినినపిమ్మట మైత్రుఁడు చైత్రునియొక్క యనుపలబ్ధి జ్ఞానముగలవాఁడై చైత్రుఁ డిక్కడ లేఁడని యూహించును. కాన ననుపలబ్ధి జ్ఞానమువలనఁ గలిగిన యీ చైత్రాభావజ్ఞానమె యసాక్షాత్కారరూపము.

మూ. ఏతేన ప్రాజ్ఞాస్తితాపి వ్యాఖ్యాతా. నను తథాప్యవాంతరజాతిభేదోఽస్తు, అజ్ఞాతానుపలబ్ధిజన్యే సాక్షాత్కారస్తు కుత ఇతి చేత్. కారణవిరోధాత్కార్యవిరోధేన భవితవ్యమిత్యుక్తమేవ. అనన్యత్రోపక్షీణేంద్రియవ్యాపారానంతరభావిత్వాచ్చ.

తా. శబ్దజన్యమగు ననుపలబ్ధిజ్ఞానమువలనఁ గలిగిన యభావజ్ఞానం బెటుల నసాక్షాత్కారరూపమో, ప్రాజ్ఞాస్తితా ప్రతీతిఁ గూడ ననుమితిరూపము గావున నిదియుఁగూడ నసాక్షాత్కారరూపమే. కారణభేద మున్నచో కార్యభేద మావశ్యకమని చెప్పియున్నందున జాతిభేదము నంగీకరించి నప్పుడు, జ్ఞాతానుపలబ్ధివలనఁ గలిగిన యభావజ్ఞాన మసాక్షాత్కారరూపమైనప్పు డజ్ఞాతానుపలబ్ధివలనఁ గలిగిన యభావ జ్ఞానము సాక్షాత్కారరూప మెటుల యగునని యాశంకింప

రాదు. మఱియు నజ్ఞాతానుపలబ్ధితోఁ గూడిన యింద్రియము దానివ్యాపారము మఱియొకస్థలమందు వినియుక్తముఁ గాక యీయభావజ్ఞానమునే బుట్టించినందున నభావజ్ఞానము సాక్షాత్కారరూపమనుటకు సందేహము లేదు.

మూ అధికరణగ్రహణే తదుపక్షీణమితిచేన్న. అంధస్యాపి త్వగింద్రియోపనీతే ఘటాదౌ రూపవిశేషాభావప్రతీతిప్రసంగాత్. అస్తి హి తస్యాధికరణగ్రహణమ్, అస్తి చ ప్రతియోగిస్మరణమ్, అస్తి చ శ్యామే రక్తత్వస్య యోగ్యస్యాభావః, అనుపలబ్ధిశ్చ.

తా. అభావప్రతీతియం దింద్రియకరణకత్వమును సాధించు హేతువులో సాక్షాత్కారత్వరూపవిశేషణము సిద్ధమైనను అనన్యథోపక్షీణేంద్రియాన్వయ వ్యతిరేకానువిధాయిత్వరూపవిశేషణమసిద్ధమని యాశంకించి నిరాకరించుచున్నాఁడు. ఘటాభావమున కధికరణమైన భూతలగ్రహణమును గలుగఁజేయుటచే నింద్రియము క్షీణశక్తి గలదైనందున దిఱుగ నభావగ్రహణములో నయ్యది యుపయోగింపదని యాశంకింపరాదు. అభావప్రతీతిలో నధికరణజ్ఞానమును, ప్రతియోగిజ్ఞానమును, యోగ్యానుపలబ్ధియుఁ గారణము. త్వగింద్రియముచే గృహీతమయిన నీలఘటమందు రక్తరూపముయొక్క యభావము గ్రుడ్డివానికిఁ బ్రత్యక్షము కావలసివచ్చును. ఇచ్చట త్వగింద్రియమువలనఁ గలిగిన యధికరణప్రత్యక్షము, ప్రతియోగిస్మరణము, యోగ్యమయిన రక్త

రూపముయొక్క యనుపలబ్ధియు నున్నవి గాన నంధునికి రక్త రూపాభావప్రత్యక్షము కలుగవలసివచ్చును.

మూ. అధికరణగ్రాహకేంద్రియగ్రాహ్యోభావవాదినోపి సమానమేతదితి చేన్న. ప్రతియోగిగ్రాహకే న్ద్రియగ్రాహ్యోఽభావ ఇత్యభ్యుపగమాత్. మమాపి ప్రతియోగిగ్రాహకేంద్రియగృహీతేఽధికరణేఽనుపలబ్ధిః ప్రమాణమిత్యభ్యుపగమ ఇతి చేన్న. వాయౌ త్వగింద్రియోపనీతే రూపాభావప్రతీత్యనుదయప్రసంగాత్. తథాపి తత్తత్ర సన్నికృష్టమితి చేత్. హన్తైవమన న్యత్ర (హన్తైవమన్యత్ర) చరితార్థమింద్రియమవశ్యమపేక్షణీయం రూపాభావానుభవేన.

తా. అంధునిచేఁగూడ త్వగింద్రియమున గ్రహింపఁబడిన ఘటమునందలి రూపాభావము త్వగింద్రియముచేతనే గ్రహింపఁబడనగునను నాపత్తి యధికరణమును గ్రహించిన యింద్రియముచేతనే యభావము గ్రహింపఁబడునని వాదించువారికి సమానమే యనరాదు. అధికరణ గ్రాహకేంద్రియమే యభావమును గ్రహించుననినచో నీయాపత్తి వచ్చును. ఆ నియమమును మే మంగీకరింపము. మఱియేమన, ప్రతియోగిని గ్రహించినయింద్రియమే యభావమును గ్రహించునని చెప్పుదము. గాన నంధుఁడు రూపమును గ్రహింపనందున వానికి రక్తరూపాభావప్రతీత్యాపత్తి యుండదు. మేముకూడఁ బ్రతియోగి గ్రాహకమయిన యింద్రియముచే గ్రహింపఁబడిన

బడిన యధికరణమందే యభావగ్రహణము కలుగునని చెప్పె దము కావున నంధునకట్టి ప్రతీత్యాపత్తి లేదని చెప్పుటకు వీలులేదు. వాయువు రూపమును గ్రహించు చక్షురింద్రియ ముచే గ్రహింపఁబడనందున వాయువునందు రూపాభావ ప్రత్యక్షము కలుగకపోవలసివచ్చును. ప్రతియోగిని గ్రహించు నింద్రియ మధికరణమును గ్రహింపకపోయినప్పటికి నట్టి యింద్రియగ్రాహ్యమయిన వస్తువుతో వాయువు సంయుక్త మయినది గావున వాయువునందు రూపాభావప్రత్యక్ష ముప పన్నమగుననినచో మఱియొకస్థలమునం దుపక్షీణము గాని చక్షురింద్రియముయొక్క యన్వయవ్యతిరేకము లున్నందున వాయువునందుఁ గలుగు రూపాభావప్రతీతి సాక్షాత్కార రూప మగుటలో సందియము లేదు.

మూ. స్యాదేతత్. తథాపి వస్త్వంతరగ్రహ ఏవ తస్యో పయోగ ఇతి చేన్న. తస్య తం ప్రత్యకారణ త్వాత్. కారణత్వే వా మహాంధకారే కరపరా మర్శేన స్పర్శవద్ద్రవ్యాభావం న ప్రతీయాత్. ప్రతీయాచ్చ పురోవిస్ఫారితాక్షః పృష్ఠలగ్న స్యాశ్యామత్వం. ఆర్జవావస్థానమప్యధికరణ స్యోపయుజ్యతే ఇతి చేత్తర్హి నయనసన్నికర్షో ప్యుపయోక్ష్యతే. తదేకసహకారిప్రభాసన్నికర్షా పేక్షణాత్. అన్యథా వాతాయనవివరవిసారి కరపరామృష్టేప్యధికరణే తదుపలంభ ప్రసంగాచ్చ.

తా. ఇంద్రియ మధికరణగ్రహములో నుపయోగించక పోయినను వస్త్వంతరముయొక్క గ్రహములో నుపయో

గించినందున నభావబుద్ధియం దనన్యత్రోపక్షీణేంద్రియాన్వయ వ్యతిరేకానువిధాయిత్వ రూపహేతువసిద్ధమని యాశంకింప రాదు. వస్త్వంతరగ్రహ మభావ ప్రతీతిలో గారణమే కాదు. అట్లగుచో మహాంధకారములో త్వగింద్రియమువలన దగ్గరగా నున్నవస్తువును గ్రహించినప్పు డితరవస్తుగ్రహణ రూపకారణ మున్నది గాన మరియొకస్పర్శ గలద్రవ్యముయొక్క యభావ ప్రతీతి గలుగక పోవలసివచ్చును. కన్నులు తెఱచినవానికి నెదుటయున్న వస్తువుయొక్క ప్రత్యక్ష మున్నది గాన పృష్ఠ భాగముయొక్క యుపలబ్ధి లేనప్పుడు పృష్ఠదేశమందుండు శ్యామరూపముయొక్క యభావము ప్రత్యక్షము కావలసి వచ్చును. ఎదురుగా నుండుటఁగూడ నపేక్షితమైనచో నా లోకసహకృతమైన చక్షుస్సుయొక్క సంయోగ మభావోప లబ్ధిలో గారణమని చెప్పవలెను. వీటికి కారణత్వము చెప్ప నిచో గవాక్షముగుండా చాచఁబడినచేతితో స్పృశించిన దానియందుఁ గూడ రూపాభావ చాక్షుషము కలుగవలసి వచ్చును.

మూ. తథాపి యోగ్యతాపాదనోపక్షీణం చక్షుః.యది తరసామగ్రీసాకల్యే హ్యనుపలభ్యమానస్యా భావో నిశ్చీయతే. తచ్చ చక్షుష్యధికరణసన్ని కృష్టే సతి స్యాదితి చేత్. నను పరిపూర్ణాని కారణాన్యేవ సాకల్యం, తథా చ కిం కుత్రో పక్షీణం?

తా. యోగ్యానుపలబ్ధి యభావప్రత్యక్షములో గార ణము. యోగ్యత యనఁగాఁ బ్రతియోగికంటె నితరమైన

నభావజ్ఞానకారణ సాకల్యము. ఇట్టిసాకల్యము చక్షుస్సం
యోగ మున్నప్పుడే యుండును గాన ప్రస్తుతములో చక్షు
స్సంయోగము లేనందున యోగ్యతాపాదనమందు చక్షు
స్సపక్షీణము గాన ననన్యత్రోపక్షీణత్వ ఘటిత హేతువసిద్ధమని
యాశంకింపరాదు. ఎచ్చట నుపక్షీణమో అచ్చటనట్టి యోగ్య
తారూపమైన కారణసాకల్యము కారణసాధ్యమైన పదార్థాం
తరము గాదు. మరి యేమనఁగా? కారణసంపూర్తియే. కాన
నేది యెచ్చట నుపక్షీణము? కాన హేతువసిద్ధము గానేరదు.

మూ. అథాన్యోన్య మేలనం మిథః ప్రత్యాసత్త్యాదిశబ్ద
వాచ్యం తదుపక్షయః, న తర్హి క్వచిచ్చక్షుః
కారణం స్యాదితి. న హి రూపాద్యుపలబ్ధిమక్ష్య
సన్నికృష్టమేతదుపజనయతి. అథాధికరణసమవే
తకించిదుపలంభోఽపి తద్విషయాభావగ్రహే
ఽనుపలబ్ధేరపేక్షణీయః, తత స్తత్రేదం చరితార్థం.

తా. మేలనము తత్త్వాంతరమైన దొకటి యున్నది.
అదియే ఉపక్షయవిషయమైనది యనినచో, రూపాదిజ్ఞానము
లో గారణమైన నర్థసన్నికర్షలో నుపక్షీణమైనందున నెక్కడను
గూడ చక్షుస్సు కారణము గాకపోవలసి వచ్చును. చక్షుస్సు
సన్నికృష్టము గాకుండగనే రూపాదిప్రత్యక్షమును గలుగఁ
జేయనేరదు. కాన తత్త్వాంతరమని యాశంకింపరాదు. అభా
వాధికరణమందు సమవేతమైన వస్తువును గోచరించిన ప్రతి
యోగి గ్రాహకేంద్రియమువలనఁ గలుగునుపలబ్ధి సహాకృతమైన
యనుపలబ్ధివలన నధికరణమం దభావోపలబ్ధి గలుగును.

మూ. వాయ్వాదిషు తు రూపాద్యభావప్రతీతిరాను మానికీ. తథా హి, అనుపలబ్ధ్యాహ్యానుమీాయ తే "అయం నీరూపో వాయు"రితి. న. అసిద్ధేః. న హ్యుపలంభాభావో భవతా మభావోపలంభః, ఉపలంభస్యాతీంద్రియత్వాభ్యుపగమాత్. ప్రా కట్యాభావేనానుమేయ ఇతి చేన్న. వాయౌ రూపవత్తా ప్రాకట్యాభావస్యాప్యసిద్ధేః. రూపా భావేన సమానత్వాత్. వ్యవహారాభావేనాను మేయ ఇతి చేన్న.

తా. ఇంద్రియము సహకారిలో నుపక్షీణామైన దని నచో? చక్షుస్సంయుక్తమైన వాయువునం దుండువాని యొక్క చాక్షుషప్రత్యక్ష రూపసహకారి లేననందు రూపా నుపలబ్ధివలన వాయువునందు రూపాభావచాక్షుషప్రతీతి యనుపపన్నము గావలసివచ్చును. గాన నిది సామగ్రియనుటకు వీలులే దనుదానికి మీామాంసకుఁ డీరీతిగా ననుచున్నాఁడు. వాయువునందు రూపానుపలబ్ధి రూపహేతువుచే నీవాయువు రూపశూన్యమని యనుమేయించెదము. కాన వాయువునందు రూపాభావజ్ఞానము చాక్షుషము గాదు. అనుమితి రూపమను దానిని నిరాకరించుచున్నాఁడు. మీామతమునందు జ్ఞాన మతీంద్రియము గాన నుపలంభాభావము గురుత్వాభావమువలె నతీంద్రియప్రతియోగికము గాన నది యజ్ఞాతము. కాగా వాయువునందు రూపానుపలబ్ధి రూపహేతువసిద్ధము. జ్ఞాన మతీంద్రియమైనను జ్ఞానమువలన గలుగు జ్ఞాతతప్రత్యక్షము

గాన దానియొక్క యభావముచేతనే రూపాభావము నను. మేయించెదమని యాశంకింపరాదు. ఈ జ్ఞాతతయొక్క యభావముఁగూడ రూపాభావముతో సమానమైనందున నసిద్ధము. గాన దీనిచే నను మేయించుటకు వీలులేదు. వాయువు రూపముగలది యనువ్యవహారము లేనందున నిట్టి వ్యవహారాభావముచే వాయువునందు రూపప్రాకట్యాభావమును దానిచే రూపాభావము నను మేయించెదమని యాశంకింపరాదు.

మూ. కాయవాగ్వ్యవహారాభావే ప్యుపేక్షాజ్ఞానా
భావాభ్యుపగమాత్. మూకస్వాప్నపపత్తేశ్చ.
న చ వ్యవహారాభావమాత్రేణానుమాతుమపి
శక్యతే, అనైకాంతికత్వాదసిద్ధేశ్చ

తా. వ్యవహారము రెండువిధములు. 1 కాయికము. 2 వాచికము. ఒకానొకప్పు డీ రెండువ్యవహారములు లేకపోయినను అపేక్షాబుద్ధివలన గలుగుజ్ఞాతత యుండును గాన హేతువు వ్యభిచారి యగును. మరియు మూగవానికి వాగ్వ్యవహారమున్ను స్వప్నమును బొందినవానికి శరీరవ్యవహారమున్ను లేకపోయినను జ్ఞాతతారూపప్రాకట్య ముండును గాన వ్యభిచారి యగును. వ్యవహారాభావ మనఁగా తనదగు వ్యవహారముయొక్క యభావమా? లేక, సర్వులవ్యవహారముయొక్క యభావమా? తనయొక్క వ్యవహారాభావమే హేతువనినచో దనయొక్కవ్యవహారము లేనిసమయమున, వ్యభిచారి యగును. సర్వవ్యవహారములును అసర్వజ్ఞులమైన మనకు తెలియనందున వాట్లయొక్క యభావము హేతువనినచో హేతువసిద్ధ మగును.

మూ. తద్విషయస్తు వ్యవహార స్తద్విషయజ్ఞానజన్యో వా, తద్విషయజ్ఞానజనకో వా, తదాశ్రయ ధర్మజనకో వా? తదభావశ్చ, తజ్ఞాన తదాశ్రయధర్మాభావాంతర్భూత ఏ వేత్యశక్యనిశ్చయ ఏవ. ఆత్మాశ్రయేతరేతరాశ్రయ చక్రకప్రవృత్తి ప్రసంగాత్.

తా. అనుపేక్షణీయమైన రూపవత్తావిషయమును గోచరించిన స్వకీయవ్యవహారాభావముచే నట్టి రూపవత్తావిషయమును గోచరించిన జ్ఞానాభావము ననుమేయించెదమని యాశంకించరాదు. 1 అట్టివ్యవహారము అట్టిజ్ఞానజన్యమా. 2 అట్టి జ్ఞానజనకమా. 3 అట్టివిషయమును గోచరించిన జ్ఞాతతారూప ప్రాకట్యజనకమా? రూపవత్తావ్యవహారాభావము, రూపవత్తా జ్ఞానాభావములో గాని, రూప వత్తా ప్రాకట్యాభావములో గాని యంతర్భావమును బొందును. భట్టమతమందు జ్ఞాన మతీంద్రియము గాన జ్ఞానముయొక్క యభావమునుగాని, జ్ఞాన ఘటిత జ్ఞాతతయొక్క యభావమునుగాని నిశ్చయించుటకు వీలులేదు. మొదటిపక్షమున రూపవత్తా జ్ఞానాభావముచే దాదృశజ్ఞానాభావము ననుమేయించినచో స్వగ్రహములో స్వగ్రహ మపేక్షింపఁబడినందున నాత్మాశ్రయము వచ్చును. తద్విషయకవ్యవహారము తద్విషయక జ్ఞానజనకమనే రెండవ పక్షమున తద్విషయజ్ఞానాభావముచే తద్విషయక వ్యవహారాభావజ్ఞానము, దీనిచే తద్విషయకజ్ఞానాభావము ననుమేయించి నచో స్వగ్రహాధీన గ్రహాధీన స్వగ్రహకత్వ రూపాన్యోన్యా

శ్రయము సంభవించును. తద్విషయకవ్యవహారము తద్విషయక ప్రాకట్యమునుఁగూర్చి జనకమను మూఁడవపక్షమున తద్విష యకజ్ఞానాభావముచే తద్విషయక ప్రాకట్యాభావజ్ఞానము. దీనిచే తద్విషయక వ్యవహారాభావజ్ఞానము. దీనిచే తద్విషయక జ్ఞానాభావజ్ఞానము. కాన నీపక్షమున చక్రకమను దోషము ప్రసక్తమగును.

మూ. న చాజ్ఞాతస్యోపలంభాద్యభావస్యలింగతా, న
చ ప్రాకట్యాభావస్సత్తామాత్రేణోపలంభాభావ
మావేదయతీతి యుక్తం. లింగాభావస్య తథా
త్వేఽతిప్రసంగాత్.

తా. అజ్ఞాతమైన యనుపలబ్ధికి వాయువునందు రూపా భావానుమితిసాధకత్వము లేదు. ఇటులనే యజ్ఞాతమైన ప్రాక ట్యాభావముఁగూడ రూపానుపలబ్ధిని సాధించనేరదు. ప్రాకట్య ముపలబ్ధికార్యము గాన దానియొక్క యభావముచే ననుప లబ్ధిని సాధించెదమనినచో ధూమము వహ్నికార్యము ధూమ ముయొక్క యభావముచే వహ్నియొక్క యభావము సిద్ధించ వలసివచ్చును.

మూ. అవినాభావబలేన తు నియమే తత్ప్రతిసంధానా
పత్తేః. న హ్యవినాభావః సత్తామాత్రేణ జ్ఞాన
హేతుం నియమయతి, ధూమాదావపి తథా
భావప్రసంగాదితి. జ్ఞానప్రత్యక్షత్వేన త్వద్ధిశా
భవిష్యతీతి చేన్న. శబ్దధ్వంసాదినోక్తోత్తర
త్వాత్.

తా. రూపోపలబ్ధ్యభావవ్యాప్తి ప్రాకట్యాభావమందున్నది గాన నీవ్యాప్తినిబట్టి ప్రాకట్యాభావమునకు లింగత్వము చెప్పుటకు వీలులేదు. వ్యాప్తియున్నను జ్ఞాతము గానిచో ననుమాపకము గాదు. అట్లైనచో ధూమమందు వ్యాప్తిజ్ఞానము లేనిసమయమున వహ్న్యనుమితి కలుగవలసి వచ్చును. న్యాయమతమందు జ్ఞానము ప్రత్యక్షము గాన నా మతము ననలంబించి జ్ఞానాభావము జ్ఞాతమై రూపాభావమును వాయువునందు సాధించెదమని యాశంకించరాదు. శబ్దధ్వంసముయొక్క ప్రత్యక్షములో నధికరణప్రత్యక్షముయొక్క యవసరములేదని చెప్పియేయున్నాము. గాన వాయువు చక్షుర్గ్రాహ్యము గాకపోయినను దానియందు రూపాభావమును గోచరించుజ్ఞానము చాక్షుషప్రత్యక్షరూపమని జెప్పెదము.

మూ. అపి చ. ప్రతియోగిగ్రాహకేణేంద్రియేణాధికరణ ధర్మప్రతీతిరనుపలబ్ధేరంగమితి, తద్రహితాయా స్తస్యాః కార్యవ్యభిచారాద్వ్యవస్థాప్యేత, వ్యాప్తిబలాద్వా? న తావదుక్తరూపానుపలబ్ధిస్తాం వినా అభావప్రత్యయమజనయంతీ దృశ్యతే. నాపి వ్యాప్తేః. తథా సతి వాయౌ రూపాభావప్రత్యయస్తామాక్షిపేత్, ఏవం భూతత్వాత్. అనాక్షేపే వా, న తత్కారణకో భవేత్,

తా. ఇంతియగాదు. ప్రతియోగిని గ్రహించు నింద్రియమువలనఁ గలుగు నభావాధికరణ సమవేతమైన ధర్మము

యొక్క యుపలబ్ధి యనుపలబ్ధికి సహకారి యని చెప్పుట, అట్టి యుపలబ్ధి లేనిచో రూపాభావజ్ఞానముఁ గలుగ లేనందుననా? లేక యట్టి యుపలబ్ధితోఁగూడిన యనుపలబ్ధి రూపాభావము నకు వ్యాప్యమైనందుననా? అధికరణధర్మప్రతీతి లేనిచో ననుపలబ్ధి యభావప్రతీతిని పుట్టించకపోవుట లేనందున మొదటిపక్షము సరిగాదు. అధికరణసమవేత ధర్మప్రతీతి లేనిచో కేవలానుపలబ్ధివలన రూపాభావప్రత్యయ మనుపపన్నమగుచు నట్టి ధర్మప్రత్యయమును గల్పించునా? లేదా! కేవలానుప లబ్ధి యున్నప్పు డభావప్రతీతి నంగీకరించినందున ధర్మప్రతీతి కల్పక మభావప్రతీతి గాదు. రూపాభావప్రతీతికి ధర్మప్రతీతిని గల్పించనపు డనుపలబ్ధి కారణకత్వమే లేదని చెప్పవలసి వచ్చును.

మూ. న వా భవేత్. తతో న భవత్యేవ, లింగాత్తదు
త్పత్తిరితి చేత్. నను లింగమపి నైవ నతత్త్వాం
తరం. యథా యోనిసంబంధోఽలింగదశాయా
మింద్రియసన్నికర్షమపేక్షతే, లింగదశాయాం
తు తదనపేక్షఏవ బ్రాహ్మణ్యజ్ఞానే, తథైతత్స్యా
దితి చేన్న. కార్యజాతిభేదాత్తదుపపత్తేః. ప్రకృతే
చ తదనభ్యుపగమాత్.

తా. అధికరణసమవేతమైన ధర్మజ్ఞానమువలన రూపా భావజ్ఞానముఁ గలుగుటయే లేదు. దీనివలనఁ గలుగకపోయి నను లింగమువలన రూపాభావజ్ఞానముఁ గలుగునని చెప్పుట లింగ మనుపలబ్ధిరూప మైనదేగాని మఱియొక తత్త్వాంతరము గాదు గాన సరిగాదు. బ్రాహ్మణ్యజ్ఞానములో శుద్ధమైన

మాతాపితృసంబంధము, లింగము లేనిసమయమున చక్షుస్సన్ని కర్ష నపేక్షించును. లింగమున్న సమయములో నిరపేక్షమై యెటుల బ్రాహ్మణ్యజ్ఞానములో నుపయోగించునో, యటులనే రూపాభావప్రతీతిలో లింగములేనిదశలో నధికరణసమవేత మైన ధర్మప్రతీతి నపేక్షించును. లేనిచో నిరపేక్షమై యను పలబ్ధి యుపయోగించుననుటకు వీలులేదు. దృష్టాంత దార్ష్టాంతి కములకు వైలక్షణ్యము గలదు. బ్రాహ్మణ్య జ్ఞానరూపకార్య మునకు పరోక్షత్వాఽపరోక్షత్వరూపజాతిభేద మున్నందున మాతాపితృసంబంధమున కింద్రియాఽనపేక్షయు నపేక్షయు నుపపన్నము గావచ్చును. అనుపలబ్ధి కధికరణధర్మప్రతీతి సహ కార మున్నప్పుడుగాని లేనిసమయములోగాని రూపాభావ ప్రతీతికి పరోక్షత్వమేగాని యపరోక్షత్వము సంభవించదు. కాన వెనుక చెప్పినది దీనికి సరియైనదృష్టాంతము గాదు.

మూ. పారోక్ష్యాపారోక్ష్యే విహాయాన్యథాప్యసౌ
భవిష్యతీతి చేన్న. అనుపలంభాత్. సంభావ్యతే
తావదితిచేత్. సంభావ్యతాం, న త్వేతావతాపి
తమాశ్రిత్య కారణనియమనిశ్చయః.

తా. వస్త్వంతరజ్ఞానసహకృతమైన యనుపలబ్ధివలనఁ గలిగినరూపాభావజ్ఞానమందు పరోక్షత్వాపరోక్షత్వములకంటె విలక్షణమైన జ్ఞానావాంతరజాతి, ప్రమాణసిద్ధమైనది లేనందున స్వీకరించుటకు వీలులేదు. ఒకవేళ నట్టి విలక్షణమైన జాతి నూహించినను అట్టిజాతి సంభావనచే నట్టిజాతీయ కార్యనియత మైనదానికి కారణత్వమును నిశ్చయించుటకు వీలులేదు. కాన ననుపలబ్ధి సహకృతమైన మఱియొకచోట ననుపక్షీణమైన

నింద్రియజన్యమైనందున నభావజ్ఞానము సాక్షాత్కారరూప మయినది యని రెండవపాదముయొక్క తాత్పర్యము.

మూ. అజ్ఞాతకరణత్వాచ్చ. యదజ్ఞాయమానకరణజం జ్ఞానం తత్సాక్షాదింద్రియజం, యథా రూప ప్రత్యక్షం, తథా చేహ భూతలే ఘటో నాస్తీతి జ్ఞానమితి. యథా వా స్మరణమజ్ఞాయమాన కరణజం సాక్షాన్నోజన్మ. కుత స్తర్హి న సాక్షా త్కార్యనుభవరూపం? సంస్కారాతిరిక్తసన్ని కర్షాభావాదితి వక్ష్యామః.

తా. అజ్ఞాయమానమైన చక్షురింద్రియరూపకరణము వలనఁ గలిగిన "రూపవాన్ఘటః" అను జ్ఞానమువలె "భూతల మందు ఘటములే"దను జ్ఞానముఁగూడ నట్టిదగుటవలన నిదియుసాక్షాత్కార రూపమైనదియే. సాక్షాత్కారిత్వములో నజ్ఞాతకరణజన్యత్వము ప్రయోజకమైనచో స్మృతిఁగూడ సాక్షాత్కార్యనుభవరూప మెందుకు గాకూడదని యాశం కింపరాదు. సంస్కారముకంటె వేరైనవ్యాపారము లేనందున స్మృతి సాక్షాత్కారరూపమగుటకు వీలులేదు.

మూ. తథాపి భావవిషయే ఇయం వ్యవస్థా, అభావ జ్ఞానం త్వజ్ఞాతకరణత్వేపి న సాక్షాదింద్రియజం భవిష్యతీతి చేన్న. ఉత్సర్గస్య బాధకాభావేన సంకోచానుపపత్తేః. అన్యథా సర్వవ్యాప్తీనాం భావమాత్రవిషయత్వప్రసంగోఽవిశేషాత్.

తా. ఎచ్చటెచ్చట నజ్ఞాయమానకరణజన్యత్వమో యచ్చటచ్చట సాక్షాత్కారిత్వమను సామాన్యవ్యాప్తిని

బాధకములేనప్పుడు సంకోచము చేయుటకు వీలులేనందున నజ్ఞాయమానకరణజన్యమైన భావజ్ఞానమే సాక్షాత్కారరూప మగునుగాని యభావజ్ఞానము సాక్షాత్కారరూపము గాదను టకు వీలులేదు. అట్లైనచో విశేషము లేనందున వ్యాప్తు లన్నియును భావవిషయములే గావలసివచ్చును.

మూ. తథాపి విపక్షే కిం బాధకమితి చేత్. నన్విద మేవ తావత్. అన్యదప్యుచ్యమానమాకర్ణ య. తద్యథా, అకారణక కార్యప్రసంగో రూపాద్యుపలబ్ధీనామపి వాఽనింద్రియకరణత్వ ప్రసంగః. న హ్యానుమిత్యాదిభిరుపలభ్యమాన కరణికాభిశ్చక్షు రాదివ్యవస్థాపనం, అపి త్వనుప లభ్యమానకరణికాభీ రూపాద్యుప లబ్ధి భి రే వ. యద్యపి సాక్షాత్కారితాపి తత్రైవ పర్యవ స్యతి, తథాపి ప్రథమతో నుపలభ్యమానకరణ త్వమేవ ప్రయోజకం చక్షురాదికల్పనే. న హ్యుపలభ్యమానే కరణాంతరే సాక్షాత్కారి ణీష్వపి తాసు చక్షురాద్యనుపలభ్యమానం కశ్చిదకల్పయిష్యత్. అతఏవ సాక్షాత్కారిత్వేపి స్మృతేర్మనఏవ కరణముపాగమన్ధీరాః.

తా. అజ్ఞాతకరణకమైనను అభావజ్ఞానమును గూర్చిమా త్ర మింద్రియముకంటె భిన్నమైనదానికి కరణత్వముఁ జెప్పెద మనినచో నిట్టి నిర్బీజశంకచే నంతటను సామాన్యవ్యా ప్తిబాధక ముండును. ఇంతియ గాదు. మఱియొకటిఁ

గూడ తెలిసికొనవలసి యున్నది. కారణములేకయే కార్యము గలుగవలసివచ్చును. రూపాద్యుపలబ్ధికిఁ జక్షురాదీంద్రియ కరణకత్వము లేకపోవలసివచ్చును. అజ్ఞాతకరణక జ్ఞానమాత్ర మునుగూర్చి యింద్రియము కరణము గాన నింద్రియము లేనిచో నజ్ఞాతకరణకమైన రూపాదిజ్ఞానమే సంభవించదు. జ్ఞాతకరణకమైన ననుమిత్యాదులచేఁ గరణమైన చక్షురింద్రియము గల్పించుటకు వీలులేదు. మఱి యేమన! అజ్ఞాతకరణకమైన రూపాద్యుపలబ్ధియే కరణముగా నింద్రియమును గల్పించును. అజ్ఞాయమానకరణకత్వము చక్షురాదికల్పకము గాదు. సాక్షాత్కారజ్ఞానత్వముఁగూడ చక్షురింద్రియకల్పనలో నుపయోగించును. అయినను అజ్ఞాయమానకరణకత్వమే చక్షురాదికల్పనలో ముందుగా నుపయోగించును గాని సాక్షాత్కారిత్వము గాదు. అందువల్ల నీరీతిగాఁ జెప్పఁబడ్డది. సాక్షాత్కారరూపమైన జ్ఞానములోఁగూడ కరణాంతర ముపలబ్ధమైనపు డనుపలభ్యమానమైన చక్షుస్సుకు కరణత్వము నెవరును యంగీకరించరు. అనుపలభ్యమానకరణకమైన జ్ఞానమైంద్రియకము కాఁబట్టియే ధీరులు స్మృతియందు సాక్షాత్కారత్వము లేకపోయినను మనస్సునకే కరణత్వము నంగీకరించిరి.

మూ. సంస్కార స్త్వర్థవిశేషప్రత్యాసత్తావుపయుజ్యతే,
ఇంద్రియాణాం ప్రాప్యకారిత్వవ్యవస్థాపనాత్.

తా. నిర్వ్యాపారమైనదగుటచే సంస్కారమే స్మృతిలో కరణమని చెప్పుటకు వీలులేదు. ఇంద్రియములు విషయముతో సంబంధించియే జ్ఞానజనకములు. కాన నింద్రియసంబంధరూపవ్యాపారముతో గూడుకొనును గాన నింద్రియ

ములు కరణములు గావచ్చును. సంస్కారద్వారా స్మృతిలో మనస్సు కరణము గావచ్చును.

మూ. భావావేశాచ్చ చేతసః. సర్వత్ర హి బాహ్యార్థానుభవే జనయితవ్యే భావభూతప్రమాణావిష్టమేవ చేత ఉపయుజ్యతే, నాతోఽన్యథేతి వ్యాప్తిః. తథైవ శక్తేరవధారణాత్. న హ్యానుపలబ్ధిమాత్రసహాయం తదభావే ప్యనుభవమాధాతుముత్సహతే. శబ్దలింగాదేరపేక్షాదర్శనాత్. న చ యత్ర యదపేక్షం యస్య జనకత్వముపలబ్ధం తదేవ తస్యైవ తదనపేక్షం జనకమితి న్యాయసహం. ఆర్ద్రేంధనసంబంధమంతరేణాపి దహనాద్ధూమసంభావనాపత్తేః. తథా చ గతం కార్యకారణభావపరిగ్రహావ్యాసనేన.

తా. బాహ్యార్థమును గోచరించు ననుభవము గలుగవలసివచ్చినప్పుడు శబ్దలింగాదిరూప భావముతో గూడిన మనస్సే ప్రవర్తించుటనుబట్టి యభావానుభవములో గూడ భావరూపమైన కరణముతో గలసిన మనస్సే ప్రవర్తించునని యనుమేయించెదము. అట్టికరణ మింద్రియమే గాని మఱియొకటి గాదు. భావానుభవములో నట్టివ్యవస్థ యుండవచ్చును గాని యభావానుభవములో ననుపలబ్ధితో గూడిన మనస్సె ప్రవర్తించునని, "ఎంత వెదకినను మైత్రుఁ డుపలబ్ధుఁడుగా లేద"ను శబ్దలింగమువలన నభావప్రతీతిఁ గలుగకపో వలసి వచ్చును. మఱియొకస్థలమం దెట్లైనను "ఈభూతల

మందు ఘటములేద"ను నభావ ప్రతీతిలో ననుపలబ్ధికే కరణ త్వముఁ జెప్పెదమనినచో నొకదానిలో దేనిన పేక్షించి దేనికి కారణత్వమో దాని నపేక్షించక యాకార్యములోనే యది కారణమని చెప్పుట న్యాయము గాదు. తడిసినకట్టెలయొక్క సంబంధమును సహకారముగాఁ జేసికొని వహ్ని ధూమకారణ మగుచున్నది. అధూమము సహకారి లేకపోయినను వహ్ని మాత్రము వలనఁగూడ గలుగవలసివచ్చును గావున నిట్టి కార్యకారణభావవ్యసనమును మానుఁడు

అపిచః—

శ్లో. ప్రతియోగిని సామర్థ్యా ద్వ్యాపారావ్యవధానతః,
అనాశ్రయత్వాద్దోషాణామింద్రియాణి వికల్పనాత్.౨౧

తా. మఱియొక బాధకమును చెప్పుచున్నాఁడు. ఇంద్రియములు ప్రతియోగిగ్రాహకము లగుటవల్లను, వ్యాపారముచే నన్యథాసిద్ధములు గానందునను, దోషములకు నాశ్రయము లగుటవలనను, అభావవిశిష్టబుద్ధిజనకము లగుటవలనను, అభావబుద్ధికరణములని శ్లోకమున కర్థము.

మూ. యద్ధి ప్రమాణం యద్భావావగాహి, తత్తద భావావగాహి. యథా లింగం శబ్దో వా. ఘటాద్యవగాహి చేంద్రియమితి. అన్యథా హి శబ్దాదికమపి నాభావమావేదయేత్, భావ ఏవ సామర్థ్యావధారణాత్. న చైవమేవ న్యాయ్యం, దదేవత్తో గేహే నాస్తీతి శబ్దాత్, మయా

తత్ర జిజ్ఞాసమానేనాపి న దృష్టో మైత్ర ఇత్యవగతానుపలబ్ధ్యాఽనుమానాదప్యవగతేః.

తా. ఏప్రమాణ మేవస్తువును గ్రహించునో ఆప్రమాణము దానియొక్క యభావమునుఁ గూడ గ్రహించును. అనుపలబ్ధి ఘటరూపభావమును గ్రహించనేరదు. ఇంద్రియము ఘటమును గ్రహించును గాన దానియొక్క యభావమును గూడ ననుమానమువలెను శబ్దమువలెను గ్రహించును. భావమును గ్రహించిన ప్రమాణ మభావమును గ్రహించ నేరదనినచో 1 శబ్దము 2 లింగమున్ను యభావమును గ్రహించకపోవలసి వచ్చును. "దేవదత్తో గృహేనాస్తి" అనెడు శబ్దమువలన శ్రోతకు నభావప్రత్యయము గలుగుచున్నది. ఇటులనే తెలిసికొందమను నిచ్ఛగల నాకు నింటిలో నెంతవెతకినను మైత్రుఁడు కనిపించలేదనెడు వాక్యమువలన గలిగిన మైత్రోపలబ్ధ్యభావ లింగజ్ఞానమువలనను మైత్రుఁ డిచ్చట లేడను నభావప్రతీతి కలుగుచున్నది.

మూ. గ్రాహయతువాఽఽశ్రయమింద్రియం, తథాపి న తేనేదం వ్యవధీయతే, వ్యాపారత్వాత్. అన్యథా సర్వసవికల్పకానాం ప్రత్యక్షత్వాయ దత్తో జలాంజలిః స్యాత్. నన్వేవం సతి ధూమోపలంభోప్యస్య వ్యాపారస్స్యాత్. తథా చ గతమనుమానేనాపీతి చేన్న. యయా క్రియయా వినా యస్య యత్కారణత్వం న నిర్వహతి తం ప్రతి తస్యా ఏవ వ్యాపారత్వాత్.

న చ ధూమాద్యుపలబ్ధిమంతరేణ చక్షుషో వహ్నిజ్ఞానకారణత్వం న నిర్వహతి, సంయోగవదితి.

తా. ఇంద్రియమాశ్రయమును గ్రహించినను నాయాశ్రయగ్రహణము వ్యాపారము గాన దానిచే వ్యవధానము చెప్పుటకు వీలులేదు. చక్షుస్సంయోగానంతరము నిర్వికల్పకజ్ఞానము కలిగినపిదప సవికల్పకప్రత్యక్షము గలుగును. వ్యాపారముచే వ్యాపారికి నన్యథా సిద్ధత్వము చెప్పినచో నీ సవికల్పకము ప్రత్యక్షరూపము గాకపోవలసి వచ్చును. చక్షుస్సువలనఁ గలుగు నాశ్రయప్రత్యక్షానంతరము గలిగిన యభావజ్ఞానము ప్రత్యక్షరూపమైనచో చక్షుస్సంయోగానంతరమున గలిగిన ధూమప్రత్యక్షానంతరమందు గలిగిన వహ్న్యనుమితిఁగూడ ప్రత్యక్షరూపమని జెప్పెదము. అనుమాన మెందుకు స్వీకరించడమని యాశంకింపరాదు. ఏదిలేనిచో దేనికి కారణత్వము నిర్వహించదో దానిలో నది వ్యాపారము. ఘటచక్షుస్సంయోగము లేనిచో ఘటప్రత్యక్షకారణత్వము చక్షురింద్రియమునకు నిర్వహించనందున చక్షుస్సంయోగము వ్యాపారము. ఆరీతిగా ధూమోపలబ్ధి గాదు. ధూమపరామర్శలేనిచో వ్యాప్తి స్మృతికి వహ్న్యనుమితికారణత్వము నిర్వహించదు గాన వహ్న్యనుమితిలో ననుమానమే కరణము. ధూమోపలబ్ధి వ్యాపారము గానందున వహ్నిజ్ఞానము ప్రత్యక్షరూపము గాదు. ధూమోపలబ్ధి లేకపోయినను వహ్నిసంయోగ మున్నచో వహ్నిజ్ఞానము గలుగును గాన ధూమోపలబ్ధివ్యాపారము గాదు. ప్రకృతము ననధి

కరణ జ్ఞానద్వారమున నభావజ్ఞాన మింద్రియకరణకము గాన నభావవిశిష్టబుద్ధి సాక్షాత్కారరూపము.

మూ. అస్తి చ భావాభావవిపర్యయః. సోయం యస్య దోషమనువిధత్తే, తదేవాత్ర కరణమితి న్యాయ్యం. న చానుపలబ్ధి స్స్వభావతో దుష్టా, నాప్యధికరణగ్రహణం ప్రతియోగిస్మరణం వా స్వభావతో దుష్టం. అనుత్పత్తిదశాయామను త్పత్తే రుత్పత్తిదశాయాం చ స్వార్థప్రకాశన స్వభావతాయా అపరావృత్తేః.

తా. ఒకవస్తు వున్నప్పుడు దానియొక్కయభావమును గోచరించు విపర్యయముగూడఁ గలుగుచున్నది. ఇట్టివిపర్యయము దేనియొక్కదోషమువల్ల గలుగునో యదియే కరణము గాని మఱియొకటి గాదు. అనుపలబ్ధి యభావరూపము గాన స్వభావముచే దుష్టము గాదు. ఇటులనే అధికరణగ్రహము ప్రతియోగి స్మరణమునుగూడ దుష్టములు గావు. అధికరణ గ్రహమును ప్రతియోగిస్మరణమును లేనిసమయమున ప్రతియోగి విశేషితమైన యభావవిశిష్టబుద్ధియే గలుగదు. ఈరెండు నున్నసమయమున వీనికి స్వస్వవిషయభాసకత్వము నివర్తింపదు.

మూ. అసంసృష్టయోరధికరణప్రతియోగినోః సంసృష్టతయా ప్రతిభానం దుష్టం, సంసృష్టయోశ్చా సంసృష్టతయేతి చేత్. నన్వయమేవ విపర్యయః. తథా చాత్మాశ్రయో దోషః. తస్మాద్దుష్టేంద్రియస్య తద్విపర్యయసామర్థ్యే అదుష్టస్యతత్సవిూ

చీనజ్ఞానసామర్థ్యమపి. తథా చ ప్రయోగః—
ఇంద్రియమభావప్రమాకరణం తద్విపర్యయ
కరణత్వాత్, యత్ యద్విపర్యయకరణం తత్త
త్ప్రమాకరణం, యథారూపప్రమాకరణం చ
క్షురితి.

తా. శుక్తిరూపాధికరణమునకును రజతత్వరూపప్రతియోగికిని సంబంధము లేకపోయినను శుక్తియందు రజతత్వభ్రమ యెటుల దోషమో యటులనే భూతలమందు ఘటమున్నప్పుడు "భూతలమందు ఘటములేద"న్నజ్ఞానమే దోషమనుటకు వీలులేదు. ఇట్టిజ్ఞానమే భ్రమ గాన నిదియే దోషమైనచో దోషమువలన భ్రమరూపదోషము గాన నాత్మాశ్రయ దోషము గలుగును. అందువలన నింద్రియమే దుష్టమని చెప్పవలెను. దుష్టమైన ఇంద్రియ మభావభ్రమనుగూర్చి కరణము గాన నదుష్టమైనఇంద్రియము భావప్రమలోఁ గరణమని జెప్పవలెను. "నీలంతమః" అనుభ్రమలోఁ గరణమైన చక్షురింద్రియము "రూపవాన్ఘటః" యనుప్రమలో నెటుల కరణమో అట్లే యభావభ్రమలోఁ గరణమైన ఇంద్రియ మభావప్రమలోఁ గరణము. అనుమానప్రయోగము:—ఇంద్రియం అభావప్రమాకరణం, తద్విపర్యయకరణత్వాత్, యథా చక్షురితి.

మూ. వికల్పనాత్మల్పపి. అఘటం భూతలమితి హి విశిష్ట
ధీరవశ్యమింద్రియకరణికా స్వీకర్తవ్యా, ప్రమా
ణాంతరం వా సప్తమమాస్థేయం. యథా హి;
విశేష్యమాత్రోపక్షీణమింద్రియమకరణమత్ర,
తథా విశేషణమాత్రోపక్షీణాఽనుపలబ్ధిరపి న

కరణం స్యాత్. స్వస్వవిషయమాత్రప్రవృత్త యోః ప్రమాణయోః సమాహారః కారణమితి చేన్న. విషయభేదే ఫలవైజాత్యే చ తదనుప పత్తేః. న హి మృత్సు తంతుషు చ వ్యాప్రియ మాణయోః కులాలకువిందయోః సమాహార స్స్యాత్. నాపి ఘటపటాదికారిణాం చక్రవేమా దీనాం సమాహారః క్వచిదుపయుజ్యతే. తత్ర కర్బురకార్యాభావాన్న తథా, ప్రకృతే తు విశిష్టప్రత్యయస్య పరోక్షాపరోక్షరూపస్య దర్శ నాత్తథేతి చేన్న విరుద్ధజాతిసమావేశాభా వాత్.

తా. అభావవిశిష్టబుద్ధినిఁగూర్చి కారణమైనందున నింద్రియము కరణము. "భూతలము ఘటశూన్య మ"నుజ్ఞాన మింద్రియకరణకమా ? లేక యనుపలబ్ధి రూపాభావకరణకమా ? నీ మతమం దధికరణ జ్ఞానమాత్రమం దుపక్షీణమైనందున నింద్రియ మెటుల కరణముఁ గాదో యనుపలబ్ధిఁగూడ విశేషణమైన నభావగ్రహమును బుట్టించినందున విశిష్టబుద్ధిలో సమర్థము గాదు గాన ననుపలబ్ధి కరణము గాకపోవలసివచ్చును. ఇంద్రియమున్ను యనుపలబ్ధియున్ను ప్రత్యేకము. "అఘటం భూతల" మను విశిష్టబుద్ధిలోఁ గరణముఁ గాకపోయినను రెండునుగలసి కరణమని చెప్పుటకు వీలులేదు. ఇంద్రియవిష యము భావము. అనుపలబ్ధివిషయ మభావము. ఇంద్రియ కార్య మపరోక్షము. అనుపలబ్ధికార్యము పరోక్షరూపము. భావాభావరూప విషయభేదము. పరోక్షాపరోక్షరూపకార్య

భేద మున్నందున ప్రమాణములకు సమావేశము సంభవించదు. మృత్తునందు ప్రవర్తించు కుమ్మరవానికి, తంతువుయందు ప్రవర్తించు సాలివానికిన్ని సమావేశము లేదు. ఇటులనే మృత్కార్యమైన ఘటమునకు తంతుకార్యమైన పటమునకున్ను కారణమైన చక్రవేమాదులకున్ను సమావేశము చూడఁబడుట లేదు. అటులనే ప్రకృతములోఁగూడ సమావేశము సంభవించదు. చిత్రమైనకార్యము లేనందున కులాలకు విందాదులకున్ను చక్రవేమాదులకున్ను సమావేశము లేదు. ప్రకృతములోఁ బరోక్షాపరోక్షరూపచిత్రకార్య ముండవచ్చును గాన ప్రమాణ సమావేశ ముండవచ్చునని జెప్పుటఁగూడ నొకదానియందు విరుద్ధమైన ధర్మద్వయముండుట యెక్కడను దృష్టము గానందున పరోక్షత్వాపరోక్షత్వ రూపవిరుద్ధధర్మములు గలజ్ఞానరూపకార్య ముండదు గాన సరిగాదు.

మూ॥ భావే వా కరమ్బితఏవ కార్యే ద్వయోరపి శక్తిరభ్యుపగంతవ్యా, దర్శనబలాత్. న హి నియతవిషయేణ సామర్థ్యేన కర్బురకార్యసిద్ధిః. అన్యత్రాపి తథా ప్రసంగాత్. ననూభయోర పృథయత్ర సామర్థ్యేఽర్థోమిథస్సన్నిధానే నేతి చేన్న. తత్సహితస్యైవ తస్య తత్ర సామర్థ్యాదితి. ఏతేన సురభిచందనమిత్యాదయో వ్యాఖ్యాతాః. తథా చాభావవిషయేపీంద్రియ సామర్థ్యస్య దురపహ్నవత్వాదలమసద్గవేషణే నేతి. (అసద్గ్రహేణేతి) (పా).

తా. సమావేశమున్నచో చిత్రకార్యములో రెండింటి యందు కార్యకరణశక్తిని స్వీకరించవలెను. ఇంద్రియమునకు సామర్థ్యము సిద్ధించును. ఘటమాత్రములో సమర్థమైన చక్రముయొక్కయు పటమాత్రములో సమర్థమైన వేమదండముయొక్కయు సమావేశమువలన ఘటపటాత్మకమయిన చిత్రకార్యము లేనందున భావమాత్రగ్రాహకమైన చక్షురింద్రియముయొక్కయు నభావమాత్రగ్రాహకమైన ననుపలబ్ధియొక్కయు సమావేశమువలనఁ జిత్రకార్యముఁ బుట్టునని చెప్పుటకు వీలులేదు. అట్లైనచో వీటి రెంటిసమావేశము వలన నెట్టికార్యముఁ బుట్టుననిన సౌరభజ్ఞాన సహకృతమైన చక్షురింద్రియమువలన "సురభిచందన" మను చాక్షుషజ్ఞానము వలెను సంస్కారసహకృతమైన చక్షురింద్రియమువలన "సోయం దేవదత్తః" యను ప్రత్యభిజ్ఞవలెను, అనుపలబ్ధి సహకృతమైన చక్షురింద్రియమువలన "అఘటం భూతల"మను చాక్షుష ప్రత్యక్షము గలుగును. దీనిలోఁ జక్షురింద్రియమే కరణము గాని మఱియొకటి గాదు.

మూ. స్యాదేతత్. నాగృహీతే విశేషణే విశిష్టబుద్ధిరుదేతి, తత్కార్యత్వాత్. న చ విశిష్టసామర్థ్యే కేవలవిశేషణేపి సామర్థ్యం, కేవలసౌరభేపి చక్షుషోవృత్తిప్రసంగాత్. అతోఽభావవిశేషణగ్రహాయ మానాంతరసంభవః. అపి చ, కథమనాలోచితోఽర్థఇంద్రియేణ వికల్ప్యేత. న చ మానాంతరస్యాప్యేషా రీతిః, అనుమానాదిభిరనా

లోచితస్యాప్యర్థస్య వికల్పనాత్, అప్రాప్తేశ్చ. న హ్యభావేనేంద్రియస్య సంయోగాదిస్సంభవతి. న చ విశేషణత్వం, సంబంధాంతరపూర్వకత్వాత్తస్య. అవశ్యాభ్యుపగంతవ్యత్వాచ్చానుపలబ్ధేః. న హి తదనుపలబ్ధౌ తస్యాభావోపలంభ ఇతి చేత్.

తా. విశేషణజ్ఞానము లేక విశిష్టబుద్ధి గలుగదు "అఘటం భూతల" మను విశిష్టబుద్ధిలో విశేషణమైన ఘటాభావ జ్ఞాన మావశ్యకము. ఘటాభావ రూపవిశేషణజ్ఞాన మనుపలబ్ధి సాధ్యము. చక్షురింద్రియ సాధ్యముగాదు. ఘటాభావ విశిష్టభూతల రూపవిశిష్టోపలబ్ధిలో సమర్థమైన నింద్రియము విశేషణగ్రహములో సమర్థము గాదు. అట్లైనచో సౌరభ విశిష్టచందన రూపవిశిష్టలబ్ధిలో సమర్థమైన చక్షురింద్రియము వలన విశేషణమైన సౌరభచాక్షుషమునుఁ గలుగఁజేయవలసి వచ్చును. కాన ఘటాభావ జ్ఞానసాధకము గాన నుపలబ్ధి రూపప్రమాణాంతరము నంగీకరించవలెను. మఱియొకటి. ఈ ఘటాభావజ్ఞాన మనుపలబ్ధిజన్యము గాన ప్రత్యక్షరూపము గాదు. కాన ఘటాభావనిర్వికల్పకము లేనిచో "అఘటం భూతలం" మను విశిష్టప్రత్యక్ష మెట్లు సంభవించును. చాక్షుషమైన విశిష్టప్రత్యక్షము నిర్వికల్పజన్యమైనటుల ప్రమాణాంతరమువలన గలుగు జ్ఞానములకుఁగూడ నిర్వికల్పకజన్యత్వము లేదు. అనుమానాదులవలన గలుగు "పర్వతోవహ్నిమా" నను విశిష్టజ్ఞానము విశేషణనిర్వికల్పకము లేనిది గలుగుచున్నది. కాన ననుపలబ్ధి సాధ్యమైన అభావజ్ఞాన మసాక్షా

త్కారరూపము. మఱియొకటి ఘటాభావముతో చక్షురింద్రి యమునకు సంయోగము లేదు. చక్షుస్సంయుక్తవిశేషణత్వ రూపసంబంధ మున్నను, తద్విశేషణత్వ మనఁగా, తద్వృత్తి త్వము. అట్టి వృత్తిత్వము మఱియొకసంబంధముతో గూడు కొన్నందున చక్షుస్సుతో నభావమునకు సంబంధము లేనం దున నభావజ్ఞానము చాక్షుషము గాదు. ఘటముయొక్క యుపలబ్ధియున్న చో ఘటాభావజ్ఞానము లేనందున ననుపలబ్ధి యభావజ్ఞానములోఁ గారణముగా నవశ్య మంగీకరించవలె నను నాశంకయం "దుచ్యతే" యనుదానిచే సిద్ధాంతముఁ జెప్పఁబడుచున్నది.

ఉచ్యతే:—

శ్లో॥ అవచ్ఛేదగ్రహధ్రౌవ్యా దధ్రౌవ్యే సిద్ధసాధనాత్,
ప్రాప్త్యంతరేఽనవస్థానాన్న చేదన్యోఽపి దుర్ఘటః. ౨౨

తా. ఘటాభావగ్రహ మవచ్ఛేదగ్రహజ్ఞానజన్యము గాన విశిష్టప్రత్యక్షసామగ్రి యున్నందున నభావము నిర్వి కల్పక జ్ఞానవిషయము గాదు. ప్రతియోగిజ్ఞానము నపేక్షించ నిచో నభావమునకు నిర్వికల్పకప్రత్యక్షవిషయత్వ ముండును గాన జ్ఞానవిషయత్వము సిద్ధించినందున ననుపలబ్ధిచే జ్ఞానవిషయ త్వమును సాధించినచో సిద్ధసాధనరూపదోషము ప్రసక్త మగును. అభావమునకు స్వరూపసంబంధేన విశేషణత్వమునే స్వీకరించెదము. మఱియొకసంబంధమును స్వీకరించినచో దానికి వేరే మఱియొకసంబంధమును స్వీకరించవలసి వచ్చును. అటుల స్వీకరించినచో ననవస్థ వచ్చును. స్వరూపసంబంధేన

విశేషణత్వము గాక మఱియొకసంబంధమును స్వీకరించినచో నభావమున కనుపలబ్ధిగ్రాహ్యత్వమును స్వీకరించిన నీమత మందుఁగూడ నభావగ్రహము దుర్ఘటమని శ్లోకతాత్పర్యము.

మూ. స హ్యర్థవిశేషణీ భవిష్యన్ కేవలోపి విస్ఫురేత్, యస్యావచ్ఛేదకజ్ఞానం నవ్యంజకం. స చ వికల్పయితవ్య ఆలోచ్యతే, యో విశేషణజ్ఞాననిరపేక్షేణేంద్రియేణ విజ్ఞాప్యతే. యస్తు తత్పరస్పరఏవ ప్రకాశతే, తత్ర తస్య వికల్పసామగ్రీసమవధానతఏవ సామర్థ్యాన్నాయం విధిః.

తా. ఘటాదిరూపప్రతియోగియొక్క జ్ఞానములేనిదే ప్రతియోగి విశేషితాభావముయొక్క, అనఁగా ఘటాభావముయొక్క జ్ఞానము సంభవించదో, అట్టి ప్రతియోగిరూప మగు నర్థము ఘటాభావబుద్ధిలో విశేషణమగుచూ నట్టి ఘటవిశిష్టాభావబుద్ధికంటె పూర్వము స్మృతివిషయ మగును. కేవలసౌరభమును గోచరించెడు స్మరణవల్ల సౌరభ్యవిశిష్ట చందనఖండమును గోచరించెడు. "సురభిచందన" మ్మను చాక్షుషప్రత్యక్షమువలె ఘటాదిరూపప్రతియోగి జ్ఞానానంతరమున ఘటరూపప్రతియోగితో గూడుకొన్న యభావచాక్షుషము గలుగును గాన నీజ్ఞానకరణముగా ననుపలబ్ధికి ప్రమాణాంతరత్వము జెప్పుటకు వీలులేదు.

ప్రతియోగి రూపవిశేషణజ్ఞానము నపేక్షింపక కేవల చక్షురింద్రియ జన్యజ్ఞానవిషయత్వమే యభావమునకు స్వీకరించినచో నిర్వికల్పక జ్ఞానవిషయత్వ మభావమునకు సిద్ధిం

చును గాన సిద్ధసాధనత్వము సంభవించును. ప్రతియోగి జ్ఞాన మున్నప్పుడే ప్రతియోగి మిశ్రితమైన యభావరూపవిశిష్ట ప్రత్యయము గలుగునో విశిష్టప్రత్యయసామగ్రి యున్నందున నిర్వికల్పక వేద్యత్వ మభావమున కంగీకరించ వలనుబడదు.

మూ. స్వభావప్రాప్తౌ సత్యామప్యధికా ప్రాప్తిః ప్రతిపత్తిబలేన రూపాదావభ్యుపగతా. ఇహ త్వనవస్థా దుస్థతయా న తదభ్యుపగమః, న తు స్వభావప్రత్యాసత్తిరేతావతైవ విఫలాయతే.న చేదేవం, ప్రమాణాంతరేపి సర్వమేతద్దుర్ఘటం స్యాత్.

తా. రూపఘటములకు స్వభావరూపసంబంధ మున్నను రూపమునకుఁ జక్షురింద్రియమునకు సంయోగము రెండును గుణములగుటవలన సంభవించదు గాన రూపముగలది ఘటమును ప్రత్యక్షమునుబట్టి చక్షుస్సంయుక్త సమవాయసంబంధము కల్పించవలెను. ఇట్టి విశిష్టసంబంధఘటకతయా రూపఘటములకు స్వభావముకంటె నధికమైన సమవాయము సిద్ధించును. ప్రకృతములో భూతలమునం దభావమునకు విశేషణతకంటె (అనఁగాఁ జక్షుస్సంయుక్త విశేషణతకంటె) నధికమైన సంబంధమును స్వీకరించినచో నది సమవాయమైనచో నభావము సత్తగలదిగూడ గాని యనునవ్యవస్థ వచ్చును. కాన నభావమునకు నింద్రియసంబంధము లేనిచో నింద్రియము గ్రాహకము గాదు గాన విశేషణతాసంబంధముఁ గల్పించెదము. ఈవిశేషణతా ప్రత్యాసత్తిని గల్పించినందున నభావాధికరణములకు స్వభావ ప్రతిపత్తి విలయము గానేరదు. విశేషణ

త్వరూపసంబంధమును స్వీకరించినచో భట్టమతమందుఁగూడ నభావప్రతిపత్తి దుర్ఘటము. అది యెటులనన ?

తథాహి:—

మూ. సర్వమేవమానం సాక్షాత్పరంపరయా వా నిర్వికల్పక (జ్ఞానపూర్వకం) విశ్రాంతం. న హ్యనుమానాదికమప్యనాలోచనపూర్వకం. తతోఽనాలోచితోఽభావః కథమనుపలబ్ధ్యాపి వికల్ప్యేత. న చ తయా తదాలోచనమేవ జన్యతే, ప్రతియోగ్యనవచ్ఛిన్నస్య తస్య నిరూపయితుమశక్యత్వాత్. శక్యత్వే వా కిమపరాద్ధమింద్రియేణ. తథా, సంబంధాంతరగర్భత్వనియమేన విశేషణత్వస్య, మానాంతరేపి కః ప్రతీకారః? తదభావస్య తదానీమపి సమానత్వాత్.

తా. ప్రత్యక్షము సాక్షాత్తుగాను అనుమానాదికము పరంపరగాను నిర్వికల్పకజ్ఞానపూర్వకములు. అనుమానము ప్రత్యక్షపూర్వకము గాన నిర్వికల్పకజ్ఞాన పూర్వకమని జెప్పవలెను. కాన ననుపలబ్ధిగూడఁ బ్రమాణాంతరమైనచోఁ దత్తత్ప్రమాణజనితములైన జ్ఞానము లన్నియును నిర్వికల్పకజ్ఞానపూర్వకమైనందున దీనివలనఁ గలిగెడు జ్ఞానముఁగూడ నిర్వికల్పకజ్ఞానపూర్వకమని జెప్పవలెను. అనుపలబ్ధివలనఁ బ్రతియోగ్యమిశ్రితమైన యభావమును గ్రహించుట సంభవింపదు. అట్లైనచో ననుపలబ్ధివలన నభావనిర్వికల్పకము స్వీకరించినచోఁ జక్షురింద్రియమువలన మొదట నిర్వికల్పకజ్ఞానమును స్వీకరించిన మాచే నేమి యపరాధము చేయఁబడినది ? అట్లే యనుప

లబ్ధిచే నభావమును గ్రహించునపు డభావమునందు విశేషణత్వ సంబంధమును స్వీకరించవలెను. ఈవిశేషణత్వముఁగూడ సంబంధాంతరపూర్వకమని చెప్పుట మీకును మాకును సమానమే. కావున సంబంధాంతరాభావము అనుపలబ్ధిరూపమగు నతిరిక్త ప్రమాణాంతర వాదులకుఁ గూడ సమానమే.

మూ. పరస్య తాదాత్మ్యమస్తీతి చేత్. నను యద్యసావస్తి, అస్త్యేవ, న చేన్నైవ. న హ్యభ్యుపగమేనార్థాః క్రియంతే, అనభ్యుపగమే వా నివర్తంతే ఇతి. అవశ్యాభ్యుపగంతవ్యత్వే కారణత్వం సిధ్యేత్, న తు ప్రమాణాంతరత్వం. అన్యథా భావోపలంభేప్యభావానుపలబ్ధిరేవ ప్రమాణం స్యాత్, నేంద్రియం. అభావానుపలంభే భావానుపలంభవత్ భావోపలంభే అభావానుపలంభస్యాపి వజ్రలేపాయమానత్వాదితి.

తా. అనుపలబ్ధికి ప్రమాణాంతరత్వమును స్వీకరించిన మేము అభావమునకుఁ దాదాత్మ్యమను సంబంధాంతరమును స్వీకరించెదము. మీమతమం దది లేదు. కాన సమానము గాదని చెప్పుటకు వీలులేదు. అట్టి తాదాత్మ్యము ప్రమాణసిద్ధమైనచో నుండును. ప్రమాణసిద్ధము గానిచో నుండ నేరదు. ఆధారాధేయములకు తాదాత్మ్యసంబంధమును స్వీకరించినచో భూతలమందు చక్షుస్సంయోగముచే ఘటమును గ్రహించి నట్లు ఘటాభావాభావమునుఁగూడ గ్రహింపవలసి వచ్చును. అట్టియనుభవము లేదు. కాన వస్తువుయొక్క సదసత్త్వములు, అభ్యుపగమానభ్యుపగమమాత్రాధీనములు గావు.

అభావజ్ఞానముఁకంటెఁ బూర్వమం దనుపలబ్ధి నియతముగా నున్నచో దానికి కారణత్వమును స్వీకరించెదము గాని ప్రమా ణాంతరత్వమును స్వీకరించుట లేదు. పూర్వమందు నియత ముగా నున్నందున భావానుపలబ్ధికి నభావజ్ఞానములోఁ గరణ త్వముఁ జెప్పినచో భావోపలంభములో గూడ నింద్రియముఁ గాక యభావానుపలబ్ధియే కరణము గావలసివచ్చును. అనుప లబ్ధికి ప్రమాణాంతరత్వము నంగీకరించినవారికిఁగూడ నిది యసమ్మతము.

శ్లో. ప్రత్యక్షాదిభిరేభిరేవమధరో
దూరే విరోధోదయః
ప్రాయో యస్సుఖవీక్షకైకవిధురై
రాత్మాపి నాసాద్యతే,
తం సర్వానువిధేయమేకమసమ
స్వాచ్ఛందలీలోత్సవం
దేవానామపిదేవముద్భవదతి
శ్రద్ధాః ప్రపద్యామహే. ౨౩

ఇతి తృతీయ_స్తబకః.

తా. ఈశ్లోకముచే _స్తబకార్థము సంగ్రహింపఁబడి చెప్పఁబడుచున్నది. మొదట యనుపలబ్ధిచే నీశ్వరబాధ నాశం కించి యోగ్యానుపలబ్ధియే యభావసాధకము గాన నీశ్వరుఁ డయోగ్యుఁడు గాన నిట్టియనుపలబ్ధి యీశ్వరబాధకముగా

దని జెప్పఁబడెను. మఱియొకరీతిగాఁగూడఁ జెప్పఁబడ్డది. యేమన? అనుపలబ్ధిస్థానములోఁ బ్రత్యక్షమే ప్రమాణము గాని యనుపలబ్ధి వేరు ప్రమాణముగాదని గూడఁ జెప్పఁబడ్డది. అనుమానముచేఁగూడ నీశ్వరునియందు సర్వజ్ఞత్వాభావము, అస్తిత్వాభావము, మున్నగునవి సాధింపఁబడినవి. అట్టి ప్రత్యక్షాదిప్రమాణములన్నియు నీశ్వరుని సాధించు ధర్మిగ్రాహకప్రమాణముచే బాధితములు. కాన బాధితములైన ప్రత్యక్షాదులచే స్వాత్మయే సాధించఁబడదు. అట్టి ప్రమాణములతో విరోధ మధరము (అనఁగా హీనమైనది.) కను కనే దూరే యనఁగా లేదని యాశయము. అట్టి యీశ్వరుని నతిశ్రద్ధతోఁ గూడుకొన్నవారమై శ్రవణ మననాదులచే నెల్లప్పుడు నారాధాన జేయుచున్నాము. ఆయన యందఱకును వశ్యుఁడు. ఒకఁడు. సాటిలేని స్వసృష్టిచే జీవుల కానందమును గలుగఁజేయువాఁడు. మఱియు సమస్తదేవతలకును దేవుఁడు. అతనిసృష్టిలో గురువు మొదలగు జ్ఞానసాధనము లున్నందున గురూపదిష్టమైన వాక్యములవలన నాత్మజ్ఞానము కలుగును. దానివలన నాత్యంతిక దుఃఖనివృత్తిరూప మోక్షము సంభవించును. కాన దుఃఖనివృత్తిరూప మోక్షసాధకుఁడు. అట్టిదేవుని మేము నిరంతరము సేవించుచున్నారమని తాత్పర్యము.

తృతీయస్తబకము సమాప్తము.

పరదేవతార్పణమస్తు.

శ్రీమాత్రే నమః.

# చతుర్థ స్తబకము.

మూ. "సత్త్వేపి తస్యాప్రమాణత్వాత్."

తా. అనునది నాలగవవిప్రతిపత్తి. ప్రమాత్మకజ్ఞానాశ్రయుఁ డీశ్వరుఁడు గానందున నీశ్వరుఁడు ప్రమాణముగాదని ఈ విప్రతిపత్తివాక్యమున కర్థము. ఈ స్తబకమందు యీవిప్రతిపత్తి నిరాకరించఁబడుచున్నది.

మూ. నను సదపీశ్వరజ్ఞానం న ప్రమాణం; తల్లక్షణా
యోగాత్. అనధిగతార్థగంతు స్తథాభావాత్.
అన్యథా స్మృతేరపి ప్రామాణ్యప్రసంగాత్. న
చ నిత్యస్య సర్వవిషయస్య చానధిగతార్థతా,
వ్యాఘాతాత్.

తా. ప్రమయనఁగా నజ్ఞాతమైన అర్థమును గోచరించు జ్ఞానము. కేవల యథార్థజ్ఞానమే ప్రమ యనినచో స్మృతిఁ గూడ ప్రమ గావలసివచ్చును. అట్లైన స్మృతికరణముఁగూడ ప్రమాణాంతరము గావలసివచ్చును గాన స్మృతికి ప్రమాత్వము ఇష్టమనిజెప్పుటకు వీలులేదు. పూర్వానుభవవిషయమును గోచరించినందున ప్రమాలక్షణము స్మరణమందు లేనందున అతివ్యాప్తి కవకాశము లేదు. ఈశ్వరునిచే సర్వ

మూ జ్ఞాతము. కానిచో సర్వజ్ఞత్వమునకే హానివచ్చును. ఈశ్వరజ్ఞానము ప్రమాలక్షణముతోఁ గూడుకొననందున నీశ్వరుఁడు ప్రమకు ఆశ్రయుఁడు గాఁడు గాన అప్రమాణము. అప్రమాణమైనవానిచే రచింపఁబడినవేద మప్రమాణమనెడు శంకకు సమాధానము. "అత్రోచ్యతే" అనెడు గ్రంథముచేఁ జెప్పఁబడుచున్నది.

అత్రోచ్యతే:—

శ్లో. అవ్యాప్తేరధికవ్యాప్తేరలక్షణమపూర్వదృక్,
యథార్థానుభవో మానమనపేక్షతయేష్యతే. ౧

తా. ధారావాహికప్రమయందు అనఁగా సమానవిషయకమైన జ్ఞానపరంపరలో ద్వితీయజ్ఞానాదులు పూర్వజ్ఞానవిషయమును గోచరించుటవలన అనధిగతార్థవిషయకత్వరూపమగులక్షణము ద్వితీయజ్ఞానాదులయందు లేనందున నవ్యాప్తియు, భ్రమయం దుండుటవలన నతివ్యాప్తియు వచ్చును గాన, అనధిగతార్థవిషయకత్వము ప్రమాలక్షణము గాదు. మరేమన, యథార్థానుభవత్వము స్మృతికి పూర్వానుభవయాథార్థ్యమునుబట్టియే యాథార్థ్యము సంభవించును గాని, మరియొక జ్ఞానప్రామాణ్యము నపేక్షింపని ప్రామాణ్యము సంభవించదు. కాన దానికి ప్రామాణ్య మిష్టము గాదు. అందువలన స్మృతివ్యావృత్తికొఱకు అనుభవత్వముఁ గూడ లక్షణములో నుంచఁబడినది. ఇట్టిలక్షణము ధారావాహికజ్ఞానమం దుండును గాన అవ్యాప్తికిని, భ్రమయందు లేనందున నతివ్యాప్తికి నవకాశము లేదు. ఈశ్వరీయజ్ఞానమం

దున్నది గాన ఈశ్వరుఁ డిట్టి ప్రమాశ్రయుఁ డగుటచే ప్రమాణము గాన వానిచే రచింపఁబడిన వేదము ప్రమాణ మని యాశయము.

మూ. న హ్యధిగతే అర్థే అధిగతిరేవ నోత్పద్యతే, కారణానామప్రతిబంధాత్. న చోత్పద్యమానాపి ప్రమాతురనపేక్షితేతి న ప్రమా, ప్రామాణ్యస్యాతదధీనత్వాత్. నాపి పూర్వావిశిష్టతామాత్రేణాప్రామాణ్యం. ఉత్తరావిశిష్టతయా పూర్వస్యాప్యప్రామాణ్యప్రసంగాత్. తదపేక్షత్వేన తు తస్య ప్రామాణ్యే తదుత్తరస్యాపి తథైవ స్యాదవిశేషాత్. ఛిన్నే కుఠారాదీనామివ పరిఛిన్నే నయనాదీనామ్. సాధకతమత్వమేవ నాస్తీత్యపి నాస్తి, ఫలోత్పాదానుత్పాదాభ్యాం విశేషాత్.

తా. చక్షుస్సంయోగాది కారణసామగ్రి యున్నచో ఘటమును గోచరించిన ప్రమ గలిగినపిదప మఱల నాఘటమును గోచరించిన ప్రమఁ గలుగకపోవుట లేదు. మఱలఁ గలుగవచ్చును. ద్వితీయజ్ఞానాదులందుండు ప్రామాణ్యము ప్రమాతయొక్క యపేక్షాధీనము గానందున ప్రమ గాదని చెప్పుటకు వీలులేదు. పూర్వజ్ఞానముతోఁ దుల్యమైనందున ద్వితీయజ్ఞానమ ప్రమ యనినచో ఉత్తరజ్ఞానముతోఁ దుల్యమగుటవలన ప్రథమజ్ఞానముఁగూడ నప్రమ గావలసి వచ్చును. పూర్వజ్ఞానమున కుత్తరజ్ఞానాపేక్ష లేనందున ప్రమ యనినచో, ఉత్తరజ్ఞానమునకుఁగూడఁ బూర్వజ్ఞానాపేక్ష

లేకపోవుట సమానము గాన ద్వితీయజ్ఞానముఁగూడ పూర్వ జ్ఞానమువలె ప్రమ యగును. ఛేదనక్రియలో నొకపర్యాయ ముపయోగించిన గొడ్డలివలె మొదటిజ్ఞానములో కరణమైన చక్షురింద్రియము ద్వితీయజ్ఞానములో కరణముగాదని యాశం కింపరాదు. కుఠారము. మఱల సమర్థముఁ గాకపోయినను చక్షురింద్రియ మితర కారణసమవధాన మున్నచో ద్వితీయాది జ్ఞానములలో సమర్థమగును.

మూ. తత్ఫలం ప్రమైవ న భవతి, గృహీతమాత్రగో చరత్వాత్, స్మృతివదితి చేన్న. యథార్థానుభ వత్వనిషేధే సాధ్యే బాధితత్వాత్. అనధిగతా ర్థత్వే సిద్ధసాధనాత్, సాధ్యసమత్వాచ్చ. వ్యవ హారనిషేధే తన్నిమిత్త విరహోపాధికత్వాత్, బాధితత్వాచ్చ. న చానధిగతార్థత్వమేవ తన్ని మిత్తం, విపర్యయేపి ప్రమావ్యవహారప్రసం గాత్. నాపి యథార్థవిశిష్టమేతదేవ, ధా రావహనబుద్ధ్యవ్యాప్తేః.

తా. ధారావాహికస్థలమందు ద్వితీయజ్ఞానాదికము పూర్వజ్ఞానవిషయకము గాన ప్రమయే గాదు. కాన నచ్చట యవ్యాప్తికే అవకాశము లేదనుటకు వీలులేదు. ద్వితీయ జ్ఞానాదికమును పక్షముచేసి గృహీతమాత్రగోచరత్వరూప హేతువుచే ప్రమాత్వనిషేధమును సాధించునప్పుడు నిన్న డగవలసియున్నది. ప్రమాత్వ మనఁగా యథార్థానుభవత్వమే అయినచో ద్వితీయజ్ఞానాదికమం దిట్టి యథార్థానుభవత్వ మున్నందున హేతువు బాధితమగును.అనధిగతార్థవిషయకత్వ

రూప మైనచో సిద్ధసాధనము. అనధిగతార్థవిషయకత్వ రూప ప్రమాత్వవిరహము అనధిగతార్థవిషయకత్వరూప హేతు స్వరూప మగుటవలన సాధ్యసమమనేదోషము ప్రసక్తమగును. ప్రమాశబ్దవాచ్యత్వనిషేధము సాధ్యమైనచో ప్రమాశబ్ద ప్రవృత్తినిమిత్తముయొక్క యభావ ముపాధి గాన (అనఁగా ప్రమాశబ్దశక్యతావచ్ఛేదకవిరహము) సోపాధికమగుటచే వ్యాప్యత్వాసిద్ధము గావలసివచ్చును. మఱియు పక్షమందు సాధ్యము లేనందున బాధగూడ నుండును. ప్రమాశబ్ద శక్య తావచ్ఛేదకము అనధిగతార్థవిషయకత్వమైనచో అప్రయందుఁ గూడ నిట్టిధర్మ మున్నందున నప్రమగూడఁ బ్రమ గావలసి వచ్చును. యాథార్థ్యవిశిష్టమైన యనధిగతార్థవిషయకత్వమే శక్యతావచ్ఛేదకమైనచో అప్రమయం దతిప్రసంగము వారించినను ధారావాహికజ్ఞానమం దిట్టి శక్యతావచ్ఛేదకము లేదు. కాన దానియందు ప్రమాపదవ్యవహారము లేకపోవలసి వచ్చును.

మూ. న చ తత్తత్కాలకలావిశిష్టతయా తత్రాప్యనధి
గతార్థత్వముపపాదనీయం, క్షణోపాధీనామనా
కలనాత్. న చాజ్ఞాతేష్వపి విశేషణేషు తజ్జనిత
విశిష్టతా ప్రకాశతే ఇతి కల్పనీయం, స్వరూపేణ
తజ్జననే అనాగతాదివిశిష్టతానుభవవిరోధాత్.
తజ్జ్ఞానేన తు తజ్జననే సూర్యగత్యాదీనామజ్ఞానే
తద్విశిష్టతాఽనుత్పాదాత్. న చైతస్యాంప్రమా
ణమస్తి.

తా. సూర్యగతిరూపకాలావచ్ఛేదకకాలోపాధివిశిష్ట

మైన ఘటాదికమే జ్ఞానములో భాసించును. కాన పూర్వజ్ఞానములో విషయముగాని ఉపాధివిషయకము ఉత్తరజ్ఞానము గాన అనధిగతార్థవిషయకత్వరూప ప్రమాత్వ ముత్తరజ్ఞానముననుండునని యాశంకించరాదు. ఉణోపాధులు జ్ఞాతములు గానందున నట్టియుపాధి, జ్ఞానములో విశేషణముగా భాసించుటకు వీలులేదు. విశేషణజ్ఞానము లేనిచో విశేషణవైశిష్ట్యము విశిష్టజ్ఞానమున భాసించదు. జ్ఞాతముగాని విశేషముయొక్క వైశిష్ట్యము విశిష్టజ్ఞానములో భాసించుట ముందురాబోవు విశేషణముయొక్క వైశిష్ట్యము గోచరించిన జ్ఞానముఁగూడఁ గలుగుచున్నట్టి అనుభవమున్నందున సరిగాదు. తద్వైశిష్ట్యమును గోచరించు జ్ఞానముకంటె పూర్వము తజ్జ్ఞాన మావశ్యకమని వెనుకటి అనాగతాదివస్తు వైశిష్ట్యబుద్ధ్యుపపత్తిఁ జేసినను సూర్యపరిస్పందాదిజ్ఞానము లేకపోయినను తద్వైశిష్ట్యము నవగాహించిన జ్ఞానముఁ గలుగకపోవలసి వచ్చును. విశేషణము విశిష్టబుద్ధికంటె పూర్వమందు లేనిస్థలమందు విశేషణజ్ఞాన మావశ్యకమనియు, విశేషణమున్నప్పుడు అది యజ్ఞాతమైనను విశిష్టజ్ఞానములో విశిష్టత భాసించునని చెప్పుట అతిరిక్తవిశిష్టత యుండుటలో ప్రమాణము లేనందున సరిగాదు.

మూ. నన్వనుపకార్యానుపకారక యోర్విశేషణ విశేష్య
భావే కథమతిప్రసంగో వారణీయః? వ్యవ
చ్ఛిత్తిప్రత్యాయనేన వ్యవచ్ఛిత్త్యా స్వభావేన.
అన్యథా తవాప్యనవస్థానాదితి.

తా. విశేష్యమందు విశేషణజ్ఞానమువలన విశిష్టతఁ బుట్టును. ఆవిశిష్టతయే విశిష్టజ్ఞానములో భాసించును. అట్లు

గానిచో విశేష్యవిశేషణభావమే యనుపపన్నము గావలసి వచ్చును. ఇట్టి యనుపపత్తియే విశిష్టతలో ప్రమాణ మందువా? అది సరిగాదు. విశిష్టప్రత్యయములో విశేష్యవిశేషణములకు స్వభావముగా నుండు సంబంధము భాసించునని జెప్పినను విశిష్టప్రత్యయ ముపపన్న మగుచుండ అప్రామాణికమైన విశిష్టతయొక్క యుత్పత్తి నంగీకరించి, యావిశిష్టత విశిష్టజ్ఞానములో భాసించునని చెప్ప నవసరము లేదు. విశిష్టజ్ఞానమందుండెడి సంబంధభావనమునఁ దద్జ్ఞానాపేక్ష లేదు. విశిష్టతను స్వీకరించిన నీమతమున విశిష్టత విశేషణము గాన, దానివలన మరియొకవిశిష్టతను స్వీకరింపవలసివచ్చును. ఈ రీతిగా ననవస్థ నీమతమున వాటిల్లును.

మూ. జ్ఞాతత్వే వోపాధిరితి చేన్న. నిరాకరిష్యమాణత్వాత్. తత్సద్భావే పి వా స్మృతేరపి తథైవ ప్రామాణ్యప్రసంగాత్. జనకాగోచరత్వేప్యుత్తరోత్తరస్మృతౌ పూర్వపూర్వస్మరణజనితజ్ఞాతతావభాసనాత్. అస్తు వా ప్రత్యక్షే యథా తథా, గృహీతవిస్మృతార్థశ్రుతౌ కా వార్తా. అప్రమైవాసావితి చేత్. గతమిదానీం వేదప్రామాణ్యప్రత్యాశయా. నహ్యనాదౌ సంసారే స్వర్గకామోయజేతేతి వాక్యార్థః కేనచిన్నావగతః. సందేహేపి ప్రామాణ్యసందేహాత్. నచ తత్రాపి కాలకలావిశేషాః పరిస్ఫురంతి. నచైకజన్మావచ్ఛేదపరిభాషయేదం లక్షణం. తత్రాప్యనుభూతవిస్మృతవేదార్థం ప్రత్యప్రామాణ్యప్రసంగాత్.

కథం తర్హి స్మృతేర్వ్యవచ్ఛేదః? అననుభవత్వే
నైవ. యథార్థోహ్యనుభవః ప్రమేతి ప్రామా
ణికాః పశ్యంతి. తత్త్వజ్ఞానాదితిసూత్రణాత్.
అవ్యభిచారిజ్ఞానమితి చ.

తా. పూర్వపూర్వజ్ఞానమువలన బుట్టిన జ్ఞాతతయే ఉత్త రోత్తరజ్ఞానములో భాసించును గాన ధారావాహికబుద్ధి యనధిగతమైన జ్ఞాతతావిషయకమైనందున నవ్యాప్త్యవకాశ ము లేదనుట జ్ఞాతతను నిరాకరించుచున్నాము గాన సరిగాదు. "జ్ఞాతో ఘటః" అను ప్రతీతినిబట్టి జ్ఞానజన్యమైన జ్ఞాతత సిద్ధిం చునన్నచో పూర్వానుభవగోచరముగాని యనుభవజనితమైన జ్ఞాతత ఉత్తరోత్తరస్మరణములో విషయ మగుటవలన యనధి గతార్థవిషయకత్వ మున్నందున స్మృతికిఁగూడ ప్రామాణ్యము రావలసివచ్చును. స్మృతి యనుభవసమానవిషయకమైనందున యధిగతార్థవిషయకముఁ గాన ప్రామాణ్యప్రసక్తి లేదన్నచో మొదటిస్మృతివలన స్మృతతకలిగి దానితోఁ గూడినవస్తువే మున్ముందుగల్గు స్మృతులలో భాసించును గాన నట్టిస్మృతు లకు అనధిగతార్థవిషయకత్వరూపప్రామాణ్యప్రసక్తి వచ్చును. ప్రత్యక్షాదులం దెట్లున్నను జ్ఞానవిషయమైన వస్తువుయొక్క స్మరణము లేనపుడు వాక్యమువలన గలిగిన యథార్థమైన శాబ్దబోధ గృహీతగ్రాహి యైనందున దానికి ప్రామాణ్య మెట్లుపపన్న మగును ?

అది అయథార్థమైనచో గృహీతార్థగ్రాహి యైనట్టియు సర్వజనులకు ప్రమాణమైనట్టియు వేదమునకు ప్రామాణ్యభం గము రావలసివచ్చును. "స్వర్గకామో యజేత" యను వేదము

యొక్క యర్థము అనాదియైనసంసారమం దెవనిచేతను తెలి యఁబడలేదని జెప్పుటకు వీలులేదు. ఆవిషయములో సందేహ మున్న చో వేదప్రామాణ్యమందుఁ గూడ సందేహము కలుగ వలసియుండును. ఈజన్మయందు పూర్వమందు లేనట్టియుఁ బ్రస్తుతమం దుండునట్టియు కాలవిశేషము వేదవాక్యము వలనఁ గలిగెడుజ్ఞానములో భాసించును గాన వేదమునకుఁ బ్రామాణ్యము సంభవించునని చెప్పుట ఒకజన్మయందుండు కాలవిశేషమునుబట్టి యనధిగతార్థ విషయకత్వరూపప్రమా లక్షణము చెప్పనందున సరిగాదు. ఏకజన్మయం దనుభూత మై మరచినయర్థమును బోధించెడి వేదమున కప్రామాణ్యము వచ్చును.

అనధిగతార్థవిషయకత్వము ప్రమాపదశక్యతావచ్ఛేద కము కానిచో స్మృతికి ప్రామాణ్యప్రసక్తి యెట్లు వారణీయ మగును?

యథార్థానుభవమే ప్రమయని ప్రామాణికులు చెప్పిరి గాని స్మృతియం దనుభవత్వము లేనందున ప్రామాణ్యప్రసక్తి యుండదు. కాఁబట్టియే సూత్రకారులు:—"తత్వజ్ఞానాత్ నిశ్శ్రే యసాధిగమః" "అవ్యభిచారి జ్ఞానం" అని సూత్రీకరించిరి."

మూ. నను స్మృతిః ప్రమైవ కిం న స్యాత్? యథార్థ జ్ఞానత్వాత్ ప్రత్యక్షాద్యనుభూతివదితి చేన్న. సిద్ధే వ్యవహారే నిమిత్తానుసరణాత్. న చ స్వేచ్ఛాకల్పితేన నిమిత్తేన లోకవ్యవహారనియ మనం, అవ్యవస్థయా లోకవ్యవహారవిప్లవప్రసం

గాత్. న చ స్మృతిహేతౌ ప్రమాణాభియుక్తానాం మహర్షీణాం ప్రమాణవ్యవహారోఽస్తి, పృథగనుపదేశాత్. ఉక్తేష్వంతర్భావాదనుపదేశ ఇతి చేన్న. ప్రత్యక్షస్యాఽసాక్షాత్కారిఫలత్వానుపపత్తేః, లింగశబ్దాదేశ్చ సత్తామాత్రేణ ప్రతీత్యసాధనత్వాదితి.

తా. యథార్థజ్ఞాన మగుటవలన ప్రత్యక్షానుభూతివలె స్మరణముఁగూడ ప్రమ యేల కాఁగూడదు?

స్మృతియందుసాధించు ప్రమాత్వము యథార్థజ్ఞానత్వరూపమైనచో సిద్ధసాధన మనునట్టియు, సాధ్యావిశేషరూపమనునట్టియు దోషములు సంభవించును.

ప్రమాపదవాచ్యత్వము సాధ్యమైనచో ప్రమాపదప్రవృత్తినిమిత్తము (శక్యతావచ్ఛేదకము) ఉపాధి కావలసివచ్చును. యథార్థజ్ఞానత్వము ప్రమాపదప్రవృత్తినిమిత్తమని నిజేచ్ఛచే కల్పించినచో ప్రమేయత్వమునకు ఘటపద శక్యతావచ్ఛేదకత్వమును కల్పింపవలసి యుండును. అట్లైనచో ప్రమేయత్వ మంతటను నుండుటవలన ఘటమందువలె సర్వప్రపంచమందుఁ గూడ ఘటపదవ్యవహారమే యుండవలసివచ్చును. (అనఁగా లోకసిద్ధమైన సర్వవ్యవహారములకును లోపము రావలసివచ్చును.)

ప్రమాణాభిజ్ఞులైన గౌతమాదిమహర్షులు, ప్రత్యక్ష అనుమాన ఉపమాన శబ్దము లనువానినే ప్రమాణములనుగా నుపదేశించిరి గాని స్మృతిహేతువును ప్రమాణముగాఁ

జెప్పరైరి. కాన యథార్థజ్ఞానత్వము ప్రమాపదప్రవృత్తి నిమి త్తమని చెప్పుటకు వీలులేదు.

ప్రత్యక్షాదిప్రమాణములలో స్మృతిహేతు వంతర్భా వము నొందునని చెప్పఁగూడదా ?

ప్రత్యక్షము అసాక్షాత్కారిజ్ఞానములో కరణము కానందున స్మృతి యసాక్షాత్కారరూప మగుటవలన తత్కర ణము ఇంద్రియరూపమైన ప్రత్యక్షప్రమాణములో నంతర్భా వము పొందుటకు వీలులేదు.

అజ్ఞాతమగుచు స్మృతికారణమైనదానికి జ్ఞాతమగుచు కరణమైన అనుమానాదికములో నంతర్భావము చెప్పుటకు వీలులేదు.

మూ. ఏవం వ్యవస్థితే తర్హ్యాం తేపి.యదియ మనుభవైక
విషయా సతీ తన్ముఖనిరీక్షణేన తదయథార్థత్వాఽ
యథార్థత్వే అనువిధీయమానా తత్ప్రామాణ్య
మవ్యవస్థాప్య న యథార్థతయా వ్యవహర్తుం
శక్యతే ఇతి. వ్యవహారేపి పూర్వానుభవఏవ
ప్రమితి రనపేక్షత్వాత్. న తు స్మృతిః, నిత్యం
తదపేక్షణాత్. అసమీచీనేప్యనుభవే స్మృతి
రపి తథైవ.

చతుర్థపాదముయొక్క వివరణము:—

తా. వెనుకటిరీతిని విచారణచేయఁగా ననుభవమాత్ర సమాన విషయకమైన స్మృతి స్వకారణమైన అనుభవముయొక్క యథార్థత్వాఽయథార్థత్వవ్యాప్యమైన యథార్థత్వాఽయథా

ర్థత్వమును బొందుచు కారణమైన యనుభవముయొక్క యథార్థనిశ్చయము లేనిచో యథార్థశబ్దముచే వ్యవహరింపఁ బడదు. పూర్వానుభవము ఇతరప్రమాపేక్షితము గానందున ప్రమాశబ్దముచే నదియే వ్యవహరింపఁబడును గాని యనుభవ ప్రామాణ్యము నపేక్షించిన, ప్రామాణ్యము గలస్మృతి, ప్రమ యని చెప్పుటకు వీలులేదు. అనుభవము యథార్థమైనచో దానినిబట్టియే స్మృతియందు ప్రమావ్యవహారము. అనుభవమ యథార్థమైనచో స్మృతికూడ యట్టిదే. స్మృతియందుండు ప్రామాణ్యాఽప్రామాణ్యములు పరముఖనిరీక్షకములు గాని స్వతంత్రమైనవి కావు.

మూ. నన్వేవమనుమానమప్రమాణమాపద్యేత,మూల ప్రత్యక్షానువిధానాత్. న విషయభేదాత్. ఆగ మస్తర్హి న ప్రమాణం తద్విషయమానాంత రానువిధానాత్. న ప్రమాత్వభేదాత్. ధారా వాహికబుద్ధయస్తర్హి న ప్రమాణం ఆద్య ప్రమాణానువిధానాత్. న కారణవిశుద్ధిమా త్రాపేక్షయా ప్రథమవదుత్తరాసామపి పూర్వ ముఖనిరీక్షణాభావాత్. కారణబలాయాతం కాకతాలీయం పౌర్వాపర్యమితి.

తా. కారణప్రామాణ్యవ్యాప్యప్రామాణ్యాశ్రయమైన స్మృతివలె వ్యాప్తి ప్రత్యక్షప్రామాణ్యవ్యాప్యప్రామాణ్యా శ్రయమగుటవలన యనుమితిఁగూడ యప్రమాణము కాఁ గూడదా ?

అనుభవస్మృతులు సమానవిషయకములు. వ్యాప్తిప్రత్యక్షము సాధ్యహేతువులనువిషయముగాఁ జేసికొనును. అనుమితి దానిలో విషయముగాని పక్షమును, అందలిధర్మమును విషయముగా జేసికొనును. వ్యాప్తి ప్రత్యక్షమునకును అనుమితికిని విషయభేద మున్నందున స్మృతివలె నిది యప్రమ యని చెప్పుటకు వీలులేదు. వాక్యమువలనఁ గల్గు శాబ్దబోధ వక్తయొక్క యథార్థజ్ఞాన సమానవిషయకమును, తత్ప్రామాణ్యాధీన ప్రామాణ్యాశ్రయము నగుటవలన నిదియేల యప్రమ కాఁగూడదు?

అనుభవస్మృతులకువలె వక్తయొక్క యథార్థజ్ఞానమునకును వాక్యమువలనఁ గల్గు శాబ్దబోధకును సామానాధికరణ్యము లేనందున స్మృతివలె శాబ్దబోధకప్రామాణ్యముఁ జెప్పుటకు వీలులేదు.

ధారావాహికబుద్ధులు సమానవిషయకములును సమానాధికరణములు నగును గాన మొదటిజ్ఞానముయొక్క ప్రామాణ్యాధీనప్రామాణ్యాశ్రయ మగుటవలన ద్వితీయాదిజ్ఞానములు అప్రమ లేల కాఁగూడదు?

సామగ్రి యున్నపుడు మొదటిజ్ఞానమువలె ద్వితీయాదిజ్ఞానములుకూడఁ గలుగును గాన ద్వితీయాదిజ్ఞానములయొక్క ప్రామాణ్యము ప్రథమజ్ఞానముయొక్క ప్రామాణ్యము నపేక్షింపదు. స్మృతిలో ననుభవము సమానవిషయకమై కారణమైనటుల ద్వితీయాదిజ్ఞానములలో పూర్వపూర్వజ్ఞానములు కారణములు కాఁజాలవు. వలనన విశిష్టబుద్ధిలో విశేషణజ్ఞానము కారణము గాన పూర్వపూర్వజ్ఞానము విశేషణజ్ఞానరూప

మగుటవలననే కారణముగాని సమానవిషయక మగుటవలన కారణము కాఁజాలదు. సమానవిషయకత్వ మున్నను పూర్వాపరజ్ఞానముల కది కాకతాళీయమువంటిది.

మూ. యది హి స్మృతి ర్న ప్రమితిః పూర్వానుభవే కిం ప్రమాణం. స్మృత్యన్యథానుపపత్తిరితి చేత్. న. తయా కారణమాత్రసిద్ధేః. న తు తేనానుభవేనైవ భవితవ్యమితి నియామకమస్తి. అననుభూతేపి తర్హి స్మరణం స్యాదితి చేత్. కిం న స్యాత్. న హ్యత్ర ప్రమాణమస్తి. పూర్వానుభవాకారోల్లేఖః స్మృతేర్దృశ్యతే, సోన్యథా న స్యాదితి చేత్. తత్కిం బౌద్ధవద్విషయాకారాన్యథానుపపత్త్యా విషయసిద్ధిస్త్వయాపీష్యతే, తథాభూతం జ్ఞానమేవ వా తత్సిద్ధిః? ఆద్యే తద్వదేవాఽనైకాంతికత్వం.న హి యదాకారం జ్ఞానం, తత్పూర్వకత్వం తస్యేతి నియమః; అనాగతజ్ఞానే విభ్రమే చ వ్యభిచారాత్. ద్వితీయే తు స్మృతిప్రామాణ్యమవర్జనీయం. మాభూత్పూర్వానుభవసిద్ధిః. కిం నశ్ఛిన్నమితి చేత్. న తర్హి స్మృత్యనుభవయోః కార్యకారణభావసిద్ధిరితి.

తా. "అది" యనునది స్మృతి. తచ్ఛబ్దమునకు పూర్వానుభవముతోఁ గూడినవస్తు వర్థము. మనసుచేఁ దెలియఁ

బడని పూర్వానుభవము స్మృతిలో భాసించును గాన, స్మృతి ప్రమ యేల కాఁగూడదు? స్మృతి ప్రమ కాదనినయెడల స్మృతికిఁ బూర్వ మనుభవ ముండుటలోఁ బ్రమాణము లేక పోవలసివచ్చును గదా!

స్మృతి, అనుభవముచేఁ దక్క మరియొకరీతిని యనుపపన్నము. అనెడి యన్యథా నుపపత్తియే పూర్వానుభవములోఁ బ్రమాణము. అని చెప్పుటకు వీలులేదు.

స్మృతి కార్యమగుటవలన దాని యనుపపత్తి దాని కారణసిద్ధిలో నుపయోగించును గాని యనుభవసిద్ధిలో నుపయోగింపదు. ఆకారణ మనుభవమే యనునట్టి నియమము లేదు. అటులైనచో పూర్వమం దననుభూత మైనదానికిఁగూడ స్మరణ మేల యుండఁగూడదు?

అనుభూతమైన వస్తువునకే స్మరణ మనుటలో ప్రమాణము లేనందున పూర్వానుభవ ముండుటలోఁ బ్రమాణము లేదు.

స్మృతి పూర్వానుభవాకారము కలదనుటలో పండితులకు నిర్వివాదము గాన స్మృత్యాకారమునుబట్టి పూర్వానుభవము సిద్ధింపదా? అని అందువా!

భాట్టాదులు 'ఎప్పుడో యొకపు డుండునట్టి విషయాకారమైన జ్ఞానమునుబట్టి విషయకల్పనచేసినట్లు' విషయసిద్ధియా? లేక విషయమును గోచరించిన జ్ఞానసిద్ధియా? అని యోచింపవలసి యున్నది.

విషయసిద్ధిపక్షమున—జ్ఞాన మేవస్తువుయొక్క యా కారముఁగలదో యట్టివస్తువు పూర్వమందుండవలెనను బౌద్ధ నియమము భ్రాంతిస్థలముననుముందుపుట్టఁబోవు వస్తువుల యొక్క యాకారముగల జ్ఞానమందును వ్యభిచరించినటుల నీమతమందును (భట్టమతమందు) వ్యభిచరించును.

జ్ఞానసిద్ధిపక్షమున— స్మృతి తత్త్వావిషయకమగుటవలన నదియే జ్ఞానరూపము. కాన నది ప్రమయే యగును. అందు వలననే స్మృతికి ప్రామాణ్య మవశ్య మంగీకరింపవలసి యున్నది.

పూర్వానుభవము సిద్ధింపకున్నను నష్టమేమి ?

స్మృతికిఁ బ్రమాత్వ మంగీకరింపనియెడల స్మృత్యనుభవ ములకు కార్యకారణభావ మనుపపన్నమగును గాన స్మృతి ప్రమయని చెప్పవలెను.

మూ. న. తదప్రామాణ్యేపి పూర్వాపరావస్థావదాత్మ
ప్రత్యభిజ్ఞానప్రామాణ్యాదేవ తదుపపత్తేః. యో
ఽహమన్వభవమముమర్థం; సోహం స్మరామీతి
మానసప్రత్యక్షమస్తీతి.

తా. స్మృతి యప్రమయైనను పూర్వానుభవసహితమైన యాత్మయందు స్మృతివైశిష్ట్యమును గోచరించు మానసికప్ర త్యక్షరూపమైన ప్రత్యభిజ్ఞవలననే స్మృత్యనుభవములకుఁ గార్యకారణభావము సిద్ధించును గాన స్మృతి ప్రమ యనుట సరికాదు.

మూ. న చ గృహీతగ్రాహిత్వమీశ్వరజ్ఞానస్య, తదీయ
జ్ఞానాంతరాగోచరత్వాద్విశ్వస్య. న చ తదేవ

జ్ఞానం కాలభేదేనాప్రమాణం, అనపేక్షత్వస్య
అపరావృత్తేః. తథాపి వా అప్రామాణ్యేఽతి
ప్రసంగాదితి.

తా. ఈశ్వరునకు జ్ఞానాంతరము లేనందునను గృహీత
గ్రాహి కానందునను ఈశ్వరజ్ఞానము యప్రమ యని చెప్పు
టకు వీలు లేదు.

ఈశ్వరునకు జ్ఞానాంతరము లేకపోయినను మొదటిక్ష
ణమున గృహీతమైనవస్తువే ద్వితీయాదిక్షణములలో గ్రహిం
పఁబడును గాన యప్రమ యేల కాఁగూడదు?

ఒకేజ్ఞానము ఒకక్షణమందు ప్రమయును మరియొక
క్షణమం దప్రమయును కాఁజాలదు గదా! స్మృతికి పూ
ర్వానుభవజ్ఞానాపేక్ష యున్నటుల ఈశ్వరసంబంధమైనట్టి
యుత్తరక్షణములోని జ్ఞానమునకు పూర్వక్షణమందుండు
జ్ఞానాపేక్షయుండదు. అట్లైనచో (ఉత్తరజ్ఞానమునకు పూర్వ
జ్ఞానాపేక్ష యవసరమైనచో) సర్వజ్ఞానములు ద్వితీయాదిక్షణ
ములలో గృహీతగ్రాహు లగుటవలన నప్రమలే కావలసి
వచ్చును.

మూ. స్యాదేతత్.

అనుపకారకం విషయస్య, తదీయమేతదీయం
వాన భవితుమర్హత్యవిశేషాత్. న చ తస్యైత్య
నియతం తత్ర ప్రమాణమతిప్రసంగాత్. న చ
తదభిజ్ఞమంతరేణ తదుపకారకస్యోత్పత్తిః తథా

నభ్యుపగమాత్. అభ్యుపగమేవా కార్యత్వస్యా
నైకాంతికత్వాత్.

తా. జ్ఞానముయొక్క విషయనియమముకొఱకు జ్ఞానము వలన గలిగెడు జ్ఞాతతయను నొకవిషయధర్మము నంగీకరింప వలయును గదా! అది యెచ్చోటనుండునో యది దాని యుపాదానము. కనుక నీజ్ఞాతత యుపాదానజ్ఞానమువలనఁ గలుగునని చెప్పవలయును. అట్లు కానిచో "కార్యం ఉపాదానగోచరా పరోక్షజ్ఞానజన్యం కార్యత్వాత్." అనెడి యనుమానములో కార్యత్వరూపహేతువు సాధ్యములేని జ్ఞాతతయం దుండుటవలన వ్యభిచారి యగును. దీనిచే నీశ్వరజ్ఞానము సిద్ధింపనందున నీశ్వరసిద్ధి లేకపోవలసి వచ్చును.

ఈశ్వరసిద్ధి లేదన్నచో వచ్చినయనిష్టమందువా! వేదము పరమేశ్వరోక్తము గాన వేదమున కప్రామాణ్యము సంభవించును. కాన జ్ఞాతతారూపధర్మము విషయనియమముకొఱ కంగీకరింపవలయును. అనుశంకకు సమాధానము.

అత్రోచ్యతే:—

శ్లో. స్వభావనియమాభావాదుపకారోఽపి దుర్ఘటః,
సుఘటత్వేఽపి సత్యర్థేఽసతి కా గతిరన్యథా. ౨

మూ. విశేషాభావాత్తత్రైవ ఫలం నాన్యత్రేత్యస్యాపి
నియమస్యానుపపత్తేః. స్వభావనియమేన చోప
పత్తౌ తథైవ విషయవ్యవస్థోపపత్తేః. అవశ్యం
చైతదనుమంతవ్యం, అతీతాదివిషయానురో
ధాత్. న హి తత్ర జ్ఞానేన కించిత్క్రియతే ఇతి

శక్యమవగంతుం. అసత్వాత్. న చ తద్ధర్మసా
మాన్యాధారం కించిత్క్రియతేతి యుక్తం, తేన
తస్యైవ విషయత్వవ్యాప్తేః.

తా. జ్ఞానమువలనఁ గలిగెడు జ్ఞాతతారూపధర్మము విషయమందే యుండుగాని మరియొకచోట సంభవింపదనుటలో స్వభావనియమము తక్క మరియొకటి లేదు గాన స్వభావనియమమువలననే విషయనియమముకూడ నుపపన్నమగుచున్నది. కాన జ్ఞాతతారూపధర్మము నంగీకరింపవలసిన యవసరము లేదు.

ప్రస్తుత మందుండిన యర్థమందు జ్ఞాతత యనుధర్మము పుట్టినను నష్టమైనవస్తువునందు జ్ఞాతత పుట్టుటకు వీలులేదు. కావున దానికి (నష్టవస్తువునకు) జ్ఞానవిషయత్వ మనుపపన్నము గావలసివచ్చును. జ్ఞానములో నతీతవస్తువు భాసించినటుల యతీతవస్తువునందలి జాతికూడ భాసించును గాన నాజాతి యందే జ్ఞాతత పుట్టుననుట యుక్తము గాదు.

ఏలననఁగా! దేనియందు జ్ఞాతత పుట్టునో యాజ్ఞాతత దానికే జ్ఞానవిషయత్వము సంపాదించును గాని నష్టమైనఘటాదులకు జ్ఞానవిషయత్వ మనుపపన్నము గావలసివచ్చును.

మూ. తాదాత్మ్యాద్విశేషస్యాపి సైవ జ్ఞాతతేతి చేత్.
తత్కిం చక్షుషా ఘటే జ్ఞాయమానే రసోపి
జ్ఞాయతే, తాదాత్మ్యాత్. ఘటాకారేణ జ్ఞాయ
తఏవాసౌరసః ఇతి చేత్. అథ రసాకారేణ కిం న
యతే. తేన రూపేణ జ్ఞాతతాఽనాధారత్వా

దితి చేత్. న తర్హి వర్తమానసామాన్యజ్ఞానే ప్రతీతాఽనాగతాదిజ్ఞానం, తేనాకారేణ ప్రాక ట్యాఽనాధారత్వాదితి.

తా. ధర్మిధర్మముల కైక్యమునంగీకరించి ధర్మమందుం డెడిజ్ఞాతత ధర్మియందుఁగూడ జ్ఞానవిషయత్వమును సంపాదించు నన్నచో ఫలగ్రాహియైన నేత్రమే ఫలతాదాత్మ్యము రసమం దుండుటవలన తద్రూపమైన రసమునుకూడ గ్రహింపవలసి యుండును. నేత్రముచే ఫలము ఫలరూపముగా గ్రహించు టయే యనుభవసిద్ధము గాని రసరూపముగా గ్రహించుట యనుభవసిద్ధము కాదు. గావున ధర్మిధర్మముల కైక్యముఁ జెప్పుట యుక్తముగాదు.

రసరూపముగా జ్ఞాతత కాధారముగానందున నేత్రము వలనఁగలిగెడి ఫలప్రత్యక్షములో రసమునకు విషయత్వము లేదనినచో జ్ఞాతతకూడ నష్టమైన వస్తువుయొక్కయు ముం దుండఁబోవు వస్తువుయొక్కయు నాకారముగా లేనందున అతీ తాఽనాగతవస్తువులకు జ్ఞానవిషయత్వము లేకపోవలసి వచ్చును. జ్ఞానములో విషయనియమము స్వభావనియమము వలననే యుపపన్న మగుచున్నది. కాన విషయనియమము కొఱకు జ్ఞానజన్యమైన జ్ఞాతత నంగీకరింపవలసిన యవసరము లేదు.

మూ. నను క్రియయా కర్మణి కించిత్కర్తవ్యమితి వ్యాప్తేరస్త్యనుమానం. న.

శ్లో. అనైకాంత్యాదసిద్ధేర్వా న చ లింగమిహ క్రియా,
తద్వైశిష్ట్యప్రకాశత్వాన్నాధ్యక్షానుభవోఽధికే. 3

ధాత్వర్థమాత్రాభిప్రాయేణ ప్రయోగే సంయోగాదిభి రనైకాంతాత్. న హి శరసంయోగే న గగనే కించిత్క్రియతే. అంత్యశబ్దాభివ్యక్త్యా వా. స్పందాభిప్రాయేణాసిద్ధేః. వ్యాపారాభిప్రాయేణ శబ్దలింగేంద్రియవ్యాపారైః వ్యభిచారాత్. న హి తైః ప్రమేయే కించిత్క్రియతే, అపితు ప్రమాతర్యేవ. ఫలాభిప్రాయేణాపి తథా. అన్తత స్తైనైవానైకాంతాత్, అనవస్థానాచ్చ.

తా. క్రియవలనపుట్టిన ఫలమున కాశ్రయమైనది కర్మ యనఁబడును. "ఘటం జానాతి" అనుస్థలమున ఘటము కర్మ యగుచున్నది. జ్ఞానమువలన జ్ఞాతతారూపధర్మము పుట్టని యెడల ధాత్వర్థజ్ఞానరూపమైన క్రియాజన్యఫలశాలి కానందున ఘటమునకు కర్మత్వ మనుపపన్న మగును. కాన జ్ఞానము క్రియయగుటవలన కర్మయందుండెడి ధర్మమును పుట్టించును. అనెడి యనుమానముచే జ్ఞాతతారూపధర్మము నంగీకరింప వలసియుండును.

క్రియయనఁగా ధాత్వర్థమే యైనచో "శరేణ గగనం సంయుక్తి" అనుస్థలమునందు శరకరణకమైన సంయోగరూపధాత్వర్థమువలన గగనమం దేమియు పుట్టకుండుటవలన కర్మయందుండెడి ఫలజనకత్వరూపసాధ్యము లేని పైనుదహరించిన సంయోగమందు ధాత్వర్థత్వరూపక్రియాత్వ మున్నది గాన వ్యభిచారము సంభవించును.

క్రియయనఁగా సూర్యగతిరూపమైన స్పందమనినచో నట్టిక్రియాత్వము పక్షమైనజ్ఞానమందు లేకపోవుటంబట్టి స్వరూపాऽసిద్ధి యనుదోషము సంభవించును.

క్రియ వ్యాపారరూపమైనచో శబ్దవ్యాపారమైన పదార్థస్మరమును లింగవ్యాపారమైన పరామర్శయు ప్రమాత యందలిఫలమునకు కారణము గాని విషయమందలి ఫలము నకు కారణము కాఁజాలదు గాన వ్యభిచారము సంభవించును. కాఁబట్టియె క్రియ ఫలరూపమని చెప్పుటకుకూడ వీలు లేదు. మరియు ఫలము మరియొక ధర్మమునుగూర్చి కారణ మైనచో నాధర్మముఁగూడ ఫల మగుటవలన నాధర్మరూప ఫలము మరియొకఫలమును పుట్టింపవలసి యుండును. గాన నిట్టి యనవస్థ దీనికి సంభవించును.

మూ. ఆశువినాశిధర్మాభిప్రాయేణ ద్విత్వాదిభిరనియ
మాత్. ఆశుకారకాభిప్రాయేణ కర్మణ్యసిద్ధేః. కర్మ
ణ్యాశు కారకం జ్ఞానమిత్యేవ హి సాధ్యం.
కర్తర్యాశు కారకత్వస్య కర్మోపకారకత్వేనాऽ
వ్యాప్తేః. శబ్దాదివ్యాపారైరేవానైకాంతాత్.

తా. కర్మ నిష్ఠధర్మ జనకత్వమును సాధ్యమునుగాఁ జేసి చతుర్థక్షణావస్థాయిత్వమును హేతువుగా నెంచినచో సాధ్యములేని ద్విత్వాదికమందు హేతు వుండుటవలన వ్యభి చారరూపదోషము సంభవించును. కర్మనిష్ఠ ఫలజనకత్వమునే హేతువుగాఁ జేసినచో నదియే సాధ్యరూప మగుటవలన సాధ్యాऽవిశేషరూప నిగ్రహస్థానరూపదోషము ప్రసక్త మగును. కర్త యందుండెడి ఫలజనకత్వమే క్రియాత్వరూప

మనినయెడల సాధ్యము లేని శబ్దవ్యాపారమైన పదార్థోపస్థితి యందును అనుమానవ్యాపారమైన పరామర్శయందును కర్త యందుండెడు శాబ్దబోధ యనుమితిరూప ఫలజనకత్వముం డును గాన వ్యభిచారము ప్రసక్తమగును.

కావున క్రియయగుటవలన జ్ఞానము కర్మనిష్టఫలజనక మను యనుమానముచే జ్ఞాతతారూపధర్మమును సాధించుటకు వీలు లేదు.

మూ. స్యాదేతత్. అనుభవసిద్ధమేవ ప్రాకట్యం, తథా హి:—జ్ఞాతోయమర్థ ఇతి సామాన్యతః,సాక్షా త్కృతోయమర్థఇతి విశేషతో విషయవిశేషణ మేవ కించిత్పరిస్ఫురతీతి చేత్. తదసత్.

యథా హి:—

శ్లో. అర్థేనైవ విశేషో హి నిరాకారతయా ధియాం,
తథా క్రియయైవ విశేషో హి వ్యవహారేషు కర్మణాం.౪

కిం న పశ్యసి, ఘటక్రియాపటక్రియేతివత్ కృతో ఘటః, కరిష్యతే ఘటః, ఇత్యాది. తథైవ గృహాణ, ఘటజ్ఞానం పటజ్ఞాన మితివత్ జ్ఞాతో ఘటః జ్ఞాస్యతే జ్ఞాయతే ఇతి.

తా. పైఁజెప్పిన యనుమానముచే జ్ఞాతత సిద్ధింపక పోయినను "జ్ఞాతోఽయమర్థః" యను సామాన్యానుభవము వలనను "సాక్షాత్కృతోఽయమర్థః" యను విశేషానుభవము

నను జ్ఞాతత యర్థమునకు విశేషణమై సిద్ధించుచునే యున్న దని చెప్పుటకు వలనుపడదు.

జ్ఞానము నీలాదిరూపవిషయముచే నీలజ్ఞానమని యెట్లు చెప్పఁబడునో యటులనే జ్ఞానాదిరూపక్రియచేతను ఘటాది రూపకర్మ "జ్ఞాతో ఘటః" యనుబుద్ధిచే వ్యవహరింపఁబడును. నీమతమున "కృతో ఘటః" "కరిష్యతే ఘటః" ఇత్యాది ప్రతీతులలో ఘటమందు కృతత విశేషణముగాక కృతియే విశేషణమైనట్లు "జ్ఞాతో ఘటః" "జ్ఞాయతే" "జ్ఞాస్యతే" మున్నగు ప్రతీతులలోఁగూడ జ్ఞానమే విశేషణ మగును గాని జ్ఞాతత విశేషణము కాఁజాలదు.

మూ. కథమసంబద్ధయోర్ధర్మధర్మిభావ ఇతి చేత్. "ధ్వస్తో ఘటః" ఇతి యథా. ఏతదపి కథమితి చేత్. నూనంధ్వంసేనాపి ఘటే కించిత్క్రియతే ఇతివక్తుమధ్యవసితోఽసి. తన్నిరూపణాధీననిరూపణో ధ్వంసః స్వభావాదేవ తదీయఇతికిమత్ర సంబంధాంతరేణేతి చేత్. ప్రకృతేప్యేవమేవ. ఏతేన ఫలాఽనాధారత్వాదర్థః కథం కర్మేతి నిరస్తం. వినాశ్యవత్కారణవ్యాపారవిషయత్వేన తదుపపత్తేః. స్వాభావికఫలనిరూపకత్వం చ తుల్యం.

తా. "జ్ఞాతో ఘటః" "జ్ఞాయతే ఘటః" ఇత్యాదిప్రతీతులలో అతీతజ్ఞానము, అనాగతజ్ఞానము (కలుగఁబోయెడి)

వర్తమానమైన ఘటమునకు సంబంధించనందున జ్ఞానఘటములకు విశేషణ విశేష్యభావ మెట్లు సంభవించును? "ధ్వస్తో ఘటః" ఇత్యాద్యాదిప్రతీతులలో నసంబద్ధమైన ఘటమునకును తన్నాశమునకును విశేషణవిశేష్య భావమెట్లో "జ్ఞాతో ఘటః" మున్నగు ప్రతీతులలోఁగూడ నట్లే యోచించునది.

"ధ్వస్తో ఘటః" యను ప్రతీతిలో ధ్వంసవలన మరియొక ధర్మము ఘటమందుఁ బుట్టినచో "ధ్వస్తో ఘటః" యను ప్రతీతిఁ గూడ నెట్లుపపన్న మగును?

ప్రతియోగి జ్ఞానమువలనఁ దెలియఁదగిన ధ్వంస మరియొకసంబంధము లేక స్వభావముచేతనే యెటుల ప్రతియోగి విశేషణమగునో యటులనే విషయజ్ఞానముచేఁ దెలిసికొనఁదగిన జ్ఞానముకూడ స్వభావముచేతనే పూర్వప్రతీతులలో విషయవిశేషణమై భాసించును.

జ్ఞానమువలన జ్ఞాతతారూపఫలము ఘటమందుఁ బుట్టననినయెడల "ఘటం జానాతి" యనుస్థలమందు ఘటమునకు జ్ఞానకర్మత్వ మెట్లు? క్రియాజన్యఫలాశ్రయ మైనదియే, కర్మ యనినచో పైయూహ సరియగునుగాని, "ఆత్మానం జానీయాత్" మున్నగుస్థలములలో నాత్మ కట్టి క్రియాజన్యఫలాశ్రయత్వము లేనందున నట్లు చెప్పుటకు వీలులేదు. ద్వితీయాంతపదముచేఁ జెప్పఁబడు క్రియాకారకమే కర్మయని చెప్పవలయును. "ఘటం జానాతి" మున్నగుస్థలములందు జ్ఞానమువలనఁ గలిగెడి జ్ఞాతతారూపఫలమును ఘటమందంగీకరింపకపోయినను యిట్టికర్మత్వ మున్నందున "ఘటం జానాతి"

యనుప్రయోగ ముపపన్న మగును. కర్తృవ్యాపారఫలమైన నాశము ప్రతియోగినిరూప్యమగునట్లు కర్తృవ్యాపారఫలమైనజ్ఞానము విషయనిరూప్య మగును.

**మూ.** నను జ్ఞాన మతీంద్రియత్వాదసాధారణకార్యాను
నేయం తథభావే కథమనుమీయేత, అప్రతీతం
చ కథం వ్యవహారపథ మవతరేదితి జ్ఞానవ్యవ
హారాన్యథానుపపత్త్యా జ్ఞాతతాకల్పనం. తదప్య
సత్. పరస్పరాశ్రయప్రసంగాత్. జ్ఞాతతయా
హి జ్ఞానమనుమీయేత, జ్ఞాతే చ తద్వ్యవ
హారాన్యథానుపపత్తిః తాం జ్ఞాపయేత్.

తా. జ్ఞాన మతీంద్రియ మగుటవలన తత్కార్యముచే జ్ఞానము నూహింపవలయును. ఆకార్యములేనిచో జ్ఞానము నూహించుటకు వీలులేదు. ఘటము తెలియఁబడనపుడు ఘటవ్యవహారము లేనటుల జ్ఞానముయొక్క జ్ఞానము లేనపుడు జ్ఞానవ్యవహారము లేకపోవలసి యుండును. జ్ఞానవ్యవహారమునుబట్టియే అతీంద్రియజ్ఞానమువలన ధర్మమును కల్పింపవలయును. ఆధర్మమే జ్ఞాతత యగుచున్నది. యని శంకించుటకు వలనుపడదు

జ్ఞాతతవలన జ్ఞానజ్ఞానము దానివలన జ్ఞానవ్యవహారమును గల్గుచున్నది. జ్ఞాతతలేనిచో జ్ఞానవ్యవహారమనుపపన్న మగును, గాన నీయనుపపత్తియే జ్ఞాతతాకల్పక మగుచున్నది. ఇట్టి యన్యోన్యాశ్రయదోషము సంభవించుచున్నది. కాన నతీంద్రియజ్ఞానమువలన జ్ఞాతతారూపధర్మకల్పనముఁ జేయుటకు వీలులేదు.

మూ. కుతశ్చ జ్ఞానమతీంద్రియం? ఇంద్రియేణాఽనుప లభ్యమానత్వాదితి చేత్. న. అనుమానోపన్యా సేసాధ్యాఽవిశిష్టత్వాత్. అనుపలబ్ధిమాత్రోప న్యాసేతు యోగ్యతాఽవిశేషితాఽసా కథ మైంద్రియకోపలంభాఽభావం గమయేత్. తద్వి శేషణేతు కథమతీంద్రియం జ్ఞానమితి. తథావిధ జ్ఞాతతాఽనాశ్రయత్వాదితిచేత్. న. ఆశ్రయా ఽసిద్ధేః. వ్యవహారాన్యథాఽనుపపత్త్యైవ సిద్ధ ఆశ్రయ ఇతిచేత్. న. జ్ఞాన హేతునైవ తదుప పత్తేః. తస్యాఽఽత్మమనస్సంయోగాదిరూపస్య సత్త్వేపి సుషుప్తిదశాయా మర్థవ్యవహారాభా వాన్నైవ మితి చేన్న, తావన్మాత్రస్య వ్యవ హారా హేతుత్వాత్. అన్యథాజ్ఞానస్వీకారేపి తుల్యత్వాత్.

తా ఇంద్రియమువలనఁ గలిగెడు ప్రత్యక్షములో విషయము కానందున జ్ఞాన మతీంద్రియమనియెడు ననుమా నము సరికాదు. అతీంద్రియత్వ మనఁగా నింద్రియమువలనఁ గలిగెడి ప్రత్యక్షాఽవిషయత్వ రూపమైనచో హేతువుగూడ నిట్టిసాధ్యరూప మగుటవలన సిద్ధసాధన మనుదోషము సంభ వించును. ఇంద్రియమువలనఁ గలిగెడు జ్ఞానానుపలబ్ధివలన (జ్ఞానప్రత్యక్షాభావమువలన) ఇంద్రియజన్యోపలంభాభావ మును సాధించినయెడల జ్ఞానమున కతీంద్రియత్వము సిద్ధించు నని యాశంకించుటకు వీలులేదు. ఏలననఁగా నట్టి యనుపః

యోగ్యమా? అయోగ్యమా? అయోగ్య మనినచో నది యోగ్యమైన (ఐంద్రియికమైన) ఉపలంభముయొక్క యభావ మును సాధించుటలో సమర్థము కాదు. అనుపలబ్ధి, యోగ్య మైనచో దానిచే నభావమును సాధించినపుడు జ్ఞానమున కతీం ద్రియత్వ మెట్లు సిద్ధించును?

సాక్షాత్కృతత కనాశ్రయ మగుటవలన నతీంద్రియత్వ ముండుననినచో, జ్ఞానమునకు ప్రత్యక్షవిషయత్వము లేనిచో జ్ఞానమే సిద్ధింపదు కాన నాశ్రయాऽసిద్ధి వచ్చును జ్ఞానము సిద్ధించనియెడల జ్ఞానవ్యవహార మనుపపన్న మగును. కాన జ్ఞానరూపాశ్రయము సిద్ధించునని చెప్పుటకు వీలులేదు. జ్ఞాన వ్యవహారము జ్ఞానహేతువువలననే యుపపన్నమగును గాన దానినిబట్టి యాశ్రయము సిద్ధింపదు. జ్ఞానహేతువువలననే వ్యవహార ముపపన్నమగునని చెప్పినయెడల సుషుప్త్యవస్థ యందు జ్ఞానహేతు వున్నను వ్యవహారము లేకపోవుచుం డఁగా జ్ఞానహేతువువలన నర్థవ్యవహారము సిద్ధించునని చెప్పుట యెట్లు పొసగును?

సుషుప్త్యవస్థయందు జ్ఞానహేతువున్నను దానివలన జ్ఞానము పుట్టనందున జ్ఞానసామగ్రి యపుడు లేదని చెప్పవల యును. జ్ఞానసామగ్రి యేదియో యదియే వ్యవహారమును గూర్చియు సామగ్రి యగుచున్నది. సుషుప్త్యవస్థయందు జ్ఞాన సామగ్రి లేదు. కావుననే యర్థవ్యవహారము సిద్ధింపకయున్నది వ్యవహారసాధకముగా జ్ఞానము సిద్ధింపనందున నాశ్రయాऽసిద్ధి రూపదోష మనివార్యమే యగును.

మూ. స్మరణాన్యథానుపపత్త్యేతి చేత్. న తస్యాప్యసిద్ధేః. అస్తితావద్వ్యవహారనిమిత్తం కించిదితి చేత్. కిమతః? న హ్యేతావతా జ్ఞానం తదితి సిద్ధ్యతి. తస్యైవాఽసిద్ధేః. తథాపి నియతస్య కర్తుః ప్రవృత్తేః కర్తృధర్మేణైవ కేనచిత్ప్రవృత్తిహేతునా భవితవ్యమితి చేత్. అస్త్విచ్ఛా ప్రత్యక్షసిద్ధా, న తు జ్ఞానం సైవ కథం నియతాధికరణే ఉత్పద్యతామితి చేత్. న జ్ఞానాభ్యుపగమేపి తుల్యత్వాత్. స్వహేతోః కుతశ్చిదితి చేత్, తత ఏవ ఇచ్ఛా అస్తు, కిం జ్ఞానకల్పనయేతి.

తా. పూర్వమం దనుభవింపఁబడినదాని జ్ఞానమునకే స్మరణయని పేరు. యీ స్మరణనుబట్టి తత్కారణమైనజ్ఞానము సిద్ధించునని చెప్పుటకు వీలులేదు. స్మరణకూడ జ్ఞానమగుటవలన నతీంద్రియము. కాఁబట్టి తత్కారణమునుగా జ్ఞానమును సిద్ధింపఁజేయుటకు వీలులేదు. యేదియో యొకదానివలన వ్యవహారముపపన్న మగుచుండఁగా వ్యవహారనిమిత్తముగా జ్ఞానము సిద్ధింపవలయు ననునియమము లేదు. జ్ఞానమే సిద్ధింపనందున వ్యవహారనిమిత్తము జ్ఞానమని చెప్పుటకు వలనుపడదు గదా!

కర్తకు, నియతవస్తువునందుఁ గలిగెడిప్రవృత్తి, ప్రవృత్తిజనకమైన కర్తృధర్మమువలన నుత్పన్నమగును గాన నాకర్తృధర్మమే జ్ఞానమనరాదా? యనినచో నట్లనుటకు వీలులేదు. అతీంద్రియమైన జ్ఞానమనుటకంటె ప్రత్యక్షవిషయమైన యిచ్ఛయే యాకర్తృధర్మమనుట యుక్తము.

ఇచ్ఛకూడ ప్రవృత్తివలె నియతవిషయకమైన ధర్మమగుటవలన సమానవిషయకమైన యాత్మధర్మముఃవలనఁ బుట్టునవెడి యనుమానముచే జ్ఞానము సిద్ధించునని చెప్పుటకు వీలులేదు. నియతవిషయక ధర్మమైనజ్ఞానము సమానవిషయకమైన యాత్మధర్మమువలనఁ బుట్టనందున వ్యభిచారి యగును. యేదియో యొకదానివలన జ్ఞానము కలుగునవినచో నిచ్ఛకూడ నట్లే యగును. కావున జ్ఞానకల్పన మనవసరము.

మూ. స్యాదేతత్. ప్రకాశమానే ఖల్వర్థే తదుపాదిత్సాదిరుపజాయతే, న తు సుషుప్త్యవస్థాయామప్రకాశమానేప్యర్థేఇత్యనుభవసిద్ధం. తత ఇచ్ఛాయాః కారణం విలక్షణమేవ కించిత్పరికల్పనీయం; యస్మిన్నసతి సుషాపలక్షణమాదాసీన్యమర్థవిషయమాత్మనో నివర్తతే ఇతి చేత్. హంతైవం సుషాపనివృత్తిమనుభవసిద్ధాం ప్రతిజానానేన జ్ఞానమేవాపరోక్షమిష్యతే. అచేతయన్నేవ హి సుషుప్తఇత్యుచ్యతే; అచైతన్యనివృత్తిరేవ హి చైతన్యం జ్ఞానమితి. తథాచ కాలాత్యయాపదిష్టో హేతుః. ఏతేన క్షణికత్వాదితి నిరస్తం. అపిచ. కిమిదం క్షణికత్వం నామ? యద్యాశుతరవినాశిత్వం తదాఽనైకాంతికం, అథైకక్షణావస్థాయిత్వం, తదసిద్ధం ప్రమాణాభావాత్.

తా. ఒకవస్తువును స్వీకరింపవలెననెడి యిచ్ఛ యావస్తువు తెలియఁబడినయపుడే పుట్టుటవలనను సుషుప్త్యవస్థయం

దేదియుఁ దెలియఁబడనందున దేనిఁ బుట్టకపోవుటనుబట్టియు నిచ్ఛాకారణముగా నొకదాని నంగీకరింపవలయును. యేది యున్నపుడు ఔదాసీన్యముండదో యదియే జ్ఞానమని చెప్పెద మనినచో ఔదాసీన్యమనఁగా జ్ఞాననివృత్తి దానియొక్క యభావమే జ్ఞానము. ఔదాసీన్యనివృత్తిని యనుభవించిన యపుడు జ్ఞానము ప్రత్యక్షము గాన జ్ఞానమం దతీంద్రియత్వ ముండదు. కానఁ బూర్వానుమానము బాధింపబడియెడిని. ఇట్లే. క్షణికత్వముచే జ్ఞానమం దతీంద్రియత్వమును సాధించెడి యనుమానముకూడ బాధింపఁబడుచున్నది.

అతీంద్రియముగాని యిచ్ఛయందు ఆశుతరవినాశిత్వ రూపక్షణికత్వ ముండుటవలన (శీఘ్రముగా నశించుట రూపమైనక్షణికత్వము) పూర్వానుమానములో నాశుతరవినాశిత్వ రూపక్షణికత్వమును హేతువునుగాఁ జేసినచో వ్యభిచార రూపదోషము సంభవించును. ప్రమాణము లేనందున ఏక క్షణావస్థాయిత్వ (ఒకక్షణమందే యుండుట) రూపక్షణి కత్వము జ్ఞానరూపపక్షమందు సిద్ధింపనందున అసిద్ధి యను దోషముకూడ సంభవించును.

మూ. నను స్థాయి విజ్ఞానం యాదృశమర్థక్షణం గృహ్ణా దుత్పద్యతే, ద్వితీయేపి క్షణే కిం తాదృశమేవ గృహ్ణాతి; అన్యాదృశం వా; నవా కమపీతి. న ప్రథమః, తస్య క్షణస్యాఽతీతత్వాత్. ప్రత్యక్ష జ్ఞానస్య చ వర్తమానాభత్వాత్. న చాతీత మేవ వర్తమానాభతయోల్లిఖతి, భ్రాంతత్వ

ప్రసంగాత్. న ద్వితీయః, విరమ్య వ్యాపారా౽యోగాత్. ప్రథమతోఽపి తథాభ్యుపగమే౽నాగతావేక్షణ ప్రసంగాత్. న తృతీయః, జ్ఞానత్వహానేరితి మహాప్రతీయాః.

తా. స్థిరమైనవిజ్ఞాన మేక్షణముతోఁ గూడినవస్తువును గ్రహించుచుఁ బుట్టునో రెండవక్షణమందుఁగూడ నావస్తువునే గ్రహించునా ? లేక మరియొకదానిని గ్రహించునా ? దేనిని గ్రహింపకయుండునా ? పూర్వక్షణ మతీతమైనందున పూర్వక్షణముతోఁ గూడినవస్తువు ద్వితీయక్షణమం దుండుట కుదురదు. ప్రత్యక్షజ్ఞానము వర్తమానవస్తువునే గ్రహించునుగాన జ్ఞానము పుట్టినక్షణములో నేవస్తువును గ్రహించునో రెండవక్షణమందున నావస్తువు లేనందున దానినే గ్రహించునా? యనుపక్షము సరిగాదు. జ్ఞానము పుట్టినపుడు గ్రహింపఁబడిన వస్తువే వర్తమానకాలమం దున్నట్లుగా గ్రహింపఁబడునన్నచో భ్రాంతిరూప మగును జ్ఞానము. పుట్టినక్షణమం దేవస్తువును విషయముగాఁ జేసికొనునో దానిని విడచి మరియొకదానిని విషయముగాఁ జేసికొనుట స్వభావము కాదు. జ్ఞానము. ప్రథమక్షణముననే ద్వితీయాది క్షణవిశిష్టమైనవస్తువునే గ్రహించినచో ననాగత వస్తుప్రత్యక్షప్రసంగము రావలసివచ్చును. కావున రెండవపక్షముకూడ సరిగాదు.

దేనిని గ్రహింపనిచో నిర్విషయక మగుటవలన జ్ఞానమే కాకపోవలసివచ్చును. కాఁబట్టి మూఁడవపక్షముఁగూడ సరికాదనవలయును. జ్ఞానము స్థిరమని చెప్పినచో నిట్టిదోషములు

సంభవించును గాన క్షణికమని చెప్పవలయునని మహాప్రతీయులు వక్కాణించిరి.

మూ. తదసత్. జ్ఞానం గృహ్ణాతీత్యస్యైవార్థస్యాఽనభ్యుపగమాత్. అపి తు తదేవ గ్రహణమిత్యభ్యుపగమః. తథా చ జ్ఞానం ప్రథమేక్షణేయమర్థమాలంబ్య జాతం, ద్వితీయేఽపి క్షణే తదాలంబనమేవ తన్న వేతి ప్రశ్నార్థః. తత్ర తదాలంబనమేవ తదితి పరమార్థః. న చేవం భ్రాంతత్వం, విపరీతానవగాహనాత్. తథాపి జ్ఞేయనివృత్తౌ కథం జ్ఞానానువృత్తిః, తదనువృత్తౌ వా కథం జ్ఞేయనివృత్తిరితి చేత్. కిమస్మిన్ననుపపన్నం, న హి జ్ఞానం అర్థశ్చేత్యేకం తత్త్వమేకాయుష్కం వేతి.

తా. జ్ఞానము గ్రహించుననుటయే యసంగతము. గ్రహణరూపమే జ్ఞానము. జ్ఞానము ప్రథమక్షణమున దేనిని విషయముగాఁ జేసికొనిపుట్టెనో ద్వితీయాదిక్షణములయందుఁ గూడ నావస్తువిషయకమేనా? లేక యన్యవస్తువిషయకమా? యని ప్రశ్నించిన బాగుండెడిది. వానిలో, పుట్టినక్షణమున, నేవస్తువు విషయముగాఁ గలదియో ద్వితీయాదిక్షణమందుఁ గూడ నావస్తువిషయకమే యని చెప్పెడి మొదటిపక్షమే యుచితము. ఉన్నవస్తువే భాసించుచున్నది గాన నది భ్రాంతిరూపమని చెప్పుటకు వీలులేదు. (వైపరీత్యావగాహి కానందున భ్రాంతిరూపముకూడఁ గాఁజాలదు.) జ్ఞానము -ైన

క్షణము నశించినను ఘటాదిరూపార్థములను విషయముగాఁ జేసికొనుచు జ్ఞానము భ్రాంతరూపమై యుత్తరక్షణమం దుండు నని యభిప్రాయము.

జ్ఞేయము నశించినపుడు జ్ఞానముయొక్క యనువృత్తియు, జ్ఞానానువృత్తియున్నపుడు జ్ఞేయనివృత్తియు నెటుల సంభవించును ? అనియనుట సమంజసము కాదు. జ్ఞానజ్ఞేయములు రెండును భిన్నమగుటవలనను, సమానమైన యుత్పత్తినాశము లు కలవి కాకపోవుటంబట్టియు జ్ఞేయనివృత్తియైనను జ్ఞానానువృత్తి యుండుటలో ననుపపత్తియేమియుఁ గానరాదు. గాన.

మూ. సత్యపి వా క్షణికత్వే కథమప్రత్యక్షం ? ఇత్థం? యథోచ్యతే, న స్వప్రకాశం, వస్తుత్వా దితర వస్తువత్. న చ జ్ఞానాంతరగ్రాహ్యం, జ్ఞాన యౌగపద్య నిషేధేన సమానకాలస్య తస్యాఽభావాత్. గ్రాహకకాలేగ్రాహ్యస్యాఽతీతత్వేన వర్తమానా భత్వాఽనుపపత్తేః, గ్రాహ్యకాలే చ గ్రాహకస్యాఽనాగతత్వాదితి చేత్. నన్వేవం జ్ఞాతతాపి న ప్రత్యక్షాస్యాత్, క్షణికత్వాత్. కథం? ఇత్థం; న స్వప్రకాశా, వస్తుత్వాత్. న జనకగ్రాహ్యా, అనాగతత్వాత్. విరమ్యవ్యాపారాఽయోగాచ్చ. న సమ సమయజ్ఞాన గ్రాహ్యా, జ్ఞానజనకేంద్రియ సంబంధాఽననుభవాత్. న చ తదుత్తరజ్ఞాన గ్రాహ్యా, తదానీ

మతీతత్వాదితి. క్షణికత్వమేవతస్యాః కుత ఇతి
చేత్. త్వదు_క్తయు_క్తేరేవ.

తా. "ఘటాదికమువలె జ్ఞానముకూడ వస్తువగుటవలన స్వప్రకాశము కాదు." అనెడి యనుమానముచే జ్ఞానమున కప్రత్యక్షత్వము సంభవించును. ఒకేక్షణమందు రెండుజ్ఞానములు పుట్టుట యసంభవ మగుటవలన జ్ఞాన మరియొక్క జ్ఞానముచే నీజ్ఞానము ప్రత్యక్ష మగుననుట సంభవింపదు. రెండవ క్షణమందు పూర్వజ్ఞానము లేనందున రెండవక్షణములోఁ బుట్టిన జ్ఞానముచేఁ బూర్వక్షణికమందున్నజ్ఞానము గ్రహింపఁ బడుటకు దురదు. ఇట్లే ప్రస్తుతమందలి జ్ఞానముకూడ ఉత్తర క్షణమందుఁ బుట్టెడిజ్ఞానముచేఁ గ్రహింపఁబడునని చెప్పుట సరికాదు.

పై రీతిని క్షణికత్వపక్షమున జ్ఞానమున కతీంద్రియత్వము సిద్ధింపఁజేసెడి బౌద్ధమతము సరికాదు.

జ్ఞానము క్షణికము కాఁబట్టి యప్రత్యక్షమైనచో ప్రత్యక్షమనియెడి జ్ఞాతతయును క్షణికమే యగుటవలన జ్ఞాతత కునూ నతీంద్రియత్వము రావలసియుండును. వస్తువగుటవలన జ్ఞానమెట్లు స్వప్రకాశము కాదో జ్ఞాతతకూడ నట్లే స్వప్రకాశము కాదు. జ్ఞాతతనుబుట్టించు జ్ఞానకాలమున ముందు పుట్టబోయెడి జ్ఞాతత లేనందున జనకజ్ఞానముచే గ్రహించునని చెప్పుట కుదురదు. పూర్వజ్ఞానమే జ్ఞాతతను బుట్టించి ద్వితీయాదిక్షణములయందు గ్రహించుననుటకూడ సరికాదు. ఒకే సమయమందు జ్ఞానముచే జ్ఞాతత గ్రహింపఁబడదు. జ్ఞానమును బుట్టించెడు నింద్రియసంబంధము జ్ఞాతతయందు సంభవింపదు.

జ్ఞాతతపుట్టిన యుత్తరక్షణమందు జ్ఞాతత లేనందున అపుడు పుట్టినజ్ఞానముచే గ్రహింపఁబడదు. జ్ఞానమునకు క్షణికత్వ మెటులనో జ్ఞాతతకుఁగూడ క్షణికత్వ మట్లే యంగీకరింప వలయును.

మూ. తథాహి. యం క్షణమాశ్రిత్యజాతా; తతః పరమపితమేవాశ్రయతే, అన్యం వా, న వాక మపీతి. తత్ర న ప్రథమః, తస్య తదానీమ సత్వాత్. న ద్వితీయః, అప్రతి సంక్రమాత్. ఏకక్షణావగాహిని చ జ్ఞానే తదన్య క్షణాశ్రయ జ్ఞాతతా ఫలత్వే న భ్రాంతత్వ ప్రసంగాత్. రజ తావగాహిని పురోవర్తివృత్తి జ్ఞాతతా ఫలైవ. న చాన్యమపి క్షణం జ్ఞానమవగాహతే, తదానీం తస్యాఽసత్వాత్. న తృతీయః, నిస్స్వభావతా ప్రసంగాత్. న హ్యసౌ తదానీం తదీయాఽ న్యదీయా వేతి.

తా. జ్ఞానమువలనఁ బుట్టెడిజ్ఞాతత యేక్షణము నాశ్రయించిపుట్టునో తదుత్తరమందుఁగూడ దానినే యాశ్రయించునా? మరియొకదాని నాశ్రయించునా? దేనిని యాశ్రయింపక యుండునా? ఉత్తరక్షణమందు పూర్వక్షణ ముండనందున దానినే యాశ్రయించునని చెప్పుట వీలులేదు. ముందుక్షణము నాశ్రయించిన జ్ఞాతత పూర్వక్షణవిషయకమైన జ్ఞానమువలనఁ బుట్టినచో పురోవర్తియందుండెడి జ్ఞాతతాజనకమైన రజత జ్ఞానముపలె భ్రాంతిరూపము కావలసివచ్చును. జ్ఞాతత కాశ్రయ

మైన యుత్తరక్షణము జ్ఞాతతాజనకమైన జ్ఞానకాలమందు లేక పోవుటంబట్టి యాజ్ఞానములో నుత్తరక్షణము విషయమగు ననుట యసంబద్ధము. కావున ద్వితీయపక్ష మంగీకరింప వలను పడదు. నిస్స్వభావత్వప్రసంగమువలననే జ్ఞాతత దేనినిఁగూడ నాశ్రయింపదను మూఁడవపక్షముకూడ తిరస్కరింపఁబడు చున్నది. తృతీయపక్షమున జ్ఞాతత దేనినికూడ నాశ్రయింపని యెడల దీనియం దుండునా? మరియొకదానియం దుండునా? యనుటకే యవకాశము లేదు.

మూ. అతీతేనాపి తేనైవ క్షణేనోపలక్షితాఽనువర్తతే ఇతి చేత్. ఏవం తర్హి వర్తమానార్థతాప్రకాశస్య న స్యాత్. అన్యథా జ్ఞానస్యాపి తథానువృత్తేః కో దోషః. న హి వర్తమానార్థప్రకాశసంబంధమంతరేణ జ్ఞానస్యాఽన్యావర్తమానావభాసతా నామ. అర్థనిరపేక్షప్రకాశనాఽనువృత్తిమాత్రేణ తథాత్వే భూతభావివిషయస్యాపి జ్ఞానస్య తథాఽభావప్రసంగాత్. అథ మాభూదయం దోష ఇతి స్థూలఏవ వర్తమానః ప్రకాశేనాశ్రీయతే ఇత్యభ్యుపగమః, తదా తజ్జ్ఞానస్యాఽపి స ఏవ విషయఇతి తస్యాఽపి న క్షణికత్వమితి.

తా. అతీతక్షణముతోఁ గూడినజ్ఞాతతయే ద్వితీయాది క్షణములో ననువృత్తి లేసికొని ప్రత్యక్షమగు ననినయెడల

జ్ఞానమునకు విద్యమానార్థ ప్రకాశనసామర్థ్యము లేకపోవలసి వచ్చును. అతీతక్షణముతోఁ గూడిన యర్థమునకు వర్తమానార్థత్వ మున్నచో జ్ఞానముకూడ ద్వితీయాదిలక్షణములలోని కనువృత్తి యగునని చెప్పినయెడల నెట్టిదోషము సంభవించును ?

జ్ఞానమందుండెడి వర్తమానావభాసత యనఁగా ప్రస్తుతమందుండెడి యర్థముయొక్క ప్రకాశసంబంధముగాని మరియొకటి కాదు. జ్ఞాతత క్షణికమగుటవలన పూర్వక్షణముతోఁగూడిన జ్ఞాతత, ద్వితీయక్షణమందు (అనఁగా తద్జ్ఞానకాలమందు) నశించుటవలన జ్ఞాతతాప్రత్యక్షమునకు వర్తమానాభత్వము సంభవింపదు. జ్ఞాతత స్థూలకాలము నాశ్రయించుటవలన క్షణికము కానిచో జ్ఞానముఁగూడ నారీతినే క్షణికముకాదని చెప్పవలయును. వస్తువుయొక్క యపేక్ష లేక ప్రకాశానువృత్తిమాత్రముచేతనే వర్తమానాభత్వము జెప్పినచో భూతభాతివిషయకమైన జ్ఞానముగూడ వర్తమానావభాసత కలది కావలసియుండును. కావున ద్వితీయక్షణమందు జ్ఞాతతాసంబంధము లేనందున జ్ఞాతతాప్రత్యక్షముఁ గలుగుటకు వీలులేదు. జ్ఞాతత స్థూలవస్తువు నాశ్రయించుటవలన వర్తమానానభాసత కలది యనినచో, జ్ఞాతతాజ్ఞానములోఁ గూడ నట్టి స్థూలవస్తువే విషయమగుటవలన జ్ఞాతతాజ్ఞానము మాత్ర మెట్లు క్షణికమగును ?

మూ. నను జ్ఞానమైంద్రియకం చేత్ విషయసంచారో
న స్యాత్. సంజాతసంబంధత్వాత్. న చ జిజ్ఞా
సానియమాన్నియమః, తస్యాః సంశయపూర్వ

కత్వాత్. తస్య చ ధర్మిజ్ఞానపూర్వకత్వాత్. ధర్మిణశ్చ సన్నిధిమాత్రేణ జ్ఞానే జిజ్ఞాసాపేక్షణే వా ఉభయథాప్యనవస్థానాదితి. తన్న. జ్ఞాతతాపక్షేపి తుల్యత్వాత్. తస్యాపి హి జ్ఞేయత్వే తత్పరంపరాజ్ఞానాఽఽపాతాత్. జిజ్ఞాసానియమస్య చ తద్వదనుపపత్తేః. న చేంద్రియసంబంధవిచ్ఛేదాద్విరామ ఇతి యుక్తం, ఆత్మప్రాకట్యాఽవ్యాపనాత్.

తా. జ్ఞానము మానసప్రత్యక్షవిషయమైనచో మనస్సంయుక్త సమవాయరూపసన్నికర్ష యెల్లప్పుడును జ్ఞానమందుండుటవలన నెల్లపుడును జ్ఞానప్రత్యక్షమే కలుగవలసియుండును. సుఖదుఃఖాదులయొక్క ప్రత్యక్షము కలుగకపోవలసివచ్చును.జ్ఞానమం దీసన్నికర్ష యెల్లపుడునుండినను దానియొక్క జిజ్ఞాస లేనియెడల జ్ఞానప్రత్యక్షము కలుగదనియు నాజిజ్ఞాసయుండునపుడు దానియొక్క ప్రత్యక్షము కలుగుననియుఁ జెప్పి, జిజ్ఞాసకు ప్రత్యక్షములోఁ బ్రయోజకత్వముఁ జెప్పుట పాడిగాదు. సామాన్యముగఁ దెలియఁబడి, విశేషముగఁ దెలియఁబడని వస్తువునందే జిజ్ఞాస (తెలిసికొనుటకు నిచ్ఛ) బయలుదేరును. అది సంశయపూర్వకము, ధర్మిజ్ఞానమున్నపుడే యట్టి సంశయము కలుగును. సామాన్యాకారముగ జ్ఞానానుభవము జిజ్ఞాసకంటె పూర్వ ముండవలెను. సామాన్యకారమైన జ్ఞానానుభవము జిజ్ఞాస నపేక్షింపక సన్నికర్షమాత్రమువలననే గలిగినచో నది నిత్యమగుటవలన యెల్లపుడును గ్రహణపరంపరా

రూపమైన యనవస్థ సంభవించును. సామాన్యజ్ఞానానుభవము జిజ్ఞాస నపేక్షించినచో జిజ్ఞాస సామాన్యజ్ఞానానుభవము నపే క్షించును. సామాన్యజ్ఞానానుభవము మరల జిజ్ఞాస నపే క్షించును. ఈరీతిగ జిజ్ఞాస, పూర్వపూర్వజ్ఞానాపేక్ష కలదగుట వలన ననవస్థారూపప్రసంగము వచ్చును. కావున మానస ప్రత్యక్షములో జిజ్ఞాసకునియామకత్వము చెప్పుటకు వీలు లేదు. సన్నికర్షమాత్రమునకే ప్రయోజకత్వముఁ జెప్పినచో సుఖదుఃఖాదిప్రత్యక్షము లనుపపన్నములు గావలసివచ్చును. జ్ఞానమునకు మనోగ్రాహ్యత్వ మెటుల సంభవించును?

జ్ఞాతతయందుండెడి సన్నికర్షకూడ నెప్పుడు నుండెడి దగుటవలన దానియొక్క ప్రత్యక్షమే యెప్పుడును కలుగవలసి యుండును. జిజ్ఞాస నియామకమనినచోఁ బూర్వమందుఁ జెప్పఁ బడిన యనవస్థ యిక్కడకూడ సంభవించును. ఇంద్రియసంబంధము లేనియపుడు జ్ఞాతతాప్రత్యక్షము కలుగుటయును నితర మైన ఘటాదులతో నింద్రియసంబంధ మున్నపుడు ఘటాది ప్రత్యక్షము కలుగుటయును సంభవించును. అని చెప్పుటకు వలనుపడదు. బాహ్యవస్తువులయందుండెడి జ్ఞాతతావిషయములో నిట్లు సంభవించినను ఆత్మయందుండెడు జ్ఞాతతయందు మనస్సంబంధముయొక్క విచ్ఛేదము లేదు కావున నెల్లపుడు నాత్మజ్ఞాతతాప్రత్యక్షమే కలుగవలసియుండును.

మూ. స్వభావతఏవ కాచిదసావజిజ్ఞాసితాపి జ్ఞాయతే,
న తు సర్వేతి చేత్తుల్యం. ప్రాగుత్పన్నజ్ఞాతతా
స్మరణజనిత జిజ్ఞాసః సమున్మీలితనయనః సంజ్ఞాత
జ్ఞానసముత్పాదితప్రాకట్యం జిజ్ఞాసురేవ ప్రతి

పద్యతే ఇత్యతో నాఽనవస్థేతి చేత్. (తుల్య
మేతత్.)

తా. ఒకానొకజ్ఞాతత జిజ్ఞాసితము కాకపోయినను
స్వభావమువలననే తెలియఁబడును. అన్నిజ్ఞాతతలు నట్లుకావని
జెప్పినయెడల జ్ఞానపక్షములోఁగూడ నట్లే కావలసియుండును.
పూర్వమందుఁగలిగిన జ్ఞాతతయొక్క స్మరణావలనగలిగిన జిజ్ఞాస
గలపురుషుఁడే చక్షుస్సన్నికర్షవలనఁగలిగిన జ్ఞానమువలనఁ బుట్టి
నట్టి యిప్పుడుండెడి జ్ఞాతతను గ్రహించునని జెప్పినచో జ్ఞాన
పక్షమునఁగూడ నిట్లే కావలసియుండును. (అనఁగా పూర్వ
మందుఁ బుట్టినజ్ఞానముయొక్క స్మరణావలనఁ గలిగెడి జిజ్ఞాస
కలవాఁడే చక్షుస్సన్నికర్షవలనఁ గలిగెడు వర్తమానజ్ఞానమును
గ్రహించుననని యర్థము.)

మూ. నను జ్ఞానం న సవికల్పకగ్రాహ్యం, తస్య నిర్వి
కల్పకపూర్వకత్వాత్, నిర్వికల్పకగృహీతస్య
తావత్కాలాఽనవస్థానాత్, తస్య తేనైవ వినా
శాత్. నాపి నిర్వికల్పకవేద్యం, తస్య సవికల్ప
కోన్నేయత్వేన తదభావే ప్రమాణాభావాత్.
న చ సమవాయాభావవన్నిర్వికల్పకనిరపేక్షసవి
కల్పకగోచరత్వం జ్ఞానస్యేతి సాంప్రతం, తయో
ర్విశేషణాంశస్య ప్రాగ్రహణాదనుమానాదివత్త
దుపపత్తేః. ప్రకృతే తు జ్ఞానత్వాదేరనుపలబ్ధేర
గృహీతవిశేషణాయాశ్చబుద్ధేర్విశేష్యానుప
సంక్రమాత్కథమేవం స్యాత్. న.

తా. సవికల్పకజ్ఞానము నిర్వికల్పకజ్ఞానపూర్వకము. నిర్వికల్పజ్ఞానముకంటె పూర్వమందుండెడి ఘటజ్ఞానము దాని యొక్క నిర్వికల్పజ్ఞానముచే నుత్తరక్షణమందు నశించును గాన ఘటజ్ఞానము సవికల్పకజ్ఞానకాలమందు లేనందున ఘటజ్ఞానమునకు సవికల్పకగ్రాహ్యత్వ మెట్లు సిద్ధించును? సవికల్పకము లేనిచో నతీంద్రియమైన నిర్వికల్పకజ్ఞాన మూహించుటకు వీలులేదు. కావున నిర్వికల్పకజ్ఞాన ముండుటలో మరియొక ప్రమాణము లేనందున నిర్వికల్పక ప్రత్యక్షవిషయత్వముకూడఁ జెప్పుటకు వీలులేదు. జ్ఞానమునకు సమవాయమువలె నభావమువలె నిర్వికల్పకాపేక్ష లేకయే సవికల్పక ప్రత్యక్షవిషయత్వము సంభవించునని చెప్పుటకు వీలులేదు. సమవాయాఽభావ రూపవిశేషణజ్ఞానముతోఁ గూడినసామగ్రి యున్నందున విశిష్టప్రత్యక్ష ముపపన్నమగును. ప్రత్యక్షములో జ్ఞానత్వ రూపవిశేషణము గృహీతము గానందున, గ్రహింపఁబడని జ్ఞానత్వ రూపవిశేషణముతోఁగూడిన ఘటజ్ఞానము ప్రత్యక్షవిషయ మెట్లగునని యాశంకింప వలను పడదు.

మూ. ఉత్పన్నమాత్రస్యైవ బాహ్యవిషయజ్ఞానస్యాఽఽలోచనాత్. తత స్తత్పురస్సరం, ప్రథమత ఏవ తజ్జాతీయస్య జ్ఞానాంరస్య వికల్పనాత్. ఇంద్రియసన్నికర్షస్య తత్రైవ విశేషణగ్రహణ రక్షణసహకారిసంపత్తేః. వ్యక్త్యంతరసమవేత మపి హి సామాన్యం గృహీతం తదే వేత్యుపయుజ్యతే. అన్యథాఽనుమానాదివికల్పానామను

త్త్వాదప్రసంగః, తద్గతస్య విశేషణస్యాఽగ్రహణాత్, అన్యగతస్యా చానుపయోగాత్. కిం లింగగ్రహణసహకారిస్యాదితి. ఏతేన శబ్దాది ప్రత్యక్షం వ్యాఖ్యాతమితి.

తా. మొదటిక్షణమున ఘటజ్ఞానము రెండవక్షణమున దానియొక్క నిర్వికల్పకజ్ఞానము. అదియే జ్ఞానత్వరూపవిశేషణజ్ఞానరూపము. మూఁడవక్షణమందు చక్షుస్సన్నికర్షవలన మరియొకఘటజ్ఞానము. పూర్వమందుఁ బుట్టిన జ్ఞానత్వరూపవిశేషణజ్ఞానసహకృతమైన మనస్సన్నికర్షవలన నీజ్ఞానమునకు "ఘటం జ్ఞానామి" యను ప్రత్యక్షవిషయత్వము సంభవించును. తద్జ్ఞానములో తద్గతవిశేషణజ్ఞానమే కారణమని చెప్పి తృతీయక్షణమందుఁ బుట్టినజ్ఞానమునకు సవికల్పకవేద్యత్వము సంభవింపదనినచో పర్వతమందుండెడి వహ్నిమత్వరూపవిశేషణజ్ఞానము పూర్వమందు లేనందున వహ్నిమత్వమును గోచరించిన "పర్వతో వహ్నిమాన్" అను ననుమితికి విచ్ఛేదము సంభవించును. కావున సజాతీయమందుండెడి విశేషణజ్ఞానము వలన పూర్వజ్ఞానసజాతీయమైన జ్ఞానమునకు ప్రత్యక్షవిషయత్వ మంగీకరింపవలయును. ఈరీతినే ప్రథమక్షణమందుఁ గలిగిన గకారమందుండెడి గత్వరూప విశేషణజ్ఞానముతోఁగూడిన శ్రోత్ర సమవాయరూపసన్నికర్షవలన పూర్వగకార సజాతీయమైన మూఁడవక్షణమందు పుట్టిన గకారమునకే ప్రత్యక్షత్వమూహింపవలయును.

మూ. స్యాదేతత్. విషయనిరూప్యం హి జ్ఞానమిష్యతే. న చాఽతీంద్రియస్య పరమాణ్వాదేః మనసా

వేదనమస్తి న చాఽగృహీతస్య విశేషణత్వం. న చ నిత్యపరోక్షస్యాఽపరోక్షవిశిష్టబుద్ధివిషయత్వం, వ్యాఘాతాదితి. న.

తా. జ్ఞాన మెల్లపుడును విషయముతోఁ గూడియుండును. పరమాణ్వాదిక మతీంద్రియమైనందున నది మనస్సుచేఁ గూడఁ దెలియఁబడదు. "పరమాణువును తెలిసికొనుచున్నాను" అనెడి మానసప్రత్యక్షముఁ గలుగుటకు వీలులేదు. నిత్యపరోక్షమైన పరమాణ్వాదిరూపవిశేషణప్రత్యక్షము లేనిచో, దానితోఁ గూడినజ్ఞానమునకు మానసప్రత్యక్షత్వము సంభవించదు. పరమాణ్వాదికమునకు మానసప్రత్యక్షత్వము నంగీకరించినచో పరమాణ్వాదికమున కతీంద్రియత్వవ్యాఘాతము వచ్చును. కావున జ్ఞాన మతీంద్రియమని చెప్పవలయును. కాని యిట్లు చెప్పుట యసంగతము.

మూ. బాహ్యేంద్రియగ్రాహ్యస్యాఽగ్రాహ్యస్య వా పూర్వజ్ఞానోపనీతస్యైవ మనసా వేదనాత్. అన్యథాఽతీంద్రియస్మరణస్యాప్యనుత్పత్తి ప్రసంగాత్. ఇయాంస్తు విశేషః తస్మిన్ సతి తద్బలాదేవ, అసతి తు తజ్జనితవాసనాబలాత్. న చైవం సతి స్మరణమేతత్, అగృహీతజ్ఞానగోచరత్వాత్. న చ విషయాంశే తత్తథా స్యాదితి యుక్తం. అవచ్ఛేదకతయా ప్రాగవస్థావదవభాసనాత్. న చ ప్రత్యభిజ్ఞానమపి ప్రమాణస్మరణాకారం, విరోధాత్. అథ ప్రమాణస్మరణయోః కియతీ

సామగ్రీ ? అధికో౽ర్థసన్నికర్షో గ్రహణస్య, సంస్కారమాత్రం సన్నికర్షః స్మరణస్య. అథ గ్రహణత్వేపి కుతఏతదపరోక్షాకారం ? కారణాంతరనిరపేక్షేణ సంస్కారాధిక సన్నికర్షవతేంద్రియేణ జనితత్వాత్.

తా. జ్ఞానవిశేషణమైనవస్తువు బాహ్యేంద్రియము వలనఁ గలిగిన ప్రత్యక్షములో విషయమైనను కాకపోయినను విశేషణజ్ఞాన మున్నచో దానితో (విశేషణజ్ఞానముతోఁ) గూడిన మనస్సువలన విషయముతోఁ గూడిన జ్ఞానముయొక్క ప్రత్యక్షము సంభవించును. కాన పరమాణ్వాదికమును గోచరించినజ్ఞానమున్నచో, "పరమాణువును తెలిసికొనుచున్నాను" అను మానసప్రత్యక్ష ముపపన్నమగును. సంస్కారముతోను విశేషణజ్ఞానముతోను గూడినమనస్సు అతీంద్రియమైన వస్తువును గ్రహింపని-చో నతీంద్రియమైనవస్తుస్మరణయే పుట్టకపోవలసివచ్చును. పూర్వోక్తమైన మనసువలన ననువ్యవసాయము (జ్ఞానప్రత్యక్షము) స్మరణయుఁ గలిగినచో ననువ్యవసాయమునకు జ్ఞానప్రత్యక్షమనియు స్మరణయనియు నామము లేరీతిగఁ గలిగెననఁగా విశేషణజ్ఞాన మున్నపుడు దానితోఁగూడిన మనస్సు జ్ఞానప్రత్యక్షమును పుట్టించును. అదియే [illegible] సాయ మనఁబడును. విశేషణజ్ఞానము లేక [illegible]నఁ గలిగెడు సంస్కారముతోఁగూడిన మనస్సువలన[illegible]నజ్ఞాన[illegible] స్మృతి యనఁబడును. అది పరోక్షము. అ[illegible] పూర్వమందుండిన విశేషణజ్ఞానములో విషయ[illegible]వస్తు[illegible]

యక మగుటవలన గృహీత గ్రాహి గాన స్మృతి యేల కాగూడదని శంకించుటకు వీలులేదు. స్మృతిలో పూర్వమందు గృహీతమైనవస్తువులే భాసించును. అనువ్యవసాయములో భాసించెడువిషయము పూర్వగృహీతమైనను పూర్వమందు గృహీతము కాని జ్ఞానము దీనిలో విషయమగును. అగృహీత జ్ఞానవిషయక మగుటవలన దీనిని స్మృతిరూపముగఁ జెప్పఁను టకు వీలులేదు. జ్ఞానమగృహీతమైనందున అజ్ఞానభాగ ములో ననుభవరూపమైనను జ్ఞానవిశేషణమైన యర్థము పూర్వమందు గృహీతమైనందున ఆయర్థము విషయములో స్మరణరూపము యేల కాఁగూడదు ?

ప్రాగవస్థా స్మరణతోఁగూడిన చక్షురింద్రియమువలనఁ గలిగెడి "అదియే యిది" యనెడి (సఏవాయం) ప్రత్య భిజ్ఞలో ప్రాగవస్థావిషయకమై స్మరణరూపము గాక చక్షు స్సంయుక్త విశేషణతారూపసన్నికర్షవలన యెటుల భాసిం చునో యటులనే విశేషణజ్ఞానముతోఁ గూడినమనస్సువలనఁ గలిగెడు "ఘటం జానామి" యను యనువ్యవసాయములో మనస్సంయుక్త సమవేత విశేషణతారూపసన్నికర్షవలన జ్ఞాన మందు ఘటాదిరూపార్థము విశేషణముగా భాసించును. దాని విషయమున స్మరణరూపమని చెప్పుటకు వీలులేదు.

స్మృతిత్వానుభవత్వములు రెండును పరస్పరము విరు ద్ధము లగుటవలన "స ఏవాఽయం" అను ప్రత్యభిజ్ఞ. తత్త్వాంశయందు (వాఁడే అనుతచ్ఛబ్దార్థముయొక్క భాగ మందు) స్మరణమనియు ఇదంత్వాంశయందు(వీఁడు అనియెడు ఇదంశబ్దభాగమందు) అనుభవమనియుఁ జెప్పుటకు వీలులేదు

గదా? ఈప్రత్యభిజ్ఞ సంస్కారమువలనఁ గలుగుటవలన స్మృతి రూప మేల కాఁగూడదు?

సంస్కారమాత్రమువలనఁ గలిగెడుజ్ఞానమే స్మృతి యనఁబడును. ప్రత్యభిజ్ఞ సంస్కారముకంటె భిన్నమైన యింద్రియసన్నికర్ష నపేక్షించినందున నిది స్మరణరూపము గాదు. సంస్కారమువలనఁ గలుగుటచే స్మృతి యెట్లు పరోక్షమో యటులనే ప్రత్యభిజ్ఞ పరోక్ష మేల కాఁగూడదు?

లింగశబ్దాదుల నపేక్షింపక సంస్కారముతోఁగూడిన యింద్రియసన్నికర్షమునఁ బుట్టుటవలన ప్రత్యభిజ్ఞ యపరోక్షమే యననలయును.

మూ. అథ కస్సన్నికర్షః? జ్ఞానఏవ సంయుక్తసమవాయః, తదర్థేన సంయుక్తసమవేతవిశేషణత్వమితి, మనసో నిరపేక్షస్య బహిర్వ్యాపారే అంధబధిరాద్యభావప్రసంగ ఇతి చేత్. జ్ఞానావచ్ఛేదకం ప్రతి నాయం దోషః, న చ జ్ఞానాపేక్షయా బహిరిత్యస్తి, నాపి తద్విషయాపేక్షయా నిరపేక్షత్వం, తస్యైవ జ్ఞానస్యాపేక్షణాత్. తదాపి జ్ఞానం ప్రత్యక్షమిత్యత్ర కిం ప్రమాణం? ప్రత్యక్షమేవ, యదసూత్రయత్, "జ్ఞానవికల్పానాం భావాఽభావసంవేదనాదధ్యాత్మమితి.

తా. అనువ్యవసాయములో జ్ఞానమును, దానియందు విశేషణమైన యర్థమును యెట్టిసన్నికర్షవలన భాసించును? మనస్సంయుక్త సమవాయరూపసన్నికర్షవలన జ్ఞానమును, మన

స్సంయుక్త సమవేతవిశేషణతారూప సన్నికర్షవలన యర్థమును భాసించును. ఇతరనిరపేక్షమైన మనస్సంయుక్త సమవేతవిశేషణతారూప సన్నికర్షవలన బాహ్యార్థము ప్రత్యక్షములో భాసించినచో గుడ్డివానికి "రూపమును చూచుచున్నాను" అనియు, చెవిటివానికి "శబ్దమును వినుచున్నాను" అనియు ననెడి యనువ్యవసాయ మేల కలుగఁగూడదు ?

మనస్సువలనఁ గలిగెడి బాహ్యార్థజ్ఞానప్రత్యక్షము బాహ్యేంద్రియమువలనఁ గలిగెడు వ్యవసాయజ్ఞానసహాకృతమైన మనస్సువలననే కలుగును. అంధునకు చక్షురింద్రియము వలనఁ గలిగెడు రూపప్రత్యక్షమును, చెవిటివానికి శ్రోత్రేంద్రియమువలనఁ గలిగెడు శబ్దప్రత్యక్షమును, మనస్సునకు సహకారి గావున మనస్సువలన గలుగు పూర్వోక్తమైన యనువ్యవసాయము కలుగుటకు వీలులేదు గావున నంధబధిరాదివ్యవస్థ యుపపన్న మగును.

జ్ఞానము ప్రత్యక్షమనుటలోఁ బ్రమాణ మేమి ? "జానామి" యనెడు మానసప్రత్యక్షమే జ్ఞానప్రత్యక్షత్వములోఁ బ్రమాణము. కావుననే సూత్రకారులు "భావవికల్పానాం జ్ఞానవికల్పానాం భావాఽభావ సంవేదనా దధ్యాత్మమితి" అని సూత్రించిరి. జ్ఞానవిశేషములైన ప్రత్యక్షాదుల యొక్క అస్తిత్వ నాస్తిత్వములు "అస్తిమే ప్రత్యక్షంజ్ఞానం" నాస్తిమే ప్రత్యక్షంజ్ఞానం" ఇత్యాదిరూపములుగా నాత్మచేతను మనస్సుచేతనుఁ దెలిసికొనఁబడుచున్నవి. అని పైసూత్రార్థము.

మూ. ననునేశ్వరజ్ఞానం ప్రమా, నిత్యత్వేనాఫల
త్వాత్. నాపి ప్రమాణం, అకారణత్వాత్.
అత ఏవ చ న తదా శ్రయః ప్రమాతేతి, ఉచ్యతే.

శ్లో. మితిస్సమ్యక్పరిచ్ఛిత్తిస్తద్వత్తా చ ప్రమాతృతా,
తదయోగవ్యవచ్ఛేదః ప్రామాణ్యం గౌతమే మతే.౫

సమీచీనో హ్యనుభవః ప్రమేతి వ్యవస్థితం,
తథా చ నిత్యత్వేన విశేషణమనర్థకం నిత్యాను
భవసిద్ధౌ తద్వ్యవచ్ఛేదస్యాఽనిష్టత్వాత్.
అసిద్ధౌ చ వ్యవచ్ఛేద్యాఽభావాత్.

తా. ఈశ్వరునకుండెడిజ్ఞానము నిత్యమగుటం జేసి కార్యరూపము కానందున (జన్యము కానందున) ప్రమయగుటకు వీలు లేదు. వ్యాపారము లేనందున కరణత్వము సంభవింపదు. కావున ప్రమాణరూపముగూడఁ గాజాలదు. ఈశ్వరుఁడు ప్రమ కాశ్రయము కాకపోవుటంబట్టి ప్రమాత యనుటకుఁగూడ వీలు లేదు.

ప్రమాత్వ మనఁగా నిత్యానిత్యజ్ఞానములయందుండెడి యథార్థానుభవత్వము, ఈశ్వరునియొక్క జ్ఞానము ప్రమా లక్షణముతోఁ గూడుటచే ప్రమ యగును. ప్రమాతృత్వ మనఁగా, ప్రమాశ్రయత్వమే గాని, ప్రమాకారణత్వము కాదు. కావున నీశ్వరుఁడు ప్రమాత యని చెప్పవచ్చును. ప్రమాకరణత్వరూపప్రామాణ్య మిచ్చోట వివక్షితము కాదు. ప్రమాఽయోగవ్యవచ్ఛేద రూపప్రామాణ్యమే గౌతమసమ్మ

తము. అట్టిప్రామాణ్య మీశ్వరునియం దుండుటవలన, నీశ్వరుఁడు ప్రమాణము కావచ్చును. నిత్యమైన యనుభవముఁ గూడ ప్రమ యగుటవలన ప్రమాలక్షణములో కార్యత్వరూపవిశేషణము నంగీకరింపవలసిన యవసరము లేదు.

మూ. న చేదమనుమానం, ఆశ్రయాసిద్ధిబాధయో రన్యతరాక్రాంతత్వాత్, న తత్ప్రమాకరణమితి త్వివ్యక్త ఏవ, ప్రమయా సంబంధాఽభావాత్. తదాశ్రయస్య తు ప్రమాతృత్వమేతదేవ, యతు తత్సమవాయః, కారకత్వే సతీతి తు విశేషణం పూర్వవన్నిరర్థకమనుసంధేయం యద్వేవ మాప్తప్రామాణ్యాదితి సూత్రవిరోధః, తేన హీశ్వరస్య ప్రామాణ్యం ప్రతిపాద్యతే, న తు ప్రమాతృత్వమితి చేత్. న.

తా. ఈశ్వరజ్ఞానము కార్యరూపము కాకపోవుటవలన గగనాదులవలె ప్రమకాదనెడి యనుమానము ఆశ్రయాఽసిద్ధి బాధరూపమైన దోషములలో నేదియో యొకదోషముతోఁ గూడికొని యుండుటవలన సరికాదు. ఈశ్వరజ్ఞానము ఒకానొకవానిని, వ్యాపారముగాఁ జేసికొని, ప్రమలోఁ గారణము కాకపోవుటవలనఁ బ్రమాకరణత్వము లేదనుట సమంజసము. ప్రమ కాశ్రయమగుటవలనఁ బ్రమాతృత్వము సంభవించును. కారణత్వఘటితమైనది ప్రమాతృత్వము కాదు. గావున నీశ్వరునకుఁ బ్రమాతృత్వము సంభవించును. ఈశ్వరుఁడు ప్రమాణముకానిచో నీశ్వరునకుఁ బ్రామాణ్యమును బోధించెదు. "తత్ప్రామాణ్యమాప్త

ప్రామాణ్యాత్" అనుసూత్రమునకు విరోధమువచ్చును. ఆసూత్రముచే నీశ్వరునకు ప్రామాణ్యము చెప్పఁబడుచున్నది గాని ప్రమాతృత్వము చెప్పఁబడుట లేదు. ఈశ్వరుఁడు ప్రమ కాశ్రయుఁ డగుటవలన ప్రమాత యని వ్యవహరింపఁబడును. ప్రమతో అసంబంధము లేమింజేసి ఈశ్వరుఁడు ప్రమాసం బంధి యైనందునఁ బ్రమాణమనిగూడ వ్యవహరింపఁబడును. కావున ప్రమయందు కార్యత్వరూపవిశేషణ ముండవలసిన యవసరము లేదు.

మూ. స్యాదేతత్, ప్రమీయతే అనేనేతి ప్రమాణం, ప్రమిణోతీతి, ప్రమాతేతి కారకశబ్దత్వమన యోః తథా చ కథమకారకమర్థ ఇతిచేత్. న ఏతస్య వ్యుత్పత్తిమాత్రనిమిత్తత్వాత్. ప్రవృత్తినిమిత్తం తు యథోపదర్శితమేవ, వ్యవస్థాప నాత్. అన్యథా అస్మదాదిషు న ప్రమాతృత్వ వ్యవహారః స్యాత్, సర్వత్ర స్వాతంత్ర్యా భావాత్. కారకవ్యవహార స్త్వన్యత్ర యదప్యపృన్యనిమిత్తకోపి, తథాపీహోక్తనిమిత్తవివక్ష యైవేతి.

తా. వ్యుత్పత్తిబలమువలన ప్రమాణశబ్దముచే ప్రమా కరణమును ప్రమాతృశబ్దముచే ప్రమాకర్తయును చెప్పఁబడు చున్నది. ఈశ్వరునియందు ప్రమాకరణత్వము ప్రమాకర్తృ త్వము ఉభయమును లేకపోవుటవలన నీశ్వరుఁడు ప్రమాణ మనిగాని ప్రమాత యనిగాని చెప్పుటకు వీలులేదు. వెనుకటి వ్యుత్పత్తులవలన యిట్టియర్థములు లభించినను ప్రమాసంబంధ

రూపనిమిత్తమునుబట్టి ప్రమాణమనియు ప్రమాశ్రయత్వ రూపనిమిత్తమునుబట్టి ప్రమాత యనియు నీశ్వరుఁడు వ్యవహరింపఁబడును.

మూ. ఏవం తర్హి పంచమప్రమాణాభ్యుపగమేఽపసిద్ధాంతః, న హితత్ప్రత్యక్షమనుమానమాగమో వా, అనింద్రియ, లింగ, శబ్ద, కరణత్వాత్. న, సాక్షాత్కారిప్రమావత్తయా ప్రత్యక్షాంతర్భావాత్. ఇంద్రియార్థసన్నికర్షోత్పన్నత్వస్య చ లౌకికమాత్రవిషయత్వాత్.

తా. ప్రమాసంబంధమునుబట్టి యీశ్వరునియందు ప్రమాణత్వము స్వీకరించినచో నీశ్వరుఁడు పంచమప్రమాణము కావలసియుండును. అట్లైనచో "ప్రత్యక్షానుమానోపమాన శబ్దాః ప్రమాణాని" అనెడుసూత్రమునకు విరోధము సంభవించును. సూత్రోక్తప్రమాణములలో నేదే నొకదానియం దీశ్వరున కంతర్భావముఁ జెప్పరాదా? యనినచో నింద్రియరూపము కాకపోవుటవలన ప్రత్యక్షములోను, లింగ (హేతు) రూపము కాకపోవుటవలన యనుమానములోను, శక్తిజ్ఞానములోఁ గరణము కాకపోవుటవలన నుపమానములోను, శబ్దరూపము కాకపోవుటవలన శబ్దములోను, అంతర్భావమును జెప్పుటకు వీలులేదు. ఈపై నాల్గుప్రమాణముల కంటె విలక్షణమైన యీశ్వరరూపప్రమాణము నంగీకరించిన యెడల నపసిద్ధాంతము వచ్చునని యాశంకింపఁ బనిలేదు.

సాక్షాత్కారరూపమైన ప్రమాసంబంధ మీశ్వరునియందు సంభవించును గాన ప్రత్యక్షప్రమాణములో నే

యంతర్భావమును బొందును. కావున సూత్రవిరోధము సంభవించుననిగాని యపసిద్ధాంత మగుననిగాని సందేహింప నవసరము లేదు. ఈశ్వరసంబంధియైన ప్రమ ప్రత్యక్షరూపమైనచో నది నిత్యమైనందున "ఇంద్రియార్థ సన్నికర్షోత్పన్నం జ్ఞానం ప్రత్యక్షం" అనెడు సూత్రవిరోధము వచ్చునని శంకింపఁ బనిలేదు ఆసూత్రములోఁ జెప్పఁబడిన ప్రత్యక్ష లక్షణము లౌకికప్రత్యక్షము నుద్దేశించియేకాని యీశ్వర ప్రత్యక్షము నుద్దేశించి కాకపోవుటవలన సూత్రవిరోధము కాఁజాలదు.

మూ. స్యాదేతత్. తథాపీశ్వరజ్ఞానం న ప్రమా, విపర్యయత్వాత్.యదా ఖల్వేతదస్మదాదివిభ్రమానాలంబతే, తదైతస్య విషయమస్పృశతః న జ్ఞానావగాహనసంభవ ఇతి తదర్థో హ్యాలంబనమభ్యుపేయం, తథా చ తదపి విపర్యయః, విపరీతార్థాఽఽలంబనత్వాత్. తదనవగాహనేవాస్మదాదేర్విభ్రమానవిదుష స్తదుపశమాయోపదేశానామసర్వజ్ఞత్వపూర్వకత్వమితి. న.

తా. అస్మదాదులయొక్క భ్రమ విషయకమగుటవలన నీశ్వరజ్ఞానముకూడ భ్రమయే యగునుగాని ప్రమయని చెప్పుటకు వీలులేదు. ఈశ్వరజ్ఞానము భ్రమవిషయక మగునపుడు భ్రమవిషయముకూడ దానిలో భాసించునని యంగీకరింపవలయును. విపరీతార్థవిషయక మగుటవలన అస్మదాదులయొక్క జ్ఞాన మేరీతిగ భ్రమ యగుచున్నదో యటులనే యీశ్వర

జ్ఞానముకూడ (నట్టిదే యగుటవలన) విపరీతార్థవిషయక మగుటవలన నీశ్వరజ్ఞానము భ్రాంతిరూప మగును.

ఈశ్వరుఁడు మనయందలి భ్రమను గుర్తెరుగనియెడల అసర్వజ్ఞుఁడు గాన మనయొక్క భ్రమను నివర్తింప చేయుట కొరకు కాయనయొక్క యుపదేశము అసర్వజ్ఞపూర్వకము కావలసివచ్చును. కాన నీశ్వరజ్ఞానముకూడ నస్మదాదిభ్రమలను గోచరించుటవలన భ్రాంతిరూపమని యాశంకింప వీలు లేదు.

మూ. విభ్రమస్యాఽప్రామాణ్యేపి తద్విషయస్య తత్వముల్లిఖతః అభ్రాంతత్వాత్, అన్యథా భ్రాంతిసముచ్ఛేదప్రసంగః, ప్రమాణాభావాత్. తథాప్యారోపితార్థావచ్ఛిన్నజ్ఞానావలంబనత్వేనకథం నభ్రాంతత్వమితి చేన్న. యత్ యత్రనాస్తి తత్ర తస్యాచగతిరితి భ్రాంత్యర్థత్వాత్. ఏతదాలంబనస్య చైవముల్లిఖతః సర్వత్ర యథార్థత్వాత్. నహి న తద్రజితం, నాపి తత్రాఽసత్ నాపి తత్రావగతమితి.

తా. ముత్యపుచిప్పయందు (యందలి) ఇది వెండి "యను జ్ఞానము రజితత్వములేని ముత్యపుచిప్పయందు రజితత్వమును గోచరించుటవలన నది భ్రమరూప మగును. ఇట్టి భ్రమయందుండెడు భ్రమత్వ మనఁగా రజతత్వాభావవచ్ఛుక్తి నిష్ఠవిశేష్యతానిరూపిత రజతత్వ నిష్ఠప్రకారతాకత్వరూప మైనది.

ఇట్టిభ్రమత్వమును పురస్కరించుకొనియే భ్రమ యీశ్వరజ్ఞానములో విషయ మగును. ఇట్టిజ్ఞానము తచ్ఛ్వాన్యే తదవగాహికాకపోవుటవలన ప్రమాత్మకమే యగును. భ్రమను గోచరించినజ్ఞానము భ్రమరూపమైనచో భ్రమను సాధించెడి ప్రమాత్మకప్రతీతి లేకపోవుటవలన భ్రమసిద్ధియే లేకపోవలసి వచ్చును పూర్వోక్తరీతిగా తదభావవన్నిష్ట విశేష్యతానిరూపిత తన్నిష్టప్రకారతాకత్వ రూపభ్రమత్వమును పురస్కరించుకొని భ్రమను గోచరించినందున ఈశ్వరజ్ఞానము సర్వాంశములనుబట్టి ప్రమాత్మకమే గాని భ్రమరూపము గాదు. ఇట్టిప్రమాసంబంధమునుబట్టి యీశ్వరుఁడు ప్రమాణమని వ్యవహరింపఁబడును. ఇట్టి ప్రమాణభూతమైన యీశ్వరునిచేఁ జెప్పఁబడిన వేదము ప్రమాణమని తెలిసికొనవలయును.

శ్లో. సాక్షాత్కారిణి నిత్యయోగిని పరద్వారానపేక్ష్య స్థితౌ
భూతార్థానుభవే నివిష్టనిఖిలప్రస్తావివస్తుక్రమః,
లేశాదృష్టి నిమిత్తదృష్టి విగమప్రభ్రష్టశంకాతుషః
శంకోన్మేషకలంకిభిః కిమపరైస్తన్మే ప్రమాణం శివః. ౬.

ఇతి చతుర్థస్తబకః.

తా. ప్రత్యక్షమైనట్టియు, నిత్యమైనట్టియు చక్షురాది ప్రమాణముల నపేక్షింపనట్టియు యథార్థానుభవమందు

విషయమైన నిఖిలపదార్థములయొక్క సంబంధము గలిగినట్టియు, స్వల్పమైన (తక్కువదైన) మోహామే నిమిత్తముగాఁగల రాగద్వేషాదికము పోవుటచే నశింపఁబడిన వేదప్రామాణ్యమందలి శంకగలిగినట్టి పరమశివుఁడే ప్రమాణము. ఇట్టిశివునివిషయమై యప్రామాణ్యశంకారూపకలంకములతోఁ గూడిన పాషండాదుల యవసర మేమి గలదు?

చతుర్థ స్తబకము సమాప్తము.

శ్రీ పరదేవతార్పణమస్తు.



శ్రీ మాత్రే నమః.

# పంచమస్తబకము.



మూ. నన్వీశ్వరే ప్రమాణోపపత్తౌ సత్యాంసర్వమేత దేవం స్యాత్. తదేవ తు న పశ్యామ ఇతి చేత్. న హ్యేష స్థాణోరపరాధో యదేనమంధో న పశ్యతి.

తథా హి:—

శ్లో. కార్యాయోజనధృత్యాదేః
పదాత్ప్రత్యయతశ్శ్రుతేః,
వాక్యాత్సంఖ్యావిశేషాచ్చ
సాధ్యో విశ్వవిదవ్యయః. ౧.

క్షిత్యాది కర్తృపూర్వకం కార్యత్వాదితి.

తా. తత్సాధకప్రమాణాభావాత్. అను విప్రతిపత్తిని నిరాకరించుట యీ స్తబకమునందు కాఁగలదు. ఈశ్వర సాధనలో ప్రమాణమున్నచో వెనుక యుపన్యసించిన సంగతులన్నియు నుపపన్న మగును. అట్టి ప్రమాణమే లేదనినచో, గుడ్డివానిచే చూడఁబడనందున యాస్థాణువ ప్రమాణసిద్ధముఁ గాకపోవునా? అటులనే ప్రమాణపరిజ్ఞానము లేనివానిచే ఈశ్వరునివిషయమై ఈశ్వరసాధకప్రమాణమును

కనిపెట్టఁబడకపోవుట ఈశ్వరునియొక్క యపరాధము గాదు. ఈశ్వరునిసాధించెడు ప్రమాణము యీశ్లోకముచే జెప్పఁబడు చున్నది.

అనుమానమే ప్రమాణము, వానియొక్కస్వరూపము.

1. కార్యమగుటవలన ఉపాదానమును గోచరించిన అపరోక్షజ్ఞానముతోను, అట్టిచికీర్ష, అట్టికృతితోను గూడినవానిచే ఘటము యెటులఁ బుట్టునో కార్యమైన పృథివ్యాదికముఁగూడ అటులనే బుట్టును అని యనుమానము. ఇట్టి యనుమానసిద్ధమైన క్షిత్యాదికర్తృత్వము కించిజ్ఞులమైన మనకు సంభవించ నందున సర్వజ్ఞుఁడైన ఈశ్వరునికే జెప్పవలెను. కాన యీఅనుమానమువలన ఈశ్వరుఁడు సిద్ధించును.

2. అస్మదాదిశరీరకర్మ యెటుల చేతనప్రయత్నపూర్వకమో అటులనే, ఆయోజనమనఁగా, కర్మ. కర్మయగుటవలన సృష్ట్యాద్యకాలీనద్వ్యణుకారంభక సంయోగజనకమైన కర్మ గూడ చేతనునియొక్క ప్రయత్నపూర్వకముఁ గాన అట్టిచేతనుఁడే ఈశ్వరుఁడు.

3. ధృతియనఁగా, గురువైన వస్తువులయొక్క పతనాభావము. ధృతి యగుటవలన ఆకాశమందుండు పక్షిచే ధృతమగు కాష్ఠాదులయొక్క పడకపోవుట. యెటుల పతనప్రతిబంధకమగు ప్రయత్నాధిష్ఠితమో, అటులనే బ్రహ్మాండాదులయొక్క ధృతిఁగూడ, పతనప్రతిబంధకమైన ప్రయత్నముతో గూడినపురుషునిచే యధిష్ఠించఁబడ్డది. అట్టిపురుషుఁ డీశ్వరుఁడే గాని, అస్మదాదులము గాము.

4. వ్యవహార మగుటవలన ఆధునికలిప్యాదివ్యవహార మెట్ుల పురుషప్రయోజ్యమో, అటులనే ఘటాదిసంప్రదాయ వ్యవహారముగూడ స్వతంత్ర పురుషప్రయోజ్యము. అట్టి స్వతంత్రపురుషుఁ డీశ్వరుఁడు.

5. ప్రత్యయమనఁగా, వేదమువలనఁ గలుగు ప్రమ. ప్రత్యక్షాదిప్రమ లెటుల కారణగుణపూర్వకములో వేదము వలనఁగలుగు ప్రమగూడ, కారణగుణపూర్వకము. అట్టి గుణా శ్రయమైనవాఁడు ఈశ్వరుఁడే గాని మరియొకఁడు గాఁడు.

6. శ్రుతి యనఁగా, వేదము. ఆయుర్వేద మెటుల పౌరుషేయమో వేదముగూడ పౌరుషేయమే యను నను మానముచే వేదకర్త సిద్ధించును. వాఁడే ఈశ్వరుఁడు.

7. వాక్యరూప మగుటవలన భారత మెటుల పౌరు షేయమో, వేదవాక్యముఁగూడ పురుషప్రణీతమనే యను మానముఁగూడ ఈశ్వరునివిషయమై ప్రమాణము.

8. మహత్పరిమాణముతో గూడినవానిలో మహత్తర మెటుల గొప్పదో అణుపరిమాణముఁ గలవాట్లలో అణు తరము గొప్పది, మహత్పరిమాణముతో గూడిన కపాలముల వలనఁగలిగినఘటము కపాలములకంటె యెటుల ఉత్కృష్టమో, అటులనే పరమాణువు లణుతరములు. ద్వ్యణుకపరిమాణము పరమాణు పరిమాణమువలనఁ గలిగినచో పరమాణువుకంటే ద్వ్యణుకము అణుతరము కావలసివచ్చును. అట్లైనచో దాని వలనఁ గలుగునది మరియు చిన్నది కావలసివచ్చును. కాఁగా ప్రపంచము అప్రత్యక్షము గావలసివచ్చును. కాన ద్వ్యణుక పరిమాణములో పరమాణువయందున్న ద్విత్వసంఖ్యయే

కారణమని చెప్పవలెను. ఆసంఖ్య అపేక్షాబుద్ధివలనఁ గలుగును. సృష్ట్యాదియందు శరీరముతో గూడుకున్న జీవులు లేనందున జీవాపేక్షాబుద్ధివలనఁ గలుగునని చెప్పుటకు వీలులేదు. ఈశ్వరుని యొక్క అపేక్షాబుద్ధివలననే గలుగునని చెప్పవలెను. అట్టి అపేక్షాబుద్ధ్యాశ్రయముగా సర్వజ్ఞుఁడైన ఈశ్వరుఁడు తత్తత్పక్షకానుమానములచే సిద్ధించునని శ్లోకతాత్పర్యము.

శ్లో. న బాధోఽస్యోపజీవ్యత్వాత్ ప్రతిబంధో న దుర్బలైః,
సిధ్యసిధ్యోర్విరోధో నో నాసిద్ధిరనిబంధనా. ౨

మూ. తథాప్యత్ర యే శరీరప్రసంగముద్ఘాటయన్తి కస్తేషామాశయః? కిమీశ్వరం పక్షయిత్వా కర్తృత్వాచ్ఛరీరిత్వం? తతశ్శరీరవ్యావృత్తేర కర్తృత్వం, అథ క్షిత్యాదికమేవ పక్షయిత్వా కార్యత్వాచ్ఛరీరికర్తృకత్వం, యద్వా శరీరాజన్యత్వాదకార్యత్వం, తతఏవ వా కర్తృకత్వం పరవ్యాప్తిస్తంభనార్థం విపరీతవ్యాప్త్యుపదర్శన మాత్రం వేతి.

తా. పూర్వానుమానములచే జగత్కర్త సిద్ధించినను అట్టికర్తకు శరీరప్రసంగమును ఉపన్యసించెడువారియొక్క యాశయమేమో? ఈశ్వరుఁడు కర్త గాన శరీరముఁ గలవాఁడనిగాని, శరీరము లేకపోవుటవలన కర్త గాఁజాలఁడనియా? లేక క్షిత్యాదికము కార్యమగుటవలన శరీరముతో గూడిన కర్తవలన బుట్టుననియా? లేక శరీరమువలన బుట్ట

నందున యకార్యమనియా ? అందువలననే యకర్తృక మనియా? లేక పరవ్యాప్తిస్తంభనమునకై విపరీతవ్యాప్తిని జూపించునిమిత్తమా ?

మూ. తత్ర ప్రథమద్వితీయయో రాశ్రయాసిద్ధిబాధాపసిద్ధాంత ప్రతిజ్ఞావిరోధాః, తృతీయే తు వ్యాప్తౌ సత్యాం నేదమనిష్టం, అసత్యాం తు న ప్రసంగః, చతుర్థే బాధానైయికాన్తికౌ, పంచమే త్వసమర్థవిశేషణత్వం, షష్ఠేపి నాగృహ్యమాణవిశేషయా వ్యాప్త్యా బాధః, న చాగృహ్యమాణావిశేషవ్యాప్త్యా గృహ్యమాణవిశేషాయాః సత్ప్రతిపక్షత్వం, అస్తి చ కార్యత్వవ్యాప్తేః పక్షధర్మతాపరిగ్రహో విశేషః; కర్తా శరీరీ విపరీతో న కర్తేతి చానయో స్తద్విరహః.

తా. కర్తృత్వరూపహేతువువలన ఈశ్వరునియందు శరీరిత్వమును సాధించినయనుమానము మొదటిది. ఈశ్వరునియందు శరీరాభావముచే అకర్తృత్వమును సాధించు ననుమానము రెండవది. ఇట్టి రెండిటివలనను ఈశ్వరసాధకమైన యనుమానములో బాధ రూపదోషము చెప్పుటే గదా! నీతాత్పర్యము? ఏలయన, మామతములో ఈశ్వరుడు అనగా అశరీరియే, గాన కర్తయగువాడు శరీరియే యను నీమతముచే యశరీరిత్వ రూపవిశేషణమునకు బాధ చెప్పుటయే అని గదా ? నీవుపన్యసించిన ఈశ్వర బాధకానుమానములు రెండును [illegible]

కానవచ్చుచున్నవి. నీ యనుమానములలో పక్షముగా చేయఁబడిన ఈశ్వరుఁడు ప్రమాణసిద్ధుఁ డగునా? కాఁడా? ప్రమాణాంతరముచే సిద్ధమైనచో ఆప్రమాణముచేతనే యశరీరి కర్తయగు నీశ్వరుఁడు సిద్ధించినందున, ఈశ్వరసాధక ప్రమాణముచేతనే నీ యనుమానములు బాధితము లగును. సిద్ధించనిచో, పక్షమే లేనందున కర్తృత్వముచే శరీరిత్వమును, శరీరాభావముచే అకర్తృత్వమును ఎక్కడసాధించెదవు. కాన యాశ్రయాసిద్ధి వచ్చును. ఈశ్వరద్వేషివైన నీవు కర్తృత్వముచే శరీరిత్వమును సాధించినచో యపసిద్ధాంతముఁగూడ సంభవించును. ఇటులనే అశరీరికర్తయే ఈశ్వరుఁడు గాన,అట్టి ఈశ్వరుఁడు శరీరి, అకర్త, అనెడుప్రతిజ్ఞ, నాతల్లి గొడ్డురాలు అని చెప్పునట్లుండును. కావున నీచే ఉపన్యసింపఁబడిన ఈశ్వరపక్షకానుమానములు రెండును, పైన నుదహరించినరీతిగా బాధ, ఆశ్రయాసిద్ధి, అపసిద్ధాంత, ప్రతిజ్ఞావిరోధ, రూపదోష చతుష్టయముతోఁ గూడుకొన్నందున, ఇట్టి దోషయుక్తమైన యనుమానములచే కార్యత్వరూపహేతువచే క్షిత్యాదికమందు అశరీరి కర్తయగు ఈశ్వరిని సాధించెడు ననుమానము బాధితము గానేరదు.

పూర్వానుమానములచే కార్యత్వముచే సకర్తృకత్వమును సాధించెడు ననుమానము బాధింపఁబడుటకు వీలులేదనియే, క్షిత్యాదికమందు కార్యత్వమువలన శరీరికర్తృకత్వమును, శరీరాజన్యత్వమువలన అకార్యత్వమును, అకర్తృకత్వమును, సాధించెడు ననుమానత్రయమును నుపన్యసించితివి? ఇట్టి యనుమానములచే ప్రకృతానుమానము బాధింప

బడుననిగదా! నీయాశయము. కొన్ని కార్యములు శరీరి కర్తృకములైనను, కార్యత్వమందు శరీరకర్తృకత్వవ్యాప్తి యున్నంతమాత్రమున యశరీరి కర్తృకత్వమును నిరసించుటకు వీలులేదు. శరీరి కర్తృకత్వములేని యంకురాదులయందు కార్యత్వ ముండుటవలన ననైకాంతిక మనుదోషము సంభవించును. కాన కార్యత్వముచే శరీరి కర్తృకత్వమును సాధించెడు మూఁడవయనుమానము, మా యనుమానమును బాధింపనేరదు. శరీరాజన్యత్వముచే యకార్యత్వమును సాధించెడి యనుమానముగూడ సరికాదు. క్షిత్యాదికమంతయు పక్షముచేసినచో అంతయు అకార్యము గానందున బాధ సంభవించును. పరమాణ్వాదికము నేపక్షము చేసినచో, శరీరమువలనఁ బుట్టని యంకురాదికమందు అకార్యత్వరూప సాధ్యము లేనందున వ్యభిచారము సంభవించును. ఇట్టిదోషములతో గూడినందున యకార్యత్వసాధకానుమానము దుర్బలము. ఇటులనే యకర్తృకత్వమును సాధించెడు పంచమానుమానము వ్యాప్యత్వాసిద్ధి యనుదోషముచే దూషితము అజన్యత్వముకే యకర్తృకత్వ వ్యాప్యత్వము సంభవించును. వ్యర్థమగు శరీరపదమును హేతువాక్యమున ప్రయోగించుటవలన వ్యాప్యత్వాసిద్ధిదోషముచే దూషితముఁ గాన, ఈ పంచమానుమానముఁగూడ హీనబలమైనదగుటవలన వీట్లచే ప్రకృతానుమానములో సత్ప్రతిపక్షితత్వమును గాని బాధను గాని యాశంకించుటకు వీలులేదు.

**అన్యవ్యావృత్తపక్షధర్మతగల హేతువునకుండెడు వ్యాప్తియనునట్టి పక్షధర్మమైన సాధ్యవ్యాప్యమైన కార్యత్వహే**

తుకానుమానమునకు సత్ప్రతిపక్షితత్వ మాశంకించుటకు వీలు లేదు. మాయనుమానములో వ్యాప్యమైన కార్యత్వమునకు పక్షధర్మతారూపవిశేష మున్నది. కర్తా శరీరీ, అశరీరీ అకర్తా, యనుస్థలమున వ్యాప్తియున్నను, పక్షధర్మతా రూపవిశేషము లేదు. కాన నీ వుపన్యసించిన క్షిత్యాదిపక్షకానుమానములచే ప్రకృతానుమానములో బాధగాని సత్ప్రతిపక్షితత్వముగాని యుండుటకు వీలు లేదు.

మూ. నను యద్బుద్ధిమద్ధేతుకం తచ్ఛరీరిహేతుకమితి నియమే యచ్ఛరీరహేతుకం న భవతి తద్బుద్ధిమద్ధేతుకమపి న భవతీతి విపర్యయనియమోఽపి స్యాత్. తథా చ పక్షధర్మతాపి లభ్యతేతి చేత్ న గగనాదేః సపక్షభాగస్యాపి సంభవాత్, కేవలవ్యతిరేకిత్వానుపపత్తేః, అన్వయే తు విశేషణాసామర్థ్యాత్ హేతువ్యావృత్తిమాత్రమేవ హి తత్ర కర్తృవ్యావృత్తివ్యాప్తం న తు శరీరరూపహేతువ్యావృత్తిరిత్యుక్తం వ్యాప్తశ్చ పక్షధర్మ ఉపయుజ్యతే న త్వన్యోఽతి ప్రసంగాత్.

తా. క్షిత్యాదికము శరీరమువలనఁ బుట్టనందున బుద్ధిగల చేతనునివలనఁగూడఁ బుట్టదు. అనెడు నియమమున్నప్పుడు, ఏది బుద్ధిమద్ధేతుకమో అది శరీరజన్యము అనెడు వ్యతిరేకవ్యాప్తియందు పక్షధర్మతాలాభముఁగూడ యగును. కాన, క్షిత్యనుమానము యశరీరి కర్తృకత్వసాధకమైన

యనుమానమునకు ప్రత్యనుమానము గాన సమానబలమైన దగుటవలన దీనిచే సత్ప్రతిపక్షితత్వ మాశంకించుటకు వీలు లేదు. శరీరరాజన్యత్వముచే బుద్ధిమద్ధేతుకత్వాభావము క్షిత్యాదికమందు సాధించెడు ననుమానము కేవల వ్యతిరేక్యనుమానమా? లేక అన్వయ వ్యతిరేక్యనుమానమా? ఆకాశము నిత్యమగుటవలన బుద్ధిమద్ధేతుకత్వాభావరూపసాధ్యము ఇక్కడ నిశ్చితము గాన నిశ్చితసాధ్యముఁ గలగఁగ నాది రూపసపక్ష ముండుటవలన, "అసత్సపక్షో హి కేవలవ్యతిరేకీ" అను కేవలవ్యతిరేకి లక్షణాక్రాంతము గానందున కేవల వ్యతిరేక్యనుమాన మనుటకు వీలులేదు. కేవలవ్యతిరేకి గాకపోయినను, అన్వయవ్యతిరేకి యగునని నీ యాశయముఁ గాబోలు? అదియని చెప్పుటకుఁగూడ వీలులేదు. అజన్యత్వమే వ్యాప్తము గాన శరీరాజన్యత్వమునకు వ్యాప్తత్వము లేదు. వ్యాప్తియు పక్షధర్మతయు రెండు నుపయోగించును గాని వ్యాప్తిలేని కేవలపక్షధర్మతకు ఉపయోగిత్వము లేదు. కాన అన్వయవ్యతిరేకి యనుటకుఁగూడ వీలులేదు. ఇట్టి యాభాసరూపమైన యనుమానముచేఁ బ్రకృతానుమానమునకు సత్ప్రతిపక్షితత్వ మాశంకించుట సరికాదు.

మూ. ఏతేన తద్వ్యాపకరహితత్వాదితి సామాన్యోప
సంహారస్య అసిద్ధత్వం వేదితవ్యం. న హి
యద్వ్యావృత్తిః, యదభావే అన్వయవ్యతి
రేకాభ్యాముపసంహర్తుమశక్య, తత్తస్య
వ్యాపకం నామేతి.

తా. శరీరాజన్యత్వ హేతుకానుమానము ప్రత్యనుమానము గాకపోయినను కర్తృవ్యాపకరహిత మగుటవలన క్షిత్యాదిక మకర్తృకము. అనెడు యనుమానమే ప్రత్యనుమాన మందుము. ఇట్టియనుమానములో హేతువు వ్యర్థవిశేషణముతోఁ గూడుకొననందున ఇదియే ప్రత్యనుమానము అని యనుటకు వీలుపడదు. ఈయనుమానముఁగూడ యసిద్ధిరూపదోషాక్రాంతమగును. ఏలనన, కర్తృవ్యాపకరహితత్వమే హేతువుఁజేసినచో కర్తృవ్యాపక ప్రమేయత్వాదికము క్షిత్యాదికమం దుండుటవలన తద్రహితత్వరూప హేతువు క్షిత్యాదికమందు లేనందున యసిద్ధిరూపదోషము వాటిల్లును. కర్తృవ్యాపక శరీరరహితత్వమునే (అనఁగా శరీరజన్యత్వాభావము) హేతువ చేసినచో అసమర్థవిశేషణ ఘటితమగుట వలన వ్యాప్యత్వాసిద్ధి యనుదోషము సంభవించును.

దేనియొక్క యభావము దేనియొక్క యభావసాధకముగా యుపన్యసించుటకు వీలగునో యదియే దానికి వ్యాపకముఁ గదా! వహ్నియొక్క యభావము ధూమముయొక్క యభావసాధకముగా నుపన్యసించుటకు వీలగునటుల శరీరజన్యత్వముయొక్క యభావము శరీరరూపవ్యర్థవిశేషణముతోఁ గూడినందున కర్తృజన్యత్వముయొక్క యభావసాధకముగా యుపన్యసించుటకు వీలుకాదు.

మూ. విశేషవిరోధస్తు విశేషసిద్ధౌ సహోపలంభేన.
తథసిద్ధౌ మిథోధర్మి పరిహారేణానుపలంభేన నిరస్తో
నాశంకామప్యర్థిరోహతీతి.

టీ. ధర్మిణి పరిహారః, అవృత్తిత్వం మిథః పరస్పరస్య ధర్మపరిహారానుపలంభేన. ఏకధర్మిణ ఏవాసిద్ధే రేకధర్మి వృత్తిత్వాభావ రూపవిరోధానులంభేన ఈశ్వరైకధర్మివృత్తిత్వాభావరూపవిరోధః తద్ఘట కేశ్వరరూపధర్మస్యాగ్రహాద్దుర్గ్రహ ఇతి భావః.

తా. "సిధ్యసిధ్యో ర్విరోధేన" అనెడు మూఁడవపాదమునకు మరియొకరీతిని వ్యాఖ్యానముఁ జేయఁబడుచున్నది. వ్యాప్తి పక్షధర్మతలవలన శరీరత్వముయొక్కయు అశరీరత్వముయొక్కయు సిద్ధియున్నప్పుడు అవి యొకపర్యాయమే రూపరసములవలె కర్తయందు కలిసియే జ్ఞాతమగుటచేతను కర్తయందు శరీరత్వముయొక్కయు అశరీరిత్వముయొక్కయు సిద్ధి లేనప్పుడు అన్యోన్యధర్మి ప్రతిక్షేపముయొక్క యనుపలంభముచేతను శరీరిత్వాశరీరిత్వముల కుండెడు విరోధము నిరసించఁబడుచూ సత్ప్రతిపక్షితత్వాది శంకలకు తావివ్వదు.

మూ. స్యాదేతత్. అస్తి తావత్కార్యస్య అవాంతర విశేషః, యతశ్శరీరికర్తృకత్వమనుమీయతే తథా చ తత్ప్రయుక్తామేవ వ్యాప్తిముపజీవేత్ కార్యత్వసామాన్యమితి స్యాత్ న స్యాత్ న హి విశేషోస్తీతి సామాన్యమప్రయోజకమ్. తథా సతి సౌరభ కటుత్వ నీలిమాదివిశేషే సతి న ధూమసామాన్యమగ్నిం గమయేత్. కిన్నామ సాధకసామాన్యే సాధ్యసామాన్య

మాశ్రిత్య ప్రవర్తమానే తద్విశేషః సాధ్య విశేషవ్యాప్తిమాశ్రయేత్.

టీ. అవాంతరవిశేషరూపోపాధిప్రయుక్తామేవ జౌపాధికిమిత్యర్థః. కార్యత్వం సకర్తృకత్వనిరూపితస్వాభావిక వ్యాప్తిమన్న భవతీత్యేవ కారార్థః. తథా చ కార్యత్వం సోపాధికత్వాద్వ్యాప్యత్వాసిద్ధమితి భావః.

మూ. న తు విశేషే సతి సామాన్యమకించిత్కరం, తస్యాపి విశేషాన్తరాపేక్షయా అకించితరత్వ ప్రసంగాత్. శరీరజన్యతాజ్ఞాపకతయా ఆవశ్య కల్పరూపవిశేషాత్మకోపాధి విశిష్టత్వాత్స కర్తృకత్వానుమానం వ్యాప్యత్వా సిద్ధమినా శంకనీయం.

తా. (శరీరజన్యతావచ్ఛేదకరూపవిశేషముచే శరీరి కర్తృకత్వమును అనుమేయించెదము. శరీరజన్యత్వ రూప విశేషమందు శరీరి కర్తృకత్వవ్యాప్తి యున్నచో కార్యత్వ సామాన్యమందు సకర్తృకత్వవ్యాప్యత్వముండుటకు వీలు లేదు. సకర్తృకత్వ సాధకానుమానము శరీరజన్యత్వావ చ్ఛేదకరూపోపాధితోఁ గూడుకొనుటవలన వ్యాప్యత్వాసిద్ధ మగును. కాన కార్యత్వ రూపహేతువువలన ఈశ్వరసిద్ధి గాదని శంకించుట వలనుపడదు.) విశేష మున్నంతమాత్ర మున సామాన్య మప్రయోజకము గానేరదు. అట్లైనచో సారభకటుత్వ నీలిమాదులతో గూడిన విశేషధూమ ముం

డఁగా, ధూమసామాన్యము వహ్నిసామాన్యానుమాపకము కాకపోవలసి వచ్చును. దేనియొక్క విశేషములకు కార్యకారణభావమో బాధకము లేనిచో తత్సామాన్యములకుఁ గూడ కార్యకారణభావము సిద్ధించును గాన వహ్నిసామాన్యములో ధూమసామాన్యమునకు విశేషమున్నను ఎటుల అనుమాపకత్వమో అటులనే సకర్తృకత్వానుమాపకత్వము శరీరజన్యత్వావచ్ఛేదకత్వరూపవిశేషమున్నను, కార్యత్వసామాన్యమున కుండవచ్చును. "కార్యత్వము సకర్తృకత్వవ్యాప్యమే గానిచో కర్తృజన్యతావచ్ఛేదకమే గాకపోవలసి వచ్చును" అనెడు వ్యభిచారశంకను నివర్తింపఁజేయు తర్క ముండుటవలన ప్రసక్తమైన వ్యాప్యత్వాసిద్ధి ప్రకృతానుమానమున లేదు. నాసిద్ధి రనిబంధనా యను చతుర్థపాదమునకు ఇదియే అభిప్రాయము. "అనిబంధనా. వ్యభిచార శంకానివర్తకతర్కము లేకపోవుటవలన ప్రసక్తమైన అసిద్ధిః. వ్యాప్యత్వాసిద్ధి. న. లేదు. అని యర్థము. సాధ్యసామాన్యసాధకమైన హేతుసామాన్య మున్నప్పుడు హేతుసామాన్యమందు సాధ్యసామాన్యవ్యాప్తియే సిద్ధించును. విశేషములకు వ్యాప్యవ్యాపకభావ మున్నంత మాత్రమున సామాన్య మప్రయోజకము గానేరదు. అట్లైనచో ఈవిశేషము దీనియొక్కవిశేషమును బట్టి సామాన్యమగుటవలన అకించిత్కరము గావలసివచ్చును. విశేషమున్నంతమాత్రమున సామాన్య మకించిత్కరమని చెప్పుటకు వలనుపడదు.

మూ. సౌరభాదివిశేషం విహాయాపి ధూమేవహ్ని ర్దృష్టః, న తు విశేషం విహాయ కార్యే కర్తేతి చేత్. న, కార్యవిశేషః కారణవిశేషే వ్యవతిష్ఠతే, న తు కార్యకారణసామాన్యయోః ప్రతిబంధమన్యథా కుర్యాదితి. కిం న దృష్టం కార్యం కారణమాత్రే అంకురో బీజేతద్విశేషో ధాన్యే తద్విశేషశ్శాలౌ తద్విశేషః కలమే ఇత్యాది బహులం లోకే, క్వ వా దృష్టమణు ద్రవ్యారబ్ధం ద్రవ్యం నిత్యరూపాద్యారబ్ధం రూపాది, తథాపి సామాన్యవ్యాప్తేరవిరోధాత్ సిద్ధ్యత్యేవ, అవశ్యం చైతదేవమంగీకర్తవ్యమ్, అన్యథా కార్యత్వస్యాకస్మికత్వప్రసంగాత్.

తా. సౌరభాదివిశేషమును విడనాడి ధూమసామాన్యమున్నచో వహ్నిసామాన్యము దృష్టమై యుండవచ్చును గాని విశేషమును విడనాడి కార్యత్వసామాన్య మున్నచో కర్తదృష్టమగుటలేదు. కావున విశేషమునకే కర్తృసాధకత్వము గాని సామాన్యమునకు కర్తృసాధకత్వము లేదని యాశంకింపవలదు.

కార్యవిశేషమువలన కారణవిశేషము సిద్ధించినను కార్యత్వసామాన్యమందు కర్తృసామాన్యవ్యాప్తిని మరియొకరీతిగా చేయుటకు వీలులేదు. బీజమున్నపుడు అంకురము, ధాన్యవిశేష మున్నపుడు అంకురవిశేషము, ధాన్యవిశేషమైన

శాలియున్నపుడు తద్విశేషము, శాలివిశేషమైన కలమబీజ మున్నపుడు తద్విశేషము పుట్టుచున్నది గాన యిట్టివిశేష కార్యకారణభావమున్నను కారణసామాన్య మున్నచో కార్య సామాన్యము దృష్టమగుటవలన కార్యత్వసామాన్యమునకు కర్తృజన్యత్వవ్యాప్తి యుండవచ్చును.

ఇట్టి యనుమానముచే నిత్యాపరోక్షజ్ఞానాశ్రయుం డైన నీశ్వరుని సాధించినచో జ్ఞాన మనిత్యమనెడు ప్రత్యక్ష బాధ కలుగును గదా! ఇట్లు ప్రత్యక్షమే బాధకమైనచో ద్రవ్యారంభకమైన అవయవములు మహత్పరిమాణము గలవి. అను ప్రత్యక్షమువలన ద్వ్యణుకారంభకమైన పరమాణువులు సిద్ధింపక పోవలసివచ్చును. ఇట్లనే రూపారంభకమైన రూపము అనిత్యమనెడు ప్రత్యక్షముచే నిత్యమైన ద్వ్యణుకరూపా రంభకమైన జలీయ పరమాణువునందుండెడు నిత్యరూపము సిద్ధింపక పోవలసివచ్చును. కావున విరోధి ప్రత్యక్షముచే కార్యకారణభావమునకు భంగము చెప్పుట వలనుపడదు. కనుక విశేషములకు వ్యాప్తియున్నను సామాన్యముల యందు వ్యాప్తి ప్రతిబంధింపఁబడనందున కార్యత్వసామాన్య ముచే కర్తృసామాన్యసిద్ధి యగుటలో సందియము లేదు. కర్తృసామాన్యమువలన కార్యసామాన్యము కానిచో కార్య సామాన్యము అనియతకారణకము కావలసివచ్చును.

మూ. స్యాదేతత్, అన్వయవ్యతిరేకి తావదిం కార్య
త్వమితి పరమార్థః. తత్రాకాశాదేర్విపక్షాత్ కిం
కర్తృవ్యావృత్తేః, కార్యత్వవ్యావృత్తిః ఆహో

స్విత్ కారణమాత్రవ్యావృత్తేరితి సందిహ్యతే. తదసత్, కర్తురపి కారణత్వాత్. కారణేషు చ అన్యతమవ్యతిరేకస్యాపి కార్యానుత్పత్తిం ప్రతి ప్రయోజకత్వాత్,అన్యథా కారణత్వవ్యాఘాతాత్. కరణాదివిశేషవ్యతిరేకసందేహప్రసంగాచ్చ,కథం హి నిశ్చీయతే కిమాకాశాత్ కారణవ్యావృత్త్యా కార్యత్వవ్యావృత్తిః, ఉతకరణవ్యావృత్త్యా, ఏవం కిముపాదానవ్యావృత్త్యా, కిమసమవాయివ్యావృత్త్యా, కిం నిమిత్తవ్యావృత్త్యేతి. కార్యత్వాత్కారణముపాదానమసమవాయినిమిత్తం వా బుద్ధ్యాదిషు న సిద్ధ్యేత్. కర్తుః కారణత్వే సిద్ధే సర్వమేతదుచితమ్ తదేవత్వసిద్ధమితి చేత్. కిం పటాదౌ కువిందాదిరకారణమేవ కర్తా, ప్రస్తుతే వోదాసీనఏవ సాధయితుముపక్రాంతః, తస్మాద్యత్కించిదేతదపీతి.

తా. కార్యమగుటవలన క్షిత్యాదికము సకర్తృకమనెడు యనుమానము అన్వయవ్యతిరేకి యనుటయే యుచితముఁ గదా! గగనాదిరూపవిపక్షమందు కర్తయొక్క యభావమువలన కార్యత్వనివృత్తియా? లేక కారణమాత్ర నివృత్తివలననా?యనెడు సందేహము కలుగును. ఇట్టి వ్యతిరేకసందేహము కార్యమువలన ఉపాదానాది రూపకారణవిశేషానుమానమందుఁగూడ చేయుటకు వీలుగాన కారణవిశేషానుమాపక

మైన కార్యత్వరూపహేతువు హేత్వాభాసరూప మగును. అనుట యుక్తము గాదు. కర్తయు కారణమే యగును. కారణములలో నేది లేకపోయినను కార్యము పుట్టుట లేదు. (కర్త లేనిచో కార్యము పుట్టలేదు గాన) ఏది లేనందున కార్యము పుట్టకుండునో యదియే కారణము గదా! కర్త లేనిచోగూడ కార్యము పుట్టుట లేదు గాన నిదియును గారణమని చెప్పవలెను. ఆకాశాదికమందు కర్తలేనందున కార్యత్వనివృత్తియా? లేక కారణము లేకపోవుటవలననా యని ఎటుల నిశ్చయించెదవు. ఇట్లు సమవాయి కారణనివృత్తి వలననా? లేక అసమవాయి కారణనివృత్తివలననా? లేక నిమిత్త కారణ నావృత్తివలననా? కార్యత్వనివృత్తియను కారణవిశేషములయొక్క వ్యతిరేకసందేహముఁగూడ కలుగవలసి వచ్చును. ఇట్టిసందేహమున్నచో బుద్ధ్యాదిరూపకార్యములో కారణవిశేషములైన సమవాయి కారణము గాని అసమవాయికారణముగాని నిమిత్తకారణము గాని సిద్ధించక పోవలసివచ్చును. కర్త కారణమైనచో వెనుకఁజెప్పినసంగతులన్నియు నుపపన్నము లగును గాని కర్త కారణముగానిచో వెనుకఁజెప్పిన సంగతు లెట్లుపపన్నము లనెదవా? పటములో కర్తయగు సాలివాఁడు, కారణమే గాడనియా? లేక ప్రస్తుతమున జగత్కర్త యీశ్వరునివలె ఉదాసీనుఁడా? ఇది రెండునుగూడ యసంభావితమె గాన పటములో కర్త యెటుల కారణమో, అటులనే జగత్కర్తయగు నీశ్వరుఁడుగూడ కారణమని జెప్పవలెను.

మూ. ననుకర్తా కారణానామధిష్ఠాతా సాక్షాద్వా శరీరవత్, సాధ్యపరంపరయా వా దండాదివత్. తత్ర న పూర్వః, పరమాణ్వాదీనాం శరీరత్వప్రసంగాత్. న ద్వితీయః, ద్వారాభావాత్. న హి కస్యచిత్. సాక్షా దధిష్ఠేయస్యాభావే పరంపరయాధిష్ఠానం సంభవతి.

తా. మరియొకరీతిగా సత్ప్రతిపక్షితత్వ మాశంకించుట కుపన్యసించుచున్నాఁడు. దేనియందు, ప్రయత్నవదాత్మ సంయోగాసమవాయి కారణకమైన క్రియ నెవఁడు బుట్టించునో వాఁడు దానియందు సాక్షాదధిష్ఠాత యగును. అటులన మన శరీరములో మనము యెటుల సాక్షాదధిష్ఠాతలమో, అట్లే కర్తగూడ సాక్షాదధిష్ఠాత యనియా? లేక పరంపరయాయధిష్ఠాత యనియా! పరంపరయా యధిష్ఠాత యనఁగా, ఎవఁడు శరీరక్రియను వ్యాపారముగా జేసుకుని దేనియందుండెడు క్రియకు కారణమో వాఁడు దానియందు పరంపరాధిష్ఠాత యని యర్థము. అందందుఁ బుట్టెడు క్రియలో శరీరక్రియను వ్యాపారముగా జేసుకొని కులాలుఁడు కారణము గాన దండములో కుమ్మరివాఁడు పరంపరయాఽధిష్ఠాత యగును. అటులనే క్షిత్యాదికర్తఁగూడ పరంపరయా కారణాధిష్ఠాత యనెదవా? మొదటిపక్షమున సాక్షాదధిష్ఠేయమైనది యేదియో అదియే శరీరమనిగదా? అట్టి సాక్షాదధిష్ఠేయత్వము, (అనఁగా ప్రయత్నవదాత్మ సంయోగాసమవాయికారణక క్రియాశ్రయత్వము) పరమాణువులయం దున్నందున పరమాణువులు శరీరము గావలసివచ్చును. కాన పరమాణువులకు శరీరత్వ

మిష్టము గానిచో కర్మకు సాక్షాదధిష్ఠాతృత్వము సంభవించదు. ద్వారము లేనందునను, సాక్షాదధిష్ఠాతృత్వమే లేనిచో పరంపరయాఽధిష్ఠాతృత్వముఁగూడ సంభవించదు గాన. ద్వితీయపక్షముఁగూడ సరిగాదు.

మూ. తదయం ప్రమాణార్థః. పరమాణ్వాదయో న సాక్షాచ్చేతనాధిష్ఠేయాః, శరీరేతరత్వాత్. యత్పునస్సాక్షాదధిష్ఠేయం న తదేవం, యథా స్మచ్ఛరీరమితి, నాపి పరంపరయాఽధిష్ఠేయాః స్వవ్యాపారే శరీరానపేక్షత్వాత్. స్వచేష్టాయామస్మచ్ఛరీరవత్. వ్యతిరేకేణ వా దండాద్యుదాహరణం,ఏవం క్షిత్యాది న చేతనాధిష్ఠితహేతుకం, శరీరేతరహేతుకత్వాదిత్యతిపీడయా సత్ప్రతిపక్షత్వం.

తా. యీ చెప్పుటవలన పరమాణువులు శరీరముగాదని యాశయము గదా ? పరమాణువులు, శరీరముకంటె వేరగుటవలన, సాక్షాచ్చేతనాధిష్ఠేయములు గావు. అను యనుమానములభించెను. యేది సాక్షాచ్చేతనాధిష్ఠేయమో, అది శరీరేతరము గాదు. దీనిలో మనశరీరమే వ్యతిరేకదృష్టాంతభూతము.

పరమాణువులు స్వక్రియలో శరీరాపేక్ష లేనందున (పరమాణువులు) పరంపరయాగూడ చేతనాధిష్ఠేయములు గావు. దీనిలో యస్మదాదిశరీరము. అన్వయదృష్టాంతము దీనివలన యేది పరంపరాధిష్ఠేయమో, అది శరీరాపేక్షగలది యను

యానుమానము రెండవది. వ్యతిరేకదృష్టాంతము దండము పరంపరయా అధిష్ఠేయముగాన శరీరాపేక్ష గలది.

ఈరీతిగా కారణమైన పరమాణుపక్షకానుమానములు రెండు. క్షిత్యాదికార్యపక్షకానుమానము మూఁడవది. శరీరేతర హేతుకమైనందున, క్షిత్యాదికము, చేతనాధిష్ఠిత హేతుకముగాదన్నది. అతికష్టముచే ఇట్టిప్రత్యనుమానము లున్నందున కార్యత్వమువలన సకర్తృకత్వ మెటుల సిద్ధించును. ప్రత్యనుమాన మున్నచో ప్రకృతానుమానముసత్ప్రతిపక్షమగును గాన ఈశ్వరసిద్ధి గాజాలదని యాశయము.

మూ. అపి చ పటాదౌ కువిందాదేః కిం కారకాధిష్ఠానార్థమపేక్షా, తేషామచేతనానాం స్వతోఽప్రవృత్తేః. ఆహో కారకత్వేన? న పూర్వః, తేషాం పరమేశ్వరేణైవాధిష్ఠానాత్. న హ్యస్య జ్ఞానమిచ్ఛాప్రయత్నో వా వేమాదీన్న వ్యాప్నోతీతి సంభవతి. న చాధిష్ఠితానామధిష్ఠాత్రంతరాపేక్షా తదర్థమేవ, తథా సత్యనవస్థానాదేవావిశేషాత్.

తా. క్షిత్యాదికం సకర్తృకం కార్యత్వాత్, యథా పటః అనెడనుమానములో దృష్టాంతభూతమగు పటమునందు, సాలివానికి తురీవేమాదిరూపమగు కారకముల చేతనమగుటం జేసి స్వయముగా ప్రవర్తించదు గాన, వానికధిష్ఠాతగా చేతనుఁడగు సాలివానికి యుపయోగమా? లేక కారకరూపము గానా? మొదటిపక్షమున యచేతనమగు తురీ

వేమాదికము పరమేశ్వరునియొక్క జ్ఞానేచ్ఛాప్రయత్నములు కారకములైన వేమాదులను వ్యాపించును గాన పరమేశ్వరాధిష్ఠేయములై పటములో నుపయోగించును గాన, కువిందాదులకు (సాలివాఁడు) ఉపయోగమే లేకపోవలసి వచ్చును. అధిష్ఠాతయగు నీశ్వరునికి యధిష్ఠాతగా కువిందాదుల కుపయోగమనినచో కువిందుఁడుకూడ చేతనుఁడు గాన వీనికి యధిష్ఠాతగా మరియొకరిని, వారికి మరియొకరిని యను యనవస్థ వచ్చును. కాన మొదటిపక్షము సరిగాదు.

మూ. న ద్వితీయః. అధిష్ఠాతృత్వస్యానంగత్వ ప్రసంగే దృష్టాంతస్య సాధ్యవికలత్వాపత్తేః, న చ హేతుత్వేనైవ తస్యాపేక్షాఽస్త్వితి వాచ్యం, ఏవం తర్హి యత్కార్యం తత్సహేతుకమితి వ్యాప్తిః. న తు సకర్తృకమితి తథా చ తత్రైవ ప్రయోగే సిద్ధసాధనాత్.

తా. కువిందునకు పటములో కారకత్వేన ఉపయోగముఁ జెప్పినచో, చేతనాధిష్ఠిత హేతుజన్యత్వము సాధ్యము గాన, అధిష్ఠాత కుపయోగము లేనందున పటరూపమగు దృష్టాంతము సాధ్యశూన్యము గావలసివచ్చును. అధిష్ఠాతకు హేతుత్వేనోపయోగముఁ జెప్పుటకు వీలులేదు. అట్లైనచో "యత్ కార్యం తత్సహేతుకం" అనియే వ్యాప్తి యుండవలెను. యత్కార్యం తత్సకర్తృక మనువ్యాప్తి లేకపోవలసి వచ్చును. అటులనే వ్యాప్తి నంగీకరించినచో కార్యము హేతుజన్యము గాన సిద్ధసాధన మనెడుదోషము సంభవించును.

మూ. కించానిత్యప్రయత్నపూర్వకత్వప్రయుక్తాం వ్యాప్తిముపజీవతః కార్యత్వం న బుద్ధిమత్పూర్వకత్వేన స్వభావప్రతిబద్ధం. న హ్యనిత్యప్రయత్నోఽపి బుద్ధ్యా శరీరవత్కారణత్వే వాపేక్ష్యతే. యే న తన్నివృత్తావప్యకార్యబుద్ధిర్న నివర్తత ఇతి, తదేతత్ప్రాగేవనిరస్తప్రాయం నోత్తరాంతరమపేక్షతే.

తా. 'కార్యం చేతనపూర్వకం కార్యత్వాత్' అను యనుమానముచే చేతనుఁడైన ఈశ్వరుఁడు సిద్ధించును గదా? చేతనపూర్వకత్వ మనఁగా బుద్ధిమత్పూర్వకత్వము. ఇచ్చట యనిత్యప్రయత్నపూర్వకత్వ ముపాధి యగును. ఘటాద్యంతర్భావమున సాధ్యవ్యాపకత్వమున్ను అనిత్యప్రయత్నాంతర్భావమున సాధనావ్యాపకత్వమును అనిత్యప్రయత్నపూర్వకత్వమం దుండును గాన ప్రకృతానుమాన ముపాధిగ్రస్తమగుటవలన కార్యత్వమందు బుద్ధిమత్పూర్వకత్వవ్యాప్తి నిశ్చయముఁ గలుగుట దుర్లభము. శరీరమువలె అనిత్యప్రయత్నమనిత్యమైనబుద్ధిలో హేతువ గాదు. అట్లైనచో శరీరము నివర్తించినపుడు అనిత్యబుద్ధి నివర్తించినటుల అనిత్యప్రయత్నము నివర్తించినపుడు అనిత్యమైనబుద్ధి నివర్తించవలసి వచ్చును. కాన అనిత్యప్రయత్నపూర్వకత్వ ముపాధిగాదన్న సంగతిపూర్వమందేఁ జెప్పఁబడియున్నందున తిరుగా జబాబు జెప్ప నవసరము లేదు.

మూ. తథాహి సాక్షాదధిష్ఠాతరి సాధ్యే పరమాణ్వాదీనాం శరీరత్వప్రసంగ ఇతి కిమిదం శరీరత్వం

యత్నప్రసజ్యతే? యది సాక్షాత్ప్రయత్నవ దధి ష్ఠేయత్వం, తదిష్యతఏవ. న చ తతో అన్య త్ప్రసంజకమపి,అథేంద్రియాశ్రయత్వం? తన్న, తదవచ్ఛిన్నప్రయత్నోత్పత్తౌ తదవచ్ఛిన్నజ్ఞాన జననద్వారేణేంద్రియాణాముపయోగాత్, అనవచ్ఛిన్నే ప్రయత్నేనాయం విధిః నిత్య త్వాత్.

తా. వెనుక యుపన్యసించిన సత్ప్రతిపక్షితత్వాదిదోష ములు యీగ్రంథముచే నిరసించఁబడుచున్నవి. కరణము లకు సాక్షాదధిష్ఠాత యగుఁగర్తయే సాధ్యముజేసినచో పర మాణ్వాదులకు శరీరత్వప్రసంగము జూపింపఁబడ్డది గదా? ఆప్రసంగవిషయమైన శరీరత్వ మననేమి? సాక్షాత్ప్రయత్న వధిష్ఠేయత్వరూపమైనచో, ఆపాధ్యము ఆపాదకము యొక టియే యగును. ఆపాధ్య మనఁగా, ఆపత్తివిషయము. ఆపాదక మనఁగా, ఆపత్తిజనకజ్ఞానవిషయము. వెనుక యాశంకించిన పరమాణు పక్షకానుమానములో, శరీరాన్యత్వరూప హేతువ యుండనిమ్ము. సాక్షాత్ప్రయత్నాధిష్ఠితత్వాభావము లేక పోని, యనెడు వ్యభిచారశంకానివర్తకముగా పరమాణ్వా దికము, సాక్షాత్ప్రయత్నాధిష్ఠితము లైనచో, శరీరము గావ లసివచ్చు ననుతర్కము జూపించవలెను. ఇట్టి శరీరత్వము సాక్షాత్ప్రయత్నాధిష్ఠితత్వ రూపమైనచో, పరమాణ్వాదిక మందుఁగూడ ఇట్టిశరీరత్వ మిష్టముగాన, ఇట్టి శరీరత్వప్రసంగ మిచ్చుటకు వీలులేదు. తర్కమనఁగా అనిష్టాపాదన రూపమైనది గాన పూర్వానుమానము నిర్దుష్టమైనది గాదు. ఆపాద్యవిషయ

నమై శరీరత్వ మింద్రియాశ్రయత్వరూపమని యాశంకింప వలదు. యేశరీరావచ్ఛిన్నమగు యాత్మయందు ఇంద్రియము వలనఁ గలుగు యర్థజ్ఞానముచే ప్రయత్నమున్నూ, భోగ మున్నూ గలుగునో యాశరీరమే ఇంద్రియాశ్రయ మగును. మామతసిద్ధమగు ఈశ్వరునియొక్క ప్రయత్నము నిత్యము గాన ఇంద్రియాశ్రయమగు శరీరాపేక్ష లేదు. తర్కములో ఆపాద్యాపాదకములకు యుండు వ్యాప్తినిశ్చయము గార ణము. ప్రకృతమున ఇంద్రియాశ్రయత్వ రూపాపాద్యము లేని పరమాణ్వాదికమం దాపాదకమగు సాక్షాత్ప్రయత్నాధిష్ఠి తత్వ మున్నందున తర్కకారణ మగువ్యాప్తి నిశ్చయము గలుగదు గాన తర్కావతరణమే సంభవించదు.

మూ. అతఏవ నార్థాశ్రయత్వం. న హి నిత్యజ్ఞానం భోగరూపమభోగరూపం వా యత్నమపేక్ష తే. తస్య కారణవిశేషత్వాత్. న చ నిత్యసర్వజ్ఞ స్య భోగసంభావనాపి, విశేషాదర్శనాభావే మి థ్యాజ్ఞానానవకాశే దోషానుత్పత్తౌ ధర్మాధర్మ యోరసత్వాత్.

తా. తర్కకారణమగువ్యాప్తి నిశ్చయము లేనం దున ఆపాద్యమగుశరీరత్వ మర్థాశ్రయత్వ రూపమనుట సరి గాదు. అర్థాశ్రయత్వ మనఁగా భోగవత్వము. వ్యాప్తి నిశ్చయ మెందువలనఁ గలుగుటకు వీలులేదని యాశంకింప వలదు. సోపాధికమైనచో వ్యాప్తినిశ్చయము సంభవించదు. ప్రకృతమున ఆపాద్యమైన భోగాశ్రయత్వరూపమగు శరీర త్వమునకు అనిత్యజ్ఞానవత్వము వ్యాపకము. సాధనత్వేన అభి

మతమగు చైతన్యమునకు అవ్యాపక మగుటవలననూ, అనిత్య జ్ఞాన ముపాధియగును. ఇట్టియుపాధి యున్నందున, ఆపాద కమగు చైతన్యమందు ఆపాద్యమగు భోగవ్యాప్తి నిశ్చ యముఁ గలుగుటకు వీలులేదు. ఈశ్వరునియందుయుండు నిత్యజ్ఞానము కారణవిశేషము గాన ప్రయత్నము నపే క్షించదు. నిత్యసర్వజ్ఞుఁడైన ఈశ్వరునకు భోగసంభావనకూడ సంభవింపదు. యేల ననఁగా ? సర్వజ్ఞుఁ డగుటవలన విశేషా దర్శనరూపమగు మిథ్యాజ్ఞానము లేనందున దోషము యుం డదు. దోషములేనిచో ధర్మాధర్మరూప మగుప్రవృత్తి సంభ వింపదు. ధర్మాధర్మములు లేనిచో సుఖదుఃఖానుభవ రూప మగుభోగము సంభవింపదు. కాన శరీరత్వప్రసంగము సంభ వింపదు.

మూ. తస్మాత్ సాక్షాత్ప్రయత్నా నధిష్ఠేయత్వాత్, స్వవ్యాపారే, తదనపేక్షత్వాచ్చేతి ద్వయం సా ధ్యావిశిష్టం, అనింద్రియాశ్రయత్వాదభోగా యతనత్వాత్. స్వవ్యాపారే తదనపేక్షత్వా చ్చేతి త్రయమప్యన్యథాసిద్ధం. అభోగాయతన త్వాదనింద్రియాశ్రయోపి, భోక్తృకర్మాను పగ్రహాదభోగాయతనమపి, స్పర్శవద్వేగవద్ద్ర వ్యానుద్యత్వాత్తదనపేక్షమపి స్యాత్. అచేతన త్వాచ్చేతనాధిష్ఠితమపి స్యాదితి కో విరోధః.

తా. వెనుక సత్ప్రక్షముగా యాశంకించిన, పరమా ణ్వాదయో, న సాక్షాచ్చేతనాధిష్ఠేయాః, శరీరేతరత్వాత్. అనునది మొదటి యనుమానము. (2) నాపి పరంపరయా అధి

ష్ఠేయాః, స్వవ్యాపారేత దనపేక్షితత్వాత్, అనునది రెండవ యనుమానము, శరీరత్వప్రసంగము దూషిత మగుటచో యీ రెండుయుఁగూడ సరిగావు. మొదటి యనుమానములో శరీరత్వ మనఁగా, సాక్షాచ్చేతనాధిష్ఠేయత్వ రూపమైనచో, శరీరేతరత్వము సాక్షాచ్చేతనా నధిష్ఠేయత్వముగదా? సాధ్యముఁగూడ ఇదియే గాన, సాధ్యహేతువులు ఒకటియే యగుటవలన సిద్ధసాధనాది దోషదూషితము. రెండవయనుమానములో హేతువ. స్వవ్యాపారే శరీరానపేక్షితత్వము. స్వవ్యాపారములో సాక్షాత్ప్రియత్నాధిష్ఠేయా న పేక్షితత్వ మని గదా. పరంపరాధిష్ఠేయత్వ మనఁగా స్వవ్యాపారే సాక్షాత్ప్రియత్నాధిష్ఠేయాపేక్షితత్వము. నాపి పరంపరయా అధిష్ఠేయాః అను సాధ్యవాచకపదమునకు స్వవ్యాపారే సాక్షాత్ప్రియత్నాధిష్ఠేయా నపేక్షత్వమే యర్థము. ఇదియుఁగూడ హేతుసాధ్యములు ఒకటి యగుటవలన పూర్వానుమానము వలె సిద్ధసాధనాది దోషదూషితము యగును.

ఇటులనే మొదటియనుమానములో శరీరత్వ మనఁగా ఇంద్రియాశ్రయత్వముగాని, భోగాశ్రయత్వముగాని యైనచో 'అనింద్రియాశ్రయత్వాత్, అభోగాయతనత్వాత్.' అనెడు రెండు హేతువులు మొదటి యనుమానములో సంభవించును. రెండవయనుమానములో స్వవ్యాపారేత దనపేక్షత్వాత్. అనుదానివలన, స్వవ్యాపారములో ఇంద్రియాశ్రయా నపేక్షత్వాత్. స్వవ్యాపారే భోగాయతనానపేక్షత్వాత్, అనియు రెండు హేతువులు లభించును. యీ నాలుగున్నూ అన్యథా సిద్ధము లగును. యేలనన, ఈశ్వరుని

యందు అదృష్టము లేనందున భోగము సంభవింపదు. కాన పరమాణ్వాదికము భోగాయతము గానేరదు. కనుకనే ఇంద్రియాశ్రయములుగూడ గానేరవు. పరమాణువులయందు అభోగాయతనత్వము, అనింద్రియాశ్రయత్వమున్ను యీరీతిగా సిద్ధమగుచున్నది. వేగము స్పర్శయుగల ద్రవ్యాంతరముచే ప్రేర్యమాణము గానందున శరీరానపేక్షితక్రియ గలదియును గావచ్చును. అచేతన మగుటవలన చేతనాధిష్ఠితముఁగూడ గావచ్చును. అభోగాయతనమైననూ, చేతనాధిష్ఠితత్వముఁగూడ యీరీతిగా యుండుటలో యేమియుఁ విరోధము లేదు. యీ రీతిగా సిద్ధించుచుండఁగా పరమాణుపక్షకమైన రెండు యనుమానములు సరిగాదని తలచవలెను.

మూ. తథా చ సాక్షాత్ప్రియత్నాధిష్ఠితేతరజన్యత్వా దితి సాధ్యసమః. ఇంద్రియాశ్రయేతరజన్యత్వాత్. భోగాయతనేతరజన్యత్వాదితి ద్వయమప్యన్యథాసిద్ధం, కార్యజ్ఞానాద్యనపేక్షత్వాత్. శరీరేతరజన్యమపి స్యాత్. అచేతనహేతుకత్వాచ్చేతనాధిష్ఠితహేతుకమపీతి కో విరోధః.

తా. "క్షిత్యాదికం, న సాక్షాత్ప్రియత్నాధిష్ఠితహేతుకం, శరీరేతరహేతుకత్వాత్." అను ప్రత్యనుమానములో శరీరత్వము, సాక్షాత్ప్రియత్నాధిష్ఠితత్వమైనచో, శరీరేతరహేతుకత్వాత్. అను హేతువాక్యమువలన సాక్షాత్ప్రియత్నాధిష్ఠితేతరజన్యత్వము లభించును. సాధ్యముఁగూడ యీ హేతువే గాన సాధ్యహేతువులకు భేదము లేనందున యనుమాన మసిద్ధమగును. శరీరత్వము, ఇంద్రియాశ్రయత్వరూపము

గాని, భోగాయతనత్వాది రూపముగాని యన్నచో ఇంద్రి యాశ్రయేతర జన్యత్వాత్. భోగాయతనేతరజన్యత్వాత్, అని హేతువు యగును. యీ రెండును పూర్వమువలె అన్యథా సిద్ధమగును. క్షిత్యాదికము కార్యజ్ఞానము నపేక్షించనందున, శరీరేతరజన్యము యగును.అచేతనమైన పరమాణ్వాది హేతుక మగుటవలన చేతనాధిష్ఠిత హేతుకము గావచ్చును. అచేతన హేతుకమైనందున చేతనాధిష్ఠిత హేతుకత్వము యుండు టలో యేమియు విరోధము లేదు. కాన క్షిత్యాదిపక్షకాను మానముఁగూడ సరిగాదు.

మూ. అప్రసిద్ధవిశేషణశ్చ పక్షః. న హి చేతనానధిష్ఠిత హేతుకత్వం క్వచిత్ప్రమాణసిద్ధం, న చ చేత నాధిష్ఠిత హేతుకత్వనిషేధస్సాధ్యః హేతోర సాధారణ్యప్రసంగాత్. గగనాదేరపి సపక్షా ద్వ్యావృత్తేః.

తా. పూర్వానుమానములో మరియొకదోషము సంభ వించును. చేతనాధిష్ఠిత హేతుకత్వమే సాధ్యమైనచో ఇట్టి సాధ్యము ఎక్కడను ప్రసిద్ధము గానందున, అప్రసిద్ధసాధ్యక మైనపక్షము గావలసివచ్చును. ఘటాదికమందు ప్రసిద్ధమైన చేతనాధిష్ఠితత్వముయొక్క నిషేధమే సాధ్యము. ఇది ప్రసిద్ధ ప్రతియోగికము గాన ఇట్టినిషేధమే సాధ్యమనినచో ఇట్టి సాధ్యముఁ గలగగ నాదిరూపసపక్షమందు, శరీరేతర హేతు కత్వ రూపమగు హేతువ లేనందున అసాధారణ మగును.

మూ. యత్పునరుక్తం, కువిందాదేః పటాదౌ కథమపే క్షేతి. తత్ర కారకతయేతి కస్సందేహః. కింతు

కారకత్వమేవ తస్య జ్ఞానచికీర్షాప్రయత్నవతః,
న స్వరూపతః. తదేవ చాధిష్ఠాతృత్వం.

తా. కువిందునకు అనఁగా సాలివానికి పక్షములో యటుల యపేక్షయని యాశంకకు సమాధాన మేమనఁగా, కారకత్వేనయపేక్ష యనుటలో యేమియు సందియము లేదు. జ్ఞానచికీర్షాప్రయత్నము గల కువిందునకే కారకత్వేనాపేక్ష గాని, జ్ఞానాదిశూన్యునకుఁ గాదు. జ్ఞానచికీర్షాప్రయత్నవత్వమే కువిందునియందు యుండుకున్న అధిష్ఠాతృత్వము.

మూ. యత్వధిష్ఠితే కిమధిష్ఠానేనేతి తత్కిం కువింద
ఉదాహార్యతే, ఈశ్వరో వా, అనవస్థావా ఆపా
ద్యతే. న ప్రథమః అన్వయవ్యతిరేకసిద్ధత్వాత్.
న ద్వితీయః, పరమాణ్వాదృష్టాధిష్ఠాతృత్వసిద్ధౌ
జ్ఞానాదీనాం సర్వవిషయత్వేవేమాద్యధిష్ఠాన
స్యాపి న్యాయప్రాప్తత్వాత్. న తు తదధిష్ఠా
నార్థమేవేశ్వరసిద్ధిః.

తా. ఏకాధిష్ఠితమైనదానిలో మరియొక యధిష్ఠానముచే యేమిపని యని యాశంకించిన నీయాశయ మేమో? ఈశ్వరునిచేతనే తంత్వాదులయొక్క యధిష్ఠానము యగుచుండఁగా తంత్వాద్యధిష్ఠానముకొరకు కువిందాదులచే యేమి ప్రయోజనమనియా? కువిందునిచేతనే తంత్వాద్యధిష్ఠానమగుచుండఁగా ఈశ్వరునిచే యేమిపని యనియా, లేక అనవస్థాపాదనమా? అనఁగా ఘటము ద్వికర్తృకముగా దృష్టమగుచున్నది. యీ ఘటాదిదృష్టాంతముచే కార్యత్వమువలన

క్షిత్యాదికముఁగూడ ద్వికర్తృకత్వమునకు యాపత్తివచ్చును. యీరీతిగనే ఘటమువలె క్షితియు, క్షితివలె ఘటమూ ఈశ్వ రానంత్యప్రసంగరూప యనవస్థయా ?

యీ మూఁడిటిలో మొదటిపక్షమున కువిందవ్యాపా రమునకు యన్వయవ్యతిరేకములు దృష్టము గాన, కువిందు నిచే పనిలేదని యాశంకింపరాదు. పరమాణువులయొక్కయు అతీంద్రియములైన ధర్మాదులయొక్కయు అధిష్ఠాతృత్వము సిద్ధించినపుడు ఈశ్వరజ్ఞానము నిత్యము సర్వవిషయకము గాన పటాదులయొక్క యుపాదానమునుగూడ గోచరించును. కువిం దునియొక్క జ్ఞానమువంటిదే గాన, ఈశ్వరునకుఁగూడ వేమాద్యధిష్టానత్వము వేమాద్యధిష్టాతగానే ఈశ్వరుని యంగీకరింపవలసినది గాదు. న్యాయసిద్ధమే గాన ఈశ్వరునితో యేమిపని యను రెండవయాశంక కవకాశము లేదు.

మూ. న తృతీయః, తస్మిన్ ప్రమాణాభావాత్. తథా ప్యేకాధిష్ఠితమపరః కిమర్థమధితిష్ఠతీతి ప్రశ్నే కిము త్తరమితి చేత్. హేతుప్రశ్నోయం ప్ర యోజనప్రశ్నో వా ? నాద్యః. ఈశ్వరాధిష్ఠాన స్య నిత్యత్వాత్. కువిందాద్యధిష్ఠానస్య స్వహే త్వధీనత్వాత్. న ద్వితీయః, కార్యనిష్పాదనే న భోగసిద్ధేః స్పష్టత్వాత్.

తా. ఏకకర్త్రధిష్ఠిత మైనదానిలో అధిష్ఠానార్థమై కర్త్రం తరము నపేక్షించుటలో ప్రమాణము లేదు. అట్లైనచో ఆ కర్త్రంతరాధిష్ఠిత మైనదానిలో అధిష్ఠానార్థమై మరియొక

కర్తను యంగీకరించవలెను. ఈరీతిగా యనవస్థ వచ్చును గాన ప్రమాణములేనందున ద్వికర్తృత్వేన కార్యత్వేన కార్యకారణభావము లేదు. మరేమన, కార్యత్వేన కర్తృత్వేన కార్యకారణభావము, గాని ఒకనిచే యధిష్ఠితమైనదానిని ఎందువలన మరియొకఁ డధిష్ఠించవలెనను ప్రశ్నకు యేమి యుత్తర మనినచో యీప్రశ్న హేతుప్రశ్నయా? లేక ఫల ప్రశ్నయా? హేతుప్రశ్న యనుటకు వీలులేదు. పటములో యధిష్ఠాత కువిందుఁడైనను, కువిందాద్యధిష్ఠానముఁ గూడ కువిందాదులయొక్క హేత్వధీన మగుటంజేసి సర్వమునకు ఈశ్వరుఁడు కారణము గాన ఈశ్వరాధిష్ఠానము నిత్యము. కాన కువిందాద్యధిష్ఠితములోగూడ ఈశ్వరుఁడు కారణము. ఫలప్రశ్న యనుటకుకూడ వీలులేదు. ఫలమనఁగా సుఖదుఃఖానుభవరూపము. ఇట్టిఫలము, కార్యనిష్పత్తియైనచో స్పష్టమగుచున్నది. కాన అనవస్థాపాదనమా యనెడు మూఁడవ ప్రశ్నగూడ సరిగాదు.

మూ. ఏకాధిష్ఠానేనైవ కార్యం స్యాదితి చేత్ స్యా
దేవ తథాపి న సంభేదే అన్యతరనైయర్థ్యం, పరి
మాణం ప్రతి సంఖ్యాపరిమాణప్రచయవత్
ప్రత్యేకం సామర్థ్యోపలబ్ధౌ సంభూయకారి
త్వోపలబ్ధేః.

తా. ఒక అధిష్ఠానమువలననే కార్యముయొక్క యుత్పత్తి యుపపన్న మగుచుండఁగా ఒక పటరూపకార్యములో కువిందునకు ఈశ్వరునికియు, ఇద్దరిని యెందుకు అధిష్ఠాతలుగా స్వీకరించవలెనని యాశంకింపవలదు. ఒకరివలననే

గావచ్చును గాని, రెండుకారణములు నియతముగా యున్న ప్పుడు రెండిటిలో ఒకదానికే కారణత్వము మరియొకదానికి చెప్పుటకు వీలులేదనుటలో యుక్తిలేనందున ఉభయులకుఁ గూడ అధిష్ఠాతృత్వము సిద్ధించును. పరిమాణములో, అనఁగా ద్వ్యణుకమందుండు అణు పరిమాణములో పరిమాణుగత ద్విత్వసంఖ్యయు, ఘటాదిపరిమాణములో కపాలములయం దుండు పరిమాణమున్నూ దూదియందుండు పరిమాణము లో ప్రచయసంయోగమున్నూ ప్రత్యేకమునకు పరిమాణ ములో కారణత్వ ముపలబ్ధ మగుచున్నది. అటులనే ప్రత్యేక మునకు యున్నప్పుడు ఉభయమునకుఁగూడ అధిష్ఠాతృత్వము స్వీకరించెదము.

మూ. అస్తి తత్ర వైజాత్యమితి చేత్. ఇహాऽపి కించిద్భ విష్యతీతి, న చాకుర్వతః కులాలాదేః కాయ సంక్షోభాదిసాధ్యో భోగః సిద్ధ్యేదితి తదర్థ మస్య కర్తృత్వమీశ్వరో అనుమన్యతే, తదర్థ మాత్రత్వాదైశ్వర్యస్యేతి.

తా. ప్రత్యేకమువలనఁ గలుగు కార్యమందు లేని వైజా త్యము ద్వికర్తృకమైన కార్యమందు స్వీకరించెద మనినచో, ద్వికర్తృక కార్యము. అనఁగా ఘటాది కార్యమందు లేని ఊత్యా దికమందుఁగూడ వైజాత్యము స్వీకరించవలసి వచ్చును. కార్య మును జేయని కులాలునకు శరీరక్షోభమువలనఁ గలుగు భోగము సంభవించదని ఆకులాలునకు భోగమును సంపా దించునిమిత్త మీశ్వరుఁడు కర్తృత్వము నంగీకరించును. ఈశ్వరుఁడు అనఁగా ఐశ్వర్యముగలవాఁడు. ఈశ్వరునకు

యుండు ఐశ్వర్యమునకు భోగమాత్రమే ఫలము. కాన ఉభయులకుఁగూడ అధిష్ఠాతృత్వము సిద్ధించును.

మూ. యత్వనిత్యప్రయత్నేత్యాది, భవేదస్త్యేవం, యద్యనిత్యప్రయత్ననివృత్తావేవ బుద్ధిరపి నివర్తేత, న త్వేతదస్తి, ఉదాసీనస్య ప్రయత్నాభావేపి బుద్ధిసద్భావాత్. హేతుభూతాబుద్ధిర్నివర్తత ఇతి చేన్న. ఉదాసీనబుద్ధేరపి సంస్కారం ప్రతి హేతుత్వాత్. కారకవిషయా బుద్ధిర్నివర్తత ఇతి చేన్న. ఉదాసీనస్యాపి కారకబోద్ధృత్వాత్.

తా. క్షిత్యాదికం, కర్తృపూర్వకం, కార్యత్వాత్. అను యనుమానము అనిత్య ప్రయత్న పూర్వకత్వరూపమగు ఉపాధివిశిష్టమగును. కనుక సోపాధికమని వెనుక యుపన్యసించెను. అది సరిగాదు. కర్తృపూర్వకత్వ మనఁగా, బుద్ధిమత్పూర్వకత్వము. దీనిలో అనిత్యప్రయత్న పూర్వకత్వము ప్రయోజక మైనచో, అనిత్యప్రయత్నము నివర్తించినచో బుద్ధినివృత్తి గావలెను. కారణములను ప్రేరణచేయని ఉదాసీనునకు అనిత్యప్రయత్నము లేకపోయిననూ బుద్ధియున్నందున అనిత్యప్రయత్నపూర్వకత్వ ముపాధి యనుటకు వీలు లేదు. అనిత్యప్రయత్నము నివర్తించినచో, హేతుభూతమగుబుద్ధి నివర్తించును. ఉదాసీనబుద్ధి దేనినిగూర్చియు హేతువు గాదనుట సరిగాదు. ఉదాసీనబుద్ధిఁగూడ సంస్కారమునుగూర్చి హేతువు యగును. కారకమును గోచరించెడు

బుద్ధి నివర్తించుననుటఁగూడ సరిగాదు. ఉదాసీనుఁడుగూడ కారకబోద్ధ యగుచున్నాఁడు.

మూ. న హి ఘటాదికమకుర్వతశ్చక్రాదికం నేక్షా మహే. హేతుభూతా కారకబుద్ధిర్నివర్తత ఇతి చేన్న. అయతమానస్యాపి దుఃఖహేతు భూతాయా అపి తద్ధేతుకం కంటకస్పర్శబుద్ధే రభావాత్. చికీర్షాహేతుభూతో అనుభవః నివర్తతే ఇతి చేన్న. కేనచిన్నిమిత్తేనాకుర్వ తోఽపి చికీర్షా తద్ధేతుబుద్ధిసంభవాత్. అనపేక్ష కృతిహేతుచికీర్షాకారణం బుద్ధిర్నివర్తత ఇతి చేన్నతర్హి వాబుద్ధిమాత్రం తథా చానిత్య ప్రయత్నహేతుకత్వప్రయుక్తం విశిష్టప్రయ త్నచికీర్షాహేతుబుద్ధిమత్పూర్వకత్వమితి తన్ని వృత్తౌ తదేవ నివర్తతాం న తు బుద్ధిమత్పూ ర్వకత్వమాత్రం. తత్ర తస్య ప్రయోజకత్వా దితి బుద్ధిమత్పూర్వకత్వసాధ్యపక్షే పరిహారః. సకర్తృకమితి ప్రయత్నప్రధానపక్షే శంకైవ నాస్తి, తస్యైవ తత్రానుపాధిత్వాత్.

తా. ఘటమును జేయనివాఁడు, అనఁగా ఘటప్రయత్నము లేనివాఁడు కారకమైన చక్రాదులయొక్క దర్శనము గలవాఁ డగుచున్నాఁడు. కాన అనిత్యప్రయత్ననివృత్తివలన కారకబుద్ధి నివృత్తమని జెప్పుటకు వీలులేదు. అనిత్యప్రయ

త్నమువలన కారణమైన కారకబుద్ధి నివృత్తమని జెప్పెదము. ప్రకృతమున చక్రాదులను గోచరించిన బుద్ధిప్రయత్నకారణము గాదు గాన తన్నివృత్తి యకించిత్కరమని యాశంకింపవలదు. యేయత్నము లేనివానికి దుఃఖహేతువైన కంటకస్పర్శ యొక్క బుద్ధియున్నది. యీబుద్ధి దుఃఖమునుగూర్చి హేతువయూ, కంటకస్పర్శరూప కారకవిషయకముయూ యగుచున్నది. కాన హేతుభూతమైన కారకబుద్ధి నివర్తించుననుటకు వీలులేదు. చికీర్షాహేతువయగు యనుభవము అనిత్యప్రయత్ననివృత్తివలన నివర్తించు ననుటఁగూడ సరిగాదు. యేదో యొకకారణముచే ప్రయత్నములేనివానికి చికీర్షయు, దీనికి హేతువయైన బుద్ధియు యున్నందున యీరీతిఁగూడ సరిగాదు. కృతికారణమైన చికీర్షలో కారణమైనబుద్ధి నివర్తించుననినచో, అనిత్యప్రయత్న పూర్వకత్వప్రయుక్తమైనది బుద్ధిమత్పూర్వకత్వము గాదు. ప్రయత్నకారణీభూత చికీర్షాకారణీభూత బుద్ధిమత్పూర్వకత్వమే యగును. దీనియొక్క నివృత్తియే యనిత్యప్రయత్న నివృత్తివలనఁ గలుగును గాని బుద్ధిమత్పూర్వకత్వము మాత్రము గాదు. బుద్ధిమత్పూర్వకత్వములో అనిత్యప్రయత్నపూర్వకత్వము యప్రయోజకము గాన దీనియొక్కనివృత్తి బుద్ధిమత్పూర్వకత్వ నివృత్తిలో యప్రయోజకము. కాన బుద్ధిమత్పూర్వకత్వ సాధ్యకానుమానము యప్రయోజము గానేరదు. సకర్తృకమను సాధ్యపదమునకు ప్రయత్నవత్పూర్వకం అని ప్రయత్నప్రధానపక్షమున ప్రయత్నములో ప్రయత్నము యుపాధి గానందున యుపాధ్యాశంకకే యవకాశము లేదు.

మూ. ఏతేన శరీరసంబంధే బుద్ధిగతకార్యత్వవత్. బుద్ధిసంబంధే ప్రయత్నగతకార్యత్వముపాధిరితి నిరస్తం, యోహి బుద్ధ్యా శరీరవచ్ఛరీరనివృత్త్యా బుద్ధినివృత్తివద్వా ప్రయత్నేన బుద్ధిం, బుద్ధినివృత్త్యా ప్రయత్ననివృత్తిం సాధయేత్. స ఏవం కదాచిదుపాలభ్యః.

తా. కర్తృత్వమువలన శరీరసంబంధమును సాధించినపుడు కార్యబుద్ధివలె కార్యత్వముచే బుద్ధిమత్పూర్వకత్వమును సాధించినపుడు అనిత్యప్రయత్నపూర్వకత్వ మను యుపాధి ముందుఁ జెప్పఁబోవు రీతినిబట్టి నివర్తించును. బుద్ధిచే శరీరసంబంధమువలె శరీరనివృత్తివలన బుద్ధినివృత్తివలె, అనిత్యప్రయత్నముచే బుద్ధినిగాని, బుద్ధినివృత్తిచే ప్రయత్ననివృత్తినిగాని యెవఁడు సాధించునో ఒకానొకప్పుడు వాఁడు నిందితుఁడగును.

మూ. వయంత్వవగతహేతుభావం కలితసకలశక్తికారకప్రయోక్తారం కార్యాదేవానుమిమానాః, నైవమాస్కందనీయాః. తత్ర తస్యానుపాధిత్వాత్. న చ ప్రయత్న ఆత్మలాభార్థమేవ మతిమపేక్షతే, విషయలాభార్థమప్యపేక్షణాత్. తతః ప్రయత్నాద్బుద్ధిః. తన్నివృత్తేశ్చ ప్రయత్ననివృత్తిః సిధ్యత్యేవేతి విస్తృతమన్యత్ర.

తా. తెలుసుకొనఁబడిన హేతుత్వము కలిగినట్టియు, సకలశక్తులతోఁ గూడిన కారకములను ప్రేరణ జేయునట్టివానిని,

కార్యమువలన, అనుమేయించెదు మేము యీరీతిగా దూష ణకు పాత్రులము గాము.జ్ఞానేచ్ఛాప్రయత్నములలో ప్రత్యేక జన్యత్వము సాధ్యమైనచో అనిత్యప్రయత్నము యుపాధి గాదు. స్వోత్పత్త్యర్థమై ప్రయత్నము బుద్ధిని యపేక్షించినచో అనిత్యప్రయత్న ముపాధి యగును. తనయొక్క యుత్పత్తి కొరకే బుద్ధిని ప్రయత్న మపేక్షించుట గాదు. ప్రయత్నము నకు బుద్ధివిషయమే విషయముగాని, వేరే యొకవిషయము లేదు గాన బుద్ధివిషయమందు కార్యజనకమగుటకుఁగూడ బుద్ధినపేక్షించును. అందువలననే ప్రయత్నమువలన బుద్ధియు, బుద్ధినివృత్తివలన ప్రయత్ననివృత్తియు సిద్ధించునన్నసంగతి పూర్వమందుఁ జెప్పియేయుంటిమి.

మూ. కార్యబుద్ధినివృత్త్యా తు కార్య ఏవ ప్రయత్నో నివర్త్యతే న నిత్యః, నిత్యే చ ప్రయత్నే నిత్యైవ బుద్ధిః ప్రవర్తతే, నానిత్యా, న హి తయా తస్య విషయలాభసంభవః.శరీరాదేః ప్రాక్ తదసంభవే దేహానుపపత్త్యా సర్వానుపపత్తేః. శరీరాజన్యత్వ వచ్చానిత్యప్రయత్నాజన్యత్వమితి సంక్షేపః.

తా. కార్యబుద్ధియొక్క నివృత్తివలన కార్యప్రయ త్నమే నివర్తించును గాని నిత్యప్రయత్నము నివర్తించదు. అట్లైనచో నిత్యబుద్ధి యెటుల సిద్ధించుననఁగా, నిత్యమైన ప్రయత్నము యున్నచో నిత్యబుద్ధియే సిద్ధించునుగాని అనిత్యబుద్ధి ప్రవర్తించదు. నిత్యప్రయత్నమునకు విషయ లాభముఁగూడ లేదు. బుద్ధి అనిత్యమైనచో, అనిత్యబుద్ధి శరీ రములేనిచో బుట్టుటకు వీలులేదు. అనిత్యబుద్ధిలో హేతువ

యగు శరీరముయొక్క ఉత్పత్తికంటె పూర్వమున బుద్ధిలేనం దున శరీరమే బుట్టనిచో, అనిత్యబుద్ధి యెల్లపుడు పుట్టకనే బోయీని, శరీరాజన్యత్వమువలె, అనిత్యప్రయత్నాజన్య త్వముఁగూడ వ్యర్థవిశేషణఘటితము గాన అనిత్యప్రయత్నా జన్యత్వముచే క్షిత్యాదికమం దకర్తృకత్వముఁను సాధించుట సరిగాదు.

శ్లో. తర్కాభాసతయాన్యేషాం తర్కాశుద్ధిరదూషణం,
అనుకూలస్తు తర్కోత్ర కార్యలోపో విభూషణం. 3

తా. ఈశ్వరుఁడు కర్తయైనచో, శరీరముగలవాఁడుగా నియనుపరోక్తతర్కము ఆభాసరూప మగుటవలన, ఇట్టితర్కా శుద్ధి. మా యనుమానమునకు దూషకము గాదు. మామతము నందు కర్తయగు కారణము లేనిచో కార్యమే లేకపో నియ్యను. అనుకూలతర్కము వ్యభిచారశంకను నివర్తింపఁ జేయునది యున్నది. కాన ఈశ్వరసిద్ధి యగునని తాత్పర్యము. వెనుకఁజెప్పిన తర్క మాభాసరూప మెటుల యగుననఁగా, ఈశ్వరుఁడు సిద్ధించనిచో ఈశ్వరుఁడు శరీరిగాని యను యా పత్తిరూపమగు తర్కావతారమే యుండదు. ఈశ్వరుఁడు సిద్ధించినచో యెట్టిప్రమాణముచే ఈశ్వరసిద్ధియగునో దాని వలననే అశరీరి కర్తయగు ఈశ్వరసిద్ధి యగును గాన ఈశ్వ రుఁడు గ ర్తయైనచో శరీరముగలవాఁడై గా నియనుతర్కము. ఈశ్వరసిద్ధి పక్షమునందును, అసిద్ధిపక్షముననూగూడ యనుప పన్నము గాన యాభాసరూప మగును.

మూ. కారకవ్యాపారవిగమే హి కార్యానుత్పత్తిప్రసంగః. చేతనాచేతనవ్యాపారయోః హేతుఫలభావావధారణాత్. కారణాంతరాభావఇవ కర్త్రభావే కార్యానుత్పత్తిప్రసంగః. కర్తురపి కారణత్వాత్.

తా. కర్త లేకపోయినను కారణాంతరమువలన ఏల కార్యముఁ గలుగఁగూడదని యాశంకింపవలదు. కారణాంతరవ్యాపారములోఁగూడ కర్త కారణము గాన కర్తలేనిచో అదియునుగూడ లేకపోవలసివచ్చును. ఇతరకారణములు లేనిచో నెటుల కార్యానుత్పత్తియో కర్తగూడ కారణము గాన కర్త లేక ఇతరకారణములు యున్నను కార్యము లేకపోవలసివచ్చును.

మూ. యస్త్వాహ ప్రత్యక్షానుపలంభాభ్యాం తదుత్పత్తినిశ్చయో దృశ్యయోరేవ, న త్వదృశ్యయోః. ప్రత్యక్షస్యానుపలంభస్య చ తావన్మాత్రవిధినిషేధసమర్థత్వాత్. ధూమాగ్నివత్. కంపమారుతవచ్చ. న హి ధూమః కార్యో అనలస్యేతి, జౌదర్యస్యాపి, న హి శాఖాకంపో మాతరిశ్వన ఇతి, స్తిమితస్యాపి స్యాత్. కింతు భౌమస్పృశ్యయోరేవ. తథేహాఽపి శరీరవత ఏవ కారణత్వమవగంతుముచితం నాన్యస్యేతి తదసత్.

తా. అన్వయవ్యతిరేకములచే కృతికి కార్యమునకు వ్యాప్తిగ్రహము సంభవించదు. నీమతమున ఈశ్వరునియొక్క

కృతి నిత్యము గాన దానికి వ్యతిరేకము సంభవించదు. కాన అన్వయవ్యతిరేకములచే దృశ్యమైనవాట్లకే కార్యకారణ భావముగాని అదృశ్యములకు సంభవించదు. కృతివ్యాప్యతా జ్ఞానమువలన అదృశ్యమైన కర్త సిద్ధించినచో ధూమాగ్నులకు యుండు వ్యాప్తిగ్రహమువలన ధూమములో కారణము గానట్టియు, అదృశ్యమైన జాఠరాగ్ని గూడ సిద్ధింపవలసి వచ్చును. ఇటులనే శాఖలయొక్క కంపము వాయుకార్యముం గాన వీట్లకు యుండుకున్న వ్యాప్తిగ్రహమువలన స్తిమిత మైన వాయువంగూడ సిద్ధింపవలసివచ్చును, గాన దృశ్యమైన కార్యముచే శరీరి యగుకర్తయే సిద్ధించును గాని అదృశ్య మైనకర్త సిద్ధించుననుట సరిగాదని సౌగతులమతము సరిగాదు.

మూ. ప్రత్యక్షానుపలంభా హిదృశ్యవిషయావుపా
య స్తదుత్పత్తినిశ్చయే. న తు దృశ్యత్వైవ తత్రో
పేయా, కిం నామ దృశ్యా శ్రితం సామాన్య
ద్వయం? తదాలీఢస్య హి తదుత్పత్తినిశ్చయే
దృశ్యమదృశ్యం వా సర్వమేవ తజ్జాతీయం
తదుత్పత్తిమత్తయా నిశ్చితం భవతి. యథా
స్పర్శరూపరసగంధానాముత్తరోత్తరనిమిత్తతా
యాం తవ, అస్మాకం చాతీంద్రియసమవాయాది
సిద్ధౌ. న చేదేవముదాహృతయోరేవ దహన
పవనయోరాలోకరూపవతో స్తదుత్పత్తి నిశ్చ
యే కథమనాలోకనిరస్తరూపయోస్సిద్ధిః యదు
దర్యస్తిమితసాధారణసిద్ధిస్స్యాదితి.

తా. కృతివిశేష కార్యవిశేషములకుయుండు వ్యాప్తి గ్రహము బాధకము లేనిచో కృతిసామాన్య కార్యసామాన్యములయొక్క వ్యాప్తిగ్రహములో ఉపాయము యగును. వహ్నివిశేష ధూమవిశేషములకు యుండుకున్న వ్యాప్తిగ్రహము యట్లు తత్సామాన్యములకు యుండు వ్యాప్తిగ్రహములో యుపాయమౌ నీమతమున స్పర్శవలన రూపమున్ను, రూపమువలన రసముయున్ను, రసమువలన గంధముయున్ను, యెటుల యుత్పన్నమౌ, మామతమున కార్యకారణ తావచ్ఛేదక జాత్యాక్రాంతములు దృశ్యమైననూ, యదృశ్యమైననూ, కార్యతావచ్ఛేదక జాత్యాక్రాంతములో కారణతావచ్ఛేదకజాత్యాక్రాంతము ప్రయోజక మగును. కాన బాధకము లేనిచో విశేషములయొక్క వ్యాప్తిగ్రహమువలన సామాన్యములకుఁగూడ వ్యాప్తిగ్రహముఁ గలుగును. అట్లు గానిచో పాకము. ఆ లోకాత్మకవహ్నివలననూ, కంపము రూపముగల దండమువలననూ బుట్టుచున్నందున ప్రత్యక్షానుపలంభములచే పాకమువలన ఆలోకవహ్నియు, కంపముచే, రూపముగల దండమున్ను సిద్ధించును గాని, అనాలోకరూపమగు జఠరాగ్నియు, రూపములేని వాయువయున్ను యెటుల సిద్ధించును. కాన బాధకము లేనిచో సామాన్యములకుఁగూడ కార్యకారణభావము సిద్ధించునని జెప్పవలెను.

మూ. తద్భవేదప్యేవం యది శరీరాదికం వినా కార్య.
మివ భౌమం స్పర్శవద్వేగవంతం చ వినా
అగ్నిమాత్రాత్పవనమాత్రాద్వా ధూమకంపౌ
స్యాతాం న త్వేవం. నచైవం చేతనవ్యభిచా

రోపి శక్త్యభిధానఇత్యలంబాలప్రలాపానాం సమాధానైః.

తా. శరీరములేనికర్తవలన కార్యముఁ బుట్టినట్టుగా భౌమము. అనఁగా భూమియందుయున్న ఆలోకరూపమగు వహ్నిలేక, వహ్నిసామాన్యమువలన ధూమమునున్ను ఉద్భూతస్పర్శయు, వేగమున్ను గలవాయువు లేక పవనమాత్రమువలననే కంపమున్ను గలిగినచో నీవు జెప్పినరీతి సరియగును. అట్లు కానరాదు. పవనమాత్రమువలన కంపమున్ను, అదృశ్యమగు వహ్నివలన ధూమమున్ను బుట్టనందున దృశ్యత్వమే బ్రయోజకమనవలెను. కాన ధూమమువలన అదృశ్యవహ్నియు, కంపమువలన అనుద్భూతస్పర్శ గలవాయువయు సిద్ధించుటకు వీలులేదు. కర్తృత్వముచే శరీరిత్వసాధకానుమానములో వ్యభిచారశంకయుఁ జేయుటకు వీలులేదు. అశరీరకర్తను సాధించు నీయాక్షేపములచేత నేమియును బనిలేదు.

మూ. తదుత్పత్తేరసిద్ధావపి తత్తదుపాధివిధూననేన స్వాభావికత్వస్థితౌ యది కర్తారమతిపత్య కార్యం స్యాత్. స్వభావమేవాతిపతేదితి కార్యవిలోపప్రసంగ ఇతి. ఏతచ్చ సర్వమాత్మతత్త్వవివేకే నిపుణతరముపపాదితమితి నేహ ప్రతన్యతే ఏవం చ సిద్ధే ప్రతిబంధే నప్రతిబంధ్యాదేః క్షుద్రోపద్రవస్యావకాశః. ప్రతిబందసిద్ధా విష్టాపాదనాత్. తదసిద్ధా తత ఏవ తత్సిద్ధేరప్రసంగాదితి.

తా. కార్యలోపప్రసంగము మరియొకరీతిగా జెప్పఁబడు చున్నది. కర్తలేని దీకార్యముఁ బుట్టినచో కర్తృస్వభావము యనుపపన్న మగును. కర్తయనఁగా కార్యమును జేయు వాఁడు గదా? కార్యమే బుట్టినచో కర్తృత్వస్వభావమే యనుపపన్న మగును. కార్యలోపప్రసంగ మనఁగా ఇదియే. ఈసంగతియే ఆత్మతత్త్వవివేక మనుగ్రంథమం దుపపాదించఁ బడ్డది. అదృశ్యమైనకర్తకు కార్యమునుగూర్చి కారణత్వముఁ జెప్పినపిదప కర్తృత్వవ్యాప్తి కార్యత్వమందు సిద్ధించునపుడు, చవలపిల్లియందు దృశ్యశృంగము నిషేధించిననూ, అదృశ్య శృంగము సిద్ధించని యనుత్కృద్రమగు ప్రతిబంధులకు యవ కాశము లేదు. యేలనన్న, ప్రతిబంధము సిద్ధించినపుడు ఇష్ట మైన ఈశ్వరసిద్ధియే యగును. సిద్ధించనిచో, వ్యాప్తిసిద్ధి లేనందుననే అదృశ్యశృంగసిద్ధిప్రసంగము సంభవించదు.

మూ. నను తస్య సర్వదా సర్వత్రావిశేషే కార్యస్య
సర్వదోత్పత్తిప్రసంగ ఇతి నిరపేక్షేశ్వరపక్షే
దోషః. సాపేక్షే ఉపేక్షణీయ ఏవాస్త్వితి
బాలస్య ప్రదీపకలికాక్రీడయైవ నగరదాహః.
స్థేమభాజో జగతఏవాకారణత్వప్రసంగాత్. జీ
మితి బ్రువతః సౌగతస్యద త్తముత్తరం ప్రాక్.

తా. జీవాదులయొక్క కర్మను అపేక్షించక ఈశ్వరుఁడు కారణమైనచో ఈశ్వరుఁ డంతటను ఎల్లప్పుడు యుండుట వలన కార్యము ఎల్లప్పుడు పుట్టవలసివచ్చును. జీవాదృష్టము నపేక్షించి కారణమైనచో కార్యమునకు కాదాచిత్కృత్వ ముపపన్నమైననూ, బాలుఁడు క్రీడవలన దీపముచే నగర

దాహమును జేసినటుల ఈశ్వరుఁడుగూడ ఉపేక్షణీయుఁడె గావలసివచ్చునని యాశంకించుట సరిగాదు. వెనుక నుదహరించిన నిరపేక్షత్వ సాపేక్షత్వపక్షములయందు దోషములచే జగత్కారణత్వమే ఈశ్వరునకు లేకపోవలసివచ్చును. అకారణత్వమే యంగీకరించినచో కాదాచిత్కత్వమునకు యనుపపత్తి వచ్చునన్న సంగతి వెనుకఁ జెప్పియేయున్నాము.

మూ. ఆర్షం ధర్మోపదేశం చ వేదశాస్త్రావిరోధి నా.
యస్తర్కేణానుసందత్తే స ధర్మం వేద నేతరః.
తమిమమర్థమాగమస్సంవదతి విసంవదతితు పరేషాం విచారం.

శ్లో. విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో
విశ్వతో బాహురుత విశ్వతః పాత్,
సంబాహుభ్యాం ధమతి సంపతత్రై
ర్ద్యావాభూమీ జనయన్ దేవ ఏకః.

మూ అత్ర ప్రథమేన సర్వజ్ఞత్వం చక్షుషా దృష్టేరుపలక్షణాత్. ద్వితీయేన సర్వవక్తృత్వం, ముఖేన వాగుపలక్షణాత్.తృతీయేన సర్వసహకారిత్వం, బాహునా సర్వసహకారిత్వోపలక్షణాత్.చతుర్థేన వ్యాపకత్వం, పదా, వ్యాప్తేరుపలక్షణాత్. పంచమేన ధర్మాధర్మలక్షణప్రధానకారణత్వం తా హి లోకయాత్రావహానాద్బాహూపష్టేన

పరమాణురూపప్రధానాధిష్ఠేయత్వం తే హి గతిశీలత్వాత్. పతత్ర వ్యపదేశాః. పతంతీతి సంధమతి, సంచనయన్నితి చ వ్యవహితోపసర్గ సంబంధః తేన సంయోజయతి, సముత్పాదయన్నిత్యర్థః. ద్యావా ఇత్యూర్ధ్వసప్తలోకోపలక్షణం, భూమిరిత్యధస్తాత్. ఏక ఇత్యనాదితేతి స్మృతిరపి "అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే" ఇత్యాది, ఏతేన బ్రహ్మాది ప్రతిపాదకా ఆగమా బోద్ధవ్యాః.

తా. తర్కములేనిచో ఋషిప్రోక్తమగు ధర్మోపదేశమందు తాత్పర్యము నిశ్చయించుటకు వీలులేదు గాన, వేద శాస్త్రావిరోధి యగుతర్కముచే యేపురుషుఁడు ఆర్షమైన ధర్మోపదేశానుసంధానమును జేయునో, ఆపురుషుఁడే ధర్మమును తెలిసినవాఁడు, గాని మరియొకఁడుగాఁడు యని ఆగమము& జెప్పుచున్నది. సౌగతాదిమతములకు విరుద్ధముగా గూడ యాగముఁ జెప్పుచున్నది.

1. 'విశ్వతశ్చక్షుః' అనెడు ప్రథమపాదముచే పరమేశ్వరునకు సర్వజ్ఞత్వముఁ జెప్పఁబడుచున్నది. సర్వమును గోచరించెడు దర్శనముగలవాఁడు.

2. 'విశ్వతోముఖః' అన్ని ముఖములచేతను, అన్ని వాక్కులచేతను సర్వమును పలుకువాఁడు.

3. 'విశ్వతోబాహుః' యీ మూఁడవపాదముచే సర్వసహకారిత్వముఁ జెప్పఁబడుచున్నది.

4. 'విశ్వతః పాత్.' అను నాలగవపాదముచే సర్వ వ్యాప్తి జెప్పఁబడినది.

5. 'సంబాహుభ్యాం' అనెడు అయిదవపాదముచే ధర్మాధర్మరూపప్రధానకారణత్వముఁ జెప్పఁబడును. యీధర్మాధర్మములు లోకయాత్రను వహించును గాన ఇవి బాహుస్థానీయములు.

6. 'ధమతిసంపతత్రైః' అను ఆరవపాదముచే పరమాణురూపమగు ప్రధానాధిష్ఠేయత్వముఁ జెప్పఁబడును. సర్వదా గతిశీలములగుటవలన ఇవి రెక్కలవంటివి. సం॥ అను 'ఉపసర్గ ధమతి' అనుదానితో కలిసినయెడల 'సంధమయతి' అని రూపమగును. పరమేశ్వరుఁ డీపరమాణువులను కలిపి ప్రపంచమును బుట్టించును. "ద్యావాభూమీ జనయన్ దేవ ఏకః, ఏకః, అనాదిర్యైన దేవః" ఈశ్వరుఁడు ద్యురాది ఏడైన ఊర్ధ్వలోకములను, క్రిందుగాయుండుకున్న భూరాదిసప్త అధోలోకములను సృజించువాఁ డీశ్వరుఁడని తాత్పర్యము. "అహంసర్వస్య ప్రభవః" అను స్మృతిఁగూడ ఈశ్వరునకు సర్వకర్తృత్వమును జెప్పుచున్నది.

మూ. ఆయోజనాత్కల్వపి,

శ్లో. స్వాతంత్ర్యే జడతా హానిర్వ్యాపృష్టం దృష్టఘాతుకం,
హేత్వభావే ఫలాభావో విశేషస్తు విశేషవాన్. ౪

తా. ఆయోజనమనఁగా, ద్వ్యణుకారంభక సంయోగమునుగూర్చి కారణమైన సృష్ట్యాద్యకాలీనమైన పరమాణుకర్మ.

టీ. యుజ్యతే సంయుజ్యతే అన్యోన్యం ద్రవ్యమనే నేత్యాయోజనమితి వ్యుత్పత్తిః.

తా. సృష్ట్యాద్యకాలీనమైన ద్వ్యణుకారంభక సంయోగానుగుణమైనకర్మ పరమాణువులయందు స్వప్రయత్నమువలననే గలిగినచో పరమాణువుల కచైతన్యభంగముఁ గలుగును. ప్రయత్నము నపేక్షించకయే అదృష్టమువలననే క్రియఁ బుట్టినచో, అదృష్టమువలననే ద్వ్యణుకముఁ గలుగవలసివచ్చును. కారణాంతరాపేక్ష లేకపోవలసివచ్చును. కాన చేతనవ్యాపార సహితమైన పరమాణుకర్మవలననే ద్వ్యణుకారంభకసంయోగము గలుగునని చెప్పవలెను.

మఱియొకస్థలమందుండుకర్మనుగూర్చి కారణముగా నుపలబ్ధమైన చేతనప్రయత్నమునకు హేతుత్వముఁ జెప్పనిచో, హేతువు లేనందున, క్రియయే బుట్టకపోవలసివచ్చును.

చేష్టారూపక్రియనుగూర్చి చేతనవ్యాపార మగు ప్రయత్నము హేతువైనను క్రియాసామాన్యహేతుత్వము ప్రయత్నమునకు యేల జెప్పవలెననినచో? చేష్టారూపక్రియావిశేషము. భోక్తయందుండు ప్రయత్నమువలన గలిగినను, విశేషకార్యకారణభావ మున్నప్పుడు తత్సామాన్యములకుఁ గూడ కార్యకారణభావము బాధకము లేనప్పుడు సిద్ధించును. కాన క్రియాసామాన్యములో చేతనప్రయత్నము కారణమని జెప్పవలెను.

మూ. పరమాణ్వాదయో హి చేతనాయోజితాః, ప్రవర్తంతే అచేతనత్వాత్. వాస్యాదివత్. అన్య

థా కారణం వినా కార్యానుత్పత్తిప్రసంగః. అచేతనక్రియాయాశ్చేతనాధిష్ఠాన కార్యత్వావధారణాత్. క్రియావిశేషవిశ్రాంతోఽయమర్థః. న తు తన్మాత్రగోచరః. చేష్టా హి చేతనాధిష్ఠానమపేక్షతే ఇతి చేత్.

తా. వాస్యాదికము అచేతన మగుటవలన చేతనప్రయత్నాధీనమైన కర్మ గలదియై యటుల కార్యోత్పాదకమో అట్లే పరమాణువులుగూడ చేతనప్రయత్నాధీనకర్మ గలవియై కార్యోత్పాదకములు యను అనుమానముచే చేతనుఁడు సిద్ధించును. ఇట్టి కార్యకారణభావము నంగీకరించనిచో కారణము లేనందున కార్యముఁ బుట్టకపోవలసివచ్చును. అచేతనమైన వస్తువులయందుండు క్రియాసామాన్యమునకు చేతనుని యొక్క ప్రయత్నాధీనత్వము నిశ్చితమై యున్నది గాన పరమాణువు లచేతనములు గాన దానిక్రియ చేతనప్రయత్నాధీనమని జెప్పవలెను.

చేష్టారూపమగు నచేతన క్రియావిశేషము. చేతనప్రయత్నము నపేక్షించిననూ క్రియాసామాన్యములో చేతనప్రయత్నాపేక్ష యేల యంగీకరించవలెను? చేష్టాత్వము పూర్వానుమానమున యుపాధి యగును. చేష్టాంతర్భావేన సాధ్యవ్యాపకత్వము. పరమాణు క్రియాంతర్భావేన సాధనావ్యాపకత్వము వచ్చును. కాన దుష్టానుమానమని యాశంకింపవలదు.

మూ. అథ కేయం చేష్టా నామ? యది ప్రయత్నవదాత్మసంయోగాసమవాయికారణకా క్రియా

ప్రయత్నమాత్రకారణికేతి వావివక్షితం, తన్న, తస్యైవ తత్రానుపాధిత్వాత్. అథ హి తా హితప్రాప్తిపరిహారఫలత్వం తత్వం; తన్న, విష భక్షణోద్బంధనావ్యాపనాత్.

తా. చేష్టయన నేమి? ప్రయత్నముతోఁగూడిన యాత్మ యొక్క సంయోగ మసమవాయి కారణముగా గలక్రియయా, లేక ప్రయత్నమాత్రమే కారణముగా గలక్రియ యందువా? అట్లనుటకు వీలు లేదు. ప్రయత్నవదాత్మ సంయోగా సమవాయి కారణకక్రియాత్వమే సాధ్యమైనందున సాధ్యరూపమే చేష్టా త్వము గాన స్వమ్మలో స్వమ్మే యుపాధి యని చెప్పుట యసంగతము.

హితప్రాప్తిఫలకము, అహిత పరిహారఫలకమైన క్రియ చేష్టయనినచో, విషభక్షణమందును, గొంతుకకు ఉరిపోయు టయుఁగూడ చేష్ట గాన వీట్లయందు, హితాహితపరిహార ఫలకత్వ రూపచేష్టాత్వము లేనందున సాధ్యవ్యాపకము కాదు, గాన ఉపాధియనుటకు వీలు లేదు.

మూ. ఇష్టానిష్టప్రాప్తిపరిహారఫలత్వమితి చేత్. కర్తా రం ప్రత్యన్యం వా? ఉభయథాపి పరమా ణ్వాదిక్రియాసాధారణ్యాదవిశేషః. భ్రాంత సమీహాయా అతథాభూతాయా అపి చేతన వ్యాపారాపేక్షణాచ్చ.

తా. విషభక్షణానుకూలమైన క్రియఁగూడ ఇచ్ఛా విషయమైన విషభక్షణఫలకము గావచ్చును. లేనిచే దాని

యందు ప్రవృత్తియే గలుగక పోవలసివచ్చును. ఇటులనే బ్రతికియుండుట యనిష్టము. దానియొక్క పరిహారమే ఫలముగాగలది ఉద్బంధనము గాన సాధ్యవ్యాపకత్వము సంభవించును గాన చేష్టాత్వ ముపాధి గావచ్చునని యాశంకింపరాదు. కర్తయొక్క ఇచ్ఛావిషయఫలకత్వమూ, లేక మరియొకనియొక్క ఇచ్ఛావిషయఫలకత్వమా, పరమాణువులయందుయుండు క్రియ జగత్కర్తయగు ఈశ్వరునియొక్క ఇచ్ఛావిషయమైన కార్యమునుగూర్చి కారణము గావచ్చును. ఇట్లే అస్మదాదులయొక్క ఇష్టఫలములో సమర్థము గావచ్చును. సాధనవ్యాపక మైనందున ఇట్టి చేష్టాత్వ ముపాధియనుటకు వీలులేదు. ముత్యపచిప్పనుజూచి వెండియని భ్రాంతిచే ప్రవర్తించినవాని క్రియారూపచేష్టయం దిష్టమైన రజితప్రాప్తిఫలకత్వము గాని, అనిష్టమైన శుక్తి, అనఁగా (ముత్యపచిప్ప)యొక్క పరిహారఫలకముగాని లేదు గాన వెనుకటి చేష్టాత్వము సాధ్యవ్యాపకముఁగూడ గానేరదు.

మూ॥ శరీరసమవాయిక్రియాత్వం తదితి చేత్. న. మృతశరీరక్రియాయా అపి చేతనపూర్వకత్వప్రసక్తేః జీవత ఇతి చేత్. న, నేత్రస్పందాదే శ్చేతనాధిష్ఠానాభ్యుపగమప్రసంగాత్. స్పర్శవద్ద్రవ్యాంతరాప్రయోగే సతీతి చేన్న. జ్వలనపవనాదౌ తథాభావాభ్యుపగమాపత్తేః,శరీరస్య స్పర్శవద్ద్రవ్యాంతరాప్రయుక్తస్యేతి చేత్. న, చేష్టయైవ శరీరస్య లక్ష్యమాణత్వాత్.

తా. శరీరసమవేతమైన క్రియయే చేష్టయనినచో మృత శరీరమందు వాయ్వాదులయొక్క సంయోగమువలన క్రియఁ బుట్టును గాన అట్టిక్రియఁగూడ చేష్ట కావలసివచ్చును. జీవించి (బ్రతికియున్న) వానియొక్క శరీరమందుండు క్రియయే చేష్ట యని మృతశరీరక్రియయందు చేష్టాత్వము వారించినను, జీవించినవానియొక్క నేత్రములయందు వాయువుయొక్క నోదన సంయోగమువలనఁగలుగు క్రియఁగూడ చేష్ట కావలసివచ్చును. స్పర్శగల ద్రవ్యాంతరముయొక్క సంయోగమున గలగని క్రియయే చేష్టయని చెప్పెదము. నేత్రస్పంద స్పర్శగల వాయువుయొక్క సంయోగమువలనఁ బుట్టినందున దానికి చేష్టాత్వాపత్తి వారించినను అగ్నియందు, వాయువుయందుండెడు క్రియ స్పర్శగల మఱియొకవస్తువుయొక్క సంయోగమువలనఁ బుట్టనందున ఆక్రియలుగూడ చేష్ట గావలసి వచ్చును.

శరీరమందుండు స్పర్శవద్ద్రవ్యాంతరాప్రయోజ్యమైన క్రియయే చేష్టయని అగ్నియందు, వాయువుయందు నుండు క్రియకు చేష్టాత్వము వారించినను అనవస్థ యనుదోషము వచ్చును. యేలనన? చేష్టచే శరీరమును తెలిసికొనవలెను. శరీరలక్షణమైన చేష్టకు శరీరత్వములోఁ గూడ ప్రవేశముఁ జేసినచో లక్ష్యజ్ఞానము. లక్షణజ్ఞానము నపేక్షించును. లక్షణము లక్ష్యములో ప్రవిష్టమగుటవలన లక్ష్యజ్ఞానము లక్షణజ్ఞానము నపేక్షించును. లక్షణజ్ఞానముద్వారా లక్ష్యజ్ఞానములో లక్ష్యజ్ఞాన మపేక్షితము గాన ఇట్టి అన్యోన్యాశ్రయము సంభవించును.

మూ. సామాన్యవిశేషశ్చేష్టాత్వం, యత ఉన్నీయతే ప్రయత్నపూర్వికేయం క్రియేతి చేన్న. క్రియామాత్రేణైవ తదున్నయనాత్. భోక్తృబుద్ధిమత్పూర్వకత్వం యత ఇతి చేత్, తర్హి శ్రాంతత్వమేవ తస్య న చైతావతైవ క్రియామాత్రం ప్రత్యచేతనమాత్రస్య చేతనాధిష్ఠానేన వ్యాప్తిరపసార్యతే. విశేషస్య విశేషం ప్రతి ప్రయోజకతయా సామాన్యవ్యాప్తిం ప్రత్యవిరోధకత్వాత్. అన్యథా సర్వసామాన్యవ్యాప్తేరుచ్ఛేదాదిత్యుక్తం. ఏతేనాశరీరిత్వాదినా సత్ప్రతిపక్షత్వమపాస్తం, అత్రాప్యాగమసంవాదః.

తా. యేధర్మమువలన క్రియయందు ప్రయత్నపూర్వకత్వ మనుమేయించఁబడునో ఆధర్మమే క్రియాసామాన్య విశేషచేష్టాత్వ మనిచెప్పుటకు వీలులేదు. క్రియాత్వ రూప సామాన్యధర్మముచే ప్రయత్నపూర్వకత్వము సిద్ధించును.

క్రియాత్వసామాన్యముచే ప్రయత్నపూర్వకత్వము సిద్ధించినను నేధర్మముచే భోక్తృబుద్ధిమత్పూర్వకత్వము సిద్ధించునో, ఆధర్మమే చేష్టాత్వ మనినచో యెక్కడెక్కడ చేష్టాత్వమో అక్కడక్కడ భోక్తృమద్బుద్ధి మత్పూర్వకత్వ మను వ్యాప్తి విశేషములకే సంభవించును. ఇట్టి విశేషవ్యాప్తివలన అచేతన క్రియయందుండు క్రియాత్వసామాన్యమునందు చేతనాయోజితత్వవ్యాప్తి పరిహరించఁబడదు.

క్రియావిశేషమైన చేష్టాత్వము భోక్తృబుద్ధిమత్పూర్వకత్వ రూపవిశేషసాధక మగుటచే సామాన్యవ్యాప్తిని గూర్చి విరోధి గానేరదు. విరోధి అయినచో సామాన్యవ్యాప్తికి భంగముఁ గలుగునని పూర్వమందుఁ జెప్పియే యుంటిమి.

ఏయేవిశేషములకు కార్యకారణభావమో బాధకము లేనప్పుడు తత్సామాన్యములకుఁగూడ కార్యకారణభావము సిద్ధించునన్నసంగతి పూర్వమం దనేకస్థలములయందుఁ జెప్పియే యున్నాము.

శరీరేతరక్రియయందు చేష్టాత్వము లేనందున భోక్తృబుద్ధి మత్పూర్వకత్వము యుండకపోయినను క్రియాత్వము యున్నందున పరమాణుక్రియఁగూడ చేతనప్రయత్నప్రయోజ్యమై కార్యారంభకము గాన, పరమాణువులు శరీరేతరములు గాన చేతనాయోజితములై కార్యారంభసమర్థములు గావు అనెడు సత్ప్రతిపక్షానుమానము యాశంకించుటకు వీలులేదు.

పరమాణువులు చేతనాయోజితములై కార్యారంభసమర్థములు గావని జెప్పినచో ఆగమవిరోధముఃగూడ సంభవించును.

మూ. యదా స దేవో జాగర్తి తదేవం చేష్టతే
జగత్, యదా స్వపితి శాంతాత్మా తదా సర్వం
నిమీలతి. అజ్ఞో జంతురనీశోయమాత్మనః సుఖ
దుఃఖయోః. ఈశ్వరప్రేరితో గచ్ఛేత్స్వర్గం వా
శ్వభ్రమేవ వా. మయాధ్యక్షేణ ప్రకృతిః సూ

యతే సచరాచరం, తసామ్యహామహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామిచ. ఇత్యాది. అత్ర జాగర స్వాపౌ సహకారిలాభాలాభౌ ఈశ్వరప్రేరణా యామజ్ఞత్వమప్రయతమానత్వం చ హేతూ దర్శితౌ, పరమాణ్వాదిసాధారణౌ, స్వర్గశ్వభ్రే, చేష్టానిష్ఠోపలక్షణే, ఏతదేవ సర్వాధిష్ఠానముత్త రత్ర విభావ్యతే మయేత్యాదినా.

తా. అధ్యక్షేణ మయా=సర్వాధిష్ఠానమైన నా చేతను, ప్రకృతిః = పరమాణువు, సచరాచరం = చేతనాచేతనములను, సూయతే=పుట్టించునని యర్థము. పరమాణువులు మొదలుగా గలవి అచేతనములు. స్వయముగా ప్రయత్నించుటలో సమర్థ ములు గానందునను, ఈశ్వరప్రేరణ యుండవలసివచ్చును. కాన ఈశ్వరప్రేరణలో అచైతన్యము, అప్రయతమానత్వము. ఈ రెండును హేతువులుగా జెప్పఁబడెను. పరమాణువుల యందు నీరెండుహేతువులు నున్నందున ఈశ్వరప్రేరిత క్రియగలవియై కార్యారంభకము లగుచున్నది. చేతనుఁడైన జీవుఁడు స్వర్గమును పొందుటకుగాని, నరకమును పొందుటకు గాని ఈశ్వరప్రేరణ యుండవలెను. ముందు జెప్పఁబోయె మయా అనేదానివలనఁగూడ ఇట్టిసర్వాధిష్ఠానత్వమే జెప్పఁ బడుచున్నది.

మూ. న కేవలం ప్రేరణాయామహామధిష్ఠాతా, అపి తు ప్రతిరోధేపి, యోహి యత్ర ప్రభవతి స తస్య ప్రేరణావద్ధారణేపి సమర్థః. యథార్వాచీనః

శరీరప్రాణప్రేరణధారణయోరితి దర్శితం తపా మీాంత్యాదినా.

తా. నేను కేవలము ప్రేరణయందే అధిష్ఠాతనుగాను. మరేమన ధారణయందుఁగూడా అధిష్ఠాతను, శరీరప్రాణముల యొక్క ప్రేరణధారణములయందు సమర్థుఁడను నేనే యని, తపామీా అనుటచే జెప్పఁబడ్డది.

మూ. ధృతేః ఖల్వసి, క్షిత్యాదిబ్రహ్మాండపర్యంతం హి జగత్, సాక్షాత్పరంపరయావా విధారకప్రయత్నాధిష్ఠితం, గురుత్వే సత్యపతనధర్మకత్వాత్. వియతివిహంగమశరీరవత్. తత్సంయుక్తద్రవ్యవచ్చ, ఏతేనేంద్రాగ్నియమాదిలోకపాలప్రతిపాదకా అప్యాగమాః వ్యాఖ్యాతాః.

తా. అంతరిక్షమందుండు పక్షియొక్క శరీరమువలెను, అట్టిపక్షిచే ధరించఁబడ్డ కాష్ఠమువలె, పృథివ్యాది బ్రహ్మాండాదిప్రపంచము బరువుగానున్నను, క్రిందుగాపడకుండ యుండుటవలన ఒకానొక మోసేవానియొక్క ప్రయత్నాధిష్ఠితము అనెడు యనుమానముచే బ్రహ్మాండధారి యొకఁడు సిద్ధించును. వాఁడే ఈశ్వరుఁడు. ధారకప్రయత్నాధిష్ఠితత్వము చెప్పినందున దిక్పాలకాదులను బోధించు వేదముఁగూడ ముఖ్యార్థపరముగా వ్యాఖ్యానముఁ జేయఁబడెను.

మూ. సర్వావేశనిబంధనశ్చ సర్వతాదాత్మ్యవ్యవహారః. ఆత్మైవేదం సర్వమితి. యథా ఏకఏవ మాయావీ, అశ్వో వరాహో, వ్యాఘ్రో వా నరః, కిన్నరో భిక్షుస్తాపసో విప్ర ఇత్యాది.

తా. ఇంద్రాదులను బోధించెడు వేదమునకు ముఖ్యార్థపరత్వముఁ జెప్పినచో అభేదమును బోధించు వేదము అప్రామాణికము కావలసివచ్చునే? సర్వతాదాత్మ్యవ్యవహారమనఁగా జ్ఞానాదులతో గూడుకొనిన ఆత్మయొక్క సంయోగమే ఆత్మే వేదం సర్వమనెడుశ్రుతికి ఇదియే అభిప్రాయము.

ఒకమాయావి గుఱ్ఱముగాను, పందిగాను, పెద్దపులిగాను, మనుష్యుఁడుగాను, కిన్నరుఁడుగాను, సన్యాసిగాను, తపమునుజేయు బ్రాహ్మణుఁడుగాను నెట్లగునో ఒకయాత్మయే ఇంద్ర, అగ్ని, యమాదిరూపుఁడు గావచ్చును.

మూ. అదృష్టాదేవ తదుపపత్తేరన్యథాసిద్ధమిదమితి చేత్. తద్భావేపి ప్రయత్నాన్వయవ్యతిరేకానువిధానేన తస్యాపి స్థితిం ప్రతి కారణత్వాత్. కారణైకదేశస్య చ కారణాంతరం ప్రత్యనుపాధిత్వాత్. ఉపాధిత్వేవా సర్వేషామకారణత్వ ప్రసంగాత్.

తా. అదృష్టవశమువలననే ధృతి యుపపన్న మగుచుండఁగా ప్రయత్నము అన్యథా సిద్ధమని యాశంకింపవలదు. అదృష్టమున్నను ప్రయత్నాన్వయవ్యతిరేకము లున్నందున స్థితిలో ప్రయత్నమునకుఁగూడ కారణత్వముఁ జెప్పెదము. అదృష్టముఁ గూడ యొక కారణము. ఇది యున్నంతమాత్రమున మరియొకటి గూడ కారణముఁ గాకపోదు. అట్లైనచో సర్వకారణములకు నుచ్ఛేదము సంభవించును. అనఁగా మరేమియు కారణములే గాకపోవలసివచ్చును.

మూ. శరీరస్థితిరేవం, న త్వన్యస్థితిరితి చేన్న. ప్రాణేంద్రియయోస్థ్సితేరవ్యాపనాత్. ప్రాజ్ఞాన్వాయే నాహస్తత్వాచ్చ, అత్రాప్యాగమః, ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి ద్యావాపృథివ్యౌ విధృతే తిష్ఠతః. ఇతి ప్రశాసనం, దండభూతః ప్రయత్నః.

తా. స్థితియనఁగా, పతన ప్రతిబంధకసంయోగమే గదా. ఇట్టి స్థితినిగూర్చి ప్రయత్నము కారణమని జెప్పఁబడెను. శరీరస్థితిలో యత్నము కారణమైనను ఇతరమైనవానియొక్క స్థితిలో ప్రయత్నము కారణము గాదని యాశంకింపరాదు. ప్రాణములయొక్కయు, ఇంద్రియములయొక్కయు స్థితియందు అవ్యాప్తము, విశేషశ్చ, విశేషవానితిన్యాయేన. ఈవిషయములో వేదప్రమాణముఁగూడ చూపించఁబడెను.

మూ. ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః, యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః, ఇతి స్మృతిః. అత్రోత్తమత్వానుసంసారిత్వం సర్వజ్ఞత్వాది చ, పరమత్వం సర్వోపాస్యతా లోకత్రయమితి సర్వోపలక్షణం, ఆవేశః, జ్ఞానచికీర్షాప్రయత్నవతో సంయోగః. భరణం, ధారణం, అవ్యయత్వం,ఆగంతుకవిశేషగుణశూన్యత్వం,ఐశ్వర్యం, సంకల్పాప్రతిఘాతః, ఇతి ఏతేన కూర్మాదివిషయా అప్యాగమాః వ్యాఖ్యాతాః.

తా. పై స్మృతికి మూలకారుఁడే స్పష్టముగా వ్రాసినాఁడు గాన విరమించడమైనది.

మూ. సంహారణాత్ఖల్వపి, బ్రహ్మాండాదిద్వ్యణుకపర్యంతం జగత్. ప్రయత్నవద్వినాశ్యం, వినాశ్యత్వాత్. పాట్యమానపటవత్, అత్రాప్యాగమః.

ఏష సర్వాణి భూతాని సమభివ్యాప్య మూర్తిభిః
జన్మవృద్ధిక్షయైర్నిత్యం సంభ్రామయతి చక్రవత్,
సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికీం
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహం.

ఇత్యాది ఏతేన రౌద్రమంశం ప్రతిపాదయంతోప్యాగమా వ్యాఖ్యాతాః.

తా. బ్రహ్మాండాది ద్వ్యణుకపర్యంతమైన జగత్తుయొక్క నాశము ప్రయత్నముగల పరమేశ్వరునివలననే గలుగునని అనుమానమువలనను, ఆగమమువలనను బోధించఁబడుచున్నది. ఈ యాగమముచే ఈశ్వరునికి రుద్రాంశత్వము బోధితమగుచున్నది.

మూ. పదాత్ఖల్వపి.

శ్లో. కార్యత్వాన్నిరుపాధిత్వమేవం ధృతివినాశయోః
విచ్ఛేదేన పదస్యాపి ప్రత్యయాదేశ్చ పూర్వవత్. ౫

తా. ధృతివినాశములు, కార్యత్వాత్. అన్వయవ్యతిరేకములచే ప్రయత్నకార్య మగుటవలన తత్తత్పక్షకాను

మానములకు యెట్టుల నిరుపాధిత్వమో, పదపక్షకానుమాన మునకు ప్రత్యయ పక్షకానుమానమునకు అటులనే నిరుపాధిత్వము. ప్రళయకాలమున పదములు నశించును గాన పదములు అనాదియనుటకు వీలులేదు. కార్యము గాన నిరుపాధిత్వము వీనియందుఁగూడ సంభవించునని యాశయము.

మూ. పదశబ్దేనాత్ర పద్యతే, గమ్యతే, వ్యవహారాంగమర్థో అనేనేతి వృద్ధవ్యవహారప్రవాహోచ్యతే, అతో పీశ్వరసిద్ధిః. తథా హి, యదేతత్ పటాదినిర్మాణనైపుణ్యం, కువిందాదీనాం వాగ్వ్యవహారశ్చ, వ్యక్తవాచాం, లిపితత్క్రియవ్యవహారశ్చ బాలానాం, స సర్వః స్వతంత్రపురుషవిశ్రాంతః. వ్యవహారత్వాత్. నిపుణతరశిల్పినిర్మితాపూర్వ ఘటఘటనానైపుణ్యవత్. చైత్రమైత్రాదిపదవత్. పత్రాక్షరవత్. పాణినీయవర్ణనిర్దేశక్రమవచ్చేతి.

తా. వ్యక్తవాచః, మనుషులు, సాధ్యక్రమము ననుసరించి దృష్టాంతక్రమముఁ జెప్పఁబడ్డది.

మూ. ఆదిమాన్వ్యవహార ఏవం, అయంత్వనాదిరన్యథాపి భవిష్యతీతి చేన్న. తదసిద్ధేః, ఆదిమత్త్వామేవ సాధయితుమయముపక్రాంతః, న చైవం సంసారస్యానాదిత్వభంగప్రసంగః, తథాపి తస్యావిరోధాత్. న హి చైత్రాదివ్యవహారో అయమాదిమానితి భవస్యాప్యనాదిత్వంనాస్తి. తదనాదిత్వేవా నచైత్రాదిపదవ్యవహారోప్యాదిమానితి అస్తి అర్వాగ్దర్శీ కశ్చిదేవాత్ర మూల

తా. పై స్మృతికి మూలకారుఁడే స్పష్టముగా వ్రాసినాఁడు గాన విరమించడమైనది.

**మూ.** సంహారణాత్ఫల్పపి, బ్రహ్మాండాదిద్వ్యణుకపర్యంతం జగత్. ప్రయత్నవద్వినాశ్యం, వినాశ్యత్వాత్. పాట్యమానపటవత్, అత్రాప్యాగమః.

ఏష సర్వాణి భూతాని సమభివ్యాప్య మూర్తిభిః
జన్మవృద్ధిక్షయైర్నిత్యం సంభ్రామయతి చక్రవత్,
సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికీం
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహం.

ఇత్యాది ఏతేన రౌద్రమంశం ప్రతిపాదయంతో ప్యాగమా వ్యాఖ్యాతాః.

తా. బ్రహ్మాండాది ద్వ్యణుకపర్యంతమైన జగత్తు యొక్క నాశము ప్రయత్నముగల పరమేశ్వరునివలననే గలుగునని అనుమానమువలనను, ఆగమమువలనను బోధించఁబడుచున్నది. ఈ యాగమముచే ఈశ్వరునికి రుద్రాంశత్వము బోధితమగుచున్నది.

**మూ.** పచాత్ఫల్వపి.

**శ్లో.** కార్యత్వాన్నిరుపాధిత్వమేవం ధృతివినాశయోః
విచ్ఛేదేన పదస్యాపి ప్రత్యయాదేశ్చ పూర్వవత్. ౫

తా. ధృతివినాశములు, కార్యత్వాత్. అన్వయవ్యతిరేకములచే ప్రయత్నకార్య మగుటవలన తత్తత్పక్షకాను

మానములకు యెట్టుల నిరుపాధిత్వమో, పదపక్షకానుమాన మునకు ప్రత్యయ పక్షకానుమానమునకు అటులనే నిరుపాధిత్వము. ప్రళయకాలమున పదములు నశించును గాన పదములు అనాదియనుటకు వీలులేదు. కార్యము గాన నిరుపాధిత్వము వీనియందుఁగూడ సంభవించునని యాశయము.

మూ. పదశబ్దేనాత్ర పద్యతే, గమ్యతే, వ్యవహారాంగమర్థో అనేనేతి వృద్ధవ్యవహారఏవోచ్యతే, అతో పీశ్వరసిద్ధిః. తథా హి, యదేతత్ పటాదినిర్మాణనైపుణ్యం, కువిందాదీనాం వాగ్వ్యవహారశ్చ, వ్యక్తవాచాం, లిపితత్క్రమవ్యవహారశ్చ బాలానాం, స సర్వః స్వతంత్రపురుషవిశ్రాంతః. వ్యవహారత్వాత్. నిపుణతరశిల్పినిర్మితాపూర్వఘటఘటనానైపుణ్యవత్. చైత్రమైత్రాదిపదవత్. పత్త్రాక్షరవత్. పాణినీయవర్ణనిర్దేశక్రమవచ్చేతి.

తా. వ్యక్తవాచః, మనుష్యులు, సాధ్యక్రమము ననుసరించి దృష్టాంతక్రమముఁ జెప్పఁబడ్డది.

మూ. ఆదిమాన్వ్యవహార ఏవం, అయంత్వనాదిరన్యథాపి భవిష్యతీతి చేన్న. తదసిద్ధేః, ఆదిమత్త్వమేవ సాధయితుమయముపక్రాంతః, న చైవం సంసారస్యానాదిత్వభంగప్రసంగః, తథా పి తస్యావిరోధాత్. న హి చైత్రాదివ్యవహారో అయమాదిమానితి భవస్యాప్యనాదిత్వం నాస్తి. తదనాదిత్వేవా నచైత్రాదిపదవ్యవహారోప్యాదిమానితి అస్తి అర్వాగ్దర్శీ కశ్చిదేవాత్ర మూల

మితి చేన్న. తేనాశక్యత్వాత్. కల్పాదావా దర్శాభాసస్యాప్యసిద్ధేః, సాధితౌ చ సర్గ ప్రలయౌ

తా. సాదియైనవ్యవహారమే స్వతంత్ర పురుషవిశ్రాంతము. కువిందాదులయొక్కయు, మనుష్యులయొక్కయు, బాలులయొక్కయు వ్యవహారములు అనాది గావు. గాన స్వతంత్రపురుషుఁడు లేకపోయినను ఉపపన్నమగునని యాశంకింపరాదు. వ్యవహారములకు ఆదిమత్వమును సాధించునిమిత్తమే యీ యుపక్రమము.

వ్యవహారము సాది యైనంతమాత్రమున, సంసారమునకనాదిత్వ భంగప్రసంగము లేదు. పూర్వపూర్వసర్గములయందు ఏతత్సర్గీయ వ్యవహార సజాతీయమైన వ్యవహారమీశ్వరపూర్వక మగుటవలన అనాదిత్వమునకు విరోధము లేదు. చైత్రాదివ్యవహారము సాదిగదా యని. సంసారమునకనాదిత్వము లేదని చెప్పుటకు వీలులేదు. ఇటులనే సంసారమనాదియని చైత్రాదివ్యవహారము సాది కాకపోనేరదు.

పూర్వమందుండు వ్యవహారమును జూచి కల్పాదియందు యిట్టివ్యవహారమును యొకఁడు కల్పించెనని చెప్పుటకు సృష్టిప్రళయములు సాధించఁబడినందున, అట్టివాఁడు ఈశ్వరుఁడు గాక మరియొకఁడు లేదు.

మూ. నను వ్యవహారయిత్రువృద్ధః శరీరీ సమధిగతః న చేశ్వరస్తథా, తత్కథమేవం స్యాత్. న, శరీరాన్వయవ్యతిరేకానువిధాయిని కార్యే తస్యాపి

తద్వత్త్వాత్. గృహ్ణాతీహీశ్వరోపి కార్యవశా
చ్ఛరీరమంతరాంతరా దర్శయతి చ విభూతిమితి.

తా లోకములో శరీరమును ధరించినవాఁడే వ్యవ
హారకర్తగా గానవచ్చుచున్నాఁడు. ఈశ్వరునికి శరీరము లేన
ప్పుడు వ్యవహారకర్తృత్వ మెటుల సంభవించును?

ఎట్టికార్యము శరీరమున్నప్పుడు నిర్వహించునో, లేనిచో
నిర్వహించదో అట్టికార్యమును జేయునిమిత్త మీశ్వరుఁడు
గూడ శరీరమును ధరించును. కార్యవశమున అప్పుడప్పుడు
తనయొక్క విభూతిని జూపించునిమిత్త మీశ్వరుఁడుగూడ
శరీరమును ధరించును.

ఈశ్వరున కదృష్టము లేనందున శరీర మెటుల యుండు
ననఁగా మనకుఁగలిగెడు భోగసంపాదకమైన యదృష్టమువల
ననే ఈశ్వరుఁడు శరీరమును ధరించును. కొన్నిసమయముల
యందు మనకు భోగసంపాదకమైన యదృష్టమున్నను ఈశ్వర
శరీర సాధ్యమైనకర్మ యున్నపుడే మనకు భోగముఁగలుగును.
కాన ఈశ్వరశరీరసాధ్యమైన అస్మదాదిభోగ సంపాదకమైన
యదృష్టమువలన నీశ్వరుఁడు అప్పుడప్పుడు శరీరములను
స్వీకరించును.

మూ. అత్రాప్యాగమః.

శ్లో. పితాహమస్య జగతో మాతా ధాతా పితామహః,

తథా

యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః.

**మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః,**
**ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహం. ఇతి.**

ఏతేన నమః కులాలేభ్యః, కర్మారేభ్య ఇత్యాదియజూంషి బోద్ధవ్యాని.

తా. వేదమందు, స్మృతులయందుఁగూడ ఈశ్వరుఁడు శరీరమును ధరించినట్టు గానవచ్చుచున్నందున ఆయాయిసమయములయం దీశ్వరుఁడు లోకసంరక్షణకొరకు శరీరమును గూడ ధరించును, గాని శరీరి యైనవానికి వ్యవహారకర్తృత్వముఁ జెప్పినను అట్టివాఁ డీశ్వరుఁడేగాని మరియొకఁడు గాడని తాత్పర్యము.

మూ. ప్రత్యయోపి, ప్రత్యయశబ్దేనాత్ర సమాశ్వాసవిషయప్రామాణ్యముచ్యతే, తథా చ ప్రయోగః ఆగమసంప్రదాయోయం, కారణగుణపూర్వకః, ప్రమాణత్వాత్ ప్రత్యక్షాదివత్. న హి ప్రామాణ్యప్రత్యయం వినా క్వచిత్సమాశ్వాః న చాసిద్ధస్య ప్రామాణ్యస్య ప్రతీతిః, న చ స్వతః ప్రామాణ్యమిత్యావేదితం న చ నేదం ప్రమాణం, మహాజనపరిగ్రహాదిత్యుక్తం, న చాసర్వజ్ఞః ధర్మాధర్మయోస్స్వతంత్రేణ ప్రభవతి. న చాసర్వజ్ఞస్య గుణవత్తేతి నిశ్శంకమేతత్.

తా. ప్రత్యయశబ్దమునకు, శక్యమగు సమాశ్వాసముకంటె వేరగు తద్విషయప్రామాణ్య మర్థము. అనఁగా వేద

వాక్యమువలనఁ గలుగు యథార్థజ్ఞానము ఇట్టిలకూార్థమే ప్రత్యయపదముచే వివక్షితము. ప్రత్యక్షాదులు. అనఁగా ఇంద్రియమువలన గల్గుజ్ఞానములు ప్రమాణములై యెటుల కారణ గుణపూర్వకములో, యీ ఆగమప్రవాహముఁగూడ ప్రమాణము గాన, కారణ గుణపూర్వకమను యనుమానముచే కారణమైన ఈశ్వరుఁడు సిద్ధించును.

యీ అనుమానములో, అదృష్టాది రూపకారణగుణమునుబట్టి యర్థాంతరత్వము వచ్చును. అనఁగా అనభిమతార్థసిద్ధియనుదోష మొకటి. ప్రమాణమైన మనస్సునందు సాధ్యము లేనందున వ్యభిచారరూపదోషమున్ను సంభవించును గాన ప్రమాత్వప్రయోజక వాక్యార్థ ప్రమారూపగుణజన్యః అనునదియే సాధ్యము. మూలమందుండు కారణగుణపూర్వకః అనుదానికిదియే యర్థము. మరియొకరీతిగాఁగూడ యనుమానముండవచ్చును. ప్రమాణశబ్దత్వమును హేతువుగా జేసి, యథార్థచిఖ్యాపయిషాది వక్తృగుణజన్యత్వమునుగూడ సాధ్యముగా జేయవచ్చును. దీనివలన వేదకర్త యగు ఈశ్వరుఁడు సిద్ధించును.

ప్రామాణ్యప్రత్యయము లేనిచో దేనియందు సమాశ్వాసము సంభవించదు. అసిద్ధప్రామాణ్యముఁ గలదానివలన ప్రత్యయమే సంభవించదు. ఆగమసంప్రదాయమునకు స్వతః ప్రామాణ్యము లేదని వెనుకఁ జెప్పియేయున్నాము. మహాజనులచే స్వీకరించినటులనే దీనికి ప్రామాణ్యము యుండును. అసర్వజ్ఞునకు ధర్మాధర్మములను గనిపెట్టెడిసామర్థ్య ముండదు. అసర్వజ్ఞునకు ప్రామాణ్యగ్రాహక మైనగుణ ముండ నేరదు.

గాని ఇట్టి గుణమున కాశ్రయుఁడు సర్వజ్ఞుఁడని జెప్పవలెను. వాఁడే ఈశ్వరుఁడు.

మూ. శ్రుతేః ఖల్వపి, తథాహి, సర్వజ్ఞప్రణీతాః-
వేదాః వేదత్వాత్. యత్పునర్న సర్వజ్ఞప్రణీ
తం. నాసౌ వేదః, యథేతరవాక్యం, నను కిమి
దం వేదత్వం నామ? వాక్యత్వస్యాదృష్టవిష
యవాక్యత్వస్య చ విరుద్ధత్వాత్. అదృష్టవిష
యప్రమాణవాక్యత్వస్య చాసిద్ధేః. మన్వాది
వాక్యే గతత్వేన విరోధాచ్ఛ్రుతి చేన్న

తా. శ్రుతియనఁగా వేదము. వేదములన్నియు సర్వజ్ఞునిచే జెప్పఁబడ్డవి. యేవాక్యములు అస్మదాదులచే ఉచ్చరించఁబడినవాక్యములు సర్వజ్ఞప్రణీతములు గావో అవియన్నియు వేదములు గానేరదు.

సర్వజ్ఞుని యంగీకరించని పరునిఁగూర్చి యీయనుమాన మసిద్ధము గాదా? వాని మతమందుఁగూడా సంసారి యసంసారి యని రెండువిధము లుండుటవలన ఆత్మత్వ మసంసారి వృత్తి-జాతిత్వాత్. పటత్వవత్. అను యనుమానముచే అసంసారి సిద్ధించును. ఈఅనుమానముచే సిద్ధించిన యసంసారిని పక్షముగా జేసి, వాఁడు పురుషుఁడు గాన, వాక్యప్రణేతాయను యనుమానముచే వాక్యప్రణేతయగు యసంసార్యాత్మ సిద్ధించునుగాన అట్టివాఁడే మామతమం దీశ్వరుఁడు వానినే సాధించెదము. సాధ్యము ఉభయమతసిద్ధ మగుటవలన సాధ్యాప్రసిద్ధిని యాశంకించుటకు వీలులేదని ప్రకాశకారునియాశయము.

వేదత్వ మననేమి ? కేవల వాక్యత్వమా, అదృష్టార్థ బోధక వాక్యత్వరూపమా? కేవలవాక్యత్వము అసర్వజ్ఞప్రణీతమైన అస్మదాదివాక్యమందుఁగూడ యున్నందున వ్యభిచారి యగును. ప్రతారకవాక్యమందుఁగూడ నదృష్టార్థకత్వ ముండుటవలన విరుద్ధమగును.

అదృష్టార్థకప్రమాణశబ్దత్వ మనినచో మన్వాదివాక్యములుగూడ అదృష్టార్థకమై ప్రమాణమైనందున విరోధరూపదోషదూషిత మగును. సర్వజ్ఞుఁడే సిద్ధించనిచో వేదములకు ప్రామాణ్యసిద్ధి గానందున హేతువ యసిద్ధమగును. గాన వేదత్వము యేమి యనుటకు వీలులేదని యాశంకింపరాదు.

మూ. అనుపలభ్యమానమూలాంతరత్వే సతి మహాజన
పరిగృహీతవాక్యత్వస్య తత్వాత్. న హ్యస్మదా
దీనాం ప్రత్యక్షాదిమూలం,నాపి భ్రమవిప్రలమ్భౌ,
మహాజనపరిగ్రహాదిత్యుక్తం, నాపి పరంపరైవ
మూలం, మహాప్రళయవిచ్ఛేదాదిత్యుక్తం.

తా. మన్వాదిస్మృతులు అదృష్టార్థకప్రమాణము లైనను, వాట్లకు వేదమూలకత్వ ముపలభ్యమాన మగుటవలన అనుపలభ్యమాన మూలాంతరత్వరూప హేతువ లేనందున విరోధప్రసక్తి లేదు. వేదములో అస్మదాదులయొక్క ప్రత్యక్షాదులు మూలముగాదు గాన సత్యంతముండును. మహాజనులచే పరిగ్రహించఁబడుటవలన, భ్రమగాని, విప్రలప్సగాని మూలమనుటకు వీలులేదు. మహాప్రళయమందు విచ్ఛేదముండుటవలన అధ్యాపకపరంపరయే మూలమనుటకూడ

సంభవించదు. అనుపలభ్యమాన మూలాంతరము గలదియై మహాజనపరిగృహీతమైనందున వేదము సర్వజ్ఞప్రణీత మగును.

మూ. అన్వయతోపి వా, వేదవాక్యాని—పౌరుషే
యాణి—వాక్యత్వాత్. అస్మదాదివాక్యవత్.
అస్మర్యమాణకర్తృకత్వాన్నైవమితి చేన్న.
అసిద్ధేః.

శ్లో. అనంతరం చ వక్త్రేభ్యో వేదాస్తస్య వినిస్సృతాః,
ప్రతిమన్వంతరం చైషా శ్రుతిరన్యా విధీయతే.

తా. అస్మదాదివాక్యము లెటుల పౌరుషేయములో వేదములుగూడ అటులనే పౌరుషేయములు. అస్మదాదివాక్యములు సజాతీయోచ్చారణాధీనోచ్చారణ గలవి. వేదోచ్చారణ కర్తయొక్క ఉచ్చారణ మరియొకనియొక్క ఉచ్చారణాధీనము గాదు. ఈశ్వరునికంటె మఱియొకఁడు సృష్ట్యాదియందు వేదోచ్చారణఁ జేయువాఁడు లేడు. గాన సజాతీయోచ్చారణానధీనోచ్చారయితృత్వము పౌరుషేయత్వము. ఇట్టి ఉచ్చారయిత ఈశ్వరుఁడని యాశయము.

వేదకర్తగా స్మరించఁబడనందున వేద మపౌరుషేయ మనుటకు వీలులేదు. వేదములు బ్రహ్మయొక్క ముఖముల వలన ఉచ్చరించఁబడినట్లు స్మృతి యున్నందున అపౌరుషేయత్వ మసిద్ధమగును.

మూ. వేదాంతకృద్వేదవిదేవ చాహం. ఇతి స్మృతేః.
తస్మాద్యజ్ఞాత్సర్వహుత ఋచస్సామాని జజ్ఞిరే
ఇత్యాది శ్రుతిపాఠకస్మృతేశ్చ.

తా. వేదమందుఁగూడ కర్తయొక్క స్మరణయున్నందున వేదము పౌరుషేయము గావచ్చును.

మూ. అర్థవాదమాత్రమిదమితి చేత్. న. కర్తృస్మరణస్య సర్వత్రావిధ్యర్థత్వాత్. తథా బాస్మరణే కాళిదాసాదేరస్మరణాత్. ఏవం చ కుమారసంభవాదేరకర్తృకత్వప్రసంగః. అనైకాంతికత్వం వా హేతోః.

తా. కార్యాన్వితస్వార్థమందు పదములకు శక్తిగాన అర్థవాదవాక్యములయందు కార్యత్వాదులను శక్తిచే బోధించెడుపదములు లేనందున కర్తృస్మరణవిషయములో అర్థవాదవాక్య మప్రమాణమని యాశంకింపరాదు. శ్రు. ఆదిత్యో వై యూపః, యను యర్థవాద ముఖ్యార్థపరమైనచో బాధ సంభవించును గాన యప్రమాణము గావలసివచ్చును. గాన అవిధ్యర్థమునకుఁగూడా ముఖ్యార్థత్వము చెప్పవలెను. ప్రకృతమున కర్తృస్మరణ అవిధ్యర్థము గాకపోయినను ముఖ్యార్థము గాన ప్రమాణమని జెప్పవలెను. కర్తృస్మరణము విధ్యర్థము గానిచో, పౌరుషేయత్వ మలంకరించనిచో, కాళిదాసాదులు విధ్యర్థము గానందున కుమారసంభవాదుల కకుర్తృకత్వము రావలసివచ్చును. అది ఇష్టము గాదు. కర్త అవిధ్యర్థమగుటవలన అపౌరుషేయత్వమే జెప్పినచో వ్యభిచారము ప్రసక్తమగును. గాన కర్త అవిధ్యర్థ మైనంతమాత్రమున అపౌరుషేయ మనరాదు.

మూ. ప్రమాణాంతరాగోచరార్థత్వాత్సత్ప్రతిపక్షత్వమితి చేత్. న. ప్రణేతారం ప్రత్యసిద్ధేః, అన్యం

ప్రత్యనైకాంతికత్వాత్. ఆకస్మికస్మితబీజసుఖానుస్మృతేః కారణవిశేషస్యాన్యం ప్రతి ప్రమాణాంతరాగోచరస్యాపి తేనైవ వక్త్రా ప్రతిపాద్యమానత్వాత్.

తా. వేదములు ప్రమాణాంతరాగోచరమైన యర్థకములగుటవలన పౌరుషేయములు గావను ప్రత్యనుమానము వలన ప్రకృతానుమానము సత్ప్రతిపక్షితమని యాశంకింపరాదు. వేదప్రణేత యగువానియొక్క ప్రమాణాంతరాగోచరత్వము హేతువా, లేక మరియొకవానియొక్క ప్రమాణాంతరా గోచరత్వమా ?

౧. పక్షమున వేదప్రణీత యగు ఈశ్వరునియొక్క ప్రమాణాంతరమగు ప్రత్యక్షగోచరార్థకత్వముండును గాన హేతువసిద్ధము.

౨. పక్షమున దృష్టకారణములు లేకనే సుఖానుస్మృతిరూపకారణమువలనఁ గలుగుచిరునవ్వు మరియొకవానియొక్క ప్రమాణాంతరగోచరము గానందున, అట్టిచిరునవ్వు వక్తచే చాయఁబడినందున, వ్యభిచారము ప్రసక్తమగును. గాన యీసత్ప్రతిపక్షానుమానము దోషదూషిత మగుటవలన దీనిచే ప్రకృతానుమానము దుష్టమని జెప్పుటకు వీలులేదు.

మూ. వక్త్రైవ ప్రకృతే న సంభవతి. హేత్వభావే ఫలాభావాత్. చక్షురాదీనాం తత్రాసామర్థ్యాత్. అస్మదాదీంద్రియవత్. మనసో బహిరస్వాతంత్ర్యాత్. న, చేతనస్య జ్ఞానస్యేంద్రియస్య,

మనసో వా పక్షీకరణే ఆశ్రయాసిద్ధేః ప్రాగేవ ప్రపంచనాత్. నిత్యనిరాకరణే చాసామర్థ్యాత్.

తా. సర్వజ్ఞుఁడైన వేదకర్త. వాక్యార్థ గోచరయథార్థ జ్ఞానసామగ్రి లేనివాఁ డగుటవలన సంభావనాస్పదుఁడే గాఁడు. 'హేత్వభావే ఫలాభావాత్' ఈశ్వరుఁడుగూడ పురుషుఁడగుటవలన అస్మదాదులవలె అతీంద్రియార్థదర్శి గాఁడు. అస్మదాది జ్ఞానమువలె ఈశ్వరజ్ఞానముఁగూడ అతీంద్రియార్థగోచరము గాదు. అస్మదాదీంద్రియములవలెను, మనస్సువలెను, ఈశ్వరునియొక్క ఇంద్రియములు, మనస్సుగూడ, అతీంద్రియార్థ గ్రాహకులు గావు. యను యనుమానములు ఈశ్వరరూపాశ్రయము సిద్ధించనందున సరియైనవి గావు. సామగ్రి లేనందున కార్యజ్ఞానము లేకపోయినను నిత్యజ్ఞాన ముండును. దానిని నిరాకరించుటకు వీలులేదు.

మూ. పరమాణ్వాదయో,న కస్యచిత్ప్రత్యక్షాః. తత్సామగ్రీరహితత్వాదితి చేత్. న, ద్రష్టారం ప్రత్యసిద్ధేః. అన్యం ప్రతి సిద్ధసాధనాత్.

తా. ప్రత్యక్షసామగ్రి లేనందున పరమాణ్వాదికము ప్రత్యక్షవిషయము గాదను ననుమానము. పరమాణ్వాది రూపాతీంద్రియదర్శియగు ఈశ్వరునియందు ప్రత్యక్షసామగ్రి యున్నందున ప్రత్యక్షసామగ్రీ రహితత్వాదను హేతువసిద్ధము. మరియొకనియొక్క ప్రత్యక్షవిషయత్వాభావము పరమాణువులయందు సిద్ధము గాన సిద్ధసాధనము ప్రసక్తమగును. గాన పై యనుమానము సరిగాదు.

మూ. తథాపి వాక్యత్వం న ప్రమాణం, అప్రయోజకత్వాత్. ప్రమాణాంతరగోచరార్థత్వప్రయుక్తం తత్ర పౌరుషేయత్వం, న తు వాక్యత్వప్రయుక్తం. న. సుగతాద్యాగమానామపౌరుషేయత్వప్రసంగాత్. ప్రమాణవాక్యస్యాసత ఇతి చేత్. న. ప్రణేతృప్రమాణాంతరగోచరార్థత్వస్య సాధ్యానుప్రవేశాత్. స్వతంత్రపురుషప్రణీతత్వం హి పౌరుషేయత్వం, అర్థప్రతీత్యేకవిషయా హి వివక్షా ప్రయత్నే స్వాతంత్ర్యం, మన్వాదివాక్యస్యాపౌరుషేయత్వప్రసంగాచ్చ, తదర్థస్య శబ్దేతరప్రమాణాగోచరత్వాత్. ప్రయుజ్యమానవాక్యేతరగోచరార్థత్వమాత్రమితి చేత్. న. తస్య వేదేపి సత్వాత్. ఏకస్యాప్యర్థస్య శాఖాభేదేన బహుభిర్వాక్యైః ప్రతిపాదనాత్. అస్త్వేవం, న తు తేషాం మూలమూలీభావ ఇతి చేత్. న. ఉక్తోత్తరత్వాత్.

తా. వేదాః, పౌరుషేయాః, వాక్యత్వాత్. అను యనుమానము సరిగాదు. దేనిప్రయుక్తము సాధ్యమో అక్కడ అది యుపాధి యగును. ధూమము, ఆర్ద్రేంధనప్రయుక్తము గాన ధూమము సాధ్యముఁ జేసినవహ్ని యెటుల యప్రయోజకమో, అట్లె ప్రకృతానుమానములో ప్రమా

ణాంతర గోచరార్థత్వ ప్రయుక్తము పౌరుషేయత్వ రూపసాధ్య ముగాన ప్రమాణాంతరగోచరార్థత్వ ముపాధి. ఇట్టియుపాధితో గూడుకున్నందున ప్రకృత హేతువ ప్రయోజకమని యాశంకింపరాదు. సుగతాద్యాగములు పౌరుషేయములు. వానియందు ప్రమాణాంతరగోచరార్థత్వరూపప్రయోజకము లేనందున అవి యపౌరుషేయములు గావలసివచ్చును. కాన అది యుపాధి గాదు. సాధ్యవ్యాపకత్వము సంభవించదని తాత్పర్యము. ప్రమాణవాక్యత్వము ప్రత్యక్షధర్మము. దీనితో గలసిన పౌరుషేయత్వసాధ్యము సుగతాద్యాగములయందు లేదు. మన్వాది స్మృతులయందే యుండును గాన ప్రమాణాంతరార్థ గోచరత్వమునకు సాధ్యవ్యాపకత్వమున్ను పక్షాంతర్భావేన సాధనావ్యాపకత్వమున్ను యున్నందున సోపాధిక మనినచో, ప్రణేత యొక్క ప్రమాణాంతరార్థ గోచరత్వమునకు సాధ్యకోటిలో ప్రవేశముఁ జేసినచో, అదియే యుపాధి గాన భిన్నములైన వాట్లకే వ్యాప్యవ్యాపకభావము. గాని, అభిన్నమైనవానికి నుండనందున దానికి యుపాధిత్వము సంభవించదు.

స్వతంత్ర పురుషప్రణీతత్వరూపమగు పౌరుషేయత్వమే సాధ్యమైనచో, అప్పుడు నుపాధి సంభవించదు. ప్రమాణాంతరగోచరార్థత్వ మనఁగా, శబ్ద తదుపజీవి ప్రమాణములకంటె అతిరిక్తప్రమాణ గోచరార్థత్వ రూపమైనచో మన్వాదిస్మృత్యర్థము, వేదరూప శబ్దప్రమాణగోచరమే గాని తదితరప్రమాణగోచరము గాదు. శబ్దతదుపజీవి ప్రమాణేతర ప్రమాణగోచరార్థత్వము మన్వాదిస్మృతులయందు లేనందున అవి యపౌ

రుషేయములు గావలసివచ్చును. అనఁగా సాధ్యవ్యాపకత్వము సంభవించదు.

లేక తనచే ప్రయోగించువాక్యముకంటె ఇతరమైన ప్రమాణగోచరార్థత్వ ముపాధియనుచో ఇది వేదమందుఁగూడ లేనందున వేదముఁగూడ యపౌరుషేయము కావలసివచ్చును.

మూలభూతమానాంతరగోచరార్థత్వ మనినచో, మూల భూతమనఁగా ప్రణేతయొక్కయా, మరియొకనియొక్కయా, ప్రణేత యైనచో సిద్ధసాధనము. మరియొకనిదైనచో వ్యభిచారము వచ్చునని పూర్వమందుఁ జెప్పినటుల ఇక్కడగూడ సంభవించును. అప్రయోజకము గానందున వాక్యత్వరూపహేతువుచే వేదమందు పౌరుషేయత్వము సిద్ధించును. ఆపురుషుఁడే ?రుఁడు.

మూ. సంఖ్యావిశేషాత్ఖల్వపి. ద్వ్యణుకత్ర్యణుకే తావత్. పరిమాణవతీ, ద్రవ్యత్వాత్. తచ్చ పరిమాణం కార్యం కార్యగుణత్వాత్. న చ తస్య పరమాణుపరిమాణం ద్వ్యణుకపరిమాణం వా కారణం. నిత్యపరిమాణత్వాత్, అణుపరిమాణత్వాచ్చ. అన్యథా అనాశ్రయకార్యోత్పత్తిప్రసంగాత్. ద్వ్యణుకస్య మహత్త్వప్రసంగాచ్చ, త్ర్యణుకవదన్యారభ్యత్వాఽవిశేషాత్.

తా పరమాణు ద్వ్యణుకములయందుండు పరిమాణకారణంబైన సంఖ్యవలనఁగూడ నీశ్వరుఁడు సిద్ధించఁగలఁడు. ద్వ్యణుకత్ర్యణుకములు ద్రవ్యము లగుటవలన పరిమాణముగలవి. వానియొక్కపరిమాణములు కార్యమందున్న గుణములుగావున,

అవియు కార్యములు. ద్వ్యణుకపరిమాణములో నిత్యమగుట వలన, పరమాణు పరిమాణముగాని త్ర్యణుకపరిమాణములో అణువగుటవలన ద్వ్యణుకపరిమాణముగాని కారణము లని చెప్పుటకు వీలులేదు. అణుపరిమాణమునకుఁగూడ పరిమాణ మునుగుఱించి కారణత్వ మొప్పినచో, మనస్సువలన ఏ ద్రవ్యము పుట్టనందున మనఃపరిమాణమువలన దేనియందును సమవేతము గాని పరిమాణము పుట్టవలసియుండును. త్ర్యణుకమువలె ద్వ్యణుకముఁగూడ అణువులవలన పుట్టుటవలన త్ర్యణుకమందువలె ద్వ్యణుకమందుఁగూడ మహత్వ ముండ వలసివచ్చును.

మూ. తత్ర కారణబహుత్వేన మహత్వే అణుపరిమాణస్య అనారంభకత్వస్థితేరణుత్వమేవ మహదారంభే విశేష ఇత్యపి న యుక్తమ్. మహతో మహదనారంభప్రసంగాత్. అణుత్వమహత్వయోర్విరుద్ధతయా ఏకజాతీయకార్యాఽనారంభకత్వప్రసంగాత్. బహుభిరపి పరమాణుభిః ద్వాభ్యామపి ద్వ్యణుకాభ్యామారంభప్రసంగాచ్చ.

తా. త్ర్యణుకమందుండెడు మహత్పరిమాణము కారణ బహుత్వమువలననే పుట్టుననినచో, ద్వ్యణుకమందుండెడు అణుపరిమాణమునకు అనారంభకత్వము సిద్ధించునుగాన, మహదుత్పత్తిలో అణుత్వమే విశేషమనియు చెప్పుట యుక్తము గాదు ద్వ్యణుకపరిమాణమునందు ఒకానొకజాతిని స్వీకరించి దానితో గూడుకొనిన యణుపరిమాణమువలననే త్ర్యణుక

మందు మహత్త్వము పుట్టుననినచో, మహత్పరిమాణములో విజాతీయ అణుపరిమాణము కారణమైనచో మహత్పరిమాణమువలన మహత్పరిమాణముయొక్క యుత్పత్తి లేకపోవలసి వచ్చును. మహత్పరిమాణములో మహత్పరిమాణమువలె అణుపరిమాణముఁగూడ కారణమైనచో, ద్వ్యణుకమువలనఁ బుట్టిన త్ర్యణుకమందు పరస్పరవిరుద్ధములైన అణుత్వమహత్త్వములు బుట్టవలసివచ్చును. ఇవి రెండుయును విరుద్ధములగుటవలన, అనఁగా? మహత్త్వమును విడచి అణుత్వము అణుత్వమును విడచి మహత్త్వముండుట స్వాభావసిద్ధము.

అణుత్వమునకు మహత్త్వములో కారణత్వముఁ జెప్పినచో, ఏకజాతీయ కార్యాఽరంభకత్వము లేకపోవలసి వచ్చును. కారణభేదమునుబట్టియే కార్యభేదము. అనఁగా? కారణసంఖ్యను అపేక్షించక, అణుత్వమే ప్రయోజకమైనచో అనేక పరమాణువులవల్లనున్ను రెండు ద్వ్యణుకములవల్లనున్ను గూడ కార్యముఁ బుట్టవలసియుండును.

మూ. ఏవం సతి కో దోష ఇతి చేత్. పరమాణుకార్యస్య మహత్త్వప్రసంగః. కారణబహుత్వస్య తద్ధేతుత్వాత్. అన్యథా ద్వాభ్యాం త్రిభిశ్చతుర్భిరిత్యనియమేనాణ్వారంభే తద్వైయర్థ్యప్రసంగః. అణునఏవ తారతమ్యాభ్యుపగమస్తు సంఖ్యామవధీర్య న స్యాత్. అస్తు మహదారంభ ఏవ త్రిభిరితి చేన్న. మహతః కార్యస్య కార్యద్రవ్యారభ్యత్వనియమాత్. తథాపి వా తారతమ్యే సంఖ్యైవ ప్రయోజకేతి. న చ

ప్రచయోఽపేక్షణీయః. అవయవసంయోగస్యా
భావాత్.

తా. అనేక పరమాణువులవలనను, రెండుద్వ్యణుక ములవలనను కార్యోత్పత్తి స్వీకరించినచో యేమిదోషము? కారణబహుత్వమునకు మరియొకస్థలమందు మహత్వప్రయోజకత్వము క్లుప్తము గాన అనేక పరమాణువులవలన కార్యము యొక్క ఉత్పత్తి స్వీకరించినచో కారణబహుత్వ మున్నందున పరమాణుకార్యమందు మహత్వ ముండవలసివచ్చును.

రెండు పరమాణువలనఁబుట్టిన కార్యమందువలె, మూఁడు పరమాణువలనఁ గలుగు కార్యమందుఁగూడ అణుత్వమే బుట్టు నని యేల యనఁగూడదు? అట్లైనచో కార్యభేదము లేనందున కారణ మందుయుండు త్రిత్వసంఖ్యకు వైయర్థ్యము రాగలదు. ద్విత్వవిశిష్ట పరమాణుస్థలమందు, త్రిత్వవిశిష్ట ముండనందు నను త్రిత్వవిశిష్టము యున్నపుడు, ద్విత్వవిశిష్టము యుండ నందున పరస్పరవ్యభిచారమువలన దేనికియు కారణత్వము లేకపోవలసివచ్చును.

కార్యవైజాత్యమును స్వీకరించి వ్యభిచారము వారించి నను, సంఖ్యకు కారణత్వము స్వీకరించక తప్పదు.

మూఁడు పరమాణువులవలన మహత్కార్య మేలఁబుట్టఁ గూడదో జెప్పు? మహత్పరిమాణ విశిష్టమైనద్రవ్యము కార్య ద్రవ్యమువలననే బుట్టును గాన పరమాణువులు నిత్యమగుట వలన దానివలనఁ గలిగెడిద్రవ్యము మహత్తనుటకు వీలు లేదు. ద్విత్వసంఖ్యకు ద్వ్యణుకమందుండు నణుపరిమాణము

లోను త్ర్యణుకగతమహత్త్వములో త్రిత్వసంఖ్యయు ప్రయోజకమని జెప్పవలెను.

అవయవములయొక్క సంయోగము లేనందున మహత్త్వ ప్రయోజకమైన ప్రచయసంయోగ ముండుటకు వీలులేదు.

మూ. తస్మాత్పరిమాణప్రచయౌ మహతఏవారంభకా వితి స్థితిః. అతోఽనేకసంఖ్యా పరిశిష్యతే, సా అపేక్షాబుద్ధిజన్యా. అనేకసంఖ్యాత్వాత్. న చాస్మదాదీనామపేక్షాబుద్ధిః పరమాణుషు సంభవతి. తత్ యస్యాసౌ సర్వజ్ఞః. అన్యథా అపేక్షాబుద్ధేరభావాత్సంఖ్యానుత్పత్తౌ తద్గతపరిమాణానుత్పాదే అపరిమితస్య ద్రవ్యస్యానారంభకత్వాత్త్ర్యణుకానుత్పత్తౌ విశ్వానుత్పత్తి ప్రసంగః.

తా. అందువలన మహత్పరిమాణమున్ను ప్రచయాఖ్య సంయోగమున్ను మహత్త్వమునే పుట్టించును. అందువలన అనేక సంఖ్యయే పరిమాణకారణమని చెప్పవలయును. అనేక సంఖ్యయనఁగా ద్విత్వముగాని త్రిత్వముగాని కావచ్చును. పరమాణుగత ద్విత్వసంఖ్యవలన ద్వ్యణుకపరిమాణమున్ను, ద్వ్యణుకమందుండెడు త్రిత్వసంఖ్యవలన త్ర్యణుకమందు మహత్పరిమాణమున్ను బుట్టును. పరమాణువునందుండెడు ద్విత్వ సంఖ్య అపేక్షాబుద్ధివలనఁ బుట్టును. అట్టి అపేక్షాబుద్ధి పరమాణువులు అతీంద్రియములు గావున అస్మదాదులదని జెప్పుటకు వీలులేదు. అట్టిబుద్ధి ఎవనికో వాఁడే సర్వజ్ఞుఁడు. అట్టి సర్వజ్ఞుఁడైన ఈశ్వరుని ఒప్పనిచో అపేక్షాబుద్ధి సంభవించ

నందున అనేకత్వరూపసంఖ్యc బుట్టుటకు వీలులేదు. సంఖ్యc బుట్టనిచో ద్వ్యణుకత్ర్యణుకాదులయందు పరిమాణము బుట్ట నందుననున్ను, అపరిమితములైన పరమాణువులకు ద్రవ్యా రంభకత్వము లేనందుననున్ను ద్వ్యణుకత్ర్యణుకాదిక్రమ మున జగదుత్పత్తియే లేకపోవలసివచ్చును.

మూ. అస్మదాదీనామేవ ఆనుమానిక్యపేక్షాబుద్ధిర స్త్వితి చేత్. న. ఇతరేతరాశ్రయప్రసంగాత్ జాతే హి స్థూలకార్యే తేన పరమాణ్వాద్యను మానం, తస్మిన్ సతి ద్వ్యణుకాదిక్రమేణ స్థూలోత్పత్తిః. అస్త్వదృష్టాదేవ పరిమాణం కృతమపేక్షాబుద్ధ్యేతి చేన్న. అస్తు తత ఏవ సర్వం కిం దృష్టకారణేనేత్యాదేరసమాధేయత్వ ప్రసంగాదితి.

తా. మనయొక్క ఆనుమానికమైన అపేక్షాబుద్ధివలననే సంఖ్య యుత్పన్నమగునని జెప్పుటచేతనే యుపపన్నమగు చుండcగా సర్వజ్ఞు నేల నంగీకరింపవలయునని యాశంకింప రాదు. అస్మదాదులయొక్క ఆనుమానికాఽపేక్షాబుద్ధివలననే పరమాణువులయందు ద్వ్యణుకమందు అనేకత్వరూపసంఖ్యc బుట్టునని జెప్పినచో అన్యోన్యాశ్రయప్రసంగము వచ్చును. అది యెట్లన? ఆనుమానిక యపేక్షాబుద్ధివలన త్ర్యణుకాది రూపస్థూలకార్యముచే తత్కారణమగు పరమాణువుయొక్క యనుమానము. అనుమిత్యాత్మకమైన యపేక్షాబుద్ధి యున్న పుడే ద్వ్యణుకాదులయొక్క యుత్పత్తి ఇట్టి అన్యోన్యాశ్రయ దోషము సంభవించును.

అస్మదాదులయొక్క యదృష్టమువలననే జగదుత్పత్తి సంభవించుచుండఁగా నపేక్షాబుద్ధిని తదాశ్రయుఁడగు నీశ్వరుని యేల నంగీకరింపవలయునని జెప్పినచో దృష్టకారణమగు గురుశాస్త్రాదులయొక్క యపేక్షయే లేకపోవలసి వచ్చును. గాన సాధారణముగా యదృష్టమున్నను దృష్టకారణము నంగీకరింపవలయును. పరమాణుద్వ్యణుకములయందుఁ బుట్టెడు అనేకత్వసంఖ్యలో ప్రాత్యక్షికాఽపేక్షాబుద్ధియే కారణమని జెప్పవలయును. దానికి యాశ్రయునిగా యీశ్వరుని యంగీకరింపవలయును.

మూ. అథవా కార్యేత్యాదికమన్యథా వ్యాకురుతే.
శ్లో. ఉద్దేశఏవ తాత్పర్యం వ్యాఖ్యా విశ్వదృశస్సతీ,
ఈశ్వరాదిపదం సార్థం లోకవృత్తానుసారతః. ౬

తా. కార్యాయోజన ధృత్యాదేః అనుదానికి మరియొక రీతిగా వ్యాఖ్యానముఁ జేయుచున్నాఁడు. కార్యమనఁగా, ఉద్దేశము. ఉద్దేశమనఁగా తాత్పర్యము. తాత్పర్యమనఁగా ఇచ్ఛా. అట్టి ఇచ్ఛ వేదమం దస్మదాదులది గాదు. అట్టి ఇచ్ఛాశ్రయుఁడుగా ఈశ్వరసిద్ధియనే యభిప్రాయము.

ఆయోజనమనఁగా, వ్యాఖ్యానము. సర్వవేదార్థ పరిజ్ఞానములేని అస్మదాదులచే వేదమునకు వ్యాఖ్యానముఁ జేయుట సంభవించదు గాన, వేదవ్యాఖ్యాతగా నీశ్వరసిద్ధి యగును.

పదమనఁగా, ఈశ్వరపదము. శ్రు. యవమయశ్చరుర్భవతి, యను శ్రుతిలోయున్న యవపదమునకు వాక్యశేషమునుబట్టి

లోకములో దీర్ఘశూకవిశిష్టమందు యెటుల శక్తి నిర్ణయించఁబడినదో అటులనే స్తుతివాక్యములోయున్న ఈశ్వరపదము నకుఁగూడ వాక్యశేషమునుబట్టి సర్వజ్ఞుఁడైన ఈశ్వరునియందు శక్తి నిర్ణయించఁబడునని యర్థము.

మూ. ఆమ్నాయస్య హి భావ్యర్థస్య కార్యే పురుష ప్రవృత్తినివృత్తే, భూతార్థస్య తు యద్యపి నాహత్య ప్రవర్తకత్వం నివర్తకత్వం వా.తథాపి తాత్పర్యత స్తత్రైవ ప్రామాణ్యం, తథాహి.విధి శక్తిరేవావసీదంతీ స్తుత్యాదిభిరుత్తభ్యతే, ప్ర శస్తే హి, సర్వః ప్రవర్తతే. నిందితాచ్చ నివ ర్తతే ఇతి స్థితిః, తత్ర పదశక్తిస్తావదభిధా, తద్బలాయాతః పదార్థః. ఆకాంక్షాదిమత్వే సతి చాన్వయశక్తిః పదానాం పదార్థానాం వా, వాక్యం, తద్బలాయాతో వాక్యార్థః.

తా. వృద్ధవ్యవహారముచే పదమునకు కార్యాన్విత పదార్థమందు శక్తియును కార్యాన్వయము, విధి సమభివ్యా హారస్థలమందు సాక్షాత్తు సంభవించును. విధి లేనిస్థలమందు పరంపరయా కార్యాన్వయము సంభవించుననే మతమునను సరించి జెప్పఁబడుచున్నది. భావ్యర్థమనఁగా, సాధ్యార్థము. విధి నిషేధరూప మగువేదమునకు సాక్షాత్ కార్యతాజ్ఞానముచే ప్రవర్తకత్వము, నివర్తకత్వము సంభవించును. పథ్యంభుంక్ష్వ. అపథ్యం మాభుంక్ష్వ యనువాక్యములకు కార్యతాజ్ఞానము వలన సాక్షాత్తు విధి సమభివ్యాహార ముండుటవలన మొదటి

వాక్యమునకు ప్రవర్తకత్వమును రెండవవాక్యమునకు నివర్త కత్వమును సంభవించును.

సిద్ధార్థపరమగువాక్యములకు, పరిణతి సరసమామ్ర ఫలం, పరిణతి విరసంపనసం, అనుసిద్ధార్థ పరమగువాక్యము లకు ప్రవర్తకత్వముగాని నివర్తకత్వముగాని సంభవించఁ దనుటకు వీలులేదు. మొదటివాక్యమునకు మామిడిపండు ఉపాదేయమని తాత్పర్యము. రెండవవాక్యమున విరస మగు పనస మనుపాదేయమని తాత్పర్యము. గాన మొదటి వాక్యమునకు ప్రవర్తకత్వము. రెండవవాక్యమునకు నివర్త కత్వముయును పరంపరయా సంభవించును. ఈవాక్యములవలన కార్యత్వజ్ఞానము కలుగకపోయినను ప్రవృత్తిప్రయోజకమైన ప్రాశస్త్యజ్ఞానరూపసహకారి లాభమును విధిశక్తిఁ గలుగఁ జేయకపోయినను స్తుత్యాదులవలనఁ గలుగఁజేయును. కను కనే మొదట వాక్యమువలన మామిడిపండు ఇతరమైన వానికంటె ప్రశస్తమైనది యనుబోధ గలుగును గాన దాని యందు ప్రవర్తించును. రెండవవాక్యమువలన విరసమైన పనస ఫలము హేయమనుబోధ గలుగును. అట్టి పనసఫలమందు నివర్తించును.

పదార్థముకంటెను, వాక్యార్థముకంటెను, తాత్పర్యా ర్థము వేరు అన్నసఁగతి తెలుపునిమిత్తము, పదార్థమున్ను వాక్యార్థమున్ను ముందుగా జెప్పఁబడుచున్నది. అభిధారూప మగు పదశక్తిచే లబ్ధమైనయర్థము పదార్థము. ఆకాంక్షాదు లతో గూడుకున్న పదార్థాన్వయశక్తి గలది వాక్యము.

వాక్యముయొక్క యన్వయశక్తిచే లబ్ధమైనది వాక్యార్థమని జెప్పఁబడును.

మూ. తాత్పర్యార్థస్తు చింత్యతే, తదేవ పరం సాధ్యం, ప్రతిపాద్యం, ప్రయోజనం, ఉద్దేశ్యం వా యస్య తదిదం తత్పరం, తస్య భావస్తత్వం తత్. యద్విషయం, సతాత్పర్యార్థ ఇతిస్యాత్.

తా. తాత్పర్యార్థము విమర్శించఁబడుచున్నది. 'తదేవ పరంయస్య'అనునపుడు పరపదార్థమును వికల్పించఁబడుచున్నది. పరమనఁగా, సాధ్యమనియా, ప్రతిపాద్యమనియా, ప్రయోజనమనియా, లేక ఉద్దేశ్యమా, క్రమముగా మూఁటిని నిరాకరించి, నాల్గవదే పరశబ్దమున కర్థమని జెప్పఁబడుచున్నది.

మూ. తత్ర న ప్రథమః ప్రమాణేనార్థస్య కర్మణో ఽసాధ్యత్వాత్. ఫలస్య చ తత్ప్రతిపత్తితో అన్యస్యాభావాత్. ప్రశస్తనిందితప్రతిపాదన ద్వారేణ ప్రవృత్తినివృత్తిరూపం సాధ్యం పరముచ్యతే ఇతి చేన్న. గంగాయాం ఘోష ఇత్యత్ర తీరస్యప్రవృత్తినివృత్తిరూపస్యాసాధ్యస్యాపి పరత్వాత్. తీరవిషయే ప్రవృత్తినివృత్తీ సాధ్యే ఇతి తీరస్యాపి పరత్వమితి చేన్న. స్వరూపాఖ్యానమాత్రేణాపి పర్యవసానాత్.

తా. వాక్యార్థము, వాక్యరూపమగు ప్రమాణసాధ్యము గానందున, పరశబ్దార్థము సాధ్యమనుటకు వీలులేదు. వాక్యార్థ మసాధ్యమైనను తత్ప్రతిపత్తి సాధ్యము గాన తద్విషయమగు వాక్యార్థమునకు సాధ్యత్వము సంభవించునని

చెప్పుట రెండవవికల్పములో జేరును గాన ఆరీతిగా జెప్పుట కవకాశము లేదు.

ప్రశ_స్తనిందితార్థ ప్రతిపాదనద్వారా ప్రవృ_త్తినివృ త్తులే సాధ్యము గాన ప్రవృ_త్తినివృ_త్తి రూపసాధ్యమే పర శబ్దమున కర్థమనినచో, గంగాయాంఘోష యనుస్థలమందు తీరము ప్రవృ_త్తిరూపముగాని, నివృ_త్తిరూపముగాని గానం దున పరశబ్దార్థము గాకపోవలసివచ్చును. తీరతాత్పర్య కత్వమూ పదమునకు లేకపోవలసి వచ్చును.

తీరవిషయమున ప్రవృ_త్తినివృత్తులు సాధ్యముఁ గాన తీర మునకుఁగూడ సాధ్యత్వము సంభవించుననరాదు. ప్రవృ_త్తి నివృత్తులయందు తాత్పర్యము లేకపోయినను తీరమందు గంగాపదమునకు తాత్పర్య ముండుటవలన తీరవిషయ మున ప్రవృ_త్తినివృత్తులనుబట్టి తీరమునకు సాధ్యత్వము జెప్పుట సరిగాదు.

మూ. న ద్వితీయః, పదవాక్యయోః పదార్థతత్సంసర్గౌ విహాయ ప్రతిపాద్యాంతరాభావాత్. పదశ_క్తి సంసర్గశ_క్తీ వినా స్వార్థావినాభావేన ప్రతి పాద్యం పరముచ్యతే ఇత్యపి న సాంప్రతం, న హియత్ యత్. శబ్దార్థావినాభూతం తత్రతత్ర తాత్పర్యం శబ్దస్య, అతిప్రసంగాత్. తదా హి గంగాయాం జలమిత్యాద్యపి, తీరపరం స్యాత్. అవినాభావస్య తాదవస్థ్యాత్. ముఖ్యే బాధకే సతి తత్తథా స్యాదితి చేన్న. తస్మిన్నసత్యపి భావాత్. తద్యథా.

శ్లో. గచ్ఛ గచ్ఛసి చేత్కాంత పన్థానస్సంతు తే శివాః,
మమాపి జన్మ తత్రైవ భూయాద్యత్ర గతో భవాన్. ఇతి.

ముఖ్యార్థాబాధనేపి మారణే తాత్పర్యం, న చ పరం వ్యాపకమేవ. అవ్యాపకేపి దర్శనాత్. తద్యథా మంచాః క్రోశంతీతి పురుషే తాత్పర్యం. న చ మంచపురుషయోరవినాభావః. నాపి పురుషక్రోశనయోః.

తా. ప్రతిపాద్యమే పరశబ్దార్థమను రెండవపక్షముఁగూడ సరిగాదు. పదమునకు ప్రతిపాద్యము పదార్థము. వాక్యమునకు పదార్థసంసర్గయే ప్రతిపాద్యముగాని దీనినివిడచి మరియొక ప్రతిపాద్యంతరము లేదు.

పదశక్తిని సంసర్గశక్తిని విడచి అవినాభావముచే ప్రతిపాద్యమే పరశబ్దార్థ మనినచో, 'గంగాయాం జలం' అనుస్థలమందు తీరమందు గంగాపదార్థముయొక్కయు జలపదార్థముయొక్కయు అవినాభావ మున్నది గాన తీరముఁగూడ పరముగావలసివచ్చును.

ముఖ్యార్థమునకు బాధ యుండినస్థలమందే అవినాభావముచే ప్రతిపాద్యము పరమని చెప్పెదము. గంగాయాం జలం అనుస్థలమందు బాధ లేదు గాన తీరము పరముగాదని చెప్పినచో ముఖ్యార్థ బాధ లేకపోయినను, 'గచ్ఛగచ్ఛసి చేత్కాంత' యనుస్థలమందు ముఖ్యార్థమునకు బాధ లేకపోయినను మరణము పరమగుచున్నది. కాకపోవలసివచ్చును. అవినాభావముచే ప్రతిపాద్య మగువాక్యమె పరమనుట

అవ్యాపకముఁగూడ పరమగుటవలన సరిగాదు. మంచాః క్రోశంతి యనుస్థలమందు పరము. పురుషుఁడు పురుషునియందు మంచావినాభావముగాని, క్రోశనావినాభావముగాని లేదు. గాన ద్వితీయవికల్పముఁగూడ సరిగాదు.

**మూ.** నాపి తృతీయః, తద్ధి ప్రతిపాద్యాపేక్షితం ప్రతిపాదకాపేక్షితం వా స్యాత్. నాద్యః, శబ్దప్రామాణ్యస్యాతదధీనత్వాత్. తథాత్వేవా అతిప్రసంగాత్. యస్య యదపేక్షితం తం ప్రతి తస్య పరత్వప్రసంగాత్. తదర్థసాధ్యత్వేనాపేక్షానియమ ఇతి చేన్న. కార్యజ్ఞాప్యభేదేన సాధ్యస్య బహువిధత్వే భిన్నతాత్పర్యతయా వాక్యభేదప్రసంగాత్. ధూమస్య హి ప్రదేశశ్యామలతా, మశకనివృత్త్యాద్యనేకం కార్యం, ఆర్ద్రేంధనదహనాద్యనేకం జ్ఞాప్యం, తథా చేహ ప్రదేశే ధూమోద్గమ ఇత్యభిహితే తాత్పర్యతః కో వాక్యార్థః భవేత్. చేతనాపేక్షయా నియంతుమశక్యత్వాత్. నాపి ప్రతిపాదకాపేక్షితం వేదే తదభావాత్.

తా. ప్రయోజనము పరమనుటకు వీలులేదు. వక్తకుగాని, శ్రోతకుగాని ప్రయోజనము సంభవించదు. ఆ ప్రయోజనము, ప్రతిపాద్యాపేక్షితమని జెప్పుట కవకాశము లేదు. ఏ యర్థమందు శబ్దమునకు వక్తృతాత్పర్యమో శబ్దమున కట్టి యర్థమందు ప్రామాణ్యము. అట్టి ప్రామాణ్యరూపమగు ప్రయోజనము ప్రతిపాద్యాపేక్షితము గాదు. అట్లైనచో

తాత్పర్యభేద మున్నప్పు డర్థములు భిన్నములు గాన వాక్య భేదప్రసంగము వచ్చును.

శబ్దమునకు నేదియర్థమో తత్సాధ్యము. శబ్దజ్ఞాప్య మున కపేక్షితముగాని యేదియో అదియే పరమనినచో అతి ప్రసంగము వారించునని యాశంకింపరాదు అర్థమునకు సాధ్య మనఁగా, అర్థజన్యమనియా? లేక జ్ఞాప్యమనియా? ధూమము నకు అది యున్న ప్రదేశమందు నలుపు,అక్కడయుండు దోమలు మొదలగువానియొక్క నివృత్తియు కార్యములు, జ్ఞాప్యము. తడిసిన కర్రలతోఁగూడిన వహ్ని మొదలగునవి యనేకము కార్యముగాని, జ్ఞాప్యములుగాని అనేకమగుటవలన, (ఇహ ప్రదేశే ధూమోద్గమః) యీప్రదేశమందు ధూమము బయలు దేరుచున్నదను వాక్యమునకు తాత్పర్యమువలన యేది వా క్యార్థ మగును కార్యమును జ్ఞాప్యమును అనేకము గావున అనేకార్థ పరమగుటవలన వాక్యభేదప్రసంగము వచ్చును. ఒకేయర్థము అందరికీ అపేక్షితమనుట సర్వానుభవవిరుద్ధము. గాన ప్రతిపాద్యాపేక్షిత మనుపక్షము సరిగాదు.

మీామతమున వేదమందు ప్రతిపాదకుఁడే లేనందున ప్రతికాపేక్షితమైన ప్రయోజనము పరమని వికల్పించుటకు వీలు లేదు.

మూ. చతుర్థస్తు స్యాత్. యదుద్దేశేన యః శబ్దః ప్ర
వృత్తః సః తత్పరః తత్రైవ లోకవ్యుత్పత్తేః.
తథా హి ప్రసంసావాక్యం, ఉపాదానముద్దిశ్య
లోకే ప్రయుజ్యతే, తదుపాదానపరం, నిందా

వాక్యం, హానముద్దిశ్య ప్రయుజ్యతే, తద్ధాన
పరం, ఏవమన్యత్రాపి స్వయమూహనీయం.

తా. దేనినుద్దేశించి యేశబ్దము ప్రయోగించఁబడునో యాశబ్దము తత్పరము. లోకములో పదములు స్వతంత్రాభిప్రాయ పూర్వకమగుటచే యెటుల స్వార్థప్రతిపాదకములో వేదమందుగూడ పదములు స్వతంత్రాభిప్రాయపూర్వకములై స్వార్థప్రతిపాదకములు. లోకములో ప్రశంసావాక్యములు పాదానోద్దేశముగా ప్రయోగించుటవలన ఉపాదానపరములు. నిందావాక్యములు. హానపరములు. వేదమందుఁగూడ అట్లు యూహించవలెను.

మూ. తస్మాల్లోకానుసారేణ వేదేవ్యేవం స్వీకరణీయం.
అన్యథా అర్థవాదానాం సర్వథైవానర్థక్యప్రసం
గాత్. స చోద్దేశః వ్యవసాయో అధికారోఽ
భిప్రాయో భావ, ఆశయ ఇత్యనర్థాంతరమితి.
తదాధారప్రణేతృపురుషధౌరేయసిద్ధిః.

తా. కాన లోకానుసారముగా వేదమందుఁగూడ ప్రశంసావాక్యములకు ప్రవర్తకత్వము. నిందావాక్యములకు నివర్తకత్వమును జెప్పవలెను. అట్లు గానిచో అర్థవాదవాక్యముల కానర్థక్యము రావలసివచ్చును. ఉద్దేశము వ్యవసాయము. అధికారము, అభిప్రాయము, భావము, ఆశయము మొదలుగాగల శబ్దములు సమానార్థకములు. వేదతాత్పర్యమునకు ఆశ్రయుఁడైన పురుషశ్రేష్ఠుఁ డీశ్వరుఁడు సిద్ధించును.

మూ. తథా చ ప్రయోగః. వైదికాని, ప్రశంసావా
క్యాని, ఉపాదానాభిప్రాయపూర్వకాణి, ప్రశం

సావాక్యత్వాత్. పరిణతిసురసమామ్రఫలమి
త్యాది లోకవాక్యవదితి,ఏవం నిందావాక్యాని,
హానాభిప్రాయపూర్వకాని నిందావాక్యత్వాత్.
పరిణతివిరసం పనసఫలమిత్యాదివాక్యవత్.అన్య
థా నిరర్థకత్వ ప్రసంగశ్చ విపక్షే బాధక
మిత్యుక్తం.

తా. ఇట్టి యనుమానములచే సిద్ధమగు అభిప్రాయాశ్ర
యుఁడుగా ఈశ్వరుఁడు సిద్ధించును.

మూ. అపి చ, నోచేదేవం శ్రుతార్థాపత్తిరపి హీయేత,
సిద్ధోహ్యత్ర ప్రమాణవిషయః. న తు తేనైన
కర్తవ్యః. న చ పీనో దేవదత్తో దినా న భుం
క్తే ఇత్యత్ర రాత్రౌ భుఙ్క్తే ఇతి వాక్యశే
షోఽస్తి అనుపలంభబాధితత్వాత్. ఉత్పత్త్యభి
వ్యక్తిసామగ్రీతాల్వాదివ్యాపారవిరహాత్. అ
యోగ్యస్య చాశంకితుమశక్యత్వాత్. తస్మాదభి
ప్రాయస్థఏవ పరిశిష్యతే. గత్యంతరాభావాత్.
న చేద్వేదే నాస్తి. నాస్తి శ్రుతార్థాపత్తిరితి
తదుద్భావ్యత్వాదనానర్థక్యప్రసంగః. తస్మాత్కార్యా
త్తాత్పర్యాదప్యున్నీయతే. అస్తి ప్రణేతేతి.

తా. వేదమందు స్వతంత్రాభిప్రాయపూర్వకత్వ మొప్ప
నిచో శ్రుతార్థాపత్తిచే శబ్దము కల్పించఁబడునను భట్టుల
యొక్కసిద్ధాంతమునకు భంగము గలుగును. 'పీనో దేవదత్తః,

దివానభుంక్తే' అనుస్థలమున 'రాత్రౌ భుక్తే' యనుపదము అనుపలబ్ధము. అట్టిశబ్దము పుట్టుటకుగాని అభివ్యక్త మగుటకు గాని తాల్వాదిసంయోగరూప మగుసామగ్రి లేనందున పుట్టుటకున్ను అభివ్యక్త మనుటకున్ను వీలులేదు. రాత్రిభోజన మయోగ్యమగుటవలన యాశంకావిషయమని జెప్పుటకు వీలు లేదు. గాన శ్రుతార్థాపత్తిస్థలమందు స్వతంత్రాభిప్రాయపూర్వక మగుశబ్ద మెటుల భట్టమతమందు కల్పితమో అటులనే వేద మందుఁగూడ స్వతంత్రాభిప్రాయపూర్వకత్వము కల్పించెదము. వేదప్రణేతయైన పురుషధౌరేయుని కార్యమైన తాత్పర్య ముచే నూహించెదము.

మూ. ఆయోజనాత్తల్వపి. న హి వేదాదవ్యాఖ్యాతా త్కశ్చిదర్థమధిగచ్ఛతి. న చైకదర్శినో వ్యాఖ్యా నమాదరణీయం.

శ్లో. పౌర్వాపర్యాపరామృష్టః
శబ్దోఽన్యాం కురుతే మతిం. ఇతి.

న్యాయేనానాశ్వాసాత్. త్రిచతురపదకాదపి వాక్యాదేకదేశశ్రావిణోఽన్యథాఽర్థప్రత్యయః స్యాత్. కిముతాతీంద్రియాదన్తరాన్తరవాక్య సంభేదదురధిగమాత్. తతఃసకలవేదార్థదర్శీ కశ్చిదభ్యుపేయః. అన్యథా అంధపరంపరా ప్రసంగాత్.

తా. ఆయోజనమనఁగా వ్యాఖ్యానము. వ్యాఖ్యాన ములేనిచో వేదమువలన యెవనికిఁగూడ యర్థబోధ గలుగదు. వేదైకదర్శియొక్క వ్యాఖ్యానమదరణీయము గాదు.

పూర్వాపరసందర్భముతో గూడుకొన్న వాక్యమువలననే సమీచీనమైనజ్ఞానము గలుగునుగాని సందర్భశూన్యమగు శబ్దమువలన మరియొకరీతిగా బోధ గలుగును.

నాలుగు మూఁడుపదములతో గూడినవాక్యములో ఒకటిరెండుపదములు విన్నవానికే మరియొకరీతిగా యర్థబోధఁ గలుగుచున్నప్పుడు అతీంద్రియార్థకము మధ్యమధ్యను కొన్ని వాక్యములు విడిచిన వేదైకదర్శియొక్క వ్యాఖ్యానమువలన మంచిబోధ యెట్లు సంభవించును.

అందువలన సకల వేదార్థదర్శియగు నొకనిని యంగీకరించవలెను. లేక ఏకదేశదర్శియొక్క వ్యాఖ్యానమునే ప్రమాణముగా జేసుకున్నయెడల యెవనికిని లోకములో వేదార్థ బోధయే లేకపోవలసివచ్చును.

మూ. స చ శ్రుతాధీతానధృతస్మృతసాంగోపాంగవేద వేదార్థః. తద్విపరీతో వా, న సర్వజ్ఞాదన్యస్సంభవతి. కోహ్యప్రత్యక్షకృతవిశ్వతదనుష్ఠాన ఏ తావానేవా యమామ్నాయ ఇతి నిశ్చనుయాత్. కశ్చార్వాగ్దర్శినః శేషాః శ్రుతర్గ్రంథతోఽర్థతోవాఽధీయీత, అధ్యాసయేద్వా.

తా. 'కార్యాయోజనధృత్యాదేః' అనెడు కారికలోయున్న ధృతియనుదానికి వ్యాఖ్యానము. శ్రోత్రముచే సాక్షాత్కృతము అధీతము. జ్ఞానవిషయము,ధృతము, నిరంతరాభ్యాసముచే ధృఢమైన సంస్కారము. తద్విపరీతః, అధ్యయనము లేకయే తెలుసుకోబడ్డ అంగోపాంగములతో గూడిన వేదము

యొక్క యర్థములు గలవాఁడు సర్వజ్ఞునికంటె మఱియొకఁడు సంభవించఁడు. ప్రపంచముయొక్క సాక్షాత్కారము లేని వాఁడు ఇంతవరకే వేదమని యెవఁడు నిశ్చయించెనేని అసర్వజ్ఞునికి సమస్తవేదమును అధ్యయనముఁ జేయుటఁగాని, మఱియొకనికి జెప్పుటఁగాని సంభవించదు. గాన సర్వవేద వేదార్థానుభవమువలన దృఢతరసంస్కారము గలవాఁడు యొకఁడు సిద్ధించును.

మూ. అత్రాపి ప్రయోగః వేదాః కదాచిత్ సర్వవేదార్థవిద్వ్యాఖ్యాతాః. అనుష్ఠాతృమతిచలనేపి, నిశ్చలార్థానుష్ఠానత్వాత్. యదేవం, తత్సర్వం, తదర్థవిద్వ్యాఖ్యాతం, యథామన్వాదిసంహితేతి. అన్యథా త్వనాశ్వాసేనావ్యవస్థానాదననుష్ఠానమవ్యవస్థావాభవేదనాదేశికత్వాత్.

తా. మన్వాదిస్మృతులు యెటుల దానియొక్కయర్థమును తెలిసినవారిచే వ్యాఖ్యాతములో, నిశ్చలమైనార్థానుష్ఠానము గలవియగుటవలన వేదములుగూడ వేదార్థమును దెలిసినవానిచే వ్యాఖ్యానము ఒకానొకప్పుడు జేయఁబడ్డది. వేదార్థపరిజ్ఞానము లేనివానిచే వ్యాఖ్యానము జేయఁబడినచో అవిశ్వాసమువలన అర్థప్రతిపత్తి గలుగనిచో వేదబోధితకర్మలయొక్క యననుష్ఠానము గలుగును. ఉపదేశము లేనందున, అర్థనిశ్చయవ్యవస్థయు లేకపోవలసివచ్చును.

మూ. అనుష్ఠాతార ఏవా దేష్టార ఇతి చేన్న. తేషామనియతబోధత్వాత్. వేదవద్వ్యథానుష్ఠానమప్యనాదీతి చేత్. న. తద్ధి, స్వతంత్రం వా, వేదార్థ

బోధపరతంత్రం వా, ఆద్యే నిర్మూలత్వప్రసంగః. ద్వితీయే త్వనియమాపత్తిః. న హ్యసర్వజ్ఞావిశేషే పూర్వేషాం తదనబోధః ప్రమాణం. న త్విదానీం తనానామితి నియామకమస్తి.

తా. వేదోదితకర్మానుష్ఠానముఁ జేయువారికి నియతమైనజ్ఞానము లేనందున వారు ఉపదేష్టలనుటకు వీలులేదు. వేదమువలె వేదానుష్ఠానముఁగూడ యనాదియనుటకు వీలులేదు. వేదానుష్ఠానము స్వతంత్రమా? లేకార్థబోధ పరతంత్రమా? మొదటిపక్షమున నిర్మూలత్వప్రసంగము వచ్చును. అర్థబోధాధీనమైనచో నియమానుపపత్తి వచ్చును. పూర్వులయొక్క స్వతంత్రమైన వేదార్థజ్ఞానమె ప్రమాణముగాని, ఆధునికులయొక్క వేదార్థబోధ ప్రమాణము గాదు. అని చెప్పుట కవకాశము లేదు. పూర్వీకులవలె ఆధునికులుగూడ యసర్వజ్ఞు లగుటవలన ఆధునికు లెట్టివారో పూర్వీకులుగూడ యట్టివారే గాన వీరియిద్దరిలోను వకరిజ్ఞానమె ప్రమాణము. రెండవవారిది యప్రమాణ మనునియమము కుదరదు. గాన నియమానుపపత్తి వచ్చును.

మూ. పదార్థేల్వపి. శ్రూయతే హి ప్రణవేశ్వరేశానాది పదం, తచ్చ సార్థకం. అవిగానేన శ్రుతిస్మృతీతిహాసేషు ప్రయుజ్యమానత్వాత్. ఘటాదిపదవదితి సామాన్యతః సిద్ధే కోస్యార్థ ఇతి వ్యుత్పిత్సోర్విమర్శే సతి నిర్ణయః. స్వర్గాదిపదవత్.

శ్లో. ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః,
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః.

ఇత్యర్థవాదాత్. యవనరాహాదివద్వాక్యశేషా
ద్వా తద్యథా.

తా. శృతిస్మృతీతిహాసములయందుఁ బ్రయోగించఁబడిన ఓంకారశబ్దము, ఈశ్వరశబ్దము, ఈశానాదిశబ్దము నిరర్థకములని ప్రసిద్ధి లేనందున ఘటాదిశబ్దములవలె సార్థకములని అనుమానముచే సామాన్యముగా యర్థము సిద్ధించినను విధిశేషమైన యర్థవాదవాక్యములచే స్వర్గపదమున కర్థ మెటుల నిశ్చయించఁబడినదో, ముందుఁ జెప్పఁబడ్డ ఉత్తమ ఇత్యాద్యర్థవాదవాక్యముచే ప్రణవాదిశబ్దముల కర్థనిర్ణయము గలుగును. అర్థవాదలో జెప్పిన లోకత్రయధారియగు పరమాత్మయే ప్రణవాదిశబ్దముల కర్థము. వాఁడే యీశ్వరుఁడు. పదపక్షకానుమానముచే అట్టి యీశ్వరుఁడు సిద్ధించునని తాత్పర్యము. 'యవమయశ్చరుర్భవతి' యను శృతియందున్న యవపదమును కొందరలయందు మ్లేచ్ఛులు ప్రయోగింతురు. పొడుగుగాయున్న కొసలుగల ధాన్యవిశేషమందు మరి కొందరు ప్రయోగించుదురు. ఇట్లుండఁగా. శ్లో. "వసంతే సర్వసస్యానాం జాయతే పత్రశాతనం, మోదమానాశ్చ తిష్ఠంతి యవాః కణిశశాలినః" యను వాక్యశేషమువలన యవపదమునకు పొడుగుకొనలుగల ధాన్యవిశేషమే యర్థమని యటుల నిశ్చయించఁబడినదో, ప్రకృతములో విధిశేషమైన వాక్యశేషమువలన, ఈశ్వరాదిపదమునకు వాక్యశేషములో జెప్పిన యర్థమందే శక్తి నిశ్చయించఁబడును. అది యెట్లనఁగా ?

శ్లో. సర్వజ్ఞతాతృప్తిరనాదిబోధః
స్వతంత్రతా నిత్యమలుప్తశక్తిః,

**అనంతశక్తిశ్చ విభోర్విధిజ్ఞాః**
**షడాహురంగాని మహేశ్వరస్య. ఇతి.**

మూ. ఏవంభూతోఽర్థః ప్రమాణబాధిత ఇతి చేన్న.
ప్రాగేవ ప్రతిషేధాత్.

తా. సర్వజ్ఞత్వము, భోగములయందు ఇచ్ఛలేకపోవుటయు, నిత్యజ్ఞానము, స్వాతంత్ర్యము, నిత్యప్రయత్నము, నాశరహితమైన శక్తియు, యీయారు అంగములతోను, అనఁగా యీ యారుధర్మములతోను గూడుకున్నవాఁడు మహేశ్వరుఁడు. ఇట్టివాఁడు మహేశ్వరశబ్దమున కర్థమని నిశ్చయించఁబడును. ఇట్టి యీశ్వరుఁడు, 'అప్రమాణ మనాప్తోక్తిః' అను సందర్భములో ప్రమాణభాధ నిషేధించఁబడెను.

మూ. తథాపి న తత్ర ప్రమాణమస్తీతి చేత్.
అస్తీతి చేతి కా ప్రత్యాశా, న హ్యుక్తవిశే
షణే సుఖే కించిత్ప్రమాణమస్త్యస్మదాదీనాం.

తా. అట్టినిషేధమందుఁగూడ ప్రమాణము లేదనినచో స్వర్గమున్నదనుటలోఁగూడ నేమిప్రమాణము గలదు. దుఃఖమిశ్రితముగాని సుఖవిశేషమే స్వర్గముగదా! అట్టిస్వర్గమున్నదని చెప్పుటలో మాకుఁగూడఁ బ్రమాణము లేదు.

మూ. యాజ్ఞికప్రవృత్త్యన్యథానుపపత్త్యా తథైవ తది
త్యవధార్యతే ఇతి చేత్. ఇతరేతరాశ్రయ
ప్రసంగాత్. అవధృతే హి స్వర్గరూపే తత్ర
ప్రవృత్తిః. ప్రవృత్త్యన్యథానుపపత్త్యా చ తదవ

ధారమితి. పూర్వవృద్ధప్రవృత్త్యా తదవధారణే
అయమదోష ఇతి చేన్న. అంధపరంపరాప్రసం
గాత్. విశిష్టాదృష్టవశాత్ కదాచిత్ కస్యచిదేవ
మపిసుఖం స్యాదితి నాస్తి విరోధః. తన్నిషేధే
ప్రమాణాభావాదితి చేత్ తుల్యమతరత్రాపి.

తా. సుఖరూపమైన స్వర్గము దుఃఖమిశ్రితము గాని యపుడే యాజ్ఞికులయొక్క ప్రవృత్తి యుపపన్న మగును. దుఃఖమిశ్రితమే యైనచో వారియొక్క ప్రవృత్తి మఱియొక విధముగా నుపపన్నము గానందున స్వర్గసుఖము దుఃఖమిశ్రితము గాదని నిశ్చయించెదమనుటకు వీలులేదు. దుఃఖమిశ్రితముగాని సుఖవిశేషము తెలియఁబడినపుడే యట్టిసుఖవిశేషమందు ప్రవృత్తి. అట్టిప్రవృత్తి మఱియొకవిధముగా నుపపన్నము గానందున నట్టి సుఖవిశేషముయొక్క నిశ్చయము. కాన ఇట్టి యన్యోన్యాశ్రయప్రసంగము వచ్చును. పూర్వీకులైన వారి ప్రవృత్తిచేతనే అట్టి సుఖవిశేషమైన స్వర్గముయొక్కనిశ్చయము గలుగును గాన పూర్వోక్తదోషము కవకాశము లేదని చెప్పుట యంధపరంపరాప్రసంగ రూపదోషము వలన సరిగాదు.

అదృష్టవశమున నొకానొకసమయమున నొకానొకనికి యట్టి స్వర్గరూపసుఖము గలుగవచ్చును. దానియొక్క నిషేధములోఁ బ్రమాణము లేదనినచో మీకు స్వర్గనిషేధములోఁ బ్రమాణము లేనందున స్వర్గ మెటులు సిద్ధించునో యీశ్వర నిషేధములోఁ బ్రమాణము లేనందున మామతమందుఁగూడ

నీశ్వరుఁడు సిద్ధించును. బాధకప్రమాణము లేకపోవుట యుభయులకు సమానము గాన మీమాంసమతమున స్వర్గమువలె మామతమున నీశ్వరుఁడు సిద్ధించును.

మూ. అత్రాపి ప్రయోగః. యశ్శబ్దో యత్ర వృద్ధైర
సతి వృత్త్యంతరే ప్రయుజ్యతే స తస్య వాచకః.
యథా స్వర్గశబ్దః సుఖవిశేషే ప్రయుజ్యమాన
స్తస్య వాచకః, ప్రయుజ్యతే చాయం జగ
త్కర్తరీతి. అన్యథా నిరర్థకత్వప్రసంగే సార్థక
పదకదంబసమభివ్యాహారా అనుపపత్తిరితి. ఏతేన
రుద్రోపేంద్రమహేంద్రాది దేవతావిశేషవాచ
కా వ్యాఖ్యాతాః.

తా. వృత్తి యనఁగా శక్తిలక్షణాఽన్యతరరూపము. మఱియొకవృత్తి లేనిచో శాస్త్రపరిజ్ఞానముఁ గలవృద్ధులచే నేశబ్ద మేయర్థములయందు ప్రయోగించఁబడునో యాశబ్దము యా యర్థవాచకము. దుఃఖమిశ్రితముగాని సుఖవిశేషమందు స్వర్గశబ్దము వృద్ధులచేఁ బ్రయోగించఁబడుటవలన స్వర్గశబ్ద మెటుల సుఖవిశేషవాచకమో యటులనే జగత్కర్త యగు నీశ్వరునియందు వృద్ధులచేఁ బ్రణవ యీశ్వర యీశానాదిశబ్దములు ప్రయోగించఁబడుటవలన నీశబ్దములుగూడ జగత్కర్తయగు నీశ్వరవాచకములని నిశ్చయించఁబడును. ఇట్టి శబ్దములు నిరర్థకములని యాశంకించుటకు వీలులేదు. అట్లైనచో నీపదములకు సార్థకమైన పదములయొక్క సాన్నిధ్యమే లేకపోవలసి వచ్చును. కాన నీపదములకు వెనుక ముందుండు

పదములు సార్థకములైనపు డీపదములుగూడా సార్థకములని చెప్పవలెను. ఆయర్థ మెట్టిదని జిజ్ఞాస చేసినపుడు వెనుక నుదహరించిన నర్థవాద వాక్యముల చేతను వాక్యశేషముల చేత నీశ్వరుఁడే యని నిశ్చయించవలెను. అర్థవాద వాక్యశేషముల వలన నీశానాదిపదములకు జగత్కర్తయగు నీశ్వరరూపార్థ మెటుల నిశ్చయించఁబడెనో యటులనే యర్థవాదాదులచే రుద్రయుపేంద్రమహేంద్రాది రూపదేవతావిశేషవాచకము లైన శబ్దములకుఁగూడ నర్థవిశేషము నిశ్చయించఁబడెను.

మూ. అపి చ. అస్మత్పదం లోకవద్వేదేపి ప్రయుజ్యతే, తస్య చ లోకే నాచేతనేష్వన్యతమదర్థః, తత్ర సర్వథైవాఽప్రయోగాత్. నాప్యాత్మమాత్ర మర్థః, పరాత్మన్యపి ప్రయోగప్రసంగాత్. అపి తు యస్తం స్వాతంత్ర్యేణోచ్చారయతి తమే వాహ, తథైవాన్వయవ్యతిరేకాభ్యామవసా యాత్.తతో లోకవ్యుత్పత్తిమనతిక్రమ్య వేదే ప్యనేన స్వప్రయోక్త్రైవ వక్తవ్యః, అన్యథా అప్రయోగప్రసంగాత్. న చ యో యదో చ్చారయతి వైదికమహామశబ్దం స ఏవ తదా తస్యాఽర్థ ఇతి యుక్తం, తథా సతి మాముపా సీతేత్యాదౌ స ఏవ ఉపాస్యః స్యాత్. అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే, ఇత్యుపాధ్యాయశిష్యపరంపరైవ ఆత్మన్యైశ్వ

ర్యం సమధిగచ్ఛేత్. తథా చ ఉపాసనాం ప్రత్యుస్మత్తకేలిః స్యాత్. లోకవ్యవహారశ్చోచ్ఛిద్యేత. తస్మాన్నానువక్తాస్య వాచ్యః అపి తు వక్తైవేతి స్థితే ప్రయుజ్యతే. వేదే అస్మచ్ఛబ్దః స్వప్రయోక్తృవచనః. అస్మచ్ఛబ్దత్వాత్ లోకవదితి.

తా. లోకమందువలె వేదమందుఁగూడ నస్మచ్ఛబ్దము ప్రయోగించఁబడుచున్నది. లోకమందు ప్రయోగించఁబడు నస్మచ్ఛబ్దమున కచేతనమైన వస్తువేదియును నర్థము గాదు. అట్లైనచో నేను ఘటము నేను పటమనియెడి ప్రయోగము కూడ నుండవలసివచ్చును. పరాత్మనుద్దేశించి యహాం శబ్ద ప్రయోగము లేనందున నాత్మమాత్ర మస్మచ్ఛబ్దమున కర్థ మనిచెప్పుటకు వీలులేదు. మఱి యేమన ? ఎవఁడు స్వతంత్ర ముగ నస్మచ్ఛబ్దము నుచ్చరించునో ఆస్వతంత్రోచ్చారణ చేయువాఁడే యన్వయవ్యతిరేకములఁబట్టి యర్థమని చెప్ప వలెను. అందువలన లోకములోఁ బ్రయోగించు నస్మచ్ఛబ్దము నకు స్వతంత్రోచ్చారణకర్త యెటులర్థమో యటులనే వేదము లోనుండెడి నస్మచ్ఛబ్దమునకుఁగూడ నట్టి స్వతంత్రోచ్చారణఁ జేయువాఁడే యర్థమని చెప్పవలెను. అట్లంగీకరించనిచో వేద మందు నస్మచ్ఛబ్దప్రయోగమే లేకపోవలసి వచ్చును. ఉచ్చారణకర్తయే యస్మచ్ఛబ్దమున కర్థమనిచెప్పుటకు వీలులేదు. భగ వంతునిచే నుచ్చరితమయిన "మాముపాసీత" యను వాక్యము నెవఁ డుచ్చరించునో యట్టివాఁడుగూడ నస్మచ్ఛబ్దోచ్చారణ

కర్తయగుటవలన నస్మచ్ఛబ్దార్థమయినచో వానికిఁగూడ భగవంతునివలె నుపాస్యత్వము రావలసివచ్చును. ఇటులనే యస్మచ్ఛబ్దముతోఁగూడిన గీతావాక్యములను గురుశిష్యు లుచ్చరించునపుడు వారికిఁగూడ భగవంతునికివలె జగత్కర్తృత్వము జగత్ప్రవర్తకత్వముఁగూడ రావలసివచ్చును. అటుల నిష్టము గాదు గదా! అస్మదాదులకే యుపాస్యత్వము చెప్పుట మంచిదిగాదు. భగవంతుఁ డుపాస్యుఁడు. మన ముపాసకులమనెడు వ్యవహారమునకే లోపము వచ్చును. కావున ననుకరణ చేసిన పురుషుఁ డస్మచ్ఛబ్దార్థము కాఁడు. స్వతంత్రముగా నుచ్చరించినపురుషుఁ డెటులు లోకములో నస్మచ్ఛబ్దార్థమో యటులనే వేదమందుండు నస్మచ్ఛబ్దమునకుఁగూడ స్వతంత్రోచ్చారణకర్తయే యర్థమని చెప్పవలెను. వేదోచ్చారణకర్తృత్వమస్మదాదులకు సంభవించనందున తత్కర్త యీశ్వరుఁడని చెప్పవలెను.

మూ. ఏవమన్యేపి యః కః సః. ఇత్యాదిశబ్దా ద్రష్టవ్యాః. తేషాం బుధ్యుపక్రమప్రశ్నపరామర్శాదుపహితమర్యాదత్వాత్, తస్య చ వక్తృధర్మత్వాత్. బుధ్యుపక్రమో హి ప్రకృతత్వం జిజ్ఞాసా ఆవిష్కరణం చ ప్రశ్నః ప్రతిసంధానం చ పరామర్శ ఇతి ఏవం చ సంశయాదివాచకా అప్యున్నేయాః న చ జిజ్ఞాసాసంశయాదయః సర్వజ్ఞే ప్రతిషిద్ధా ఇతి యుక్తం. శిష్యప్రతిబోధనాయ ఆహార్యత్వేనావిరోధాత్. కో ధర్మః కథం లక్షణక ఇత్యాదిభాష్యవదితి. ఏతేన ధిగ

హా బత హంతేత్యాదయో నిపాతాః వ్యాఖ్యాతాః.

తా అస్మచ్ఛబ్దార్థముగా వేదవక్త యెటులు సిద్ధించునో యటులనే వక్తృధర్మములయిన బుధ్యుపక్రమ జిజ్ఞాసా ప్రతిసంధాన సంశయాదులను బోధించెదు. యః,కః,సః, అనెడు శబ్దములనుగూడ తత్తదర్థములయిన బుధ్యుపక్రమాశ్రయుండైన వక్త సిద్ధించును. సర్వజ్ఞుండైన యీశ్వరునియందు జిజ్ఞాసాసంశయాదికము శిష్యునియొక్క బోధనిమిత్తమై ఆహార్య రూపముగ నుండుటలో నేమియు విరోధము లేదు. బుధ్యుపక్రమాదికము వక్తృధర్మములని చెప్పుటచే నిందను ఆశ్చర్యమును ఖేదాదులను జెప్పు ధిక్, అహో, బత, హంత, ఇత్యాది నిపాతలుగూడ వ్యాఖ్యాతములైనవి.

మూ. ప్రత్యయాదపి. లింజాదిప్రత్యయా హి పురుష
ధౌరేయనియోగార్థా భవంతః తం ప్రతిపాద
యంతి. తథాహి

శ్లో. "ప్రవృత్తిః కృతిరేవాత్ర సాచేచ్ఛాతో యతశ్చ సా,
తజ్జ్ఞానం విషయస్తస్య విధిస్తజ్జ్ఞాపకోఽథవా." ౭

తా. ప్రత్యయమనఁగా లిజాదిప్రత్యయములు. వాటివలనఁగూడ నీశ్వరుఁడు సిద్ధించును. లోకములోనుండు లిజాదుల కాప్తేచ్ఛ యెటులర్థమో వేదములోనుండు లిజాదులకుఁగూడ నదియే యర్థము. వేదార్థమం దస్మదాదుల కిచ్ఛ సంభవించనందున లిజర్థమైన నిచ్ఛాశ్రయుఁడైన నాప్తుఁడు పరమేశ్వరుఁడని చెప్పవలెను.

ప్రవృత్తియనఁగా కృతియే. అట్టికృతి ఇచ్ఛవలనఁ గలుగును. కృతికారణమైన నిచ్ఛ దేనివలనఁగలుగునో యది జ్ఞానము. ఆజ్ఞానములో విషయమైన కృతిసాధ్యత్వ ఇష్టసాధనత్వములే విధికి నర్థములని యొకమతము.

ఇష్టసాధనత్వానుమాపకమైన నాప్తునియొక్క యభిప్రాయమే విధ్యర్థమనిన వీనుల యభిప్రాయము.

మూ. ప్రవృత్తిః ఖలు విధికార్యా సతి న తావత్కాయపరిస్పందమాత్రం, ఆత్మా జ్ఞాతవ్య ఇత్యాద్యవ్యాపనాత్. నాపి ఇచ్ఛామాత్రం, తత ఏవ ఫలసిద్ధౌ కర్మాఅనారంభప్రసంగాత్ తతః ప్రయత్నః పరిశిష్యతే, ఆత్మజ్ఞానభూతదయాదావపి తస్యా భావాత్ తదుక్తం ప్రవృత్తిరారంభః—ఇతి నేయం ప్రవృత్తిః యతః సత్తామాత్రావస్థితాత్; నాసౌ విధిః, తత్ర శాస్త్రవైయర్థ్యాత్. అప్రతీతాదేవ కుతశ్చిత్ ప్రవృత్తిసిద్ధౌ తత్ప్రియనార్థం తదభ్యర్థనాభావాత్. న చ ప్రవృత్తిహేతుజ్ఞానజననార్థం తదుపయోగః, ప్రవృత్తిహేతో రిచ్ఛాయాః జ్ఞానయోనిత్వాత్, జ్ఞానమనుత్పాద్య తదుత్పాదనస్యాశక్యత్వాత్, తస్య చ నిరాలంబనస్య అనుత్పత్తేః అప్రవర్తకత్వాచ్చ, నియామకాభావాత్.

తా. ఆప్తాభిప్రాయము విధ్యర్థమని చెప్పుటకొఱ కితర మతఖండన మావశ్యకము. కాన తత్తన్మతముల ప్రవర్తక జ్ఞానవిషయమైనవానిని గ్రమముగాఁ జెప్పి ఖండింపఁబోవు చున్నాఁడు.

విధి జ్ఞానకార్యము ప్రవృత్తియేగాని శరీరపరిస్పంద యని చెప్పుటకు వీలులేదు. "ఆత్మాజ్ఞాతవ్యః" అనుస్థలమున పరిస్పంద లేకపోవుటవలన నాత్మజ్ఞానమందు ప్రవృత్తి గలుగకపోవలసివచ్చును. ఇచ్ఛామాత్రము విధ్యర్థమని చెప్పుటకు వీలులేదు. దానివలననే విధ్యర్థముయొక్క నిర్వాహ మగుచుండఁగా బహువిత్తవ్యయాయాససాధ్యమగు యాగాదికముయొక్క యారంభమే లేకపోవలసివచ్చును. ఆత్మజ్ఞానమందు భూతదయయందు చేష్టారూపమగు పరిస్పంద లేకపోయినను ప్రవృత్తి యున్నందునఁ బ్రవృత్తియే విధ్యర్థమని చెప్పవలెను. తెలియఁబడని ప్రవృత్తికారణము విధ్యర్థమని చెప్పుటకు వీలులేదు. అట్టిదానివలననే ప్రవృత్తి సిద్ధించుచుండఁ బ్రవృత్తికారణమును బోధించెడుశాస్త్రమునకు వైయర్థ్యము సంభవించును. ప్రవృత్తిహేతువును బుట్టించుటలో శాస్త్రముయొక్క యుపయోగమని చెప్పుటకు వీలులేదు. ప్రవృత్తిహేతువైన నిచ్ఛ జ్ఞానమువలనఁ గలుగును. అట్టి జ్ఞానమువలన నిచ్ఛ సంభవించును. కాని జ్ఞానము పుట్టనిచో శాస్త్రమువలన నిచ్ఛ పుట్టుట శక్యము గాదు. శాస్త్రమువలనఁ గలుగుజ్ఞానము నిర్విషయకమైనచో నియామకము లేనందునఁ బ్రవృత్తికారణత్వము సంభవించదు.

మూ. తస్మాత్ యస్య జ్ఞానం ప్రయత్నజననీమిచ్ఛాం ప్రసూతే సోఽర్థవిశేషః, తద్జ్ఞాపకో వా అర్థ విశేషో విధిః ప్రేరణా ప్రవర్తనా నియుక్తి ర్నియోగః ఉపదేశ ఇత్యనర్థాంతరమితి స్థితే విచార్యతే. స హి కర్తృధర్మో వా స్యాత్ కర్మధర్మో వా కరణధర్మో వా నియోక్తృధర్మో వేతి. న ప్రథమః.

తా. అందువలన దేనియొక్క జ్ఞానము ప్రయత్నజనకమైన నిచ్ఛను బుట్టించునో యాయర్థవిశేషముగాని దానికి ననుమాపకముగాని విధ్యర్థము. అదియే ప్రేరణాదిశబ్దములచే జెప్పఁబడును. కాని యాయర్థముయొక్క విచారణ మావశ్యకము. అట్టియర్థము కర్తృధర్మమా? లేక కర్మయందుండు ధర్మమా? లేక కరణమందుండు ధర్మమా? ప్రయోజకునియందుండు ధర్మమా? యని విచారించెదము. మొదటిదైన కర్తృ ధర్మమని చెప్పుటకు వీలులేదు. ఆకర్తృధర్మము మూఁడువిధములు. 1 స్పందయని, 2 ఇచ్ఛయని, 3 ప్రయత్నమనియు.

శ్లో. ఇష్టహానేరనిష్టాప్తేర ప్రవృత్తే ర్విరోధతః,
ఆసత్వాత్ప్రత్యయత్యాగాత్ కర్తృధర్మో న సంకరాత్.౮

మూ. స హి న స్పంద ఏవ, ఆత్మానమను పశ్యేదిత్యా ద్యవ్యాప్తేః గ్రామం గచ్ఛతీత్యాదావతివ్యాప్తే శ్చ నాపి తత్కారణం ప్రయత్నః, తస్య సర్వాఖ్యాతసాధారణత్వాత్.

తా. వెనుకఁజెప్పిన కర్తృధర్మములలో మొదటిదగు స్పందయే ప్రవృత్తిప్రయోజకమైనచో నాత్మజ్ఞానమందు స్పంద లేనందునఁ బ్రయత్నము లేకపోవలసివచ్చును. ఇష్ట హానియనఁ గా నిదియే "గ్రామంగచ్ఛతి" అనుస్థలమున స్పంద యున్నందున గ్రామమందు ప్రవృత్తి కలుగవలసివచ్చును. ఇట్టి యవ్యాప్త్య తివ్యాప్తులు వచ్చును గాన స్పంద విధ్యర్థమని చెప్పుటకు వీలు లేదు. యత్నము విధ్యర్థమనినచో యత్న మాఖ్యాతమాత్ర మునకే యర్థమగుటవలన ననిష్టసాధనమైనవానియందుఁగూడఁ బ్రయత్నమున్నందున నట్టిప్రయత్నము లేకపోవలసివచ్చును.

మూ. నను న సర్వత్ర ప్రయత్నఏవ ప్రత్యయార్థః,
కరోతీత్యాదౌ ప్రకృత్యర్థాతిరేకిణః తస్యాభా
వాత్. సంఖ్యామాత్రాభిధానేన ప్రత్యయస్య
చరితార్థత్వాత్. తతో లిఙాదివాచ్యఏవ ప్రయ
త్న ఇతి. న. కుర్యాదిత్యత్రాపి తుల్యత్వాత్.

తా. 'కరోతి' అనుస్థలమున నాఖ్యాతప్రకృతి యైనధా తువువలననే యత్నరూపార్థము లభించుటవలన కృఞ్ ధాతూ త్తరమం దుండాఖ్యాతకు సంఖ్యయే యర్థము గాన నాఖ్యాత సామాన్యమునకు యత్నార్థకత్వము చెప్పుటకు వీలులేనందున విధిప్రత్యయమునకే యత్నార్థకత్వము చెప్పెదమని యాశంకిం చుటకు వీలులేదు. 'కరోతి' యనుస్థలమున బ్రకృత్యర్థాతిరిక్త మయిన ప్రయత్నరూపార్థ మెటులు చెప్పుటకు వీలులేదో "కుర్యాత్" అను విధిస్థలమునఁగూడ ప్రకృత్యర్థాతిరిక్తమైన యత్నార్థకత్వము లేకపోవుట తుల్యము.

మూ. ప్రయత్నమాత్రస్య ప్రకృత్యర్థత్వేపి తస్య పరాంగతాపన్నస్య ప్రత్యయార్థత్వాత్. న తుల్యత్వమితి చేత్. న. తథాపి తుల్యత్వాత్. న చేకస్య తద్వాచకత్వే అన్యస్య తద్విపర్యయ ఆపద్యేత, ఏకో ద్వౌ బహవః. ఏషిషిషతీత్యాదౌ వ్యభిచారాత్. తత్ర ద్వితీయసంఖ్యేచ్ఛాదికల్పనే కరోతి ప్రయతతే ఇత్యాదావపి తథా స్యాత్ ప్రత్యేకమన్యత్ర సామర్థ్యావధృతౌ సంభేదే తథాకల్పనాయాస్తుల్యత్వాత్.

తా. "కుర్యాత్" అనెడు విధిస్థలమున బ్రకృతిభూతమైన కృఞ్ ధాతువు యత్నార్థకమయినను తదుత్తరమందుండెడు విధిప్రత్యయమునకుఁ జైత్రాది సంబంధిత్వముగాని యనుకూలత్వము గాని యర్థమని చెప్పెదము గానఁ దుల్యముగాదని యాశంకించుటకు వీలులేదు. విధిప్రత్యయస్థలమందెటులనో "కరోతి" యను స్థలమందుఁగూడ నటులనే తుల్యమని చెప్పవలసివచ్చును. ప్రకృతి యేయర్థమును బోధించునో యాయర్థమును బ్రత్యయము చెప్పదనుటకు వీలులేదు. 'ఏకో, ద్వౌ, బహవః.' అనుస్థలమున బ్రకృతిప్రత్యయముచే నేకత్వ ద్విత్వ బహుత్వరూపసంఖ్యయు "ఏషిషిషతి" యనుస్థలమున బ్రకృతిప్రత్యయముచే నిచ్ఛయుఁ జెప్పఁబడుచున్నందున వ్యభిచారము సంభవించును పూర్వోక్తస్థలమునందు ప్రకృతిచేఁ జెప్పఁబడుచున్న సంఖ్యేచ్ఛాదులకంటె వేఱగు సంఖ్యేచ్ఛాదులే చెప్పఁబడునని వ్యభిచారమును వారించినచో 1. ప్రత్యేకము

ధాతువునకు ప్రత్యయమునకు నొకయర్థమున సామర్థ్యము నిశ్చితమైనపు డా రెండును గలసియున్నపుఁ డట్టి కల్పన తుల్యము గాన "కరోతి, ప్రయతతే" యనుస్థలమునఁగూడఁ బ్రకృత్యర్థమైనఁ బ్రయత్నముకంటె వేఱగుప్రయత్నమే యర్థము కావలసివచ్చును.

మూ. రథో గచ్ఛతీత్యాదౌ తదసంభవే కా గతిరితి చేత్. తంతవః పటం కుర్వంతీత్యత్ర యా లోకోపచారోఽయమపర్యనుయోజ్య ఇతి చేత్ తుల్యమ్. లిజః కార్యత్వే వృద్ధవ్యవహారాద్వ్యుత్పత్తౌ సర్వం సమంజం, ఆఖ్యాతమాత్రస్య తు న తథేతి చేత్. న. వివరణాదేరపి వ్యుత్పత్తేః. అస్తి చ తదిహ. కిం కరోతి? పచతి, పాకం కరోతి, ఇత్యాదిదర్శనాత్.

తా. ఆఖ్యాతకు యత్నార్థకత్వము చెప్పినచో "రథో గచ్ఛతి" యనుస్థలమం దచేతనమైన రథమందు ధాత్వర్థానుకూలప్రయత్నము లేకపోయినను ఆఖ్యాత ప్రయోగ మున్నందున నచట నట్టి ప్రయోగ మె ట్లుపపన్నమగుననుచో నచేతనమగు కర్తనుబోధించు పదసమభివ్యవహారములో ధాత్వర్థానుకూలవ్యాపార మాఖ్యాతకు నర్థముఁ జెప్పి "తంతవః పటం కుర్వంతి" యనుప్రయోగ మెటుల నుపపన్నముచేయుదురో యటులనే "రథోగచ్ఛతి" యనుస్థలమందుఁ గూడ నటులనే యుపపన్నము చేయుదురు. లిజకు కృతిసాధ్యత్వరూపకార్యమందు వృద్ధవ్యవహారమునుబట్టి శక్తి నిర్ణయించెదము. కావున లిజర్థము ప్రయత్నము కావచ్చును. ఆఖ్యా

తమాత్రమున కట్టిశక్తి గ్రాహకము లేనందున యత్నార్థకత్వము లేదని యాశంకించుటకు వీలులేదు. వ్యవహారమువలె వివరణ గూడ బాధకము లేనిచో శక్తిగ్రాహకము గాన "కింకరోతి" యని ప్రశ్నించునపుడు "పచతి"యని యుత్తరమిచ్చును. దానికి "పాకం కరోతి" యనెడు వ్యాఖ్యానమువలన పచధాతువు నకు పాకమందు నాఖ్యాతమునకు కృతియందును శక్తి నిశ్చ యింపఁబడును.

మూ. తథాపి ఫలానుకూలతాపన్న ధాత్వర్థమాత్రాభి ధానే తదతిరిక్తప్రయత్నాభిధానకల్పనాయాం కల్పనాగౌరవం స్యాత్. అతో వివరణమపి తావన్మాత్రపరమితి చేత్. భవేదప్యేవం యది పాకేనేతి వివృణుయాత్. న త్వేతదస్తి ధాత్వ ర్థస్యైవ పాకమితి సాధ్యత్వేన నిర్దేశాత్. తత స్తం ప్రత్యేవ కించిదనుకూలతాపన్నం ప్రత్య యేనాభిధానీయమితి యుక్తం.

తా. "ఓదనం పచతి" అనుస్థలమున పచధాతువునకు పూర్వరూప నాశరూపఫలానుకూల కర్మసముదాయ మర్థము. ఆఖ్యాత కనుకూలత్వముమాత్ర మర్థమని కల్పించుటచే నుప పన్న మగుచుండఁగ యత్నార్థకత్వకల్పనలో గౌరవము వచ్చును. అందువలన 'పచతి' యనుపదమునకు "పాకం కరోతి" యనువివరణముకూడ నట్టియర్థమునే బోధించును గాని యత్న రూపార్థమందు శక్తి గ్రాహకము గాదనినచో "కాష్ఠేన ఓదనం పచతి" యనునటుల "ఓదనం పాకేన కరోతి" యని ప్రయోగమున్నచో నట్టియర్థము చెప్పుట సరిపోవును. అట్టి

ప్రయోగము స్వారసికము గాదు. "పచతి" అనుస్థలమున ధాత్వర్థమునకే "పాకం" అని వివరణమున్ను దానినిగూర్చి యనుకూలమైన నొకదానిని ప్రత్యయముచేఁ జెప్పవలసియున్నది గాన నదియే "కరోతి" యనుదానిచేత వివరింపఁబడెను. అట్టివివరణవలన ననుకూలప్రయత్నమందే ప్రత్యయమునకు శక్తిగ్రహము కలుగునని చెప్పుటయే యుక్తము.

మూ. తథాపి తేన ప్రయత్నేనైవ భవితవ్యం న త్వన్యేనేతి కుత ఇతి చేత్. నియమేన తథావివరణాత్. బాధకం వినా తస్య అన్యథా కర్తుమశక్యత్వాత్. అన్యథా అతిప్రసంగాత్.

తా. అట్టి పాకానుకూలతాపన్నమైనది ప్రయత్నమే గాని మఱియొకటి గాదని యెటుల నిశ్చయించెదవు? బాధకము లేనిచో "పచతి" యనుదానికి "పాకం కరోతి" యని వివరణ యున్నది గాని మఱియొకవిధముగా వివరణ లేనందున యత్నముకంటె మఱియొకయర్థము చెప్పుటకు వీలులేదు. గౌరవమువలన యత్నార్థకత్వము చెప్పనిచో "ఓదనం పాకేన కరోతి" యను నపప్రయోగ ముండవలసివచ్చును.

మూ. స్యాదేతత్. యస్య కస్యచిత్ఫలం ప్రత్యనుకూలతాపత్తిమాత్రమేవ కరోత్యర్థః న తు ప్రయత్నఏవ. సోపి వ్యానేనైవ ఉపాధినా ప్రత్యయేన వక్తవ్యో న తు యత్నత్వమాత్రేణ. ప్రయత్నపదేన అవిశేషప్రసంగాత్. తద్వారం తావన్మాత్రమేవ అస్తు లాఘవాయ. అన్యథా

త్వానుకూలత్వప్రయత్నత్వే ద్వావప్యుపాధీకల్ప
నీయౌ, అచేతనేషు సర్వత్ర గౌణార్థాస్తిజో
అసతి బాధకే కల్పనీయా ఇతి చేత్ అత్రో
చ్యతే.

తా. వివరణవాక్యములోనుం డాఖ్యాతకు వివరణ
మైన "కరోతి" యనుపదమునకు కేవల యత్నత్వరూపోపా
ధిచే యత్నమాత్ర మర్థముగాదు. అనుకూలవ్యాపారత్వ
రూపోపాధిచే యత్నముకూడ నర్థము కావచ్చును. యత్నత్వ
రూపోపాధిచే యత్నార్థకత్వము చెప్పినచో నాఖ్యాతకు
యత్నపదపర్యాయత్వము వచ్చును. ఆఖ్యాత కనుకూలత్వ
ప్రయత్నత్వరూప ధర్మద్వయపురస్కారేణ యత్నార్థకత్వము
చెప్పుటకంటె కేవలానుకూలత్వ పురస్కారేణ యత్నార్థ
కత్వము చెప్పుట లాఘవము గాన ననుకూలవ్యాపారమే
యాఖ్యాత కర్థమని చెప్పవలెను. "రథోగచ్ఛతి" అనుస్థలమున
బాధకము లేనపు డావాక్యమునందుండె డాఖ్యాతకు లక్షణా
కల్పనవచ్చును. మీామతమున అనుకూలవ్యాపారమే యాఖ్యా
తార్థమైనచో నట్టిలక్షణాకల్పన రూపగౌరవము లేదు గాన
నదియే యాఖ్యాత కర్థమనినచో సమాధానము చెప్పఁబడు
చున్నది.

శ్లో. కృతాకృతవిభాగేన కర్తృరూపవ్యవస్థయా,
యత్నఏవ కృతిః పూర్వాపరస్మిన్ సైవభావనా. 7

తా. ఘటము కృతమనియు, అంకురాదిక మకృత
మనెడు విభాగముచేతను తృజంతమగు కృఞ్ ధాతు వ్యుత్పన్న

మయిన కర్తృపదము కృత్యాశ్రయవాచక మగుటచేత నుత్త కాలవర్తి ధాత్వర్థమైనచో దానికి సాధనమైనది యత్నరూప భావనయని యర్థము.

మూ. యత్నపూర్వకత్వం హి. ప్రతిసంధాయ ఘటా దౌ కృత ఇతి వ్యవహారాత్. హేతుసత్వప్రతి సంధానేపి యత్నపూర్వకత్వప్రతిసంధానవిధు రాణామంకురాదౌ తదవ్యవహారాత్. కరో త్యర్థో యత్న ఏవ తావదవసీయతే. అన్యథా హి యత్కించిదనుకూలపూర్వకత్వాఽవిశేషాత్. ఘటాదయః కృతాః న కృతాస్త్వం కురాదయ ఇతి కుతో వ్యవహారనియమః. తేన చ సర్వ మాఖ్యాతపదం వివ్రియతే ఇతి సర్వత్ర స ఏవార్థ ఇతి నిర్ణయః తథా చ సముదితే ప్రవృత్తం పదం తదేకదేశేపి ప్రయుజ్యతే విశుద్ధిమాత్రం పురస్కృత్య బ్రాహ్మణే శ్రోత్రి యపదవత్.

తా. యత్నపూర్వకత్వజ్ఞాన మున్నపుడే ఘటాదిక మందు 'కృతోఘటః' యని వ్యవహార ముండుటవలనను,అంకు రాదికమందు యత్నపూర్వకత్వప్రతిసంధానము లేక హేతు మత్వ ప్రతిసంధాన మున్నను యత్నపూర్వకత్వ ప్రతిసంధా నము లేనిచో "అంకురోన కృతః" యని వ్యవహారమువలనను "కరోతి" కి యత్నమే యర్థమని చెప్పవలెను. అటులగా కను

కూలవ్యాపారమే యర్థమైనచో నేదో యొకయనుకూలవ్యాపారపూర్వకత్వము ఘటాదులకువలె నంకురాదికమునకుఁగూడ నున్నందున ఘటాదులు కృతములనియు, అంకురాదిక మకృతమనెడు వ్యవహార మెటు లుపపన్న మగును? అందుచే నాఖ్యాత సామాన్యమునకు "కరోతి" యను వివరణము చేయఁబడుచున్నది. "పచతి" యనుదానికి 'పాకం కరోతి' యను వివరణముచే నీయాఖ్యాతకు యత్నార్థకత్వము చెప్పినపుడు సర్వాఖ్యాతల కదియే యర్థమని నిర్ణయించెదము. ఆఖ్యాతపదమునకు పూర్వాపరీభూతత్వమున్ను యత్నమున్ను అనుకూలత్వమున్ను వాచ్యార్థములు. ఈమూఁటితో గూడిన ప్రయత్న మచేతనమైన రథాదికమందు లేదు గాన "రథో గచ్ఛతి" యనుప్రయోగ మెటుల సాధ్యమగును? అని యాశంకించుటకు వీలు లేదు. సముదాయమందు ప్రవృత్తమైన పద మేకదేశమందుఁగూడఁ బ్రయోగింపఁబడును. శ్రోత్రియ శబ్దము వేదాధ్యయనసంపత్తి గలబ్రాహ్మణునియందుఁ బ్రయోగింపఁ బడుచున్నది. ఈశ్రోత్రియపదము వేదాధ్యేతృత్వబ్రాహ్మణత్వ రూపసముదాయమందు శక్తమైనను లక్షణచే నేకదేశమైన శ్రోత్రియత్వ రూపవిశేషణమం దెటులఁ బ్రయోగింపఁబడునో, యటులనే సముదాయశక్తమైన ఆఖ్యాతపద మేకదేశమైన ఫలానుకూలరూప ఏకదేశరూపార్థమునుబట్టి లక్షణచే నచేతనమైన రథాదులయందు "గచ్ఛతి" యని ప్రయోగింపఁబడుచున్నది.

మూ. అన్యథాపి మధ్యమోత్తమపురుషగామినః ప్రత్యయాః; ప్రథమే పురుషే జానాతి ఇచ్ఛతి

ప్రయతతే. అధ్యవశ్యతి శేతే సంశయతే ఇత్యాదయశ్చ గౌణార్థా ఏవ అచేతనేషు. న చ వృత్త్యంతరే ణాపి ప్రయోగసంభవే శక్తి కల్పనా యుక్తా, అన్యాయశ్చ అనేకార్థత్వ మితి స్థితేః. అత ఏవ అనుభవోపి యావదుక్తం భవతి. పాకానుకూలవర్తమానప్రయత్నవాన్, తావదుక్తం భవతి పచతీతి. ఏవం తథాభూతాతి వృత్తప్రయత్నో అపాక్షీదితి. ఏవం తథా భూతభావిప్రయత్నః పక్ష్యతీతి. న తు పచతీతి పాకానుకూలయత్కించిద్వానితి. అన్యథా అతి థావపి పరిశ్రమశయానే పచతీతి ప్రత్యయ ప్రసంగాత్.

తా. చిత్తరువులయందు మధ్యమోత్తమపురుషుల లిఙుల ప్రయోగ మెటుల గౌణమో యటులనే యచేతనమందు 'జానాతి ఇచ్ఛతి యతతే' యను ప్రథమపురుషప్రయోగము లెటుల గౌణార్థములో యటులనే "రథో౽గచ్ఛతి" యను స్థల మందుఁగూడ నాఖ్యాతప్రయోగము గౌణార్థము లక్షణా వృత్తిచేఁ బ్రయోగోపపత్తి కలుగుచుండఁగ లక్ష్యార్థమందుఁ గూడ శక్తికల్పనము యుక్తముగాదు. ఒకదానియందే శక్తి. ఇతరమైన నర్థములయందు లక్షణా యని వ్యవస్థ చేయుదుము. ఎపుడు పాకానుకూలవర్తమానప్రయత్నము కలవాఁడగునో యపుడు వానియందు "పచతి" యనుప్రయోగ ముండును. ఇటులనే పాకానుకూల భూతప్రయత్నము కల వానియందు "అపాక్షీత్" అనుప్రయోగ ముండును. ఇటు

లనే పాకానుకూలమైన భావిప్రయత్నముఁ గలవానియందు "పక్ష్యతి" యని ప్రయోగమున్నట్లనుభవమున్నది కాని ప్రయత్నము లేక పాకానుకూలమైన నేదో యుండుటను బట్టి "పచతి" యను ప్రయోగమున్నట్లనుభవము లేదు. అట్లయినచో శ్రమవలన నిద్రించినవానియొక్క శ్రమ శాంతి గూడ పాకానుకూల మగుటవలన శ్రమవలన నిద్రించిన నతిథి యందుఁగూడ "పచతి" యను ప్రయోగ ముండవలసివచ్చును. కాన యత్నమే యర్థముగాని యనుకూలవ్యాపార మర్థమని చెప్పుటకు వీలులేదు. ఇంతవఱకు పైశ్లోకముయొక్క ప్రథమ పాదతాత్పర్యము.

మూ. అపి చ కర్తృవ్యాపారఏవ కృఞర్థః చేతనశ్చ కర్తా, అన్యథా తద్వ్యవస్థానుపపత్తేః. న వ్యభిధీయమాన వ్యాపారవత్త్వం కర్తృత్వం, అనభిధానదశాయాం కుర్వతోఽప్యకర్తృత్వప్రసంగాత్. నాప్యాఖ్యాతప్రత్యయాభిధానయోగ్యవ్యాపారశాలిత్వం కర్తృత్వం, యోగ్యతాయా ఏవ అనిరూపణాత్. ఫలానుగుణమాత్రస్య సర్వకారకవ్యాపారసాధారణత్వాత్. నాపి వివక్షాతో నియమః, అవివక్షాదశాయామనియమప్రసంగాత్ స్వవ్యాపారేనేదమనిష్టమితి చేత్.

తా. "కర్తృరూపవ్యవస్థయా" అనే ద్వితీయపాదము "అపి చ" యనుగ్రంథముచే వ్యాఖ్యానము చేయఁబడుచున్నది. కర్త యనఁగాఁ జేతనుఁడే. కర్త యనుపదములో

నుండు కృఞ్ నకు కర్తృవ్యాపారమే యర్థము. ఆవ్యాపారము జ్ఞానముగాని, చికీర్ష గాని, ప్రయత్నముగాని యగును. కృఞర్థము మొదటఁ జెప్పినది గాన మఱియొకవ్యాపారమే యైనచో జేతనునియందువలె నచేతనమైనవానియందుఁగూడఁ గర్తృపద ప్రయోగ ముండవలసి వచ్చును. దేనియొక్క వ్యాపారమును ధాతువుగాని యాఖ్యాతముగాని ప్రధానముగాఁ జెప్పునో యట్టిస్వతంత్రమైనఁ జేతనముగాని యచేతనముగాని కర్త యని చెప్పినచో నట్టివ్యాపారమును బోధించెడు ధాతువు గాని యాఖ్యాతముగాని ప్రయోగింపఁబడనిసమయమునఁ గార్యకర్తయగువానికి కర్తృత్వము లేకపోవలసి వచ్చును. వ్యాపారబోధకమైన నాఖ్యాతయొక్కగాని ధాతువుయొక్క గాని ప్రయోగము లేకపోయినను ఆఖ్యాత యోగ్యవ్యాపార మునుబట్టి కర్తృత్వ ముపపాదనఁ జేయుటకే ధర్మమునుబట్టి యాఖ్యాత యోగ్యతయుండునో, యట్టి ధర్మజ్ఞానము లేని సమయమున యోగ్యతయే యుండుట దుర్లభము గాన యోగ్యతావ్యాపారమునుబట్టి కర్తృత్వ ముపపాదనఁ జేయు టకు వీలు లేదు. ఫలానుగుణత్వమాత్రము యోగ్యతయని చెప్పినచో నిట్టియోగ్యత ఇతరకారకములందుండు వ్యాపారమం దుండును గాన వాటికిఁగూడఁ గర్తృత్వము రావలసి వచ్చును.

ఫలానుకూలవ్యాపారము కలదిగానే కారకము వివక్షఁ జేయఁబడునో యాకారకమే కర్త యనెదము. ఇతరకారకము లట్టి ఫలానుకూలవ్యాపారములు కలవియైనను వివక్షితము గానందున వానికి కర్తృత్వము లేదని నియమించుట

యుక్తము గాదు. కార్యకారి యగుకర్తకు ఫలానుగుణ వ్యాపారవివక్ష లేనపుఁ డట్టివానికి కర్తృత్వము లేకపోవలసి వచ్చును. వివక్షనుగూడఁ గర్తృత్వశరీరములో నుంచుటకు వీలులేదు. ఫలానుగుణవ్యాపారమే కర్తృత్వమని చెప్పినచో సర్వకారకములకు తమతమ వ్యాపారములలోఁ దనకు కర్తృత్వ మిష్టమే గాన వానికి కర్తృత్వాపత్తి యిచ్చుటకు వీలులేదు. ఏలన? కర్తృత్వ మనిష్టమగునపుడే యాపత్తి నివ్వవలెను. స్వస్వవ్యాపారములలో వాట్లకుఁగూడఁ కర్తృత్వ మిష్టమే గాన ననిష్టము గాదు. అనినచో,

మూ. ఏవం తర్హి స్వవ్యాపారే చ కర్తృత్వం సర్వత్రైవాస్తి కారకే.—ఇతి న్యాయేన కరణాది విలోపప్రసంగః. న స్వవ్యాపారాపేక్షయా కరణాదివ్యవహారః, కింతు ప్రధానక్రియాపేక్షయా. అస్తి హి కాంచిత్క్రియాముద్దిశ్య ప్రవర్తమానానాం కారకాణామవాంతరవ్యాపారయోగో న త్వవాంతరవ్యాపారార్థమేవ తేషాం ప్రవృత్తిరితి చేత్. తర్హి తదపేక్షయైవ కర్తృకర్మాదివ్యవహారవిశేషనియమే కిం కారణమితి చింత్యతాం, స్వాతంత్ర్యాదితి చేత్. నను తదేవ కిమన్యత్ ప్రయత్నాదిసమవాయాదితి వివిచ్య అభిధీయతామితి తస్మాత్ సర్వత్ర సమానవ్యాపారవివాఖ్యాతార్థః.

తా. అట్లైనచో సర్వకారకములయందు స్వస్వవ్యాపారములలోఁ గర్తృత్వ ముండుననున్యాయము చేత నన్నియు

కర్తృకారకములే కావలసివచ్చును. కరణాదికారకముల లోపప్రసంగము వచ్చును. కర్తృకరణాదుల వ్యవహారము స్వస్వవ్యాపారమును బట్టిగాదు. ప్రధానక్రియనుబట్టి వ్యవహారము ఏదో యొకక్రియనుద్దేశించి ప్రవృత్తములైన కారకముల కవాంతరవ్యాపారసంబంధ ముండును. కాని యట్టి యవాంతరవ్యాపారములనిమిత్తమే కారకములయొక్క ప్రవృత్తి గాదు. కానఁ గరణాదికారకములకు విలోపప్రసంగము లేదనిచెప్పినచోఁ బ్రధానక్రియనుబట్టియే కర్తృకర్మాది వ్యవహారవిశేషనియమములో నేమికారణమో ? యాలోచించవలెను. స్వతంత్రః కర్తేతిపాణిని సూత్రమునుబట్టి స్వాతంత్ర్యమే కర్తృవ్యవహారనియామక మనినచో నితరమైన కర్తృవ్యవస్థాబీజము లేనందున జ్ఞానచికీర్షాకృతి సమవాయిత్వమే స్వాతంత్ర్యమని చెప్పవలెను. అందువలన నట్టి జ్ఞానచికీర్షాకృతులలో నేదో యొకటి యాఖ్యాతార్థమని చెప్పవలెను. జ్ఞానాదుల కాశ్రయమైనవాఁడే కర్తయగును గానఁ గర్తృవ్యవస్థచేఁ గూడఁ బ్రయత్నమే యాఖ్యాతార్థమని చెప్పవలెను.

మూ. తథాపి ఫలానుగుణత్వైవాస్తు ప్రత్యయస్య
ప్రవృత్తినిమిత్తం, ప్రయత్నస్త్వాక్షేపతో
లప్స్యతే ఇతి చేత్. న.

శ్లో. భావనైవ హి యత్నాత్మా సర్వత్రాఖ్యాతగోచరః,
తయా వివరణధ్రౌవ్యాదాక్షేపానుపపత్తితః. ౧౦

కేన హి తదాక్షిప్యేత. న తావదనుకూలత్వ మాత్రేణ, తస్య ప్రయత్నత్వేనావ్యాపనాత్. న హి యత్నత్వైకార్థసమవాయ్యేవానుకూల త్వం. అతఏవ న సంఖ్యయా, తస్యాస్సంఖ్యేయ మాత్రపర్యవసాయిత్వాత్. కర్త్రేతి చేత్. న. ద్రవ్యమాత్రస్య అకర్తృత్వాత్ వ్యాపారవత శ్చాభిధానే వ్యాపారాభిధానస్య అవశ్యాభ్యు పగమనీయత్వాత్.నాపి ధాత్వర్థేన తదాక్షేపః, విద్యతే ఇత్యాదౌ తదసంభవాత్. న హ్యత్ర ధాత్వర్థో భావనాపేక్షీ, సత్తాయాః నిత్య త్వాత్.

తా. ఫలానుకూలత్వమే ప్రత్యయశక్యతావచ్ఛేదకము. ప్రయత్న మర్థాపత్తివలన లభించుననుట సరిగాదు. యత్న రూపమైన భావనయే సర్వాఖ్యాతల కర్థము. కృతివాచకమైన పదముచే "పచతి" యనుదానికి "పాకం కరోతి" యను వివరణ వలన సర్వాఖ్యాతలకు ప్రయత్నరూపమగు కృతియే యర్థము. అనుకూలవ్యాపారము యత్నాక్షేపకము గానేరదు. వర్త మానపాకానుకూలవ్యాపార మచేతనమందుఁగూడ నుండుట వలన నది యత్నాక్షేపకము గానేరదు. కాన యత్నమే యాఖ్యాతార్థముగాని యాక్షేపలభ్యమని చెప్పుటకు వీలు లేదని శ్లోకార్థము.

దేనిచేఁ బ్రయత్న మాక్షిప్తమగును? వర్తమాన పాకానుకూలవ్యాపారముచే నాక్షిప్తమని చెప్పుటకు వీలు లేదు. అనుకూలత్వమాత్రముచే యత్నత్వమాక్షిప్తమనుటకు

వీలులేదు. అనుకూలత్వము లేని యచేతనవ్యాపారమం దుం డుటవలన యత్నత్వవ్యాప్యము గాదు. అట్టి యవ్యాప్య మయిన ననుకూలత్వ మెటుల యత్నత్వాక్షేపక మగును? అనుకూలత్వ మెటు లాక్షేపకముగాదో యటులే సంఖ్యగూడ నాక్షేపకమని చెప్పుటకు వీలులేదు. సంఖ్య సంఖ్యేయమందే యుండును గాని ప్రయత్నమందు లేమింజేసి సంఖ్యచే యత్న త్వ మాక్షిప్తమనుటకు వీలులేదు.

కర్తచే యత్న మాక్షిప్తమనుటకు వీలులేదు కర్త యనఁగా ద్రవ్యమా? వ్యాపారముఁ గలదియా? ద్రవ్యమా త్రము యత్నముగలది గాదుగాన ద్రవ్యమాత్రమైనఁ గర్తచే యత్న మాక్షిప్తమని చెప్పుటకు వీలులేదు. వ్యాపారముగల దియే కర్త యనినచో నావ్యాపారము యత్నరూపమా? దానికంటె వేఱయినదా? అచేతనముఁగూడ యత్నముకంటె భిన్నమైన వ్యాపారముగలది గాన నట్టికర్తచే యత్నాక్షే పము సంభవింపదు. యత్నరూపమగు వ్యాపారము గలదియే కర్తృప్రత్యయమున కర్థమగునపుడు యత్నముఁగూడ వా చ్యమే యగుటవలనఁ గర్తచే యత్న మాక్షిప్తమనుట సంభ వింపదు.

ధాత్వర్థముచే యత్నాక్షేపమని చెప్పుటకు వీలులేదు. "విద్యతే ఘటః" అనునపుడు, సత్వరూపధాత్వర్థము నిత్య మగుటవలన భావనారూపప్రయత్నము నపేక్షింపదు గాన ధాత్వర్థముచేతనుగూడ భావనాక్షేపము సంభవింపదు.

మూ. తత్ర న భవిష్యతీతి చేత్. న. పూర్వాపరీభూ
తభావనానుభవస్య అవిశేషాత్. భావనోపరా

గేణ హ్యతథా భూతోఽప్యర్థః. తథా భాసతే ఇతి. న చ పదాంతరలబ్ధయా భావనయా అనుకూలతాయాః ప్రత్యయార్థస్యాన్వయః, తదసంభవాత్. న ఖలు ప్రకృత్యైవ సాభిధీయతే, ధాతూనాం క్రియాఫల మాత్రాభిధాయిత్వాత్. అన్యథా పాకఇత్యాదావపి భావనానుభవప్రసంగాత్. నాపి చైత్ర ఇత్యాదినా పదాంతరేణ, ప్రకృతిప్రత్యయయోరుభయోరప్యకారకార్థత్వాత్.

తా. 'విద్యతే' యనునపుఁడాక్షేపమే లేదనుటకు వీలు లేదు. 'పచతి' అనునపుడు పూర్వాపరీభావరూప మగుభావన యెట్లు భాసించునో, ప్రకృతములోఁగూడ నట్టిభావనయొక్క భావము తుల్యమే, గాన నాక్షేపము తుల్యమే. ధాత్వర్థమైన సత్తనిత్య మగుటవలన దానియందు పూర్వాపరీభావము లేక పోయినను పాకాదులయందుండు పూర్వాపరీభావముండును. పాకాదులయం దుండునట్టి భావనాపురస్కారముగా ప్రకృతములోఁగూడ ధాత్వర్థము భాసించును. పదాంతరముచే లబ్ధమగు భావానుకూలత్వము ప్రత్యయార్థముతో నన్వయించుటకు వీలులేదు. 'జీవనం పచతి చైత్రః' అనుస్థలమందు భావననుబోధించు పదాంతరమే లేదు.

ధాతువుచే భావనావిశిష్టమైనవ్యాపారము చెప్పఁబడు ననుటకు వీలులేదు. ధాతువుచేఁ గ్రియయు ఫలముఁగూడఁ జెప్పఁబడును గాని భావన చెప్పఁబడదు. అట్లయినచో 'పాకః' అను పదముచే భావనాబోధగూడఁ గలుగవలసి వచ్చును.

'చైత్రః' అనుపదముచే భావనాబోధ గలుగుటకు వీలులేదు. చైత్రపదము ప్రకృతి. ప్రథమ, ప్రత్యయము. ఈరెండును శుద్ధప్రాదిపదికార్థములు వ్యాపారముఁ గలదియే కారకార్థము గాన 'చైత్రః' అనుస్థలమందుండు ప్రకృతి ప్రత్యయములు రెండును గారకపదములు గావు, గాన వీనిచే భావనాప్రతీతి కలుగుటకు వీలులేదు.

మూ. ఓదనమిత్యాదేః కారకపదత్వాత్. తస్య చ క్రియోపహితత్వాత్. తేన అవిధానం ఆక్షేపో వా. కథమన్యథోదనమిత్యుక్తే కిం భుఙ్క్తే పచతి వేతి విశేషాకాంక్షేతి చేత్. న. పచతీత్యుక్తే కిమోదనం తేమనం వేతి విశేషాకాంక్షాదర్శనాత్. సా చ ఆక్షేపాభిధానయోరన్యతరమంతరేణ న స్యాత్. తస్యాం దశాయాం న చేదాక్షేపో నూనమభిధానమేవేతి.

తా. ఓదనమనునది క్రియతో గూడినదానిని బోధించుటవలనఁ గారకపదము. దానిచే భావనారూపార్థము చెప్పఁబడుననిగాని యట్టిపదముచే భావన యాక్షిప్త మగుననిగాని చెప్పవలెను. భావనావిశేషజిజ్ఞాస సామాన్యజ్ఞానము లేనిది సంభవింపదు గాన 'ఓదనం' అను కారకపదముచే భావనా సామాన్యము బోధితముగానిచో భావనావిశేషజిజ్ఞాసాబోధకమైన 'కిం భుఙ్క్తే, కిం పచతి' అనెడు ప్రశ్నవాక్యమెట్లుపపన్నమగును ? కాన నోదనమను కారకపదముచే భావన యాక్షిప్తమనిగాని యభిహితమనిగాని చెప్పవలెనని యాశంకించుటకు వీలులేదు.

'పచతి' అని చెప్పినచో ఓ దనమా? లేక తే మనమా? అను విశేషజిజ్ఞాసఁ గలుగుచున్నది. కాన 'పచతి' అనుపదముచే సామాన్యముగా భావన యభిహితమనిగాని యాక్షిప్తమనిగాని చెప్పవలెను. అట్టివిశేషజిజ్ఞాస సమయమున నాక్షేపము లేనిచో 'పచతి' అను నాఖ్యాతచే యత్నరూపమయిన భావన యభిహితమని చెప్పవలెను.

మూ. స్యాదేతత్. అభిధీయతాం తర్హి కర్తాపి. తదనభిధానే హి సంఖ్యేయమాత్రమాక్షిప్య సంఖ్యా కథం కర్తారమన్వియాత్. న తు కర్మాదికమపి. శాకసూపౌ పచతి శాకసూపోదనాన్ పచతీత్యాదౌ విరోధనిరస్తా సంఖ్యా చైత్ర ఇతి కర్తారమవిరుద్ధమనుగచ్ఛతీతి చేత్. చైత్ర ఓదనం పచతీత్యత్ర కా గతిః.

తా. 'చైత్ర ఓదనం పచతి, చైత్రేణ ఓదనః పచ్యతే' అనెడు కర్తృకర్మ లకారస్థలములయందు ప్రథమస్థలమున కర్తయగు చైత్రునియందు రెండవస్థలమున కర్మయైనవో, దనమందు నాఖ్యాతార్థమైనసంఖ్య కన్వయ ముండుటవలనఁ బ్రథమస్థలమునఁ గర్తయు ద్వితీయస్థలమునఁ గర్మయు లకారమున కర్థమని చెప్పవలయును. ఈలకారములచేఁ గర్తగాని కర్మగాని యభిహితముగానిచో నాఖ్యాత వాచ్యమయినసంఖ్యచే సంఖ్యేయమే యాక్షిప్తమై ప్రథమస్థలమునఁ గర్తయందే యన్వయించును. కర్మయందన్వయింపదనునియమ మెట్లుపపన్న మగును? కానఁ గర్త్రాఖ్యాతకుఁ గర్తగూడ వాచ్యమని చెప్పవలయును.

'శాకసూపౌ పచతి, శాకసూప ఓదనాన్ పచతి' అను రెండుస్థలములయం దాఖ్యాతవాచ్యమయినసంఖ్య కర్మవాచక పదోత్తరమందుండు ద్వివచన బహువచనములచేఁ జెప్పఁబడ్డ ద్విత్వబహుత్వసంఖ్యలకు విరుద్ధమగుటవలన నట్టిసంఖ్యలతోఁ గూడుకొనినఁ గర్మలయం దాఖ్యాతవాచ్యమయిన సంఖ్యాన్వయము చేయుటకు వీలులేనందున నట్టి విరోధపరిహారము కొఱకు 'చైత్రః' యని ప్రథమాంతపదముచేఁ జెప్పఁబడిన విరుద్ధమైనకర్తయందే యన్వయించును. ఆఖ్యాతవాచ్యము కర్త కాకపోయినను కర్మయం దన్వయింపదు. కర్తయందే యన్వయించునను నియమ ముపపన్నమగును గదా! పూర్వోక్తస్థలములయందు విరోధపరిహారముకొఱకీ విరుద్ధమయినఁ గర్తయం దన్వయించినను 'చైత్రః ఓదనం పచతి' అనెడుస్థలమునఁ బ్రథమైకవచనాంతపదముచేఁ జెప్పఁబడినఁ గర్తవలె ద్వితీయైకవచనాంతమైన యోదనపదముచేఁ జెప్పఁబడిన యోదనముఁగూడ నవిరుద్ధ మగుటవలన నాఖ్యాత వాచ్యమయిన సంఖ్య ఓదనమందేల యన్వయింపఁగూడదు?

మూ. ఏకత్రనిర్ణీతః శాస్త్రార్థః అపరత్రాపి తథా, యవ
వరాహాదివదితి చేత్. న. పచ్యతే ఇత్యాదావపి
తథాభావప్రసంగాత్. చైత్రాభ్యాం చైత్రైరితి
విరోధనిరస్తాసూపఇత్యవిరుద్ధం కర్మ సమనుక్త్రా
మతీతి చేత్. చైత్రమైత్రాభ్యాం శాకసూపౌ
పచ్యేతే ఇత్యత్ర కా గతిః?

తా. 'యవమయశ్చరుర్భవతి' అను శ్రుతియందుండు యవపదమునకు వాక్యశేషమువలన దీర్ఘశూకవిశిష్టమైన యవ

లయందు శక్తి నిర్ణయింపఁబడినందున వాక్యశేషము లేకపో యినను 'యవైర్యజేత' అనుస్థలమందుఁగూడ యవపదమునకు దీర్ఘశూకవిశిష్టమైన యవ లెటులర్థమో! కేవల 'పచతి' యను స్థలమున నాఖ్యాత వాచ్యమయినకర్తయందు సంఖ్యాన్వ యము శాస్త్రముచే నిర్ణయింపఁబడినపుడు 'చైత్ర ఓదనం పచతి' అనుస్థలమునఁగూడ నటులే కర్తయందు సంఖ్యాన్వ యము చేయఁబడుననుటకు వీలులేదు. 'పచ్యతే' అను స్థలమం దుఁగూడ 'పచతి' అనుస్థలమందువలె నాఖ్యాతచేఁ జెప్పఁబడు భావనకుఁ గర్తయం దన్వయము చేయవలసివచ్చును.

'చైత్రాభ్యాం, చైత్రైః పచ్యతే' అనుస్థలమున విరుద్ధ విభక్తులచేఁ జెప్పఁబడిన కర్తయందు 'పచ్యతే' అను నేకవచన ముచేఁ జెప్పఁబడు భావనకుగాని సంఖ్యకుగాని యన్వయించు టలో విరోధ ముండును గాన నట్టివిరోధమును బోఁగొట్టెడు 'సూపః' అను ప్రథమాంతపదముచే బోధితమైన కర్మయందే యన్వయించుననుటకు వీలులేదు. 'చైత్రమైత్రాభ్యాం శాక సూపౌ పచ్యేతే' అనునపుడు శాకసూపములవలె చైత్రమై త్రులుగూడ నవిరుద్ధు లగుటవలన వారలయందుఁగూడ నా ఖ్యాతార్థాన్వయప్రసంగము వచ్చును.

మూ. అన్యత్ర నిర్ణీతేనార్థేన వ్యవహార ఇతి చేత్. న. పచతీత్యాదావపి తథాభావప్రసంగాత్. తత్ర పూర్వకపవ నిర్ణయః, పచ్యతే ఇత్యత్ర త్వపర ఇతి చేత్. న. విశేషాభావాత్. ఆత్మనేపదపర స్మైపదాభ్యాం విశేష ఇతి చేత్. న. పచ్యతే పచ తే పక్ష్యతే ఇత్యాదౌ విప్లవప్రసంగాదితి.

తా. 'చైత్రాభ్యాం చైత్రైః సూపః పచ్యతే' అనుస్థల మందు కర్మయైన సూపమం దాఖ్యాతార్థమైన సంఖ్యాన్వయ మెటుల నిర్ణీతమో యటులే "చైత్రమైత్రాభ్యాం శాకసూపౌ పచ్యేతే" అను స్థలమందుఁగూడ నాఖ్యాతార్థమైన సంఖ్యకుఁ గర్మయైన శాకసూపములయందే యన్వయము చేసెదమనుటకు వీలులేదు. "దేవదత్తః ఓదనం పచతి" అను స్థలమందుఁగూడ నాఖ్యాతార్థమైన సంఖ్య కన్వయప్రసంగము వచ్చును.

"పచతి" అనుస్థలమునఁ గర్తతో సంఖ్యాన్వయము "పచ్యతే" అనునపుడు కర్మతో సంఖ్యాన్వయమనుట విశేషము లేనందున సరిగాదు. ఆత్మనె పదలకారార్థమైనసంఖ్యకుఁ గర్మయందును బరస్మైపద లకారార్థమైనసంఖ్యకుఁ గర్తయందును నన్వయము చేయుటలో నియామకమాత్మనే పదపరస్మై పదరూపవిశేషములని చెప్పుటకు వీలులేదు. "పచ్యతే" అనునాత్మనే పదస్థలమందు లకారము కర్మగతసంఖ్యను బోధించినట్లు "చైత్రః తండులం పచతే పక్ష్యతే" అను స్థలమందుఁ గూడఁ గర్మయందు సంఖ్యాబోధకమైన యాత్మనే పదరూపవిశేష మున్నందున నీస్థలమందుఁగూడఁ గర్మయందును సంఖ్యాన్వయప్రసంగము వచ్చును.

మూ. దృశ్యతే చ సమానప్రత్యయాభిహితేనాన్వయః
సంఖ్యాయాః. తద్యథా భూయతే సుప్యతే
ఇత్యాదౌ. న హి తత్ర కర్త్రా కర్మణా వా అన్యే
నైవ వా కేనచిదన్వయః, కింతు భావేనైవ. అన
న్వయే తదభిధాయినో అనర్థత్వప్రసంగాత్.

అతీక్షేపేనచాన్వయా త్తత్రాపి కర్త్రైవా న్వయాపత్తేః. కో హి సుప్యతే స్వపితీత్యనయోః కర్త్రాక్షేపం ప్రతి విశేషః.

తా. ఆఖ్యాతార్థమైనసంఖ్యకు సమానప్రత్యయాభిహిత మైనదానితో నన్వయము దృష్టమగుచున్నది. 'భూయతే, సుప్యతే' అనుస్థలమున నాఖ్యాతచే నభిహితమైనసంఖ్య సమానప్రత్యయాభిహితమైనభావనతో నన్వయించుచున్నది గాని కర్తతోగాని కర్మతోగాని మఱియొకదానితోగాని యన్వయించుట లేదు. ఆఖ్యాతాభిహితమైన భావసంఖ్యలకు పరస్పరాన్వయము లేనిచో నీభావలకార మనర్థకము గావలసి వచ్చును. భావముచే నాక్షిప్తమైనదానితో సంఖ్యాన్వయము చేసినచో "స్వపితి" అనుస్థలమునఁ గర్తతో నెట్లు సంఖ్యా న్వయమో "సుప్యతే" అనుస్థలమునఁగూడ విశేషము లేనం దునఁ గర్తతో సంఖ్యాన్వయప్రసంగము వచ్చును. అనఁగా? ఆక్షేపహేతువైన భావనాభిధానము "స్వపితి" అనుస్థల మందువలె "సుప్యతే" అనుస్థలమందుఁగూడ నున్నందున "స్వపితి" అనుస్థలమందువలె "సుప్యతే" అనుస్థలమందుఁగూడఁ గర్తతో సంఖ్యాన్వయప్రసంగము రావలసివచ్చును.

మూ. స్యాదేతత్. భావకర్మణో రిత్యాద్యనుశాసన బలాత్తావత్ భావకర్మణీ ప్రత్యయవాచ్యే. తత స్తదభిహితా సంఖ్యా తాభ్యాం అన్వీయతే. యస్తు ప్రత్యయః న తత్రోత్పన్నః తదభిహితా సంఖ్యా, ముఖ్యం వా పూర్వచోదనాల్లోక

వదితి న్యాయేన కర్తారమేవాశ్రయతే ఇతి నియమః. న.

తా. "భావకర్మణోః" అను సూత్రబలమువల్ల నాత్మనే పదలకారమునకు భావము కర్మయు వాచ్యార్థములు కాన, నా ప్రత్యయముచే బోధితమైనసంఖ్య సమానప్రత్యయాభిహిత మైన భావముతోఁగాని కర్మతోఁగాని యన్వయించును. "భావకర్మణోః" అను సూత్రముచే నుత్పన్నమైనఁ బ్రత్యయ మెక్కడనుండదో యక్కడ ("స్వపితి" అనుస్థలమందు) నుండు ప్రత్యయముచేఁ జెప్పఁబడుసంఖ్య కారకములలోఁ బ్రథమకారకము మొదట నుపస్థితమగుటవలనఁ బ్రథమ కారకమగు కర్తయందే యన్వయించును. కాన "స్వపితి సుప్యతే" అనురూపములకు భేదముండుటవలన "స్వపితి" యనుస్థలమున నాఖ్యాతార్థమైనసంఖ్య కర్తయం దన్వయించి నను "సుప్యతే"అనుస్థలమున భావమందే యన్వయించునుగాని కర్తయం దన్వయింపదని యాశంకించుటకు వీలులేదు.

మూ. విపర్యయప్రసంగాత్. శేషాత్కర్తరి పరస్మైపదం కర్తరి శబిత్యనుశాసనబలాత్. భావకర్తారౌ ప్రత్యయవాచ్యౌతతస్తదభిహితా సంఖ్యాపి తాభ్యామన్వీయతే. యస్తు ప్రత్యయో న తత్రోత్పన్నస్తదభిహితా సంఖ్యా తే నైవ ... యేన కర్మ సమాశ్రయేదితి నియ... తస్మాన్మతికర్దమమపహాయ యథా...సనమేవ గృహ్యతే ఇతి ప్రాప్తం ఏవం ... ధీయతే.

తా. 'భావకర్మణోః' అను ననుశాసనమునుబట్టి ప్రత్యయమునకు భావకర్మ లర్థములనియు, దానిచే నభిహితమగు సంఖ్య వానియందే యన్వయించుననియు, నట్టిప్రత్యయము లేనపుడు కర్తయందే యన్వయించుననియుఁ జెప్పఁబడెను. దానికి విపర్యాసము ప్రాప్తించును. 'శేషాదిత్యాది'అను పాణిని సూత్రమువలనఁ గర్తరిపరస్మైపదమును కర్తరిశబిత్యనుశాసనమువలన శప్ప్రత్యయమును విధింపఁబడినందున భావము కర్తయుఁగూడఁ బ్రత్యయపదమునకు వాచ్యార్థము లగును. అందువలన నాఖ్యాతార్థమైనసంఖ్య భావకర్తలయందే యన్వయించును. వెనుకటిసూత్రములచే నట్టిప్రత్యయము లుత్పన్నము గానిచో నాఖ్యాతాభిహితమైనసంఖ్య ముఖ్యమగు కర్మనే యాశ్రయించు ననునియమ ముపపన్న మగును. అందువలన బుద్ధిమాంద్యమును విడిచి యనుశాసనప్రకార మాఖ్యాతచేఁ గర్త యభిహితమనెడు నాశంకకు సమాధానము చెప్పఁబడుచున్నది.

శ్లో. ఆక్షేపలభ్యే సంఖ్యే యేనాభిధానస్య కల్పనా,
సంఖ్యేయమాత్రలాభేపి సాకాంక్షేణ వ్యవస్థితిః. ౧౧

తా. ఆఖ్యాత వాచ్యమైనసంఖ్య కాశ్రయ మర్థాపత్తి ప్రమాణమువల్లనే లభించును గాన నట్టి సంఖ్యాశ్రయమైనఁ గర్తయందు శక్తికల్పన లేదు. ఆశ్రయము లేక యుండుటకు వీలులేని సంఖ్య యొకానొకసంఖ్యేయము నాక్షిప్తముగాఁ జేసికొని చరితార్థ మగును. అట్టిసంఖ్య కర్తనే యాక్షేపించును. గాని కర్త్రాదికము నాక్షేపింపదనుటలో వ్యవస్థ యేమి

కలదనినచో సంఖ్యచే సంఖ్యేయమాత్ర మాక్షిప్తమయినను ప్రథమాంతపదమునకు నాఖ్యాతకు నాకాంక్ష యున్నందున సాకాంక్షమైన నాఖ్యాతచేఁ గర్తకు సంఖ్యకుఁ బరస్పరాన్వయబోధ కలుగును అనఁగా కర్తృలకారముచే బోధితమైనసంఖ్య కర్తయందే యన్వయించును. కర్మ లకారముచే బోధితమైనసంఖ్య కర్మయందే యన్వయించుననెడువ్యవస్థ యున్నందున నాఖ్యాతచేఁ గర్త యభిహితమను వైయాకరణమతము నిరాకరింపఁబడెను. పైని జెప్పినవిషయమంతయు శ్లోకార్థము.

మూ. సంఖ్యాపి తావదియం భావనానుగామిని యం యం భావనాన్వేతి, తం తం సంఖ్యాపీతి స్థితేః ఏకప్రత్యయవాచ్యత్వనియమాత్. భావనా చ శుద్ధం ప్రాదిపదికార్థమాత్రమాకాంక్షతి న హి వ్యాపారవంతం వ్యాపార ఆశ్రయతే, ఆత్మాశ్రయప్రసంగాత్ సమవాయం ప్రతి తదనుపగమాత్. విజాతీయవ్యాపారవతో అకర్తృత్వాచ్చ, న చ ద్వితీయాద్యాః ప్రాదిపదికవిభక్తయః. తతః ప్రథమానిర్దిష్టేనైవ భావనాన్వీయతే ఇతి తస్య అన్వయయోగ్యతానియమాత్. సంఖ్యాపి తదనుగామినీ తేనైవాన్వీయతే ఇతి నాతిప్రసంగః.

తా. ఆఖ్యాతార్థమైనభావన యెక్కడ నన్వయించునో తదర్థమైన సంఖ్యఁగూడ నక్కడనే యన్వయించును.భావనయు

సంఖ్యయునుఏక ప్రత్యయార్థములుగాన నవి రెండునొకచోటనే యన్వయించును. భావన వ్యాపారరహితముగా నుపస్థితమగు ప్రాదిపదికార్థమునే యాకాంక్షించును. వ్యాపారముతోఁ గూడినదానిని వ్యాపార మాశ్రయింపదు. అట్లయినచో నాత్మాశ్రయ మనవస్థాదిదోషములు సంభవించును. వ్యాపార విశిష్టమందు వ్యాపారము నన్వయించినచో ధర్మివిశేషణమైన వ్యాపారమును తద్విశిష్టమం దన్వయించెడువ్యాపారమును్నా నొకటియైనచో నాత్మాశ్రయదోషము వచ్చును. ఇవి రెండును భిన్నములైనచో ననవస్థాప్రసంగము వచ్చును. కాని నిర్వ్యాపారత చే నుపస్థితమగు ప్రాదిపదికార్థమాత్రమునే భావన యాకాంక్షించును. వ్యాపారవిశిష్టమందు భావనారూప వ్యాపారాన్వయమున కెట్లాకాంక్ష లేదో యట్లే తత్సమవాయాన్వయములోఁగూడ నాకాంక్ష లేనందున వ్యాపారవిశిష్టమందు తత్సమవాయాన్వయము చేయుటకు వీలులేదు. భావన ప్రాదిపదికార్థముతోనే యన్వయించును. ద్వితీయాదివిభక్తులు ప్రాదిపదికలు గావు. అందువలనఁ బ్రథమాంతపదముచే నిర్దిష్టమైన దానితోనే భావన యన్వయించును. అట్టియర్థమే భావనాన్వయ యోగ్యము. సంఖ్యఁగూడ భావననే యనుసరించి యుండును అనఁగా భావనాన్వయయోగ్యమే సంఖ్యాన్వయ యోగ్యము.

మూ. నఞర్థవత్. యథా హి చైత్రో న బ్రాహ్మణః న
గౌరో న స్పందతే న కుండలీత్యాదౌ విశేషణ
విశేష్యసమభివ్యవహారావిశేషేపి నఞా తదనభి

థానావిశేషేపి నఞర్థస్య విశేషణాంశైరేవా
న్వయో న విశేష్యాంశేన.

తా. నఞునకు విశేషణ విశేష్యవాచకపదములయొక్క
సమభివ్యాహార మున్నను పూర్వోక్తస్థలములయందు నఞర్థ
మునకు విశేషణమైనబ్రాహ్మణత్వ రూపజాతితోను, "న గౌరః"
అనునపుడు విశేషణమైన గౌరరూపగుణముతోడను "న స్పం
దతే" అనునపుడు స్పందనరూపక్రియతోడను "న కుండలీ"
అనునపుడు కుండలరూపద్రవ్యముతోడ నన్వయముగాని,
విశేష్యముతో నన్వయము లేదు. ఈస్థలములయందు సాకాం
క్షము లగువాని కెట్లు నఞర్థముతో నన్వయమో యట్లే
"చైత్రః తండులం పచతి" అనునపుడు ప్రథమాంతపదమును
నాఖ్యాతయును సాకాంక్షములు గాన నాఖ్యాత వాచ్యమైన
భావనయు సంఖ్యయునూ ప్రథమాంతార్థమందే యన్వయిం
చును. ద్వితీయాంత తండులపదముతో నాకాంక్ష లేనందున
నాఖ్యాతార్థమునకుఁ గర్మయగు తండులములకుఁ బరస్పరాన్వ
యయోగ్యత యుండుటకు వీలులేదు.

మూ. నను బాధాత్ తత్ర తథా. న హి విశేష్యేణ
తదన్వయే విశేషణోపాదానమర్థవద్భవేత్. త
న్నిషేధేనైవ విశేషణనిషేధోపలబ్ధేః. ఉభయ
నిషేధే చావృత్తౌ వాక్యభేదాదనావృత్తౌ నిరా
కాంక్షత్వాదితి చేత్. న. తుల్యత్వాత్.
సమానప్రత్యయోపాత్తభావనాక్షిప్తాన్వయోప
పత్తౌ బాధకం వినా సన్నిహితత్యాగే వ్యవ

హితపరిగ్రహస్య గురుత్వాత్. భావనాయాశ్చ సామాన్యాక్షేపేపి సాకాంక్షపరిత్యాగే నిరాకాంక్షాన్వయానుపపత్తేః. నహ్యాన్యతరాకాంక్షా న్వయ హేతుః, అపి తు ఉభయాకాంక్షా. ప్రాతిపదికార్థో హి ఫలేనాన్వయమలభమానః క్రియాసంబంధమపేక్షతే, భావనాపి వ్యాపారభూతా సతీ వ్యాపారిణమిత్యుభయాకాంక్షా అన్వయ హేతుః. కటంకటీనేత్యాది తు కారకతయైవ తు ఫలసమన్వితం న వ్యాపారాంతరమపేక్షతే ఇతి నిరాకాంక్షమితి.

తా. నఞ్ స్థలమున నఞర్థమునకు విశేష్యాంశముతో నన్వయముఁ జేసినచో బాధ సంభవించును గాన విశేషణాంశముతోడనే యన్వయము చేయవలసియున్నది. విశేష్యనిషేధము చేతనే విశేషణనిషేధముయొక్క యుపలబ్ధి సంభవించును గాన విశేషణమును జెప్పుపదము వ్యర్థము కావలసివచ్చును. ఒకపర్యాయ ముచ్చరితమైన నఞ్పద మొక్కనిషేధమును జెప్పును నిషేధద్వయమును జెప్పవలసివచ్చినపుడు నఞ్పదమున కావృత్తి చేయవలయును. అట్లయినచో వాక్యభేదము సంభవించును. ఆవృత్తి చేయనిచో నిరాకాంక్ష మగుటవలన నుభయనిషేధముఁ జేయుటకు వీలులేదు. విశేష్యముతో నఞర్థమున కన్వయము చేసినచో బాధ సంభవించుటవలననే విశేషణముతో నన్వయము చేయవలయునని చెప్పు టుచితము గాని యాకాంక్ష లేనందున విశేష్యముతో నన్వయముఁ జేయు టుచితముగాదని చెప్పుట సమంజసము గాదు.

నఖిల స్థలమం దబాధితమైన సాకాంక్షితమైన యర్థముతో నఖిలార్థమున కన్వయ మెట్లో ప్రకృతమునఁగూడ నట్లే. అది యెట్లన? "చైత్రః తండులం పచతి" అనుస్థలమున 'పచ' ధాతూత్తరమందుండు నొక ప్రత్యయముచే భావనయు సంఖ్యయు చెప్పఁబడును. అట్టిభావనచే నాక్షిప్తమైనదానితో నన్వయ ముపపన్న మగుచుండఁగా బాధకము లేనప్పుడు భావనాన్వయియందే సంఖ్యాన్వయము చేయు టుచితముగాని మఱియొకదానియందు చేయుటుచితము కాదు. మఱియొక దానితోఁ జేసినచో భావనాన్వయయోగ్యమయినది సన్నిహితము గాన సన్నిహితపరిత్యాగము వ్యవహితపరిగ్రహము సంభవించును. భావనారూపవ్యాపారముచే వ్యాపారి రూపసామాన్య మాక్షిప్తమైనను భావనసాకాంక్షితమైన వ్యాపారి యగు ప్రాదిపదికార్థముతోనే యన్వయించును గాని నిరాకాంక్షమైన కారకాంతరములతో నన్వయింపదు. సాకాంక్షమైన దానితో నన్వయింపక నిరాకాంక్షితమైన కారకాంతరములతో నన్వయించినచో సాకాంక్షాపరిత్యాగము నిరాకాంక్షాన్వయప్రసంగము సంభవించును.

ఉభయాకాంక్షయే యన్వయప్రయోజకముగాని కేవల వ్యాపారాకాంక్షగాని కేవలవ్యాపారి యాకాంక్షగాని యన్వయప్రయోజకము గాదు. అదెట్లనినః ప్రాదిపదికార్థము ఫలముతో సంబంధమును బొందనిదగుచు ఫలప్రయోజక మగువ్యాపారము నాకాంక్షించును. ఇట్లే భావనారూపమైన వ్యాపారముఁగూడ వ్యాపారియగు ప్రాదిపదికార్థమునే యాకాంక్షించును. ఉభయాకాంక్ష యున్నందున "చైత్రః తండు

లం పచతి" అనుస్థలమునఁ బ్రాదిపదికార్థమైన చైత్రునియందు వ్యాపారమైన భావన యన్వయించును. "కటం కరోతి" అను స్థలమందు కటము కారకమగుటచే ఫలసంబంధము కలది గాన వ్యాపారాంతరము నపేక్షింపదు. నిరాకాంక్షిత మగుటవలన ద్వితీయాంత తృతీయాంతపదములచే బోధితమైన కటమందు భావనాన్వయము సంభవింపదు.

మూ. అతఏవ ఆస్యతే సుప్యతే ఇత్యాదౌ నాక్షిప్తే నాన్వయః. న హి చైత్రేణేతి తృతీయాంతశబ్దస్య భావనాయామాకాంక్షాఽస్తి. భావ్యాకాంక్షాఽస్తీతి చేత్. న ఫలేన శయనాదిధాత్వర్థే నాన్వయాత్. ఫలసంబంధినశ్చాత్ర కర్త్రనతిరేకాత్. న హి శయనాదయో ధాత్వర్థాః కర్త్రతిరేకిసంబంధాః. న చ ఫలతత్సంబంధివ్యతిరేకేణాన్యో భావ్యో నామ, యమపేక్షేత.

తా. "స్వపితి" అనునపు డాక్షిప్తమైనకర్తతో నెట్లన్వయమో యట్లే "సుప్యతే" అను స్థలమందుఁగూడఁ గర్తతో నన్వయ మేల యుండఁగూడదని యాశంకింపరాదు. ఉభయాకాంక్షయే యన్వయప్రయోజకము గాన "ఆస్యతే, సుప్యతే" ఇత్యాదులయందు భావనాద్యాకాంక్ష లేనందున నాక్షిప్తమైన దానితో నన్వయము సంభవింపదు. "సుప్యతే" అను స్థలమందు "చైత్రేణ" అని తృతీయాంతపదమున్నను దానికి భావనారూపవ్యాపారాకాంక్ష లేదు. భావనాకాంక్ష లేకపోయినను భావ్యాకాంక్ష యున్నదని చెప్పు టుచితము గాదు. భావ్య

మనఁగా భావనవలనఁ బుట్టెడిఫలము అది ధాత్వర్థమైన నిద్రించుటతో నన్వయించును. అనఁగా "చైత్ర కర్తృకః స్వాపః" అను నన్వయబోధ కలుగును. భావ్యమనఁగా ఫల సంబంధి యైనచో "సుప్యతే" అనుస్థలమందుండు ధాతువ కర్మకమగుటవలన ఫలాశ్రయత్వము కర్తకేవచ్చును. "చైత్రేణ సుప్యతే" అనునపుడు "కర్తృకరణయోస్తృతీయా" అను శాస్త్రముచేఁ గర్తృత్వరూపార్థమందు వచ్చిన తృతీయచే నుప స్థితమైన చైత్రకర్తృకత్వమునకు ధాత్వర్థమైనఫలమందు భావ్యత్వముచే నన్వయము లేదు. శయనస్వాపాది రూప ధాత్వర్థములు కర్తకంటె భిన్నములగువానియొక్క సంబం ధముగలవి కావు. దేని నపేక్షించునో యట్టిభావ్యము ఫల తత్సంబంధములకంటె వేఱగునది మఱియొకటి లేదు. ఫల సంబంధము కర్తకే యుండును గాన నట్టిసంబంధమును బోధించు తృతీయాంతమైన "చైత్రేణ" అనుపదముతో "సుప్యతే" అనుపద మాకాంక్షగలది యగుచుండును.

మూ. స్యాదేతత్. కిమితి న ప్రయుజ్యతే కటః కరోతి చైత్రమిత్యాది, అభిహితానభిహితవ్యవస్థా అభావాదితి చేత్. న. చైత్రమితి ప్రథమాం తస్యాసాధుత్వాత్. ద్వితీయాంతస్య తు కర్మ వచనత్వేవ తత్సంబంధాద్భావ్యానపేక్షిణీ భా వేనభావకమాత్రమపేక్షేత. న చ కటస్య చైత్రం ప్రతి భావకత్వం, విపర్యయాత్. అనా ప్తేన తు వివక్షాయాం ప్రయుజ్యత ఏవ.

తా. ఆఖ్యాతచేఁ గర్తృకర్మకరణాదుల కభిహితత్వా నభిహితత్వములు లేనపుడు "కటః చైత్రం కరోతి" అను ప్రయోగ మేటుల యుండఁగూడదని యాశంకింప వలను డదు. చైత్రశబ్దము పుంలిఙ్గ మగుటవలనఁ బ్రథమయందు "చైత్రం" అను ద్వితీయాంతపదము సాధువగును. ద్వితీయాంత పదము కర్మవాచక మగుటవలన భావ్య మాకాంక్షితము గాదు గాన భావముచే భావకముమాత్రమే యపేక్షింపఁ బడును. ప్రథమాంత కటపదార్థమైన కటము చైత్రునిఁగూర్చి భావకము గాదు. చైత్రుఁడు కటమునుగూర్చి భావకము గావచ్చును. కనుక "కటం కరోతి చైత్రః" అనుప్రయోగము సాధువగును గాని "కటః కరోతి చైత్రం" అనుప్రయోగ మనాప్తులచేఁ బ్రయోగించఁబడునుగాని యాప్తులచేఁ బ్రయో గింపఁబడదు. కనుకనే యాప్రయోగము సాధువు గాదు.

మూ. ప్రయుజ్యతాం తర్హి 'కటః కరోతి చైత్ర' ఇత్యాది. న. నిత్యసందిగ్ధత్వేన వాక్యార్థాసమ ర్పకత్వాత్. తత్తదుపపత్తయె విశేషస్య వ్యంజ నీయత్వాత్. వ్యజ్యతాం తర్హి తృతీయయా; చైత్రేణేతి, ఏవం దేవదత్తః క్రియతే కటమితి వ్యజ్యతాం ద్వితీయయేతి చేత్. న. అప్రయో గాత్. న హ్యనాప్తే నాప్యేవం ప్రాయాణి ప్రయుజ్యంతే. లక్షణావిరోధేన కుతవేతదే వేతి చేత్. లోకస్య అపర్యనుయోజ్యత్వాత్.

తా. చైత్రుఁడు భావకమైనచో "కటః కరోతి చైత్రః" అనుప్రయోగ మేల యుండకూడదు. రెండు ప్రథమాంత

పదము లున్నందున కర్తయేదో కర్మయేదో యనుసందేహ మెల్లపుడు నున్నందునఁ గటము భావకమా? లేక చైత్రుఁడా! అనుసందేహ మెల్లపుడు నుండును. కాన వాక్యార్థబోధయే సంభవింపదు. అందువలన వాక్యార్థబోధోపపత్తికొఱకు మఱి యొకవిశేష మాలోచింపవలసి యుండును.

"చైత్రేణ కటః కరోతి" అను తృతీయాంత చైత్రపద ముతోఁగాని యిట్లే "దేవదత్తః క్రియతే కటం" అని ద్వితీయాంత కటపదముతోఁగాని యోజనచేసిన నిట్టిప్రయోగము లాప్తునిచే నేల ప్రయోగింపఁ బడఁగూడదు? అని యాశంకింపరాదు.

అనాప్తునిచేఁగూడ నీరీతిగఁ బ్రయోగింపఁబడనందున నెల్లపుడు నివియసాధుప్రయోగములు వ్యాకరణాదులు గూడఁ బ్రయోగము ననుసరించియే పుట్టినందున నిట్టిప్రయోగములు పూర్వమందు లేనందున వ్యాకరణముచే వీనికి సాధుత్వము సంభవింపదు.

మూ. న హి గార్గికయేతి పదం సాధ్వితిశ్లాఘాభిధాయి పదసన్నిధిమనపేక్ష్య ప్రయుజ్యతే. తస్య తదుపాధినైవ విహితత్వాదితి చేత్. ఏతదేవ కుతః? లోకే తథైవ దర్శనాదితి చేత్ తుల్యం. కరోతీత్యాదికర్మవిభక్తిసమభివ్యాహారేణైవ ప్రయుజ్యతే క్రియతే ఇతి కర్తృవిభక్తిసమభివ్యాహారేణైవేతి కిమత్ర క్రియతాం.

తా. 'గార్గికయా'అనెడుపదము సాధువని యసాధుపద సన్నిధానములోఁ బ్రయోగింపఁబడదు. అట్టి సాధుపదప్రయో

గము తదుపాధినిబట్టియే విహిత మనినచో, నది యెట్లనఁగా? లోకములో సాధుపదములయొక్క సన్నిధియందే ప్రయోగ మునుబట్టి యనినచో నది మా మతమునఁగూడ సమ్మతమే. "కరోతి" అనుపదము ద్వితీయాంతమైన కర్మవాచక పదసన్నిధి యందే ప్రయోగింపఁబడును. అనఁగా "కటం కరోతి క్రియతే" అనెడుప్రయోగము తృతీయాంతమైన కర్తృవాచకపదసన్నిధి యందే ప్రయోగింపఁబడును. అనఁగా "చైత్రేణ క్రియతే కటః" ఈవిషయమున బాధకమేమియు లేదుగదా!

**మూ.** ఇమమేవ విశేషమురరీకృత్య అనభిహితాధి
కారానుశాసనేన హ్యేతావాన్ పరామర్శః.
సర్వేషాం హ్యాది పదమాదధాతీత్యభిదానానభి
ధానవిభాగఏవ వ్యుత్పాదనదశాయాం పేశల
ఇతి.

తా. వ్యా. సూ. 'అనభిహితే కర్తరి తృతీయా, అనభిహితే కర్మణి ద్వితీయా' అనెడు నధికారసూత్రములచే "చైత్రేణ" అనెడు తృతీయాంత పదమునకు "క్రియతే" అనెడు పదసమభివ్యాహారములోను, కటం అను ద్వితీయాంత పదమునకు "కరోతి" అను పదసమభివ్యాహారములోనే సాధుత్వమని బాలుర వ్యుత్పత్తినిమిత్తమై యభిహితత్వా నభిహితత్వవ్యుత్పాదనము చేయఁబడినది.

**మూ.** స్యాదేతత్. భవతు సర్వాఖ్యాతసాధారణీ
భావనా. కాలవిశేషసంబంధినీ సా లడాద్యర్థః.
కాలత్రయాపరామృష్టా లిజర్థ ఇతి చేత్. న.
యత్నపదేన సమానార్థత్వప్రసంగాత్. విష

యోపరాగానుపరాగాభ్యాం విశేష ఇతి చేత్
న. యాగయత్న ఇత్యనేన పర్యాయతాపత్తేః
కర్తృసంఖ్యాభిధానానభిధానాభ్యాం విశేష
ఇతి చేత్. న. యాగయత్నవానిత్యనేన సా
మ్యాపత్తేః. ఇష్టపేవాయమర్థ ఇతి చేత్. న.
ఇతోఽవత్సరశతేనాప్య ప్రవృత్తేః. ఫలసమభి
వ్యాహారాభావాన్న ప్రవర్తతే ఇతి చేత్. న.
స్వర్గకామో యాగయత్నవాన్ ఇత్యతో
ఽప్రవృత్తేః.

తా. కర్తృధర్మమైనయత్నము విధ్యర్థమైనచో నది సర్వాఖ్యాత సాధారణమను నతిప్రసంగము వచ్చినపుడు సమాధానము చెప్పఁబడియున్నది. దానినే "స్యాదేతత్" ఇత్యాదివాక్యముచే శంకించుచున్నాఁడు. ఎట్లన? సర్వాఖ్యాత సాధారణమే యత్నరూపభావన కావచ్చును. కానిలట్టుకు వర్త మానకాల విశిష్టమగుభావన యర్థము. లిఙుకు కేవలయత్నము. అనఁగా కాలత్రయసంబంధములేని యత్నరూపభావన యని యర్థము. ఇట్టియర్థము లిఙునకుఁ జెప్పినపుడు సర్వాఖ్యాత సాధారణ్య మెట్లుండునని యాశంకింపరాదు. కేవలయత్నమే లిఙున కర్థమనినచో యత్నపదముతో సమానార్థకత్వప్రసం గము వచ్చును.

"యజేత" అను లిఙ్యాగరూపవిషయముతోఁ గూడినయత్నమును బోధించును. యత్నపద మట్టివిషయ ముతోఁ గూడనియత్నమును బోధించును. కాన "యజేత" అనులిఙునకు యత్నపద సమానార్థకత్వప్రసంగము లేదని

యాశంకింపరాదు. కేవల యత్నపదసమానార్థకత్వము లేక పోయినను "యాగయత్నః" అనుపదముతో పర్యాయతా ప్రసంగము వచ్చును. "యజేత" అనెడువిధి కర్తృసంఖ్యను బోధించును. యాగయత్నపద మట్టిసంఖ్యాబోధకము గాదు. ఇట్టి విశేషమునుబట్టి "యజేత" అనువిధి వాక్యమునకు యాగయత్నపదముతో పర్యాయతాప్రసంగము లేదనిచెప్పి నచో "యాగయత్నవాన్" అనుదానితో విధివాక్యమునకు సామ్యప్రసంగము వచ్చును. ఈయర్థ మిష్టమని చెప్పుటకు వీలులేదు. ఇదియే యర్థమైనచో విధివాక్యమువలనఁ బ్రవృత్తియే లేకపోవలసి వచ్చును. ఫలసమభివ్యాహారము లేనందునఁ బ్రవర్తింపఁడని చెప్పుటకు వీలులేదు. స్వర్గకాముఁడు యాగయత్నము కలవాఁడు. అనఁగా "స్వర్గకామో యాగయత్నవాన్" అను స్థలమునఁగూడఁ బ్రవృత్తికలుగుట లేదు. స్వర్గరూపఫలసమభివ్యాహార మున్నందునఁ బ్రవృత్తి కలుగవలసివచ్చును.

మూ. తత్కాస్య హేతోః? న హి యత్నో యత్నస్య హేతుర్యత్నప్రతీతిర్వా యత్నస్య కారణం, అపిత్విచ్ఛా న చ సాపి ప్రతీతా యత్నజననీ యేన సైవ విధ్యర్థః ఇత్యనుగమ్యతాం, అపితు సత్తయా న చ లిఙః శ్రుతికాలే సాసతీ. న చ లిఙేవతాం జనయతి అర్థవిశేషమప్రత్యాయయంత్యాస్తస్యాః తజ్జనకత్వే వ్యుత్పత్తిగ్రహణవైయర్థ్యాత్. అనుపలబ్ధలిఙాంచేచ్ఛానుత్పత్తిప్రసంగాత్.

తా. 'స్వర్గకామో యాగప్రయత్నవాన్'. అనుదాని వలనఁ బ్రవృత్తి కలుగకపోవుట యెందువలన ననఁగా? ప్రవృత్తిలోఁ బ్రవృత్తికారణము గాదు. విధ్యర్థము ప్రయత్నమైనను విధివాక్యమువలన ప్రయత్నజ్ఞానము కలుగును. అది ప్రయత్నములోఁ గారణము కాదు. ప్రవృత్తిలోఁ గారణము చికీర్షయే. అది విధికి నర్థమనినచో! విధివాక్యమువలన దాని యొక్క ప్రతీతి కలుగును. ప్రవృత్తిలో నజ్ఞాయమానమైన చికీర్షయే కారణముగాని చికీర్షాజ్ఞానము హేతువు గాదు. అందువలనఁ బ్రయత్నకారణ మైనట్టియు నజ్ఞాయమానమైనట్టియు చికీర్ష లేనందున విధివాక్యమువలనఁ బ్రవృత్తి లేకపోవలసి వచ్చును. ప్రవృత్తికారణమైనయిచ్ఛ లిఙువల్లనే పుట్టునని చెప్పుటకు వీలు లేదు. అర్థవిశేష ప్రతీతిజనకముగాని లిఙువలన నిచ్ఛ పుట్టుటకు వీలులేదు. ఇచ్ఛలో జ్ఞానము కారణమగుటవలన లిఙువలన నిచ్ఛాకారణమైనజ్ఞానము కలుగనిచో నిచ్ఛపుట్టుటకు వీలులేదు. విధిప్రత్యయము లేకపోయినప్పుడు ఇచ్ఛయే పుట్టకపోవలసి వచ్చును.

మూ. ఏతేన వృద్ధవ్యవహారాద్వ్యుత్పత్తిర్భవంతీ బాల
స్యాత్మని ప్రవృత్తిహేతుర్యోవగత స్తమేవా
శ్రయతే. స్వయం చ కుర్యామితి సంకల్పాదేవా
యం ప్రవృత్తః. తతస్స ఏవ లిఙర్థ ఇతి నిరస్తం
కుర్యాదితి యత్నో వా స్యాదిచ్ఛా వా? నాద్యః.
స్వాత్మని వృత్తివిరోధాత్. న ద్వితీయః. సా హి
స త్తయైవప్రయత్నోత్పాదినీ. న చ విఙ్ఞః శృతి
కాలే సాసతీత్యుక్తం.

తా. మధ్యమవృద్ధునియొక్క ప్రవృత్తి హేతుభూత మైన సంకల్పజ్ఞానము ననుమేయించి వ్యుత్పత్తిని గోరెడు బాలుఁడు. 'ఇది నాకు ఇష్టసాధనము' అని తెలుసుకొనినపిదప "కుర్యాం" అనెడు ఏసంకల్పముఁ గలిగెనో దానియొక్క జ్ఞానమువలన ప్రవర్తించెను గాన నాసంకల్పమే విధ్యర్థమని యాశంకింపవలదు. కుర్యాం అనఁగాఁ బ్రయత్నమా లేక యిచ్ఛయా? ప్రయత్నమే యనినచో, తన్నుఁగూర్చి తాను కారణము గానందున మొదటిపక్షము సరికాదు. ఇచ్ఛయే యనినచో నది లిఙర్థముగాన లిఙ్ శ్రవణ మైనపిదప దాని యొక్కజ్ఞానము గల్గును. ప్రయత్నకారణమైన యిచ్ఛ యజ్ఞాయమానమై యుండవలెను. లిఙ్ శ్రవణకాలమం దట్టి యిచ్ఛ లేనందున ప్రయత్నమే లేకపోవలసి వచ్చును.

మూ. ఫలేచ్ఛా తు నిసర్గవాహితయా సత్యపి న ప్రయత్నం ప్రతి హేతుః. అన్యవిషయత్వాత్. తదర్థం చ శాస్త్రవైయర్థ్యాత్. తస్యాః కారణాంతరతఏవ సిద్ధేః. తత్ప్రతీత్యర్థమపి శాస్త్రానపేక్షణాత్. తస్యామనోవేద్యత్వాత్. అప్రాప్తే చ శాస్త్రానవకాశాత్. తదభిధానే చ స్వర్గకామ ఇతి కర్తృవిశేషణపౌనరుక్త్యాత్. తదా హి యజేతేత్యస్యైవ యాగకర్తా స్వర్గ కామ ఇత్యర్థస్స్యాత్.

తా. 'సంకరాత్' అనెడు కారికాంశమును వివరించుటకొఱకు సుఖాదిరూపఫలేచ్ఛ యెల్లప్పుడు నుండుట వలన నదియే లిఙర్థము. దానివలననే స్వర్గసాధనమగు యాగా

దికమందుఁ బ్రవృత్తి గలుగును. అని చెప్పుటకు వీలులేదు. యాగాదిప్రయత్నములో సుఖేచ్ఛ కారణమని చెప్పుటకు భిన్నవిషయకము గాన వీలులేదు. అట్లైనచో నొకదానిని గోచరించిన యిచ్ఛవలన మఱియొక ప్రయత్నముఁగూడఁ గలుగ వలసివచ్చును.

'స్వర్గకామో యజేత' అనెడు శాస్త్రమువలన సుఖా దీచ్ఛఁ బుట్టుననియా? లేక తెలుపుడు చేయుననియా? ఈ రెండు పక్షములలోను శాస్త్రవైయర్థ్యము తప్పదు. శాస్త్రమువలన సుఖేచ్ఛఁ గలుగుటకు వీలులేదు. సుఖేచ్ఛలో సుఖజ్ఞానమే కారణము గాన దానివలననే సుఖేచ్ఛఁ గలుగుచుండఁగా! శాస్త్రవైయర్థ్యము సంభవించును. సుఖేచ్ఛయొక్క ప్రతీతి కొఱకే శాస్త్రమని చెప్పుటకు వలనుపడదు. దానియొక్క ప్రతీతి యాత్మ మనస్సంయోగమువలననే గల్గును గాన నీ పక్షమునఁగూడ శాస్త్రవైయర్థ్యము తప్పదు. శాస్త్రమువలన ఫలేచ్ఛయు దానిజ్ఞానమును సంభవింపనపుడు శాస్త్రమనవ కాశ మగును. లిఙుచే సుఖరూపమగు స్వర్గకామన చెప్పఁబడినచోఁ గర్తృవిశేషణమగు స్వర్గకామ ననుబోధించెడు. "స్వర్గకామః" అనువిశేషణమునకుఁ బౌనరుక్త్యరూప మగు సాంకర్యము వచ్చును. "యజేత" అనుదానివలననే యాగకర్త స్వర్గకామన గలవాఁడనునర్థము లభించు చూడఁ గా "స్వర్గకామః" అనుపదమునకు పౌనరుక్త్యము వచ్చును. కాన లిఙ్జనకు ఫలేచ్ఛ యర్థమని చెప్పుటకు వీలులేదు.

మూ. యది చ ఫలవిషయైవ సాధనవిషయం ప్రయ
త్నం జనయేత్; అన్యత్రాపి ప్రసువీత, నియా

మకాభావాత్. హేతుఫలభావఏవ నియామక ఇతి చేత్. న అజ్ఞాతస్య తస్య నియామకత్వే లిఙం వినాపి స్వర్గేచ్ఛాతో యాగే ప్రవృత్తి ప్రసంగాత్. జ్ఞాతస్య తు తత్సాధనత్వస్య నియామకత్వే తదిచ్ఛైవ తత్ర ప్రవర్తయతు. యో యత్కామయతే స తత్సాధనమపి కామయతఏవేతి నియమాత్. న చ సా తదానీం సత్.

తా. ఫలమును గోచరించునిచ్ఛయే ఫలసాధనమందు ప్రయత్నము నేల పుట్టింపఁగూడదని యాశంకింపవలదు. అట్లైనచో ఫలసాధనమందువలె దానికి నసాధనమైనవానియందుఁ గూడ నియామకము లేనందునఁ బ్రయత్నము కలుగవలసి వచ్చును.

ఫలేచ్ఛ తత్సాధనమందే ప్రయత్నమును బుట్టించును గాని తదసాధనమందు ప్రయత్నమును బుట్టింపదని చెప్పుటకు వీలులేదు. ఫలేచ్ఛయందుండు, తత్సాధనము గోచరించెడు ప్రయత్నసాధనత్వ మజ్ఞాతమై నియామక మగునా? లేక జ్ఞాతమై నియామక మగునా?

మొదటిపక్షమున "స్వర్గకామో యజేత" అను విధి వాక్యమువలన గలుగుజ్ఞానము లేకపోయినను, స్వర్గేచ్ఛయున్నపుడు యాగమందుఁ బ్రవృత్తి కలుగవలసివచ్చును. జ్ఞాతమైన ఫలసాధనత్వమే యాగమందుండెడు ప్రవృత్తిలో నియామకమని చెప్పినచో ఫలసాధనత్వమును గోచరించెడి యిచ్ఛయె ఫలసాధనమందుఁ బ్రవృత్తినిఁ గలుగఁజేయును.

ఎవఁ డేఫలము నిచ్ఛయించునో వాఁడు తత్సాధనమునుగూడ నియతముగ నిచ్ఛయించును. లిఙ్ శ్రవణకాలమం దట్టియిచ్ఛ లేనందున యాగాదికమందు బ్రవృత్తియె గలుగక పోవలసి వచ్చును.

మూ. న చ తద్జ్ఞానమేవ ప్రయత్నజనకం తచ్చ లిఙా క్రియత ఇతియుక్తం. స్వర్గకామః యాగచికీర్షావా నిత్యతోఽపి ప్రవృత్తిప్రసంగాత్. లిఙో వా ఇచ్ఛాం ప్రతీత్యా అనిచ్ఛన్నపి సర్వః ప్రవర్తేత. స్వసంబంధితయా తదవగమస్తథా న తు సామాన్యత ఇతి చేన్న. ప్రథమపురుషేణ తదభిధానే తస్యావిధ్యర్థత్వప్రసంగాత్. ఓదనకామస్త్వం పాకచికీర్షావా నిత్యతోఽపి ప్రవృత్త్యాపత్తేశ్చ.

తా. ఫలసాధనేచ్ఛాజ్ఞానమే స్వర్గసాధనమగు యాగాదికమందుఁ బ్రవృత్తిని బుట్టించును. ఆజ్ఞానము లిఙాదులవలన నిచ్ఛలేకపోయినను గల్గును గాన లిఙాదిశ్రవణకాలమున యాగాదికమందుఁ బ్రవృత్తి యుత్పన్నమగునని చెప్పుట యుక్తము గాదు. ఫలసాధనేచ్ఛాజ్ఞానముగాని ఫలేచ్ఛాజ్ఞానముగాని ప్రవర్తకమనినచో 'స్వర్గకామః' 'యాగచికీర్షావాన్' అను వాక్యములవలనఁగూడఁ దత్తదిచ్ఛాజ్ఞానములు గల్గును గాన విధివాక్యశ్రవణానంతరము యాగమందుఁ బ్రవర్తించినటుల పూర్వోక్తవాక్య శ్రవణానంతరమున గూడ యాగాదికమందుఁ బ్రవర్తింపవలసి వచ్చును. సాధనేచ్ఛాజ్ఞానమువలననే ప్రవృత్తియైనచో సాధనేచ్ఛ లేనపుడుగూడ

మకాభావాత్. హేతుఫలభావఏవ నియామక ఇతి చేత్. న అజ్ఞాతస్య తస్య నియామకత్వే లిఙం వినాపి స్వర్గేచ్ఛాతో యాగే ప్రవృత్తి ప్రసంగాత్. జ్ఞాతస్య తు తత్సాధనత్వస్య నియామకత్వే తదిచ్ఛైవ తత్ర ప్రవర్తయతు. యో యత్కామయతే స తత్సాధనమపి కామయతఏవేతి నియమాత్. న చ సా తదానీం సత్.

తా. ఫలమును గోచరించునిచ్ఛయే ఫలసాధనమందు ప్రయత్నము నేల పుట్టింపఁగూడదని యాశంకింపవలదు. అట్లైనచో ఫలసాధనమందువలె దానికి నసాధనమైనవానియందుఁ గూడ నియామకము లేనందునఁ బ్రయత్నము కలుగవలసి వచ్చును.

ఫలేచ్ఛ తత్సాధనమందే ప్రయత్నమును బుట్టించును గాని తదసాధనమందు ప్రయత్నమును బుట్టింపదని చెప్పుటకు వీలులేదు. ఫలేచ్ఛయందుండు, తత్సాధనము గోచరించెడు ప్రయత్నసాధనత్వ మజ్ఞాతమై నియామక మగునా? లేక జ్ఞాతమై నియామక మగునా?

మొదటిపక్షమున "స్వర్గకామో యజేత" అను విధి వాక్యమువలన గలుగుజ్ఞానము లేకపోయినను, స్వర్గేచ్ఛ యున్నపుడు యాగమందుఁ బ్రవృత్తి కలుగవలసివచ్చును. జ్ఞాతమైన ఫలసాధనత్వమే యాగమందుండెడు ప్రవృత్తిలో నియామకమని చెప్పినచో ఫలసాధనత్వమును గోచరించెడి యిచ్ఛయె ఫలసాధనమందుఁ బ్రవృత్తినిఁ గలుగఁజేయును.

ఎవఁ డేఫలము నిచ్ఛయించునో వాఁడు తత్సాధనమునుగూడ నియతముగ నిచ్ఛయించును. లిఙ్ శ్రవణకాలమం దట్టియిచ్ఛ లేనందున యాగాదికమందు బ్రవృత్తియె గలుగక పోవలసి వచ్చును.

మూ. న చ తద్జ్ఞానమేవ ప్రయత్నజనకం తచ్చ లిఙా క్రియత ఇతియుక్తం. స్వర్గకామః యాగచికీర్షా వా నిత్యతోఽపి ప్రవృత్తిప్రసంగాత్. లిఙో వా ఇచ్ఛాం ప్రతీత్యా అనిచ్ఛన్నపి సర్వః ప్రవర్తేత. స్వసంబంధితయా తదవగమస్తథా న తు సామాన్యత ఇతి చేన్న. ప్రథమపురుషేణ తదభిధానే తస్యావిధ్యర్థత్వప్రసంగాత్. ఓదనకామస్త్వం పాకచికీర్షావా నిత్యతోఽపి ప్రవృత్త్యాపత్తేశ్చ.

తా. ఫలసాధనేచ్ఛాజ్ఞానమే స్వర్గసాధనమగు యాగాదికమందుఁ బ్రవృత్తిని బుట్టించును. ఆజ్ఞానము లిఙాదులవలన నిచ్ఛలేకపోయినను గల్గును గాన లిఙాదిశ్రవణకాలమున యాగాదికమందుఁ బ్రవృత్తి యుత్పన్నమగునని చెప్పుట యుక్తము గాదు. ఫలసాధనేచ్ఛాజ్ఞానముగాని ఫలేచ్ఛాజ్ఞానముగాని ప్రవర్తకమనినచో 'స్వర్గకామః' 'యాగచికీర్షావాన్' అను వాక్యములవలనఁగూడఁ దత్తదిచ్ఛాజ్ఞానములు గల్గును గాన విధివాక్యశ్రవణానంతరము యాగమందుఁ బ్రవర్తించినటుల పూర్వోక్తవాక్య శ్రవణానంతరమున గూడ యాగాదికమందుఁ బ్రవర్తింపవలసి వచ్చును. సాధనేచ్ఛాజ్ఞానమువలననే ప్రవృత్తియైనచో సాధనేచ్ఛ లేనపుడుగూడ

లిజాదులవలన గల్గెడు సాధనేచ్ఛాజ్ఞానమువలనఁగూడఁ బ్రవ ర్తింపవలసి వచ్చును. ఇచ్ఛాసంబంధి యైన పురుషునియందుం డెడు నిచ్ఛాజ్ఞానమే ప్రవర్తకము; ఇచ్ఛ లేనిసమయమున లిజాదులవలనఁ గలిగెడుజ్ఞాన మట్టిది గాదు గానఁ బ్రవృత్తి ప్రసంగము లేదని చెప్పుటకు వీలులేదు. 'యజేత' అను ప్రథ మపురుషచే సామాన్యముగా నిచ్ఛయే చెప్పఁబడును గాని స్వసంబంధియైన యిచ్ఛ చెప్పఁబడనందున సామాన్యముగా నిచ్ఛాజ్ఞానమువలనఁ బ్రవృత్తి గలుగక పోవలసివచ్చును. అనఁగా ప్రవర్తకజ్ఞానవిషయమే లిజర్థము. స్వసంబంధీచ్ఛయె ప్రవర్తక జ్ఞానవిషయము ప్రథమపురుషచే సామాన్యముగా నిచ్ఛయే చెప్పఁబడినచో నది ప్రవర్తకజ్ఞానవిషయము గానం దున నది విధ్యర్థమే గాకపోవలసి వచ్చును. మఱియు "ఓదనకామస్త్వం" "పాకచికీర్షావాన్" అనువాక్యములకు నోదనమును గోరు నీవు పాకమునుఁజేయ నిచ్ఛయించియుం టివి యని యర్థము. ఈ వాక్యమువలన స్వసంబంధీచ్ఛా జ్ఞానము గల్గినందున నీవాక్యముఁగూడ ప్రవర్తకము గావ లసి వచ్చును.

మూ. అపి చ సంకల్పజ్ఞానాత్ యది ప్రయత్నో జాయేత, తథాపి సంకల్పస్య కుతో జన్మ కిమర్థం చ? సంకల్పజ్ఞానాదేవ,ప్రయత్నార్థం చేతి చేత్. నన్విచ్ఛావిశేషస్సంకల్పః, స తావత్ సుఖే స్వభా వతః తత్సాధనే చౌపాదికః సంకల్పవిషయస్తు కథం? తత్సాధనత్వాదేవేతి చేత్. తర్హి తత్సా ధనత్వ జ్ఞానాత్. న తు సంకల్పస్వరూపజ్ఞానాద్భ

వితుమర్హతీతి, అన్యథా ఇష్టసాధనతాజ్ఞానమప్యనర్థకమాపద్యేత. తస్మాత్సంకల్పః ప్రవర్తక ఇత్యభ్యుపేయతే, కింతు సత్తామాత్రేణ న తు జ్ఞాత ఇతి నాసౌ విధిః. జ్ఞానం చ విషయోపహారేణైవ వ్యవహారయతీతి తద్విషఏవావశిష్యతే ఇతి కర్తృధర్మవ్యుదాసః.

తా. మఱియు సంకల్పజ్ఞానమువలననే ప్రయత్నముఁ గల్గినచో సంకల్పము దేనివలనఁ బుట్టును. అనఁగా సంకల్పకారణమేది? సంకల్పమునకుఁ బ్రయోజన మేది? చెప్పుడు? సంకల్పము సంకల్పజ్ఞానమువలననే కల్గును. సంకల్పమునకుఁ బ్రయత్నమే ప్రయోజనము! అనినచో సంకల్పమనఁగా నిచ్ఛావిశేషము గదా! అది సుఖేచ్ఛారూపమా? లేక తత్సాధనేచ్ఛారూపమా? సుఖేచ్ఛారూపమైనచో నది సుఖత్వప్రకారకజ్ఞానమువలననే గల్గును. సుఖసాధనేచ్ఛ యనినచో నది [illegible] గల్గును. సంకల్పము సుఖరూపముగాని తత్సాధనరూపముగాని కానందునఁ బూర్వమందుఁ జెప్పఁబడిన ఫలేచ్ఛలోగాని తత్సాధనేచ్ఛలోగాని సంకల్పజ్ఞానము కారణము గానందున నిచ్ఛాజనకజ్ఞానవిషయము సంకల్ప మెట్లగును. సంకల్పము సుఖరూపముగాని తత్సాధనరూపముగాని కానందునఁ దజ్జ్ఞానమువలన సంకల్పము గల్గునని యట్లందువు. సంకల్పముఁగూడ పరంపరయా సుఖసాధనమగుటవలన తజ్జ్ఞానమువలన సుఖసాధనేచ్ఛఁ గలుగవచ్చుననినచో సంకల్పజ్ఞానములవలననే యది గల్గునని చెప్పుట

యుచితము గాదు. సుఖసాధనత్వజ్ఞానమువలననే సాధనేచ్ఛ గలుగునని జెప్పుట యుచితము. ఈ సుఖసాధనత్వజ్ఞానమునకు సాధనేచ్ఛాజనకత్వము చెప్పినచో నీజ్ఞాన మనర్థకము గావలసివచ్చును. అనఁగా నిష్ఫలము గావలసివచ్చును. కాన సంకల్పమే ప్రవర్తకమని చెప్పవలెను. అది యజ్ఞాయమాన మగుచుఁ గారణము జ్ఞాతమైనకారణము గాదు. కాన సంకల్పము విధ్యర్థమని జెప్పుటకు వీలుపడదు.

జ్ఞానమే విధ్యర్థమనినచో విషయమును స్పృశింపనిది ప్రవర్తకము గాదు. ఇష్టసాధనతాజ్ఞానమే ప్రవర్తకము. అట్టి యిష్టసాధనత్వమే విధ్యర్థము గాన కర్తృధర్మమైన స్పందగాని యత్నముగాని సంకల్పముగాని విధ్యర్థమని జెప్పుటకు వీలు పడదు.

మూ. అస్తు తర్హి కర్మధర్మః. నేత్యుచ్యతే.

శ్లో. అతిప్రసంగాన్న ఫలం నాపూర్వం తత్వహానితః,
తదలాభాన్న కార్యం చ న క్రియాప్యప్రవృత్తితః. ౧౫

తా. కర్తృధర్మము గాకపోయినచో కర్మధర్మమే విధ్యర్థమని చెప్పుటకు వలనుపడదు. కర్మధర్మము ఫలమా? అపూర్వమా? కార్యత్వమా? లేక క్రియయా? స్వర్గాదిరూప ఫలమే యనినచో దానికి కార్యత్వమును దెలుసుకొని యే యుపాయమునఁ బ్రవర్తింపవలెను. ప్రవృత్తిజ్ఞాపకమైన కార్యత్వము నుపాయమందుఁగూడ నుండుటవలన దానియందుఁ గూడఁ బ్రవర్తింపవలెను. కాన ఫలము విధ్యర్థమనుటకు వీలు

లేదు. అపూర్వము విధ్యర్థమనుటకు వీలులేదు. శబ్దానుభవముకంటెఁ బూర్వమం దపూర్వము జ్ఞాతమా? యజ్ఞాతమా? జ్ఞాతమైనచో నపూర్వత్వమునకే హానిగల్గును. అజ్ఞాతమైనచో దానియందు శక్తిగ్రహమే దుర్లభము గాన నపూర్వతచే నపూర్వము విధ్యర్థమనుటకు వీలులేదు. కార్యత్వవిశిష్టమై కార్యరూపధర్మియందు లిఙ్పదమునకు శక్తిగ్రహము కార్యార్థానుభవదశయందు ఘటాదులయోగ్య మగుటవలన కార్యత్వవిశిష్టాపూర్వమందే శక్తిగ్రహముఁ గల్గుననుటకు వీలులేదు. కార్యత్వవిశిష్టమై యపూర్వము జ్ఞాతమైనచో నపూర్వత్వమునకే హానివచ్చును. అజ్ఞాతమైనచో నది లభింపనందున నట్టి యపూర్వమందు శక్తిగ్రహము దుర్లభము. క్రియయే విధ్యర్థమనినచో ననిష్టసాధనమందుఁగూడఁ గ్రియాత్వ మున్నందున దానియందుఁగూడ విధివాక్యశ్రవణానంతరము ప్రవృత్తిఁ గలుగవలసివచ్చును.

మూ. కర్మ హి ఫలం వా స్యాత్ తత్కారణమపూర్వం వా తత్కారణం క్రియా వా? న ప్రథమః ఫలేచ్ఛాయాః ప్రవృత్తిం ప్రత్యహేతుత్వాత్ అతిప్రసంగాదిత్యుక్తత్వాత్. న ద్వితీయః అవ్యుత్పత్తేః. లిఙో హి ప్రవృత్తినిమిత్తమపూర్వత్వం వా స్యాత్. కార్యత్వం వా స్యాత్. ఉభయం వా? న ప్రథమః శబ్దప్రవృత్తినిమిత్తస్య అపూర్వత్వస్య ప్రమాణాంతరాదవగతౌ అపూర్వత్వవ్యాఘాతాత్. అనవగతావవ్యుత్పత్తేః. సంబంధినో ఽనవగమే సంబంధస్య ప్రత్యేక

మశక్యత్వాత్. తత ఏవావగతా ఇతరేతరా
శ్రయదోషాత్. న చ గంధవత్వేనోపనీతా
యాంపృథివ్యాం పృథివీశబ్దపదదూరవిప్రకర్షేణ
కార్యత్వేనోపనీతేనాపూర్వత్వేన నిమిత్తేనా
పూర్వే ప్రవర్తతేలిజితి యుక్తం. తత్రోభయో
రేపి ప్రతీయమానత్వేన సందేహే కల్పనా
గౌరవపురస్కారేణ పృథివీత్వఏవ సంగతివిశ్రా
న్తేరుపపత్తేః. నత్వత్రాపూర్వత్వప్రతీతిః.

తా. ఫలము విధ్యర్థమా? ఫలసాధనమైన యపూర్వమా? అపూర్వసాధనమైనక్రియయా? స్వర్గాదిరూపఫలము కార్యమని తెలిసినను నుపాయజ్ఞానము లేనిచో నెట్లు ప్రవర్తించును. అట్లైనచో ననుపాయమందుఁగూడఁ ప్రవర్తింపవలసి వచ్చును గాన ఫలము విధ్యర్థమనుటకు వీలు లేదు.

అపూర్వము విధ్యర్థమైనచో లిజ్పదశక్యతావచ్ఛేదకమపూర్వత్వమా? కార్యత్వమా? లేక రెండును నగునా? అపూర్వత్వమే యనినచో నది ప్రమాణాంతరముచే జ్ఞాతమా? అజ్ఞాతమా? జ్ఞాతమైనచో నపూర్వత్వమునకే వ్యాఘాతము సంభవించును. అజ్ఞాతమైనచో నపూర్వరూపధర్మిజ్ఞానమే లేనందున శక్తిరూపసంబంధప్రతీతి కనుపపత్తి వచ్చును. లిఙ్వలననే శక్తిగ్రహముగల్గి దానివలన నపూర్వోపస్థితియు నట్టి యపూర్వోపస్థితివలన నపూర్వమందు శక్తిగ్రహమును నీరీతిగ నన్యోన్యాశ్రయప్రసంగము వచ్చును గాన లిఙ్వలన నపూర్వమందు శక్తిగ్రహము గల్గుననుటకు వీలు లేదు.

పృథివీపదమునకు పృథివీత్వము గంధవత్త్వము నెట్లు ప్రవృత్తినిమిత్తములో (అనఁగా శక్యతావచ్ఛేదకమో) అట్లే లిఙ్ పదమునకుఁగూడ కార్యత్వముతోఁగూడిన యపూర్వత్వమే ప్రవృత్తినిమిత్తమని చెప్పుటకు వీలులేదు. గంధవత్త్వ పృథివీత్వములు రెండును ప్రత్యక్షసిద్ధములు. ఈరెండింటిలో నేది శక్యతావచ్ఛేదకమని సందేహము గల్గినప్పుడు గంధవత్త్వ ముపాధి పృథివీత్వము జాతి సఖండమైన గంధవత్త్వరూపోపాధికిఁ బ్రవృత్తినిమిత్తత్వము చెప్పుటకంటె నఖండమైన పృథివీత్వజాతికిఁ బ్రవృత్తినిమిత్తత్వము చెప్పుటలో లాఘవమనెడు లాఘవజ్ఞానముచే పృథివీత్వమందుఁ బ్రవృత్తినిమిత్తత్వము సిద్ధించును గాని యపూర్వత్వ మజ్ఞాతమైనందున దానియందు శక్తిగ్రహము సంభవింపదు.

మూ. స్యాదేతత్. కార్యత్వముపలక్షణీకృత్య తావదేవ లిఙ్ ప్రవృత్తా, తదుపలక్షితశ్చ యాగో వా యత్నో వాన్యోవా శబ్దేతరప్రమాణగోచరో నాధికారివిశేషణస్వర్గసాధనసమర్థః. న చాకామ్యఫలే కామీ నియోక్తుం శక్యతే. తతోఽన్యదేవాలౌకికం కించిదనేనోపలక్ష్యతే. యో లిఙాదిప్రవృత్తిగోచర ఇతి కిమనుపపన్నమితి చేన్న.

తా. వృద్ధవ్యవహారమువలన బాలుఁడు ప్రవృత్తిహేతువైన కార్యత్వము లిఙర్థమని నిశ్చయించును. ఈకార్యత్వముచే నుపలక్షితము యాగముగాని యత్నముగాని ?ముగాని స్వర్గకామయోగ్యములు కాకపోవుటవలన

యాగస్వర్గములను విడిచి స్వర్గసాధనతాయోగ్యమగు యలౌకికమైన కార్యత్వోపలక్షితమైన యపూర్వమందు శక్త్యనుభవము గలవాఁడై యగునని చెప్పుటలో నేమి యనుపపత్తి యని యాశంకింపరాదు.

మూ. ఉపలక్షణం హి స్మరణమనుమానం వా, ఉభయమప్యనవగతసంబంధేనాశక్యం. న హి సంస్కారవన్మనోవదదృష్టవద్వా కార్యత్వమపూర్వత్వముపలక్షయతి, జ్ఞానాపేక్షణాత్. తతో హస్తీ వా హస్తిపకం, ధూమ ఇవ ధూమధ్వజం, తత్సంబంధజ్ఞానాదుపలక్షయేత్, న త్వన్యథా.

తా. ఉపలక్షణ మనఁగా స్మరణయా? అనుమానమా? కార్యత్వమునకు, అపూర్వమునకు నుండుసంబంధము తెలియనప్పుడు కార్యత్వ మపూర్వమును స్మరింపఁజేయుటలోగాని, యనుమేయించుటలోగాని సమర్థము గాదు. గంగాపదము స్వార్థాన్వయయోగ్యము గానందున, స్వార్థాన్వయసంబంధతచేఁ బ్రతీతమగు తీరము నెట్లు స్మరింపఁజేయునో, ధూమమునకు వ్యాపకతచే వగతమైన వహ్ని నెట్లనుమేయించునో, యొనుఁగు పాల్యపాలకసంబంధతచే జ్ఞాతమైన హస్తిపకు నెట్లు స్మరింపఁజేయునో, అట్లే సంబంధతచేఁగాని వ్యాపకతచేఁగాని యవగతము గానప్పుడు కార్యత్వ మపూర్వమును స్మరింపఁ జేయుటలోగాని యనుమేయించుటలోగాని సమర్థము గాదు.

సంస్కారమువలెను, మనస్సువలెను, అదృష్టమువలెను నజ్ఞాతమై కార్యత్వము స్మారకము గాదు.

మూ. తథా చ న్యాయసంపాదనాప్యరణ్యేరుదితం. న హి యుక్తిసహస్రైరప్య విదితే సంగతిగ్రహో అవిదితసంగతిర్వా శబ్దః ప్రవర్తతేతి. ఏతేన భేదాగ్రహాత్క్రియాకార్యే వ్యుత్పత్తిరితి నిరస్తం. న హ్యజ్ఞాతే భేదాగ్రహో వ్యవహారాఙ్గం. అతిప్రసంగాత్.

తా. 'తతోఽన్యదేవాలౌకికం కించిదనేనోపలక్ష్యతే యో లిఙ్గాది ప్రవృత్తిగోచరః' అను న్యాయముఁగూడ నరణ్యరోదనము వంటిది. అపూర్వ మజ్ఞాతమైనప్పుడు దానియందు శక్తిగ్రహమును నపూర్వమం దజ్ఞాతశక్తికమైన లిఙాదుల వలనఁ బ్రవృత్తియును సంభవింపదు.

కార్యత్వమే లిఙాది పదశక్యతావచ్ఛేదకము. క్రియారూపకార్యమందు భేదాగ్రహముఁ గలిగినచో లిఙాది పద శక్తిజ్ఞానముగలిగి ప్రవర్తించుననుటకు వీలులేదు. అపూర్వ మజ్ఞాతమగుటవలన జ్ఞాతమైనదానితో భేదాగ్రహమే యుపయోగించును. అపూర్వ మజ్ఞాతమైనందున దానియందుండు భేదాగ్రహము నెందులకు నుపయోగించుటకు వలనుపడదు. ఇట్టి భేదాగ్రహమువలననే వ్యవహారమును సంభవింపదు.

మూ కిం చాపూర్వత్వే ప్రవృత్తినిమిత్తే కల్ప్యమానే లౌకికీ లిఙ్గనర్థికా ప్రసజ్యేత, తత్రోపలక్షణీయాభావాత్. తత్ర కార్యత్వమేవ ప్రవృత్తినిమిత్తమితియది, ప్రకృతేపి తదైవాస్తు క్లుప్తత్వాత్సంభవాచ్చేతి.

తా. అపూర్వత్వము లిజ్పదప్రవృత్తి నిమిత్త మనినచో 'పచేతేత్యాదు'లయందుండు లిజనర్థకము గావలసివచ్చును. ఏలన పాకరూపక్రియకార్యత్వాన్వయయోగ్యము గానఁ గ్రియాకార్యమే లిజర్థము. లిజువలన నపూర్వప్రతీతి కవసరములేదు గాన నపూర్వత్వమే ప్రవృత్తినిమిత్త మనినచో నిరర్థకము గావలసివచ్చును. ఈస్థలమందుఁ గార్యత్వమే ప్రవృత్తినిమిత్త మనినచో క్లృప్త మగుటవలనను సంభవించుటవలనను 'యజేత' అను స్థలమందుఁగూడఁ గ్రియాసాధారణమగు కార్యత్వమే ప్రవృత్తినిమిత్త మగును. 'పచేత' అనునపుడు క్లృప్తము గాన నిట్టి క్రియాసాధారణమగు కార్యత్వములవల్ల నెట్లపూర్వలాభ మగును?

మూ. అస్తు తర్హి తదేవప్రవృత్తినిమిత్తం. తర్కసంపాదనయా త్వపూర్వవ్యక్తిలాభ ఇతి చేత్. న. నిత్యనిషేధాపూర్వయోరలాభప్రసంగాత్. న చాస్మిన్పక్షే ఏకత్ర నిర్ణీతేన శాస్త్రార్థేనాన్యత్ర తథైవ వ్యవహార ఇతి సంభవతి. కార్యత్వస్యైవ ప్రవృత్తినిమిత్తత్వేననిర్ణీతత్వాత్. న త్వపూర్వన్యాయసంపాదనాయాశ్చ తత్రా సంభవాత్. ఫలానుగుణ్యేన హి వ్యక్తివిశేషో లభ్యతే. న చ తత్ తత్ర శ్రూయతే. న చాశ్రుతమపి కల్పయితుం శక్యతే బీజాభావాత్.

తా. క్రియాసాధారణకార్యత్వము 'యజేత స్వర్గకామః అను స్థలమందు లిజ్ప్రవృత్తి నిమిత్త మనెదము. 'కార్యం లిజపదశక్యం' అను శక్తిజ్ఞానము ఘటాదిరూపకార్యమును

గోచరించును. పిమ్మట శక్తిజ్ఞానవిషయమైన ఘటాదికము స్వర్గ సాధనతాయోగ్యము గానందున యాగాదిరూపక్రియవలె ఘటమునుగూడ పరిత్యజించి స్వర్గసాధనతాయోగ్యమైన స్థాయియగు (అనఁగా ఫలపర్యంతమునుండు) నపూర్వ మునే కార్యత్వమున బోధించుననుటకు వీలులేదు. ఈస్థల మందు ఫలశ్రవణ మున్నందునఁ దత్సాధనతాయోగ్యమైన యపూర్వలాభమైనను. శ్రు. 'అహరహస్సంధ్యా ముపాసీత' 'న కలంజం భక్షయేత్' అనుస్థలములయందు ఫలశ్రవణము లేనందున నిత్యవిధులు నిట్టి స్థలమందు ఫలానుగుణతాయో గ్యములు గానందున నిత్యనిషేధరూపాపూర్వలాభము లేక పోవలసి వచ్చును.

కార్యత్వమందే లిఙపదప్రవృత్తినిమిత్తత్వము నిశ్చయిం చిన ట్లాన్యాయముచే నపూర్వత్వమందు నిశ్చయింపనందునఁ బూర్వోక్తస్థలములయందు నిత్యనిషేధరూపమగు నపూర్వ లాభము లేకపోవలసి వచ్చును. ఫలమునుబట్టి వ్యక్తివిశేషము లభించును. పూర్వోక్తస్థలములయందు ఫలశ్రవణము లేదు. ఫలకల్పన చేయుటలో బీజము లేదు. కాన (యజేతయను) పూర్వోక్తస్థలమం దపూర్వలాభము దుర్ఘట మగును.

మూ. తద్ధి విధ్యన్యథానుపపత్త్యా కల్ప్యతే. కార్యత్వ ప్రత్యయాన్యథానుపపత్త్యా వా లోకవత్. న ప్రథమః. భవతాం దర్శనే తస్యోపేయరూప త్వాత్. యతః శ్రుతస్వర్గఫలత్వేపి సాధ్యవివృద్ధి రుచ్యతే. న ద్వితీయః, శబ్దబలేవ తత్ప్రీత్యయే తదనపేక్షణాత్. లోకే హి తత్ప్రీత్యయ ఇష్టా

భ్యుపాయతాధీనః. న తు వేదే ఇత్యభ్యుపగ మాత్.

తా. లోకములోనుండు విధిస్థలమందు ఫలప్రతీతి గలిగినపిదప నెట్లు కార్యత్వము ప్రతీతమగునో వేదమందుఁగూడ ఫలసాధనత్వము లేనిచో విధిత్వము సంభవింపదు గాన విధిత్వాన్యథానుపపత్త్యా ఫలకల్పనయా లేక కార్యత్వప్రతీత్యన్యథానుపత్త్యా ఫలకల్పనయా ?

(1) విధిత్వాన్యథానుపపత్త్యా ఫలకల్పన యనుటకు మీ మతమందపూర్వమే ఫలమగుటవలన ఫలమే సాధనరూపము. ఫలజనకత్వము లేకపోయినను ఫలరూపమగు నపూర్వమున నుండు కార్యత్వము ఫలకల్పకము గానేరదు. స్వర్గస్వరూపమగు ఫలము శ్రుతమైనను నక్కడనుగూడ స్వర్గపర్యంతము వ్యాపించిన యపూర్వమునకే స్వతఃప్రయోజనత్వము స్వీకరింపఁబడును గాన స్వర్గము ఫలము గానేరదు. స్వర్గమునకు గౌణప్రయోజనత్వము. "అపూర్వం న స్వర్గసాధనం" అను ప్రతీతినిబట్టి ప్రధానమైన యపూర్వమునకు గుణత్వము నీ మతమందు స్వీకరింపనందున మొదటిపక్షము సరిగాదు.

(2) కార్యత్వప్రతీత్యన్యథానుపపత్త్యా ఫలకల్పనయా! 'కార్యశక్త్యా లిఙ్గ' నుజ్ఞానము ఫలసాధనత్వము నపేక్షింపదు. అనఁగా శబ్దమువలనఁ గలుగు కార్యత్వజ్ఞానము ఫలసాధనత్వము లేకపోయినను గలుగు నన్నందునఁ గార్యత్వప్రతీతి యుపపన్న మగుచుండఁగా ఫలకల్పన కవకాశము లేదు. లౌకిక విధిస్థలమందు కార్యత్వప్రతీతి యిష్టసాధనతా జ్ఞానాధీనమైనను వేదస్థలమం దట్లు స్వీకరింపము.

మూ. అన్యథేష్టాభ్యుపాయత్వైవ ప్రథమం వేదాదవగంతవ్యా, ప్రమాణాంతరాభావాత్. తతః కార్యతేత్యానుమానికో విధిః స్యాత్. న శాబ్దః.

తా. లోకములో కార్యతాప్రతీతి యొట్లిష్టసాధనతారూపలింగమువలనఁ గలుగునో వేదములోనుండు లిఙువల్లఁ గూడ నట్లే యంగీకరించినచో ఇష్టసాధనత్వప్రతీతి మొదటఁ గలిగినపిదప నీ హేతుజ్ఞానమువలన నానుమానికమగు కార్యత్వప్రతీతిఁ గలుగనిమ్ము. కార్యతాబోధశాబ్దము గాకపోవలసి వచ్చును. కార్యత్వము లిఙర్థమే కాకపోవలసి వచ్చును.

మూ. ఆనుమానికం ఫలమస్తు, యత్కర్తవ్యం తదిష్టాభ్యుదయ ఇతి వ్యాప్తేరిత్యపి న యుక్తం. సుఖే న వ్యభిచారాత్. అన్యత్వే సతీతిచేన్న. దుఃఖాభావేన వ్యభిచారాత్. ఫలం విహాయేతి చేత్. తదేవ కిముక్తం స్యాత్. ఇష్టం స్వభావత ఇతి చేత్తర్హి తతోఽన్యదనిష్టం స్యాత్. తచ్చ కర్తవ్యమితి వ్యాఘాతః. తత్సాధనమితి చేత్. తత్సాధనత్వే సతీతి సాధ్యావిశిష్టం విశేషణం. స్వభావతో నేదమిష్టం కర్తవ్యం చ, తతో నూనమిష్టసాధనమితి సాధనార్థ ఇతి చేన్న. స్వభావతో నేదమిష్టమిత్యసిద్ధేః. అనన్యోద్దేశప్రవృత్తకృతివ్యాప్యత్వాత్. అన్యథా తదసిద్ధేః, తతో వ్యాఘాతాదన్యతరాపాయ ఇతి.

తా. ఏది కృతిసాధ్యమో అది ఇష్టసాధన మనువ్యాప్తి యున్నందున ననుమానముచేతనే ఫలసిద్ధి యని యాశంకింప వలదు. సుఖ మిష్టము గాని, ఇష్టసాధనము గాదు. ఇష్టసాధన ముగాని సుఖమందు కృతివ్యాప్యత్వ మున్నందున వ్యభిచా రము ప్రసక్తమగును. సుఖాన్యత్వము హేతుశరీరములో ప్రవేశపెట్టి వ్యభిచారము వారించెద మనినచో దుఃఖనాశ ముఁగూడ చరమఫల మగుటవలన దీనియందు సుఖాన్యత్వ విశిష్టకృతివ్యాప్యత్వ రూపహేతు వున్నందున వ్యభిచారము దుఃఖనాశాంతర్భావముచే తిరిగి ప్రసక్తమగును. సుఖము దుఃఖాభావము రెండును ఫలములు గాన ఫలాన్యత్వము హేతుకోటిలోఁ బ్రవేశపెట్టి పూర్వమందుఁ జెప్పిన వ్యభి చారములు వారించెదనని యాశంకింపవలదు.

ఫలమనఁగా నేమి? ఇష్టమనినచో ఫలాన్యమనఁగా ననిష్ట మని యనవలెను. అనిష్టము కర్తవ్యమని జెప్పునపుడు వ్యాఘా తము వచ్చును. కాన ఫలాన్యత్వనివేశముఁ జేయుటకు వీలులేదు.

ఇష్టసాధనత్వవిశేషణము హేతుకోటిలోఁ బ్రవేశపెట్టి వ్యభిచారమును వారించినచో, సాధ్యముఁగూడ నదియే గాన విశేషణము సాధ్యావిశిష్టము గావలసివచ్చును. అనఁగా సాధ్యముచే సాధ్యమును సాధించిన ట్లగును. సాధ్యము సిద్ధింపనప్పుడు హేతుశరీరములో మఱియొకదోషమును వారింపనపుడు సాధ్యప్రవేశమును జేయుట సరిగాదు.

'ఇతరేచ్ఛాధీనేచ్ఛావిషయత్వే సతి కర్తవ్యత్వాద'ను హేతువుచే నపూర్వమందు ఫలసాధనత్వ మను మేయించెద

మనుట సరిగాదు. నీమతమం దదృష్టమే చరమఫల మగుటం జేసి 'ఇతరేచ్ఛాధీనేచ్ఛా విషయత్వ మసిద్ధము. అపూర్వము, 'అనన్యోద్దేశ ప్రవృత్త కృతివ్యాప్యత్వాత్' అపూర్వ మన్య ఫలోద్దేశముచేఁ బ్రవర్తించినఁ బురుషునియందు సమవేతమగు కృతివ్యాప్యమైనచో నిత్యవిధి. శ్రు. అహరహస్సంధ్యా ముపాసీత యనునపుడు నిత్యాపూర్వమున్ను. శ్రు. 'నకలంజిం భక్షయే' దనునపుడు నిషేధాపూర్వమును లేకపోను గాన నపూర్వమే ఫలమనవలెను. విశేషణాసిద్ధి వచ్చును గాన నీ యనుమానముకూడ సరిగాదు. ఇష్టసాధనత్వ మున్నచో, నన న్యోద్దేశ ప్రవృత్తకృతివ్యాప్తత్వ ముండదు. ఒకటి యున్న పుడు రెండవది యుండదు. కాన విశేషణవిశేష్యములు విరుద్ధ ములు కాన పూర్వానుమానము సరిగాదు.

మూ. అస్తు నిత్యనిషేధాపూర్వయోరలాభః కిం నచ్ఛి న్నమితిచేత్. కిం నఛిన్నం. యదా కామాధికా రేపితదలాభః. న హి లిఙాకార్యం స్వర్గసాధన ము_క్తం. నాపి స్వర్గకామపదసమభివ్యాహారాన్య థానుపపత్యా తల్లబ్ధం, బ్రాహ్మణత్వాదివదధి కార్యవచ్ఛేదమాత్రేణైవోపపత్తేః.

తా. అపూర్వమం దనన్యోద్దేశ ప్రవృత్త కృతివ్యాప్తత్వ మంగీకరించినచో నిత్యాపూర్వమును నిషేధాపూర్వమును లేకపోవలసి వచ్చునని చెప్పియుండిరి. ఆరెంటికిని లాభము లేనిచో నేమిబాధ వచ్చుననుట 'స్వర్గకామో యజేత' అను నప్పుడుఁగూడ నపూర్వాలాభములో వచ్చుబాధకమే యుం డును. కాన కామాధికార స్థలమందువలె, నిత్యనిషేధస్థల

ములయందుఁగూడ నిత్యనిషేధరూపమగు నపూర్వ మంగీక రింపవలెను.

'యజేత' యనునపుడు కేవల లిఙ్ స్వర్గసాధనత్వమును జెప్పునా? లేక స్వర్గకామపద సమభివ్యాహృతమైన లిఙుస్వర్గ సాధనత్వమును జెప్పునా? మొదటిపక్షమున లౌకిక లిఙనర్థ కము కావలసివచ్చును. వేదమందుఁగూడ ననన్యోద్దేశ్యకృతి వ్యాప్యత్వరూపమగు కార్యత్వమునకు స్వర్గసాధనత్వముతో విరోధ ముండవలసి వచ్చును. కావ మొదటిపక్షము సరిగాదు.

రెండవపక్షమున నే సమయమున నెవనియందు బ్రాహ్మ ణ్య ముండునో వానిని సంబంధించిన కార్యబోధవలె నెవనికి స్వర్గకామన యెప్పుడుండునో యాస్వర్గకామనకు సంబంధించిన కార్యబోధయే గలుగును గాని స్థిరమైన యపూర్వలాభము కలుగకపోవలసి వచ్చును.

మూ. న చేదమనుమానం, యస్య యదిచ్ఛాతో య
త్కర్తవ్యం తత్తస్యేష్టసాధనమితి. అన్యేచ్ఛయా
స్వాభావికకర్తవ్యతాయాసిద్ధేః. తదిచ్ఛయైవ తత్క
ర్తవ్యతాయాః సుఖేనానైకాంతికత్వాత్. జౌ
పాధికకర్తవ్యతాయాశ్చేష్టసాధనత్వమప్రతీత్య
ప్రత్యేతుమశక్యత్వాత్.

తా. స్వర్గసాధకమైన యపూర్వము శబ్దముచే లభింపక పోయినను నెవనికి దేనియొక్క యిచ్ఛవలన నేది కర్తవ్యమో, యట్టికర్తవ్యము వాని కిష్టసాధనమను ననుమానముచే స్వర్గ సాధనమైన యపూర్వము సిద్ధించు ననుమతముఁగూడ సరిగాదు.

ఏలన నితరమును గోచరించు నిచ్ఛచే కర్తవ్యమైనచో, అనఁగా ఫలేచ్ఛవలన సాధనమందు కర్తవ్యత్వము సంభవించదు. కర్తవ్యత్వ మనఁగా అనన్యోద్దేశ్యప్రవృత్త కృతివ్యాప్యత్వరూపము. సాధనమందు ఇట్టి కర్తవ్యత్వమే లేక పోవలసి వచ్చును.

దానియొక్క ఇచ్ఛాప్రయుక్త తత్కర్తవ్యత్వమే హేతువైనచో సుఖేచ్ఛాప్రయుక్త సుఖనిష్ఠ కర్తవ్యతసుఖమం దున్నది గాన నిష్టసాధనముగాని సుఖమందు వ్యభిచారము ప్రసక్తమగును.

మొదటిపక్షమున మఱియొకదోషముఁగూడ సంభవించును. ఇష్టసాధనతాజ్ఞానము లేనిది. కృతిసాధ్యతాప్రతీతిఁ గలుగదు గాన కర్తవ్యత్వముచే నిష్టసాధనత్వానుమానమే సంభవింపదు.

మూ. కిమనయా విశేషచింతయా, ప్రతీయతే తావ
చ్ఛబ్దాదన్యదిచ్ఛతో కర్తవ్యమనుమానమిత్యే
తావతైవానుమానమితి చేత్. నన్వన్విత
మభిధానీయం, యోగ్యం చాన్వీయతే. అన్యది
చ్ఛత శ్చాన్యత్కర్తవ్యమన్వయాయోగ్యం, త
త్కథమభిధీయతాం, తత ఏవ తత్సాధనత్వసిద్ధి
రితిచేత్. ఏవం తర్హీష్టసాధనతైకార్థసమవాయి
కర్తవ్యత్వాభిధానాదనుమానానవకాశః. న
చాన్వితాభిధానేపి తత్సాధనత్వసిద్ధిః. అధికా
ర్యవచ్ఛేదమాత్రేణాప్యన్వయయోగ్యతోపపత్తేః.

తా. స్వాభావికత్వ జౌపాధికత్వములయొక్క విచారణతో నేమి. అట్టివివక్ష లేనప్పుడు కర్తవ్యతామాత్రమే వివక్షితము. శబ్దముచే మఱియొకదాని నిచ్ఛయించువానికి కర్తవ్యతాబోధఁ గలుగును. కాన నిట్టిదే యనుమానమని చెప్పెదవా? అది సరిగాదు. ఇష్టసాధనత్వము జ్ఞాతము కానప్పుడు కర్తవ్యతాబోధ కలుగుట శక్యము గాదు. అయోగ్యమైన వాని కన్వయము సంభవింపదు. అన్యదిచ్ఛతో ఽన్యత్కర్తవ్య మనునది పరస్పరాన్వయయోగ్యములు గావు. కామ్యభిన్నమగు కామియొక్క కార్యమందే కామ్యసాధనత్వ మన్వయించును. కాని యిట్టిదానిచే నిష్టసాధనత్వ మెట్లను మేయింపఁబడును.

కామ్యభిన్నకామి కార్యత్వరూపహేతువుచే నదృష్టమం దిష్టసాధనత్వ మనుమేయించెదమని యాశంకింపరాదు. ఇష్టసాధనత్వ సమానాధికరణ కర్తవ్యత శబ్దముచే బోధితమగు నప్పుడు ననుమానమున కవకాశమే లేదు.

'అన్యదిచ్ఛతో ఽన్యత్కర్తవ్య'మనునది యన్వయయోగ్యమైనను నిష్టసాధనత్వ మనుమేయింప నవసరము లేదు. బ్రాహ్మణత్వమువలె నిష్టసాధనత్వముగూడ స్వర్గకామన అధికారియం దవచ్ఛేదకమని చెప్పెదము. అధికార్యవచ్ఛేదకతచే నిష్టసాధనత్వాన్వయోపపత్తి యగుచుండఁగా ననుమానమునకే యవసరము లేదు.

మూ. న చ కార్యత్వమపూర్వే సంభవతి. తద్ధికృతివ్యాప్యతా చేత్. ప్రీహ్యాదిష్వేవ, సిద్ధత్వాత్. కృతిఫలత్వం చేత్. యాగస్యైవ. తత స్తస్యైవాహ

తోౘత్పత్తేః, కృత్యుద్దేశ్యతా చేత్. స్వర్గస్యైవ. నిసర్గసుందరత్వాత్. న త్వపూర్వస్య. తద్విపరీతత్వాత్. స్తనపానాదివదౌపాధికీతి చేత్. సాపి యాగస్యైవ, స్వర్గస్య సాధ్యత్వసిద్ధౌ యాగస్యైవ సాధనత్వేనాన్వయాత్.

తా. వికల్పించి యపూర్వమందు కార్యము నిరాకరింపఁబడుచున్నది. కార్యత్వమన నేమి? కృతివ్యాప్యతారూపమైనచో, కృతివ్యాప్యత యనఁగా గృతిజన్యవ్యాపారవత్వరూపమైనది. ఇట్టి కార్యత్వము వ్రీహ్యాదులకే గాని, అపూర్వత సిద్ధింపనందున దానికి సంభవింపదు. కృతిఫలత్వ రూపమైనచో, యాగమునకే వచ్చును. యాగకృతివలన యాగమే పుట్టును గాన యాగమునకే సంభవించును. కృత్యుద్దేశ్యత్వరూపమైనచో ఫలమే కృత్యుద్దేశ్యము ఫలము సుఖము. దుఃఖాభావమును కృత్యుద్దేశ్యత్వము సుఖరూపమగు స్వర్గమునకే సంభవించును. అపూర్వము, సుఖరూపము, దుఃఖనివృత్తిరూపము గానందున దానియందుఁ గృత్యుద్దేశ్యత్వము సంభవింపదు. స్తనపాన మిష్టసాధనమైనందున నౌపాధికకృతి సాధ్యత్వమెట్లో యట్లే యపూర్వమందుఁగూడ నుండఁగూడదా యని యనుటకు వీలులేదు. స్వర్గమునకు సాధ్యత్వము సిద్ధించినచో యాగమేయిష్టసాధనము గాన దానికే యౌపాధికకృతిసాధ్యత్వముగాని యపూర్వమునకు స్వీకరింపము.

మూ. కాలవ్యవధానాన్నైతన్నిర్వహతీతి చేత్. యథా నిర్వహతి, శ్రుతానురోధేన తథా కల్ప్యతాం. వ్యాపారద్వారా కథంచిత్స్యాత్. న తు

భిన్న కాలయోః వ్యాపార వ్యాపారిభావః. కార ణత్వం చ వ్యాపారేణ యుజ్యతే. అవ్యవథా నేన పూర్వకాలనియమశ్చ తత్వం. అన్యథాతి ప్రసంగాదితి చేత్. న పూర్వభావనియమమా త్రస్య కారణత్వాత్. కార్యానుగుణావాన్తర కార్యస్యైవ వ్యాపారత్వాత్. కృషిచికిత్సాదౌ బహులంతథావ్యవహారాత్. లాక్షణికోసావితి చేత్. న ముఖ్యార్థత్వే విరోధాభావాత్.

తా. యాగమాశుతరనివాశి యగుటవలనను, స్వర్గము కాలాంతరభావి యగుటవలనను స్వర్గమున కవ్యవహిత పూర్వభావి గానందున యాగమునకు స్వర్గకారణత్వ మెట్లు సంభవించుననినచో. శ్రు. 'జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత' అను శ్రుతివలన యాగమునందు స్వర్గకారణత్వము చెప్పఁబడు చున్నది. కాన ఇట్టికారణత్వము స్వర్గమునకు యాగమునకు మధ్యగా స్వర్గపర్యంతస్థాయియగు నొక స్థిరమైనవ్యాపార మంగీకరింపనిచో నుపపన్నము గాదు గావున మధ్యగా నొక వ్యాపారమును గల్పించి కారణత్వ ముపపన్నము చేసెదము.

అవాంతరవ్యాపార మున్నచో యాగమునకు వ్యాపా రిత్వము సంభవించును. అట్టి వ్యాపారము ప్రకృతములో నేమియుఁ గానరాదు. యాగము కార్యావ్యవహితపూర్వ వృత్తి గానందున స్వర్గకారణ మగునని యాశంకింప వలదు. కారణత్వము కార్యావ్యవహిత పూర్వవృత్తిత్వ రూప మైనచో నీయాశంక కవకాశ ముండును. కార్యపూర్వవృత్తి

త్వమునకే కారణత్వశరీరములోఁ బ్రవేశముగాని యవ్యవహితత్వభాగమును బ్రవేశపెట్టుట లేదు.

వ్యాపార మనఁగా జన్యము. జన్యజనకము గదా! కను కనే మాఘమాసములోఁ జేసినభూకర్షణము హేమంతఋతువులోఁ గాబోవు సస్యములోఁ గారణ మెట్లనఁగా పాకజపరంపరారూపమగు నవాంతర వ్యాపారద్వారమున భూకర్షణ మెట్లు కారణమో, యట్లే దశమూలికషాయమునకు ధాతుసామ్యద్వారమందు గాబోవు జ్వరశాంతి రూపకార్యజనకత్వ మెట్లో యట్లే ప్రకృతములోఁగూడఁ గార్యానుగుణమగు కార్యరూపమగు నవాంతరవ్యాపారము స్వీకరించి దానిని ద్వారముగా జేసి యాగమునకు స్వర్గకారణత్వ ముపపన్నము చేయఁదగును.

కృషి చికిత్సాదులయందుఁ గార్యజనకత్వవ్యవహారము లాక్షణికమని యాశంకింపరాదు. ముఖ్యార్థమునకు బాధ యున్నపుడట్లు చెప్పవలెను. అట్టి బాధలేనందున లాక్షణికమనుట యసంగతము.

మూ. అస్తు తర్హి పుత్రేణ హతే బ్రహ్మణి చిరధ్వస్త
స్యపితుస్తమవాంతరవ్యాపారీకృత్యకర్తృత్వం.
తథా చ లోకయాత్రావిప్లవ ఇతి చేత్. న.

తా. చిరధ్వస్తమైన వ్యవహితమైనదాని నవాంతరవ్యాపారద్వారమునఁ గారణత్వముఁ జెప్పినచోఁ బుత్రునిద్వారమునఁ జిరధ్వస్తమైన తండ్రికిఁగూడఁ గుమారునిచేఁ జేయు కార్యములలోఁ గర్తృత్వము రావలసివచ్చును. అట్టివ్యవహా

రము లేనందున నిష్టమనుటకు వీలులేదు. కాన వ్యవహితమైన దానికిఁ గారణత్వము సంభవింపదని యాశంకింపవలదు.

మూ. సత్యపి సుతే కదాచి త్తదకరణాత్. తస్మిన్నసత్యపి కదాచిత్ కరణాదనిర్వాహకతయా తస్య వ్యాపారత్వాయోగాత్. యం జనయత్వైవ హి యం ప్రతి యస్య పూర్వభావనిర్వాహః స ఏవ తం ప్రతి తస్య వ్యాపారః, నాపరః. యథా అనుభవస్య స్మరణం ప్రతి సంస్కారః. తస్య హ్యాన్వయవ్యతిరేకానువిధానే సిద్ధే తదన్యథానుపపత్యా సంస్కారః కల్ప్యతే, నత్వన్యథా, తథేహాపి. న చేదేవం, తవాపి బ్రహ్మాభిదురశరవిమోకసమసమయహతస్య, హంతృత్వం న స్యాత్. స్యాచ్చ స్వనివేశానశయానస్య తత్పితురితి, ఏతేనోభయం వేతి నిరస్తం.

తా. యేది లేనప్పుడు దేనికిఁ గారణత్వము నిర్వహింపదో దానికది వ్యాపారము. దండమునకు ఘటకారణత్వము భ్రమణాదికము లేనిచో నిర్వహింపనందున భ్రమణాదికము దండమునకు వ్యాపార మగును. ఇట్టివ్యాపారత్వము పుత్రుని యందు లేదు. ఏలనఁగా పుత్త్రుఁడున్నను తండ్రి కొన్నిపనులు చేయకపోవచ్చును. పుత్త్రుఁడు లేకపోయినను జేయవచ్చును. కానఁ బుత్త్రుఁడు తండ్రికి ద్వారమని చెప్పుటకు వీలులేనందున పుత్త్రకృతహననకర్తృత్వము చిరధ్వస్తమైనతండ్రికిఁ జెప్పవలసిన యవసరము లేదు.

దేనినిబుట్టించి దేనినిగూర్చి దేనికిఁ బూర్వభావము నిర్వహించునో దానికదియే వ్యాపారముగాని మఱియొకటిగాదు. యట్లనఁగా ననుభవమునకు స్మరణనుగూర్చి సంస్కారము వ్యాపారము. అనుభవము సంస్కారమును బుట్టించి స్మరణలోఁ గారణము గాన సంస్కారము వ్యాపారము. అనుభవాన్వయవ్యతిరేకములు స్మృతియందు సిద్ధమైనప్పుడు సంస్కారరూపవ్యాపారములేనిదే యన్వయవ్యతిరేకములు నిర్వహింపదు గాన సంస్కారకల్పన యెట్లో ప్రకృతములోఁగూడ నట్లే వ్యాపారకల్పన చేయవలెను గాని మఱియొకలాగున కాదు. అనఁగా కార్యకాలమందున్నదానికే కారణత్వమనుటకు వీలులేదు. కార్యకాలమందున్నదానికే కారణత్వము నీకుఁగూడ సమ్మతము గాదు. అట్లైనచో బ్రాహ్మణునిజంపుటకు బాణము విడిచి సమయమందే బాణవిమోకముఁ జేసిన వాఁడుకూడ మరణించెను. బ్రాహ్మణుఁడు వీనిచేఁ బ్రయోగింపఁబడినశరముచేఁ జనిపోయెను. బ్రాహ్మణుఁడు చనిపోయిన సమయమున శరవిమోకముఁ జేసినవాఁడు లేనందున వానికి హననకర్తృత్వము లేకపోవలసి వచ్చును. చంపినవానియింటి వద్ద నిద్రించిన తండ్రికి హంతృత్వము రావలసివచ్చును. కాన వ్యాపారద్వారమునఁ గార్యపూర్వవృత్తి యగుదానికే కారణత్వముగాని మఱియొకరీతిగాఁ జెప్పఁగూడదు కార్యత్వమెట్లు లిఙ్ప్రవృత్తినిమిత్తము గాదో, కార్యత్వ మపూర్వత్వము నీరెండునుగూడ లిఙ్ప్రవృత్తినిమిత్తములు గావు.

మూ. అస్తు తర్హి క్రియాధర్మ ఏవ కార్యత్వం విధిః.
సర్వో హి కర్తవ్యమేతదితి ప్రత్యేతి, తతః

కుర్యామితి సంకల్ప్య ప్రవర్తతేతి చేత్. న. కర్తవ్యంమయేతి, కృత్యధ్యవసాయార్థో వా స్యాత్, కర్తవ్యం మయేత్యుచితార్థో వా స్యాత్? తత్ర ప్రథమః. సంకల్పాన్న భిద్యతే, వ్యవహితకార్యసంకల్పో హి కర్తవ్యోమయేతి, సన్నిహితకార్యసంకల్పస్తు కుర్యామితి. స చ న లిఙర్థః సత్తామాత్రేణ ప్రవర్తనాదిత్యుక్తం. తదేతత్కర్తవ్యతాయాం జాతాయాం ప్రవర్తతేతి వస్తుస్థితౌ భ్రాంత్యైర్జ్ఞాతాయామితి గృహీతం.

తా. క్రియాధర్మమగు కార్యత్వమే విధిప్రత్యయమునకర్థము ప్రతిమనుజుఁడు నాచే నిది చేయఁదగినదనెడు జ్ఞానానంతరమున (కర్తవ్యమేతన్మయా) నిది నాచేఁ జేయఁదగినది యని సంకల్పించి ప్రవర్తించును గానఁ గ్రియాధర్మమగు కార్యత్వమే విధిప్రత్యయమున కర్థమని యాశంకింపరాదు. 'కర్తవ్యం మయా' అనునది. ప్రయత్నజనకేచ్ఛారూపమైనచో నది సంకల్పముకంటె భిన్నము కాదు. ఆసంకల్పము వ్యవహితకార్యసంకల్పము, సన్నిహితకార్యసంకల్పమని రెండు విధములు. మొదటిసంకల్పము 'కర్తవ్యోమయా' అనునది. రెండవది కుర్యామనునది. ఈరెండునుఁగూడ విధ్యర్థములు గావు. సంకల్ప మజ్ఞాయమానమై ప్రయత్నమునుగూర్చి కారణము. సంకల్పముఁ బుట్టినవెంటనే ప్రయత్నముఁ గలుగును. ఇట్లుండఁగా ఛాత్రులు సంకల్పజ్ఞానముఁ గలిగినపిదపఁ బ్రవ

ర్తించెదనని నమ్ముదురు. కాన నిచ్ఛారూపమగు సంకల్పము విధిప్రత్యయార్థము గాదు.

మూ. ఔచిత్యం తు క్రియాధర్మః, ప్రాగభావవత్త్వం, తస్మిన్సతి శక్యత్వం వా, తస్మిన్సతి కర్తారం ప్రత్యుపకారకత్వం వా? ప్రథమే కుతశ్చిదపి న ప్రవర్తేత, ద్వితీయే దుఃఖేపి తథావిధే ప్రవర్తేత, తృతీయే తు వక్ష్యతే.

తా. 'కర్తవ్యం మయా' అనునది యౌచిత్యార్థమైనచోఁ గ్రియాధర్మమైన నౌచిత్యమన నేమి? ప్రాగభావమా, లేక క్రియయుండఁగా కృతిసాధ్యత్వరూపమా? కర్తనుగూర్చి యుపకారకత్వరూపమా? ప్రాగభావరూపమైన క్రియాధర్మ మనిష్టస్థలమందుఁగూడ నున్నందున ననిష్టసాధనమువలన నివర్తించక పోవును. కృతిసాధ్యత్వ రూపమైనచో యత్నసాధ్యమైన దుఃఖమందుఁగూడఁ బ్రవర్తింపవలసివచ్చును. తృతీయ పక్షము ఇష్టసాధనత్వనిరాసచేఁ జెప్పఁబడును.

మూ. అస్తు తర్హి కరణధర్మః. న. కరణం హి శబ్దః తద్ధర్మో భావనా వా స్యాత్. తదర్థో భావనాది ర్వా. తద్ధర్మ ఇష్టసాధనతా వా? న ప్రథమః.

తా. శబ్దము కరణము, దానియందుండు ధర్మమే విధ్యర్థమని యనుటకు వీలులేదు. ఆధర్మము, శాబ్దీభావనా రూపమా, లేక యార్థీభావనారూపమా, లేక ఇష్టసాధనతా రూపమా? శాబ్దీభావనారూపమనుటకు వీలులేదు.

శ్లో. అసత్త్వాద ప్రవృత్తేశ్చ నాభిధాపి గరీయసీ,
బాధకస్య సమానత్వాత్పరిశేషోపి దుర్లభః. ౧౩

తా. శబ్దధర్మమగు నభిధ యుండుటలో ప్రమాణము లేనందున నభిధయే లేదు. ఉన్నను నభిధాశబ్దముచే, నభిధాజ్ఞాన మున్నప్పుడు, ప్రవృత్తి లేనందున నభిధారూపశబ్ద ధర్మము, '(లిఙర్థతయా, నగరయసీ)' ఉచితము గాదు. ఇతర మైన కార్యత్వాదికము లిఙర్థమనినచో బాధయున్నందునఁ బరిశేషముచే నభిధావ్యాపారమే లిఙర్థమని చెప్పుట సరిగాదు. ఇతరమైనవి లిఙర్థమైనప్పు డున్న బాధకము భావనయున్నప్పుడు గూడ సమానము గాన భావన విధ్యర్థమనుట యుచితమని యర్థము.

మూ. సంగతి ప్రతిసంధానాధికాయాం తస్యాం ప్రమాణాభావాత్. అన్యసమవేతస్యాపూర్వ వదస్యవ్యాపారత్వేనాప్యుపపత్తేః. విషయతయాపి చ స్వవ్యాపారం ప్రతి లింగవద్ధేతుభావావిరోధాత్. అధికత్వేపి తతోఽప్రవృత్తేః. బాలానాం తదభావేపి తద్భావాత్. శబ్దాన్తరేణ తచ్ఛ్రావిణామప్య ప్రవృత్తేః.

తా. శబ్దము వాక్యార్థబుద్ధిలో గరణమగుటవలన దానికి వ్యాపారముండుట యావశ్యకము. అట్టివ్యాపార మభిధయే యగును. శబ్దవ్యాపారముగా నభిధ నంగీకరించెదమని యాశంకింపవలదు. సంగతి స్మృతి యేపదమున కవాంతర వ్యాపారమో. ఆస్మృతిలో విషయమైన యానుపూర్వితోఁ

గూడిన పదసముదాయమే పదార్థస్మృతినిఁ గలుగఁజేసి వాక్యార్థబోధలోఁ గరణమగును. కాన సంగతిస్మృతికంటె విలక్షణమైన యభిధయుండుటలోఁ బ్రమాణము లేదు.

సంగతిస్మృతి యాత్మయం దుండుటవలన శబ్ద మాకాశమం దుండుటవలన భిన్నదేశములయందుండు సంగతిస్మృతి శబ్దముల కెటుల వ్యాపారవ్యాపారిభావ ముండును? అని యాశంకింపవలదు. యాగము క్రియారూపము. అపూర్వ మాత్మయం దుండును. కాన మీమతమందు భిన్నదేశమం దుండు నపూర్వమునకు యాగవ్యాపారత్వ మెట్లో యట్లే సంగతిస్మృతిఁగూడ శబ్దవ్యాపారము కావచ్చును.

వ్యాపారివలనఁ బుట్టినదే వ్యాపార మగును. సంగతిగ్రహరూపమగువ్యాపారము శబ్దరూపమగు వ్యాపారివలనఁ బుట్టనందున నది వ్యాపారముఁ గాదు. కాన శబ్దమునలనఁ బుట్టెడునభిధయే శబ్దవ్యాపారముగా స్వీకరించెదమని యాశంకింపవలదు. లింగపరామర్శలో విషయమైన లింగమెటుల హేతువో యటులే సంగతిస్మృతిలో విషయమైనపదముఁ గూడ స్మృతిహేతువు గావచ్చును. సంగతిస్మృతి పదజన్య మగుటవలన నిదియే పదమునకు వ్యాపారముగాని పదజన్యమైన యభిధ యుండుటలోఁ బ్రమాణము లేదు. స్మృతిలో విషయమునకు కారణత్వము మామతమునందు లేకపోయి నను పరమతముచేఁ జెప్పఁబడినది.

ఒకవేళ శబ్దవ్యాపారముగా నంగీకరింపఁబడిన యభిధ లిఙర్థమైనను నది ప్రవృత్తిజనకము గాదు. అభిధాజ్ఞానము

లిఙ్గమువలన లేకపోయినను బాలురకుఁ బ్రవృత్తిఁ గలుగు చున్నది. అభిధనుబోధించెడు నభిధాశబ్దమును వినువారికిఁ బ్రవృత్తిఁ గలుగుట లేదు. కాన నభిధ శబ్దవ్యాపారమనియు లిఙ్గున కర్థమనియు చెప్పు టుచితము గాదు.

మూ. న చ విలక్షణైవ సా లిఙో విషయః.తద్వైలక్షణ్యం
ప్రతిపత్తిం ప్రతీతిచేత్. అర్థవిశేషోపి స్యాత్.
ప్రవృత్తిమాత్రం ప్రతి చేత్ అభిధాసమవేతం
తదితి కుతః? తత్సన్నిధానాదితి చేత్. న అనియ
మాత్. అన్యస్య సర్వస్య నిషేధాదితి చేత్. న.
ప్రవృత్తిహేతుత్వనిషేధస్య తుల్యత్వాత్.
తత్సన్నిధినిషేధస్య చ అశక్యత్వాత్. శబ్దైక
వేద్యత్వే చ అవ్యుత్పత్తేః.

తా. అభిధాపదమువలనఁ గలుగు నభిధాజ్ఞానము ప్రవర్తకముఁ గాకపోయినను, లిఙభిధేయమైన విలక్షణమైన యభిధాజ్ఞానమే ప్రవర్తకమని చెప్పెదము. ఇట్టి విలక్షణ ప్రతీతియే ప్రవర్తకమని యాశంకింపరాదు. విషయ వైలక్ష ణ్యము లేనిదే ప్రతీతివైలక్షణ్య ముపపన్నము గాదు. అభిధా పదబోధ్యమైన యభిధ వేఱు. ఆఖ్యాతాంతరబోధ్యమగు అభిధ వేఱు. లిఙుబోధ్యమైన యభిధ వేఱని యనవలసి వచ్చును. అభిధాసామాన్యజ్ఞానము ప్రవర్తకము గానందున దేనియొక్క జ్ఞానమువలనఁ బ్రవృత్తిఁ గలుగుచున్నదో దాని యందుఁ బ్రవృత్తిచే వైలక్షణ్య మనుమేయించెద మనినచోఁ బ్రవర్తకజ్ఞానవిషయమైన యభిధయందు వైలక్షణ్యము దేని

వలన వచ్చినది ? సన్నిహిత మగుటవలన నభిధ యందు వైలక్షణ్యము. ఇట్టివిలక్షణమైన యభిధయే ప్రవర్తకమని చెప్పరాదు. బౌద్ధసన్నిధి యభిధయందువలె, ధాత్వర్థమందు, ఇష్టసాధనత్వమందుఁగూడ నున్నందున నియమము లేదుగాన నిట్టివైలక్షణ్యము సరిగాదు.

ఇతరమైన కార్యత్వాదికమునకు విధ్యర్థత్వము నిషేధించుటవలనఁ బరిశేషన్యాయముచే నభిధయే విధ్యర్థమని చెప్పుటకు వీలులేదు. ఇతరమైన విధ్యర్థములకు ప్రవృత్తిహేతుత్వనిషేధ మెట్లో దీనికిఁగూడఁ దుల్యమే గాన నిది విధ్యర్థమని చెప్పుటకు వీలుచేదు. విధివాక్యసన్నిధి నిషేధమభిధయం దెట్లు చేయుటకు వీలులేదో ధాత్వర్థాదికమందుఁగూడ నట్లే చేయుటకు వీలులేదు. విధివాచ్య మభిధ యనినచో దానియందు శక్తిగ్రహము దుర్లభము. ప్రమాణాంతరముచే నభిధ సిద్ధింపనందునఁ దదుపస్థితి లేనందున దానియందు శక్తిగ్రహము దుర్లభము.

మూ. ప్రవృత్త్యన్యథానుపపత్తిసిద్ధే వ్యుత్పత్తిరిత్యపి వార్తం. న హి ప్రవృత్తిహేతుః కశ్చిదస్తీతి ప్రవర్తతే. ఇష్టసాధనతా తు స్యాత్. సర్వో హి మయా క్రియమాణమేతన్మమ సమీహితం సాధయిష్యతీతి ప్రతిసంధత్తే, తత ఇచ్ఛతి కుర్యామితి, తతః కరోతీతి సర్వానుభవసిద్ధం. తదయం వ్యుత్పిత్సుః యజ్జ్ఞానాత్ ప్రయత్నజననీమిచ్ఛామవాప్తవాన్, తజ్జ్ఞానమేవ లిఙ్శ్రావిణః ప్రవృత్తికారణమనుమినోతి. తతశ్చ

కర్తవ్యతే కార్థసమవాయినీ ఇష్టసాధనతా లిఙర్థ ఇత్యవధారయతి.

తా. లిఙ్గుయొక్క శ్రవణమైనపిదప ప్రవృత్తిఁ గలుగుచున్నందునను, అది లేనపుడు ప్రవృత్తిఁగలుగుట లేకపోవుటంబట్టియుఁ బ్రవృత్త్యన్యథానుపపత్తిచే సిద్ధమగుదాని యందే శక్తిగ్రహము సంభవించునని చెప్పు టుచితము గాదు. సామాన్యముగాఁ బ్రవృత్తిహేతు వొకటియనెడుజ్ఞానము ప్రవర్తకము గాదు. ఇష్టసాధనత్వమే విధ్యర్థము. ప్రతిమనుజుఁడు నే జేయఁబోవుకార్యము నాకు నిష్టమును సాధించు ననెడు జ్ఞానముఁగలవాఁ డగును. పిదప నాయిష్టసాధనము నిచ్ఛయించును పిమ్మటఁ జేయుననెడిసంగతి సర్వానుభవ సిద్ధము. వ్యుత్పత్తిని గోరుబాలుఁడు దేనియొక్కజ్ఞానమువలనఁ బ్రయత్నజనకమైన యిచ్ఛగలవాఁ డగునో యట్టిదానియొక్క జ్ఞానమే లిఙ్ వాక్యమును వినినవానియొక్క ప్రవృత్తిలోఁ గారణమని యనుమేయించును. పిదప కృతిసాధ్యమైనదాని యందుండు నిష్టసాధనతయే లిఙర్థమని నిశ్చయించును.

మూ. న చ వాచ్యమేవం చేత్. వరం కర్తవ్యతైవాస్తు, అవశ్యాభ్యుపగమనీయత్వాత్, కృతమిష్టసాధనతయేతి. యథా హి నేష్టసాధనతామాత్రం ప్రతీత్య ప్రవర్తతే. అసాధ్యేషు వ్యభిచారాత్. తథా ప్రయత్నవిషయస్వరూపమపి ప్రతీత్య న ప్రవర్తత ఏవ. కిం తు ప్రయత్నవిషయసమవాయినీ మిష్టసాధనతామధిగమ్య అధికారీ ప్రవర్తతే ఇత్యనుభవః.

తా. కృతిసాధ్యమందుండెడు నిష్టసాధనత విధ్యర్థ మనుటకంటె కృతిసాధ్యతయే విధ్యర్థమనినచో లాఘవ ముండును గానఁ గర్తవ్యతయే విధ్యర్థము. ఇష్టసాధనముగా నాచే నిది చేయఁబడెననెడి యనుభవమున్నది గానఁ గృతి సాధ్యత్వమే విధ్యర్థమని యాశంకింపరాదు. ప్రయత్న సాధ్యముగాని రాజదారాదులయందుఁ గేవల మిష్టసాధనతా జ్ఞానమున్నను నెట్లు ప్రయత్నముఁ గలుగుటలేదో యట్లే యిష్టసాధనత్వప్రతీతి లేనప్పుడు కేవల ప్రయత్నసాధ్యతా జ్ఞానమున్నను బ్రవృత్తిఁ గలుగుట లేదు. కానఁ బ్రయత్న సాధ్యమందుండి యిష్టసాధనతను దెలిసి కొన్నిసమయమందే యధికారి ప్రవర్తించుచున్నాఁడను ననుభవమునుబట్టి ప్రయ త్నసాధ్యమైనదానియందుండి యిష్టసాధనతయే విధ్యర్థమని చెప్పవలెను.

మూ. తత్ర విషయో ధాతునా భావనా ఆఖ్యాత
మాత్రేణ శేషం తు తద్విశేషేణ లిఙా ఇత్యేవ
మిష్టాభ్యుపాయతాయామధిగతాయామన్వయ
బలాత్ తద్విషయస్యేష్టసాధనత్వావగతిరితి కర్త
వ్యతైకార్థసమవాయినీష్టాభ్యుపాయతా లిఙః
ప్రవృత్తినిమిత్తమిత్యుక్తం.

తా. ధాతువుచే యాగరూపవిషయము చెప్పఁబడును. ఆఖ్యాతాంశచే భావన చెప్పఁబడును. లిఙ్త్వాంశముచే నిష్ట సాధనత్వము చెప్పఁబడును. ఈరీతిగా నిష్టసాధనత్వాదుల యొక్క ప్రతీతి కలిగినపిదపఁ బ్రకృతిప్రత్యయ సమభివ్యా హారమువలనఁ గృతివిషయమం దిష్టసాధనతాప్రతీతి కలు

